# బ్రహ్మవిద్యానుసన్ధాన దర్పణం



గ్రంథకర్త.

కొత్తా మోహన రామశాస్త్రి

ఆత్మవిద్యాశ్రమము
విజయవాడ — సికింద్రాబాదు
1971

ప్రథమ ముద్రణము— 97

మూల్యము : రు. /-

ప్రాప్తిస్థానము :

ఆర్ష విద్యాశ్రమము
10, పద్మారావునగర్, సికింద్రాబాదు-25.

2. వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,
అన్ని బ్రాంచీలలో

ముద్రణ :

స్వారాజ్య ప్రింటింగ్ వర్క్సు,
కొత్తా స్వరాజ్య విహార్,
10, పద్మానగర్,
సికింద్రాబాద్ — 25.

॥ श्रीः ॥

॥ श्रीचन्द्रमौळीश्वर ॥

स्वस्ति श्रीमदखिल भूमण्डलालंकारत्रयस्त्रिंशत्कोटि देवतासेवित-श्रीकामाक्षीदेवीसनाथ श्रीमदेकाम्रनाथ श्रीमहादेवीसनाथ श्रीहस्तिगिरिनाथ-साक्षात्कार परमाधिष्ठान सत्यव्रतनामांकित काञ्चीदिव्यक्षेत्रे शारदामठ-सुस्थितानाम् अतुलितसुधारसमाधुर्य कमलासनकामिनीधम्मिल्लसम्फुल-मल्लिकामालिकानिष्यन्द मकरन्दझरीसौवस्तिक वाङ्गिगुम्मविजृंभणानन्द-तुन्दिलितमनीषिमण्डलानाम् अनवरताद्वैतविद्याविनोदरसिकानाम् निरन्तरालंकृतीकृतशान्तिदान्तिभूम्नाम् सकलभुवनचक्र प्रतिष्ठापक श्रीचक्र-प्रतिष्ठाविख्यातयशोऽलंकृतानाम् निखिलपाषण्डषण्डकण्डकोत्पाटनेन विशदीकृतवेदवेदान्तमार्ग षण्मतप्रतिष्ठापकाचार्याणां श्रीमत्परमहंस-परिव्राजकाचार्यवर्य श्रीजगद्गुरु श्रीमच्छंकरभगवत्पादाचार्याणाम् अधिष्ठाने सिंहासनाभिषिक्त श्रीमन्महादेवेन्द्रसरस्वती संयमीन्द्राणाम् अन्तेवासिवर्य-श्रीमच्चन्द्रशेखरेन्द्रसरस्वतीश्रीपादादेशानुसारेण श्रीमज्जयेन्द्रसरस्वती श्रीपादैर्नारायण स्मरण पूर्वकं प्रयुक्ता आशिषः

धर्मार्थ काम मोक्ष रूपाणां पुरुषार्थानां मध्ये मोक्ष एव परमः पुरुषार्थः - तदवाप्तिश्च वेदान्त वाक्य श्रवण मननादिभिरेव ब्रह्मश्री कौता सूर्यनारायणपुत्रस्य श्री मोहनराम शास्त्रिणः — श्रवणादीनां फलरूपेण समुत्पन्नानुभव संकलन रूपेण लोकोपकाराय — तैः रचितं ब्रह्मविद्यानुसन्धानदर्पणाख्य सिद्धान्तानुसारिणं ग्रन्थं श्रुत्वा — आनन्दः समजानि· तेषां मन्त्रप्रणाड्या. दिनादिनाभिवृद्धिद्वारा मुमुक्षप्रकारेण अस्य ग्रन्थस्योद्देशः सफलो भवत्विति श्री महात्रिपुर सुन्दरी सहितं चन्द्रमौळीश्वरं प्रार्थयामहे·

यात्रास्थानम् - हैदराबाद्
कालयुक्तनाम संवत्सर. वैशाख-
कृष्ण· सप्तमी स्थिरवासरः·

नारायण स्मरणम्

Sampath Press, Madurai-63.

శ్రీమత్పరమహంసేత్యాది బిరుదాంకిత జగద్గురు శ్రీ , కాంచీ కామకోటి పీఠాధీశ్వరుల ఆ స్సులు.

॥ శ్రీ చన్ద్రమౌ శ్వర ॥

స్వస్తి శ్రీమదఖిల భూమండలాలంకార త్రయస్త్రింశత్కోటి దేవతాసేవిత శ్రీ కామాక్షీదేవీసనాథ శ్రీమదే కామనాథ శ్రీ మహా పీఠనాథ హస్తి గిరినాథ సాక్షాత్కార పరమాధిష్ఠాన సత్యవ్రత నామాంకిత కాంచీదివ్యక్షేత్రే శారదామఠ సుస్థితానామ్ అతులిత సుధారసమాధుర్య కమలాసన కామినీ ధమ్మిల్ల సంఫుల్ల మల్లికామాలికా నిష్యన్దమకరన్దఝరీ సౌవస్తిక వాఙ్నిగుమ్ఫ విజృంభణానన్ద తున్దిలిత మ ిషి మణ్డలానామ్ అనవరతాద్వైత విద్యావినోద రసికానామ్ నిరంతరాలంకృ కృతశాన్తిదాన్తి భూమ్నామ్ సకల భువన చక్ర ప్రతిష్ఠాపక శ్రీచక్ర ప్రతిష్ఠావిఖ్యాత యశోఽలంకృతానామ్ నిఖిల పాషణ్డ షణ్డకణ్టక కోత్పాటనేన విశదీకృత వేదవేదాన్తమార్గ షణ్మత ప్రతిష్ఠాపకాచార్యాణాం శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాదా చార్యాణామ్ అధిష్ఠానే సింహాసనాభిషిక్త శ్రీ మన హా వేం ద్ర సరస్వ సంయ మీన్ద్ర ణామ్ అన్తేవాసివర్య శ్రీ మచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వ శ్రీపాదాదేశాను సారేణ శ్రీమజ్జయేన్ద్ర సరస్వ శ్రీపాదైః నారాయణ స్మరణ పూర్వకం ప్రయుక్తా ఆశిషః.

ధరార్థ కామమోక్షరూపాణాం పురుషార్థానాం మధ్యే మోక్ష ఏవ పరమః పురుషార్థః, తదవాప్తిశ్చ వేదాన్త వాక్య శ్రవణమననాదిభిరేవ.

బ్రహ్మ కౌ శా సూర్యనారాయణ పుత్రస్య శ్రీ మోహనరామశాస్త్రిణా శ్రవణాదీనాం ఫలరూపేణ సముత్పన్నానుభవ సంకలన రూపేణ లోకోపకారాయ త్తైః రచితం బ్రహ్మవిద్యానుసంధాన దర్పణాఖ్యం సిద్ధాన్తానుసారిణం గ్రన్థం శ్రుత్వా ఆనన్దః సమజని తేషాం మనన ప్రణాడ్యాః దినదినాభివృద్ధిద్వారా ముముక్షూపకారేణ అస్య గ్రన్థస్య ఉద్దేశః సఫలో భవత్వితి శ్రీమహా త్రిపురసున్దరీ సహితం చన్ద్రమౌళీశ్వరం ప్రార్థయామహే.

యాత్రాస్థానమ్—హైదరాబాద్

శుకనామసంవత్సర వైశాఖకృష్ణ సప్తమీ—స్థిరవాసరః

నారాయణస్మరణమ్



శ్లో॥ కౌతాన్వయసుధాబింబం సూర్యనారాయణంగురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం పితరం జ్ఞానభాస్కరమ్ ॥

# సమర్పణ



వేదవేదాంతశాస్త్రాభివృద్ధ్యభిలాషులును,
ధర్మాచరణప్రవర్తకులును,
ప్రచండవ్యవహార వ్యాపార కుశలులును,
బ్రహ్మవిద్యాసాంప్రదాయకులును,
బ్రహ్మవిద్యాసిద్ధులును, నాకు బ్రహ్మవిద్యాగురువులును,
మజ్జనకులును నైన
శ్రీకొత్తా సూర్యనారాయణ వర్యచిద్రూపుల చరణారవిందములకు
నాచే రచింపబడిన
శ్రీ బ్రహ్మవిద్యానుసంధానదర్పణంబను
నీ గ్రంథ కుసుమమును భక్తి పురస్సరముగ
సమర్పణము గావించు చున్నాడను.

గ్రంథకర్త.

"బ విద్యాలంకార," "తర్క-వేదాంత విశారద," "మహోపాధ్యాయ,"

"గురుకుల-భార నిలయ సంస్థాపక,"

బహ ( ) ముదిగొండ వేంకటరామశాస్త్రిగారి అ ప్రాయము

" బహ విదా ను సంధానదర్పణం" అను గంధమును శ్రుతియుక్త్యనుభవ నిరూపణములతో, బహ ( ) కౌతా మోహన్ రామ్‌శాస్త్రిగారు రచించి ము దించి నాకు సమర్పించగా చూచి సంతసించితిని.

ఈ గంధములో ముముక్షువుల కపేక్షితములగు అనేక వేదాంతార్థ రహస్యములు వివరింపబడియున్నవి.

మరియు, పధానములుగ అనేక ఉపనిషద్వచనములకుప బృంహకములుగ, యోగవాసిష్ఠ, నైష్కర్మ్యసిద్ధి, వేదాన్తపంచదశి, మున్నగు పామాణిక గంధ వచనములు సముయోచితములుగ ఉదాహృతములై తెలుగు తాత్పర ములతో వివరింపబడియున్నవి.

ఈ గంధకర్తకు పశాస్త్రమందును గొప్ప పాండిత ము లేకపోయినను, పతివిషయము శాస్త్రీయముగనే యుండుట వి యకరముగానున్నది.

దీనినిబట్టి — "ఈశ్వరాను గహాదేవపుంసామద్వైతవాసనా" ఇత్యాది పమాణములననుసరించి రికిగల జనా ంతరీయ సత్సంస్కారమే నిరంతర విద్వద్గోష్ఠితో భగవదను గహమున నుద్బుద్ధమై బహ విద యందుత్క ంఠేచ్ఛను కలిగించి ముముక్షులోకోపకారార్థమై రి- ఇట్టి రచనను చేయించెనని తోచు చున్నది.

మరియు "శుచీనాం మతాం గేహే యోగ ష్టోభిజాయతే" అని భగ వానుడు చెప్పినట్లు రి జన కు 8 సంవత్సరములకు పూర్వమే. 1892 .సంవత్సర ములోనే సార్థకమగు "స్వధర స్వారాజ్య" సంస్థను స్థాపించి పతి సంవత్సరము

వివిధ వేదశాస్త్రసభలను జరుపుచు అనేకమంది పండిత ప్రకాండులను సత్కరించుచు కోటీశ్వరులై కూడ జనకుడువలె నిరంతరము యోగవాసిష్ఠ మననముతో వనుక్తులై నిర్లిప్తులుగా బ్రహ్మానందముతో కాలముగడపిన కీ. శే. బ్రహ్మశ్రీ కొత్తా సూర్యనారాయణరావుగారికి సుపుత్రులై, శిష్యులైయున్న ప్రధాన కారణము చేతనే వీరిట్టి గ్రంథమును రచించిరని తోచుచున్నది.

పర్యవసానములో ఈ గ్రంథములో నచ్చటచట కొలదిగ భాషాలోపము లున్నను వేదాంత సిద్ధాంత భావ లోపములు లేనందున, సులభమగు తెలుగు భాషలో వివిధవేదాంత విషయములను తెలియగోరెడి ముముక్షువుల గ్రంథము మహోపకారమును కలిగించునని నా యభిప్రాయము.

త్రిలింగ మహా విద్యాపీఠం
విజయవాడ–2
బకింగుహాంపేట–P.O.
A. P.
20-1-1971

ఇట్లు
సర్వశ్రేయోభిలాషి
ముదిగొండ వేంకట రామశాస్త్రి

ఉభయ మీమాంసాభాస్కర, పూర్వమీమాంసా-అద్వైతవేదాన్త-ఆలంకారశాస్త్ర, విద్వాన్, పం త ప్రవర, బ్రహ్మ ( ) డోంగ్రేపీరేశ్వర శాస్త్రిగారి అ ప్రాయము.

( ) బ్రహ్మ విద్యానుసంధాన సారంబను నీ గ్రంథమును ఆమూలాగ్రముగ నేను పరి లించితిని. దీనిని చూచి మిక్కిలి యానందించితిని. ఇందులో విషయము లన్నియు సులలితమైన ఆంధ్రభాషలో సముచితోదాహరణ నిరూపణలతో విశదీకరింపబడి యున్నవి. కాన శాస్త్రపటిమలేని జిజ్ఞాసువులకు సిద్ధాంతమును హించుటకు యిది చాలా సుబోధకముగను సులభ సాధనముగను యుండును. శాస్త్రీయ విషయములను గ్రహించుటకు కావలసిన పూర్వాచార్యులుదహరించిన దృష్టాంతములతోసహా ప్రస్తుత ప్రపంచానుభవములోనున్న ప్రసిద్ధ దృష్టాంతములును సంగ్రహింపబడి విషయ గ్రహణము సుసాధ్యముగ జేయబడినది.

ఇందు ప్రతి విషయ నిరూపణయందును శ్రుతి, యుక్తి, అనుభవము, అను మూడు విధములగు ప్రమాణములు చూపబడియున్నవి గాన యీవిషయములను గ్రహించు వారికి ప్రామాణ్యమునందు యెట్టి సందేహములు కలుగుట కవకాశము లేదు.

ఇచట నిరూపించిన విషయములకు సంవాదరూపముగనున్న పూర్వాచార్యుల వచనముల స గ్రహమిందు చాల సమంజసముగ నున్నది. ఇట్టి వచనములు ఉపనిషత్తులు, భగవద్గీత, యోగవాసిష్ఠము, వేదాన్తపంచదశి, నైష్కర్మ్యసిద్ధి, ఉపదేశసాహస్రి, వివేకచూడామణి, మొదలుగాగల గ్రంథరాజములనుండి సుకొనబడినవే గాన వాటివిషయమున యెట్టి విద్వాంసులకునూ కూడ విప్రతిపత్తి యుండుటకు వీలులేదు.

ఇందు నిరూపింపబడిన విషయములన్నియు శ్రుతి సూత్రాద్యనుగుణములై శాస్త్రసిద్ధాంతము ఎత్తుకూడ యుల్లంఘించక యుండుట ప్రశంసనీయము, చాల ముఖ్యమైన విషయము. ఇందులో ( ) శాస్త్రిగారు మిక్కిలి సావధానులుగ నున్నారు.

ఇట్టి బ్రహ్మవిద్యావిషయక లేఖనము సునిశితమైన శాస్త్ర పరిశ్రమగాని,

జన్మాంతరీయ దృఢ సంస్కారముగాని, విశిష్టగురుదేవతానుగ్రహముగాని లేనిచో చేకూరునది కాదని నా నమ్మకము.

ఈ గ్రంథమందు సిద్ధాంతబోధ సుకరము గావించుటకుగాను విషయ నిరూపణలకే ప్రాధాన్యమిచ్చుటచే రచనానిబంధనలు మిక్కిలి ప్రధానముగ పరిగణింపబడలేదు. అయినను విషయ ప్రాధాన్యమును పరిగణించి లోపముల నెంచకూడదు విచారించిన, అట్టివి సర్వ గ్రంథములయందును అన్వేషించినచో లభించును. గాన విద్వాంసులిందులోని గుణములనే గ్రహించగలరని నమ్ముచున్నాను.

ఇట్టి అపూర్వమైన యుత్తమ గ్రంథమును రచించిన ( ) శాస్త్రిగారికి నా అభినందనములను సమర్పించుచు యీ గ్రంథరాజము అధికారులగు వారలకు అమృతోపమానమైన సాక్షాత్సాధనము కాగలదని నా ఆశయము.

సికింద్రాబాదు,
1-3-68

ఇట్లు
( ) రేశ్వర ... శాస్త్రి

శాస్త్రరత్నాకర, దర్శనాలంకార, వేదాన్తస్థాపక, మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ మండ క వేంకటశాస్త్రిగారి ఆశీస్సులు.

శ్రీకృష్ణపరమాత్మనే నమః.

ధర్మార్థకామమోక్షములలో మోక్షమే నిత్యమగుటవలన పరమపురుషార్థము. అది శ్రవణ మనన నిదిధ్యాసనపూర్వక జీవబ్రహ్మైక్య సాక్షాత్కారము వలననే లభించునని శ్రుతిస్మృతి పురాణాదులయందు వర్ణింపబడియున్నది. అట్టి బ్రహ్మసాక్షాత్కారమును పూర్వులగు మహనీయులు మననాదిరూపమగు సతత బ్రహ్మానుసంధానమువల్ల పొంది కృతకృత్యులై తాము అభ్యాసముచేసిన, అనుసంధానమును లోకోపకారము కొరకు తాము రచించిన గ్రంథములలో వర్ణించి యున్నారు.

శ్రీకౌతా మోహన్‌రామశాస్త్రిగారు చిరకాలమునుండి ఆధ్యాత్మికవిచారాసక్తి కలవారగుటచే యెక్కువ విద్యాభ్యాసము లేకపోయిననూ శ్రీ బ్రహ్మశ్రీ తండ్రిగారగు శ్రీకౌతా సూర్యనారాయణగారి ఆధ్యాత్మిక విచారరూపములగు అనేక బ్రహ్మానుసంధాన ప్రతిపాదకములగు శ్రీశంకరభగవత్పాదకృత ప్రకరణ గ్రంథములూ యోగవాశిష్ఠము మొదలగు గ్రంథముల పఠనముచేతనూ, తమకు సహజముగనుండు స్వభావముచేతనూ, తమకు అపుడపుడు స్ఫురించు భావముల ననుసరించి బ్రహ్మవిద్యానుసంధాన దర్పణాఖ్యమగు నీ గ్రంథమును తమ అభ్యాస దార్ఢ్యము కొరకు రచించియున్నారు. నేనాపుస్తకమును స్థాలీపులాకన్యాయమున కొంతవరకు విన్నాను. ఈపుస్తకము సిద్ధాంతవిరుద్ధముగాక అనేక శ్రుతిస్మృతి పురాణాదులనుండి అనుభవపూర్వక వివరణలతో చక్కగ రచింపబడినది. దీనివలన శ్రీకౌతా మోహన్‌రామశాస్త్రిగారికి బ్రహ్మవిద్యానుసంధానదార్ఢ్యము కలిగి తద్ద్వారా పరమపురుషార్థము పొందునటుల శ్రీకృష్ణభగవానుని ప్రార్థించుచున్నాను. ఇది ముద్రితమగునెడల లోకోపకారమగునని ఆశించుచున్నాను.

ఇట్లు

మండ క వేంకటశాస్త్రి

సికింద్రాబాదు,
7–6–1969

దర్శన భూషణ, రాష్ట్రపతి సమ్మానిత, మోడేకుర్రు
సంస్కృత కళాశాల ఎక్స్ ప్రిన్సిపాలుగారైన
బ్రహ్మశ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రిగారి
అభిప్రాయము.

శ్రీ బ్రహ్మవిద్యానుసంధాన దర్పణమను నీ గ్రంథమును నేను సమగ్రముగ వింటిని. ఇందు సిద్ధాంతమునకు విరుద్ధమగు నంశములేవియును లేవు. కాని యనుసంధాన దార్ఢ్యము కొరకు చెప్పినదానినే మఱల మఱల జెప్పుచు వచ్చిరి. వీరు యే గ్రంథమును చదువకయే స్వతఃపాండిత్యము నాధారముగ జేసికొని యీ గ్రంథమును రచించిరి. ఇక్కాలమున వీరివంటివారరుదు. వీరు చిరకాలము నుండియు నద్వైత సిద్ధాంతమును బాగుగ మననముజేసి తమ యనుసంధానమున గోచరించిన యంశములనే యిందు పొందుపరచియున్నారు.

ఈ గ్రంథముయొక్క పీఠికను, యుపసంహారమును చదివిన నీ గ్రంథమునందలి విషయములన్నియును స్పష్టముగ గోచరించును. వీరు చూపిన దృష్టాంతములు మన యనుభవమునకెంతేని యుపయోగించును.

వీరీ గ్రంథమును రచించుటకు శ్రీ వీరి తండ్రిగారియొక్క చరమోపదేశము మూలము. దానిని బట్టి వీరు తీవ్రానుసంధానమును జేసిరి. దాని పరిణామమే యీ గ్రంథము. ఇది మంద ప్రజ్ఞులగు తత్త్వజిజ్ఞాసువుల కెంతేని సహకరించునని మనవి జేయుచున్నాను.

5-4-1968
ప్రకీలకనామసం॥
చైత్రశుద్ధసప్తమీ
శుక్రవారం

కొ. సోమశేఖరశాస్త్రి
Ex. ప్రిన్సిపాల్, మోడేకుర్రు సంస్కృతకళాశాల

# ప్రాస్తావికము

ఓంకార లక్ష్యార్థంబును, అద్వితీయంబును, దృశ్యరహిత పరిపూర్ణంబును, నిరుపమానంబగు సత్యజ్ఞానానంతస్వరూపంబైన బ్రహ్మయే తన స్వరూపంబని యెపుడు గుర్తించుటకుగాను యీ బ్రహ్మవిద్యానుసంధాన మావశ్యకమైయున్నది. ఇది విద్యలలో కెల్ల రాజవిద్యయై పరమశ్రేయోదాయకమగుచున్నది. కాని యిది కష్టసాధ్యమై గురు ఈశ్వరానుగ్రహములతో స్వప్రయత్నము వల్ల చిరకాల శ్రవణమననాదభ్యాసపాటవములతో గాని పొందబడదు. దీనికీవిద్యానుసంధానము పెన్నిధివంటిది. ఇట్టి బ్రహ్మవిద్యానుసంధానమును, ఒకచిన్నగ్రంథ రూపమున వ్రాయుటకు మందప్రజ్ఞుడనైన నేను పూనుకొనుట సాహసము, హాస్యాస్పదమనియు తలంచుచున్నాను ఈ విషయము నేనొక గ్రంథముగ వ్రాయగలనని కాని, వ్రాయవలెనను తలంపుతోగాని వ్రాసినది గాదు. ఐననూ భాగవతమున శ్రీ పోతనగారు "పలికెడిది భాగవతమట, పలికించు విభుండు రామభద్రుండట, నేబలికిన భవహరమగునట, పలికెద వేరొండుగాథ పలుకగనేలా" అనినట్లు కేవలము నా పురాకృతపుణ్యఫలంబున గురు ఈశ్వరానుగ్రహప్రేరితస్ఫురణముచే బ్రహ్మవిద్యాభ్యాస సాధనముగ నిది వ్రాయబడినదే గాని, వేరొండుగాదు.

మా తండ్రిగారు ఆంధ్రదేశ బ్రాహ్మణ వ్యాపారప్రముఖులని పేరు పొందిననూ వారు వాస్తవముగ, బ్రహ్మవిద్యాసిద్ధులును వేద, వేదాన్తవిద్యా వృద్ధ్యభిలాషులును, తత్ప్రవర్తకులునై యుండుటచే, అనేకవ్యాపారసంస్థలను శాఖోపశాఖలుగ స్థాపించి, బహులక్షలాదిద్రవ్యము నార్జించియున్ననూ, అందు చాలాభాగము అనగా తొంబదిపాళ్ళకధికమైన వారికుటుంబద్రవ్యము తోడనే వారి జీవితాశయమైన వేదవేదాంతాభివృద్ధి, తత్సంబంధమైన దేవతాకార్య

నిర్వాహణములు, బ్రహ్మవిద్యాసాంప్రదాయ నిర్వహణములు, మొదలుగాగల ధర్మోద్దేశ్యములతో "స్వధర్మ స్వారాజ్య సంఘ" అనుపేర నొక సంస్థను స్థాపించి వృద్ధిని గావించి యుండిరి. నేను వారికేకైక పుత్రుడను. వారికి సదా అర్థ—పరమార్థములలో అర్థముచే కలుగు సుఖము దుఃఖమిశ్రితము తాత్కాలికమైనదనియూ, పరమార్థసుఖమే నిత్యనిరతిశయమైనదనియూ దృఢనిశ్చయ ముండుటచేతనూ, యింకనూ మానవునకు ఐహిక ధనరూపమైన స్థిరచరాస్తులు రెండునూ చరములేగాని స్థిరములుగావను దృఢవిశ్వాసముతోడనూ, పరమార్థమే స్థిరమను గట్టినమ్మకముతోడనూ, అర్థభారమును, అనగా వారు స్థాపించిన బహువ్యాపార ధర సంస్థల యొక్క నిర్వహణములను వారియొక్క పౌత్ర దౌహిత్రులిద్దరికిని తదితరులకునూ అప్పగించి, వారియాశయమైన బ్రహ్మ విద్యాభ్యాసానుకూలతను అనుసరించి, వసతులనేర్పరచి, కుటుంబనిర్వాహణా వశ్యకధనమును మాత్రము వయఃపరిణామియైన నాకప్పగించి, విదేహ ముక్తులైరి.

ఎట్టి తండ్రియైననూ తనకు ప్రియమైన ద్రవ్యసంపత్తిని తనకుమారునకప్పగించునుగదా? తక్కిన దానిని తోచినట్లుచేయును. వారు బాగున్న కాలములో యనేకమారులు, యీవ్యవహార, వ్యాపార, పరిపాలనాదికములు, అందరకును ప్రారబ్ధఫలానుసారమే వచ్చుచున్ననూ, యట్టివి విద్వాంసుడైన బ్రహ్మ విదునికే కేవలసుఖకరములుగ నుండుననియు, తదితరులైన సామాన్యులకిట్టివి, కేవలసుఖకరములు గాక, సుఖ, దుఃఖ, క్లేశాది మిశ్రితములై యుండుననియూ, అందువల్లనే శ్రుతి "తతోమేశ్రియమావహ" అని చెప్పుచున్నదనియూ యనుచుండెడివారు. ఈ యుద్దేశముతోడనే, కించిద్విద్వాంసుడను, ఏకైకపుత్రుడనైన నన్ననుగ్రహింపదలచి "సబ్రహ్మ విద్యాం సర్వ విద్యా ప్రతిష్ఠాం, అథర్వాయజ్యేష్ఠపుత్రాయప్రాహ" యను వచనమునననుసరించి వారు విదేహముక్తిని పొందుటకు సుమారొకమాసము రోజులకు ముందొకరోజున సికింద్రాబాదుపట్టణ గృహమందు నన్నువారికడకు బిలచి కొన్ని యుపదేశ వచనముల చెప్పి వ్రాసికొన నాదేశించిరి. వ్యవహారసాధ్యమైన అర్థము

దుఃఖమిశ్రితమేగాని శాశ్వత సుఖము నివ్వ సామర్థ్యము గలది గాదనియు, మానవజన నొందిన వానికి పురుషార్థములు నాలుగైననూ వానిలో మోక్ష పురుషార్థమే పరమపురుషార్థమనియూ, దానిని యీ జన లోగాని, మరియెన్ని జన లకైననూ గాని సాధించవలెననియూ. యిది మన సంప్రదాయమనియు, యీ యుపదేశ వచనముల సారాంశము. "తండ్రి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి" యని భాగవత వచనముగదా.

మా మాతామహులు బ్రహ్మవిద్వరులు. వారిభుజములమీద నా శైశవము గడచినది 'తద్దృష్టిగోచరాస్సర్వేముచ్యన్తేసర్వకిల్బిషైః' అనువచనము బ్రహ్మవేత్తదృష్టికి గోచరులైన వారెల్లరు సర్వపాపములనుండి విముక్తులగుదురని తెలుపుచున్నది. అట్టితరి నా సుకృత ఫలమెట్టిదైయున్న, యిట్టి వన్మూక్త పరంపరలోని వాడనై యిట్టిమహానీయుల హస్తములలో నా శైశవము గడిపిన వాడనై యుందును? మా తండ్రిగారు బ్రహ్మణ్యులైనను, ప్రారబ్ధానుసారము వ్యాపారములను నిర్వహించుచుండిరి

ఒక బ్రహ్మవిదునకు దౌహిత్రుడనై, మరియొక బ్రహ్మవిదుని గర్భవాసమున జనించిన ఫల మూరకపోవునా? "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా" అను వచనము చొప్పున తదాది బ్రహ్మానుసంధానా లాష కలిగి నిత్యాభ్యాసపటిమ, గుర్వీశ్వరానుగ్రహములవల్ల దినదినా వృద్ధిని గాంచుచుంటిని. ఇట్లు కాలము గడచుచుండ,

తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్।
ఏతదేక పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః॥

అను విద్యారణ్య వచనము ననుసరించి ప్రతిదినము కొంతకాలమీ బ్రహ్మాభ్యాసము చేయుచు తద్దార్ఢ్యము నపేక్షించినవాడనై ఆవిషయముల నప్పుడప్పుడు వ్రాయుచుంటిని.

ఇట్లు కొంతకాలము గడువగా నేను గ్రహించిన విషయసిద్ధాంతములు సంప్రదాయానుకూలముగ నున్నవో లేవో అను సంశయముతోడను

నాయొక్క సిద్ధాంత దార్ఢ్య సంపాదనేచ్ఛతోడను నేనప్పుడప్పుడు వ్రాసికొన్న విషయసంపుటిని, మాసంఘీయ సంస్థాన పండితవరేణ్యులైన, పూర్వోత్తర మీమాంసాచార్యులు బ్రహ్మశ్రీ దోంగ్రే వీరేశ్వరశాస్త్రి గారికిని, తదితర పండిత వర్యులకును గూడ జూపిన వాడనైతిని. వారీపత్రికలను బాగుగ పరిశీలించి అందలి విషయగ్రహణ, నిరూపణములు సిద్ధాంత సాంప్రదాయానుకూలము గను, శ్రుత్యనుభవయుక్తములుగ నున్నవనిచెప్పి తదుపరి "మీ సంపుటీ విషయములను గ్రంథరూపమున నుంచిన బాగుండునని" సూచించిరి. అయి నను దీనిప్రకాశనము హాస్యాస్పదముగ నుండునేమో యని కొంత కాలమూరకుంటిని ఇదిగాకను యీ నాగ్రంథ విషయాంశములు మానవులకు పరమశ్రేయోదాయకమైన నిత్య నిరతిశయ సుఖసాధనములైననూ, యిర్వ్యాది భాషా గ్రంథమగుటవల్లనూ, రచనానైపుణ లోపముచేతనూ, యిందలి విష యము కేవలనిర్గుణస్వరూపమైన బ్రహ్మ ప్రతిపాదనమే యగుట చేతనూ, శాస్త్రజ్ఞులకీ గ్రంథమాదరణీయము కాజాలదేమో యనియు, అజ్ఞులకు దీని యందభిరుచి కలుగునా యనియు సంశయచిత్తుడనైతిని, కాని చివరకు దీని గ్రంథరూపముననుంచిన కొందరు ముముక్షు జిజ్ఞాసువులకైననూ నుపయోగ ముగా నుండుననియూ అట్లుకానిచో నాస్వలాభమేయుండునను దృఢనిశ్చయ ముతో యీ గ్రంథము యొక్క ప్రకాశనమునకొప్పిన వాడనైతిని. నా గ్రంథ ప్రకాశనమున దోడ్పడిన మాపండిత వరేణ్యులకు నాకృతజ్ఞతాంజలులు.

ఇచట నొకవిషయమును తెలుపవలసియున్నది. ఈ గ్రంథమందు సుబోధకముగ నుండుటకుగాను, సిద్ధాన్తదార్ఢ్యమునకును. విషయ నిరూ పణలు శ్రుతియుక్త్యనుభవయుక్తముగ అనేక విధముల వ్రాయబడియున్నవి. ఇందు సూచించిన విషయనామములు అనుభవవివేచనా సద్వస్తునిరూపణలకు ఆలంబనముగ గ్రహించినవేగాని, కేవలము ఆయా నామవిషయముల నిర్ణ యమే ప్రధానోద్దేశముగాగలవికావు. ఈ బ్రహ్మవిద్యానుసంధాన ప్రధాన విషయము "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అని సదా ఒక్కటిగానే యుండునుగాని మారుటకు వీలులేదు. ఈ విషయాలంబనకు అవాంతరనామముల నెన్ని

యుదహరించినను యివియన్నియు మార్గభేధములేగానిఅన్నిటియందును ప్రధాన విషయ మొక్కటిగనే యుండును. ఇందుచే పాఠకులకు గడచిన విషయ నిరూపణలలోని అనుభవములే పునః పునః యీ నిరూపణలయందు తోచు చుండును. ఇట్లుండుట యీ బ్రహ్మ విద్యానుసంధానమునకు పునరుక్తి దోషముగాక, భూషణమేయగును. అనుసంధాన మనగా వృత్తి దార్ఢ్యమునకుగాను ఒకే విషయమును వివిధోపాయములచే తిరిగి తిరిగి యను కొనుట. కాన బ్రహ్మ విద్యానుసంధానమునందు పునరుక్తిదోషములేదు. పాఠ కులు దీనిని గ్రహించవలెను.

ఈ చిన్న గ్రంథమందు నిరూపించిన అంశములన్నియు, జిజ్ఞాసు వునకు శ్రవణముచే గ్రహించిన, వాక్యార్థబోధయొక్క దార్ఢ్యమును సంపా దించుటకుగాను సులభసాధన రూపముగా నుండుటకు వ్రాయబ నవే గాని వేరుకాదు. ఇందు శాస్త్రార్థములుగాని, వాదములు, అర్థనిర్ణయములు గాని నిరూపింప సాహసింపక, కేవల బ్రహ్మానుసంధానోపయుక్తములగు విషయములనే శ్రుతి సమ తిని నిరూపింప యత్నించితిని. కాని యిట్టి పరమాగ వస్తువు - నిత్య — దృశ్య రహిత - పరిపూర్ణ-అఖండ—శుద్ధచైతన్యము—అద్వి యము—నిరుపమానమైనది కనుకనే "యతోవాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" అనిశ్రుతి తెలుపుచున్నది. ఐనను యిట్టిగ్రహణానుభవములు సంస్కృతమనస్సుచే పొందదగినవిగా నున్నవి. ఇట్టి గ్రహణమునకు సాధా రణముగా దృష్టాంతములచే నిరూపణ, శబ్దముచే అనుసంధానములు సాధకుని కావశ కము. ఇట్లు చేయుటకు సాధకునకు వ్యవహారసాధనములు గాని వేరు కనబడుటలేదు. కాన యిట్టి ఒక్కటియైన సద్వస్తువును మనసుచే గ్రహించు టకు వాక్యములతో నుదాహరణల పూర్వకముగా నిరూపించవలసి యున్నది. ఇట్లు నిరూపించుటకు ఎట్టియుదాహరణలు, యెట్టి సుశబ్దములచే నిరూపింప యత్నించినను, విపర్యకు అవకాశము ఉండుచునే యుండును. ఏలయన యిట్టి సద్వస్తువు అద్వితీయమై నిరుపమానమై యున్నది. అయిననూ సాధారణ ముగ జిజ్ఞాసువుకు ప్రథమముననే యిట్టి నిర్విషయ, నిరాకార, నిర్గుణ

పదారము—తాను అనగా నేనే అని గ్రహించుట సులభసాధ్యముకాదుగనుక అందుకు గాను యిట్టి సద్వస్తువు, అనగా నిరుపమాన, నిత్య, అద్వితీయ పరిపూర్ణ పదార్థముయొక్క గ్రహణ సౌలభ్యమునకు గాను, వ్యవహారసిద్ధమైన దృష్టాంతములను, గ్రహించవలసివచ్చినది. నిరూపణల కివియే సాధనములు గదా? ఉపమాన, ఉపమేయములు రెండును వ్యవహారము లోనివే ఐనను ఉపమాన ఉపమేయములు సాధారణముగా కొన్ని అంశములలోనే సరిపోవునుగాని అన్ని అంశములలో పూర్తిగా సరిపడవు. ఇట్లు వ్యావహారికములోని రెండువస్తువులకే అత్యన్త సాదృశ్యములేనప్పుడు—వ్యావహారిక పారమార్థికములకు సాదృశ్యము సర్వ అంశములలోను ఉండుట ఎట్లు సంభవము? ఇట్లే శబ్దములుగూడ వ్యవహారాంతర్గతములే గదా? ఇట్టివిషయ సందర్భములలో అవిమర్శకు అవకాశముండకూడదని భావించుచున్నాను. కాన ఇందు దృష్టాంతములయందు సిద్ధాన్తమునకు సరిపడు అంశములను మాత్రమే గ్రహించవలెనుగాని తదితరములను గ్రహించి సంశయించుట యుక్తముగాదు. ఇట్టిశబ్దములను గూడ "తాత్పర్యాధీనా శబ్దవృత్తిః" అను న్యాయము ననుసరించి నిరూపణ, ప్రకరణానుకూలముగ గ్రహించి అద్వైత సిద్ధాంత గ్రహణలాభ సాధనముగా దీనిని గ్రహింప ప్రార్థన. భాషా, పాండిత పటిమలేని నేను ఈ గ్రంథరచనయందు శబ్ద శుద్ధి, సౌందర్యములను, అంత ప్రధానముగ పాటింపక, అన సాహాయ్యమందిచ్చులేక, తత్త్వ విషయమునే ప్రధానముగ పాటించి నా అబా సానుభవ దార్ఢ్యములకుగాను నాచే వ్రాయబడిన ఈ గ్రంథమునందుండు లోప, దోషములను పండితవరులు మన్నింతురుగాక.

ఇట్లు
కౌతా. మోహనరామశాస్త్రి

# విషయ సూచిక


| | | పుట |
|---|---|---|
| 1. | మంగళా చరణము | 1 |
| . | అసద్గురు ప్రార్థనా | 2 |
| 3. | ఉపోద్ఘాతము | 3 |
| 4. | జగత్స్వరూప నిరూపణ | 17 |
| 5. | జగదుత్పత్తి వినాశ నిరూపణ | 26 |
| 6. | బహ్మ విద్యా వశ్యకతా నిరూపణ | 30 |
| 7. | బహ్మ విద్యా శ్రేష్ఠ్యము | 35 |
| 8. | ఆత్మా నాత్మా ధ్యాస నిరూపణ | 39 |
| 9. | సర్వదృశ్యా ధిష్ఠాన నిరూపణ | 42 |
| 10. | అధిష్ఠానాధ్యస్తములు | 44 |
| 11. | సంసారాసారతా నిరూపణ | 47 |
| 12. | మోక్షసాధన సామగ్రి | 52 |
| 13. | మానవునకు నిత్యానిత్య వివేకావశ్యకత | 62 |
| 14. | అహం ప్రత్యయ వివేచన | 66 |
| 15. | అహంకార వివేచన | 75 |
| 16. | ప్రత్యగాత్మ నిరూపణ | 79 |
| 17. | శరీర త్రయ వివేచన | 84 |
| 18. | వాసనా నిరూపణ | 90 |
| 19. | కర్తృత్వాద్యాభాస నిరూపణ | 103 |
| 20. | సుఖానుభవ వివేచన | 111 |
| 21. | నిష్కామతా నిరూపణ | 115 |

22. త్యాగ స్వరూపము ... ... 116

23. పరమపురుషార్థ నిరూపణ ... ... 120

24. సంకల్పసామర్థ్య నిరూపణ ... ... 125

25. ప్రత్యక్షానుభవ వివేచన ... ... 128

26. పిండాండ బ్రహ్మాండ వివేచన ... ... 131

27. దుఃఖనివృత్తి నిరూపణ ... ... 135

28. అంతఃకరణాభాస వివేచన ... ... 139

29. వ పరిశోధనావశ్యకత ... ... 143

30. వుని సాక్షిభావసుఖము ... ... 149

31. తత్త్వజ్ఞానముచే వ్యవహారసుఖ నిరూపణ ... ... 153

32. వేదాంతానుభవము వ్యవహారికి సాధ్యమా ... ... 157

33. తత్త్వజ్ఞాని స్థితివ్యవహార నిరూపణ ... ... 161

34. జ్ఞాని అజ్ఞానుల అనుభవ వివేచన ... ... 166

35. వుని జన పరంపర కథనము ... ... 170

36. వ వివేకము ... ... 178

37. మిథ్యాత్వానుభవ వివేచన ... ... 183

38. అనుభవ వివేకము, పురుష ప్రయత్నావశ్యకత ... 191

39. స్వస్వరూపసుఖ ఆవశ్యకత, సంభావితము .... 197

40. ముముక్షువునకు శ్రద్ధోత్సాహాద్యావశ్యకత ... 203

41. ముముక్షువునకు వైరాగ్య బోధోపరతుల యావశ్యకత ... 208

42. ముముక్షువునకు చిత్తనాశ ప్రయత్నము--వృత్త్యాలంబన ఆవశ్యకత ... 211

43. వృత్తి దాని పరమ ప్రయోజనము ... ... 214

44. ముముక్షు వ్యవహారాచరణావశ్యకత ... ... 218

45. ముముక్షువుకు అనుసంధానావశ్యకతా నిరూపణ ... 223

46. ముముక్షు స్థితి వ్యవహార నిరూపణ ... ... 237

47. ముముక్షువునకు విధి, కర్తవ్యతలు ... ... 250

48. జ్ఞాన నిరూపణ ... ... 260

49. జ్ఞాన్యజ్ఞానులకు ప్రారబ్ధ ఫలభోగము సమానము ... 274
50. ఆతా ంతఃకరణ ధర ముల వైలక్ష ణ్యము ... 277
51. రాజ విద్య ... ... 281
52. జ్ఞానసాధనము ... ... 286
53. వ బ్రహ్మై క్యానుసంధానము ... ... 290
54. పునరధిష్ఠాన గ్రహణావశ్యకత ... ... 296
55. విద్యాభ్యాసకుని ప్రశంస ... ... 302
56. అఖండత్వ నిరూపణ .... ... 311
57. ఆత విచారము ... ... 315
58. శక్తి, బ్రహ్మ వివేచన ... ... 321
59. జనన మరణ స్వరూప వివేచన ... ... 323
60. సత్యశబ్దార్థ నిరూపణ ... ... 328
61. అహం నేను అను ప్రతీతికి వాస్తవికార్థము ... 333
62. మనస్స్వరూపము, దాని పరమ ప్రయోజనము ... 349
63. మాయాస్వరూపము ... ... 364
64. జ్ఞాన ప్రతిబంధములు, వాటి నివర్తకోపాయ సంగ్రహము.... 380
65. అనాది కర్మయే పుని సంసార కారణము ... 382
66. శ్రవణ, మనన, నిదిధ్యాసనముల అత్యావశ్యకత ... 385
67. మోక్ష వివేకము ... ... 389
68. అద్వైత గ్రహణ మహిమ ... ... 398
69. బ్రహ్మానుసంధాన ప్రకార నిరూపణ ... ... 403
70. అనుసన్ధాన క్రమము ... ... 406
71. బ్రహ్మానుసంధాన ప్రకారాంతము ... ... 429
72. అనుసంధాన స్వరూపము ... ... 434
73. వృత్తి వివేచనము .... ...., 437
74. అనుసన్ధాన రహస్యము .... .... 441
75. జ్ఞాని యథ సించవలసిన లోకదృష్టి .... ...., 449

76. ఆత్మబోధ .... .... 460
77. బ్రహ్మస్వరూపోపలబ్ధి స్థానము .... .... 469
78. అభ్యాస నిరూపణ .... .... 471
79. శ్రుత్యనుసారి బ్రహ్మ నిరూపణ .... .... 474
80. సారాంశము .... .... 479
81. సిద్ధాంత సారాంశము .... .... 483
82. ఆత్మానుసంధానము .... .... 488
83. మహావాక్యానుసంధానము .... .... 499
84. ఆత్మానుసంధానమే దేవపూజనము .... .... 500
85. హితోపదేశము .... .... 510
86. శక్తి సిద్ధులు, జ్ఞానవిరోధులు .... .... 536
87 మోక్షసాధన వివేచనానుసంధానామృతము .... 539
88. అద్వైతానుసంధాన వివేచన .... .... 546
89. సంక్షిప్త అనుభవవాక్యములు .. .... 548
90. బ్రహ్మాభ్యాసకునకు నిర్వేదము శుభలక్షణము .... 567
91. జ్ఞాని నిత్యానుసంధానము .... .... 570
92. నేను అను "అహం" పదార్థము, మనోభిన్నము .... 573
93. సర్వాధిష్ఠాన సర్వాత్మ, అఖండ గ్రహణము .... 574
94. అభ్యాస ప్రశంస .... .... 576
95. మనోజయము .... .... 579
96. ఆత్మానుసన్ధాన శ్లోకములు, తద్వివరణము .... 581
97. చిదాకాశానుసంధానస్తోత్రమ్ .... .... 585
98. చిదాకాశానుసంధాన స్తోత్ర వివరణము .... .... 591
99. తత్త్వజ్ఞాన పక్ష .... .... 597
100. బ్రహ్మ విద్యాభ్యాస సారము .... .... 599
101. ఉపసంహారము .... .... 609
102. తత్త్వమంజరి .... .... 625
103. తప్పొప్పుల పట్టిక .... .... 636



శ్రీగురుభ్యోనమః

# బ్రహ్మవిద్యానుసన్ధాన దర్పణం

## మంగళాచరణము

శ్లో॥ బ్రహ్మాది స్థావరాన్తస్య ప్రపంచస్యావభాసకమ్ ।
తద్బ్రహ్మ సచ్చిదానన్దం సాక్షివద్వయ మాశ్రయే ॥

శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ ।
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిన్దయోగీన్ద్రమథాస్య శిష్యమ్ ।
శ్రీశంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకంచశిష్యమ్ ।
తంతోటకం వార్తికకార మనా నస్మద్గురూన్ సంతత మానతోఽస్మి ॥

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్ ।
నమామి భగవత్పాదం శంకరం లోక శంకరమ్ ॥

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।
సూత్ర భాష్యకృతౌ వందే భగవన్తౌ పునఃపునః ॥

శ్లో॥ సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యన్తాం వందేగురుపరంపరామ్ ॥

శ్లో॥ యోబ్రహ్మాణం విదధాతిపూర్వం యోవై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై ।
తగ్ంహదేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥

ఓంనమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మ విద్యాసంప్రదాయకర్తృభ్యో
వంశఋషిభ్యః పరమఋషిభ్యో నమోమహద్భ్యో నమోగురుభ్యః.

సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాఽహమస్మి.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

## అస్మద్గురు ప్రార్థనా

శ్లో॥ కౌణ్డిన్యాన్వయ సుధాబింబం సూర్యనారాయణం గురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం పితరం జ్ఞాన భాస్కరమ్ ॥

శ్లో॥ బిల్వేశం సతతం వందే భాస్కరం పరమంగురుమ్ ।
గురుంచ జ్ఞానదాతారం సూర్యనారాయణం బుధమ్ ॥

శ్లో॥ నిత్యం తే ప్రణమామి పాదయుగళం ధ్యాత్వాముదాభాస్కరం ।
సాదరంస్మారమహో త్వదీయమధురాం వాచం సదా జ్ఞానదామ్ ।
తృప్తోఽహం మమజన్మ ధన్య మహహో లబ్ధ్వాగురుంత్వాదృశమ్ ।
తాతాధేహి మమాపరోక్ష మధునా జ్ఞానం హి చిద్భాస్కర ॥

# ఉపోద్ఘాతము

జన్మించిన ప్రతి మానవునకును అనాది సిద్ధమైన అవిద్యచే, తన వాస్తవ స్వరూపము కప్పబడి కల్పితమగు స్థూల, సూక్ష్మ శరీరాదులు అనుభవములో నున్నవి. ఈ యవిద్యయను మాయచేత యేర్పడిన మిథ్యాప్రపంచ దృశ్యమే అధ్యాసము. అధ్యాసమన్నను అనాది భ్రాంతియన్నను ఒక్కటియే. దీనిచేత జీవుడు తన స్వరూప సుఖమును మరచి యున్నాడు. కాన జన్మించిన ప్రతి జీవుడు పిపీలికాది బ్రహ్మ పర్యంతము సర్వదా కోరునది సుఖము. ఇందు ప్రతి మానవునకున్నూ తాత్కాలిక సుఖముకన్న శాశ్వత సుఖమునందు ఎక్కువ ప్రీతి. ప్రతి మానవునకున్ను స్వ— శాశ్వతత్వముల మీద అధిక ప్రేమయను విషయమందరి యనుభవములో నున్నదే. ఐనను శాశ్వత సుఖమొక్కటి యున్నదని తెలియకను, తెలిసినను దానిని సంపాదించు శాస్త్రీయ మార్గమందు రుచిలేకను, ఒకవేళ మందేచ్ఛ యున్నను అది క్లేశకరమని భావించియు, తాత్కాలిక విషయసుఖముల మీదనే యాధారపడి "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం" అను పద్ధతిలోనే తృప్తిని పొంది చర్విత చర్వణమైన యీ సంసార ప్రవాహమందు అనాదిగ తిరుగుచున్న ఒకానొక జీవునకు అధిక పుణ్యాతిశయముచే ప్రాపంచిక సుఖానిత్యత్వాదులు తోచి విసగటజెంది శాశ్వతసుఖ సంపాదనేచ్ఛ కలుగును. ఇట్టి నిత్య నిరతిశయమైన సుఖమునే "ఆత్మైవానన్దః" అని శ్రుతిమాత తెలుపుచున్నది. కనుక ఆత్యంతిక దుఃఖరాహిత్యమును, నిత్య నిరతిశయ సుఖప్రాప్తినిగోరు మానవునకు ఆత్మజ్ఞాన మావశ్యకము. ఇట్టి జ్ఞానేచ్ఛ ఈశ్వరానుగ్రహమువల్లగాని కలుగదు. దీనినే—"ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా" అని శాస్త్రము చెప్పుచున్నది. జపతపములవల్ల శాంతచిత్తుడై వైరాగ్య సంపన్నుడైన జిజ్ఞాసువునకు ఈశ్వరానుగ్రహము వల్లనే బ్రహ్మజ్ఞానేచ్ఛ కలుగును.

జనన మరణములు అనాదులు. సంసార ప్రవాహమును దాటుటకు మానవ జన్మ మొక్కటియే—నిత్యానిత్య వివేకము, నిత్యానిత్య సుఖ జ్ఞానము, తద్ద్వారా నిత్య నిరతిశయానన్ద సుఖప్రాప్తి, అనగా—మోక్ష సంపాదనకు సాధనముగాని, యితర జన్మలుకావు. ఇట్టి మానవ జన్మ లభించినను దానిని ముక్తి సాధనముగ నుపయోగించుకొనలేని మానవుడు పశు సమానుడని తెలుపుచూ మరియున్నూ లౌకిక ధర్మములయందు అనగా ఆహారము, నిద్ర, భయము, మైథునాదులయందు ప్రవృత్తి కలుగుచుండుట నరులకునూ పశువులకున్నూ సమానముగానే కనబడుచున్నది. కాని నరజన్మమెత్తిన వారికి విశేషముగా కలుగవలసినది, సంపాదించవలసినదిన్నీ యేమనిన యెడల, నిత్యానిత్య వివేకము, తద్ద్వారా తన స్వరూపజ్ఞానము అయిన సుఖము. అనగా మోక్షప్రాప్తి నభిలషించి సంపాదించు ప్రయత్నము చేయుచుండుటయే అధికమనిన్నీ, పరమోత్కృష్టమైనదనిన్నీ శాస్త్రము తెలుపుచున్నది. అటుల గానిచో మానవ జన్మము గూడ పశు ధర్మములతో సమానమైనదియే యగుననియూ "పశ్వాదిభిశ్చ అవిశేషాత్" అని శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. గాన మానవ జన్మ లభించి, అందు మనలకు జ్ఞాన సంపాదనానుకూలమైన స్థితి కలిగినప్పుడు దానిని వ్యర్థము చేయక సర్వ విధముల చేతను తన వాస్తవస్వరూపసుఖ జ్ఞానమును సంపాదించు యత్నము చేయుచుండవలయును. ఇదియే మానవ జన్మకు పరమ ప్రయోజనము. ఇంతకు మించిన ఉత్కృష్టాశయ కర్తవ్యములు లేవని తెలుసుకొనవలయును. ఇట్టి ప్రయత్నమే మానవునికి నిత్యనిరతిశయానందప్రాప్తి సాధనమై మోక్ష మార్గమగును. దీనినే—

శ్లో॥ లబ్ధ్వాకథం చిన్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్ ।
యస్త్వాత్మముక్త్యై నయతేత మూఢధీః
సహ్యాత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్ ॥

# ఉపోద్ఘాతము

"జ్ఞానాదేవతు కైవల మితి వేదాన్త డిండిమః ।"

"వినాఽజ్ఞాన ప్రహాణేన పురుషార్థస్తు దుర్లభః ॥"

"వస్తుసిద్ధిర్విచారేణ నకించిత్కర్మకోటి భిః ।"

శ్లో॥ అవిచారకృతో బన్ధో విచారేణ నివర్తతే ।
తస్మాజ్జీవ పరాతా నౌ సర్వదైవ విచారయేత్ ॥

"ప్రాప్యప్రాప్తి రశేషేణ విచారేణైవ నాన్యథా।విచారాజ్జాయతే బోధః।"

అనగా—"అనేక జన్మ సుకృతములున్నగాని లభించనట్టి నరజన్మను, అందును పురుష జన్మను, పరిపూర్ణమైన వేదజ్ఞానమును సంపాదించికూడ ఏ మూర్ఖుడు తన ముక్తికై ప్రయత్నించడో, అతడు అజ్ఞానముచే తననుతానే చంపుకొను చున్నాడు. మోక్షము జ్ఞానము వల్లనే కలుగునని ఉపనిషత్తుల యుద్ఘోషము. అజ్ఞానము నశించనిదే మోక్షము దుర్లభము. స్వరూప జ్ఞానము విచారము చేతనే కలుగునుగాని కోటి కర్మలు చేసినను ఏమియు ప్రయోజనముండదు. అవిచారముచే యేర్పడిన సంసారము విచారము చేతనే పోవునుగాన ఎల్లప్పుడు వపరమాత్మలను గూర్చి విచారించవలెను. పొందవలసిన సద్వస్తువును పొందుట విచారముచేత గాని మరియొక విధముగా కాదు అని పై శ్రుతి స్మృత్యాది వచనములు చెప్పుచున్నవి. ఇట్లే—

శ్లో॥ నిత్యమంతర్విచారస్య పశ్యతశ్చంచలం జగత్ ।
జనకస్యేవ కాలేన స్వయమాత్మా ప్రసీదతి ॥

సర్వదా అంతరాత్మను ధ్యానించుచు జగత్తంతయు అస్థిరమని గుర్తించినట్టి వారికి, జనకునికి వలె క్రమముగ ఆత్మసాక్షాత్కారము కలుగును అని వశిష్ఠవచనము తెలుపుచున్నది. ఇంకనూ ఈ ఆత్మ విచారమనునదిముముక్షు వునకు సంసారమహాసముద్రము దాటుటకు ఒక గొప్పనావవంటిది. ఇదియే జ్ఞానసాధనమునకు కల్పలత యగుచున్నది. శ్రీయోగవాశిష్ఠమను మహా

తత్త్వ గ్రంథమందు యీ ఆత్మ విచారమును గురించి సర్వోత్కృష్టమైనదిగా అచటచట వర్ణింపబడినది. అందు ప్రహ్లాదోపాఖ్యానమునందు యిట్లు తెల్పు చున్నారు :

శ్రీ మహావిష్ణువు నరసింహావతారముదాల్చి తన తండ్రి యైన హిరణ్యకశిపుని సంహరించిన తదుపరి ప్రహ్లాదుడు తన తండ్రి మరణమునకు దుఃఖితుడై యిట్లు చింతించిన వాడాయెను. "పరాక్రమంబున దేహబలంబున నా తండ్రికి మించిన వారెవ్వరునూ యీ ముల్లోకంబులందులేరు. అయిననూ అట్టివానిని గూడ యవలగ విష్ణుమూర్తి వధించి యున్నాడు. ఇట్టి వానిని జయించుట నాతరముగాని, మరెవ్వరివల్లనూకాని కాజాలదు. అట్టిచో నేనెట్లు దుఃఖోపశమనమును పొందగలను" అని తలచి, కట్టకడకు తనతండ్రిని జంపిన వానికన్న గొప్పవాడు యుండడని నిశ్చయించి, ఆ విష్ణుమూర్తినే నేను నాదుఃఖోపశమనమునకు ప్రార్థింతునుగాక అని నిశ్చయించి ఆ మహా విష్ణువును గురించి తపస్సుచేయ నారంభించెను. కొంతకాలమునకు నా విష్ణువు ప్రహ్లాదుని తపమునకు మెచ్చినవాడై ప్రత్యక్షమిచ్చి ప్రహ్లాదుని తనకేమి వరముకావలయునని అడిగెను. అప్పుడు భక్తాగ్రేసరుడగు నా ప్రహ్లాదుం డిట్లనియె :

శ్లో॥ సర్వసంకల్పఫలద స్సర్వలోకాంతరస్థితః ।
యమదారతమం వేత్సి తదేవాదిశ మే విభో ॥

తా॥ ఓ ప్రభువా ! నీవు సమస్తమగు కోరికల నొసంగు వాడవును, సర్వలోకంబుల యందు నుండువాడవు నగుదువు. అట్టినీవు ఎయ్యది శ్రేష్ఠమని తలంచెదో, అయ్యదియే నాకనుగ్రహింపుము.

అనిన, నా విష్ణుమూర్తి యిట్లనియె :

శ్లో॥ సర్వసంభ్రమ సంశాంత్యై పరమాయ ఫలాయ చ,
బ్రహ్మ విశ్రాంతిపర్యంతో విచారోఽస్తు తవాఽనఘ.

తా॥ ఓ ప్రహ్లాదా! సమస్త విధములగు భ్రమములు అణగుటకును, పరమపురుషార్థప్రాప్తి కొరకును, బ్రహ్మమునందు విశ్రాంతినొందుట యంతమగు నాత్మ విచారము నీకు గలిగెడిని. అని చెప్పిఅంతర్ధానుండయ్యె—

శ్లో॥ విచారవానేవ భవాన్భవత్వితి భవారిణా,
దేవేనోక్తోఽసి తేనాఽంతః కరోమ్యాత్మ విచారణామ్ ॥

తా॥ జన్మదోష వినాశకుండగు సద్దేవుండు నను గరుణించి తత్త్వ విచారపరుండవు కమ్మని యానతిచ్చెను. కావున నాలో నేను ఆత్మ విచారమును జేసికొందునుగాక.

శ్లో॥ కిమహం తావదేవ స్యాం యోఽస్మిన్భువనడంబరే,
వచ్మి గచ్ఛామి తిష్ఠామి ప్రయతే విహరామి చ.

తా॥ ఈ లోకమునందు నేను పలుకుచున్నాను, నేను నడుచుచున్నాను, నేను ప్రయత్నించుచున్నాను, నేను విహరించుచున్నాను, అని యిట్లు సమస్తమగు నింద్రియవ్యాపారముల యందు సమానముగల నేను యెవ్వండనగుదును.

శ్లో॥ అసన్నభ్యుత్థితో మూకః పవనేనైవ విస్ఫురన్,
కాలేనాల్పేన విలయీ దేహో నాహమచేతనః.

తా॥ వాస్తవముచేత లేనిదియై, మాయచేత కల్పితంబైనదియు, మూగిదియు, గాలిచే కదలుచున్నదియు, అల్పకాలంబున నశించుచున్నదియు, నచేతనంబుననగు నీదేహము నేను కానేరను, అను మొదలుగాగల ఆత విచారము చేసెను.

ఇచట ముఖ్యముగా మనము గ్రహింపవలసినదేమనిన సర్వశక్తుడైన యా మహావిష్ణువుకూడ, ప్రహ్లాదుడు తనకు పరమపురుషార్థమై పరమశ్రేయోదాయకమగునది ఏదియో అట్టిది, నా విష్ణుమూర్తినే నిశ్చయించి తన

కనుగ్రహింపవలసినదిగా కోరెను. అందుకుగాను అట్టి పరమ శ్రేయో దాయక పరమపురుషార్థము తన వాస్తవ నిర్గుణస్వరూపమును, విచారించి అనుసంధానముచేసి తెలుసుకొని యనుభవించుటయేనని తెలిపెను గాని వనమాలియు, పీతాంబరధారియు, శంఖ చక్ర గదాధరుండునగు తన సగుణ స్వరూపమును గూడ వదలి తన వాస్తవ స్వరూపమైన నిర్గుణరూప వాక్యములనే తెలిపి అద్దానిని గురించియే ఆత్మవిచారము చేయుమని యుపదే శించెను. దీనినిబట్టి తెలియుచున్నదేమనగా మానవునకు నాల్గు పురుషార్థము లలో ధర్మ, అర్థ, కామములకు పరమేశ్వరుడైన తన బహు సగుణాకార రూపములనూ, పరమ పురుషార్థమైన మోక్షప్రాప్తికి ఆయనయొక్క అద్వయ, అఖండ, సర్వాంతర్బహిర్వ్యాపక, పరిపూర్ణ చైతన్యమునే విచా రించి, అనుసంధానముచేసి, తానుగా తెలుసుకొని యనుభవముపొందిన జీవుని దృశ్య దుఃఖము నశించి తన పరిపూర్ణ సుఖస్వరూపమును పొందగల డని యుపదేశించెను. కాన యీ ఆత్మవిచారమనునది ముముక్షువునకు పరమ శ్రేయోదాయకమైన మోక్షసాధనమని గ్రహించవలెను. అట్టి ఆత్మ విచార మేదియనిన: "కోఽహం, కథమిదం జాతం, కోవాకర్తాస్య విద్యతే" అనగా నే నెవడను? ఈ ప్రపంచమెట్లు పుట్టినది? దీనికి కర్త యెవరు? అను జిజ్ఞాసచే శ్రుతియుక్త్యనుభవ ప్రమాణములతో తెలిసికొనుటయే ఆత్మవిచార మనబడును. ఇదియే స్వప్రయత్నము. సంసారబంధమునుండి విముక్తిని సాధించుటకు ఇంతకన్న వేరు మార్గములేదు. దీనినే—

శ్లో॥ నదైవం నచకర్మాణి నధనాని నబాన్ధవాః ।
శరణం భవ తానాం స్వప్రయత్నాదృతేనృణామ్ ॥

అనగా—స్వప్రయత్నమను విచారములేనిచో ఈ సంసారమును దాటుటకు కర్మ, ధనము, దైవము, బంధుసాహాయ్యము ఎవ్వియు నుపయోగపడవు. అనగా వీనిచే యీ సంసారమును దాటుటకు శక్యముకాదు. కనుక యీ విచారమతావశ్యకమై యున్నది.

# ఉపోద్ఘాతము

"అహం" అను ప్రతీతిలో విషయమైన ప్రకాశరూపుడను నేను, "అహం" అను దానిలో చిత్, జడమను రెండంశములు కలవు. ఇందు జడాంశములు స్థూలశరీరాన్తఃకరణములు. వీనిని ప్రకాశింపజేయు చిదంశమే సాక్షీ, కూటస్థః, ప్రత్యగాత్మా అను పర్యాయపదములచే తెలుపబడు అద్వితీయ బ్రహ్మ. ఇతనినే శ్రుతి—"ప్రాణస్య ప్రాణః", "అయమాత్మా బ్రహ్మ", "జ్యోతిషామపితజ్జ్యోతిః" అని తెలుపుచు ఈయననే—"ఏకధైవానుద్రష్టవ్యం" అనిన్నీ, ఆయననే "తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్" ప్రపంచమును సృజించి అందు జీవరూపముగ నా పరమాత్మ ప్రవేశించినాడు. అనిన్నీ చెప్పుటె కాక, "యోవేద నిహితంగుహాయాం పరమెవ్యోమన్" 'హృదయ గుహయందు దాగియున్న ఈ పరమాత్మ నెవడు తెలిసికొనుచున్నాడో' అని ఆయనను తెలిసికొనవలసిన స్థల నిర్ణయమును గూడ చేయుచున్నది.

"ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"

అని గీతావచనము. ఈ పరమాత్మ యొక్కడే సర్వ జీవులయొక్క హృదయపుండరీకములయందు ఉజ్జ్వలప్రకాశుడై తెలియబడుచున్నాడు. ఎట్లనగా— "సూర్య ఏక ఏవసన్ యథా ప్రతి పురుషం స్న ఇవదృశ్యతె" "సూర్యుడొకడేయైనను ప్రతి మానవునకు వేరు వేరు దేశములయందు కనుపించునట్లు." దీనినే ష స్తవములో "ఒక సూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొక్కడై తోచుపోలిక" అని పరమాత్మ స్తుతిని పోతనగారు అనువదించియున్నారు. ఈ పరమాత్మయే ఆత్మ, అహం, స్వం, నేను, అను పర్యాయపదములచే ప్రతి మానవుని చేతను అనుభవింపబడుచున్న సద్వస్తువై యున్నది. ఇందు త. ప్రతి మానవునకున్ను సర్వదృశ్యముకన్నను తనయందు అధికప్రీతి కలుగుచున్నది. ఎంత దుఃఖ క్లేశములు వచ్చినను తన (స్వ) సుఖమును కోరుచు తనను మిగుల్చుకొనును. ఇదియే పరమప్రియమైనదిగాన అట్లు చేయును. ఎవరికైనను ఈ యధికప్రీతి అమూల్యోత్కృష్ట వస్తువునందు కలుగును గాని, సాధారణ నికృష్ట వస్తువునందు

కలుగుటలేదు. ఏ మానవునికైనను స్వసుఖముకన్న అధికవస్తువు గోచరించుటలేదు దీనినే విద్యారణ్యముని—

శ్లో॥ విత్తాత్పుత్రః ప్రియః, పుత్రాత్పిండః, పిండాత్తదిన్ద్రియమ్ ।
ఇన్ద్రియాచ్చ ప్రియః ప్రాణః, ప్రాణాదాత్మాప్రియః పరః ॥

అని తెలుపుచున్నారు. విత్తాదులవల్ల గలుగు సుఖము— వాస్తవ నిత్యస్వరూప సుఖముకాదు. కాని అజ్ఞానముచే దానిని ఆ విధముగ గ్రహించుటలేదు. ప్రతి వారికిన్ని యీ ప్రీతి స్వరూప సుఖమందే అతిశయముగ కలుగుచున్నను ఇది యెందుకు, ఎట్లు కలుగుచున్నదియు తెలియక అధిష్ఠానమైన తనను మరచి, అధ్యస్తమైన విషయదృశ్యములవల్ల ఈ ప్రీతి సుఖములు తనకు కలుగుచున్నవని నమ్మి భ్రాంతిచే తాత్కాలికసుఖమును దుఃఖమిశ్రితముగ అనుభవించుచు సంసారచక్రమున తిరుగుచున్నారు. ఇదియే అజ్ఞానము. దీనిని వివేచనము జేసి, జ్ఞానముచే వాస్తవమును గ్రహించిన వారికి దుఃఖ మిశ్రితముకాని కేవల సుఖము అనగా — నిత్య నిరతిశయానంద ప్రాప్తి కలుగును. ఎందుచేతననగా— నిత్య నిరతిశయ సుఖము తన సత్య స్వరూపము కనుక. ఇట్టి తన వాస్తవ స్వరూపమును పొందుట కొరకే 'అహం' లోని చిజ్జడాంశములను వివేచన విచారముల జేసి తన వాస్తవ స్వరూపము నిశ్చయించుకొని అనుభవింపవలసియున్నది. ఈ విధానమంతయు వివేక చూడామణి, మహావాక్య దర్పణము, ఉపదేశ సాహస్రి, పంచదశి, నైష్కర్మ్య సిద్ధి మొదలగు ప్రకరణ గ్రంథములలో విపులముగ తెలుపబడియున్నది.

ఈ పై శ్రుతిస్మృతివచనముల విచారము ఈ దేహాదులలో నున్న సంవిన్మాత్రమే 'అహం' నేను అనుశబ్దమున కర్థముగాని, యీ దేహాదులు కావని స్పష్టపరచుచున్నది. కాని— అనుభవములో సమస్త వ్యవహారములు ఈ దేహాదులవల్లనే నిర్వర్తించవలసి యున్నవిగాన, దేహము లేనిదే ఏపని జేయుటకు సాధ్యము కాదుగద! అందుచేతనే ఈ స్థూల సూక్ష్మ శరీరము

లను మనయొక్క కరణములనుగా తెలిసికొనవలెను గాని, అవి మన వాస్తవ స్వరూపములు గావని గ్రహించవలెను. ఎట్లనగా— శిల్పి వేరు, శిల్ప సాధనములు వేరులాగున. ఐనను సాధనములున్నగాని శిల్పమును నిర్మింపలేనట్లు ఈ యుపాధుల వల్లగాని మనకు కార్యసిద్ధుల నిర్వహణములు జరుగవు. ఉపాధిలేక జలమును గ్రహింప సాధ్యము కానట్లు ఈ యుపాధి వల్లగాని మనము సర్వవ్యాపకమైన చైతన్యముయొక్క ఏకత్వమును గ్రహించుటకును, పొందుటకును వీలుకాదు. ఐనను ఈ స్థూల సూక్ష్మోపాధులు కరణములుగాని, 'నేను' అను వాస్తవాహం పదార్థము కాజాలదు. ఘటములోని జలమెప్పటికైనను ఘటమగునా! కాని ఘటమున్నగాని జలముకు శీతోష్ణ సంస్కారముల జేయ సాధ్యము కాదుగద! ఒక్కటైన జలము సముద్ర— నదీ— తటాక— కూపములలో ఉపాధిస్థితమై వేరువేరుగ కనబడుచున్నను జలమంతయు నొకటేయైనట్లు, ఆకాశమొక్కటిగా నుండిన్ని ఉపాధిభేదేన ఘటాకాశ, మఠాకాశ, మేఘాకాశములుగ గ్రహింపబడుచున్నట్లు, ఈ పరమాత్మ ఒక్కడై యుండిన్ని ఉపాధిభేదములచేత భ్రాంతిచే నానా ~వరాసులుగ ప్రకాశించుచున్నాడు.

ఇట్లు ఎందుకు కలిగినదన, మాయాప్రభావముచే అనాద్యవిద్యా కామకర లవల్ల భ్రాంతుడైన శుద్ధ వుడు తన అఖండ పరిపూర్ణ నిత్య నిరతిశయానందములను మరచి, అనగా— తన పరిపూర్ణత్వమును మరచి పరిచ్ఛిన్నత్వమును గ్రహించియున్నాడు. ఇందువల్లనే యీ సంసార దుఃఖమంతయు వునికి ప్రాప్తమైనది. కాని — ఈ సంసారదుఃఖ మాగంతుకము గనుక ఆత్యన్తిక దుఃఖ రాహిత్యమును, నిరతిశయానంద ప్రాప్తిని కోరు నే వునికైనను ఈ భ్రాంతిని పోగొట్టుకొనుట సాధ్యమగును. దీనికి జ్ఞాన సంపాదన కావలెను. ఈ జ్ఞానానుకూల శ్రుత్యుక్తులను పైన నిరూపించి వివేచనజేసి 'అహం' తాను సంవిద్రూపుడు గాని, యీ దేహాదులు కావని నిశ్చయించితిమి. ఐనను ఈ నిశ్చయ దార్ఢ్యమునకు మనయొక్క సాధారణానుభవములను గూడ వివేచనజేసి చూచిన సహకరించును. ఎట్లన—

ఈ సర్వ ప్రపంచ వ్యవహారము "నేను" "నాది" అని జరుగుచున్న విషయమంతరికిన్ని అనుభవమె. ఈ రెండును కర్తృత్వ భోక్తృత్వములచే కలుగుచున్నవి గాన ఈ రెంటిని నివేసినయెడల ప్రపంచము మనల బాధింపఁ జాలదు. కావున వీటి వాస్తవతను విచారించి తెలిసికొనుట ఆవశ్యకమగుచున్నది. బాగుగా విచారించిన ఈ నేను "అహం" అనుమాటకు వాస్తవికర్త కనబడుటలేదు. ఏ జన్మ స్థూలదేహమాజన్మాంతముతో నశించుచున్నది. ఇది సర్వులకు తెలిసిన ప్రత్యక్షము. కాని—ఈ స్థూలశరీరములో "నేను", "నాది" అనుకొను ఒక అభిమాని యున్నాడు. ఈయనే ఆభాసుడు. మిథ్యా పురుషుడు. ఈయనకు అంతఃకరణ ముపాధి. ఈ కరణశబ్దమువల్లనే ఈ యంతఃకరణము తనుకాదని స్పష్టమగుచున్నది. ఈ యన్తఃకరణ శబ్దార్థమేమనగా—లోపలి పనిముట్టు. (సాధనము). ఎప్పుడును పనిముట్టు పనివాడు కాదుగద ! ఈ యంతఃకరణమనగా వునియొక్క అనాద్యవిద్యాకామ కర్మల ఫల కర్తృత్వభోక్తృత్వముల ననుభవించుటకు కల్పితమైన యొక సూక్ష్మోపాధి. కాన ఇయ్యదికూడ స్థూలదేహములాగున అనాత్మ పదార్థమే యైనను ఇది (అంతఃకరణము). ఆ పరమాత్మ కతిసమీపములోనున్న స్వచ్ఛ స్వరూపమగుటచే ఆ పరమాత్మ ప్రకాశమును తనలో ప్రతిబింబింపజేసికొని ఆ ప్రతిబింబప్రకాశమును, తన అవిద్యాకామకర్మల వాసనలను ఒక్కటిగ జేర్చుకొని ప్రతి జీవోపాధియందు తను నిత్యుడిలాగున వ్యవహరించు చుండును. ఈయనయే కల్పితుడు, ఆభాసుడు.

ఈ యాభాసుడు స్థూలశరీరమును ఉపాధిగా జేసికొని తనకర్మ విశేషములచే జన్మపరంపరలబొందుచు ఈ సంసారచక్రమున తిరుగుచున్నాడు. కాని ఈయనగూడ నిత్యుడుకాడు, నశించువాడు. ఐనను స్వకర్మవాసనా బలము ఇష్టానిష్టములను, రాగద్వేషాదులను సంపాదించి కామక్రోధాదులచే సుఖ దుఃఖములను పొందుచు మోక్షప్రాప్తి పర్యంతము ఉపాధిపరంపరలను గ్రహించుచుండును. ఇట్టి వివిధోపాధుల గ్రహించుటయే జన్మములు. ఈయన యే జన కాలములో ఆ జన్మవాసనోచితమైన కర్తృత్వభోక్తృత్వము

లను గ్రహించుచు ఆయాజన్మాంతమునందే తనదనుకొనుచున్న స్వశరీరాది సర్వమును వదలి వెళ్లుచుండును. ఇట్టి స్థితినె శాస్త్రము "మాతాపితృసహస్రాణి జన్మోర్జన్మని జన్మని" "జీవునకు అనేక జన్మలయందు అనేకులు తల్లిదండ్రులగుచున్నారు" అని చెప్పుచున్నది. ఏ జన కాజన్మలోనే నా దేహము, నా భార్య, నా పిల్లలు, నా ఆస్తి అని తాత్కాలికముగ అ మానముజెంది సంపాదించి విడిచిపెట్టి పోవుచున్నాడు. ఇట్టి యీ సూక్ష్మశరీరికి నిత్యత్వము గాని, నిత్యసుఖముగాని, ఎట్లు చెప్పనగును? కనుకనే ఈ దేహాదులను అనిత్యములుగ తెలుసుకొనవలెను. సత్యమైన పదార్థము అద్వితీయాఖండ సర్వాధిష్ఠాన స్వప్రకాశ నిత్య నిర్వికార పరిపూర్ణశుద్ధ చైతన్యమే అనిన్నీ, దీనికి కర్తృత్వ భోక్తృత్వాదులు లేవనిన్నీ నిశ్చయముతో తెలిసికొనవలెను. ఇట్లు తెలిసిన, దానియొక్క స్వానుభవమును పొందవలెను. ఇదియే నిత్య నిరతిశయానందసుఖము. దీనిని పొందుటయే మోక్షమగుచున్నది. లోగడ ఉదాహరించిన ప్రకారము ఈ అహం ప్రతీతిలో చిత్ జడములు రెండునుగలవు. ఈ రెండును కలసియే నేనను (అహం అను) ఒక్కపదార్థముగ అందరికి స్ఫురించుచున్నది. ఇట్టిస్థితినే—

"ద్వాసుపర్ణాసయుజాసఖాయౌ సమానంవృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽ చాకశీతి"

అను శ్రుతి చెప్పుచున్నదని కొందరి య ప్రాయము.

ఇట్లు రెండునుజేరి ఒక్కటిగా స్ఫురించు "అహం" పదార్థములో శాస్త్రానుభవములతో భాగత్యాగలక్షణచే జడమును వదలి సత్యమును గ్రహించవలెను. దీనికి వివరణము చాల యున్నది. ముందు గ్రంథములో నిరూపింపబడును. ఐనను జిజ్ఞాసువులకు లోగడ ఉదాహరించిన పూర్వాచార్యుల ప్రకరణ గ్రంథములను చూచిన అధికోపయోగముగ నుండును.

"ఇదం" అనగా ఈ ప్రపంచ సర్వదృశ్యము. "మాయామాత్ర మిదం సర్వం" (ఈ కనిపించు జగత్తంతయు మాయయె) "సర్వం ఖల్విదంబ్రహ్మ"

(వాస్తవముగ ఈ జగత్తంతయు బ్రహ్మయే) అని శ్రుతివచనములు. ఈ స్వశరీరాది సర్వప్రపంచము మాయ యనియు, దీనినంతను బ్రహ్మగా తెలిసికొమ్మనియు చెప్పుచున్నవి. మాయ యనగా "యా—మా—సా—మాయా" ఏది లేనిదో అది మాయ యని చెప్పబడుచున్నది.

శ్లో॥ భ్రాంతిమాత్రమిదం విద్వన్ విశ్వంబ్రహ్మణి కల్పితమ్ ।

అని శంకర భగవద్వచనము.

శ్లో॥ అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యం భ్రమోదితమ్ ।
జగత్సర్వ మితిజ్ఞేయం పండితై స్తత్త్వదర్శిః ॥

అనగా ఈ సర్వప్రపంచము భ్రాంతిచే కనుపించునది స్వప్నసమానము. లేని వస్తువువంటిదని తత్త్వజ్ఞులు తెలిసికొనవలెను.

శ్లో॥ అహం సర్వమిదంవిశ్వం పరమాత్మాహమచ్యుతః ।
అహంకారా ధా యాసా కల్ప్యతే నతువాస్తవీ ॥

అనగా ఈ ప్రపంచమంతయు పరమాత్మనైన నేనె. నాకు నాశములేదు. నాకు 'అహం' అను అభిధానము కల్పితమేగాని వాస్తవము కాదు.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।

అనగా దృష్టిగోచరముకాని నా స్వరూపముచే ఈ ప్రపంచమంతయు వ్యాప్తమై యున్నది. పైన ఉదాహరించిన గీతావచనము, ఇతర వచనములును పూర్వోక్తశ్రుతుల అర్థమునే అనువదించుచున్నవి.

అహం పదార్థములో నున్నట్లే 'ఇదం' అను బాహ్య ప్రపంచములో గూడ సజ్జడాంశములు రెండును గలవు. ఈ కల్పిత దేహ ప్రపంచాదులలో అబాధితముగ భాసించు సదంశము సర్వత్ర ఒక్కటిగ నున్నది. ఇదియె బ్రహ్మ యని చెప్పబడుచున్నది. మాయా శబలితమైన యీ బ్రహ్మ పదార్థమే

ప్రపంచ రూపముతో భాసించుచున్నది. (రజ్జుసర్పవత్). ఇచ్చట "యః స్థాణుః సపురుషః" స్థాణువుకాదు, పురుషుడు అని బాధాయాంసామానాధికరణ్యముచే తెలిసికొనునట్లు మిథ్యాపదార్థమును బాధించి అబాధితమైన సత్యమును గ్రహించవలెను.

శ్రుతిమాత "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తికించన" అని తెలుపుచున్నది. కాని యీ జ్ఞానము మనలకు అద్వైతసిద్ధివల్లగాని కలుగదు. ఈ యద్వైతజ్ఞానము జగని ధ్యాత్వ నిశ్చయజ్ఞానమువల్లగాని కలుగదు. అందుకుగాను సర్వదృశ్యవివేచనమును శ్రుతియుక్త్యనుభవములతో జేయవలెను. శ్రుతిమాత—బ్రహ్మ ఒక్కటే సత్యము, తదితరమంతయు నసత్యమని స్పష్టముగ తెలుపుచున్నది. కాని అనుభవములో మాత్రము అందరికిని అట్లు కనుబడుటలేదు. ఐనను "శతమాతృ సమాశ్రుతిః" అను నిశ్చయముతో మన అనుభవమునుగూడ ఈ క్రిందివిధమున వివేచనముజేసిన ఈ వాక్యముల యర్థము మనకే స్పష్టపడగలదు. ముముక్షువు అయిన జిజ్ఞాసువునకు తాను ఇచ్ఛయించు పరమలాభప్రాప్తికి గుర్వీశ్వరానుగ్రహముతోశ్రుత్యుక్త్యనుభవయుక్తముగ యీ దిగువ యంశములను బాగుగ విచారించి నిశ్చయించుకొనుట యావశ్యకము. అహమ్, నేను యనునది యెట్టిది, ఇది ఎవరు, లోకమునందు సర్వులు అనగా ప్రతి ఒక్కరున్ను అహమ్, అహమ్, నేను, నేను, అని ఒకే శబ్దమును అందరును వాడుకొనుచున్నారు. దీనికి కారణమేమైయుండును. ఈ అహమ్, అను పదార్థమేగదా ? నేను అని అందరకును స్ఫురించుచున్నది. ప్రతివారికిని నేను అనుదానియందే అధికప్రీతి గలుగుచున్నది. ఎందులకిట్లగుచున్నది. నా సత్యస్వరూపమెట్టిది ; నాకున్నూ ఈ ప్రపంచమునకున్నూ సంబంధమెట్టిది. ఈ సంసారసుఖదుఃఖము లెట్లెందుకు గలుగుచున్నవి. ఇట్లు గలుగుచున్న సుఖము, నిలబడుటలేదే—కొద్ది కాలమే యుండి సుఖస్యానంతరము దుఃఖము, దుఃఖస్యానంతరము కించిత్ సుఖము గలుగుచున్నదిగాని యీ సుఖము నిత్యముగా నిలబడుటలేదు. ప్రతివారికిని యీ అహమ్ అను నేను యనునది తన మనస్స్వరూపముగాను,

ఇదమ్ అనునదంతయు దృశ్యస్వరూపముగాను అనగా ప్రపంచరూపముగను స్ఫురించుచున్నది. ప్రతివారికిని యీ తన మనస్సు, దృశ్యము, గాక మరేమియు కనుబడుటలేదు. నాకున్నూ యీ దృశ్యమునకున్నూగల సంబంధ మెట్టిది. ఇప్పుడు నాకు గలుగుచున్న సంసార దుఃఖానుభవమంతయు వాస్తవమా? అవాస్తవమా? వాస్తవమైనయెడలపోదుగదా? శాస్త్రము యీ సంసారము కల్పితము, పోవునదియని తెలుపుచున్నది. కాన యిప్పుడు నాకు గలుగుచున్న దృశ్యానుభవములన్నియు అవాస్తవమైనవిగా యుండ వలయును. కాని అవాస్తవమైనచో యీ దృశ్యానుభవములు అందరిచేతను సత్యమైనవానివలె అనుభవింపబడుచున్నవి. ఇట్టిదియే అందరియనుభవము. వీరందరును సర్వదా కోరునది సుఖముగాని దుఃఖము నెవ్వరుకోరుట లేదు. అయినను సుఖానుభవము వెంటనే దుఃఖము గలుగుచున్నది. ఇట్లు గలుగు చున్న సుఖము మనోనిష్ఠమా? లేక విషయనిష్టముగా నున్నదా? అనగా యీ సుఖము వాస్తవముగ యనుభవింపబడు వస్తుయందు వున్నదా? లేక అనుభవించెడు నా మనస్సునం దున్నదా? ఈ సుఖము సత్యముగా అనుభ వింపబడు దృశ్యపదార్థమందు యున్నయెడల యట్టి సుఖము మార్పుజెందక యుండవలెను. కాని యనుభవమునందు యెట్టి వస్తువునందును నిత్యసుఖము కనుబడుటలేదు. కాని యున్నది—వస్తు సముదాయ సంపుటియైన దృశ్య మున్నూ, నాయొక్క మనస్సున్నూ తప్ప తదితరమేమియు లేదు. ఇందు వస్తుసముదాయము దృశ్యకోటిలోనిది. కాన యీ సుఖము నా మనోనిష్ఠమై నదిగానే యుండవలెను. ఈ మనస్సు నన్ను విడచి యుండనికాలములో గూడ యీ సుఖము నిలచియుండుటలేదు. అట్లుగాక యీ నా మనసు సదా చర్వితచర్వణవస్త్వనుభవములతో సుఖస్యానంతరము దుఃఖమును, దుఃఖ స్యానంతరము కించిత్ సుఖమును గలుగచేయుచున్నదిగాని కేవల సుఖరూప ముగ నిత్యమై యుండుటలేదు. ఈ నా మనసు దుఃఖమిశ్రితముగాని కేవల సుఖమును నన్ననుభవింపజేయుటలేదు. దీనికి కారణము నేను పొరబడుట (భ్రాంతియుతుడనగుట) గా గనుబడుచున్నది. ఇట్టి భ్రాంతిని నివర్తించు

కొనుట యెట్లు? శాస్త్రము దుఃఖమిశ్రితముగాని కేవల సుఖస్వరూపమున్న దనియు, యట్టిది నా స్వరూపమేననియు తెలుపుచున్నది. కాన ముముక్షువైన వాడు యట్టి నిత , నిరతిశయమైన తన స్వస్వరూపమును, మనోవివేకముచే యత్నించి సాధింతునను నిశ్చయముతో పైన నిరూపించిన సంశయాంశ ములనన్నిటిని ప్రత్యక్ష్యనుభవమున నిశ్చయించి నిస్సంశయముగ తెలుసుకొనుట యావశ్యకము.

---

# జగత్స్వరూప నిరూపణ

ధీకల్పితమైన స్వప్నమునకు నిద్రయెట్లా ్రయమో, అట్లే యీ సర్వ దృశ్యమునకున్ను అజ్ఞానమాశ్రయముగ కనబడుచున్నది. స్వప్నజాగ్రద్ద శలకు స్వకాలసత త్వము సమానము. ఇది అందరి అనుభవములోనున్నదే. ఆయా అవస్థానంతరమందు రెండును కనబడుటలేదు. జాగ్రద్దశ స్వప్నమున కెట్లు ప్రతియోగియో, అట్లె జ్ఞానదశ యీ సర్వదృశ్యము అనగా జాగ్రత్స్వ ప్నములకు ప్రతియోగియని యెరుగవలెను. ఈ స్వప్నానుభవము ప్రతి వారికిన్ని అహం పదార్థములో అనగా - తనయందు మాత్రమే కలుగు చున్నది. బాహ్యమున కనబడుటలేదు. ఐనను యీ ప్రపంచములో తనచే బాహ్యమందు చూడబడు పదార్థములందుగూడ ఈయనుభవము కలుగు చున్నది. ఎట్లనగా - ఈ కాలములో అందరకున్ను శబ్దచలనచిత్ర దర్శన ములు అనుభవములో నున్నవె. సర్వజనులున్ను ఈ ప్రదర్శనముల జూచి యానందము నొందుచున్నారు. కాని దీని వాస్తవమును విచారించిన యెడల ఆ ప్రదర్శనశాలలో నెదుటనున్న సుమారు దశపద చతురస్రమగు నిర లశ్వే తాంబరము తప్ప ఆటనాడువారుగాని మాటలాడువారుగాని లేరనుమాట పసి పిల్లలకు గూడ తెలిసిన విషయమే. ఈశ్వేతపటము కదలుటగాని, ఆడుట గాని, మాటలాడుటగాని ఏమియుజేయక నిశ్చలముగ నొక్కచోటనే

యుండును. ఎన్ని దృశ్యములు కనబడినను ఆశ్వేతాంబర నిర్మలమునందే కనబడుచున్నవిగాని దానిని విడచి కనబడుటకు శక్యముకాదు ఎందు చేతననగా-ఆ నిశ్చల నిర్మలపటమే అధిష్ఠానము. కనబడునదంతయు అధ్యస్తముగాన దానిని విడచి కనబడవు, ఈ నిర్మల శ్వేతపటమే సాక్షిస్థానీయము. దీనినే పంచదశికారులు నాటకదీప ప్రకరణమందు ఇట్లు నిరూపించిరి:

శ్లో॥ స్వస్థాన సంస్థితోదీపః సర్వతోభాసయేద్యథా।
స్థిరస్థాయీ తథాసాక్షీ బహిరన్తః ప్రకాశయేత్ ॥

దీపము ఉన్నచోటనేయుండి అన్నిచోట్లను ప్రకాశము నిచ్చునట్లు స్థిరముగా నుండు సాక్షి లోపలను బయటను ప్రకాశింపజేయును.

ఆ కాలమునందున్నవి నాటకశాలలె గనుక శాలలోని దీపమునే సాక్ష్యుపమానముగ నిరూపించిరి. కాని ఇప్పుడు దీపస్థానీయము నిర్మలశ్వేతాంబరముగా తెలిసికొనవలెను. ఈ విషయములు అందరికిన్నీ తెలిసినవే. ఐనను ధనవ్యయ ప్రయాసలతో ఇట్టి తాత్కాలిక అనిత్యానందమును బహుజనులు కోరి పొందుచున్నారు. ఇదియే అజ్ఞానమువల్ల కలుగుచున్న తాత్కాలిక విషయానందము. అచటనున్న సత్యవస్తువేమన, శ్వేత నిర్మల చతురస్రాకార పటము, దాని యందెట్టి వికారములునులేవు. ఐనను పగలుకూడ అజ్ఞానస్థానీయమైన చీకటిని సంపాదించి ఆశ్వేతపటమునందు వికారములను కలుగజేసి క్లేశములకోర్చి తాత్కాలిక సుఖమును సంపాదించుచున్నారు. నిర్మలమైన యీ శ్వేతపటమే ప్రత్యగాత్మ స్థానీయము, దీనిమీద చీకటియున్నగాని బొమ్మలు కనబడుటలేదు. ఈ చిత్ర ప్రదర్శనములు బాహ్యమునుండి రిఫ్లెక్టర్ యంత్రముద్వారా అనగా - అంతఃకరణ ద్వారా ఆశ్వేతపటమునందు పడునట్లు చేసి యానందించుచున్నాము. ఈ చలన చిత్రములలో కనబడు సమస్త పదార్థములు వ్యవహారయోగ్యమైనవి కావుగద! ఆభాసమాత్రములె గనుక వీనివలన గలుగు సుఖముగూడ ఆభాసమనక తప్పదు. ఇట్లే యీ సర్వశరీరములలో నున్న సత్యవస్తువైన ప్రత్యగాత్మ స్వరూపమందు అజ్ఞానమను

చీకటిని మనము భ్రాంతిచే కల్పించి దానియందు విషయములను, చలన చిత్రములను సంస్కార వాసనాబలముచే కలుగ జేసికొని సుఖదుఃఖాదులను పొందుచున్నాము. ఇదియంతయు చీకటియున్నప్పుడే సంభవించునుగాని, ప్రకాశస్థితి (జ్ఞానదశ)లో సంభవించుటకు వీలులేదు. ఇంకను ఈ కనబడు చలన చిత్రములయొక్క అపరిమిత దృశ్యమంతయు, అనగా – ఆకాశ సముద్ర భూమండలాదులు అధిష్ఠానమైన యీ యొక్క నిరల శ్వేత పటమునందె కలుగుచున్నవిగాని, తద్భిన్నముగ, అనగా – నిరలపటమును విడచి యే చలనచిత్రమున్ను కలుగుటలేదు. ఇట్లే యీ సర్వదృశ్యమున్ను ఏకాధిష్ఠానమైన ప్రత్యగాత్మయందే కలుగుచున్నదిగాని దానిని విడచిగాని, తద్భిన్నముగగాని కలుగుటలేదు. ఇట్లే తోలుబొమ్మలాటలో నాటికలోని పాత్ర లన్నియు ప్రకాశము అధిష్ఠానము గాగల శ్వేతాంబర పటమందు చూపబడుట అందరకు తెలిసినదే. ఇందు తనే యీ సర్వదృశ్యము భ్రాంతిచే భిన్న స్న ముగ నానాకారముగ భాసించుచున్నను దీనికి అధిష్ఠానమైన సత్య స్వరూపము నిర్మలశ్వేతపటమువంటి స్వప్రకాశ ఏకాధిష్ఠానము,అచలము, వికారరహితము మాత్రమే అయియున్నది. చలనాది వికారములన్నియు చిత్రమునందే కలుగు చున్నవిగాని యీ శ్వేతాంబరమును కొంచెమైనను స్పృశింపవు. ఇదిన్ని అంద రికి తెలిసిన విషయమె.

కనుక మనకు గలుగు సర్వ దుఃఖాది వికారములు దృశ్యమందున్నవి గాని, దృశ్యాధిష్ఠానమైన బ్రహ్మ యందు లేవని నిశ్చయముతో గ్రహించ వలెను. చలనచిత్ర ప్రదర్శనశాలలో నెల్లప్పుడును చిత్రములు మారుచుండును గాని, ఎప్పటికిని ఈశ్వేతాంబరపటమునకు మార్పులేదు. ఇట్లే సర్వవికార ములు నుపాధులకేగాని, వీటికి అధిష్ఠానమైన బ్రహ్మ నీవికారములంటవు. ఆయన అసంగుడు, నిర్వికారుడు అని "అసంగోహ్యాయం పురుషః" అను శ్రుతి తెలుపుచున్నది. అనగా – నిరల శ్వేతపటము బ్రహ్మస్థానీయము, దీని మీద చీకటియను అజ్ఞానము, రిఫ్లెక్టర్ అను ఆభాసుడు నున్నప్పుడే ఈ చిత్ర వికారములు, సుఖదుఃఖములు కనబడును గాని, ఈ చీకటివంటి యజ్ఞానమును

తజించిన యెడల ఈ సర్వదృశ్యము సత్యస్వరూపమైన ప్రత్యగాత్మగా సదా గోచరించుచుండును. ఇట్లే చలనచిత్రశాలయందు దీపప్రకాశమువలన వ్యవహారసత్యమైన శ్వేతాంబర పటము మాత్రము కనబడుచుండును. ఈ దృష్టాన్తము వలన నీ దృశ్యమిథ్యాత్వమును గ్రహించి సత్యమును గ్రహించుటే జ్ఞానము.

ఇచట మరియొక విషయమును గ్రహించవలెను. ఈ చలన చిత్ర ప్రదర్శనమునందు ప్రేక్షకులలోనున్న పసిబాలుడు ఆ తెరమీద కనబడు విధ్వంసములు, యుద్ధాదులు, అగ్నిజ్వాలలు మొదలగువానిని చూచి భయపడును. అప్పుడు దగ్గరనున్న తల్లి నాయనా! అవి నిజమైనవికావు, భయపడవద్దు, అక్కడనున్నది శ్వేతాంబర పటముగాని వేరేమియు లేదని చెప్పి యోదార్చును. చెప్పినది తల్లి కావున పసిబాలుడు నమ్మి భయపడక శాంత చిత్తుడై వానిని చూచును. తరువాత ఆనందమును గూడ పొందును. ఇట్లే మనకు దృశ్యమంతయున్ను అజ్ఞానముచేత భయహేతువుగనున్నదిగాని, యీ కల్పిత దృశ్యస్వరూపముయొక్క అయథార్థతను గుర్తించి దాని అధిష్ఠాన సత్యస్వరూపజ్ఞానము కలిగిన నీ భయమెంత మాత్రమునుండదు. నిత్యసుఖము గోచరించును. ఆనందము లభించును. దీనినే శ్రుతి—"ఆనన్దం బ్రహ్మణోవిద్వాన్ న భేతికుతశ్చన" అనగా - ఆనందరూపమైన బ్రహ్మ తానని తెలిసికొన్న పురుషునకు దేనివల్లనుంచియు భయము కలుగదని చెప్పుచున్నది. అనగా - భయకారణములేదు గనుక భయముండుటకు వీలులేదు. "ద్వితీయాద్వై భయంభవతి" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి వాక్యములు తెలుపుచున్నవి. కనుక జ్ఞానకాలములో ఈ జగత్తు భాసించదు. భాసించినను దానివల్ల జ్ఞాని, అజ్ఞానిలాగున దుఃఖక్లేశములను పొందడు, స్వప్నదృశ్యవత్, దీనినే-"ఇదంవిశ్వం స్వప్నేంద్ర జాలసదృశమ్-ఈ జగత్తు స్వప్నము, ఇంద్రజాలములతో సమానమైనది" "భ్రాన్తిమాత్రమిదంవిశ్వమ్- ఈ ప్రపంచము భ్రమయే" "దీర్ఘస్వప్నమిదంవిశ్వమ్ - ఈ ప్రపంచము చాలకాలము వరకు నుండు స్వప్నము" "విశ్వం బ్రహ్మణికల్పితమ్—

ప్రపంచము బ్రహ్మయందు కల్పితము" అని పూర్వాచార్యుల వచనములు చాటుచున్నవి.

ఈ వచనములనుబట్టియూ సర్వదృశ్యము (జగత్తు) బ్రహ్మయందు కల్పితమైనదిగాని, వేరుకాదు అని తెలియుచున్నందున ఈ సర్వదృశ్యము, అనగా ప్రపంచము దీని స్వభావ స్వరూపములను గురించి విచారించి యిది యీ విధముగ నెట్లు భాసించుచున్నదో విచారింతము.

మనలకు చిత్తవిభ్రమముచేత, అనగా అనాద్యవిద్య చేత ఆకాశము నందుతోచు నగరము (అనగా చిత్రవర్ణములు)తో నాకాశమున కెట్టి సంబంధము లేనియటుల, ఈ సర్వదృశ్యము బ్రహ్మయందు ఆయనతో నెట్టి సంబంధమునూ లేకనే తోచుచున్నది. ఇది భ్రాంతి. ఇట్టి భ్రాంతినే—

శ్లో॥ నామరూపాదయోయత్ర కల్పితాశ్చిత్త విభ్రమాత్।
వ్యోమ్నివనగరం యత్తద్బ్రహ్మ తత్త్వ మసిధ్రువమ్॥

అని శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. ఇట్లు ఈ అధిష్ఠానమైన బ్రహ్మయు, అధ్యస్తమైన సర్వదృశ్యమును మనలకు ఐదు అంశములుగ నీజగత్తు భాసించుచున్నది. ఎట్లన—

శ్లో॥ అస్తి భాతిప్రియం రూపం నామచే త్యంశపంచకమ్।
ఆద్యత్రయం బ్రహ్మ రూపం జగద్రూపం తతోద్వయమ్॥

అను వచనము చొప్పున ప్రతిదిన్నీ వస్తువుకలదు—కలదనుతెలివి—దానియందు ప్రీతి—వస్తువు పేరు—వస్తువు రూపము అను ఐదంశములతో ఈ ప్రపంచము భాసించుచున్నది. ఇందు లోగడ మనము విపులముగా వివేచనజేసి నామరూపములు కల్పితములని నిశ్చయించియుంటిమి. ఈ నామరూపములు రెండును దృశ కల్పిత పదార్థములు. శేషించిన అస్తి-భాతి-ప్రియత్వములను మూడంశములును పరబ్రహ్మ లక్షణములు. ఇట్టి బ్రహ్మ జగత్తంతయు పరిపూర్ణుడై—ప్రకాశరూపముతో—కదలికలేక వృక్షములాగున నున్నాడని శ్రుతి—

"యస్మాత్పరం నా పరమ_స్తి కించిద్యస్మాన్నాణీయో నజ్యాయోఽ_స్తికశ్చిత్।
వృక్ష ఇవ_స్తబ్ధోదివి తిష్ఠత్యేక_స్తే నేదం పూర్ణం పురుషేణ సర్వమ్॥

అని చెప్పుచున్నది. కాన జిజ్ఞాసువు అధ్యాసకాలములో కల్పితములగు రెండంశములను త్యజించి, వా_స్తవికములగు మూడంశములను గ్రహించి అనుసంధానము చేయవలసియున్నది. ఇట్టి అనుసంధానమున క్రింది యుదాహరణము లుపకరించును——

రజ్జువునందు సర్పభ్రాంతిచే కలుగుచున్న సర్పనామము, సర్పాకారము రెండును కల్పితములుగదా ! ఈ రెండంశములు కలదియే సర్వదృశ్యము. దీనిని కల్పితమను జ్ఞానముతో త్యజించి, శేషించిన మూడు లక్షణములను, అనగా అ_స్తి-భాతి-ప్రియత్వములుగల తన స్వరూపము నొక సంవిత్ స్ఫటిక మహాశిలలాగున తలచి, శిలా శబ్దరూపముచే అచలత్వమును అ_స్తి యనియు, మహా సంవిత్ శబ్దరూపముచే పరిపూర్ణత్వమును అట్టిదగుటచే ప్రీతియును, స్ఫటిక శబ్దరూపముచే నిరల ప్రకాశమును అందుచే భాతి యనియు అనుసంధించుచు, తన స్వరూపమిట్టిదనియు, తను అధిష్ఠానమనియు, తనయందే నామరూపాత్మకమైన ఈ దృశ్యము కల్పితమై అధ్య_స్తముగా నున్నదనియు గ్రహణముచే సిద్ధాన్త దార్ఢ్యమును అనుసంధాన సౌలభ్యము పొందనగుచున్నది.

మానవున కెట్లుచూచిననూ అనగా శ్రుతి పరమతాత్పర్యమునుబట్టిగాని, దృశ్యానుభవములను బట్టిగాని, నిత్యసుఖము అద్వైత సిద్ధాంతజ్ఞానమువల్ల గాని కలుగదు అద్వితీయ బ్రహ్మ తత్త్వమును నెరుంగని వారందరునూ భ్రాంతులేయగుదురు అట్టి అవివేకులకు ఐహికాముష్మిక సుఖములందుగూడ సుఖములేదు జన రాహిత్యమన్ననో మొదటేలేదని గట్టిగా చెప్పవచ్చును. ద్వైతజ్ఞానుడు విద్యాధనాదులచేత ఉత్తమాధమ భావములుగల సుఖము పొందుచున్న విషయము వ్యావహారిక వా_స్తవమైననూ దానివల్ల చి_త్తవిశ్రాంతి రూపమైన ప్రయోజనము కనబడుటలేదు ఏలననగా స్వప్నదృశ్యములో

రాజ్యముచేసిననూ, క్షమె త్తిననూ మేలుకొనినతరువాత కలగాంచినవానికి రాజ్యముచేసితినన్న సుఖముగాని, భిక్షమెత్తితిన్న దుఃఖముగాని కలుగుట లేదు. ఇది సర్వజనానుభవమే. కనుక మిథ్యయగుచున్నట్టి యిట్టి వుత్తమాధమ దృశ్యభావములను విద్వాంసులు పాటింపరు.

మోక్షేచ్ఛకలవారు వివిధ శాస్త్రవాదములతో వృధాకాలక్షేపములు చేయక సర్వదా ఉపనిషద్గమ్యమగు అద్వి య బ్రహ్మతత్త్వమును బాగుగ విచారణచేసి అట్టిది తన అపరోక్షస్వరూపముగా తెలిసికొని యనుభవింప నభ్యసించుటయే ముముక్షు కర్తవ్యము. జీవేశ్వరుల స్వరూపమును దృశ్య మిథ్యాత్వమును విచారించుట బ్రహ్మస్వరూపానుభవమున గాని మరి వేరు ప్రయోజనము లేదు. అద్వైతసిద్ధాంతము వేశ్వరుల నిరుపురనే నిత్యులని యెప్పుదు బ్రహ్మత్వమొక్కటియే పరమార్థ స్వరూపమగును ఇట్టి అద్వి యత్వమును తెలుపుటకే వేశ్వర వాదము, జీవానుభవము ననుసరించి బోధకుగాను శాస్త్రము కల్పన చేసినదియే కాని వాస్తవమున ద్వి య పదార్థమనునది లే. లేదు. అవిద్యయ గా తనకాశ్రయమైన వస్తువును మోహింపజేయునది ఇట్టి మాయచేత మా వుడు భ్రా తియుతుడై పు కర్తృత్వాది ధర్మములునూ, ఈశ్వరునకు సర్వజ్ఞత్వాది విభూతులను పారమార్థికమని తలంచుచున్నాడు. ఇది విపరీత జ్ఞానము, భ్రాంతి ఇట్టి భ్రాంతి నివర్తించుటకే శాస్త్రము తత్త్వం పదార్థవివేచనచేసి శిష్యునకు ఏకత్వము బోధించుచున్నది. కాని వ, ఈశ్వర, దృశ్యములు మూడును సత్యముగా నున్నవను నిరూపణ సిద్ధాంతములయందు శాస్త్రమునకు పరమ తాత్పర్యము కాదు. ఇట్టి విపరీతమైన ద్వైతజ్ఞానము నివర్తించుటకొరకే శాస్త్రము శిష్య బోధకుగాను అనేకవిధముల బోధించుచున్నది.

సర్వత్రా శక్తి, శక్తిమత్తులయందు బేధమును అబేధమునుగూడ కన బడుచున్నవి. కాన వాటిని భేదమనుటకునూ, బేధము కాదనుటకునూగూడ వీలులేదు. కాని అట్టిది అవినాసంబంధమై ఒక్కటిగానే తెలియబడుచున్నది.

ఇదియే అనిర్వచనీయము. ఆ పరమాత్మయందు మాయగూడ నిర్లేపయుండి జగత్కల్పన చూపుచున్నదేకాని విచారించి తెలిసికున్నయెడల నీమాయ లేనిదే యగుచున్నది. ఇదియంతయూ లోగడ మాయాస్వరూప నిరూపణ యందు విపులముగా వివరించియుంటిమి. జగత్కారణమును నిరూపింపదలచి యోగనిష్ఠులగు ఋషులు పరమాత్మయందు శక్తిరూపముననున్నట్టి మాయను తెలిసికొని యిట్టి మాయచేతనే యీ జీవభ్రాంతియూ, యీ సర్వదృశ్యమూ కల్పితమైనదని తెల్పుచున్నారు.

జగద్వివర్తకారణమైన పరబ్రహ్మము నిత్యము, సర్వవ్యాపకము, పరిపూర్ణము అద్వితీయమని వేదము చెప్పుచున్నది. ఆపరబ్రహ్మ మెప్పుడెప్పుడు మాయాశక్తిచేత జగద్రూపమై కనబడునో నప్పుడెల్ల నది మాయాశక్తియే నని ఎరుగవలయును.

శ్లో॥ ఫల పత్ర లతా పుష్ప శాఖా విటప మూలవాన్।
నను బీజే యథావృక్షః తథేదం బ్రహ్మణిస్థితమ్॥

ఫల కుసుమాదులతో కూడిన మహావృక్షము విత్తునందు తెలియబడక యున్నట్లు యీ జగత్తు బ్రహ్మమునం దున్నదని తెలిసికొనమని శ్రీరామ చంద్రునికి వశిష్ఠులువారు తెలుపుచున్నారు. వుల అనాదివాసనా సంస్కారము లనుబట్టి భూమియందు నాటబడిన విత్తనములు ఆ యా దేశ కాలములననుస రించి మొక్కలు మొలుచునట్లు యీ మాయా ప్రభావముచే ఆ బ్రహ్మము నందే మొదట మనస్సు, బంధమోక్షములు, ప్రపంచకల్పన క్రమక్రమముగా దృఢమగుచున్నవి కాని యీ కనబడు ప్రపంచస్థితి వాస్తవముకాదు దీనిని నిరూపించుటకు యోగవాశిష్ఠమున శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠులువారు యొక కథను చెప్పిరి. అది యేదన :

ఓ రామా ! రాజకుమారులను దాది ఎత్తుకొని యొక యింపైనకథను జెప్పెను. శ్లాఘనీయములగు బాహువులుగల యో బాలుడా ! ఒక యూరిలో

ముగ్గురు రాజకుమారులున్నారు. ఆ ముగ్గురిలో నిద్దఱు పుట్టనేలేదు. ఒకడైతే గర్భములోనే లేడు. అట్టి ముగ్గురు అసలేలేని పట్టణములో మహాధర్మాత్ములై యున్నారు. సద్భావములుగలిగిన యా రాజపుత్రులు తమ శూన్యపట్టణము నుండి బయలుదేఱిపోవుచు, ఆకాశమునందు పండ్లతోగూడిన వృక్షములను చూచిరి. ఆ రాజపుత్రులు ముగ్గురును ఆ భవిష్యన్నగరమునందు వేటాడుచు సుఖముగా నుండిరి. ఇట్లు దాదిచే చెప్పబడిన కథ నా పసిబాలుడు ఆలోచన లేని బుద్ధిగలవాడగుటచే నిజమని నమె ను. ఓ శ్రీరామా ! ఈ సంసార రచన కల్లనిజముల యాలోచనలేనివారికి, బాలునికి పై కథయందువలె నమ కమును కలిగించును.

ప్రపంచమనునది అజ్ఞాన పరిణామము. త్రాటియందుతోచు సర్పమును బోలె దీనికి నజ్ఞానముకంటె న్నమగు స్వరూపములేదు. భ్రాంతియున్నంత కాలమే రజ్జువుయందు సర్పము కానవచ్చును. కావున నజ్ఞానము స్వయముగ సర్పరూపమున బరిణమించి యా సర్పమును తాటిపై నెట్లారోపించుచున్నదో అట్లే యిచటగూడ మాయ యను నజ్ఞానము (మూలప్రకృతి) ప్రపంచ రూప మున బరిణమించి దానిని పరమేశ్వరుని యందారోపించుచున్నది. అనగా మానవుడు అజ్ఞానమువలన త్రాటిని సర్పముగ దలంచినట్లే అవిద్యాప్రతిబింబ మగు వుడు యీ కల్పిత బేధ న్నభిన్నమగు జగత్స్వరూపమును అబేధ అద్వి యమైన బ్రహ్మయందు ప్రపంచముగ చూచుచున్నాడు. ఇదియే జగత్స్వరూపము. పపంచ మనాదియగుటచే ననేక కల్పములయందు సమానమగు క్రమములు జీవులచే ననుభవింపబడియుండెను. కావున నా సంస్కారముల ననుసరించి ప్రపంచభ్రాంతియూ, నేకక్రమమున కలుగు చున్నది—ఇదంతయునూ భ్రాంతియందు క్రమముగాని మరి వేరేమియూ కాదు.

ఇట్లు మాయాకార్యమై కనబడుచున్న ప్రపంచమును జ్ఞానరూపమున నివర్తింపజేయుటకు ఘటాదుల కుపాదానమైన మృత్తువ సత్యము. ఘటము

సత్యముకాదని గ్రహించుటయే కార్యనివృత్తికి (ప్రపంచ మిథ్యాత్వజ్ఞానము నకు) సాధనము. ఇదియే నివృత్తి యనంబడును. అయిననూ పూర్తిగా వస్తుప్రతీతి లేకపోవుట యనునది, నిరుపాధిక భ్రమ స్థలముననేగాని యిట్టి ఘటాది సోపాధిక స్థలములలో నక్కరలేదు. అద్వయ ఆనంద స్వరూపుడైన బ్రహ్మముకంటె నితరమంతయూ మిథ్యయను రూఢి జ్ఞానానుభవములు గలిగిన అదియే పరమపురుషార్థమగు మోక్షమని అద్వైతసిద్ధాంతము. సారాంశమేమనగా ఈ సర్వదృశ్య ద్వైతమిథ్యాత్వజ్ఞానమునూ నామరూపాదుల యనృతత్వమునూ ఎంతెంత దృఢముగా గ్రహింపబడునో అంతంతగా బ్రహ్మసాక్షాత్కారసుఖము కలుగుచుండును. ఇదియే ఈ జగత్స్వరూప మిథ్యాత్వ జ్ఞానమువల్ల కలుగు పరమలాభము. ఇదియే వముక్తి సుఖము.

---

# జగదుత్పత్తి వినాశ నిరూపణ

అద్వైతసిద్ధాన్తము పరమార్థతః ప్రపంచోత్పత్తి నాశముల నొప్పదు. ఏలయన — శ్రుతివచనము ఏకమేవాద్వితీయంబ్రహ్మ" 'నేహనానాస్తికించన" అని అన్వయవ్యతిరేకములతో ఉన్నది. బ్రహ యొక్కటియేగాని, తదితర మంతయు నెంతమాత్రము లేనిదేయని చెప్పుచున్నది. ఉన్నపదార్థము ఒక్కటియే యైనప్పుడు ఆయొక్క దానికినీ నాశమొప్పినయెడల సర్వశూన్యమై అద్వైతసిద్ధాన్తము శూన్యవాదమగును. ఉత్పత్తిని ఒప్పుదమన్నను యజ్జన్యం తన్నశ్యం "జాతస మరణంధ్రువమ్" అనగా ఉత్పన్నమైన ప్రతి పదార్థమునకున్ను నాశము తప్పదని వచనములు తెలుపుచున్నవి కాని— బ్రహ కు ఇట్టి యుత్పత్తి దేనినుంచిని చెప్పియుండలేదు. "జాతస్య మరణం ధ్రువం" అనువచనమును బట్టి ఉత్పత్తిగల యేవస్తువైనను నాశము కావలసియున్నది. ఇట్టి అసత్పదార్థములోనుండి సత్పదార్థమైన బ్రహ కలుగట యసంభవముగద! దీనినే శ్రుతి "కథమసతస్సజ్జాయేత" అని నిషేధించుచున్నది. ఐనను తక్కినపదార్థములవలె ఈ బ్రహ కూడ అసత్తై

యనకూడదా యని శంకించిన, అట్లనుటకు వీలులేదు. శ్రుతి— 'సదేవసో మ్యేద మగ్ర ఆసీత్" తసా ద్వాఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" సోఽకా మయత" తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్" ఈ సృష్టికి మొదటనున్నది సత్పదార్థమొక్కటియే యనియు, అట్టి సత్పదార్థమైన బ్రహ్మ (ఆత్మ) నుండే ఆకాశాదులుద్భవించినవనియు, ఆయన స్వసంకల్పముచే వానిని సృజించి తానందులో ప్రవేశించెననియు చెప్పు శ్రుతివాక్యములను బట్టి అసత్తున కిట్టి సామర్థ్యముండదని నిశ్చయించవలసియున్నది. కనుక సృష్టికి పూర్వము సత్పదార్థమొక్కటియె యున్నదనిన్నీ, అట్టి పదార్థమె యీసర్వదృశ్య మునకు అధిష్ఠానమైనదనిన్నీ నిశ్చయించవలెను. ఇట్లు నిశ్చయించిన యడల ఒక్కటియైన ఆసత్తు బ్రహ్మ లోనుండి సర్వదృశ్యములెట్లువచ్చినవని తెలిసికొనవలసియున్నది. ఈ సర్వదృశ్యము అనగా— ప్రపంచము కార్యము. ఏకార్యమైనను కారణములేనిదె కలుగుటకు వీలులేదు. కనుకనే అద్వైతసిద్ధాన్త మందు కార్యకారణములుక ల్పితములుగాని భిన్నా భిన్నములుగాలేవు. కనుక నిట్లు కనబడుదృశ్యమయథార్థము. అయథార్థమనగా కల్పితమేగద ! ఇట్టి కల్పితము లెన్నియున్నను వ్యవహారమునకు గ్రాహ్యములే ఇట్టి కల్పిత దృశ్యచిత్ర నానాత్వములకు కారణము భ్రాంతి, అనాది అవిద్యయేయనిన్నీ, అట్టిది అజ్ఞానమువల్లనే కలుగుచున్నదనిన్నీ వీటికిగల కార్యకారణ నిరూపణమంతయు జ్ఞాననిరూపణ ప్రకరణమందు విమర్శజేసి సర్వదా ఒక్కటియైన ఆ బ్రహ్మ, అను సద్వస్తువునందె (వివర్తకారణముచే) ఈ సర్వదృశ్యము భ్రాంతి కల్పితమై ప్రకాశించుచున్నదని నిశ్చయించి యున్నాము. భ్రాంతి యనగా అసత జ్ఞానము సత్యమైన ఒకపదార్థమును, దాని సత్యస్వరూపము దెలియక మరియొకటియని గ్రహించుట. ఇట్టియనుభవమునకు దృష్టాన్తము ముఖ్యముగ రజ్జువునందు సర్పభ్రాంతి కలుగుచుండుటె. ఇట్లే సత్యాధిష్ఠా నమైన బ్రహ్మయందు మనకు సర్వదృశ్యము భ్రాంతిచే కనబడుచున్నది. గాని సత్యముగాలేదు. కాని— కనబడుచున్నదె? అందరివల్లను అనుభవింప బడుచున్నదే? అనుశంక కలుగును. ందుచేతనే ఈ సర్వదృశ్యములు

శ్లో అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యం భ్రమోదితమ్।
జగత్సర్వమితిజ్ఞేయం పండితై స్తత్త్వదర్శి ః॥

అను వచనముచే మిధ్యాభూతమని శంకరభగవత్పాదులు తెలుపుచు,

శ్లో భ్రాంతిమాత్ర మిదం విద్వన్ ! విశ్వంబ్రహ్మణికల్పితమ్।
విద్ధి యస్మా త్స్వయంవిశ్వం బ్రహ్మజ్ఞానేనబాధ్యతే॥

అనియూచెప్పుచున్నారు. కనుక ఈ దృశ్యజగమంతయు భ్రాంతి కల్పితమని నిశ్చితముగదః ఇట్లు భ్రాంతికల్పితములగు పదార్థములకు నాశనములేదు. నివృత్తిమాత్రమే. నిరధిష్ఠానభ్రాంతికలుగుటకు వీలులేదు. భ్రాంతియున్నచోట నెల్ల అధిష్ఠానాధ్యస్తములు రెండును నుండవలయును. ఇందు సదా అధిష్ఠానము సత్యముగాను, అధ్యస్తము అసత్యముగానుండును. కనుక భ్రాంతిస్థలములనెల్లను అధిష్ఠానసత్యజ్ఞానము అధ స్తమును భాధించును. ఇట్లు భాధింపబడు అధ్యస్తదృశ్యమునే మిధ్యయందురు. ఇట్టి చోట్ల అధిష్ఠానసత్య పదార్థజ్ఞానముచే అధ్యస్థమైన అసత్యమదృశ్యమై అధిష్ఠానము శేషించును.

ఈ యవిద్యాభ్రాంతి నాశములు సత్యవస్తు జ్ఞానమువల్లనే కలుగును గాని, అన్యధా కలుగుటకు వీలులేదు. దీనినే—

శ్లో॥ నహిస్నానశతేనాపి రజ్జుసర్ప భ్రమోనృణామ్।
భయకంప పదో యాతి వినావస్తు విమర్శనమ్॥

అనగా—వస్తువిమర్శనము జేయనిదే శతసంఖ్యాకములగు స్నానములను చేసి నను రజ్జుసర్పభ్రాంతి తొలగదు.

శ్లో॥ నిత్యాజ్ఞానస్య విచ్ఛిత్తిః సమ్యక్ జ్ఞానేన సిధ్యతి।
సమ్యక్జ్ఞానం పదార్థస్య విచారేణైవ నాన్యథా॥

అనగా—మిథ్యాజ్ఞాననాశము సమ్యక్జ్ఞానమువలన గలుగును. సమ్యక్జ్ఞానము పదార్థ విమర్శ చేతనే కలుగునుగాని, వేరువిధముగ గలుగదు అని శంకర

భగవత్పాదులు తెలుపుచున్నారు. ఇట్టి వాస్తవావాస్తవికములు జ్ఞానాజ్ఞానముల యొక్క భేదముచే కలుగుచున్నవిగాని సత్యవస్తువునం దెట్టిమార్పును కలుగుట లేదు. మనము భ్రాంతిచే సర్పమునుజూచి భయకంపాదుల నొంది నప్పుడు అచటనున్నది వాస్తవముగ రజ్జువేగద! దీప ప్రకాశముచే నిది సర్పముకాదని తెలిసికొన్నకాలములోగూడ ఆ రజ్జువు ఈషన్మాత్రైనను మార్పు జెందక యథాస్వరూపముగ నచటనేయుండును. ఇట్లే యీ సర్వదృశ్యము లను మనముచూచి దుఃఖముల ననుభవించునపుడును, అధిష్ఠాన సమ్యక్ జ్ఞానము సిద్ధించినపుడునూ ఈ బ్రహ్మ నిత్యమై, నిర్వికారమై స్వప్రకాశ సర్వాధిష్ఠాన పరిపూర్ణమై యుండును. ఇట్లుండు ఈ బ్రహ్మ స్వరూపమునే మనము తెలిసికొని సాక్షాత్కారము నొందవలసియున్నది. అనగా—అదియే తన స్వస్వరూపముగ స్వానుభవమును సంపాదించుకొనవలసి యున్నది. ఇట్టి జ్ఞానసంపాదనానుభవమును పొందుటకే బ్రహ్మవిద్యానుసంధానమును నిరంతరము ఫలపర్యన్తము అభ్యసించుటావశ్యకము. ఇట్లు చేయుటకు ఈ జ్ఞానమనునది కేవల ఇంద్రియముల సిద్ధించదు. కాని సాధుసంగమ సచ్ఛాస్త్ర ములవల్ల సద్వృత్తిని సంపాదించిన సాధించవచ్చును. ఇట్టి జ్ఞానమునకు సద్వృత్తియే శరణ్యముగాని వేరులేదు. అందుకుగాను సర్వవిధములచేతను ఈ సద్వృత్తిని అనగా చిత్తసంస్కారమును సంపాదించిన నీ జ్ఞానమును పొందుట సుసాధ్యము. ఇది చిరకాలము సత్కర్మానుష్ఠానముజేసి గుర్వీశ్వ రానుగ్రహములను సంపాదించినగాని కలుగదు. ఈ వృత్తినిగురించియే—

శ్లో॥ బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రపేక్షతే।
స్వయం స్ఫురణరూపత్వాన్నాభాస ఉపపద్యతె॥

అజ్ఞాన నాశముకొరకు బ్రహ్మయందు వృత్తివ్యాప్తి యుండవలెను. బ్రహ్మ స్ఫురణ రూపమగుటచే అచట చైతన్యప్రతిఫల మక్కరలేదు.

శ్లో॥ విచారాజ్జాయతె బోధోఽనిచ్ఛయా న్న నివర్తతే।
నోత్పత్తి మాత్రాత్సంసారే దహత్యఖిల సత్యతామ్॥

అనగా—విచారమువలన గలుగు బోధము ఇచ్ఛలేకపోవుట మాత్రముచే, తన పనిని చేయుట మానదు. తన పుట్టుకమాత్రముచేతనే సంసారమందలి సత్యత్వబుద్ధిని దహించును అని విద్యారణ్యముని చెప్పుచున్నారు. ఇదం అను నీ ప్రపంచమంతకును సత్యాధిష్ఠానమును గ్రహించినటుల అహం-నేను అను ప్రత్యయములోగూడ సత్యాధిష్ఠానమును గ్రహించవలసి యున్నది. ఇందుకు విచారణ ఆవశ్యకము.

---

## బ్రహ్మ విద్యావశ్యకతా నిరూపణ

సర్వజీవులు కోరునది సుఖమైనను భ్రాంతిజ్ఞానముచే పర్యవసానముగ సుఖమునకు బదులు దుఃఖమునే పొందుచున్నారు. సార్వభౌముడుదగ్గిరనుండి సామాన్యునివరకు ఎంత విషయఐశ్వర్య సంపన్నుడైననూ వారివారి అనుభవమును అడిగినయెడల దుఃఖరహితముగా నేను సర్వదా కేవలసుఖమునే అనుభవించుచున్నానని ఒక్క తత్త్వజ్ఞానితప్ప మరియెవ్వడును చెప్పజాలడు. ఒకవేళ ఎవరైన చెప్పినను అది అవివేకము, అజ్ఞానముతో చెప్పినదేగాని వాస్తవము కాజాలదు. ఏలనన ఇంద్రియప్రత్యక్ష మెన్నటికిని పరమార్థ సత్యము కానేరదు. ఇంద్రియములచే గ్రహింపబడునది వ్యావహారికమేగాని పారమార్థికము కాదు. అద్వైతసిద్ధాంతమందు సత్యమొక్కటియేగాని రెండు లేవు. ఉండుటకు వీలులేదు. గాన యీ వ్యవహార పరమార్థ సత్యజ్ఞానము లలో ఒక్కటియే పరమార్థ సత్యమగునుగాని రెండు కావు. కాన మన శాస్త్ర జ్ఞానమునుబట్టి అనుభవముచేతనూ లోగడ విపులముగా చేసిన విచారణను బట్టియు ఒక్కటియే పరమార్థ సత మైనదనిన్నీ వ్యవహారము కల్పితమూ ఆభాసమనిన్నీ నిశ్చయించితిమిగాన ఇపుడు సర్వులకు సహజముగా కలుగు చున్న జ్ఞానము వ్యవహారాన్తఃపాతియైన జ్ఞానములోనిది అగుచున్నది. మనలకు స్థూలబుద్ధ్యా కలుగుచున్న జ్ఞానము అసత్యమైనదని గ్రహించి వాస్తవజ్ఞాన

మును గ్రహించుటకు సూక్ష్మ బుద్ధి అనగా సంస్కృతమనస్సును ఆశ్రయించి యాథార్థ్యమును తెలుసుకొనవలయును.

లోకములోగూడ పదార్థ యథార్థజ్ఞానమువల్ల సుఖము, అయథార్థ జ్ఞానమువల్ల దుఃఖము కలుగుచున్న విషయము అందరికిన్నీ అనుభవసిద్ధమే. కాన పదార్థయాథార్థ్యజ్ఞానమును సుఖముకొరకు సంపాదించవలసియున్నది. ఆ సుఖము ఎట్టిది? మనము సుఖమనుకొన్నదియే సుఖమా? లేక వాస్తవ సుఖస్వరూపము మరొకటి యున్నదా? యని విమరించవలయును. శ్రుతి "ఆనందో బ్రహ్మ" అని ఆ సుఖము బ్రహ్మయే అని చెప్పుచున్నది. అట్టి బ్రహ్మను తెలిసికొన్నవాడు ఆ సుఖస్వరూపుడైన బ్రహ్మయె యగుననియు "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అని శ్రుతిమాత చెప్పుచున్నది.

ప్రతి వుడును తెలిసియో, తెలియకయో కోరుచున్న వాస్తవ సుఖ స్వరూపమును మనలకు ఒక్క శ్రుతిమాతతప్ప మరి యెవ్వరున్నూ చెప్పుట లేదు. ఆ శ్రుతినే అనుసరించి మనము పూర్ణఫలమును పొందవలయునుగాని వేరుమార్గము లేదు. దీనినే "నాన్యఃపన్థావిద్యతేఽయనాయ" అని శ్రుతి వాక్యము ధ్రువపరచుచున్నది. ఇంకనూ "సర్వంఖల్విదం బ్రహ్మ" అని వాక్యము దృశ్యమంతయూ బ్రహ్మయె అనిచెప్పి "తత్త్వమసి" అను వాక్యముచే ఆ బ్రహ్మ నీవే అనియు తెలుపుచున్నది. ఇదియెట్లుయని మనము గ్రహించవలయును. ఇట్లు చెప్పునటువంటి శ్రుతి "మాతృాణాంశతం శ్రుతిః" అని చెప్పిన ప్రకారముగ నూరుతల్లులపెట్టుగాన అది అసత్యమును చెప్పదు గదా! కాన దానినే ఆశ్రయించి వులు తమ తరణోపాయమును గ్రహించ వలయును. ఈ వాక్యముల ప్రామాణ్యములను మనము ఈ క్రిందివిధమున గ్రహించవలయును. ఎట్లనగా, మన అనుభవములో ఒకడైన సూర్యుడు వివిధప్రదేశములలో పరిమిత పరిమాణమైన బింబాకారముతో గ్రహింపబడు చున్ననూ ఆ పరిమితాకారమునువదలి ఆయన ఒక్కడే అనిన్నీ మనము నివసించు భూగోళముకన్ననూ అనేకరెట్లు పెద్దవాడనిన్నీ ఎట్లు గ్రహించు

చున్నామో, అదేవిధముగ శ్రుతి 'సర్వంఖల్విదం బ్రహ్మ' అని చెప్పునప్పుడు ఈ నామరూపాత్మకమైన సర్వదృశ్యమును విడచి తదధిష్ఠానమైన బ్రహ్మ రూపమును సత్యజ్ఞానానన్త లక్షణములతో గ్రహించవలయును. అట్లే 'తత్త్వమసి' అనుశ్రుతి చెప్పినప్పుడు, మనలకు అహం అను ప్రతీతిలో గోచరించు పరిమితాకార విశిష్టదేహమును, జడస్వరూపమైన అంతఃకరణమును, నేనుకానని త్యజించి చెప్పినట్లు ఆ బ్రహ్మయే నేను అని అనుకొనవలయును. అప్పుడు తన వాస్తవస్వరూపము తన అనుభవమునకు వచ్చును. కాలత్రయ అవస్థాత్రయాబాధితముగ గోచరించు అహం నేను ఆ పదార్థమేనని నిశ్చయించుకొనవలెను. ఇట్టి నిశ్చయమును పొందినపిదప తన సత స్వరూప మెట్టిదై యుండవలయునని విచారించుకొని తన స్వరూపము దృశ్య రహితాఖండ పరిపూర్ణ శుద్ధచైతన్యమే కాని వేరుకాదు అని బోధ పడగలదు. ఆ వాస్తవస్వరూపమును అవిద్యాబలముచే గ్రహించలేక దుఃఖమిశ్రితమైన విషయసుఖమునే సుఖమని అనుభవించుచున్నాము. కాని ఇది సుఖముకాక సుఖాభాసము. ఆ స్వరూపసుఖము ఎటువంటిదని అడుగగా అట్టిసుఖము నిరుపమానమై అవాఙ్మనస గోచరమగుటచే చెప్పుటకు వీలు లేదు అని తెలిసికొనవలయును. దీనినే "యతోవాచో నివర్తనే అప్రాప్య మనసాసహ" అనుశ్రుతి తెలుపుచున్నది. పసిబాలుడొకడు, పంచదార మధురముగా యుండునని చెప్పగా పి అనగా ఏమిటి ? అని అడుగును. అప్పుడు తల్లి కొంచెము చక్కెరను వాని నోటిలోవేసి చూపును. బాలుడు అది చాల మధురముగా యున్నదని మాధుర్యస్వరూపమును అనుభవముచే గ్రహించి ఎట్లుతెలుసుకొనునో అట్లే యీ బ్రహ్మ సుఖముగూడ అనుభవముచేతనే తెలియబడునుగాని అన్యథాకాదు. కాన ఇట్టి స్వరూపసుఖమును స్వానుభవమువల్లనే గ్రహించవలయును. ఈ గ్రహణమునకు సతత బ్రహ్మానుసంధానము ఫల పర్యంత మావశ్యకము.

అద్వైతసిద్ధాంతమందు ఈ జగత్తంతయు మాయాకార్యము. వ స్త్వము కల్పితము. జీవుడు జగదంతఃపా . ఇట్టి మాయాకార్య, కల్పితము

లచే పొందబడుచున్న వద్భుశా నుభవములు సత్యమెట్లగును. మాయా కార్యములన్నియు మాయయే కావలయునుగదా అనగా అవాస్తవములు. దీనిని గురించి మాయాస్వరూప ప్రకరణమందు విపులముగా నిరూపించియుంటిమి. గ్రంథవిస్తర మగునను తలంపుచే యిచట తిరిగి విమరి-ంచుటలేదు. సత్య మన్ననూ, యథార్థమన్నను, వాస్తవమన్నను ఒక్కటియే. ప్రపంచ వ వహా రములందుగూడ మానవులు యథార్థజ్ఞానము అనగా వాస్తవజ్ఞానము ( rue or Correct now e e వల్ల లాభమును సుఖమును అసత అవాస్తవ జ్ఞానము a se or incorrect now e e) వల్ల నష్టమును దుఃఖ మును పొందుచున్నవిషయ మందరకును తెలిసినదే. ఈ బ్రహ్మవిద యనగా తత్త్వవిద్య. తత్త్వవిద్యయనగా వాస్తవమునుతెలుపు జ్ఞానము. కనుక మానవుని వితవాస్తవతను తెలియగోరు పతి వునకున్నూ ఈ బ్రహ విద్య యనునది యావశ కమగుచున్నది.

ఇదిగాకను ఈ బ్రహ విద్యను రహస్యవిద యనియు, గుహ విద్య యనియుగూడ గీతాచార్యుడైన భగవంతుడు "రహస్యం హే తదుత్తమం". ఈ విద్య రహస మైనదియూ ఉత్తమమైనదనిన్నీ యింకనూ "ఇతిగుహ్య తమం శాస్త్ర మిదముక్తంమయాఽనఘ", ఈరీతిగా రహస్యమగు శాస్త్ర మంతయు నీకు తెలిపితినని అర్జునునకు తెలిపియున్నారు. రహస్యమనగా అందరకును తెలియబడునది కాదనియూ, అతిభ దముగా రక్షించుకోవలసిన దనియు అర్థమగుచున్నది. ఇంకనూ ఒక వస్తువుయొక్కగాని, స్థితియొక్క గాని మర ము విప్పిచెప్పునదిగూడ రహస్యమనబడును. సహజముగా ఈ వత్వము, జన ములు, వాటి యనుభవములు అనాది అవిద్యచే జీవులకు కలుగుచూ భ్రమింపజేయబడుచున్నవి. ఇట్టి అవిద్యను వుడు పోగొట్టుకొాన నంతవరకు ఈ దృశ సంసారదుఃములను చర్వితచర్వణముగా పొందు చుండును. ఈ అనాది అవిద్యా భ్రాంతిజ్ఞానము, ఒక్కవిద్యచేగాని నశించదు. మానవులకు కలుగుచున్న యీ అనాది అవిద్యాభ్రాంతిస్థితిని తొలగించు విద్య యొక్కటియే. ఇది జనసామాన్యమునకు తెలియదు గనుక రహస్యము.

ఇట్టి విద్యయే బ్రహ్మవిద్య. ఇది సర్వజీవులవల్లనూ పొందశక్యముగాక నిత్యానిత్య వివేకముగలిగిన వారివల్లనే పొందబడును. ఇట్టి నిత్యానిత్య వివేకము కలుగు అవకాశము ఒక్క మానవజన్మకుతప్ప తదితర జన్మలందు యీ వివేకశక్తి కలుగదు. ఇట్టి మానవజన్మములలోగూడ ఎంతో పూర్వపుణ్య సుకృతమున్నవారికిగాని యీ నిత్యానిత్య వివేకమనునది కలుగదు ఇట్టి జ్ఞానము కలిగినగాని వాడు బ్రహ్మవిద్యాసాధనమునకైననూ అర్హుడు కాడు ఈ బ్రహ్మవిద్య యిట్టి మహిమకలది గనుకనే దీనిని రహస్య విద్యయనిన్నీ వునికి పరమ శ్రేయోదాయకమైనదనిన్నీ భగవంతుడు తెలుపుచున్నాడు. అయిననూ జనసామాన్యులకునూ కొంతమంది మేధావంతులకునూ కూడ యిట్టివిద్య యావశ్యకమా యని తోచును. కాని యీ విద్యావశ్యకత వివేక జిజ్ఞాసువులకు మాత్రమే తోచును. అట్టి వివేకజిజ్ఞాస యెట్లుండవలెననిన:—

నేను ఎవడను ? ఎట్టివాడను ? నాకు యీజన్మ వచ్చుటకు కారణమేమి? విధిగా నేనెందుకు మరణించవలెయును ? నేను మరణించిన పిదప ఏమగుదును ? నేను విధిగా ఉచ్ఛ, నీచ, అతినీచ, యుపాధులను పొందుచూ జన్మ పరంపరలు పొందుచుండుట ఎంతకాలము ? నాజీవితకాలమైననూ అల్పముగా నుండి పరాధీనముగానే యున్నదే. నేననుకొనుచున్న నా స్వేచ్ఛా స్వతంత్రతలు ఆభాసగానే యున్నవి కాని వాస్తవముగా కనబడుటలేదు. ఏలనన నేను తలంచినంతకాలము జీవించియుండుటకాని, నావి యనుకొను విత్త, కళత్ర, పుత్ర, క్షేత్రాదులను నా జీవితకాల మంతమగునంతవరకైననూ నిలుపుకొనలేకపోవుచు, ఎట్లున్నవట్లు విడిచి విధిగా ఎప్పుడో నేననుకొను నా దేహమునుగూడ విడిచిపెట్టి పోవుచున్నానే, దీనికి కారణమేమి ? జీవిత కాలములోగూడ చాలాకాలము సుఖముకానిదానిని సుఖముగ భావించుతూ సుఖమను రూపమున దుఃఖమునే పొందుచుంటినే. ఎందులకిట్లు కలుగు చున్నది ? దీనికి అనుభవయుదాహరణములు చాలాగలవు. క్రియలు స్వరూపముచేత క్లేశదుఃఖకరములైననూ మనోభావనచే వాటిని సుఖమని తలచి అనుభవించుచున్నాడు. ఇట్టి సుఖము భ్రాంతిగాక వాస్తవమెట్లగును ?

ఇట్టిదానిని నివృత్తిచేసుకుని నేను ఎప్పటికినీ (శాశ్వతముగా) సుఖముగా యుండు మార్గము యున్నదా? అట్టిది ఏది? అని వివేకము గలిగినప్పుడు ఈ బ్రహ్మ విద్య యనునది అట్టి ముముక్షువునకు ఆవశ్యకమై పెన్నిధివంటిదిగ నుండును నిత్యసుఖము కావలెననికోరు వునకు ఈ బ్రహ్మ విద్యతప్ప వేరు శరణ ములేదు. ఈ బ్రహ్మ జ్ఞానము దాని మహిమచే వునికి ఇహమందు వారివారి ప్రారబ్ధకర ననుసరించి అనుభవసుఖానుభూతిని, పరమందు స్వస్వరూప సుఖప్రాప్తిని కలుగజేయును కాన ఈ విద జీవునికి ఇహపరసుఖసాధన మగుచున్నది. కనుకనే దీనిని గీతాచార్యుడైన భగవంతుడు బ్రహ్మ విద్యయనియు, మోక్షోపాయమనియుగూడ చెప్పుచున్నారు.

---

# బ్రహ్మావిద్యా శ్రేష్ఠ్యము

సర్వశాస్త్రములకన్నను ఈ బ్రహ్మ విద నుతెలుపు వేదాన్తశాస్త్రము పరమోత్కృష్టమైనదని విద్వాంసులందరిచేతను గ్రహింపబడుచున్నది. రాజ విద్యాధ్యాయములో నిరూపించిన రాజవిద్య యిదియే. ఇది అనుభవశాస్త్రము. అనగా ఇతర శాస్త్రములవలె ఇది అంగముగాక అంగి యగుచున్నది. తక్కిన షట్ఛాస్త్రాదులును ఈ శాస్త్రరాజమునకు అంగములే యగుచున్నవి. ఏలనన ఈ శాస్త్రప్రయోజన పర్యవసానము స్వానుభవములోనే ముఖ్యముగాని తదితరప్రయోజనములు గౌణానుషంగికములు. ఈ వేదాన్త, తత్త్వశాస్త్రములను రెంటిని ఈషద్భిన్నములనుగా గ్రహించినను వేదాన్తశాస్త్రప్రయోజనము తత్త్వనిరూపణమేగాన తత్త్వ, వేదాన్తశాస్త్రములు ఐక్యము (అవినాభావము) గలవి యగుచున్నవి. తత్త్వమనగా యథార్థము. అట్టి యథార్థ జ్ఞాన స్వరూపము ప్రతివారికిన్నీ స్వస్వరూపమె యగుచున్నది. ఇట్టివారి స్వస్వరూపమును భ్రాంతియుతుడైన వుడు మరచి సంసారదుఃఖమును పొందుచున్నాడు. గనుక తద్దుఃఖ నివారణోపాయమును శాస్త్రము కారుణ్యముతో బోధించు

చున్నది. ఈ బోధయే బ్రహ్మ విద్య—దీనిని పొందుటకే బ్రహ్మ విద్యాను సంధానమును నిరంతరము అవగతిపర్యంతము ఆచరించవలసియున్నదని పూర్వాచార్యుల వచనములు, శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. ఇది యంతయు స్వసుఖప్రాప్తికేగాని, అన్యులకు కాదు. ఈ స్వసుఖము అనా ను భవమువల్ల కలుగునదికాదు. స్వానుభవముచేతనే కలుగునుగాని, కేవల శాస్త్ర పాండిత్యముచే పొందదగినది కాదని—

శ్లో॥ అనుభూతింవినామూఢో వృథాబ్రహ్మణి మోదతే।
ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్॥

అనగా అనుభవములేని మూర్ఖుడు జలాదులయందు ప్రతిబింబించిన కొమ్మల చివరనున్న ఫలములనుండి ఆస్వాదసుఖము ననుభవించినట్లు మిథ్యయైన బ్రహ్మాస్వాదముచే తృప్తిపడుచున్నాడని శంకరభవత్పాదులు చెప్పుచున్నారు. గాన ఈ మనన, నిరూపణ, బ్రహ్మ విద్యానుసంధానములు కేవల పఠనముల వల్ల పూర్తి ప్రయోజనకారులు కాజాలవు. లౌకికవిషయ గ్రహణములాగున ఈ బ్రహ్మ విద్య ఇంద్రియగ్రాహ్యము కాదు. షష్ఠేన్ద్రియమైన సంస్కృత మనస్సుచే నొకసారి గ్రహించిననూ ఆ గ్రహణము ఫలకారి కాజాలదు. ఎందుచేతననగా ఈ యవిద్య అనాదిగా మనలను ఆశ్రయించుకొనియున్నది. దీనిని వెళ్ళగొట్టుట బహుకష్టసాధ్యము. దీర్ఘప్రబలరోగము అల్పచికిత్స అల్పకాలములకు పోనటుల ఈ జగత్సత్యత్వ భ్రాంతి అనాద్యవిద్యా కల్పితము గనుక ఈ యవిద సంతతానుసంధాన నిరంతరదీక్ష సతతాభ్యాసములతోగాని నివర్తించదు. ఈ దృశ్య భ్రాంతి కుపాదానమైన అజ్ఞానము నశించినగాని జగత్సత్యత్వభ్రాంతి నివర్తించదు. ఈ యజ్ఞానము నశించుటకు అధిష్ఠాన సాక్షాత్కారమే కావలయును. ఎట్లన సర్పభ్రాంతికి అధిష్ఠానమైన రజ్జువును చూచినప్పుడుగదా మనలకు సర్పభ్రాంతి భయములు నశించును. అట్లే మనలకు ఈ దృశ్యదుఃఖాదులు తగ్గవలెనన్న ఈ దృశ్యాధిష్ఠానమైన బ్రహ్మ దర్శనమే కావలయును.

శ్లో॥ భ్రాంతిమాత్రమిదంవిద్వన్ విశ్వం బ్రహ్మణికల్పితమ్।
విద్ధియసాత్త్వయంవిశ్వం బ్రహ్మజ్ఞానేన బాధ తే॥

శ్లో॥ శుక్తిజ్ఞానాద్యథారూప్యం రజ్జుజ్ఞానాద ఘోరగః।
తథాధిష్ఠాన తద్బ్రహ్మజ్ఞానాద్విశ్వం నదృశ తే॥

శ్లో॥ అధిష్ఠానాదర్శనత ఏవ విశ్వభ్రమస్సతామ్।
తసిన్దృష్టే జగద్భ్రాన్తి ర్దూరాదేవ పలాయతే॥

అని శంకరభగవత్పాదుల వచనములు పైన నిరూపించిన యర్థమునే చెప్పు చున్నవి. ఒక్క బ్రహ్మజ్ఞానమువల్లతప్ప దృశ్యమును బాధించుటకు వీలు కాదు. ఎందుకనగా—సర్పభ్రాంతికి రజ్జువు అధిష్ఠానమైనట్లు మనలకు ఈ దృశ భ్రాంతి బ్రహ్మాధిష్ఠానమునందే కలుగుచున్నది. అధిష్ఠానజ్ఞానము కలిగినగాని అధ్యస్తము నివర్తింపదు అనగా మిథ్యాత్వబుద్ధి కలుగదు. ఇట్టి మిథ్యాత్వబుద్ధి రజ్జుసర్ప దృష్టాన్తమందు తేలికగా కలుగవచ్చును. ఎందుచేతననగా—అచట సర్పమున కధిష్ఠానమైన రజ్జువు ఇంద్రియగ్రాహ్యమైన వ్యావహారిక సత్తము గాన దానిని ప్రకాశాదుల సహాయముచే సులభముగా గ్రహించవచ్చును. ఈ దృశాధిష్ఠానమైన బ్రహ్మ ఇంద్రియగ్రహణాతీతమై పారమార్థిక సత్యవస్తువుగనుక దానిని తేలికగా గ్రహించలేక ఈ దృశ్యభ్రాంతి అనాది జన్మపరంపరగా వచ్చుచున్నది. ఈ దృశాధిష్ఠానమైన బ్రహ్మ అమూర్తముగూడనై యున్నది. గాన దీనిని దీర్ఘకాలాభ్యాసమువల్ల గలిగిన అనుభవమువల్లనే గ్రహించవచ్చునుగాని కేవల శబ్దశ్రవణ పఠనములచే వ్యావహారిక సాధనములతో పొందజాలము. అందుచేతనే ఈ బ్రహ్మవిద్యాసంప్రదాయమందు అనుభవాభ్యాసములకు ప్రాధాన్యము నిచ్చియున్నారు. ఈ బ్రహ్మవస్తువు స్వానుభవమువల్లనే పొందవలసినదిగాని, అన్యథాసిద్ధించునది కాదు. ఇట్టి బ్రహ్మవస్తువు లక్షణరహితమైనను మన అనుభవములోనున్న తల్లక్షణములను ఉపలక్షణములుగా గ్రహించి 'ఏకమేవాద్వితీయం' అను మొదలగు వాక్యముల నాశ్రయించి అన్వయవ్యతిరేక వివేచనానుసంధానము

లను చేయవలయును. ఇందుకొరకే జగద్గురువులైన శంకరభగవత్పాదులు ఇట్టి అనుసంధాన వాక్యములను, శబ్దములను వివేకచూడామణి, ఉపదేశ సాహస్రి మొదలగు గ్రంథములయందు తెలుపుచున్నారు. శ్రీ వసిష్ఠ భగవానులుగూడ యోగవాసిష్ఠమునందు అనుసంధాన సౌలభ్యమునకు వివిధో పాయములను బోధించియున్నారు. ఇట్లు తెలుపబడిన అనుసంధానములను కేవల శబ్దోచ్చారణమాత్రముల గాక, అట్టి ప్రతిశబ్దముయొక్క అర్థస్వరూప ములను బాగుగా మనోగోచరముచేసుకొని అన్యచిత్తులుగాక అట్టి సద్వస్తువైన బ్రహ్మ తానేనని ప్రీతినిశ్చయములతో ప్రతిబంధ నివృత్తిపర్యంతము అనగా ఫలావగతిపర్యంతము మనన నిదిధ్యసనాదులను చేయుచుండిన తదనుభవ లాభము తప్పక కలుగును. ఇందుచేతనే ఈ బ్రహ్మవిద అనుభవవేద్య మని చెప్పుదురు

ఇంకనూ ఈ వేదాంతశాస్త్రమునుగురించి వసిష్ఠమహాముని యిట్లు తెలుపుచున్నారు:—

శ్లో॥ కి...న్న ...కబుద్దీనాం ... శాస్త్రమిదం యథా।
మ్మో...హ ...థా శాస్త్ర ... స్తి ...కించ...॥

అనగా కొంచమైననూ చిత్తసంస్కారము గలవారలకు ఈ వేదాంతశాస్త్రము మౌఢ్యమును బోగొట్టునట్లు మరియొకశాస్త్ర మేదియును చేయలేదు అనగా ఉపకరించదు అని భగవత్స్వరూపుడైన వశిష్ఠులవారే చెప్పుచున్నారుగావున— సుఖముకోరు ప్రతిమానవునకున్నూ యీ వేదాంతశాస్త్రజ్ఞానము అమృతము వంటిది నిత్య నిరతిశయ సుఖప్రాప్తికి యింతకన్న వేరు సాధనలేదు ఇది పరమ శ్రేయోదాయకము.

బ్రహ్మ విద్యా నుసంధానమునకు— వేదప్రమాణమును శిరసావహించిన అద్వైతశాస్త్రమే ఆధారము. సప్రామాణిక, సయుక్తిక, సూక్ష్మ బుద్ధితో గ్రహించిన దీనికన్న ఇహపర ప్రత సుఖసాధన సిద్ధాన్త మితరమేదియును

వివేకులకు గోచరించుటలేదు ఇది అతిగంభీర, సాహస, పరమోత్కృష్ట సిద్ధాన్తము ఇట్టి అద్వైతసిద్ధాంతము వేదమునే పరమార్థముగా తీసికొని అద్వైతమందే దాని తాత్పర్యమును ఉపక్రమోపసంహారాది షడ్విధ తాత్పర్య లింగములతో నిరూపించి ఫలదశయందు ఈవేదములనే "యత్రవేదా అవేదా భవన్తి" అని చెప్పుచు త్యజించియున్నది. వేదాపశ్యకతనుగూడా వదలివేసిన ఆస్తిక దర్శనములలో ఇదియొక్కటియేగాని రెండవదిలేదు అనగా అద్వైత మోక్షస్వరూపము ఇట్టి స్వతంత్రమైనదై పరాపేక్షారహితమైన సర్వోత్కృష్ట స్వరూపము. ఇదియే దృశ్యరహిత— సర్వాధిష్ఠాన— స్వప్రకాశ— అఖండ— పరిపూర్ణ చైతన్యస్వరూపమై యున్నది. ఇట్టిది అద్వితీయము, నిరుపమానముగాన ఇట్టి స్థితిని నిరూపించుటకు స్వానుభవముతప్ప తదితరమేమియూ లేదు—ఉండదు ఇట్టి స్వరూపము స్వస్వరూపానుభవముపల్లగాని ఇతరవిధమున ఇట్టిదియని నిరూపించుటకు ఉపయోగించే పదార్థముండుట అసంభవము. కనుకనే అట్టిస్థితి యెట్టిదనిన "యత్రవేదా అవేదాభవన్తి" అని అట్టి స్వస్వరూపమోక్షస్థితిని కలుగజేసి వేదముకూడ లేనిదే యగుచున్నది. గనుక ఈ యద్వైతసిద్ధాంత మొక్కటియే సర్వోత్కృష్ట సర్వస్వతంత్ర అద్వితీయ సిద్ధాంతమని గ్రహించక తప్పదు.

---

# ఆత్మానాత్మాధ్యాస నిరూపణ

మనకు కలిగే అధ్యాసములు అహం, ఇదం, మమేదం అని మూడు విధములుగ ప్రసిద్ధములై యున్నవి. ఇవి ఎట్లు కలుగుచున్నవని తెలిసికొన్నగాని అట్టి యధ్యాసములను నిర్మూలనము జేయుటకు సులభముగా నుండదు. గాన ముముక్షువునకు వీటి విచారము అత్యావశ్యకమై యున్నది కాని వాటి విచారము నిచట శ్రుతివాక్యముల ననుసరించి చేయుదుము.

"పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే, పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే" అని ఒక శ్రుతి. అది బ్రహ్మ పూర్ణము, ఈ సర్వదృశ్యము పూర్ణము, పూర్ణమువల్లనే యీ జగత్తు పరిపూర్ణమై యున్నది, ఈ పూర్ణము పూర్ణమునుండియే వచ్చినది, చివరకు పూర్ణమే మిగులునని చెప్పుచున్నది. "ఏకమేవాద్వితీయం" అని ఇంకొక శ్రుతి వాక్యము. అది బ్రహ్మ అద్వితీయమైనదని చెప్పుచున్నది. "అహం బ్రహ్మాస్మి" అని మరియొక వాక్యము. అది అహం అను నేను బ్రహ్మను అని చెప్పుచున్నది. కాని ఈ అహం అను ప్రతీతిలో గోచరించువస్తువు పూర్ణమై అద్వితీయమై ఉండవలయునుగాని సద్వితీయమై యుండుటకు వీలు లేదు. కాని సర్వులకు స్ఫురించుచున్న అహం నేను అని కలుగు ప్రత్యయము తనకంటె భిన్నమైన సర్వమును నిషేధించి తననుమాత్రము విషయీకరించును. ఇలా గుర్తించుట రెండవపదార్థమున్నప్పుడే దానిని నిషేధించి తనను విషయీకరించుటకు శక్యము కాని శ్రుతి మాత్రము "నేహనానాస్తి కించన" "సర్వంఖల్విదం బ్రహ్మ" "తత్త్వమసి" అనగా బ్రహ్మేతర మేదియు లేదనిన్ని, అగపడుదృశ్యమంతయు బ్రహ్మయే అనిన్నీ, ఆ బ్రహ్మ నీవే అనియు చెప్పుచున్నది. ఐనను మనలకు భిన్నత్వ ద్వితీయత్వములు స్ఫురించుచు ప్రతియొక్కడును నేను అహం అని తలచుచు భేదమును అనుభవించుచున్నాడు శ్రుతిప్రామాణ్యమునుబట్టి యీ ద్వితీయపదార్థభానము భ్రాంతియనియే చెప్పవలయునుగదా! ఇట్టి భ్రాంతి కలుగుటకు కారణమును, మనకు కలుగుచున్న అనుభవములను పరిశీలించుకొని నిశ్చయింపవలసి యున్నది. అది యెట్లనగా— శ్రుతివాక్యము అప్రమాణమగుటకు సాధ్యము లేదు గనుక మన యనుభవమును శ్రుతివాక్యానుగుణముగ అన్వయించ వలయును గాని శ్రుతి వాక్యమును అప్రమాణము చేయుటకు వీలులేదు. కనుక మనలోయున్న ప్రత్యగాత్మకే మనలోని అంతఃకరణ సాన్నిధ్యము వలన వీరిరువురకు అన్యోన్యాధ్యాసమని అనుభవమునుబట్టి కల్పించవలసి

యున్నది. ఇట్టి యధా స అనాదిగానున్నది. దానిని తొలగించి మనమే ప్రయత్నముతో ఏకత్వమును పరిపూర్ణత్వమును గ్రహించవలసి యున్నది. అహం నేను అను ప్రత్యయములో భాసించు న్నత్వ కర్తృత్వ భోక్తృత్వ ములు మనలోనున్న స్వప్రకాశ సాక్షిచైతన్యమైన ప్రత్యగాతకే అంతః కరణ సాన్నిధ్యమువల్ల కల్పితముగా కలుగుచున్నట్లు పూర్వాచార్యులు నిశ్చ యించి చెప్పుచున్నారు. కనుక అహం నేను అను ప్రత యమును కేవల సాక్షి స్వరూపముగా గ్రహించి జడమైన అంతఃకరణధర ములైన కర్తృత్వాదులు తనవికావని తెలిసికొనవలయును. అప్పుడు తను సాక్షిమాత్రుడుగా మిగులును. దీనినే——

శ్లో॥ అంతఃకరణసంబంధా దవశిష్టేచిదాత ని।

అని శంకరభగవత్పాదులు చెప్పుచున్నారు.

ఇట్లే యీ ప్రత గాత దృశ వస్తుసముదాయమువల్ల అంతఃకరణము నకు కలుగు ఉపకారాపకారములను తనవిగాగ్రహించి ఇదినాది మమేదం అని తలచుచున్నాడు. కాని ఈ ఇదం మమేదములు రెండును తన స్వరూప మునే భ్రాంతిచే జగత్తుగా గ్రహించుచున్నాడు. దీనినిబట్టియే ఇదం, ఇదం, ఇది, ఇది, ఇదినేను, ఇదివెండి, ఇది త్రాడు అని సర్వవిషయములయందును తన స్వరూపమైన అధిష్ఠానమును స రించుచు దానియందు భ్రాంతిని పొందు చున్నాడు. ఇట్టి భ్రాంతిని తొలగించుకొని తన సత్యస్వరూపమును యథార్థ ముగా గ్రహించి దానిని అనుభవించుటయే ముముక్షువునకు ఆవశ్యకమై యున్నది. ఇదియే మోక్షస్వరూపము. ఐనను ఇది అనుకొన్నంత సులభ ముగా పొందబడునది కాదు. ఏలనన ఈ అనాది అవిద్యా కామకర ములు -వుని జన పరంపరలో అనువర్తించుచు వీనిని భ్రాంతియుతునిగా చేయు చున్నవి. ఒకానొక సుకృత వునిచే ఇట్టి విచారముచేయబడి స్వస్వరూపము గ్రహింపబడినదైనను ఇట్టి ఏకత్వ పరిపూర్ణత్వముల జ్ఞానమందు ప్రీతి నిశ్చ యములు కలుగుటలేదు. ఇట్టి ప్రీతినిశ్చయజ్ఞానమును బహుకాలాభా సముచే

సంపాదించినను అయ్యది పరోక్షజ్ఞానముగానే యుండునుగాని అపరోక్షము గాజాలదు ఇందుకుగాను శ్రుతియుక్తివివేచన శ్రవణమననములచే గ్రహించి తన స్వరూపమును ముముక్షువైనవాడు ఫలావగతిపర్యంతము సతతానుసంధానము చేయుచుండవలయును.

ఈగ్రంథ నామమునుబట్టి పాఠకులకు ఇట్లు ఒకేవిషయమునుగూర్చి పునఃపునః విమర్శించుటయు, విమర్శించు విషయముగూడ గ్రంథమున కప్రస్తుతమని శంకకలుగవచ్చు. కాని ముముక్షువునకు సిద్ధాన్తదార్ఢ్యముకొరకు ఈ విషయము వృత్తిగోచరమగుటకున్నూ దీని యావశ్యకత యుండును. భ్రమనివృత్తిని, సిద్ధాంతదార్ఢ్యమును, విషయగ్రహణమును పొందగోరు ముముక్షువునకు ఇట్టి విచారణావశ్యకత చాలాయుండును. ముముక్షువునకైనను ఈ యనాద్యవిద్యానివృత్తి పర్యంతము బ్రహ్మవిద్యానుసంధానము విధియై యున్నది. ఇట్టి అనుసంధానమును వల వాగ్రూపముతోగాక మనోగోచరముగా చేయుట శీఘ్రఫలప్రదము. కనుక విషయము వృత్తిగోచరమగుటకు విచారణ, సతతానుసంధానములు విధిగా కావలయునని గ్రహింతురుగాక— ఇట్టి జ్ఞానసిద్ధి చిరకాలానుసంధానముచేతగాని కలుగదని "అనేకజన్మ సంసిద్ధస్తతోయాతి పరాంగతిమ్" అని గీతావచనము తెలుపుచున్నది.

---

# సర్పాద్యధ్యాసాధిష్ఠాన నిరూపణ

ఎప్పుడునైనను భ్రాంతికల్పిత పదార్థములన్నియు యథార్థజ్ఞానమువల్లనే నివర్తించునుగాని, అన్యథాకాదు. భ్రాంతియనగా మూలాజ్ఞానము. అది చిత్తశుద్ధిని సంపాదించి శ్రుతియుక్త్యనుభవములతో జేసిన శ్రవణమనననిదిధ్యాసనములచేగాని నివృత్తముగాదు. ఇచట మనకు రజ్జువుయందుకలిగిన సర్పభ్రాంతి యెట్టిదని విచారింతము. ఈ సర్పాకారమంతయు ఒక్కటియైన రజ్జువు నందే వివిధావయవములతో తోచుచున్నది అవయవములనగా తల, పడగ, నాలుక, చారలు మొదలైనవి. ఇవియన్నియు మనమనస్సులో యున్నవిగాన

నిచట కలిగినవి. ఇన్నీ మనమనస్సులో యుండినగాని మనకు సర్పజ్ఞానము కలుగదు. సర్పము ఈవిధముగాయుండునని పూర్వవాసన మనకు యున్నం దున అట్లే కనబడుచున్నది. కాని యిది అవాస్తవజ్ఞానము—అజ్ఞానఫలము. అజ్ఞానఫలమెప్పుడును అవాస్తవికముగానే యుండును. ఐనను ఈ యజ్ఞానము అనాదిగా మనలకు జన్మపరంపరలందు వచ్చుచున్నందున ఈ అవిద్యా ప్రభా వమువల్ల సంస్కారమేర్పడి ఆ యొక్కటియైన బ్రహ్మ వస్తువును మన వాసనానుకూలగ ప్రపంచదృష్టితో అనేకవిధములుగ చూచుచున్నాముగాని వాస్తవములో ఆ బ్రహ్మేతర మేదియునులేదు పూర్వపూర్వవాసనాసంస్కా రములు ఉత్తరోత్తరవాసనా సంపర్కములకు హేతువగుచున్నవి. అధిష్ఠాన మును విడిచి అధ్యస్తముండుటకు వీలుకాదు. ఎట్లన—రజ్జువు ఎంత యున్నదో సర్పము అంతే ప్రకాశించునుగాని, ఎక్కువగాని, తక్కువగాని యుండదు ఈ సర్పాధిష్ఠానమైన రజ్జువు కొంత తెలిసి కొంత తెలియక ఉండు టకు వీలు దు. తెలిసిన అంతా తాడుగా తెలియును. లేనిచో అంతయూ సర్పముగా తెలియును. ఇట్లే బ్రహ్మయందు మనలకు అజ్ఞానమను అంధ కారము ఈ సర్వ ప్రపంచము భాసించుచున్నది. గాని విచారణ చేసిచూచిన ఇందు సత్యమునకు నిలచు పదార్థమేదియును లేదు. అధిష్ఠానముతేర అధ్యస్తము కలుగుటకు వీలులేదు. నిరధిష్ఠానమైన భ్రాంతి కలుగుటకు వీలు లేదు. సర్వత్ర భ్రాంతిలో అధిష్ఠానము సత్యముగను, అధ్యస్తము అసత్య మైనదిగను ఉండును. ఇది నియమము. శ్రుతి మనలకు "భ్రాంతిమాత్ర మిదంసర్వం అద్వైతం పరమార్థతః" అని తెలుపుచున్నది. గాన మనలకు కనిపించు ఈ సర్వదృశ్యమునకున్ను అధిష్ఠానముండవలయునుగదా ! ఇట్టి సత్యమైన సర్వాధిష్ఠానమేది ? అని మనము విచారించిన, శ్రుతి "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం" —(సఇదంసర్వం) అని శ్రుతిమాత సిద్ధాన్తముజేసి మనలకు తెలుపుచున్నది. గాన బ్రహ్మయే యీ సర్వదృశ్యమునకు అధిష్ఠాన మనుటలోగాని—ఈ సర్వదృశ్యము బ్రహ్మయందు అధ్యస్తము (వివర్తము) అనుటలోగాని ఎంతమాత్రము సందేహము లేదు. ఈ బ్రహ్మ మనకగపడుట

లేదే యని శంకింప నక్కరలేదు. లోకమందున్న వస్తువు సత మైనను ప్రతి దిన్నీ మనలకు ఎప్పుడును కనపడవలెనను నియమము లేదు. లోకములో ఎన్ని వ్యవహార సత్యవస్తువులున్నను, అవి అన్నియు మనకగపడుట లేదు. అగపడకపోవుటకు కారణములనేకములు కలవు. సాధారణముగ శక్తి ప్రయత్నలోపములని తలంతురుగాని, అట్టి లోపములను ర్చినను కనబడనివి చాలా ఉన్నవి. అట్టి వస్తువులను మనము బుద్ధిచే ఉన్నవని గ్రహించి వ్యవహారము జేయుచున్నాము. వాటి లాభమును పొందుచున్నాము. అట్లే ఈ సర్వదృశ్య, వాస్తవతనెరుంగుటకు ఈ బ్రహ్మ వస్తువునుగూడ శ్రుతిప్రామాణ్యమును సంపాదించి బుద్ధి వృత్తిచేతనే గ్రహించి అట్టి లాభమును, అనగా తనసత్య స్వరూపమును ముముక్షువైనవాడు పొందవలసి యున్నది. దానికి గాను కల్పితమైనను, మనము ఈయంతఃకరణవృత్తిసాహాయ్యమును ప్రయత్నముచే సంపాదించవలసి యున్నది లేనిచో మనలను అనాదిగా ఆశ్రయించి యున్న వాసనా సంస్కారములే సంసార దుఃఖమును కల్పించుచుండును. ఈ విషయమును గురించి వాసనా నిరూపణ ప్రకరణమందు విపులముగా విమర్శించి యుంటిమి గాన వాసనానిరూపణములో తెలిపిన విధమున సర్వ ప్రయత్నములచే అనగా తత్త్వజ్ఞానమును సంపాదించి ఈ దృశ్యమంతయు మిథ్యయని నిశ్చయముగా గ్రహించిన శేషించునది జ్ఞానమొక్కటే. ఇదియే సత్యము, అనంతమగు సద్వస్తువు, సర్వాధిష్ఠానము, బ్రహ్మ. ఇట్టి సత్యపదార్థమును తెలుసుకొని అనుభవము పొందిన మహనీయుడు బ్రహ్మ స్వరూపుడే యగునని "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి" అని శ్రుతి చెప్పుచున్నది.

---

# అధిష్ఠానాధ్యస్తములు

అధ్యస్తములు ఎప్పుడునూ అధిష్ఠానమును విడిచి వేరుగా నుండుటకు వీలు దు. ఇది నియమము. ఇందులో అధిష్ఠానమెప్పుడును సత మైన

షడ్భావవికారములను పొందుచూ అంతమగుచునే యున్నది అయిననూ అంద రకును తెలిసినదానిలో ఒక్కటి మాత్రమట్లుగాక పయిలక్షణములకు నిల బడుచు సర్వదా గోచరించుచున్నది. అది యేది యనిన అహం, నేను అని ప్రతివారిచేతను అనుభవింపబడుచున్నదియే ఎవ్వరును యీనేను అను తనను ఎరుగననికాని, తానులేననికాని, చెప్పుట లేదు. చెప్పుటకు వీలులేదు ఇది అంతయూ సయుక్తికముగ అహం వివేచనయందును సందర్భమునుబట్టి యితర నిరూపణలయందుగూడ విపులముగా విమరించి యుంటిమి కాన దానిని గుర్తెరిగి అహం, నేను అను ప్రతి ఇతరదృశ్యపదార్థములవలె గాక నేను అను తనను సర్వదా సర్వకాల సర్వావస్థలయందును నిత్యముగా జీవుడు యనుభవించుచున్నాడు. ఈనేను అను ఒక్కపదార్థమే సర్వజీవులచేతనూ భిన్న భిన్ననామములతో అనుభవింపబడుచున్నది. ఇదిలేని దేశ, కాల, వస్తు, అవస్థలు యెప్పుడును యెక్కడను వుండుటలేదు. అట్టియెడ యీ అహం నేను అను దీని స్వభావమెట్టిదియై యుండవలయును. ఈ నేను అనునది ఒక్క టియా, భిన్న భిన్నములా యను విషయమును శ్రుతి, యుక్తి, అనుభవము లతో ఒక్కటియే యని లోగడ నిశ్చయించి యుంటిమి. ఇట్టి ఒక్కటియైన నిత్యపదార్థమునే సర్వజీవులునూ నేను, నేనను బుద్ధితో పరిచ్ఛిన్న న్న న్న యుపాధులు గ్రహించి తమ అనుభవములను పొందుచున్నారు. ఇట్టి జ్ఞానాను భవములను కల్పితమనియెగదా నిశ్చయించ వలసియున్నది. ఈ కల్పితము నకు అధిష్ఠానమేదో యొకటి యుండి రవలయును గదా. "సతికుడ్యే చిత్రి కర్మాణి" అనున్యాయము చొప్పున గోడయుండినగదా చిత్రములు వ్రాయు టకు సాధ్యమగును. గోడేలేనిది వ్రాయబడు చిత్రము లుండుట యెట్లుసంభ వము. అందులో ఒక్కటియైన గోడయందు చిత్రకారుని సామర్థ్యమునుబట్టి అనేక చిత్రములనైనను వ్రాయవచ్చును గదా. ఇట్లే యీ మాయ (అనాది అవిద్య)గూడ యొకనిపుణ, చిత్రకారుని వంటిది. ఇదియే ఒక్కటియైన బ్రహ్మాధిష్ఠానమందు అనేక దృశ్యములను కల్పన చేయుచున్నది. ఇట్టి కల్పనాదృశ్యమే జీవానుభవములకు తాత్కాలికాధార మగుచున్నది. ఇదియే

అవిద్య, అజ్ఞానము. ఇది కల్పితము గనుక వుడు యిట్టి అజ్ఞానమును పోగొట్టుకొని వాస్తవముగ జగదాధిష్ఠానము తానని తెలుసుకొనినయెడల తన యందే అధ్యస్తమై యిప్పుడు తనకు భ్రాంతిచే కలుగుచున్న సాంసారిక దుఃఖములు తగ్గుచు కాలక్రమేణ తనజ్ఞానదార్ఢ్యమునుబట్టి అజ్ఞానము నశించి వాస్తవమైన తన అధిష్ఠానస్వరూప జ్ఞానము పొందును. ఈ అధిష్ఠానమే ప్రత్యగాత గాను, పరమాత గాను, సర్వాత గాను తెలియబడుచు సర్వమును తానేయగుచున్నాడు. అప్పుడు యీ దృశ్య భిన్న న్నత్వములు: వికారిత్వ ములు, మిథ్యయై అహం, నేను అను తాను అద్వి య అఖండ పరిపూర్ణుడుగ శేషించును. ఇదియే అధిష్ఠాన జ్ఞానము.

ఇదియే జీవుని వాస్తవ స్వస్వరూప జ్ఞానము. ఇట్టి జ్ఞానమే ముక్తి, మోక్షమని తెలియుచున్నది. దీనినే—

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానంద లక్షణే।
బ్రహ్మైవ సకలం విశ్వం భోక్తృభోగాది లక్షణమ్॥

ఈ జగద్భ్రాంతికి కారణమైన సచ్చిదానందలక్షణములుగల బ్రహ్మాధి ష్ఠానమును తెలుసుకొనిన యెడల కర్తృత్వాధ్యాసము నశించి అధ్యస్తమగు యీ సకల దృశ్యమును బ్రహ్మ రూపమున తానే యని తెలిసికొనును, అని శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు.

---

# సంసారాసారతా నిరూపణ

సంసార మనగా "సం, సర తిసంసారః" వాస్తవమునుండి త్రిప్పునది (మరలించునది) కావున సంసారము అని తెలియుచున్నది. మనకు కలుగు చున్న సంసారదుఃఖమంతయును దీనినిబట్టియే కలుగుచున్నది. అనగా ఈమిథ్యారూపమైన సర్వదృశ్యము వాస్తవమని తలచి సంసక్తిని పొందు

చున్నాము. ఇట్టి సంసక్తి ముఖ్యముగా అహం—మమేదం—నేను—నాది అని కలుగుచున్నది. ఇందలి అహం నేను అనుదానిని గురించి లోగడనె విపులముగా విమర్శచేసి సిద్ధాంతమును నిరూపించి యుంటిమి. ఇట్టి "అహం"ను వివెచనచేసి శ్రవణమననాదులవల్ల తన సత స్వరూపమును పొందనిశ్చయించి ప్రయత్నించువాడు ముముక్షువు. ఇట్టివారిలో బ్రహ్మ విద్యకు సన్న్యాసాశ్రమ స్వీకారము చేసినవారు ముఖ్యాధికారులైయున్నను, వారి వారి ప్రారబ్ధ కర ఫలమునుబట్టి కొందరు గృహస్థాదులుగూడ నుందురు. అట్టివారి విషయములోను, లోకసామాన్యముగను ఇట్టి సంసారబంధములలో ప్రతివారికిన్ని నేను అను తన కుటుంబసంసక్తి తన అధిక క్లేశములకు కారణముగానున్నది. గాన ఇదియంతయు వాస్తవమేనా? వాస్తవ మైనయడల ఎట్టి వాస్తవము? ఇంత క్లేశమును మనము పొందుచుండవలసినదేనా? దీని స్వరూపమేమి? అని వివేచనజేసి వాస్తవమును గహించిన యడల — దానిని బట్టి యిప్పుడు మనకు కలుగుచున్న దుఃఖక్లేశములను — వివెకముచె కొంతయైనను తగ్గించుకొనుట కవకాశము కనబడుచున్నది.

ఇట్టి అధిక సంసక్తత కలుగుటకు భ్రాంతిజ్ఞానమె ముఖ్యకారణము. బలీయము. ఇట్టి భ్రాంతిజ్ఞానమును నిరా లించుటకె శ్రీశంకరభగవత్పాదులు అధ్యాసభాష్యమందు ప్రథమముననే — "భార్యాపుత్రాదిషువికలేషు సకలేషువా అహమేవ వికలఃసకలోవేతి మన్యతే।"

"ఏవమయమనాది రనన్తో నైసర్గికోఽధ్యాసో మిథ్యాప్రత్యయరూపః కర్తృత్వభోక్తృత్వ ప్రవర్తకః సర్వలోక ప్రత్యక్షః। అస్యానర్థహేతోః ప్రహాణాయ ఆత్మైకత్వ విద్యా ప్రతిపత్తయే సర్వే వేదాన్తా ఆరభ్యన్తే"

కాన బ్రహ్మాభ్యాసియైన గృహస్థునకు చిత్తవిక్షేపమును కొంతవరకైనను తగ్గించుకొనుటకు పైవిధముగ కుటుంబాదులయందు కలుగుచున్న అహమధ్యాసను గురించి; లఘువివేచన అని ప్రారంభించి తెలిపియున్నారు.

మైననూ యట యావశ్యకమని తోచుచున్నది. గనుక నేను అనుతనకు కలుగుచున్న — ప్రతిగృహస్థునకున్నూ ఉండు — కుటుంబ స్వరూపము నించుక విచారించుదము.

ఈ లోకమందు ప్రతి వుడును వానివాని ప్రారబ్ధ కర ఫలానుభవము లకుగాను వారియొక్క కర ఫలానుభవమునకు తగిన ప్రదేశములు, కుటుంబ ములు, స్థితులలో ఆయాగర్భములయందు జన ముఎత్తి, ఆయాఫలములను వారి (అనగా ఆయాజీవులయొక్క) ప్రారబ్ధ కర్మఫలాంతమువరకు — అను భవమును పొంది, వారి ప్రారబ్ధఫలము రినవెంటనే మరియొక క్షణమైన నుండక — వారి కర ఫలములనుబట్టి మృత్యువును పొందుచుందురు. ఇట్టి అను భవములు — ఆయుష్కాలము, మృత్యువు, ఆయా వులకర నుబట్టియే ముఖ్యముగ నుండునుగాని, అను లరు (అనగా — భర్తకు భార్య, తండ్రికి కుమారుడు, అన్నకు తము డు, అత్తకు కోడలు, మొదలగు సంబంధము లన్నియు వారివారి కర ఫలమునసనుసరించి ఒకరి కొకరు అన్యులే) ఎంత మా ము సంబంధించినవి కావు. అన్యులు సహాయ పడజాలరు. ఏ వుని పారబ్ధకర ఫల మా వునిదై యుండగా అన్యుల కెట్లువచ్చును? రాదు. అయి నను ఆయా వులు వారివారి కర ఫలానుభవమునకు తగినవారిగర్భమున తగినచోట్ల జని ంతురు. అట్లు జని ంచువారు వారి కర్మానుభవమునకు వీరి గర్భమున జని ంతురుగాని, వారు జన్మించిన తల్లితండ్రుల యు ర్ణతకు మాత్రిమె కాదు. ఐనను లోకదృష్టినిబట్టిన్నీ, శాస్త్రదృష్టా గూడ వారితలి దండ్రుల తరణోపాయమునకు సహాయభూతులగుచున్నారు. ఇదియైనను ఈ జన్మించిన జీవుని ప్రారబ్ధకర నుబట్టి అట్టియవకాశమున్నప్పుడే యగు చున్నారు. నిచో తనతండ్రికన్నను, తల్లికన్నను ముందే యీజీవుడు మృతుడగుచున్నాడు. ఇట్లై యీ లోకమందనుభవించు ధనసంపత్తులలోను, సుఖదుఃఖములలోను, స్థితిగతులలోను, గుణాగుణములలోను చాలవ్యత్యాస ములు కనబడుచున్నవి. కాని ఆయాజీవుల కర్మపరిపాక సామీప్య సాదృశ్య ములనుబట్టి యెచటనైనను తండ్రికుమారులుగాని, అన్నదమ్ములుగాని, తల్లి

కుమా ర్తెలుగాని, భారా భర్తలుగాని కాకతా యముగ సమానానుభవములుగల వారై యుండవచ్చునుగాని, అట్టిది వారివారి ప్రారబ్ధకర ఫల సాదృశ్యసామీప ములనుబట్టి సంభవించునదెగాని, యీజన్మలో వీరి సంబంధబాంధవ్యాము లనుబట్టి కలుగుచున్నది గాదని గట్టిగా నమ్మవలయును.

ఈ వరాశిలో ఆయాజీవుల పరిపాకమునుబట్టి తదనుకాలమైన కుటుంబ పరిస్థితులలో జని ంచి ఆయాయనుభవములు పొంది ఒకరికొకరను ముందువెనుక వివక్షత క వారివారి ప్రారబ్ధఫలాంతమందు వారువారు మర ణించుచుందురు అంతియేగాని వాస్తవమున జూచిన ఇందులో ఒకరికొకరి కర్మానుభవ సంబంధములేమిన్ని యుండవు. ఐనను సశ రికి వ్యవహార ధగ ము తప్పదు గాన, వారివారి కుటుంబ స్థితిగతులననుసరించి వారివారి కుటుంబ సంరక్షణకు ప్రయత్నించుటావశ్యకము ఐనను అట్టివారి ధనసంపా దనా విధానమును, ఆశయమునెట్లుండవలెననిన ప్రవసిష్ఠభగవానులు తెలుపు చున్నారు.

శ్లో॥ దేశక్రమేణ ధనమల్పవిగర్హణేన తేనాంగసాధుజనమర్జయ
మానపూర్వమ్।
తత్సంగమోత్థ విషయాద వహేళనేన సమ గ్విచారవిభవేన
తవాత లాభః॥

అనగా — దేశాచారముననుసరించి అనింద మగువృత్తితో ధనమునా ర్జించి, ఆదరపూర్వకముగ సత్పురుషులనాశ్రయింపుము. సత్సాంగత్య ము- గల్గిన విషయ వైరాగ్య మువల్లను, వేదాన్త విచారమువల్లను నీకు ఆత్మ తత్త్వజ్ఞానము చేకూరును అని భావము.

కాని జీవులయొక్క కర్మ ఫలములు భిన్నభిన్నములుగాను చిత్రవిచిత్ర ములుగాను ఉండును. కాని కుటుంబములోని అత్యంతసన్నిహితులైన తండ్రి కుమారులు, భార్యాభర్తలకైనను మనోధర్మములుగాని, ఆహారవిహారాదులు గాని, తెలివితేటలుగాని, సమర్థతాసమర్థతలుగాని, అనుభవములుగాని సాధారణ ముగ నొకేవిధముగ నుండవు. ఐనను పైన తెల్పినట్లు కాకతా ళీయముగ నుండినను ండవచ్చును. దీనినే సాంప్రదాయికులిట్లుచెప్పుచున్నారు—

## సంసారాసారతా నిరూపణ

శ్లో॥ ఏకమస్మి శరారూణాం త్రయమేకౌకసామపి।
సంకరోఽస్తి మిథోబుద్ధేః నమూర్ఖవిదుషామివ॥

ఈ కుటుంబమెట్టిదనగా — ఒక చెరువువంటిది. ఎట్లనగా ఒక్కటి యైన యాచెరువునందు మత్స్యములు, తాబేళ్లు, ఎండ్రకాయలు, కొంగలు, నీటికాకులు, బాతులు, హంసలు మొదలుగాగలవన్నియు కలసి నివసించు చుండును. కాని వేటి స్వభావము వాటిది, వేటియాహారము వాటిది యైయున్నదిగదా! ఎట్లన-హంసలు తామరతూండ్లను తినును. కొంగలు చిన్నచేపలను తినును. ఎండ్రకాయలు నీటి పురుగులను తినును. పెద్దచేపలు చిన్నచేపలను గూడ తినును. ఇట్లయ్యును ఇవియన్నియు ఒక్క చెరువునందే యుండువిధమున మన కుటుంబములు కలుగుచున్నవి.

కావున గృహస్థులైన ముముక్షువులు సంసారాసారతను బాగుగ గ్రహించి, దృశ్య వి ·షయములయం దత్యంతాసక్తులుగాక, యథోచిత వ్యవహారముతో ప్రవర్తించుచు ఆత్మానుసంధానతత్పరులై కృతకృత్యులు కావలసి యున్నది. ఎట్లు విచారించినను యీ జననమరణ ప్రవాహమునందు ·వునకు నిత్యసుఖమనునది కలుగుటకు వీలులేదు - ఏలయన ·వుడు, సంసారమున పాపక·· సంబంధమనునది ·క యుండుటకు శక ·ముకాదు. కర స్వరూపమునుబట్టి పుణ్య, పాపకర లు రెండునూ జీవునకు బంధములే యగుచున్నవి. ఇట్టి బంధములే జన్మ పరంపరను వునికి కలిగించుచు సంసార నిమగ్నుని చేయుచున్నవి. కాని వివేకియగువాడు సంసారమందు విరక్తి నొందుట తన శాశ్వత సుఖమున కాపశ ·కమగుచున్నది. దీనినే శ్రుతి "తసా జ్జుగుప్సే " అని యిట్లీ సంసారము నిస్సారమగుటచే వైరాగ్యము బూనవలయునని స్పష్టముగా చెప్పుచున్నది. ఇట్లు విరక్తుడై మోక్షోపాయమును విమర్శింపవలయును - సర్వము కల్పితమే యగుటవలన శాస్త్రాభ్యాసాదులవలన భ్రాంతి తొలగునేని ముక్తుడగును.

---

# మోక్షసాధన సామగ్రి

మానవుడు తాను వాస్తవముగా కానట్టి, ఈజడ దుఃఖపరిచ్ఛిన్నములయిన స్థూలసూక్ష్మదేహములను తాను, అని నమ్మి యీమిథ్యాదృశ్య పదార్థములు తనవనిన్ని భ్రాంతిబుద్ధిచే యనుకొనుటవలన తనకు యీ సమస్త సంసార దుఃఖానుభవములు కలుగుచున్నవి. తాను అనునది యున్నప్పుడేగదా తనది యనునది యుండుటకు సంభవము. కానివివేకముతో సయుక్తికముగ విచారించి విమర్శించిన యెడల తాను అనునదియే అవాస్తవమగుచున్నపుడు యింక తనది అనునది యుండుట అసంభవముగదా. ఇట్లుజడమైన అసత్య పదార్థమును సత్యమని భావించి, శాస్త్రవిచార జ్ఞానముచే అసత్యమని తెలుసుకొనినను, దానిని నమ్ముటకు సామర్థ్యములేక యీ కల్పిత అసత్యదృశ్య పదార్థానుభవములనే పొందుచు సంసారదుఃఖములను నిరంతరము యనుభవించుచున్నాడు ఇదియే అజ్ఞానము, భ్రాంతి — అనగా ఏ వస్తువునైనను వాస్తవముగ అదికానిదానిని అది అనుకొనుట. ఒక వస్తువుయొక్క, సత్యత్వమును గుర్తించలేక దానిని మరియొకటిగా తలంచుట. ఇదియే భ్రాంతి. ఇట్టి భ్రాంతిని గురించి శ్రీశంకరులు "భ్రాంతిమాత్ర మిదంవిద్వన్ విశ్వంబ్రహ్మణి కల్పితం" ఓ విద్వాంసుడా ! యీ దృశ్యమంతయు బ్రహ్మయందు కల్పితముగానున్నది. ఎట్లన "రజ్జుసర్పవ , అని చెప్పుచున్నారు. కాన యీమానవ శరీర స్వరూపముగూడ దృశ్యకోటిలోనిదేగాన అధ్యస్తమైన అసత్యమే యగుచున్నది. కాని మానవుడు అసత్యమైన తన శరీర స్వరూపములనే సత్యమని నమ్మి వ్యవహరించుచున్నాడు. ఇట్టి భ్రాంతిజ్ఞానమును నివర్తింపజేసుకొనిన గాని మానవుడు తన సత్యస్వరూపమును తెలిసికొనజాలడు—తన సత్యస్వరూపమిట్టిదియని తెలిసికొని స్వానుభవము పొందినగాని యీ అనాదిభ్రాంతియైన అవిద్య నశించదు. కాన ముముక్షువు తనకు వ్యవహారదశయందు కలుగుచున్న సత్యాసత్య పదార్థానుభవములను శాస్త్రదృష్టితో గనుకొని బాగుగ వివేచనచేసిన యెడల తనకు యీ సంసారదుఃఖమెందుకు కలుగుచున్న

దియు తెలియగలదు ఎట్లనలోకములో మానవులకు ఆనందానుభవ సుఖములు రెండువిధముల కలుగుచున్నవి. మొదటిది వ్యావహారిక సత్యపదార్థముల వల్లను, రెండవది వ్యావహారిక కల్పిత పదార్థములవల్లనూ సుఖానుభవములు కల్గుచున్నవి కల్పితమన్న అసత్యములే కదా ఇందు వివేకులు తమ పంచేంద్రియ భోగానుభవములకుగాను వ వహారవాస్తవ పదార్థములనే అనగా సహజమైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను కోరుచుందురు. గాని కృత్రిమ — ప్రతిమ — పదార్థఛాయాపటములతో పూర్తియానందమును పొందరు. అయినను లోక వ్యవహారమున అవివేకులు యిట్టి కృత్రిమ, పదార్థ, ఛాయా శబ్ద చలన చిత్రములతోడనే ఆనందమును పొందుచున్నారు. కాని వ్యావహారికముగాగూడ ఈ కల్పితమైన రెండవ సుఖానుభవములకు అనగా అసత్యానుభవములకు సత్యత్వ సుఖములు కనబడుటలేదు జనసామాన్యము రెండవదియైన కల్పిత వ్యవహారములతోనే తాత్కాలిక తృప్తియానందముల పొందుచూ తిరిగి తిరిగి అట్టి క్షణిక సుఖములనే నపేక్షించుచు వారి ధన ద్రవా దులను వ్యయముచేసుకొని దుఃఖములకు లోనగుచున్న విషయమందరకునూ అనుభవములోనున్నదియే ముఖ్యముగా యిట్టి అవివేకుల అల్ప సుఖములకొరకు యీశబ్దచలనచిత్ర ప్రదర్శనాదులు ఉపయోగపడుచున్నవి. అయినను యీచిత్ర ప్రదర్శనములు వివేకులు చూచుటలేదాయని యడిగిన యెడల వివేకులు వారి యావశ్యకతనుబట్టి చూచిననూ అట్టివారు వీనిని వారి విద్యా పరిశోధనా వృద్ధులకు యుపయోగించుకొని లాభమునే పొందుదురు. కాని అవివేకుల వలెను ధనవ్యయ ప్రయాస దుఃఖముల నొందరు. అవివేకులు అధర్మ అసత్యానుభవములవల్ల ధననష్ట, క్లేశదుఃఖములను పొందుచున్నారు. ఇంకను మానవులకు యావశ్యకమైన ఆకలి బాధను తీర్చుకొనుటకుగూడ యెన్నివిధములైన కల్పిత కృత్రిమ ఆహారములనుతిన్నను పర్యవసానమున సహజాహారపదార్థములను భుజించిన కలుగు తృప్తియానందములు కలుగుట లేదు. కాన దానినిబట్టి వ్యవహారానుభవములోగూడ మానవులకు ధర్మ, సత్య పదార్థానుభవములవల్ల అధికసుఖము—దీర్ఘకాల ఐశ్వర్య అనుభవములను కల్గుం

చుచున్నవి. కాని అధర అసత్య పదార్థానుభవములు తాత్కాలిక అల్ప సుఖములను మాత్రమిచ్చుచు పర వసానమున మానవుల దుఃఖదారిద్ర్యములపాలు చేయుచున్నవి. ఇదియును అందరికి తెలిసిన విషయమే.

ఇట్లే మానవులకు పరమార్థములో గూడ తన సత్యస్వరూపానుభవము నిత్యనిరతిశయ సుఖమునిచ్చుచు యీ కల్పిత దృశ్య అసత్యానుభవములు తాత్కాలిక అభాససుఖములు కలుగజేయుచు పర్యవసానమున మానవుని దుఃఖములపాలుచేసి సంసార చక్రమున చర్వితచర్వణముగ ద్రిప్పుచున్నది, ఈ దశ్యమంతయు మాయాకార్యము. లోకమునందు యెట్లు వివేకి, అవివేకుల, భోగార్థము పదార్థములు సృష్టింపబడి సుఖదుఃఖములను తారతమ్యముతో నిచ్చుచున్నవో అట్లే పరమార్థమునందు గూడ జ్ఞానుల (వివేకుల) అనుభవముకు నిత్యనిరతిశయ పరిపూర్ణ బ్రహ్మ పదార్థమున్నూ - అజ్ఞుల (అవివేకుల) అనుభవమునకు యీ మాయా కల్పిత సర్వదృశ మున్నూ యున్నవి. ఈ దేశ, కాల వస్తు, సర్వదృశ మున్నూ అవివేకుల ఆనందము కొరకు అనాదియైన మాయచే కల్పింపబడి మానవునకు తన నిత్య పరిపూర్ణ జ్ఞానము (వివేకము) కలుగునంతవరకు యీ మాయ వుని భ్రాంతియుతునిగా జేసి సంసార దుఃఖసాగరమున త్రిప్పుచుండును. అయినను వ్యవహారానుభవములలో గూడ మానవుడు యీ కల్పిత అధర అసత్యానుభవములతో విసగటజెంది - తన ధర పత్నితో తన చిన్న కుటీరమందైనను యుండి సంసార సుఖమును బడయుచున్నట్లు వివేకియైన ప్రాజ్ఞుడు యీ జగదసత్యత్వమును బాగుగ గురు, శాస్త్రములవల్ల గ్రహించి - తనకు యింతకు పూర్వమున కలుగుచున్న సుఖము ఆభాసమనిన్నీ అనిత్యములనిన్నీ తెలుసుకొని తను యీ సంసార చక్రమునుంచి విముక్తి పొందుటకు ప్రయత్నించును. ఇట్టివాడే వివేకి, ముముక్షువు. ఇట్టి ముముక్షువునకు తాను కోరు నిత్యనిరతిశయ సుఖము ఒక్క బ్రహ్మ జ్ఞానమువల్ల గాని అన్యధాగా కలుగదు. ఇట్టి బ్రహ్మ జ్ఞానము కలుగుటకు దృశ మిథ్యాత్వ లక్షణములను తాను బాగుగ శాస్త్ర దృష్టితో వివేచనచేసి అట్టి సతతాభాసములవల్లగాని దృశ్యమిథ్యాత్వ జ్ఞాన

నిశ్చయము కలుగదు. ఇట్టి స్వశరీర దృశ్యమిథ్యాత్వ జ్ఞాన నిశ్చయమే తనకు మోక్షసాధన మార్గమగును. అయిననూ యిట్టి మోక్షార్థి శాస్త్రమును ఎట్లు విచారించి తెలిసికొనవలసినది, ఎట్టి గుణములు సంపాదించవలసినది, అట్టి గుణ సంపాదనా లాభములను గూర్చి ముముక్షువునకు తెలుపుటకుగాను శ్రీరామచంద్రమూర్తిని నిమిత్తమాత్రముగ జేసికొని లోకానుగ్రహచిత్తులై వసిష్ఠ భగవానులు యిటుల బోధించుచున్నారు. కాన యీ బోధను ముముక్షువగు జిజ్ఞాసువు తనకు మోక్షసాధన సామాగ్రిగ నెరింగి యీ సాధనములను ఫలావగతి పర్యంతము అభ్యసించుచుండవలయును.

శ్లో॥ శాస్త్రైస్సజ్జన సంసర్గపూర్వకై స్సతపోదమైః,
ఆదౌ సంసార ముక్త్యర్థం ప్రజ్ఞామేవాభివర్ధయేత్ ॥

తా॥ సంసారము విడిపోవుటకై మొదట శాస్త్రములచేతను, సత్సాంగత్యముచేతను, తపముచేతను, ఇంద్రియ నిగ్రహముచేతను బుద్ధినే పెంపు చేయవలయును.

శ్లో॥ స్వానుభూతేశ్చ శాస్త్రస్య గురోశ్చైవైక వాక్యతా,
యస్యాభ్యాసేన తేనాత్మా సంతతేనావలోక్యతే.

తా॥ ఎవనికి యెల్లప్పుడు చేయబడునట్టి యభ్యాసముచేత తన యనుభవము, శాస్త్రమున జెప్పబడిన నిర్ణయము, గురువచనము ఈమూడును ఒకటిగ సరిపోవునో, వానికి ఆత్మ సాక్షాత్కారము కలుగును.

శ్లో॥ కించిత్సంస్కృత బుద్ధీనాం శ్రుతం శాస్త్రమిదం యథా,
మౌర్ఖ్యాపహం తథాశాస్త్ర మన్యదస్తి న కించన.

తా॥ కొంచెము చిత్త సంస్కారముగల మనుజులకు ఈ వేదాంత శాస్త్రము వినబడినంత మాత్రమున మూఢతనమును పోగొట్టినట్లు ఇంకొక శాస్త్రము మూఢత్వమును పోగొట్టనేరదు.

శ్లో॥ వరం శరావహస్తస్య చాండాలాగార వీథిషు,
భిక్షార్థమటనం రామ నమౌర్ఖ్య హతజీవితమ్.

తా॥ రామచంద్రా! మూకుడు చేతగొని చండాలుల యిండ్ల వెంబడి బిచ్చమునకై తిరుగుటయు శ్రేష్ఠమగునుగాని మూఢతనముగల వ్యర్థపు బ్రతుకు శ్రేష్ఠము కానేరదు.

శ్లో॥ న ధనాన్యుప కుర్వంతి న మిత్రాణి న బాంధవాః,
న హస్తపాదచలనం న దేశాంతర సంగమః.

శ్లో॥ న కాయక్లేశవైధుర్యం న తీర్థాయన జీవితం,
కేవలం తన్మనోమాత్రజయే నాసాద్యతే పరమ్.

తా॥ బ్రహ్మప్రాప్తికి ధనములు ఉపకారకములు కావు. స్నేహితులు సాధకులుగారు. బంధువులు ఉపయోగపడరు. కాలుసేతులు ఆడుటలుగాని, దేశాంతరమున గుటగాని, కాయక్లేశము నొందుట బొందకుండుటలుగాని, పుణ్యతీర్థంబులయందు జీవించుటగాని ఉపయోగించనేరవు. ఇక ఆ బ్రహ్మ వస్తువు మనసును మాత్రము జయించుటచేత పొందబడును.

శ్లో॥ మోక్షద్వారే ద్వారపాలానిమాన్ శృణు యథాక్రమం,
ఏషామేకతమాసక్త్యా మోక్షద్వారే ప్రవేశ్యతే.

తా॥ ఇంద్రియ నిగ్రహము, బ్రహ్మవిచారము, సంతోషము, సత్సాంగత్యము ఈ నాల్గును క్రమముగా మోక్షముయొక్క వాకిటియందు ద్వారపాలకులనియు, వీటిలో నొకదాని నాశ్రయించినను మోక్షద్వారమునందు ప్రవేశింపనగును.

శ్లో॥ యాని దుఃఖానియా తృష్ణా దుస్సహా యే దురాధయః,
తత్సర్వం శాంతచేతస్సు తమోఽర్కేష్వివ నశ్యతి.

తా॥ ఏ దుఃఖములు గలవో, ఏయాశగలదో, సహింపదరముగాని యేదుర్వ్యసనములు గలవో, అవియన్నియు కామ క్రోధాదులు లేక యడగి యున్న చిత్తముగలవారియందు సూర్య కిరణములయందు చీకటిపోలె నశించుచున్నది.

శ్లో॥ శ్రుత్వాస్పృష్ట్వా చదృష్ట్వాచ భుక్త్వా ఘ్రాత్వా శుభాశుభం,
స హృష్యతి గ్లాయతి యః స శాంత ఇతి కథ్యతే.

తా॥ మంచిచెడుగులను వినియు, స్పృశించియు, చూచియు, భుజించియు, ఆఘ్రాణించియు నెవ్వడు సంతోషమునుగాని దుఃఖమునుగాని చెందదో, అట్టివాడు శాంతుడని చెప్పబడును.

శ్లో॥ తుషారకర బింబాచ్ఛం మనో యస్య నిరాకులం,
మరణోత్సవ యుద్ధేషు స శాంత ఇతి కథ్యతే.

తా॥ ఎవ్వని మనసు మరణమునందును వివాహమునందును కలహమునందును చంద్రబింబముపోలె నిర్మలమై వ్యాకులపడక యుండునో, వాడు శాంతుడని చెప్పబడును.

శ్లో॥ శాస్త్రివబోధా మలయా ధియా పరమపూతయా,
కర్తవ్యః కారణజ్ఞేన విచారోఽనిశమాత్మనః.

తా॥ మొదట సత్కార్మలుచేసి ఈశ్వరార్పణము చేయుటచే మిగుల పవిత్రమైనట్టియు, పిమ్మట నివృత్తి శాస్త్రార్థ మెరుంగుటచే నిరలమగు బుద్ధిచే యిది దీనికి కారణము, దీనికి నిది కార్యమని తెలిసినవాడై ఆత్మవిచారం బెప్పుడు యుచుంపవలయును.

శ్లో॥ విచారా త్తీక్ష్ణతామేత్య ధీః పశ్యతి పరం పదం,
దీర్ఘ సంసారరోగస్య విచారో హి మహౌషధమ్.

తా॥ ఆత్మ విచారమువలన బుద్ధి చురుకుదనమును పొంది పర బ్రహ్మ ను చూడజాలును. ఆత్మ విచారము సంసారమను దీర్ఘ రోగమునకు గొప్ప ఔషధము గదా.

శ్లో॥ కోఽహం కస్యచ సంసార ఇత్యాపద్యపి ధీమతా,
చింతనీయం ప్రయత్నేన న ప్ర కారమాత్ర నా.

తా॥ నేనెవరు? ఈ సంసార మెవనికి గలిగెను? అని బుద్ధిమంతుడు యెట్టి ఆపదయందును ఆటంకము లేక ప్రయత్నముతో బుద్ధిచే విచారణ చేయుచుండనగును.

శ్లో॥ సంతోషామృతపానేన యే శాంతా స్తృప్తి మాగతాః,
భోగశ్రీ రతులా తేషా మేషా ప్రతి విషాయతే.

తా॥ సంతోషమను నమృతమును త్రావుటచే తృప్తినొందిన యే శాంత చిత్తులు గలరో, వారలకు భోగముల యందగు విస్తారమగు నాశ ప్రతికూల మగు విషముగా నొప్పుచున్నది.

శ్లో॥ అప్రాప్త వాంఛా ముత్సృజ్య సం ప్రాప్తే సమతాంగతః,
అదృష్ట ఖేదా ఖేదో య స్సంతుష్ట స్స ఇహోచ్యతే.

తా॥ లభించని వస్తువునందు కోరికను విడిచియు, ల ంచిన వస్తువు విషయమునను నిర్వికారస్థితి గలిగియు, దుఃఖమును ఉబ్బును పొందక యున్నవాడు సంతుష్టుడని చెప్పబడును.

శ్లో॥ నాభి వాంఛ త సంప్రాప్తం ప్రాప్తం భు క్తే యథాక్రమం,
యస్తు సౌమ్యసమాచార స్సంతుష్ట ఇతి కథ్యతే.

తా॥ ప్రాప్తించని వస్తువును కోరనివాడును, ఆచారక్రమమును విడు వక ప్రాప్తించిన వస్తువు ననుభవించువాడును మంచి నడతగల వాడును సంతుష్టుడని చెప్పబడును.

## మోక్షసాధన సామగ్రి.

శ్లో॥ విచ్ఛిన్న గ్రంథయ స్తజ్జ్ఞా స్సాధవ స్సర్వ సమ్మతాః,
సర్వోపాయేన సంసేవ్యా స్తే హ్యుపాయా భవాంబుధౌ.

తా॥ విడిపోయిన యహంకార గ్రంథి గలవారును, ఆత్మ తత్త్వము నెరింగినవారును, అందరకు నిష్టులగు సాధుజనులను అన్ని విధములగు నుపాయముల చేతను సేవింపవలయును. ఈ చెప్పబడిన శాంతి మొదలగు నాల్గును సంసార సముద్రమును దాటుటకు నుపాయములగును.

శ్లో॥ చత్వార ఏతే విమలా ఉపాయా భవ భేదనే,
యైరభ్యస్తా స్త ఉత్తీర్ణా మోహవారి భవార్ణవాత్.

తా॥ శాంతి, ఆత్మ విచారము, సంతుష్టి, సజ్జన సాంగత్యము అను నీ నాల్గును సంసారము నడంచు విషయమై నిర్మలములగు నుపాయములగును. ఈ నాల్గిటిని అభ్యసించినవారు మోహమను జలముగల సంసారమను సముద్రమునుం తరించిరి.

శ్లో॥ మోక్షోపాయ కథామేతాం శ్రుత్వాతా మరిమర్దన,
అనిచ్ఛతామపి బలాత్ప్రరో బోధః ప్రవర్తతే.

తా॥ శత్రువుల నశింపజేయునట్టి ఓ రామచంద్రా ! ఈ మోక్షోపాయములను లోన నిష్టములేక బలాత్కారముగా వినిన వారలకును శ్రేష్ఠమగు జ్ఞానము గలుగును.

శ్లో॥ సముద్రస్యేవ గాంభీర్యం స్థైర్యం మేరోరివ స్థితిః,
అంతశ్శీతలతా చేంద్రోరివోదేతి విచారిణః.

తా॥ ఆత్మ విచారణ చేయువానికి సముద్రము యొక్క గాంభీర్యమును బోలు గాంభీర్యంబును, మేరు పర్వతముయొక్క స్థైర్యమును బోలు స్థైర్యంబును, చంద్రునిలో నున్న చల్లదనమును బోలు చల్లదనంబును గల్గును.

శ్లో॥ సచ్ఛాస్త్ర సాధువృత్తానా మవిరోధిని కర్మణి,
రమతే ధీ ర్యథాప్రాప్తే సాధ్వీవాంతః పురాజిరే.

తా॥ ఆత్మ విచారము చేయువాని యొక్క బుద్ధి వేదము ననుసరించిన శాస్త్రములకు సజ్జన స్వభావమునకును విరోధించని కృత్యమునందును, అప్రయత్నముగా సంప్రాప్తమైన వస్తువునందును పతివ్రత అంతఃపురము నందు యుండి, సంతసమొందినట్లు సంతసపడుచున్నది.

శ్లో॥ దృశ్యతే లోకసామాన్యో యథా ప్రాప్తాను వృత్తిమాన్,
ఇష్టానిష్టఫలప్రాప్తౌ హృదయే నాపరాజితః.

తా॥ జీవన్ముక్తుడెట్టి వాడనిన, శాస్త్రముచేతను లోకముచేతను సిద్ధించిన దాని ననుసరించి యుండువాడై యిష్టము సిద్ధించినను సిద్ధించకుండినను మనస్సున ఉబ్బునుగాని దుఃఖమునుగాని యెఱుంగక లోకసామాన్యుడుగా గనుపించువాడు జీవన్ముక్తుడని చెప్పబడును.

శ్లో॥ సుఖాసనోపవిష్టేన యథా సంభవమశ్నతా,
భోగజాలం సదాచార విరుద్ధేషు న తిష్ఠతా.

శ్లో॥ యథాక్షణం యథాదేశం ప్రవిచారయతా సుఖం,
యథాసంభవ సత్సంగ మిమం మోక్ష కథాక్రమమ్.

శ్లో॥ ఆసాద్యతే మహాన్ జ్ఞేన బోధస్సంసార శాంతిదః,
న భూయో జాయతే యేన యోనియంత్ర ప్రపీడనమ్.

తా॥ సుఖకరమగు నాసనంబున గూర్చుండు నట్టియు, సంభవించిన భోగంబుల ననుభవించి తృప్తి నొందునట్టియు, సదాచారమునకు విరుద్ధము లగు పనులజేయ నట్టియు, దేశకాలంబుల ననుసరించి సంభవించిన సత్సాంగత్యము గలిగి యీ మోక్షశాస్త్రమును విచారణచేయునట్టి పండితుడు మరల యోని యంత్రములయొక్క బాధలను గలిగించునట్టి సంసారము నడంపజాల గొప్ప జ్ఞానమును పొందుచున్నాడు.

# మోక్షసాధన సామగ్రి

శ్లో॥ యుక్తి యుక్తముపాదేయం వచనం బాలకాదపి,
అన్యత్తృణమివ త్యాజ్యమప్యుక్తం పద యోనినా.

తా॥ మాట యుక్తియుక్త మగునేని బాలకుడు చెప్పినను గ్రహింపదగును. యుక్తియుక్తము కాదేని బ్రహ్మదేవుడు చెప్పినను గడ్డిపరక వలె విడువనగును.

శ్లో॥ బ్రహ్మోపదేశ దృష్టాంతో యస్తవేహ హి కథ్యతే,
ఏకదేశ సధర్మిత్వం తత్రాంతః పరిగృహ్యతామ్.

తా॥ నేను నీకు తత్త్వము నుపదేశించు నపుడు ఏ దృష్టాంతమును చెప్పుదునో, ఆ దృష్టాంతమునందు ఉద్దేశింపబడిన యొక యంశము మాత్రము సరిపడుటనే గ్రహించవలయును.

శ్లో॥ ఏవం సతి నిరాకారే బ్రహ్మ ణ్యాకారవాన్కథం,
దృష్టాంత ఇహ చోద్యంతి మూర్ఖం వైకల్పికోక్తయః.

తా॥ ఇటులుండగా రూపములేని బ్రహ్మ విషయమై రూపముగల వస్తువు యెట్లు దృష్టాంత మగునని భ్రాంతిచే గల్గిన మాటలు మూఢుని ప్రేరేపించుచున్నవి.

శ్లో॥ నను తార్కికతామేత్య నాశనీయా ప్రబుద్ధతా,
అనుభూత్యపలాపాంతై రపవిత్రైర్వికల్పితైః.

తా॥ బ్రహ్మ సద్వితీయమా (రెండవ వస్తువుతో గూడినదియా) అద్వితీయమా (రెండవ వస్తువు లేనిదా) సద్వితీయమంటివేని సిద్ధాంతము చెడును. అద్వితీయమంటివేని గురువుగాని శాస్త్రముగాని లేకుండుటచే ఆ బ్రహ్మ వస్తువు ఏర్పడదు. బ్రహ్మ సప్రమాణమా? అప్రమాణమా? సప్రమాణ మంటివేని బ్రహ్మకంటె వేరగు ప్రమాణము ఉండిన, అద్వైతము చెడును. అప్రమాణమంటివేని ప్రమాణము లేదుగాన ప్రమేయమగు

బ్రహ్మ వస్తువు ఏర్పడదు. అని యిట్టి అనుభవమును నశింపజేయు నట్టియు మనసును చెరచునట్టి వికల్పములచే కుతర్కము నవలంబించి తనకుగల జ్ఞానము నశింపజేయ దగదు.

శ్లో॥ గుణాశమాదయో జ్ఞానాచ్ఛమాదిభ్య స్తథా జ్ఞతా,
పరస్పరం వివర్ధంతే ద్వే పద్మ సరసీ ఇవ.

తా॥ జ్ఞానము వలన శాంతి మొదలగు గుణములును, శాంతి మొదలగు గుణముల వలన జ్ఞానంబును, ఈ రెండును కమలముల వలన కొలను, కొలను వలన కమలంబులును పెంపుగాంచునట్లు ఒకటిచే నొకటి పెంపుగాంచును.

శ్లో॥ ఇదం యశస్య మాయుష్యం పురుషార్థ ఫలప్రదం,
శ్రుత్వాత్వం బుద్ధి నైర్మల్యాద్బలాద్యాస్యసి తత్పదమ్.

తా॥ శ్రీ రామచంద్రా ! నీవు కీర్తిని ఆయువును మోక్షమును గలిగించునట్టి యీ జ్ఞాన శాస్త్రమును నిర్మలమగు బుద్ధితో వినిన నీ బుద్ధిబలమువల్లనె ఆ బ్రహ్మ వస్తువును పొందుదువు.

---

# మానవునకు నిత్యానిత్య వివేకావశ్యకత

ఈ నిత్యానిత్య వివేకమనునది వుని సుఖ సంపాదనకుగాను మానవునికి ఇహపరములు రెంటియందును యావశ్యకత కనబడుచున్నది. ప్రతి వుడును అన్నిటికంటెను ఎక్కువగా కోరునది తన సుఖమే కదా. ఇట్టి స్వసుఖాపేక్ష మానవులకును, పశువులకును సమాన ధర్మముగానే కనబడుచున్నది. కాని యిట్టి తన సుఖము నపేక్షించు ధర్మము పశు, మానవులకు సమానమే యైననూ, అనుభవములలో నిత్యమేదియో అనిత్యమేదియో

## మానవునకు నితా నిత వివేకావశ్యకత

గ్రహించగలిగిన శక్తిని అనగా వివేకమును పరమేశ్వరుడు మానవులకు మాత్రమే యిట్టి జ్ఞానమును పూర్తిగా యిచ్చియున్నాడు. మానవజన వచ్చుటకు కారణము, వుడు తాను అనాది అవిద్యాపరిచ్ఛిన్న భ్రాంతుడై సిన పుణ్య పాప కర ఫలముల ననుభవించుటకుగాను కల్పితముగా యేర్పడిన యొక ఉపాధి. అనగా మానవజన్మ పుణ్య పాప ఫల మిశ్రితము. కాన మానవుడు తన పుణ కర ఫలమగు సుఖమును, తన పాప కర్మ ఫలమగు దుఃఖమును విధిగా తాను అనుభవించవలసి యున్నది. జీవుడు అనాది అవిద్యవల్ల పరిచ్ఛిన్న భ్రాంతుడై తన కర్తృత్వభోక్తృత్వములతో చేసిన కర్మఫలములు సంచిత, ప్రారబ్ధ, ఆగామియను మూడు విధములుగ నుండును. ఇందు సంచిత మనగా లోగడతాను చేసిన కర ఫలములో అనుభవమునకు రాక నిలవయున్న కర ఫలము. ప్రారబ్ధమనగా లోగడ తాను చేసిన కర్మ ఫలములో యీ జన మునం దనుభవించుటకుగాను పరిపక్వమైన కర్మఫలము. ఆగామి యనగా మానవుడు యిప్పుడు తాను చేయు కర లచే ముందు యను భవమునకు ఏర్పడు కర ఫలము. ఇట్టి కర ఫల సముదాయములో తన ప్రారబ్ధ కర ఫలమే ప్రస్తుతము తన జన కు హేతువగుచున్నది. కాన మానవుడు యీ జన మునందు తన ప్రారబ్ధకర ఫలమును విధిగా యనుభ వింపవలయును. ఏలననగా యీ ప్రారబ్ధమనునది విల్లునుంచి యెక్కుపెట్టి విడువబ న బాణము వంటిది. కాన యీ ప్రారబ్ధకర ఫలానుభవములు యెట్టివి యైనను తప్పించుకొనుటకు దేవతాదులకు గూడ సాధ్యము కాలేదు. ఇంక మానవుల మాట చెప్పవలసిన దేమియున్నది. వుడు తాను చేసిన కర్మఫలమే యైనను యెట్టి మానవులును సుఖము అనుభవించుటకు యిచ్ఛ యించుచు సంతోషానుభవమును పొందునుగాని దుఃఖానుభవములను మాత్రము యిష్టపడక అధికదుఃఖ క్లేశములతో యనుభవించుచుండును. ఇదియేగాక యిట్టి తన దుఃఖానుభవములు అన్యనిమిత్తముతో వచ్చినవను భ్రాంతితో దుఃఖ్ల శముల నొందుచుండును. కాని వాస్తవము విచారించిన యెట్టి యెంతటి సుఖదుఃఖాను భవము లైననూ తన కర ఫలములే యని తెలిసికొనజాలక

చింతాక్రాంతుడగుచుండును. కాని యిట్టివి అన్నియు తన కర్మఫలము.. అన్య నిమిత్తకములు కావు. దీనినే

శ్లో॥ సుఖస్య దుఃఖస్య న కోపి దాతా। పరోదదా -తి కుబుద్ధిరేషా ।
అహంకరోమీతి వృథా మానః ।స్వకర్మ సూత్ర గ్రథితోహి లోకః॥

అని శాస్త్రము తెలుపుచున్నది.

సార్వభౌముడు మొదలు, సాధారణ, నికృష్ట మానవుల వరకునూ యెట్టివారైనను తాను తన జన్మ పరంపరలో యాచరించిన పాపకర్మఫల దుఃఖమును పొందక తప్పుటలేదు. దీనినే

శ్లో॥ అవశ్యం భావిభావానాం, ప్ర కారో భవేద్యది ।
తదా దుఃఖై ర్నలిప్యేర న్నల రామ యుధిష్ఠిరాః ॥

అని విద్యారణ్యముని తెలుపుచున్నారు. కాని తత్త్వజ్ఞులైన మహనీయులకు వారి ప్రారబ్ధాను భవములు తప్పక యున్నను వాటిచే కలుగుచున్న దుఃఖాద నుభవముల త్రవతను తగ్గించుకొని యనుభవింపవచ్చునని శాస్త్రాను భవములు రెంటివల్లను తెలియుచున్నది. అట్టి శాస్త్రము యేది యనిన తత్త్వశాస్త్రము, తత్త్వజ్ఞానముచే జీవునియొక్క సంచిత ఆగామి కర్మ ఫలములు రెండునూ నశించునుగాని ప్రారబ్ధకర్మఫలము మాత్రము నశించదు. కాన తత్త్వజ్ఞునకైననూ యీ ప్రారబ్ధకర్మఫలాను భవములు తప్పవు. కాని యీ ప్రారబ్ధకర ఫలమును తత్త్వజ్ఞాని యైనవాడు తన జ్ఞానబలముచే వాటిని అనగా అట్టి సుఖదుఃఖములను తాత్కాలికముగను ఆభాసముగను యనుభవించును. తత్త్వజ్ఞాని యనగా అద్వైత సిద్ధాంతజ్ఞానమును అపరోక్షముగాపొందిన మహనీయుడు. దుఃఖమిశ్రితము గాని శాశ్వతసుఖమును కోరు మానవుడు తన అనుభవములలో యేది నిత్యముగా నున్నది, యేవి అనిత్యములని శాస్త్రజ్ఞానయుక్త స్వానుభవములతో తెలిసికొనుట యిహపరముల రెంటి సుఖమునకును యావశ్యకమగుచున్నది. ప్రతి మానవ వికియున్న వ్యవ

హార పారమార్థికములు రెండునూగలవు. కావున మానవునికి వ్యవహార కాలములో వ్యవహార నిత్యానిత్య జ్ఞానముయున్నూ పారమార్థిక స్థితియందు పారమార్థిక నిత్యానిత్య జ్ఞానమున్నూ యీ రెండు స్థితులయందుననూ తన దీర్ఘ, శాశ్వత సుఖానుభవములకుగాను ఆవశ్యకమగుచున్నది. అయినను మానవుడు వ్యవహార నిత్యత్వము నెంత గ్రహించిననూ, యెంత ఆశ్రయించిననూ అది నశించునదే యగుచున్నది. ఎట్లనిన తాను అను జీవుడు యీ స్థూలోపాధిస్థితి విడచిననూ, లేక యే కారణముచే నైనను అట్టి వ్యవహార పదార్థములే తనను విడచిననూ, తన యీ వ్యవహారానుభవములు నిత్యమగుట లేదు. వాస్తవమున అనిత్యములే యగుచున్నవి. మానవునకు యీ వ్యవహార సత్యత్వమనునది మాయబంగారము లాగున శాశ్వతస్థితి లక్షణములతో నుండదు. ఈ వ్యవహార అనుభవములన్నియు జీవుని పారమార్థిక జ్ఞానము అనగా తత్త్వజ్ఞానముచేత వాస్తవమున లేనివే యగుచు మిథ్యయగుచున్నవి. కాన యీ వ్యవహారానుభవములన్నియు మానవునకు తత్త్వజ్ఞానముచే అనిత్యములగు చున్నవి. మానవునకు ప్రాపంచిక వ్యవహారానుభవములయందు అనిత్య, అశాశ్వతత్వములు కనుపించుచు అసత్యములగుచున్ననూ ఆంగ్లములో ( re is a met o in ma ness.) అనునట్లు మానవునకు యీ సుఖదుఃఖాది దృశ్యానుభవములన్నియునూ, అనాది అవిద్యా భ్రాంతియను యున్మత్త స్థితిలోని, యొక పద్ధతిన జరుగుచుండును. గనుకనే వశిష్ఠాది తత్త్వజ్ఞులు యీ సాంసారిక వ్యవహారానుభవముల నన్నింటినీ, "దీర్ఘ స్వప్నమిదం విశ్వం"–"స్వప్నతుల్యం భ్రమోదితం"–"రజ్జుసర్పభ్రాంతి వత్" అని యీ ప్రపంచమంతయు దీర్ఘ స్వప్నము వంటిది. భ్రమచే కలుగునది–స్వప్నము వంటిది–మందాంధకారమున త్రాడుయందు కలుగుచున్న సర్పభ్రమ వంటిది యని తెలుపుచున్నారు. కాన వివేకులైన మానవులు తమ నిత్యానిత్య వివేకానుభవ వివేచనలతో యీ దృశ్య సుఖదుఃఖాద్యనుభవముల యొక్కయు తన ప్రాపంచిక వ్యవహారానుభవముల యొక్కయు అవాస్తవికతను బాగుగ గుర్తించి తెలుసుకొనిన యెడల అట్టి అనుభవముల వలన కలుగు సుఖదుఃఖములు అల్పమై, తాత్కాలిక

ములై, కల్పనానుభవములు మాత్రమే యగుచు తన వ్యవహారదశయందు సుఖము నిచ్చును. ఇట్టి జ్ఞానమే తన అభ్యాస పటిమచే మోక్షసాధనమై, తన నిత్య నిరతిశయ సుఖ ప్రాప్తిని యిచ్చును. కాన ప్రతి వివేక మానవునికిని యీ నిత్యా నిత్యజ్ఞానమనునది సర్వదా పరమ యావశ్యకమై యున్నది.

---

# అహంప్రత్యయ వివేచన

మానవులకు ఈ లోకమందు కలుగుచున్న దుఃఖములన్నియు నేను నావి అనుప్రత్యభిజ్ఞతో కలుగుచున్నవి. నాది అనునది నేను అనునది యున్నప్పుడే సంభవముగాని నేను లేనిదే నావి అనునది యుండుటకు వీలు లేదు. గనుక ఈ నేను అహం అను ప్రత్యయ వాస్తవికతను గురించి విచారించుదము. ఈ విచారణ అంతయును లోగడచేసి యుంటిమి గాని యీ నేను, నేను అను ప్రత్యయ ప్రాముఖ్యమును బట్టి సర్వలోక వ్యవహారములు నడచుచూ, యివియే మానవుని సుఖదుఃఖములకు ప్రధానమగుచున్నందున యీ విచారణ ముముక్షు జిజ్ఞాసువులకే కాక సర్వసాధారణమైన వారందరకున్నూ గూడ ఈ శబ్దార్థ వాస్తవికతను గ్రహించి నిరూఢి చేసుకున్న యడల యిప్పుడు మనలకు కలుగుచున్న తాపత్రయాది దుఃఖములు కొంతవరకుగాని లేక చాలావరకు గాని యుపశమించును. కాన ముముక్షువునకు స్వస్వరూపానుసంధానాదుల అభ్యాసమునకున్నూ కేవల సంసారికి యీ సంసార యాత్రను అధిక దుఃఖాక్రాంతుడు గాక వివేక సౌలభ్యములతో నడుపుటకున్నూ-వివేకులకు యిదియే శరణ్యము. అందుకుగాను తిరిగి యీ నేను అను అహం ప్రత్యయమునకు వాస్తవికార్థము విచారింతము.

ఇంతవరకు దీనిని గురించి శ్రుత్యుక్తి ప్రమాణములతో చేసిన మన విచారణనుబట్టిన్నీ సాధారణ లోకానుభవమునుబట్టిన్నీ చూచిన యీనేను

అని ప్రతివారికి స్ఫురించు పరిమితాకార అనుభవములకు పారమార్థిక సత్తమైన నిత్యత్వము కాకపోయినను నేను అను తను - ఊహించగలిగినంతకాలమైనను తనుండ_క కోరినంత కాలమైనను ఈ స్వశరీర దృశ్యానుభవములను పొందుట_దు. లౌకిక బుద్ధితో యోచించినను తను నేను నాది అనుకొను దానియందు తన స్వతంత్రము ఆభాసముగా యున్నది గాని వాస్తవముగా కనుబడుటలేదు. దీనినిబట్టి పూర్వాపర విమర్శ చేయునట్టి వివేకులకు, మనము పొరబడుచున్నామనియు యిట్టి పొరబడుటచేతనే మనకు దుఃఖాధిక ములు కలుగుచున్నవనియు నిశ్చయింపక తప్పదు. మానవులిట్లు దీర్ఘ విమర్శచేయక, యున్నదే నిజమనినమి సంసార దుఃఖములకు లోనగుటయే అవిద్యయని చెప్పబడుచున్నది.

ఇట్టి అవిద్య అనాదియై జీవులను భ్రాంతియుతులుగజేసి సంసార ప్రవాహమందు సు గుండము నీటిలోని తృణములాగున త్రిప్పుచున్నది. గాని ఈ అవిద్య అనాదియైనను, సాంతము. అనగా మానవుని ప్రజ్ఞావివేకములచే విచారించి వాస్తవమును తెలుసుకొనినయడల ఈ అవిద్య లేనిదే అగును.

ఇట్లు అవిదా నివృత్తి పొందిన మానవుడు దుఃఖరహితుడై నిత నిరతిశయానంద స్వరూపుడే అగును. కాన నేను అను ప్రత్యయమునకు దృశ్య పరిమితాకారాదులు కాని యడల అది యెట్టిది అని వివేకులు విచారించిన యడల అట్టి స్వరూపము శాస్త్రముచే స్పష్టముగా చెప్పబడి యున్నది. నేను అని ప్రతివారును అనుభవించుచున్న ప్రత్యయ సత్యార్థమును బాగుగ గ్రహించక, యిప్పుడు తను నేను నాది అని గ్రహించి పొందుచున్న అనుభవమంతయు భ్రాంతియుతమై దుఃఖకరమైనదని తోచక తప్పదు, కాన అహం, నేను అను తన సత్య స్వరూపమును అనగా తన యథార్థ స్వరూపమును శాస్త్రానుకూలముగ యీ విధముగ తెలుసుకొనవలయును:—

నేను ఈ కర్తృత్వాది సంఘాతదృశ్య పరిచ్ఛిన్న శరీరముకాను. ఈ శరీరము, కర్తృత్వాద్యభిమానములు నాకు, లోగడ నా అవిద్యాకామ

కర్మలచే యిప్పుడు నా ప్రారబ్ధ కర్మ ఫలముగా వచ్చినవేగాని వీటితో నాకెట్టి వాస్తవ సంబంధమునులేదు. కాని ఎట్టివారికైనను ప్రారబ్ధ కర్మఫలానుభవము (విధింపబడిన శిక్షవంటిది గాన) తప్పదు గనుక నేను అనుభవించవలెను. అయినను నా కర్మానుభవములకు యిప్పుడు నేను కర్తనుగాను—పిలనన కర్తృత్వాదులు నాకులేవు. ఇవి అన్నియు అంతఃకరణ ధర్మములు. ఈ అంతఃకరణము, లోగడ నా అజ్ఞాన కాలములో చేసిన కర్మఫలభోక్తృత్వములకుగాను అవిద్యా కల్పితమైన యొక సూక్ష్మోపాధి. ఇది నాయొక్క పనిముట్టుగాని దీనితో నాకు యెట్టి వాస్తవ సంబంధమును లేదు. నా పనిముట్టు యెప్పటికైనను నేనగుదునా. కాను. కాన నాకున్నూ యీ అంతఃకరణమునకున్నూ యెట్టి సంబంధమునులేదు. ఈ అహం అను నా వాస్తవిక స్వరూపము యెట్టిదనిన — అది, ఏకమై అఖండమైన పరిపూర్ణ స్వరూపము — రెండవ వస్తువు వాస్తవముగా యుండుటకు వీలులేదు — నేను సత్యజ్ఞానానంద స్వరూపుడను — సర్వాంతర్బహిర్వ్యాపకమైన చిదాకాశ చిద్ఘనానంద స్వరూపుడను — శృత్యుక్త్యనుభవములనుబట్టిన్నీ యింతవరకు చేసిన నిరూపణా నిశ్చయములనుబట్టిన్నీ, అహం అను నేను లేనికాలముగాని — దేశముగాని - వస్తువుగాని—అవస్థగాని, యుండుటకు వీలులేదు. నేను సర్వదా త్రివిధపరిచ్ఛేద రహితుడనై —స్వప్రకాశుడనై —పరిపూర్ణుడనై —అసంగుడనై — వికారరహితుడనైన అఖండ స్వరూపమై యున్నాను. కాని నేను లోగడ నా అజ్ఞాన కాలములో చేసిన కర్మ ప్రారబ్ధ ఫలానుభవమునకుగాను యిప్పుడు నేను యీ అంతఃకరణమను కల్పిత యుపాధితో కల్పిత సంబంధము కలవాడనై నా యుపాధి ప్రారబ్ధకర్మ — క్షయముకుగాను తాత్కాలికముగ ప్రారబ్ధబద్ధుడనై యున్నాను. గాని వాస్తవముగా యీ అంతఃకరణముతో నాకు ఎట్టి సంబంధములేదు, అనిన్నీ—నా వాస్తవ స్వరూపము యిట్టిది యనిన్నీ యిప్పుడు గ్రహించితిని. ఈ కలుగుచున్న దృశ్యసంసార దుఃఖము నేను పడనక్కరలేదు—నాకు ఎంత మాత్రము వాస్తవముతో యీ దుఃఖాదులు సంబంధించినవి గావు ఇది యంతయు అవిద్యా కల్పిత భ్రాంతానుభవముగాని వాస్తవము

## అహం ప్రత్యయ వివేచన

గాదు—నేను సంవిజ్ఞాత్ర స్వరూపుడను—నా నిత్య అఖండ స్వరూపమునే, భ్రాంతియుతుడనై యీ స్వశరీర సర్వ దృశ్యముగా చూచుచున్నాను—రజ్జువయందు సర్పభ్రాంతిలాగున నాకు యీ సర్వదృశ్యము నా సత్య జ్ఞానానంద పరిపూర్ణ స్వరూపమందే కల్పితమై యీ పరిచ్ఛిన్న దుఃఖ దృశ్యానుభవములు కలుగుచున్నవి వీటితో నాకెంత మాత్రమును సంబంధములేదు. అహం, నేను అను యీ జీవుడు సైంధవశిల ప్రతిమ వంటివాడు ఇట్టి ప్రతిమారూపము, సత్యముగా తలచి భ్రాంతియుతుడనై నా వాస్తవ స్వరూపమును మఱచి, భ్రమవికారములచే యీ యుపాధి వికారములను నావిగా పొందుచున్నాను. గాని యిది వాస్తవముగాదు. అహం అని స్ఫురించుచున్న నా స్వరూపము లవణఖండము వంటిది. వాస్తవమైన సముద్ర జలమే లవణముగా మారినదే—గాని లవణ స్వరూపము సహజమైనది కాదుగదా? సముద్రజల వికారమే లవణము. ఇట్లే యీ అహం అను నేను అనునది కూడయగుచున్నది—వాస్తవము విచారించిన బ్రహ్మేతరమేమియునులేదు. యథార్థముగా చూచిన అహం, నేను అను ప్రత్యయమునకు వాస్తవ కర్త ఎవరును కనబడుటలేదు. ఈ విషయమంతయు కర్తృత్వాద్యాభాస నిరూపణమందు స్పష్టపరచియుంటిమి. ఈ కర్తృత్వాది సంబంధములన్నియు మాయా కల్పితములు. అనాది మాయా కల్పనవల్ల యీ పరిచ్ఛిన్న భేదములుగల యీ దృశ్య, స్ఫురణమంతయు తోచుచున్నది. ఈ విషయమునే:-

"విశ్వంపశ్యతి కార్య కారణతయా స్వస్వామి సంబంధతః।
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః।
స్వప్నేజాగ్రతివా యయేష పురుషో మాయా పరిభ్రామితః।"

ఈ దృశ్య పరిచ్ఛిన్న భేదములన్నియు మాయా పరిభ్రమితములని శ్రీశంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. కాన ఈ మాయ అను అనాది అవిద్యను నివృత్తి చేసుకొనిన యడల భేదమనునదే యుండదు. పరిచ్ఛిన్న భేదములు కల్పితములు. అపరిచ్ఛిన్న అభేదము, అనగా అద్వితీయ అఖండ

త్వము వాస్తవము. నేను—సాక్షి- ప్రత్యగాత్మ -శివః—శాంతః-నేను స్వజాతీయ, విజాతీయ—స్వగత—భేదరహిత నిత్య నిరతిశయ అసఙ్గ, అద్వితీయ, సర్వాధిష్ఠాన స్వప్రకాశ పరిపూర్ణ శుద్ధ చైతన్య స్వరూపుడను. నిరవయవుడనగుటచే నాకు కర్తృత్వాదులు సంభవింపవు. నేను నిష్క్రియుడను—అచలుడను—అని ముముక్షువు బాగుగ తన సత్యస్వరూపమును గ్రహించి, యిప్పుడు తన స్వరూపముగా స్ఫురించుచున్న యీ సైంధవ ప్రతిమను స్వప్రయత్నముతో, తన సత్యజ్ఞానానంత లక్షణమైన స్వస్వరూపమను, నిస్తరంగ మహాసముద్రమందు యుంచిన—అనగా నిరంతర స్వస్వరూప అనుసంధానాదులను సలుపుచుండ, వేరు ప్రయత్నమవసరములేకయే తన యిప్పటి స్వరూపముగా స్ఫురించుచున్న యీ సైంధవ ప్రతిమ తనంత తానుగనె తన వాస్తవిక స్వస్వరూపమైన సత్యజ్ఞానానంద మహాసాగర స్వరూపము నొందును. ఇదియే అఖండ, అద్వితీయ, పరిపూర్ణ, చైతన్యానుభవము. ఈ స్థితియే నిస్సంకల్పమైన శాంత స్వరూపము. ఇదియే మోక్ష సామ్రాజ్యము. దీనినే "సంశాంత సంకల్పకలంక ముక్తచిత్తః,స్వస్థస్సు రాజ్యమిదంప్రశాధి"సంశాంతమై సంకల్పరహితుడవై యీ రాజ్యమును సుఖముగా అనుభవింపుము అని వశిష్ఠ భగవానులు శ్రీరామచంద్రమూర్తికి చెప్పుచున్నారు. కాన ఇట్టి స్వరూపమే అహం, నేను, అని తెలిసికొని తన వాస్తవ స్వరూపము దృశ్యరహిత, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, అఖండ పరిపూర్ణ శుద్ధ చైతన్యముగాని వేరుగాదనియూ, యిదియే తన సత్యస్వరూపము జ్ఞాన స్వరూపము అని తెలుసుకుని తన వాస్తవ స్వరూపమైన యీ జ్ఞానమే సర్వాధిష్ఠానమైనదని ఈ విధమున:—అనగా

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం ।
చిదేవ భువనత్రయం ।
చిదేవ పంచభూతాని । సర్వం చిదిహనాన్యథా॥

అని సర్వదా తన అఖండ, పరిపూర్ణతను అనుసంధానము చేయుచుండవలయును—ఇట్లు అహం అను తన వాస్తవ స్వరూపమును తెలుసుకుని అనుసంధానము చేయుచుండుటయే యీ వివేక ప్రయోజనము—

ఈ అహం ప్రత యమును గురించి యింతవరకు విమర్శించి యుంటిమి—కాని యిపుడు మరియొక విధముగా విచారించుదము—యెంత విమర్శించి నిరూపించినను ఈ అహం అను విషయముయొక్క వాస్తవ స్వరూపమును గ్రహించి అనుభవమును పొందుట శాస్త్రపారంగతులైన వార లకు గూడ దుస్తరముగా నున్నది. లోకమునందు యీ సమస్త దృశ దుఃఖమంతయును యీ అహం—నేను అను విషయమును బాగుగ తెలిసికొన జాలనందున కలుగుచున్నది. ఎట్లనిన విచారింతము—సమస్త లోక వ్యవహా రములు, అనుభవములు యీ ఒక్కటియైన"అహం" నేను అను ప్రత్యయము వల్ల, కలుగుచున్నవి. ఈ ఒక్కటియైన అహం అను ప్రత్యయమునే ప్రతి యొక్క జీవియు నేను, నేను, అహం అని యీ ఒక్కటియైనదానినే వివిధ భాషలలో వివిధ నామభేదములచే యుపయోగించుకొనుచు సర్వులును తమ అనుభవములను పొందుచున్న విషయ మందరకును స్పష్టమే. అనగా సంస్కృత భాషలో "అహం" అని ఆంధ్రములో "నేను" అని, ఆంగ్ల ములో "ఐ" (I) అని, తమిళములో "నాన్" అని, హిందీలో "మై", "హం" అను మొదలుగాగల పరా యి పదములచే సర్వజీవులును యీ యొక్క అహం పదార్థమునే వాడుకొనుచు, వారివారి అనుభవములను పొందు చున్న విషయముగూడ అందరకున్ను తెలిసినదే. దీనినిబట్టి యీ ఒక్కటి యైన అహం పదార్థమునే సర్వ వులు వారివారి భాషలలో న్నభిన్న పదము లతో వ వహరించుచు అనుభవించుచున్నారనియే కదా తేలుచున్నది. గనుక సర్వ వులకు సమానార్థమును, సమాన అనుభూతిని కలిగించుచు అనుభవింప బడుచున్న యీ అహం పదార్థము ఏకవస్తువా లేక న్న న్నములా యని విమరి ంచిన యీ శబ్దార్థమునుబట్టిగాని, వివిధ వానుభవములనుబట్టిగాని యీ అహం అనునది సర్వులకు యేకార్థమునేయిచ్చుచు, ఏకరూపమైన యనుభవమునే యిచ్చుచున్నది కాని యీ అహం అను పదమునకు మరియొక అర్థముకాని, మరియొక అనుభవము కాని యెవ్వరికిన్ని కలుగుటలేదు. ఇట్లు కాలత్రయమునందున సర్వ వుల తను ఏకరూపముతో ఏకమైన ఒక్క అర్థ

ముతో సమాన స్వభావము కలిగి అనుభవింపబడుచున్న యీ "అహం" పదార్థము ఒక్కటియే అని చెప్పుట యుక్తముకాని భిన్న భిన్నములని చెప్పుట యుక్తముగా కనబడుటలేదు. ఎట్లన ఒక్కటియైన సువర్ణము కటక, కంకణ, కిరీట, కుండలాద్యాభరణములకు వాడుకొనుచు, వివిధ నామ రూపములతో వ్యవహరించుచున్నను అట్లు వాడబడిన సువర్ణమంతయు యేక రూపమై ఒక్కటిగ నున్నట్లును, మృత్తు ఒక్కటియైనను ఘట, శరావాదు లుగ వ్యవహారమున వాడబడుచున్నను సర్వదా మృత్తు ఒక్కటియే యైన ట్లును, యీ ఒక్కటియైన "అహం" పదార్థమునే సర్వజీవులును వివిధ నామ రూపములతో అనుభవమును పొందుచున్నారని చెప్పక తప్పదు. కాన వ్యవ హార దశలో యీ అహం పదార్థము వివిధ నామరూపములతో అనుభవించు కాలములో జీవుడు తన వాస్తవ 'అహం' స్వరూపమును భ్రాంతియుతుడై తన సత్యస్వరూపమును మరచి కేవల నామరూపములతో వ్యవహరించుచు, అట్టి నామరూపములే తను అనగా అహం, నేను అని నమ్మి యీ దృశ్య దుఃఖమును పొందుచున్నాడు.

అనగా జీవుడు యీ పరిచ్ఛిన్న హస్తపాదాదులుగల శరీరముగాని, లేనిచో కొంచెము వివేకియైన యెడల తను అనుకొను యీ పరిచ్ఛిన్న జడ రూపమైన అంతఃకరణ రూపమగు సూక్ష్మ శరీరమునే తాను అనగా అహం, నేను అని తెలుసుకొనుచున్నాడు. గాని యీ రెంటినిగూడ భ్రాంతియుతుడై అభిమానించుచు తనలోనే, ప్రత్యగాత్మ యొకడున్నాడనియు, ఆయనయే పరమాత్మ యనియు, ఆయనకు యిట్టి పరిచ్ఛిన్న శరీరోపాధులతో యెట్టి వాస్తవ సంబంధము లేకపోయిననూ జీవుని అనాది అవిద్యచే శరీర సంబం ధము కలిగినవానివలె మనలకు తోచుచున్నదనియు, యిదియే వ భ్రాంతి యని గ్రహించవలెను. ఇట్టి భ్రాంతిని పురుషుడు తన నిత్యానిత్య వివేక ప్రయత్నములచే తెలుసుకొని త్యజించిన యెడల తన సత్యస్వరూపము స్ఫురించి తనకు యిప్పుడు కలుగుచున్న కర్తృత్వాదులు, దృశ్య దుఃఖ ములు అభాసములని తోచును అనగా యివి వాస్తవములుకావు. మనస్సు

పొరబడుట- అనగా అజ్ఞానులమై యీదుఃఖాదులను పొందుచున్నామని తోచక తప్పదు. ఏలనన తానుగానిదానిని తను అని అనుకొనుటగాని, తనది కాని దానిని తనది యనుకొనుటకన్న అజ్ఞానము, పొరపాటు యేమియుండును. కాని యిట్టి పొరపాటు మనలకు యెట్లు కలుగుచున్నదని విచారించిన, యీ యబోవు విచారణయొక్క అంశములు సర్వులయనుభవములో నున్నవే గాన వాటినే మనము అనుభవయుక్తి పూర్వకముగ బాగుగ విచారించిన, యీ నేను 'అహం' అను ప్రత్యయముయొక్క వాస్తవ స్వరూపము తెలియగలదు. ఎట్లన — ప్రతి మానవుడును యెప్పుడో యొకప్పుడు నా దేహము నేడు సరిగాలేదు అని గాని, లేనిచో నేడు నా మనస్సు యేమి బాగులేదనిగాని, లేక నా మనస్సుకు నేడు యెక్కడ ని ఆనందము కలిగినదనిగాని, లేక నా అంతఃకరణము పరితపించు చున్నదను మొదలగు ప్రయోగములను మనము వాడుచు మన యనుభ వములను గురించి వ్యవహరించుచున్నాము గదా—ఇట్టి అనుభవములను మనము బాగుగ వివేచనచేసి చూచిన యెడల నా దేహము, నా అంతఃకర ణము, నా మనస్సు అనునప్పుడు నాయొక్క దేహము, నాయొక్క అంతః కరణము, నాయొక్క మనస్సు అనియేగదా అర్థము, అట్లయినచో నాబల్ల, నాపెట్టె, నా తిరగ్ర యనుసంతటి అర్థమేకదా యగుచున్నది. ఇట్టి సమా నార్థము కలుగుచున్నప్పుడు తనది యనుకొను చేతికర్రగాని, పెట్టెగాని, బల్ల గాని తానసుటకు యెట్లు సంభవముకాదో, అట్లే నాయొక్క దేహము, అంతః కరణము మనస్సు అన్నియు తాను కాజాలదుకదా. ఇది సర్వులకును తెలిసిన విషయమే. అయినను జీవుడు తన అనాది భ్రాంతి జ్ఞానముచే తాను కానట్టి దేహాదులనే తాను "అహం" అని వ్యవహరించుచు సర్వదుఃఖములను పొందు చున్నాడు. కాని యీ బల్ల, పెట్టె, కర్ర మొదలగువానిని నావి యనుకొను కర్తలాగుననే యీ దేహాదులు నావి యనుకొనుచున్న కర్తయొకడుండి ర వలయును కదా యనిన అట్టి జీవుడు యున్నాడు. అట్లనుకొను జీవుడే అభా సుడు. భ్రాంతియుతుడు. ఇప్పుడు మనలకు కలుగుచున్న యీ వ ఆభాస

జ్ఞానమును జీవుడు తన నిత్యానిత్య వివేక ప్రయత్నములచే తన భ్రాంతి జ్ఞానమును తొలగించుకొని "అహం" నేను అను జీవుడైన తన వాస్తవ స్వరూపమును తెలుసుకొనవలయును. ఇట్టి జీవునియొక్క వాస్తవ స్వరూపమును "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనియు "తత్త్వమసి" ఆ బ్రహ్మ నీవు అనియు శ్రుతిమాతయైన ఉపనిషద్వాక్యములు మనలకు తెలుపుచున్నవి. గాన జీవుని వాస్తవ స్వరూపము శ్రుతిస్మృతులు మనలకు అద్వితీయ పరిపూర్ణ అఖండ వస్తువని చెప్పుచుండగా మన యనుభవమునుబట్టి కూడ యీ నేను-అహం అను పదార్థము ఒక్కటియైన ఏక పదార్థమనియే నిశ్చయమగుచున్నది. అయిననూ జీవుని అజ్ఞానముచేత తన పరిపూర్ణ అఖండత్వమును గుర్తించలేక భ్రాంతివశుడై యీ పరిచ్ఛిన్న జడోపాధులే తానని నమ్మి సంసార దుఃఖమును పొందుచున్నాడు.

కావున మానవుడు కొంచెము శాస్త్రదృష్టితో నిత్యానిత్య వివేకముచే తాను, అనగా నేను ఎవరు, నా వాస్తవ స్వరూపమెట్టిది, యని గురు ఈశ్వరానుగ్రహముతో విచారించి యిప్పుడు తాను అనుకొను యీ నామరూప, పరిచ్ఛిన్న దేహోపాధులు తాను కాననియు, అయినను తాను చేసిన తన అనాది అవిద్యా కామకర్మాదుల ఫలముచే యీ వుపాధి కల్పితముగా తనకు సంప్రాప్తమైనదనియు, తనకు యిప్పుడు ప్రాప్తమైన యీ శరీరోపాధులు తన ప్రారబ్ధ కర్మ ఫలానుభవమునకు మాత్రము యీ వుపాధి తనకు వచ్చినదని తెలుసుకొనవలయును. ఇట్లు తెలుసుకొని తన కర్మ ఫలానుభవకాలమందు తన యుపాధితోను యీ ఉపాధి ధర్మములైన కర్తృత్వభోక్తృత్వాదులతోను తనకెట్టి సంబంధము లేదని తెలుసుకొని నిశ్చయించుకొని కర్మ ఫలానుభవమును యథాప్రాప్తముగ నిరభిమానియై యనుభవించుచుండిన యట్టి యనుభవము, కర్మలు, తనకు భావి ప్రతిబంధము కలిగించజాలవు. ఏలనన తన వాస్తవ స్వరూపమును బట్టి యీ అంతఃకరణ ధర్మ, కర్మములకు తాను కర్త కాదు గదా-కర్తకాని వానిని కర్మ బంధింపజాలదు. ఇదియే తనకు పరమ లాభము. ఇట్లు తెలుసుకొన్న జ్ఞానము స్వానుభవము పొందుటకు తన సత్యస్వరూపమును

తాను వల సాక్షి, ప్రత్యగాత్మ, శివః, శాంతః, అని తెలుసుకొని నేను, అహం—నిత్య, నిరతిశయ, దృశ రహిత, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, సజాతీయ విజాతీయ స్వగత భేదరహిత, అసంగ, అఖండ, పరిపూర్ణ చైతన్య మని సదా అనుసంధానము చేయుచు, యింకను అహం అను తన సత్య స్వరూపమును యెట్లు తెలుసుకొనవలయు ననిన అహం, నేను వాస్తవముగ సంవిత్. మహాస్ఫటిక మహాశిలవంటి వాడను, అచలుడను-స్వప్రకాశుడను-నాకు గమనాగమనములు, క్రియాచరణలును లేవు-నేను నిష్క్రియుడను-అసంగుడను-అయిననూ నా యొక్క యీ కల్పితాంతఃకరణ ధర మలు నా యందు ప్రతిఫలించి ఆ అంతఃకరణ కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు నావిగా తోపింపబడుచున్నవే గాని వాస్తమున నాకు యీ గమనాగమ నములతోగాని, కర్తృత్వాది క్రియలతోగాని, రాగద్వేషములతోగాని, సుఖ దుఃఖములతోగాని దేహధర్మములయిన క్షుత్పిపాసాదులు జనన మరణములతో గాని నాకెట్టి వాస్తవ సంబంధమును లేదు. యథార్థమున యీ ధర్మ ములన్నియు జడోపాధులైన శరీరధర్మములుగాని నాకు సంబంధించినవి కావు. ఇవి యన్నియు నా భ్రాంతి కల్పితములే గనుక అట్టి భ్రాంతిని నా యథార్థ స్వరూపజ్ఞానము చేతనే నశింప జేయవలయును. గాని వేరు మార్గము లేదు. భ్రాంతి యనునది అయథార్థజ్ఞాన సంస్కారముచే మనసుకు కలుగు వికారమే కాని వేరుకాదు. కాన యిప్పుడు నా సత్య స్వరూపజ్ఞానముచే నా మనస్సు సంస్కరించుకొనిన నా సత్యస్వరూపమును నేను తెలుసుకొనగలను. ఇట్టి సత్యస్వరూపమును స్వానుభవమును పొందుటే పరమ పురుషార్థము, మోక్షము అగుచున్నది.

## అహంకార వివేచన

అహంకారమనగా నేను, నాది యనుకొనుట. అహంకారుడు అను శబ్దమునకు అర్థము నేను. ఇట్లు అహం, నేను అనుకొనుచునే సర్వ వులును సర్వవ్యవహారములు చేయుచున్నారు. ఈనేను అను ప్రతీతి లేనిదే ప్రపంచమే

యుండదు. ఈనేను అనునది జీవుని జన ప్రభృతి వెంబడించుచు -వుని మోక్ష పర్యంతము ఉండును. ఈనేను అనువాడు యెవడు అని బాగుగ విచారించిన యెడల మిథ్యయేయగును. అయిననూ ఈనేను అను ప్ర తి లేనిది లోక వ్యవహారము జరుగుటగాని, జీవుడు మోక్షప్రాప్తి నొందుటకుగాని వీలు కాదు. ఈనేను అనునది యున్నది యనుటకు పరమార్థతః వీలులేదు. లేదనుటకు వ్యవహారతః వీలులేదు. అట్లనుటకు వీలునుకాదు. కాని పర్యవసానముగ ఈనేను అను అహం పదార్థమును మాయలాగున లేనిదేయని చెప్పుటకు వీలు లేదు. ఏలనన ఈ అహం నేను అనుప్ర -తి వుడును, చిదాభాసుడును కలసి అన్యోన్యాధ్యాసచే అనుకొనుచున్నారు. ఇందు జీవుడు నిత్యుడు, వాస్తవుడు. చిదాభాసుడు కల్పితుడు, భ్రాంతియుతుడు. నేను అను ప్ర తిలో వీరిద్దరును యున్నారు. కాని ఇద్దరుగా ప్ర తిని పొందుటలేదు. ఎందుచే ననగా నిజము విచారించిన యిందు ఒక్కడే వాస్తవుడు, నిత్యుడు, రెండవవాడు అనాది అవిద్యాభ్రమ కల్పితుడు, అనిత్యుడు. ఈ కల్పితుని భ్రాంతి ధరా ధ్యాసమునే వాస్తవజీవుడు పొంది నటుల మనకు కనబడుచు సర్వదృశ్య సంసారమును కలిగించుచున్నాడు. సర్వ వ్యవహారములు ఈ వీరిరువురి కలియిక అనగా అధ్యాసచేతనే కలుగుచున్నవి. "ఇదం" ప్ర -తిలో లాగుననే "అహం" నేను అనుప్ర -తిలో గూడ సతా-నృతములు మిధునీకృతమై, యీనేను అనుప్ర -తి సర్వులకును యొకేవిధముగా కలుగుచున్నది. ఇందు అధిష్ఠానము, నిర్వికార అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపుడైన ఆత --అధ్యస్తము, వారివారి అనాది అవిద్యాకామకర ఫలముల ననుభవించుటకు కల్పితమైన భిన్న, న్న వివిధ వోపాధులు. ఈ వోపాధులన్నియు నేను, నేను అనుప్ర తి తోడనే వ్యవహరించుచున్నవి. ఇట్లెందువల్లననగా సర్వ వోపాధులకు అధిష్ఠానము ఒక్కటియే గనుక. ఎట్లన చలన చిత్రములయందు సదా ఒక్కటియైన శ్వేతాంబరపటమునందు చీకటిలో అనేక శబ్దచలన చిత్రములు కనబడుచు, దీపప్రకాశము వచ్చిన వెంటనే యెట్లివియన్నియూ లేనివే యగుచున్నవో అట్లే ఈ వుల అజ్ఞానమను చీకటి యున్నంతకాలము న్న న్న యుపాధు

లతో చిత్ర విచిత్రానుభవములను పొందుచు సంసార చక్రమున భ్రమణము చేయుచుందురు. వీరిలో యొకానొక సుకృతజీవుడు అనేక కోటి జన్మ పుణ్య ఫలమున జ్ఞానమను ప్రకాశమును పొంది వాస్తవమైన తన అధిష్ఠాన స్వరూపము గోచరించి స్వానుభవము పొందుటవలన మోక్షప్రాప్తిబడయును. బాగుగ విచారించిన యెంతకాలము యెంతమంది జీవులచే అనుభవింపబడు చున్నదైనను యీనేను అనుప్రతీతి యొక్క వాస్తవిక అర్థము ఎల్లప్పుడును యొక్కటిగానే కనపడుచున్నది. ఎవరైననూ నేను అనునట్టి వారి అనుభవము చూచిన ప్రతివారును సర్వదృశ్యమును నిషేధించుచూ, తనను తాను మిగుల్చు కొని గుర్తించుచున్నాడు. అనగా ప్రతియొక్క జీవియు తనను తెలుసుకొను టకు సర్వదృశ్య నిరాకరణము చేయుచు సర్వ జీవులును ఈ యొక్క ఆత్మ పదార్థమునే నేను అని గుర్తించుచు, స్మరించుచు వారివారి ఆత్మ యందే అనగా తనయందే పరమప్రీతిని పొందుచున్నాడు. కాని జీవునికి తనయందు అట్టి పరమ ప్రీతి తన సత్యస్వభావముచే తన యందే పొందుచున్నను ఈజీవుడే తన అనాది అవిద్యా మహిమచే అధ్యాసవలన అజ్ఞానముచేత భ్రాంతి రూపమైన పరిచ్ఛిన్నో పాధియే తానని నమ్మి మోసపోవుచు తన జీవ కర్తృత్వాద్య మానములతో సంసారదుఃఖమును నేను అనుప్రతీతితో అనుభవించుచున్నాడు. ఈ అనాది భ్రాంతి మహిమచే జీవుడు తన సత్యస్వరూపమును గుర్తించలేక, తన సత్య స్వరూపాజ్ఞానముచే భ్రాంతుడగుచున్నాడు. ఇట్టి అనాది భ్రాంతివలన తన భ్రాంతి కల్పితాంతఃకరణోపాధితో తన సంబంధము వాస్తవము కాదని తెలుసుకొనలేకున్నాడు. జీవుడు తన స్వప్రయత్నముచే యీ సంబంధములు యుపాధి ధర్మములు, తనకు వాస్తవము కాదు యని, తెలుసుకొనిన యెడల, యీ కల్పితోపాధి ధర్మములు తనను వాస్తవముగ బాధించక తనకు యీ జ్ఞానమే మోక్షసాధనమగును.

ముముక్షువు తరణోపాయ బోధకుగాను యోగవాసిష్ఠమందు యీ అహం కారమును రెండు విధముల తెలుపుచున్నారు. ఒకటి సదహంకారమనియు, రెండవది దురహంకారమనియు చెప్పుచున్నారు. సదహంకారమనగా నేను

తాను వాస్తవముగ సర్వాధిష్ఠాన సత్ స్వరూపుడని, తనకు యీ అంతః
ధర ములతో ఎట్టి సంబంధములేదు అని తెలుసుకొని స్వానుభవమునకు
అనుసంధానాదులను చేయుచుండుట. రెండవది తన యీ స్వశ ర
ఃకరణ జీవధర ములు కల్పితములని తెలుసుకొని వాటిని జ్ఞాన పూర్వక
సతతాభ్యాసములచే త్యజించుట. ఇట్లు చేయుచు తన దురహంకారమును
పూర్వకముగ త్యజించి సదహంకారమును తాను అనగా నేను అని తనను
జ్ఞాన స్వరూపునిగా తెలిసికొనుటయే జీవునికి సాక్షాన్మోక్ష ప్రయత్నమగును.
: "అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః । అహంకారా ధా
హ కల్ప్యతే సతు వాస్తవి"-యని శాస్త్రము తెలుపుచున్నది. కాన నాకు
న్నడు పరిచ్ఛిన్నోపాధులుగా దృశ్యానుభవముల నిచ్చుచున్న యీ స్థూల
్మ శరీరములు నేను కాను వాస్తవమున వీనితో నాకెట్టి సంబంధమున్నూ
. "అహం" నేను అనుకొను ప్ర తికి వాస్తవికార్థము ఏమన, ప్రతి
ు హృదయ పుండరీకమున, ప్రత్యగాత్మగా సర్వాత్మ పరమాత్మలు తాను
యుండి, స్వప్రకాశమై, సర్వాధిష్ఠానమై, సర్వాంతర్పరిపూర్ణమై,
ంగమై, దృశ్యరహితమై,సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమై, త్రివిధ
చ్ఛిన్న రహితమై, జగదుత్పత్తి, స్థితి, లయములకు వివర్తకారణమై,
మై, నిర్వికారమై, నిరతిశయమై, నిరవయవమై, నిష్క్రియమై, అద్వి
అఖండ పరిపూర్ణ చైతన్యముగా యే సద్వస్తువయున్నదో అదియే
అనునదికాని తన శరీరాదులు కావని సంశయ రహితముగా తెలిసి
వలయును. ఇంకను నేను అను తన వాస్తవ స్వరూపము కేవల జ్ఞానము
జ్ఞాతృజ్ఞేయములు కావు అనిన్నీ, తను, స్వప్రకాశ, నిత్య, నిర్వికార,
ల, మహాకాశములాగున చిదాకాశ స్వరూపుడననిన్నీ, తన సత్య స్వరూ
ు సంవిద్రూప పరిపూర్ణ మహాస్ఫటికశిల వంటిదనిన్నీ తాను సర్వగత
ి, అచల స్థిర స్వరూపుడనని, "అహం" నేను అను ప్రతీతికి వాస్తవి
మని, నిశ్చయముగా తెలిసికొనవలయును.

---

# ప్రత్యగాత్మ నిరూపణ

లోకములో ఒక వస్తువును తెలిసికొనుటకుగాని, పొందుటకుగాని దానికి సంబంధించిన సన్నిహిత వస్తువునాశ్రయించి ఆ వస్తువును పొందటకుగాని, తెలిసికొనుటగాని జరుగుచున్న విషయము అందరియనుభవములోనున్నదే. కనుక మనము పొందవలసిన బ్రహ్మ జ్ఞానముకొఱకు గూడ మనలోనున్నట్టి సత్యవస్తువునాశ్రయించి యిట్టి జ్ఞానమును పొందవలసియున్నది. ఇట్టి సత్పదార్థము ప్రత్యక్షముగ మనలోనే యున్నట్లు శ్రుతి—

"సయఏషోఽన్తర్హృదయఆకాశః, తస్మిన్నయం పురుషోమనోమయః, అమృతోహిరణ్మయః" అని ఆ బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూపముగ అందరి హృదయాకాశాన్తరమందు నున్నాడనియు, ఆయన అమృతుడనియు, తేజోరూపుడనియు చెప్పుచున్నది. ఆయనయే ఆత్మ. దీనినే శంకరభగవత్పాదులు—

శ్లో॥ స్వప్నప్రపంచో రవిణా సభాస్యతే నైవానలాద్యైర్నచ చక్షురాదిః।
ప్రత్యక్ప్రకాశేన విభాతిసర్వం ॥

అనగా స్వప్నమందలి ప్రపంచము సూర్యునిచేతగాని, అగ్న్యాదుల చేతగాని చక్షురాదుల చేతగాని భాసించక, కేవలము ఆత్మ ప్రకాశముచేతనే సర్వము భాసించును అని తెలుపుచున్నారు. అనగా – ఆ ప్రత్యగాత్మ వల్లనే యీ సర్వదృశ్యము ప్రకాశించుచున్నదని భావము. ఈయనయే సర్వాన్తర్బహిర్వ్యాపకమైన ఆ బ్రహ్మ. ఈ ప్రత్యగాత్మ స్వరూపమున అందరి హృదయాకాశములయందుసుండి ప్రకాశించుచు తెలియబడుచున్నాడు. కనుక ఈయన స్వరూపమును బాగుగా గ్రహించనివారలకు ఈ ప్రత్యగాత్మ పరమాత్మలు ఒక్కటేయని గ్రహించి స్వానుభవమును పొందుట అసాధ్యము. కనుక ఈ వివేక గ్రహణములు చాలా ఆవశ్యకములు. అదియెట్లనిన – మనలకు బాహ్యమందు లోకభాస్కరుడున్నట్లుగనే, అందరి అంతరమందు చిద్భాస్కరుడున్నాడు. మనము ఏలాగున పరిమితాకారమైన సూర్య

బింబమును ప్రతియొక్కరును వివిధ ప్రదేశములయందు చూచుచు ఈయన యొక్కడే సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయు ఒక్క సూర్యుడని యెట్లు గ్రహించుచున్నామో, అలాగుననే యీ ప్రత్యగాత్మను వాస్తవ స్వరూపముతో ఎవరి హృదయమందు వారు గ్రహించి ఈయనయే ఆ బ్రహ్మ. ఆ బ్రహ్మయును, ఈ ప్రత్యగాత్మయైన నేనున్ను ఒక్కటియెయని తెలిసికొని అనుభవము పొందవలసి యున్నది. ఇదియే శ్రుతిమాత ముఖ్యతాత్పర్యము. ఇదియే జీవబ్రహ్మైక్యము. ఇచట ఐక్యమనగా — రెండు పదార్థములను చేర్చుటకాదు. కాని రెండున్ను ఒక్కటియేయని తెలిసికొనుట. ఉన్నది ఒక్క వస్తువేగాని రెండవదిలేదు. "ఏకమేవాద్వి యం బ్రహ్మ" అని శ్రుతి తెలుపుచున్నది. కనుక మనము లోకములో బాహ్యమందు అనేక సూర్యబింబములను చూచుచున్నను సూర్యుడు ఒక్కడేయని యెట్లు తెలిసికొనుచున్నామో అట్లె యీ ప్రత్యగాత్మ పరమాత్మలొక్కటియెయనిన్నీ, ఆ యొక్కటియే సత్యమనిన్నీ, అదియే నేను (అహం) అనిన్నీ గ్రహించవలెను. అహం అను ప్రత్యయములో సత్యపదార్థ స్వరూపుడు ఈ ప్రత్యగాత్మయేగాని తక్కినవేవిన్నీ కావు. అందుచేతనే యీ ప్రత్యగాత్మను మనము భాగత్యాగలక్షణముచే గ్రహింపవలెనని పూర్వాచార్యుల వచనములన్నియు తెలుపుచున్నవి. ఇట్లు భాగత్యాగలక్షణముచే ఒక నిశ్చయమునకు వచ్చినను ఈ ప్రత్యగాత్మ (చిద్భాస్కరుడు), లోక భాస్కరునిలాగున అందరకున్ను తెలియబడుటలేదే ? అనుశంకతోచును. కాని యీశంక సరియైనదికాదు. ఎందుచేతననగా—లోకభాస్కరుడు జాత్యంధులగు వారికి అగపడుటలేదు. మేఘాదులావరించినపుడు ఆ ప్రదేశములోని వారందరికిన్నీ సూర్యదర్శనమగుటలేదు. ఈ రెండుస్థితులు లేనప్పుడె లోకభాస్కరుడైనను మనలకు అగపడుచున్నాడు. అట్లే మనము ఈ చిద్భాస్కరుని చూడవలెనన్న మేఘావరణములాగుననే తమకున్న అజ్ఞానావరణమును తొలగించుకొని అజ్ఞాన దృష్టిని అంధత్వమును తొలగించుకొని జ్ఞాన దృష్టితో తెలిసికొనువారందరికిన్నీ ఈ చిద్భాస్కరుడైన ప్రత్యగాత్మ అగపడును. ఈయన అన్నిటికంటెను, అందరికన్నను

మనలో ప్రతియొక్కరికిన్ని అతిసన్నిహితుడుగనున్నాడు. దీనినే —"యత్సాక్షా దపరోక్షాద్బ్రహ" ఈ ప్రత్యగాత్మ యెల్లప్పుడును మన యనుభవములోనున్నా డనిశ్రుతి తెలుపుచున్నది. కాని—మనము వివేచనజేయకున్నందున ఆయనను గ్రహించుటలేదు. ఎట్లనగా — ఈ దృశ్యమంతయు జ్ఞానమునందధిష్ఠితమై, అజ్ఞానజడమై భాసించుచున్నది. దీనినే గీతాచార్యులు "అజ్ఞానే నావృతం జ్ఞానం", అని చెప్పుచున్నారు. అజ్ఞానము అంధకార రూపము. ఈ యజ్ఞాన మను కప్పును నివేసినగాని మనకు సత్యము భాస్యముకాదు. మనలోని అన్తః కరణము జడము. అందుకుగాను మనలోనున్న ఈ ప్రత్యగాత్మ యే అన్తః కరణము ద్వారా సమస్త పదార్థములను మనలకు భాసింపజేయుచున్నాడు. ఇదిగాక లోకభాస్కరుడైన సూర్యుడు మనలకు బాహ్య ప్రకాశమునే యిచ్చు చున్నాడుగాని అన్తర ప్రకాశమునీయజాలడు. ఈ ప్రత్యగాత్మ చిద్భాస్క రుడు గనుక మనలకు బాహ్యాన్తర ప్రకాశములను సదా ఇచ్చుచున్నాడు. ఎట్లనగా— చీకటిలోనున్న మనుష్యుడు నేనున్నానని తననున్ను, తనచుట్టు చీకటి యున్నదని తన బాహ్యమందున్న చీకటినిన్ని యీ ప్రత్యగాత్మ ప్రకా శము తన తెలిసికొనగలుగుచున్నాడు. ఇదిగాక జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడు దశలయందును ఈ ప్రత్యగాత్మయొక్కడే సమానముగానుండి ఆయా యవస్థలయందు జ్ఞానాజ్ఞానములను గ్రహించుచున్నాడు. ఎట్లనగా - సుషుప్తి నుండి లేచినవాడు"ఏతావన్తంకాలం సుఖమహమస్వాప్సం, నకించిదహమవేది షమ్" అని, అనగా — నేనింతకాలము సుఖముగ నిద్రించితిని. నాకేమియు దెలియలేదు అని చెప్పుచున్నాడు. సుషుప్తికాలమందు అన్తఃకరణముగూడ అజ్ఞా నమందులయమగుచున్నది. ఆసుషుప్తి కాలమందుండునది యీ ప్రత్యగాత్మ యొక్కటేకాని, మరేదియులేదు. జాగ్రతగలిగిన తరువాత తన జ్ఞాన సుఖ స్వరూపానుభవమును మూలాజ్ఞానమును రెంటిని స్మరించుకొనుచున్నాడు. దీనివల్ల ఈ ప్రత్యగాత్మ అవస్థాత్రయములోనున్న అబాధితుడై మనలో నుండి జ్ఞాన ప్రకాశములనిచ్చుచున్నాడని సులభముగ గ్రహించవచ్చును. చీకటిలోనున్న ఘటము నేనున్నానని చెప్పుటలేదుగద! ఈ తెలివియే ప్రకాశము.

ఇట్లు తెలిసికొని ఆయన అనగా — ఈ ప్రత్యగాత్మ మనలోనున్నాడని నిశ్చయించి ఆయన వాస్తవ స్వరూపమే తానుగా గ్రహించవలెను. కాన నీప్రత్యగాత్మ మనలకు కనబడుటలేదని శంకకు అవకాశములేదు. ఈ ప్రత్యగాత్మ (చిద్భాస్కరుడు)లోకభాస్కరునిలాగున ప్రత్యక్షాదులకు గోచరుడుకాడు. ఐనను ఆయన వాస్తవస్వరూపమును తానుగా తెలిసికొని నిశ్చయించి అనుభవరూపఫలపర్యన్తము దీర్ఘకాలానుసంధానముజేయగా ప్రతిబంధ నివృత్తియై తత్స్వరూపమును పొందును. ఈ ప్రత్యగాత్మ జ్ఞానస్వరూపుడు. జ్ఞానము తెలియబడునదికాదు. తెలిసికొనునది జ్ఞానము. అది తెలియబడునది గాని, తెలిసికొనే కర్తగాని అగుటకు వీలులేదు. శ్రుతి సత్యవస్తువు ఒక్కటియే యున్నది. తదితరమంతయు అసత్యము, భ్రాంతిజన్యము అని తెలుపుచున్నది. కనుక నితరమును తెలిసికొనుట భ్రాంతి జ్ఞానమేయగును. ఐనను ముముక్షువగు సాధకునకు ఈ కల్పితధీవృత్తి చేతగాక, ఈ ప్రత్యగాత్మ పరమాత్మ స్వస్వరూపము తానుగా తెలిసికొనుటకు వేరుశరణ్యములేదు. ఈయన జ్ఞాన స్వరూపుడు. తెలియబడుటకు వీలుకానిదగుటచేతనే జిజ్ఞాసువగు సాధకునకు ఈ బ్రహ్మను తెలిసికొన్నానన్నను తప్పే. ఎందుచేతననగా— ఈయన తెలియబడువాడుకాదు. కనుక దీనినే శ్రుతి "యత్రాన్యోన్య త్పశ్యతి తదల్పం" అని చెప్పుచున్నది. తెలియదనిన్ని తెలియలేదనిన్ని నిశ్చయించితిమేని, అప్పుడు సాధనముగ శ్రవణాదులను బోధించు "ద్రష్టవ్య శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతి వాక్యమునకు సార్థక్యము లేక పోవును. కనుక ఈ శబ్దార్థమును గౌణముగ భావించి సాధనకొరకు ముముక్షువైన సాధకుడు తదనుభవ లాభమును కోరుచు సత్య స్వస్వరూప స్థిత్యవగతి పర్యన్తము నిరన్తరానుసన్ధాన సమాధ్యభ్యాసములను చేయవలెను. ఈ మార్గ మిట్టిదిగనుకనే శ్రుతి-"క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గంపథస్తత్కవయో వదన్తి" అని యీ మార్గక్లిష్టతనుచెప్పి, మరియు "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్" ఈ ఫలము ధీరుడైన ఏ యొక్కనికో కలుగుచున్నదని చెప్పుచున్నది. ఇంకను జిజ్ఞాసువైన సాధకుని యనుభవమును—

ఇట్లు తెలిసికొని ఆయన అనగా — ఈ ప్రత్యగాత్మ మనలోనున్నాడని నిశ్చయించి ఆయన వాస్తవ స్వరూపమే తానుగా గ్రహించవలెను. కాన నీప్రత్యగాత్మ మనలకు కనబడుటలేదని శంకకు అవకాశములేదు. ఈ ప్రత్యగాత్మ (చిద్భాస్కరుడు)లోకభాస్కరునిలాగున ప్రత్యక్షాదులకు గోచరుడుకాడు. ఐనను ఆయన వాస్తవస్వరూపమును తానుగా తెలిసికొని నిశ్చయించి అనుభవరూపఫలపర్యన్తము దీర్ఘకాలానుసంధానముజేయగా ప్రతిబంధ నివృత్తియై తత్స్వరూపమును పొందును. ఈ ప్రత్యగాత్మ జ్ఞానస్వరూపుడు. జ్ఞానము తెలియబడునదికాదు. తెలిసికొనునది జ్ఞానము. అది తెలియబడునది గాని, తెలిసికొనే కర్తగాని అగుటకు వీలులేదు. శ్రుతి సత్యవస్తువు ఒక్కటియే యున్నది. తదితరమంతయు అసత్యము, భ్రాంతిజన్యము అని తెలుపుచున్నది. కనుక నితరమును తెలిసికొనుట భ్రాంతి జ్ఞానమేయగును. ఐనను ముముక్షువగు సాధకునకు ఈ కల్పితధీవృత్తి చేతగాక, ఈ ప్రత్యగాత్మ పరమాత్మ స్వస్వరూపము తానుగా తెలిసికొనుటకు వేరుశరణ్యములేదు. ఈయన జ్ఞాన స్వరూపుడు. తెలియబడుటకు వీలుకానిదగుటచేతనే జిజ్ఞాసువగు సాధకునకు ఈ బ్రహ్మను తెలిసికొన్నానన్నను తప్పే. ఎందుచేత ననగా— ఈయన తెలియబడువాడుకాదు. కనుక దీనినే శ్రుతి "యత్రాన్యోన్య త్పశ్యతి తదల్పం" అని చెప్పుచున్నది. తెలియదనిన్ని తెలియలేదనిన్ని నిశ్చయించితిమేని, అప్పుడు సాధనముగ శ్రవణాదులను బోధించు "ద్రష్టవ్య శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతి వాక్యమునకు సార్థక్యము లేక పోవును. కనుక ఈ శబ్దార్థమును గౌణముగ భావించి సాధనకొరకు ముముక్షువైన సాధకుడు తదనుభవ లాభమును కోరుచు సత్య స్వస్వరూప స్థిత్యవగతి పర్యన్తము నిరన్తరానుసన్ధాన సమాధ్యభ్యాసములను చేయవలెను. ఈ మార్గ మిట్టిదిగనుకనే శ్రుతి-"క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గంపథ స్తత్కవయో వదన్తి" అని యీ మార్గక్లిష్టతనుచెప్పి, మరియు "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మా న మైక్షత్" ఈ ఫలము ధీరుడైన ఏ యొక్కనికో కలుగుచున్నదని చెప్పుచున్నది. ఇంకను జిజ్ఞాసువైన సాధకుని యనుభవమును——

# శరీరత్రయ వివేచన

ఈ బ్రహ్మ విద్యానుసంధాన మనునది తన స్వరూపమైన బ్రహ్మ ప్రాప్తికి అనుష్ఠించవలసిన ఒక ప్రక్రియ. ఈ ప్రక్రియ ఎట్టిదనగా—బ్రహ్మ జిజ్ఞాసువు తన సత్యస్వరూపమును బాగుగా గుర్వీశ్వరానుగ్రహములద్వారా శ్రుతి యుక్త్యనుభవ పూర్వకముగ తెలుసుకొని దాని స్వానుభవమును పొందుటకు అనేక విధములుగా, అనగా తనకు గ్రహణదార్ఢ్యతలు కలుగు విధమున మననాదులు చేయుచుండవలయును. ఇట్లు చేయుటలో ముముక్షువునకు దృశ్యానుభవములు భిన్నభిన్నముగా కలుగుచుండును. ఇందులో మొట్టమొదటిది తన శరీరానుభవము. దీనిని గురించి శాస్త్రము పలువిధముల ఇది మిథ్యయని చెప్పినను శాస్త్రీయ స్వానుభవ యుక్తితో గూడా తను విచారణ చేయుటచేత అంతఃకరణకు సిద్ధాంత దార్ఢ్యము అధికము కాగలదు. అందుకుగాను మనము యీ క్రింది అనుభవ విషయములను విచారణ చేయుదము. ప్రతి మనకున్నూ స్థూల సూక్ష్మకారణ శరీరములని మూడు శరీరములున్నవని శాస్త్రము చెప్పుచున్నది. ఐనను సూక్ష్మ శరీరమైన అవిద్యా విలయముతో అంతఃకరణము గూడా నశించునుగాన దీనికి వేరు ప్రయత్నము అక్కరలేదు.

శ్లో॥ స్థూలస్త్వన్నమయో దేహస్సూక్ష్మ స్స్యాద్వాసనామయః ।
మూలాజ్ఞానం యత్తదేవ శరీరంకారణాభిధమ్ ॥

శ్లో॥ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన శక్త్యైవ బ్రహ్మ విద్యతిః ।
నాశయేత్కారణం దహ మకుర్వన్ కించి దంతరమ్ ॥

అనగా ఈ అన్నవికారమైన దేహము స్థూలము. వాసనారూపమైనది సూక్ష్మ దేహము. మూలాజ్ఞానమే కారణ దేహము. బ్రహ్మాత్మైకత్వవిజ్ఞాన శక్తితోనే యీ కారణ శరీరమును యతి నశింపజేయగనే అంతఃకరణము గూడ విలయమగును. దీనికి వేరు ప్రయత్నమవసరములేదు.

"కారణస్యాపి సూక్ష్మస్య వినాశేసతి వర్ష్మణః" (వినాశః)

అని శంకర భగవత్పాదులు కారణ శరీరముతోపాటు అంతఃకరణము గూడ నశించునని తెలుపుచున్నారు. గాన ఇచట స్థూల సూక్ష్మ శరీరములను గురించియే విచారణమావశ్యకము. ఇందులో మొదటి రెండు శరీరములైన స్థూల సూక్ష్మములు నశించునవి. ఆత్మ యొక్కటియే సత్యమని శాస్త్రము చెప్పుచున్నది. గాన మన యనుభవముచే గూడ విచారించుదము. పైన చెప్పిన స్థూల సూక్ష్మ శరీరములలో ప్రతివారి స్థూల శరీరము మనమెంత జాగ్రతగా రక్షించిననూ మన ప్రయత్నములేకయే కాల పరిణామములను పొంది ఆ జీవుని ప్రారబ్ధాంతమందు ఈ శరీరము నశించుచున్నది. దీనికి ప్రయత్న మక్కరలేదు. దీనిని ఆపుటకు ఎంత ప్రజ్ఞావంతులకైనను సాధ్యమగుటలేదు. ఇది అందరకును ప్రత్యక్షమే. ఈ స్థూల దేహము నిరపరాధి, జడము. స్వతః ఏమి చేయునదియూ గాదు. కాష్ఠతుల్యము. ఐననూ దీని సమస్త వ్యాపారములు సూక్ష్మ శరీరమైన అంతఃకరణ సారథ్యముచే జరుపబడుచున్నవి. గనుక ఈ స్థూల శరీరము మనలకు ప్రారబ్ధానుగతమైన దేహయాత్రా నిర్వహణమునకే పనికి వచ్చునదిగాని, అంతకన్న మనకెక్కువ ఉపయోగపడుట లేదు. ఇదిగాకనూ ప్రతి జీవునకు ఏ జన్మ స్థూల దేహము (ఉపాధి) ఆ జన్మాంతమునందే నశించుచున్నది. గాన దీని నాశమునకు మనము చేయవలసిన ప్రయత్నమేమియున్నిలేదు. కాని ఈ స్థూలోపాధి సారథ్యమును జరుపుచున్న సూక్ష్మ శరీర (అంతఃకరణ)మట్లు నశించుటలేదు. కాని శాస్త్రము ఈ యన్తఃకరణోపాధి గూడ జడమనియు, నశించునదనియు చెప్పుచున్నది. ఈ యన్తఃకరణము జీవత్వముతోపాటు అనాది అవిద్యవల్ల సంప్రాప్తమై జీవునితో మోక్ష సంప్రాప్తి పర్యంతముండి నశించును. గనుక ఈ యంతఃకరణము, అనగా సూక్ష్మ శరీరమును పోగొట్టుకొనుట, అనగా త్యజించుట ప్రతి జీవునకు అతి ప్రయత్న సాధ్యముగాని, స్థూలోపాధిలాగున సులభముగా తనంతటతాను విడిచిపోవునదికాదు. గాన విద్వాంసుడు దీనిని గురించి పరిపరి విధములుగా విచారణచేసి దీని అవాస్తవికతను తెలుసుకొని జ్ఞానపూర్వకముగా త్యజించిన యెడల మనకు కృతార్థత కలుగును గాని వేరువిధము లేదు. దీనినే—

శ్లో॥ అంతఃకరణ సం త్యాగాదవశిష్టే చిదాత ని ।
అహంబ్రహ్మేతి వాక్యేన బ్రహ్మత్వం సాక్షిణీక్షతే ॥

అని విద్యారణ స్వామి తెలుపుచున్నారు. ఐనను బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి ఈ యన్తఃకరణమునే సంస్కృతము గావించి మనము ఫలప్రాప్తి పర్యంతము దీనినే ఆశ్రయించి చిత్తశుద్ధి ద్వారా బ్రహ్మానుభవమును పొంద వలసి యున్నది. గాన ఈయంతఃకరణ స్వరూపమును మనము బాగుగా గ్రహించి ఉపయోగించుకొనవలసి యున్నది. ఇందుకుగాను—

శ్లో॥ బ్రహ్మణ్య జ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రపేక్షతే ।
స్వయం స్ఫురణ రూపత్వాన్నాభాస ఉపయుజ్యతే ॥

అని కూడా విద్యారణ్యముని తెలుపుచున్నారు. గాన ముముక్షువునకు యీ యన్తఃకరణమెట్టిది ? దీనినుపయోగించుకొనుటెట్లు ? అను విచారణ ఆవశ్యకము. సూక్ష్మశరీర మన్నను, అంతఃకరణమన్నను, జీవత్వమన్నను, ఆభాసమన్నను, కించిద్భేదములున్ననూ, మొత్తముమీద ఇవి యన్నియు ఒక్కటియే. మొట్టమొదట ఒక్కటిగాయున్న సత్పదార్థమునందే మాయా ప్రభావమువల్ల పరిచ్ఛిన్నత్వములు కల్పితములై వీని అవిద్యాకామ కర ల కర్తృత్వభోక్తృత్వములకుగాను ఏర్పడిన కల్పిత సూక్ష్మోపాధి యీ యంతఃకరణము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములన్నియూ ఈ యంతఃకరణ పరిణామములు. పైన తెల్పినవిధమున ఈ యంతఃకరణము మాయా ప్రభావముచే అనాదికల్పితమై కర్తృత్వ భోక్తృత్వములను కల్పించుచూ కర్మఫల భోగార్థమై అనేకోపాధులను గ్రహించుచు ఆ ప్రారబ్ధఫలాంత మందాయుపాధిని విడచి ఆయా జన లయందు సంపాదించిన కర ఫలానుభవముకొరకు మరల మరల ఉచ్చనీచోపాధులను గ్రహించుచూ సముద్రములో పడిన ఎండు సొర కాయ బుర్రలాగున ఆ యొడ్డుకును యీ యొడ్డుకును కొట్టుకొనుచు జన పరం పరలననుభవించుచూ తన అవిద్యా నాశము అనగా మోక్షప్రాప్తి పర్యంతము ఈ సంసార మహాసముద్రమున నోలలాడుచు యుండును. దీని స్వరూపము

పరిచ్ఛిన్నము (ఏకదేశి), జడము (దుఃఖము) ఐయున్నది, ఇదియంతయు భ్రాంతి ప్రభావము. ముముక్షువైనవాడు దీనియొక్క, అవాస్తవికతలను గ్రహించి తన సత్యస్వరూపమును (అనగా మరచినదానిని) తిరిగి తెలుసుకొని అనుభవములోనికి తెచ్చుకొనుట, పొందుటయేగాని మరియేమియు కొత్తదిగాని, లేనిదానిని సంపాదించుటగాని కాదు. ఇట్లు పరిచ్ఛిన్నావృత జడదుఃఖరూపమై, ఆభాసమై, ఏ జన్మకు ఆ జన్మలో నేను నాది అను అహంకార కర్తృత్వా మానియై ఆ జన్మ ప్రారబ్ధాంతమందు పుత్ర, కళత్ర, విత్త, క్షేత్రాదులను ఎట్లున్నవి అట్లువిడచి తనయొక్క అవిద్యాకామకర్మ ఫలములయందు అభిమానియై, తిరిగి కర్తృత్వభోక్తృత్వములను కల్పించుకొని తత్ఫలభోగార్థమై మరియొక యుపాధిని ఉచ్ఛనీచ వివక్షతలేక గ్రహించుచూ, అంధపాంథునిలాగున ఈ సంసార సముద్రమున ఈదులాడు ఈ సూక్ష్మోపాధియైన అంతఃకరణమును మనము సత్యమైనదానినిగా నమ్మి వ్యవహరించుట ఎంత అవివేకముగానున్నదో గ్రహింతురుగాక — కాని దీనిని త్యజించుట ఎట్లు? సంభవమా? అను సందేహము కలుగక మానదు. ఇది పురుష ప్రయత్న సాధ్యముగాని, దానియంతట అదియే స్థూలోపాధిలాగున విడచునదికాదు. దీనిని, దీని సత్యాసత్యతలను బాగుగా విచారణచేసి జ్ఞాన పూర్వకముగా త్యజించవలసినదేగాని వేరు దారిలేదు. ఇందుకుగాను ముముక్షువు ఉపనిషద్వాక్య శ్రవణమువల్ల పరమార్థ సత్య లక్షణములను బాగుగా గ్రహించి అట్టి లక్షణములకు ఈ సర్వదృశ్యమును తాను అని వ్యవహరించు అంతఃకరణమున్ను ఎంతవరకు ఆ లక్షణములకు వర్తించునో చూచుకొనవలయును. కాలత్రయ, అవస్థాత్రయ, అబాధిత వస్తువు సత్యము — తదితరమంతయు ఆభాసము, అసత్యము, మిథ్య యని శాస్త్రము మనలకు తెలుపుచున్నది. గాన ఎట్లు చూచినను ఈ యంతఃకరణము సుషుప్త్యవస్థయందు ఎవరికిన్నీ గోచరించుటలేదుగదా! దీనిని గురించి లోగడ విపులముగా తెలిపియుంటిమి. ఇదిగాకను కర్తృత్వాద్యభిమానములు తనకు వాస్తవములే ఐన యెడల ఏ జన్మలో తాను సంపాదించిన పుత్ర, మిత్ర, క్షేత్ర, కళత్ర, విత్తా

దులను తన స్థూలోపాధి సహితముగ విడిచి వెళ్ళునా ? ఇది అందరకున్ను ప్రత్యక్షమేగదా ! నాది అనుకొను తన సమస్తమును అవియున్నంతకాలమైనను తాను యుండుట లేదుగదా ! ఇట్లు ఎందులకు జరుగుచున్నది, దీని వాస్తవమేమిటియను విమర్శ విద్వాంసున కావశ్యకమేగదా ! అందుకుగాను ఈ యన్తఃకరణ లేక సూక్ష్మోపాధి చర్యలనుబట్టి చూడగా ఇది కల్పితమైన దనిన్నీ దీని కర్తృత్వాదులు కూడా కల్పితములుగాని వాస్తవములుగావని తేలుచున్నది. ఎందుకన ఈ కర్తృత్వము వాస్తవమైన యడల ఏ కర్త యున్నూ తన ఆస్తిని అన్యులపాలుజేసి పోడుగదా ! గాన ఇట్టి కర్తృత్వాదులు తాత్కాలికానుభవ కల్పితములుగాని, వాస్తవములుగావు. దీనినే ఈ యంతఃకరణ పరిణామమైన అహంకారమును గూర్చి "అహంకారా ధాయాసా కల్ప్యతే నతువాస్తవీ" అని వసిష్ఠ వచనము తెలుపుచున్నది. ఈ యహంకారము కేవల కర ఫలాధీనమై యున్నది. నేను, నాది అనుకొను అహంకారము తన సుకృతదుష్కృత ప్రారబ్ధకర్మఫలముండునంతవరకే యీ కర్తృత్వాదులు కనబడుచున్నవిగాని ఆ వుపాధితో అనుభవించవలసిన ప్రారబ్ధఫలము రిన వెనుక ఒక్క క్షణమైననూ ఈ కర్తృత్వాదులుండుటలేదు. ఈ నేను అనుకొను అహంకారుడు కేవలము పరాధీనుడుగా యున్నాడు, గాని స్వతంత్రము కనబడుటలేదు — ఏలయన తాను ఉండదలచినంత కాలము యుండలేకుండ యున్నాడు — లేక తాను నాదియనుకొను పుత్ర, కళత్ర, విత్తాదులను తాను యుండినంతకాలమైననూ నిలుపుకొనలేక యున్నాడు. తనదనుకొను గృహమును కట్టించినంత కాలమైనను తను ఉండుటలేదు. ఇట్లే తనదనుకొనుచు అతి ప్రీతిగా తలంపబడుచున్న పుత్రకళత్రాదులు తన ముందే నశించుచున్నారు. ఎంత ప్రయత్నము జేసియు నిలుపుకొనలేక యీ నేను అను అహంకారుడు ఉన్నాడు. ఈ యహంకారుడు కేవల వాసనాప్రయుక్తుడై కర ఫలానుభవమును పొందుటకుగాను యేర్పడిన కల్పితోపాధి. దీనినిబట్టి చూడ నేను అనుకొను తనస్థితి ఎంత పరాధీనముగా నున్నదో వివేకులు గ్రహింతురుగాక. ఇట్టి దుఃఖాదులను వుడు పొందకుండుటకే శ్రుతిమాత

మనలకు అనేక వచనములతో ఈ దృశ్య అసత్యత్వమును — మనయొక్క స్వస్వరూపమును గురించి చెప్పుచున్ననూ మనలకు విశ్వాసము కలుగుటలేదు. కాన మనము తెలుసుకొనవలసినది యేమన — మనలకు స్ఫురించు ఈ యహంకారము వాస్తవము కాదని తెలుసుకొని, తదుపరి ఇట్టి యహంకారములు రెండుగా నున్నవియని శాస్త్రముచే గ్రహించవలెను, ఇందొకటి సదహంకారము, రెండవది దురహంకారము. మొదటిది సత్యము. రెండవది అసత్యము, కల్పితము. ఈ రెండవ అహంకారమే అంతఃకరణ సంయుక్తమైనది — ఆభాసముగాన దీని మిథ్యా స్వరూపమును బాగుగా విచారణచేసి తెలుసుకొని ఈ యవాస్తవమైన రెండవ అహంకారము నేను అహం కాననిన్నీ, నేను అనుకొను మొదటి అహంకారుడైన తన సత్యస్వరూపమునకు కర్తృత్వాదులు లేవు అనిన్నీ కల్పితములనిన్నీ గ్రహించి ఇట్టి కర్తృత్వాద్య మానములను వదలి తన దేహయాత్రాభారమును మాత్రము యథా ప్రాప్తముగా వ్యవహరించుచు, ప్రారబ్ధ ఫలమును నిర మానముగా అనుభవించుచుండిన ఈ రెండవదియైన అంతఃకరణ అహంకారుని బలము కాలక్రమముగా క్షీణించును. అప్పుడు తన వాస్తవ స్వరూపమైన మొదటి అహంకారముతో తన సత్యస్వరూపమును స్వానుభవ పర్యంతము అనుసంధానము చేసుకొనవలసియున్నది. ఇట్లు అనుసంధానము జేసుకొనుచున్న "త్ర వేగానామాసన్నం" అను సూత్రమునుబట్టి తన అనుసంధాన ప్రీతి నిశ్చయ త్రవతలతో ప్రారబ్ధ ప్రతిబంధాంతమున తన స్వరూపము గోచరించి నేను అను ఈ మొదటి అహంకారముకూడ నశించి కేవలతత్స్వరూపము తానుగానే యగును. ఇట్లు నిత్యానిత్య వివేక వివేచనతో తన సత్యస్వరూపమిట్టిదియని తెలుసుకొని స్వానుభవమును పొందుటే తత్వజ్ఞానము. జిజ్ఞాసువునకు మోక్ష ప్రాప్తికి వైరాగ్యము, బోధ, ఉపరతి, అను నీ మూడునూ యావశ్యకమైయున్ననూ అందు జిజ్ఞాసువునకు బోధ అనగా జ్ఞానము; యనిన తత్వజ్ఞానమే యీ మూడింటియందునూ ముఖ్యమైనదనిన్నీ సాక్షాత్సాధనమనిన్నీ విద్యారణ్య స్వామి ఈ క్రింధివిధమున తెలుపుచున్నారు:—

శ్లో॥ తత్త్వబోధః ప్రధానం స్యాత్సాక్షాన్మోక్ష ప్రదత్వతః ।
బోధోపకారిణౌ వేతౌ వైరాగ్యో పరమా వుభౌ ॥

అనగా 1. వైరాగ్యము, 2. బోధ, 3. ఉపరతి అను నీ మూడింటిలో తత్త్వబోధ మోక్షమును గలుగజేయును, గనుక ముఖ్యము. తక్కిన రెండును తత్త్వబోధకు సహాయకారులగును.

శ్లో॥ పూర్ణేబోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా ।
మోక్షో వినిశ్చితః కింతు, దృష్ట దుఃఖం న నశ్యతి ॥

అనగా తత్త్వజ్ఞానము పూర్ణముగానుండి వైరాగ్యోపరతులు లేని యెడల మోక్షము తప్పక కలుగును. కాని వను క్తి సుఖము గలుగనేరదు. ప్రారబ్ధమువలన గలుగు దుఃఖము నశింపదు.

ఇట్లుగాక వైరాగ్యంబును ఉపరతియు పూర్ణముగానుండి తత్త్వజ్ఞానము లేకపోయిన యెడల మోక్షముకలుగదని మరియొక్క శ్లోకములో గూడ చెప్పియున్నారు.

గాన యిట్టి తత్త్వజ్ఞాన సంపాదనకు, శరీరత్రయ వివేచన బాగుగా చేసిన, తన సత స్వరూపము గోచరించును — ఇదియే పరమలాభము.

---

# వాసనా నిరూపణ

ఈ వాసనా స్వరూపమును గురించి యితర నిరూపణములలో కొంత చెప్పబడినను వుడు నిత్యసుఖమును పొందుటకు ఈ వాసనా నిరూ లనమే అతా వశ కముగాన తిరిగి ఇచటగూడ విచారింతము. ఈ వాసనలు వుల యందు రెండువిధములుగ నుండును. ప్రబుద్ధవాసనలు, సుప్తవాసనలు అ.

వాటిలో ప్రబుద్ధవాసనలు అనుభవమువల్ల తెలియుచునేయుండును. కాని సుప్తవాసనలు అట్లు తెలియబడక నీటియందు బుడగయున్నట్లుండును. అనగా- బుడగ నీటిపైకి వచ్చువరకు తెలియబడక నీటిలోనేయుండును. కనుక ఈ సుప్తవాసనలను కనిపెట్టుట కష్టసాధ్యము. ఐనను జిజ్ఞాసువగువాడు సూక్ష్మబుద్ధితో వాటిని కనిపెట్టి మోక్షసిద్ధికి ఇట్టి ప్రబుద్ధసుప్త వాసనల రెంటిని నిర్మూలించవలెను. ఇందు మొదటిదైన ప్రబుద్ధవాసనలో శుభవాసనలనియు, అశుభ వాసనలనియు రెండువిధములు. శుభవాసనలు శాస్త్రానుకూలమై యుండునవి. అశుభవాసనలు కేవలలోకవాసన ననుసరించి యుండునవి. "నలోకః పారమార్థికః" అను న్యాయము ననుసరించి పరమార్థము గోరునట్టి ముముక్షువు ఈ లోకవాసనలను శాస్త్రవాసనలచే జయించి, యీ శాస్త్రవాసనలను గూడ తత్త్వవాసనచే జయించవలెను. ఈ తత్త్వ వాసనాదార్ఢ్యము సతత తత్త్వానుసంధానములేనిదే కలుగదు. మనమీలోకమునందనుభవించు సమస్త దుఃఖములకు వులయొక్క యీ అనాది వాసనలే ముఖ్యకారణము. సర్వ ప్రయత్నముల చేతను ఈ వాసనా తాగమును ముముక్షువైనవాడు చేయవలసి యున్నది. దీనినే యోగవాసిష్ఠములో-

శ్లో॥ అశేషేణ పరిత్యాగో వాసనానాంయ ఉత్తమః ।
మోక్ష ఇత్యుచ్యతేసద్భి స్సఏవ విమలక్రమః ॥

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచమలినా తథా ।
మలినా జన నో హేతు శ్శుద్ధా జన వినాశ ॥

అజ్ఞాన సుఘనాకార ఘనా హంకారశాలినీ ।
పునర్జన కరీ ప్రోక్తా మలినావాసనా బుధైః ॥
పునర్జన్మా ఙ్కురాం స్త క్త్వా స్థితా సంభృష్ట జవత్ ।

అనగా సంపూర్ణముగ వాసనలను పరిత్యజించుటయే మోక్షమని విద్వాంసులు చెప్పుదురు. అట్టి వాసనలు శుద్ధవాసనలనియు, మలినవాసనలనియు రెండువిధములు. మలిన వాసన మరల జన కు కారణమగును. శుద్ధ

వాసన జన్మలను తొలగించును. అజ్ఞాన వికారరూపమైన దృఢాహంకారముతో గూడినదియే పునర్జన్మమునిచ్చు మలినవాసన. పునర్జన నిచ్చు శక్తి నశించగా అగ్ని తప్తమగు జమువలె నుండునది శుద్ధవాసన. ఇట్టి శుద్ధవాసన గలవారికి మరల జన యను అనర్థము ఉండదు అని వసిష్ఠ భగవానులు చెప్పుచున్నారు.

ఈ వాసనా సంస్కారములు వివిధ -వులయందు వివిధములుగ అనాదిగ ఉన్నవి. ఎట్లనగా - అప్పుడే అండమునుండి వెలుపలకు వచ్చిన (అనగా జని ంచిన) కోడి-బాతు పిల్లల ప్రవృత్తిని చూడగా ఈ సంస్కారవాసనా దార్ఢ్యమెంత చిత్రముగనుండునో తెలియును. పుట్టిన వెంటనే కోడిపిల్ల మట్టి ప్రోవుల మీదికి వెళ్లి వెదకును. బాతుపిల్ల పుట్టిన క్షణముననే సమీపమున నున్న నీటిలోనికి పరుగెత్తి వెళ్లి వెదకును. ఆ నీరును చూచిన కోడిపిల్లకు మరణతుల్యమగును. బాతు పిల్లలకు ఆహ్లాదముగనుండును. నీరు ఒక్కటే యైనను వుల యొక్క వాసనా భేదములచే సుఖదుఃఖములు కలుగుచున్నవి. సర్వులు పరమఏహ్యముగ జూచు అమేధ్యము వరాహమునకు పరమప్రీతి దాయక మగుచున్నది. ఇట్టి ప్రీతి భక్షణములు ఎట్టివారికైనను మృష్టాన్నము నందుగూడ కలుగుటలేదని ఊహించవచ్చును. సర్పగరళము న్న న్న కాలములలో న్నభిన్న ప్రయోగములచే అమృతము, విషమునగుచున్నది. మత్స్యాహారము కొందరికి పరమప్రీతిని, మరికొందరికి పరమాసహ్యమును కలిగించుచున్నది. ఒక్క స్త్రీయే కుమారునకు తల్లియని పూజ్యభావమున కును, తండ్రికి కూతురని వాత్సల్యభావమునకును, భర్తకు భార్యయని శృంగార భావమునకును విషయమగుచున్నది. ఈ భావములను బట్టి ఆ యొక్క స్త్రీయే తల్లియని, కూతురని, భార్యయని, ఉదాసీన యనియు వ్యవహరింపబడుచున్నది. ఇట్లే వ్యాఘ్రాది క్రూరజంతువులు గూడ వాటి యందు మనకు గలుగుచున్న అనుకూల ప్రతికూల జ్ఞానములను బట్టి ప్రీతిని, భయమును, ఉపేక్షను కలిగించుచున్నవి. ఇట్లే నిర్జీవమైన మణి సువర్ణాదుల యందుగూడ వారివారి వాసనలనుబట్టి అనుకూల ప్రతికూల ఉపేక్షాజ్ఞానములు, సుఖదుఃఖాద-నుభవములు కలుగుచున్నవిగాని వాస్తవముగ ఈ సుఖదుఃఖా

ద్యనుకూల పరిణామము లెవ్వియు వస్తువులయందు కనిపించుటలేదు. వారి వారి వాసనాబలముచే అనుభవించువారి సుఖదుఃఖములు ఈ పదార్థ సంయోగ వియోగములచే కలుగుచున్నవి.

ఈ వాసనలకు ముఖ్యకారణము మనస్సుచే చేయు సంకల్పములే. ఈ సంకల్పములు వాసనా సంస్కారములకు బీజములు. ఈ వాసనలు గ్రామ ఫోను రికార్డులయందు మాట - పాటలయొక్క శబ్ద ధ్వని సంస్కారములు అణగి యున్నట్లుండును. మనస్సు ఛాయాపటమును తీయు యంత్రము వంటిది. శుభ సంకల్పమునుగాని అశుభ సంకల్పమునుగాని చేసిన వెంటనే యీ మనస్సునందు ఛాయా రూపమున ఒక సంస్కారమేర్పడుచున్నది. ఇది అనుభవమువల్లగాని నశించదు. కాన ముముక్షువు సర్వ ప్రయత్నములచేతను వాసనామూలమైన సంకల్పములను, వాటి పరిణామమగు అనుకూల ప్రతికూల జ్ఞానములను ఇవి కల్పితములుగాని, వాస్తవములు కావని తెలిసికొని అట్టి వాసనా జాలమును, సంకల్పములను నిర్మూలనము గావించుకొన్నచో అప్పుడు ఈ ప్రపంచములోని యెట్టి వస్తువుల చేతగాని, కర్మల చేతగాని సుఖదుఃఖా దులు కలుగక సర్వసమత్వబుద్ధి కలుగును. ఈ సమత్వబుద్ధియే సమ్యక్ జ్ఞాన మునకు ద్వారము. ఈ సమ్యక్ జ్ఞానమే బ్రహ్మ స్వరూపమని ముముక్షువు గ్రహించవలెను.

ఈ వాసనా మూలములగు సంకల్పముల కాశ్రయమైన మనస్సు నీటి సరస్సువంటిది. ఇందులో నొకానొక సంకల్పమను బీజము పడినప్పుడది కొలదికాలమందులోనే యుండి కాలాన్తరమున అంకురించుచుండును. ఇట్లు అంకురించి పైకి వచ్చినవే ప్రబుద్ధ వాసనలు. అంకురించకయున్న సంకల్ప బీజము లెప్పటికైనను అంకురించును. ఇట్టి సంకల్ప బీజములంకురించకుండ నుండవలెనన్న, నెప్పుడు చేయు సమస్త కర్మలను కర్తృత్వాభిమానమును త్యజించి చేయవలయును. ఇట్టి కర్మలు కర్తృత్వాభిమానము తనకు లేక పోవుటచే తనను బంధింపనేరవు. ఇట్లు కర్మలను చేయుటయే కర్మ కౌశలమని

"యోగః కర్మసు కౌశలమ్" అను గీతావచనము చెప్పుచున్నది. కాన ముముక్షు వైనవాడు సర్వకర్మలను అహంకార సక్తతారహితముగ నాచరించవలయును. ఐతే ఇట్లాచరించుట బహుకష్టసాధ్యము. కాని యిది తప్ప వేరు దారిలేదు. ఇట్లు వాసనా రహితముగ కర్మలజేయుటకు దృఢ తత్త్వజ్ఞానము కావలసి యున్నది. అది యెట్టిదనగా-'భాసించు సర్వదృశ్యమును మిథ్య. నేను అను నొక్క పదార్థమే సత్యము. అది నిత్యము కర్తృత్వాది రహితమైన బ్రహ్మ స్వరూపము. తదితర మంతయు ఆభాసమే గాని, వాస్తవముకాదు' అనునదే ఈ జ్ఞానము-లోకజ్ఞానమును శాస్త్రజ్ఞానముచేతను, శాస్త్రజ్ఞానమును దృఢ తత్త్వజ్ఞానము చేతను బాధించినగాని-కలుగదు. శాస్త్రజ్ఞానముచే సద్వాసన లను సంపాదించినను అద్వైత సిద్ధాన్త గ్రహణము మనో నిశ్చయము లేనిదే సిద్ధించదు.

మనము చేయు సర్వకార్యములలో కేవల శరీరాదులతో జేసిన క్రియలకన్న మనస్సుతో జేసిన క్రియలు ఎక్కువ ఫలవంతములుగా కనబడు చున్నవి. అట్టి క్రియలు మానసికనిశ్చలతను, ఏకాగ్రతను అపేక్షించు చున్నవి. ఈ మానసికైకాగ్రత, తత్త్వనిరూఢివల్లనే సులభసాధ్యము. కనుక మనము ప్రారబ్ధోచితమైన లౌకిక కర్మలను చేయుచున్నను వానితో పాటు కేవల కాయముతో ననుష్ఠించిన జపతపములకన్న మానసిక నిశ్చ యాను సంధానములకే ఎక్కువ ఫలమను విషయము ఈ క్రిందిగాథవల్ల నిశ్చితము కాగలదు.

ఒకప్పుడొక ఋషి తనయొక్క జపానుష్ఠానాదులను నిర్విఘ్నముగ సాగించుట కొరకు ఊరి బయటనుండు ఒకనది గట్టున ఆశ్రమమేర్పరచు కొని తన జపాదులను సలుపుచుండెడివాడు. ఇట్లు కొంతకాలము గడువగా ఆ నదికి ఆవలి గట్టున తనకు రహస్యముగను విజన ప్రదేశముగను నుండు నను తలంపుతో ఒక భక్తురాలైన స్త్రీ అచట తన గృహమును నిర్మించుకొని వసించుచుండెను. కాని యామెయొక్క కుల ధర్మము చొప్పున ప్రతి దినము

నామె కొరకు పలుమంది విటులు వచ్చుచుండిరి. ఆ విధముగ నామె జీవ యాత్ర గడపుచుండెను. ఐనను ఆమె భక్త శిఖామణి గావున భగవంతుడు తన కిది తప్ప వేరు వయాత్రా సాధనమును చూపలేదేయని సదాచింతతో (కృష్ణధ్యానవంతురాలై తన కులధర్మమును అనుసరించుచుండెను. ఈ దృశ్యమునంతయు నావలి యొడ్డుననున్న ఋషి పుంగవుడు ప్రతిదినమున జూచుచున్నవాడగుచు, ఇది పాపకార్యమని తన మనస్సులో దానినే తలంచుచుండెను. కాని-కాలక్రమముగ ప్రతిరోజునను ఇట్లు చింతించుచు ఆ వచ్చుబోవు విటులనే కాంచుచు ఇట్టి దుర్వృత్తివల్ల నామెకెట్టి నరకములు సంప్రాప్తమగునోయని చింతించుచు తన జపానుష్ఠానములను నిర్విఘ్నముగ సాగించుచుండెను. కాలాంతరమున వీరిద్దరును మరణాసన్నులైన సమయములో ఈ ఋషి పుంగవుని వమును యమభటులును, ఈ వేశ్యజీవమును విష్ణుదూతలును సికొని చనిరి. అప్పుడు ఈ ఋషి పుంగవుడు - నేను ఏకాకినై సదాజపతపములనే గావించినవాడను. నన్ను యమభటులేల గొనిపోవుచున్నారని యడుగగా - నీవు జపమును చేయుచున్నను సదా వ్య చారవృత్తి చింతలోనే మునిగియుంటివి. కాని యా భక్తురాలు సదా భగవద్ధ్యానములో నుండి వ భిచారవృత్తి నాచరించుచుండెను. ఇట్లాచరించిన దేహము లిప్పుడిరువురికిని లేవుగద ! ఇప్పుడున్న నీ మనః క్రియాఫలమును నీ వనుభవించవలెను గాని, దహన సంస్కారమును బొందిన నీ భౌతిక శరీర మిప్పుడెట్లు వచ్చునని యమభటులు నుడివి, ఋషి పుంగవుని యమపురికిం గొనిపోయిరి.

ఈ పైగాథవల్ల మనకు దృఢపడునదేమన - పరమార్థ విషయములలో సర్వకార్య ఫలప్రాప్తికి మనోవృత్తియే ప్రధానముగాని, కేవల దేహక్రియలు కావు. అని విశదమగుచున్నది. ఇప్పుడు మన యీప్సితము బ్రహ్మ విద్యానుసంధానము గద ! ఇట్టి బ్రహ్మ విద్యను సంప్రదాయానుసారముగ గుర్వీశ్వరానుగ్రహములతో గ్రహించి, అట్లు సంపాదించిన పరోక్షజ్ఞానమును అపరోక్షముగ పొందుటకు సతతానుసంధానము జేయవలసి యున్నది.

ఇట్లు చేయుటకు ఫలపర్యన్తము అన్తఃకరణాశ్రయము తప్ప వేరు శరణ్యము లేదు. ఐతే-అందలి ఈ యనాదివాసనాజాలము చిత్తవిక్షేపకారణ మగుచున్నది. అట్టి చిత్త విక్షేపక సంకల్ప వాసనలే ముముక్షువునకు ప్రధాన ప్రతిబంధము లగుచున్నవి. కాన నిట్టివిషయమును బాగుగ గ్రహించుటకు ఇచట కొంత అధిక నిరూపణమును చేయవలసియున్నది.

ముముక్షువునకు నిత్యనిరతిశయానంద బ్రహ్మప్రాప్తికి వాసనాక్షయ మనోనాశములే సర్వత్యాగరూపమైన సాధనమని వసిష్ఠ భగవానులు చెప్పు చున్నారు. ఇచట మనోనాశమనగా - విషయములయందు సక్తతను వదలు టయే గాని, మనస్సు యొక్క స్వరూపనాశము కాదు. వాసన యనగా-రాగ ద్వేషాదులకు కారణమగు విషయ సక్తత. దీనిని త్యజించక కేవల విషయ త్యాగము జేయువాడు విద్వాంసుడు కాడనిన్నీ, అది శాస్త్రీయ వైరాగ్యము కాజాలదనిన్నీ చెప్పుచున్నారు. కాని ఎవరు ఈ జగని ధ్యాత్వ నిశ్చయముతో ఆసక్తి రహిత వ్యవహారమును చేయుచుందురో వారు ఆత్మను తెలిసికొని తృప్తిని పొందగలరు. వారికి విషయాసక్తత, రాగద్వేషాదులు నుండవు. దీనినే—

శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యంకర్మ సమాచర ।
అసక్తోహ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః ॥

అనగా - విషయాసక్తుడుగాక, కర్మజేయువాడు పరమాత్మ స్వరూప మును పొందునుగాన, నీవుగూడ ఆసక్తిని వదలి కర్మా నుష్ఠానము జేయుము. అని భగవద్గీతావచనము తెలుపుచున్నది. కనుక సర్వప్రయత్నములచేతను వాసనాక్షయ సంపాదన మత్యావశ్యకము. అనగా- ప్రపంచానిత్యత్వా సత్యత్వ ములను శాస్త్రీయముగ గ్రహించి సర్వకార్యములను అహంకారా మాన రహి తుడై, అసక్తుడై, చేయుచుండవలయును. అట్టి జిజ్ఞాసువునకు ప్రారబ్ధ వశుడై చేయు ఎట్టి కార్యములైనను బంధహేతువులు కావు. అట్టి విషయాను భవము తత్త్వజ్ఞానమునకుగాని, బ్రహ్మానుభూతికిగాని విఘ్నకారికాదు. దీనిని

నిరూపించుచే శిఖిధ్వజోపాఖ్యానములో చూడాల భర్తకుజేసిన యుపదేశము. దీనిని సంగ్రహముగ ఈ క్రింది నిరూపణవల్ల గ్రహించవచ్చును.

శిఖిధ్వజుడను రాజు రాజ్యము జేయుచుండగా కొంతకాలమునకు రాజ్యభోగవిరాగము కలిగి, చిత్తవిశ్రాంతిని సంపాదింపదలచి యీ విషయమును తన భార్యయైన చూడాలకు జెప్పి రాజ్యమును వదలి వనమున గి తపస్సు నారంభించెను. ఆ చూడాల మహాతత్త్వవేత్త్రి, బ్రహ్మజ్ఞానవతి యగుటచే తనభర్త రాజ్యవిషయములను వదలినంత మాత్రముచే జ్ఞాన సంపన్నుడు గాజాలడనితలచి భర్తకు తత్త్వోపదేశముజేయు నుద్దేశ్యముతో కొంతకాలమునకు తానుకూడ కుంభుడను ఋషిపుత్రవేషముతో వనమునందు భర్త యున్నచోటికి వెళ్లినదాయెను. అప్పుడు శిఖిధ్వజుడు ఆమెను ముని పుత్రుడుగానే తలచి ఆసన పరిచర్యనిచ్చి యిట్లు పలుక నారంభించెను.

శిఖిధ్వజుడు : శ్లో॥ కేనాయంచాల్యతే దేహః కిం బీజం జన్మ కర్మణామ్ ।
కస్మిన్ త్యక్తే పరిత్యక్తం సర్వంభవతి సుందర ॥

ఓ మునిపుత్రా ! దేనిచేత ఈ దేహము కల్పింపబడుచున్నది ? జన్మ కర్మలకు మూలమైనదేది ? దేనిని విడచినయెడల సర్వత్యాగము సిద్ధించును ? అని యడుగగా–

కుంభుడు : శ్లో॥ చిత్తంవిద్ధి జగజ్జాలం బంధశ్చిత్త ముదీర్యతే ।
తస్మిన్ సాధో పరిత్యక్తే సర్వత్యాగోఽభవేదితి ॥

జగత్తు అనగా చిత్తమే. బంధముగూడ నదియే. దానిని విడచిన సర్వమును విడచుటయగును.

శ్లో॥ జన్మ నాంకర్మణాంవాపి చిత్తం బీజ ముదాహృతమ్ ।
పాదపః పవనేనేవ దేహశ్చిత్తేనచాల్యతే॥

జనన లకు కరణ లకున్ను చిత్తమే కారణము. వృక్షము వాయువుచే కదలింపబడునట్లు దేహము చిత్తముచేతనే ప్రవర్తింపజేయబడుచున్నది.

శ్లో॥ చిత్త త్యాగంవిదు స్సర్వ త్యాగం త్యాగవిదోజనాః ।
చిత్తేత్యక్తేలయం యాతిద్వైత మైక్యంచ సర్వతః॥

చిత్తత్యాగమే సర్వత్యాగమని అజ్ఞులు చెప్పుదురు. ఈ చిత్తమును త్యజించగా, ద్వైతమంతయును లయించి అద్వైతభావమేర్పడును.

శ్లో॥ శిష్యతేపరమంశాన్త మేకమచ్ఛమనామయమ్ ।
సర్వత్యాగః పరానందో దుఃఖమన్యత్సుదారుణమ్॥

అత్యంతశాంతము, ఏకము, స్వచ్ఛమునగు ఆత్మ స్వరూపమే మిగులును. ఇట్టి సర్వత్యాగమే ఉత్కృష్టానందము. ఇదికాక తక్కినదంతయు దారుణమైన దుఃఖమే అని తెలిపెను. అప్పుడు శిఖిధ్వజుడు మరల

శ్లో॥ చిత్తస్యాదౌ స్వరూపంమే యథావద్భగవన్వద ।
తతశ్చిత్త పరిత్యాగం వదమే వదతాం వర॥

మొట్టమొదట చిత్తస్వరూపమును నాకుజెప్పి, పిదప దానినివిడచు నుపాయమును జెప్పుము అని యనగా, కుంభుడు—

శ్లో॥ వాసనైవ సదారాజన్ స్వరూపం విద్ధి చేతసః ।
చిత్తశబ్దస్తు పర్యాయో వాసనాయా ఉదాహృతః ॥

వాసనయె చిత్తమని చెప్పబడును. చిత్తవాసనా శబ్దములు పర్యాయములు.

శ్లో॥ ఆహమర్థోదయో యోఽయం సర్వానర్థైకభాజనమ్ ।
ఏతచ్చిత్త ద్రుమస్యాస్య విద్ధి బీజం మహామతే॥

## వాసనా నిరూపణ

సర్వానర్థములకు మూల మహంకారమే. ఓ మహాత్మా ! చిత్తమను వృక్షమున కిదియే జమని గుర్తింపుము

శ్లో॥ ఏతస్మాత్ప్రథమోద్భిన్నాదంకురోఽనుభవాకృతిః।
నిశ్చయాత్మా నిరాకారో బుద్ధిరిత్యేవ సోచ్యతే॥

మొట్టమొదట ఉత్పన్నమైన ఈ యహంకారమను జమునుండి యుద్భవించిన యంకురము నిశ్చయాత్మకమైన బుద్ధిగా చెప్పబడుచున్నది.

శ్లో॥ అస్యబుద్ధ్య ధానస్య యాఽఙ్కురస్య ప్రపీనతా ।
సంకల్పరూపిణీ తస్యాశ్చిత్తం చేతోమనోఽ ధాః ॥

ఈ బుద్ధియను అంకురముయొక్క స్థూలావస్థయే సంకల్ప - చిత్త- చేతస్సు-మనస్సు అను పేర్లతో వ వహరింపబడును.

శ్లో॥ వాసనావివిధాశా ఖాః ఫలన్త్యోవివిధం ఫలమ్ ।
అభావితా భవన్తన్త ర్జ్ఞానా స్సవిద్భవేనవై ॥

వాసనారూపములగు శాఖలే సుఖదుఃఖాదిరూప నానావిధఫలములను కలిగించును. జ్ఞానబలము నాశ్రయించి వీటిని తిరస్కరించగా వానియంతట నవియే విచ్ఛిన్నములగును. ఈ శాఖలను ఛేదించుట ఎట్టివానికి సాధ్యమనగా-

శ్లో॥ అసంసక్తమనా మౌనీ శాంతవాద విచక్షణః ।
సంప్రాప్తకార్యోయ స్సోఽన్తర్జ్ఞానచిత్తలతో భవేత్॥

అనగా-విషయాసక్తిలేనివాడున్ను, మౌననిష్ఠుండును, విద్వాంసుండును అవశ్యకార్యములనుచేయువాడును నగు పురుషునకు సాధ్యమగునని తెలుపుచు నింకను——

శ్లో॥ గౌణంశాఖావిలవనం ముఖ్యంమూలవివర్తనమ్ ।
చిత్తవృక్షస్యతేనత్వం మూలకాషపరోభవ ॥

చిత్తవృక్షముయొక్క శాఖలగువాసనలను ఛేదించుటకంటె మూలమగు అహంకారమును ఛేదించుట ముఖ్యముగాన నీవు ఈ మూలమునే ఛేదింపుము. అని చెప్పిన కుంభమునితో తిరిగి శిఖిధ్వజుడు—

శ్లో॥ అహం భావాత నశ్చిత్త ద్రుమ జస్యహే మునే ।
కోఽనలో దహనాధ్యోఽసి న్ కర ణ్యర్థకరోభవేత్ ॥

ఈ చిత్తవృక్ష జమగు అహంకారమును కాల్చుట కేయగ్ని ఉపయోగించునో చెప్పుమని యడుగగా- కుంభుడు—

శ్లో॥ రాజన్స్వాత విచారోఽయం కోఽహంస్యామితి రూపకః ।
చిత్తదుర్ద్రుమబీజస్య దహనేదహనః స్మృతః ॥

ఈ యహంకారమను చిత్త జమును కాల్చుటకు 'నే నెవ్వడను ?' అను నాత విచారమె అగ్ని యగుచున్నది. చైతన్యమునకు దృశ్యానుసంధానము చేత దుఃఖకరంబగు నహంకారంబు కలిగినదని చెప్పగా, ఆ దృశ్యమె ట్లుపశమించునో, దృశ్యమెట్లు తోచకుండునో ఆ యుపాయమును చెప్పుమని శిఖిధ్వజుం డడిగెను.

శ్లో॥ దేహాదిరూపయోదేతి వేదనంవస్తుసత్తయా ।
అసత్యాభాసయాస్పందో యథాపవన లేఖయా ॥
అసత్తాంవస్తుసత్తాయా నావగచ్ఛామ్యహం యథా ।
అహంత్వవేదనం చిత్తి జం సమనుశామ్యతి ॥

వాయువుచే స్పందనము కలుగునట్లు ఆభాసరూపమైన దేహాదివస్తుసత్తచే దృశ్యదర్శనము కలుగును. ఏ సత్తచే చిత్త జమగు నహంకారమును, దానికి

కారణంబగు దృశ్యానుసంధానమును శాంతించునో అట్టి దేహవస్తుసత్తయొక్క అసద్భ్రాంతి తెలియదుగాన, దానిని తెలుపుమని కోరగా, కుంభుం డిట్లనియె-

శ్లో॥ విద్యతేయది దేహాది వస్తుసత్తాతదస్తితే ।
అభావాద్దేహసత్తాదేః కిం నిష్ఠంతవ వేదనమ్ ॥

అనగా దేహమే లేనప్పుడు దేహసత్త యెక్కడిది? అదియె లేనప్పుడు దానిని తెలిసికొనుటెట్లు ఘటించును? అనిన, శిఖిధ్వజుడు-

శ్లో॥ హస్తపాదాది సంయుక్తః క్రియాఫలవిలాసవాన్ ।
సదాఽనుభూయమానోఽయం దేహోనాస్తికథం మునే ॥

అనగా చేతులు కాళ్లు కలిగి చలనాదిక్రియలు, తత్ఫలవిలాసములతో గూడియున్న దేహ మనుభవగోచర మగుచుండగా, అది లేకపోవుటెట్లు సంభవించును? అనిన కుంభుం డిట్లనియె-

శ్లో॥ కారణం యస్యకార్యస్య భూమిపాల న విద్యతే ।
విద్యతేనహితత్కార్యం తత్సంవిత్తిస్తు విభ్రమః ॥
అవిద్యమానమేవత్వం విద్ధిసర్వం భ్రమోదితమ్ ।
అకారణం హియద్వస్తు తని థ్యా రజ్జుసర్పవత్ ॥

ఏ కార్యమునకు కారణమే లేదో అట్టికారము ఉండదు. కాన తద్విషయకజ్ఞానము భ్రమ మాత్రమే. కావున సర్వప్రపంచము, లేకనే భ్రాంతిచే గోచరించుచున్నదని తెలిసికొనుము. కారణములేని కారము రజ్జు సర్పము వలె మిథ్యారూపము. ఇట్లు దృశ్యమంతయు భ్రాంతి మాత్రమని చెప్పి యీ భ్రాంతి కధిష్ఠానమై బ్రహ యొక్కటే నిత్యమనిన్నీ, అధిష్ఠానజ్ఞానముచే అధ్యస్తమైన దృశ్యము మిథ్యయై సర్వాధిష్ఠానమైన బ్రహ యొక్కటే చిద్రూపమై శేషించునని తెలిపెను.

అటుపైన శ్రుతి "ఏకమేవాద్వి యంబ్రహ్మ " అని చెప్పుచున్నందున ఈ స్వశరీరాది సర్వదృశ్యమున్ను బ్రహ్మయందే అధిష్ఠితమనిన్నీ, తన దేహాదులుగూడ దృశ్యాన్తర్భూతములగుటచే కల్పితములనిన్నీ, ఈ కల్పిత ములను త్యజించగా మిగులునది బ్రహ్మ - (తాను) ఒక్కటేననిన్నీ గ్రహించి యా శిఖిధ్వజుండు వన్ముక్తుండాయెను. అంతట కుంభుండు తన నిజస్వరూపమును తన భర్తయగు శిఖిధ్వజునకు జెప్పి యుభయులు పరమా నందమును పొందినవారైరి. ఇపుడు భారాభర్త లిరువురున్ను అహంకార వాసనాత్యాగముజేసిన వన్ముక్తులగుటచే వారు నిర్బాధకమైన రాజ్యపరిపాల నమును గ్రహించి దీర్ఘకాలమునకు విదేహముక్తులైరని యీ యుపాఖ్యా నము తెలుపుచున్నది. కాన ముముక్షువునకు విషయత్యాగములకన్న విషయ వాసనాత్యాగము అధికావశ్యకమని గ్రహించవలెను. ముముక్షువు సద్వాసనా వృద్ధి తనున్ను, విచారణచేతనున్ను ప్రబుద్ధవాసనలను తగ్గించుకొనవచ్చును గాని, సుప్తవాసనలు కనబడక సంస్కారరూపములుగ అంతఃకరణమను జ మందు—

శ్లో॥ ఆనీలవల్ల రూపం యథాపదా క్షకోటరే ।
ఆస్తేకమలినీబీజం తథాద్రష్టరిదృశ ధీః ॥

అనగా కలుగబోవు తామర గెయొక్క రూపము ఆకులు పుష్పములు అన్నియు తామరవిత్తనముయొక్క గర్భమునందు సూక్ష్మరూపముగ నెట్లు న్నవో అట్లు ఈ యతఃకరణ జమందు ప్రసుప్తరూపముగ ఈ ప్రపంచము యొక్క వాసనాసంస్కారములు అణగియుండును.

ఈ జమునకుత్పత్తి సామర్థ్యమును తీసివేయుటకు అగ్నిసంస్కా రము 'అనగా వేయించుట' ఆవశ్యకము. అట్టిచో అంకురసామర్థ్యము నివృత్తమై జము మాత్రము మిగులుచున్నది. ఈపై అంతఃకరణ జము నందలి యీ సామర్థ్యమును సివేయుటకు దీనిని జ్ఞానాగ్నిచే బాగుగ తప్తము

చేసిన యెడల పునర్జనమును కలిగించు సామర్థ్యము నశించి తాను మాత్రము మిగిలి దేహప్రారబ్ధాంతమందు నశించును. తిరిగి అంకురించదు. ఉన్నను కోలుబదీసిన సర్పముతో సమానముగనుండును. దీనినే—

"జ్ఞానాగ్నిస్సర్వ కర్మాణి భస్మసాత్కురుతేఽర్జున"
"జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః"

అని గీతావచనము తెలుపుచున్నది. ఐనను ముముక్షువునకు ముఖ్యముగ అహంకార కర్తృత్వాద్యభిమానములు అనుభవములో నుండియున్నందున నిట్టి త్యాగమునకు నిరోధమును కలిగించుచుండును. ఐనను ఈ యహంకార కర్తృత్వాద్యభిమానముల యొక్క కల్పితస్వభావమును విచారించి బాగుగా తెలిసికొనిన యిట్టి జ్ఞానము ముముక్షువునకు కర్తృత్వాద్యభిమానములు వాస్తవములను, దృశ్యవాసనా సంస్కారములను క్షీణింపజేయును. కనుక ఈ యహంకార కర్తృత్వాద్యాభాసములను విచారింతము.

---

# కర్తృత్వాద్యాభాసనిరూపణ

శ్లో॥ కర్తృత్వంకారకాపేక్ష మకర్తృత్వం స్వభావతః ।
కర్తాభోక్తేతి విజ్ఞానం మృషైవేతి సునిశ్చితమ్ ॥

అనగా "కర్తృత్వము, కారకముల సంబంధముచే వచ్చినదేగాని, ఆత్మకది స్వతస్సిద్ధము కాదు. నేను కర్తను, భోక్తను అను జ్ఞానములు భ్రమరూపము లనునది నిర్ణీతవిషయము" అని శంకరభగవత్పాదుల వచనము తెలుపుచున్నది. లోగడ మనముచేసిన నిరూపణలనుబట్టి యీ నేను (అహం) అను ప్రతీతిలో వాస్తవావాస్తవు లిద్దరు గోచరించుచున్నారనియు, ఈ యిద్దరి కలయికచే 'నేను' అను ప్రతీతి కలుగుచున్నదనియు నిరూపించి యున్నాము.

ఇందు వాస్తవుడు సాక్షి. ఈయనకు కర్తృత్వ భోక్తృత్వములు లేవు. సాక్షియైనవానికి సాక్ష్యవిషయములతో సంబంధ ముండదుకద! సాక్షి కిట్టిసంబంధము మనలకు ప్రపంచవ్యవహారములోగూడ కనబడుటలేదు. ఇక రెండవవాడు అవాస్తవికుడైన అహం – ఆభాసుడు. ఈయనయే సర్వవ్యవహారి, ఆభాస శబ్దములోనే లేనిది ఉన్నట్లు కనబడుటయను అర్థమున్నదిగద! కనుక ఈయన చేయు సర్వవ్యవహారము ఆభాసమే అగుచున్నది. ఇందు సత్యస్వరూపుడగు ప్రత్యగాత్మయే నిత్యుడు, అసంగుడు, నిరవయవి, సర్వవ్యాపకుడు, స్వప్రకాశుడు సర్వాధిష్ఠానుడై యున్నాడు. కనుక ఈయనకు ద్వితీయత్వము లేదు. సంభవింపదు.

సత్యపదార్థ మెప్పుడున్ను ఒక్కటికన్న నెక్కువ ఉండుటకు వీలులేదని లోగడనే వివరించి నిశ్చయించితిమి. రెండవ అహం ఆభాసుడు అసత్య పదార్థమగుటచే సర్వదా వివిధ వికారములను పొందుచు కర్తృత్వ భోక్తృత్వ సంపాదనలను చేయుచుండును. నానావస్తుసంపాదనలనున్ను చేయుచుండును. వ్యవహారమునకు అసత వస్తువు లెన్నియుండినను భూషణమేగాని అందు దోషమేమిన్నీ లేదు. ఈ యాభాసుడు అనేక పదార్థములను సంపాదించుచు, వాటి కర్తృత్వ భోక్తృత్వములను పొందుచు, జన్మపరంపరలను పొందుచుండును. ఈ యిద్దరిలో ఆభాసుడైన యొక్కడే సాక్షి — అన్తఃకరణములతో అన్యోన్యాధ్యాసనుపొంది సర్వ వ్యవహారములను కలుగజేయుచున్నాడు. వ్యవహారమనగా మాయ బంగారము వంటిదని లోగడనే చెప్పియుంటిమి. ఇట్టి వ్యవహారములో 'నేను—నాది' 'అహం—మమ' అను కర్తృత్వాద్యమానములు సర్వదుఃఖములకు మూలమగుచున్నవి. ఈ కల్పితుడైన ఆభాసుని మనము భ్రాంతియుతులమై నేనేయని నమ్మి 'అహం, మమేదం' అని వ్యవహరించి దుఃఖముల పాలగుచున్నాము. ఇట్టి నేను అను అహంకారి తన కర్తృత్వాద మానమును, భారా పుత్రగృహక్షేత్రాదులను, కరచరణాదిరూపమైన తనదేహమునుగూడ విడిచిపెట్టి పోవుచున్నాడుగద!

# కర్తృత్వాద్యాభాసనిరూపణ

"నేను" అను తా నున్నప్పుడుగదా "నాది" యనుకొనుటకు అవకాశము. "నాది" అనుకొను తానే యీ సర్వ వస్తువులను స్వదేహముతో గూడ వదిలిపెట్టి వెళ్ళినతరువాత తా నింతకాల మీ స్థూల దేహాద్యుపాధితో సంపాదించిన వస్తు సముదాయమంతయు నెవరిదగుచున్నదని విచారించగా వారి వారి కర్మఫలముచే ఈ వస్తువుల యనుభవము ఎవరికున్నదో వారికే పోవుచున్నదిగాని తన జీవితకాలములో తాను ద్దేశించినప్రకారము తన తరువాత ఈ పదార్థముల యనుభవముజరుగుటలేదు; జరుగదు. ఈ స్థూల దేహమున్నంత కాలమే ఈ యాభాసునికి తన కర్తృత్వాద్య మానములు కలుగుచున్నవి కాని తరువాత కనబడుటలేదు. ఒకవేళ కొందరు నమ్మినట్లుండి పిశాచగణములోజేరి అ మానించినను అనుభవానుకూలసామగ్రిలేక, దుఃఖమును పొందుచున్నట్లు తెలియుచున్నది. ఇదిగాకను తాను సంపాదించిన గృహక్షేత్రవిత్తాదులను, తా నభిమానించు సంతానమును తానుండి అనుభవమును పొందదలచినంతకాలము నుండకపోవుటను (మరణించుటను) మనమందరమును చూచుచున్నాము. ప్రారబ్ధకర్మ ఫలము ఆ దేహముతో నెంతవరకున్నదో అంతవరకేగాని ఆ పైన నొక్కక్షణమైనను తానీస్థూలోపాధితో నుండలేకున్నాడుగదా! ఇదిగాక తాను కష్టపడి సంపాదించిన ద్రవ్యము, గృహక్షేత్రాదులనూ తన సంతానమును తాను కోరినంతకాలము నిలుపుకొనలేకున్నాడు. చిరకాలమునకు సంతానము కలిగినవానిని పెద్దవానినిచేసి తాను సుఖముగా నుండుటను కోరుచున్నను వానిముందు తాను మరణించుట జరుగుచున్నది. ఇట్లే తన సంపదలుగూడ తన జీవితాన్తమువరకైన నుండవలెనని గదా ప్రతి వుడు కోరినది! కాని ఎక్కడో యొకజీవికితప్ప ఇట్లుండుట లేదు. ఈ ప్రత్యక్షానుభవములనుబట్టి యీ స్థూల దేహా మాని కల్పించుకొనుచున్న కర్తృత్వాదులు ఆభాసమని తేలుచున్నది. "నేను" అనుకొను తాను కేవలము పరతంత్రుడుగనే కనబడుచున్నాడు. కాని యీ కర్తృత్వాదులలో స్వాతంత్ర్యము కనబడుటలేదు. "స్వతన్త్రఃకర్తా" అనగా నిజముగ కర్త యగువాడు పరతంత్రుడుగా నుండుట కూడదు. స్వతంత్రుడైనవాడే కర్త.

ఇట్లుండగా తాను అనుకొను స్వతంత్రతయాషనా భ్రమగనుండి బహ్వల్పకాల మనుభవింపబడుచున్నది. ఈ కర్తృత్వాదులు ఇట్లాభాసములగుటయేగాక, బాగుగా విచారించిన యడల ఈ స్వల్పకాల సుఖముగూడ దుఃఖపూరితముగ నున్నదని ఈషద్వివేకము, కలవారికి గూడ తెలియగలదు. కర్త— ఆర్జించినవాడుగద !

శ్లో॥ అర్థానామార్జనే దుఃఖం ఆర్జితానాంచరక్షణే।
నాశే దుఃఖం వ్యయే దుఃఖం కిమర్థం దుఃఖ భాజనమ్ ॥

అనగా ద్రవ్యమును సంపాదించుటలోను, రక్షించుటలోను, నాశము లోను, వ్యయములోను దుఃఖము కలుగుచున్నదిగాన దుఃఖ కారణమైన యీ ధనమెందుకు ? అని పెద్దల వచనము ఇచట అర్ధమనగా సమస్త సంపాదన లనియే గ్రహించవలెను. ఇది నాది యనుకొనువాడు కర్త. ఇట్టి కర్తృత్వాద మానము గృహ క్షేత్ర విత్తాదులయందుకన్న వారి వారి సంతానమునందె క్కువ యనుమాట అందరికిని అనుభవమే. ఇట్టి కర్తృత్వా మాన ప్రీతి పాత్రమైన సంతానము వివేక దృష్ట్యా ఎంతవరకు ప్రీతిదాయకమగుచున్న దని విచారించిన నీ క్రిందనుదాహరించిన విద్యారణ్యుల వారి వచనములవల్ల తెలియగలదు,

శ్లో॥ అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్ ।
లబ్ధోఽపిగర్భపాతేన ప్రసవేనచ బాధతే ॥

శ్లో॥ జాతస్య గ్రహరోగాదిః కుమారస్య చమూర్ఖతా ।
ఉపనీతే ప్యవిద్యత్వం అనుద్వాహశ్చ పండితే ॥

శ్లో॥ పునశ్చ పరదారాది దారిద్ర్యం చ కుటుంబినః ।
పిత్రోర్దుఃఖస్య నాస్త్యన్తో ధనీ చేన్మ్రియతే తథా ॥

శ్లో॥ ఏవం వివిచ్య పుత్రాదౌ ప్రీతింత్యక్త్వా నిజాత ని।
నిశ్చిత్య పరమాంప్రీతిం వీక్షతేఽయమహర్నిశమ్ ॥

అనగా తల్లితండ్రులకు పుత్రుడు కలుగకపోవుట, కలిగినను గర్భపాతాదులు సంభవించుట, పుట్టినపిదప గ్రహపీడా రోగాదులవల్లను, మూర్ఖత్వమువల్లను విద్య లేకపోవుటవల్లను, పండితుడయ్యు పెండ్లికాకపోవుట, చేసికొన్నతరువాత పరదారాసక్తత, కుటుంబియైయుండి దారిద్ర్యమును పొందుట, ధనికుడై యున్నచో త్వరలో మరణించుట, మున్నగు కారణములచే పుత్రులవల్ల కల్గు దుఃఖమున కంతములేదు. ఈ విషయములన్నింటిని గుర్తించి పుత్రాదులయందు ప్రీతిని త్యజించి నీ యెడల అహోరాత్రము లాత్మానుసంధానపరుడై పరమానందము నొందును.

ఇంక స్త్రీసంతానవిషయములో— వారి విద్యాభ్యాససందర్భములు, వారి వివాహము, తదుపరి సంసారానుకూల్యములు, పురుళ్లు, రాకపోకలు, పెట్టుబళ్లు, మరా దలు. అవమానములు, ధనవ్యయప్రయాసలు ఇట్టివి అందరికిన్ని అనుభవములో నున్నవే. 'కనా పితృత్వంఖలు నామకష్టమ్' అను లోకానుభవము ప్రసిద్ధముగద ! ఐనను వారివారి లోకవాసనానుసారముగ నిశ్చయించుచు సుఖదుఃఖానుభవములను పొందుచున్నాము. ఇట్లు అశాశ్వతమగు పుత్రవిత్తగృహక్షేత్రాదులయందు వ్యామోహితుడై పొందుచున్న కర్తృత్వప్రియత్వా మానము లెంత దుఃఖకరముగను, లేక (అట్లుగానిచో) స్వల్పసుఖముతో గూడిన దుఃఖమిశ్రితములుగ నున్నవో మన మూహించవచ్చును.

ఇట్టి కర్తృత్వము ఆభాసమని కర్తృత్వా మానియు ఆభాసుడని తెలిసికొనవలెను. ఇట్టి కర్తృత్వా మానములే మనకు అనుభవించు విత్తగృహ త్రసంతానాది నిమిత్తములచే క్లేశదుఃఖాదులను కలిగించుచున్నవి. ఇట్టి దుఃఖక్లేశాదులు కేవలము సంతాన ద్రవ్యసంపద లున్నతమాత్రమున గలుగుటలేదు. కాని వాటియందు అవిదా వాసనాబలముచే పొందుచున్న

అభిమానములచేతను, ప్రీతి వ్యామోహ ద్వేషములవల్లను కలుగుచున్నవి. కాన ఈదుఃఖాదులన్నియు వస్తువులున్నంతమాత్రమునగాని, వాటిని మన మనుభవించినందునగాని కలుగవు. కాని వాటియందు కలుగుచున్న అ మానములే దుఃఖాదులకు కారణమగుచున్నవి. అనుభవించువాడు కర్తగానే యుండవలెనను నియమము కనబడుటలేదు. కర్తృత్వా మాన మొక్కనిదైనను అనుభవము మరియొకనిదిగ నుండుట లోకములో కనబడుచున్నది. కొందరు కర్తలు కాకపోయినను ద్రవ్యగృహక్షేత్రాదుల అనుభవమును పొందుచున్నారు. అట్టివారు కర్తృత్వాది దుఃఖములను పొందక అనుభవసుఖమును మాత్రము పొందుచున్నారు. ఈ విషయములు వివేకులకు అనుభవములో నుండి దృష్టాంతములు స్ఫురించుచుండునుగాన ఈ విషయమును విస్తరించి వ్రాయుటలేదు.

ముముక్షువైనవాడు పై వివేచనమును బాగుగ గ్రహించి తను ఈ అహంప్ర తిలో సత్యస్వరూపుడైన సాక్షియేయనిన్ని, తనకు కర్తృత్వాదులు వాస్తవముగ లేవనిన్ని, ఐనను తనయొక్క అనాద్యవిద్యాభ్రాంతిచే ఈ యధ్యాస కలుగుచున్నదనిన్ని, ఇప్పుడిది ప్రారబ్ధబలముచే తనకు విధింపబడిన శిక్షవంటిదియని తెలిసికొని, విధింపబడిన శిక్షానుభవ మెవ్వరికిని తప్పదు గనుక నిట్టి యనుభవమును అ మానరహితుడై విధిచే యథాసంప్రాప్తముగ అహంకార కర్తృత్వాద్య మాన రహితుడై అనుభవించుచుండిన నట్టి యనుభవము సంసారబంధమునకు కారణము కాజాలదని తెలిసికొనవలెను.

ఇట్లు యెంత వివేచనచేసి తెలుసుకొన్ననూ యీ కర్తృత్వాద్య మానములు జీవునియందు మహాబ యములుగానుం సుఖదుఃఖ పరంపరలకు హేతువగుచున్నవి. దీనికి కారణము దృశ్యానుభవములే ప్రధానము. కాని పైన నిరూపించిన యటుల కేవల అనుభవములు మాత్రము యిట్టి కర్తృత్వాదులకు కారణముగాదు. మరియేమన అట్టి దృశా నుభవములయందుండు సత్యత్వబుద్ధియే యిట్టికర్తృత్వాద్యభిమానములకు కారణమగుచున్నవి. దీనినిబట్టి యిట్లు మనలకు

కలుగుచున్న ఆ మానసక్తతలు, దృశ్యసత్యత్వ నిశ్చయమువలననే కలుగుచున్నవని చెప్పవలయును. కాన ముముక్షువు తనకు యిప్పుడు కలుగుచున్న ఆ మానసక్తతలు, అందుమూలమున కలుగుచున్న కర్తృత్వాద్య మానములు, అందుచే కలుగుచున్న రాగద్వేషాదులను తగ్గించుకొనవలయును. ఇందుకుగాను తను విచారించి శ్రుతి, యుక్తి, అనుభవములతో యీ తన స్వశరీరాది సర్వదృశ్యముయొక్క మిథ్యాత్వమును అనగా అవాస్తవికతను బాగుగ గ్రహించి నిశ్చయమును సంపాదించుకొనినయెడల అట్టి జగని ధ్యాత్వ నిశ్చయజ్ఞానము తనకు— అనగా జీవునికి యిప్పుడు కలుగుచున్న సర్వానర్థమూలమగు కర్తృత్వాభిమానములు కొంతవరకైనను తగ్గి, తన చిత్తసంస్కారమునకు, విశ్రాంతికిని యుపకరించును. కాన యట్టి జగని ధ్యాత్వ నిశ్చయజ్ఞానదార్ఢ్యాభ్యాసములకుగాను యీ ప్రకరణములో గూడ యిట్లు కొంత విచారించవలసిన యావశ్యకత కనబడుచున్నది.

ఇంతవరకు మనముచేసిన అనుభవవివేచనములనుబట్టిన్ని నిర్దిష్టమగు "ఏకమేవాద్వి యం బ్రహ్మ", "మాయామాత్ర మిదం ద్వైతం", "అద్వైతం పరమార్థతః" మొదలుగాగల శ్రుతివచనములవల్లనూ "దీర్ఘస్వప్నమిదం విద్వన్, విశ్వంబ్రహ్మణి కల్పితం" మొదలుగాగల పూర్వాచార్యుల వచనములవల్లను—— "అహం సర్వస్య ప్రభవోమత్తస్సర్వం ప్రవర్తతే", "మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా" అని చెప్పు భగవద్వచనములను బట్టియు—— ఒక్కటియైన ఆ పరమాత్మయందే యీ కనబడుచున్న సర్వదృశ్యము అధ్యస్తముగా నున్నది యని స్పష్టమగుచున్నది—— అధ్యస్తమనగా ఒకసత్యవస్తువునందు దాని యథార్థజ్ఞానమును మరచి (తెలిసికొనలేక) అజ్ఞానముచే అదియే మరియొక వస్తువుగా న్న రూపమున గ్రహించుట. దీనిని గురించి లోగడ విపులముగా నిరూపించి యుంటిమి—— ఇచట యెట్లన అధిష్ఠానమై ఒక్కటియైన సత్య వస్తువునందే యీ సర్వదృశ్యము న్నభిన్నపరిచ్ఛిన్నాకారములుగ ప్రకాశించుచున్నవి.

ఎట్లన రజ్జువునందు కలుగుచున్న సర్పభ్రాంతి లాగున. ఇదిగాకనూ యీ కాలమున ప్రస్తుతము మనము చూచుచున్న శబ్దచలనచిత్రప్రదర్శనముల లాగున. అనగా ప్రదర్శనశాలలో సర్వదా ప్రేక్షకుల యెదుట, కదలక నిరలముగా నుండు శ్వేతవస్త్రపటమునందేగదా మనలకు మాటలు, పాటలు, చిత్రములు అగుపడుచున్నవి. అయిననూ వీనిని నిజమని నమ్ము వారెవరైననూ యున్నారా? అందరకునూ దానియందసత్యత్వనిశ్చయ బుద్ధియే గదా యున్నది. వీనియందిట్టి అసత్యత్వ నిశ్చయము వల్లనే ఆ తెల్లతెరమీద యెంతటి రమ్యచిత్రము చూచినా, లేక ఘోరదృశ్యములు చూచినా, నాట్యములు జరిగినా, యుద్ధములు జరిగినా, ప్రేక్షకుల మనస్సులు కలత జెందక సమానముగానే యుండును. ఒకవేళ అచట చిత్రముల ప్రాత్రలరసపోషణవల్ల ప్రేక్షకులకు కొంచెము ఖేదమోదములు కలిగిననూ అవి క్షణమాత్రమై ఉత్తరక్షణమున మరువబడుచున్నవి. అట్లే మనము నిత్యానిత్యవివేకమువలన యీసర్వదృశ్య అవాస్తవికతను గ్రహించి నిశ్చయమును పొందిన యప్పుడు మనలకు వ్యవహారానుభవములచే కలుగు సుఖ దుఃఖ వ్రతలు ఉపశమించును. ఏలనన దృశ్యానుభవములయందు మనము చేయు అసత్యత్వబుద్ధిచే అనగా మనము జాగ్రద్దశయందు చూచు శబ్దచిత్రముల లాగుననూ స్వప్నములో కలుగు యనుభవములలాగున యీ దృశ్యము వాస్తవము కాదను నిశ్చయమువలన. ఇట్లే శాస్త్రబోధవలన, శ్రుతి, యుక్తి, అనుభవ విచారములవలన నిత్యానిత్య వివేకమును సంపాదించి యీ దృశ్యమును విమర్శించిన ముముక్షువునకు యిదియంతయూ శబ్ద చలనచిత్రప్రదర్శనములలోని దృశ్యమువంటిది, స్వప్నదృశ్యమువంటి దనియు తోచకతప్పదు. అట్లుతోచినదానిని మరలమరల విచారము చేయుటవలన దృశ మిథ్యాత్వజ్ఞానము దృఢపడును. అప్పుడు క్రమక్రమముగా యీ స్వశరీర, దృశ్యముల యందు సత్యత్వబుద్ధితగ్గి, కర్తృత్వాభిమానములు క్షీణించుచుండును. ఇట్టి ముముక్షువు స్వశరీర సర్వదృశ్యమును సర్వదా దోషదృష్టితో, వైరాగ్యపరుడై చూచుచుండవలయు. ఇదియొక

మార్గము. రెండవమార్గమేమనిన సూక్ష్మదృష్టితో విచారించిన యెడల తాను అనగా నేను కర్తను అనుకొను వాస్తవస్వరూపుడెవ్వడును కనబడుటలేదు. ఈ నేను అను అహం ప్రతి చిత్, జడముల సంబంధముచే కల్పితమగుచున్న ఒక మిథ్యాపురుషుడు. ఏలనన యీ రెండింటికినీ వాస్తవసంబంధము కుదరదు, లేదు. ఇందు ఒకటి చైతన్యము, మరియొక్కటి జడము. కేవలచైతన్యమునకు కర్తృత్వాదులు సంభవింపవు. కేవలజడమునకు కర్తృత్వాదులు కలుగు యోగ్యతలేదు. కాన యీ రెంటి సాన్నిధ్యసంబంధముచే కలుగుచున్న ప్రతిబింబమైన ఆభాసుడే యిట్లనుకొను కర్తగా కనబడుచున్నాడు. వీడు మిథ్యా పురుషుడు అవిద్యాకల్పితుడు. కాన ముముక్షువు తన నిత్యానిత్యవివేకముచే జ్ఞానపూర్వకముగ వీరిరువురను (అనగా అంతఃకరణ, ప్రత్యగాత్మలను) వారి వైలక్షణ్యధర్మములనుబట్టి విడదీసినచో యిట్లు నేను కర్తను, నేను భోక్తను అనుకొను ఆభాసుడు లేనివాడే యగును. కనుకనే యీ కర్తృత్వాద్యభిమానములుగల నేను అను అహం మిథ్యాపురుషుడగుచున్నాడు. కాన ముముక్షువైనవాడు బాగుగ విచారపరుడై యిప్పుడు తనకు కలుగుచున్న కర్తృత్వాదులు నిజము కాదు, భ్రాంతియుతము, ఆభాసమని గ్రహించి నిశ్చయమును పొందవలెను.

---

# సుఖానుభవ వివేచన

సర్వజీవులును సర్వాదా కోరునది సుఖము. ఈ తనసుఖముకొరకే ప్రతిమానవుడున్నూ సర్వయత్నములనూ జననాది మరణపర్యంతము చేయుచుండును. అయిననూ యిట్లు కోరు సుఖముయొక్క వాస్తవస్వరూపమును, పదివేల మానవులలో తొమ్మిదివేల తొమ్మిదివందల తొంబదితొమ్మిది జీవులకు పైగా, యథార్థముగా తెలిసికొనలేక అట్టిసుఖము వస్తునిష్ఠమని నమ్మి అనగా తనకు యీ సుఖము విషయానుభవముల వల్లనే కలుగుచున్నదని నమ్మి, వారి వారి వాసనానుకూలముగ విషయములకు సర్వదా ప్రయత్నము

సి ఆ విషయములనే సుఖముకొరకు అనుభవించుచున్నారు. వివేకముతో పరి లించిన యీ విషయదృశ్యకోటియందు, ఒక్కటిగూడ సత్యలక్షణము నకు నిలుచునదేదీ లేనందున యివి యాభాసము లనక తప్పదు. కాన వీటి వలన మనలకు కలుగుచున్న సుఖముకూడ అసత్య, ఆభాస సుఖ మనక తప్పదు. ఇట్టి విషయసుఖములు జీవుని ప్రారబ్ధఫల వాసనానుకూలముగ మనః కల్పితములుగా నున్నవి. జీవుడు వాస్తవముగ తనయందే యున్న స్వరూపసుఖమును గ్రహించక తన వాసనానుకూలసంకల్పములతో యీ సుఖము విషయముల యందున్నట్లు భ్రాంతిని పొంది సుఖమునకు బదులు సుఖాభాసము ననుభవించూచూ యీ అనాది సంసార చక్రమునందు భ్రమణము చేయుచూ సుఖమునకు బదులు పర్యవసానమున దుఃఖమునే పొందుచున్నాడు. ఇట్లు కలుగుచున్న విషయసుఖములు ఆభాసము లనక తప్పదుగదా. అయినను సర్వులునూ యీ విషయానుభవములతో సుఖము ననుభవించుచున్నారుగాదా. లోకమున యింతమందికి సుఖానుభవము నిచ్చుచున్న విషయసుఖముల నెట్లు అసత్యము, ఆభాసములగునని శంక కలుగును. కాని యిది సరియైనది కాదు. ఎన్ని గుడ్లగూబలైననూ ప్రకాశమును రాత్రులయందే చూచునుగాని వాస్తవముగా సూర్యప్రకాశమున్న పగటియందు చూడలేవుగదా. ఇదిగాకను "శతాం ధాః కూపం ప్రవిశన్తి" అను న్యాయమును బట్టి నూరుగురు గుడ్డివారు నూతిలో పడిననూ, అది నూతిలో పడుటయే అగునుగాని అన్యముకాదు గదా. అట్లే యీ విషయసుఖములు అందరిచే ననుభవింపబడుచున్నను, యివి కేవలసుఖముగాక సుఖస్యానంతరము దుఃఖము, దుఃఖస్యానంత రము యీషత్సుఖమును కలుగజేయుచు పర్యవసానమందు దుఃఖము-యిచ్చుచున్నది. శాస్త్రము నిర్దిష్టముగా సుఖము ఆత నిష్ఠ మనియు, వస్తు నిష్ఠము కాదనియు తెలుపుచున్నది. అయినను జీవులు భ్రాంతియుతులై సుఖములేనిచోట సుఖమున్నట్లు భావించి, అధర్మపరు లగుచున్నారు. లోకాను భవమునందుగూడ మానవునికి వర్ణాశ్రమధర్మో చితమైన విషయానుభవములు (వ్యవహారకాలములో నైనను) దీర్ఘసుఖదాయకములై అధర్మవిషయాను

భవములు తాత్కాలికకించిత్సుఖము నిచ్చి వెంటనే దుఃఖములపాలు చేయు చున్నవి. దీని కుదాహరణము—ధర్మపత్నితో శాస్త్రవిధిన నొందు సుఖము దీర్ఘవంతమై అభ్యుదయహేతు వగుచున్నది. కాని పరదారాసుఖము క్షణికమై దుఃఖహేతువు, నాశకరము అగుచున్నది. ఇట్లు జీవునికి కలుగుచున్న విషయ సుఖానుభవములే సంసారమనబడుచున్నది. ఇట్టి సంసారదుఃఖము తన మనసు నందే యున్న సత సుఖస్వరూపానుభవమును పొందిన యెడల గాని, నివర్తింప బడదు. ¯వుడు యీ విషయసుఖములను భ్రాంతిమాత్రుడై యనుభవించుచున్నాడు. ఈ దృశ్యవిషయము లన్నియు కల్పితములు, భ్రాంతి మాత్రమేనని శ్రీ శంకరభగవత్పాదులు "భ్రాంతి మాత్రమిదం విద్వన్ విశ్వంబ్రహ్మణి కల్పితమ్" అని తెలుపుచున్నారు. జీవులు కోరు సుఖము తమ మనోనిష్ఠము కాని, వస్తు నిష్ఠము అనగా విషయములయందు యీ సుఖము లేదని శాస్త్రముచేతను, మన యనుభవము వల్లనూగూడ తెలియుచున్నది. ఎట్లన, మన యనుభవమున యీ సుఖము మనలకు విష యములయందు యెట్లు కలుగుచున్నదియు యిచట యించుక విచారింతము. లోకానుభవమున ప్రతి¯వుడును తన వాసనానుకూలముగ విషయము లభ్యము కాగానే క్షణకాలము తనచిత్తము అనగా మనసు స్థాయి నొందుచున్నది. అట్టి స్థాయీభావము మనసు నొందుటయే సుఖానుభవమునకు కారణమగు చున్నది. కాని యీ విషయ ప్రాప్తిచే తన మనసునకు కలుగుచున్న యీ స్థాయీభావము అల్పకాలమేయుండి, మనస్సుయొక్క స్వభావముచే ప్రారబ్ధఫలంబున అన్యవిషయేచ్ఛ చేయుచు తిరిగి అట్టి అన్యవిషయ ప్రాప్తి కలుగువరకు మనసు చలించుచు సంక్షోభము నొందును. ఇట్టి తన చిత్త సంక్షోభకాలమే దుఃఖానుభవము నిచ్చుచున్నది. తిరిగి యిష్టవిషయ ప్రాప్తి కలుగగనే తన మనసు క్షణకాలమూరట జెంది స్థాయీభావమును పొందును– మనసును తిరిగి యీ స్థాయీభావమును పొందించుటచేతనే తనకు సుఖము కలుగుచున్నది. ఇట్లు తన మనసు యిష్టప్రాప్తి విషయము వలన క్షణకాలము సుఖమును పొంది తిరిగి అన్యవిషయేచ్ఛ వలన తన మనఃసంక్షోభముచే

దుఃఖమును పొందుచు చర్వితచర్వణముగ -వుడు అనుభవించుచున్నాడు. ఈ మనసు దర్పణము వంటిది. అద్దము కదలక యుండునపుడు మనలకు మన సుఖస్వరూపమైన బ్రహ్మ ప్రతిబింబము స్పష్టముగా ప్రకాశించును. అధిష్ఠానమైన బ్రహ్మ సుఖస్వరూపుడు గనుక యీ ప్రతిబింబము స్పష్టముగా ప్రకాశించునపుడు మనలకు సుఖమును ఆభాసముగా యిచ్చుచున్నది. కాని యీ ఆభాససుఖము, మనఃస్వభావముచే సర్వదా విషయమునుండి విషయాంతరమును కోరుచుండును గనుక యీ మనోదర్పణము సర్వదా కదలికతో స్థిరముగా నుండదు. అట్లుండుటచే సుఖస్వరూపమైన బ్రహ్మ ప్రతిబింబము స్పష్టముగా గోచరింపదు. ఇందుచే దుఃఖము కలుగుచుండును. కాన నిత్యసుఖస్వరూపము కోరు ముముక్షువు తనకు విషయ ప్రాప్తిచే తన మనసుకు తాత్కాలికముగ కలుగుచున్న స్థాయీభావము నుపేక్షించి నిర్విషయమైన, నిత్యనిరతిశయ సుఖస్వరూప బ్రహ్మానుసంధానముతో తన మనసుకు స్థాయీభావము కలుగజేసిన తన సంకల్పము నిర్విషయము గనుక తన మనసు కోరుటకు విషయాంతరము లేక స్థాయినొందును. ఇదియే క్రమక్రమముగ తన ధ్యాన సమాధులకు సాధనమై వాస్తవ సుఖానుభవమును తనకు కలుగజేయును.

గనుక ముముక్షువు తన మనసును విషయాలంబననుంచి మరల్చి నిర్విషయముగా జేసుకొని - తన వాస్తవసుఖస్వరూపమైన బ్రహ్మస్వరూపాలంబనతో తన మనసును యుంచుట అభ్యసించవలయును. ఈ పయి వివేచనను బట్టి వునకు సుఖదుఃఖానుభవములు వస్తుసహజస్వభావములను బట్టి కలుగుటలేదనియు, యివి మనఃకల్పితమని ధ్రువమగుచున్నది. ఇట్టి మనఃకల్పిత సంకల్పములే సంసారబంధము కలిగించుచున్నవి. ఇట్టి సంసారబంధమునుంచి ముక్తి నొందుటకు యీ మనఃసంకల్పములచే పొందుచున్న విషయాభాస సుఖములను వదలినగాని ముముక్షువునకు తన వాస్తవ స్వరూప సుఖమును పొందవీలుగాదు. ఇట్టి వాస్తవ సుఖస్వరూపమునుగూడ తన

మనసు వల్లనే పొందవలయునుగాని అన్యథాగా వీలుకాదనియు—సంకల్ప మనసు సంసార హేతువనియు, నిస్సంకల్పమనసు బ్రహ్మ-తన సత్యసుఖ స్వరూపమే యగుచున్నదని వశిష్ఠ భగవానులు శ్రీ రామచంద్ర మూర్తికి యోగ వాశిష్ఠమందు తెలుపుచున్నారు. గాన ముముక్షువైన జిజ్ఞాసువు వాస్తవమైన సుఖము విషయములలో లేదనియు, తన యొక్క సంకల్పరహిత మనసే వాస్తవసుఖ స్వరూపస్వానుభవమివ్వగల సమర్థత గలదనియు తెలుసుకొన వలయును. తన మనసు యెల్లప్పుడును తనలోనే యుండునుగాని అన్యత్ర యీ విషయములలో స్థితియై యుండదుగదా. గాన యిట్లు తెలుసుకుని తన మనసును నిస్సంకల్పముగా చేసుకొని తన యీ వాస్తవ సుఖస్వరూపాను భమును పొందుటయే మోక్షము. ఇదియే తన వాస్తవ స్వరూపసుఖము. దీనికి గాను జిజ్ఞాసువు బ్రహ్మానుసంధానాది స్వ ప్రయత్నములుచేసి తన మనసు చేతనే స్వానుభవమును సంపాదించుకొనవలయును. ఇట్టి ప్రయత్నము చేయువాడే యోగి. వీనిని గురించి "యోగీ విగతకల్మషః, సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే"—యోగి పాపవర్జితుడై అనాయాసముగా బ్రహ్మ సందర్శము గల ఉత్తమసుఖము ననుభవించునని కృష్ణభగవానుల వచనము తెలుపుచున్నది.

---

# నిష్కామతా నిరూపణ

పరమార్థలాభమును పొందిన మహనీయులకు అర్థకామాద్యాసక్తి యుండదు. వారు యథాలాభసంతుష్టులు. నిత్యము సుఖసంతోషములు అట్టి మహనీయుల నాశ్రయించి యుండును. గాన మహదైశ్వర్య సంపన్నులగు వారికి కోరవలసినదేమియు నుండదు. వారు లాభనష్టములను సమానముగా చూచువారు. లోకములో దరిద్రుడెవ్వడనగా-సదా కోరికలు గలవాడు. తృప్తి

సంతోషములు వస్తుసముదాయము నాశ్రయించి యుండునవిగావు. వీటికాశ్రయము మనస్సు. తృప్తి ఎన్ని సంపదలున్నను, వాటివల్లనే కలుగుటలేదు. ఎంతయున్నను, ఉన్న దానితో తృప్తియుండ దని లోకానుభవసిద్ధము. సదా ఈ కామ పరంపరలు బాధించుచునే యుండును గాన, కలవాడున్నూ సదా కోరికలచే పీడింపబడుచుండును. ఇట్టివానికి భోగములు తృప్తినివ్వజాలవు. విషయములను అనుభవించిన కొలది కామదుఃఖము వృద్ధి నొందును. దీని నే—

శ్లో॥ నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వా వర్ధతే ॥

అని విద్యారణ్యస్వామి చెప్పుచున్నారు. గనుక దారిద్ర్యనివృత్తి, సుఖసంపాదనలకు ఈ కోరికలు ప్రబల విరోధులు. ప్రారబ్ధ కరా నుసారముగ ప్రాప్తించు సుఖదుఃఖములను అనుభవించుచూ క్రొత్తఫలములను కోరక యున్నవాడు ధన్యుడు. గనుక ఉన్నవానికైనను, లేని వానికైనను తృప్తిని సంపాదించుకొని, కావలెనను కోరికను హతము చేయుట ఆవశ్యకము. ఇట్టి యావశ్యకతనే బ్రహ్మ వల్లియందు శ్రుతిమాత ఆనంద తారతమ్యములను తెలుపుచు ఎట్టి యానందమును పొందుటకున్నూ ప్రతియొక్క ఆనంద ప్రకార నిరూపణలోను "శ్రోత్రియస్య చాకామహతస" అను వాక్యముచే ప్రతి యానందమును కామపీడితుడుగాని శ్రోత్రియుని యానందముతో పోల్చుచున్నది. గాన ఏ ఆనందము సంపాదించుటకున్నూ, కామరహితుడై శ్రోత్రియుడై యుండుటగూడ ఆవశ్యకము. ఇట్టి ముముక్షువునకు బ్రహ్మ విద్య కరతలామలకమై యుండును.

---

# త్యాగస్వరూపము

అద్వైత సిద్ధాంతమందు మోక్షప్రాప్తికి త్యాగమే పరమ సాధనముగ శాస్త్రము తెలుపుచున్నది. కాన ముముక్షువగు జిజ్ఞాసువునకు యిట్టి త్యాగ

స్వరూపమును తెలిసికొనుట యావశ్యకమగుచున్నది. ఈ త్యాగమనునది రెండు విధముల నున్నది. మొదటిది త్యాగమనియు రెండవది సర్వత్యాగ మనియు తెలియబడుచున్నవి. ఇందు మొదటి త్యాగము వులకు అభ్యుదయ కరముగను రెండవదియైన సర్వత్యాగము నిశ్శ్రేయస్సు అనగా మోక్షప్రాప్తికి సాధనమగుచున్నది. జీవుడే సాపేక్షితముగ తనకున్న శక్తి, ధన, ద్రవ్య ములను గాని తాను ఏ యుపాయముచేతనైననూ సంపాదించిన ద్రవ్యాదులను యీ లోకములో యశఃకాములై గాని ఉత్తమపరలోకప్రాప్తిని గోరుచూ గాని చేయు దానధర్మములు, తన కాయక్లేశాదులు త్యాగమని చెప్పబడును. ఇట్టి త్యాగము వులు వారివారి కోరికల ననుసరించి చేయుచుందురు. అ యా వులు అట్టి త్యాగకర లచే కలుగు కర్మఫల సుఖానుభవములను తాత్కాలిక ముగ పొందుచూ ఆనందించుచుందురు. యశఃకాములైన కొందరు యేదో యొక నిమిత్తమై తమ దేహములను గూడ త్యాగముచేయుచూ ప్రాణము లర్పించుచున్నారు. మరి కొందరు తమ దేహసౌఖ్యముల నెంతమాత్ర మైననూ పాటింపక యెట్టి శ్రమలకైననూ యోర్చి కేవల లోకశ్రేయస్సునకు గాను తమ శరీరసౌఖ్యములను త్యాగము చేయుచూ వయాత్రను జరుపు చుందురు. కొందరు అధికమైన ధన ద్రవ్యములను దానముచేసి లేక స్థాపిత నిధులు దేవాలయములు, సంస్థలకునూ యిచ్చి ఆ రోజు మొదలు తన నామము ఎన్ని పత్రికలలో యెట్లు శ్లాఘింపబడినవియో చూచి యానందించుటకుగాను ప్రతిరోజుననూ ప్రసిద్ధిగానున్న దిన, వార పత్రికల నన్నిటినీ వారి పేరుకు గాను వెదకుచునే యుందురు. ఒకవేళ ఏ పత్రికయైననూ వారిపేరు వేయుట మరచినగాని లేక యుపేక్షించినగాని యా పత్రికలయందు నిరసనభావులై యొకప్పుడు దుఃఖ క్రోధములనుగూడ పొందుచుందురు. ఇట్లుగాక తమ పరలోకసాధనమునే ఎంచి జనోపయోగముకొరకు దేవాలయములు, ఆసు పత్రులు, అనగా చికిత్సాలయములు, విద్యాలయములు, స్కూళ్లు, సత్రవులు మొదలుగాగల అనేక ధర కార్యములను మహనీయులు చేయుచున్నారు. ఇవియన్నియూ త్యాగములే. ప్రజలకు మహోపకారములు. కాని యివి

యన్నియూ వారివారి వాంఛానుసారము లోకయశస్సుకును, ఉత్తమలోక ప్రాప్తికిని సాధనములే యగును కాని, ముముక్షువు కోరు తన నిత్యనిరతిశయ సుఖ మోక్షప్రాప్తిని కలుగజేయజాలవు. ఏలనన యిట్టి త్యాగములన్నియూ యేదోయొకవిధమున వారివారి ఫలవాంఛలతో కూడుకొనియున్నవి. ఇవి యన్నియూ యేదోయొక యుత్కృష్టసాధారణ రూపఫలముల నపేక్షించియే చేయబడుచున్నవి గాని నిష్కామకర లగుటలేదు. కానీ యిట్టివి ముఖ్య తాగకర లు కావు. దీనినే

"కామ్యానాం కర ణాం న్యాసమ్ సనా సం కవయోవిదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్తా గం విచక్షణః"

కామ్యకర ల విడచుటయే సన్యాసమనియూ, సర్వకర ముల ఫలమునూ విడచుట యనగా కోరకుండుటయే త్యాగమనియూ భగవద్వచనము తెలుపు చున్నది. అయిననూ యిట్టి ఉత్తమ వులయొక్క ఫలాపేక్షిత త్యాగకర లు గూడ చిత్తశుద్ధికి హేతువులగుచు మోక్షప్రాప్తికి పరంపరసాధనగా కాలాంతరమున కాగల వనుటలో సందియము లేదు.

కాని యిచట మనలకు విషయస్థుడైన ముముక్షువు యెట్టి వాడనగా చిత్తశుద్ధిని సంపాదించి ప్రస్తుతము తన సత స్వరూపమైన మోక్షప్రాప్తికి గాను సాక్షాత్సాధనముల నభ్యసించువాడు. ఇట్టి జిజ్ఞాసువు తన మోక్షప్రాప్తిని లౌకిక త్యాగమువల్ల పొంద సాధ ముకాదు. మరి యెట్లనిన సర్వత్యాగమను చిత్త త్యాగము వల్లనే మోక్షసిద్ధి కలుగునుగాని అన విధముగ కలుగదని యోగవాశిష్ఠమందు శిఖిధ్వజోపాఖ్యానములో తెలుపబడియున్నది. దానినే ఈ గ్రంథములో వాసనానిరూపణమందు సంగ్రహించి యుంటిని. దాని సారాంశ మేమనగా ముముక్షువైనవాడు ఈ దృశ్యసంఘాతమందు తనదను కొనుచున్న సమస్తద్రవ సంపత్తిని తనస్థూలోపాధితోసహా త్యాగము చేసిననూ యిదియంతయూ వాస్తవమున తానుకానట్టి వుడు తనది యను

కొనుచున్నాడు. గాన సర్వత్యాగము కాజాలదనియూ అట్టిసర్వత్యాగ మనునది తన చిత్తనాశముచే కాగలదుకాని అన్యమువల్ల కాజాలదనియూ వాశిష్ఠమున తెలిపియున్నారు. చిత్తమనగా ఆత్మ కానిదానిని ఆత్మ యని భావించుటకునూ సత్యము కానిదానిని సత్యమని భావించుటకునూ కారణ మేదిగాయున్నదియో అదియే చిత్తము. హేయోపాదేయ సర్వభావములనూ విడచిన చిత్తమనునది కలుగదు. అంతఃకరణకల్పించు పదార్థములను వాస్తవమైనవానినిగా భావించుట యేదికలదో అదియే చిత్తస్వరూపమని తెలియబడుచున్నది. సంకల్పాదివిషయంబగు దృశ్యంబును కొంచమైననూ భావింపక నిర్మలా కాశములాగున యుండువానికి చిత్తమనునది యుదయించదు. జగద్భావ నను విడచి జగము వాస్తముగ లేదని భావించుటయు, బ్రహ్మయే యీ సర్వ జగత్కారణమనియూ తెలిసికొనుట చిత్తరాహిత్యమని చెప్పబడుచున్నది. ఇంకనూ రాగద్వేషరహితమైన చల్లనిస్థితిగల స్థిరచిత్తము వృత్తుల యందున్నదైననూ అదియే చిత్తనాశమని తెలియబడుచున్నది. అట్టి చిత్తము పునకు పునర్జన హేతువగు దృఢవాసనాసంస్కారములను కలిగించదు. జీవుడు తన ప్రారబ్ధానుసారము దేహేంద్రియాదులుకలిగి తిరుగుచున్ననూ యిట్టి సంస్కారవాసనారహితమైన చిత్తము సంసారబంధమగు పునర్జన కు పునకు హేతువుగాక పొరిటిపోయిన విత్తనములలాగున యుండును. అప్పుడు అట్టి చిత్తము పునకు బంధకారణముగాక పొట్లిపోయిన లేక వేయించిన గింజలు వాటి అంకురశక్తి నశించిననూ మానవునికి ఆహార మాత్రముగా నెట్లుపయోగపడునో అట్లే యీ రాగద్వేషాదులు నశించి, వాసనా రహితమై, తాను వాస్తవముగ అంతఃకరణసంబంధములేనివాడని గ్రహిం చిన యెడల అట్టి చిత్తము పుని ప్రారబ్ధానుసారదేహయాత్రకుగాను ఉప యోగించును. కాని అట్టి పునికి కర ఫలోత్పత్తిని యీ చిత్తము కలిగింప జాలదు. పుని ప్రారబ్ధాంతమందు తన చిత్తమను రూపమును విడిచి బ్రహ్మ స్వరూపమే యగును. కాన ముముక్షువైనవాడు తా గమనగా గ్రహించవలసి నది యేమనిన యిట్టి సర్వత్యాగమేగాని లౌకిక త్యాగములు కావు. సర్వత్యాగ

మనగా వుడు యిప్పుడు తనకు దృశ్యమందు కలుగుచున్న సత్యత్వబుద్ధిని, దానిచే కలుగుచున్న కర్మఫలా సంధులను, ఇహాముత్రఫల కామములను స_క్తతా మానములను, సంకల్ప వికల్పములను జ్ఞానపూర్వకముగా చేయు త్యాగమువల్ల స్వానుభవమును సంపాదించుటే సర్వత్యాగము, మోక్ష సాధనమైన ముఖ్యత్యాగమని ముముక్షువు గ్రహించవలెను.

---

# పరమపురుషార్థ నిరూపణ

ఈ ప్రపంచమున మానవునకు పొందతగినవి ధరార్థకామమోక్షములని నాలుగు పురుషార్థములు. ఐనను వీటిలో మోక్షమే పరమపురుషార్థమని "మోక్ష ఏవపరమః పురుషార్థః" అని శాస్త్రము తెలుపుచున్నది. అనగా ఈ పురుషార్థములలో శ్రేష్ఠమైనది మోక్షమే అని చెప్పుచున్నది. మోక్షమనగా నిత్యనిరతిశయసుఖముకన్న వేరుకాదు. ఇది నేను అను తనస్వరూపముకంటె న్నముకాదని లోగడనే నిశ్చయించితిమి. ఐనను ఇట్టి స్వరూపసుఖము ప్రతివారికిన్నీ అనుభవములో స్ఫురించుట లేదు. కాని ప్రతివారిచేతనున్నూ కోరబడునదిగానే యున్నది. ఎవరినైనను నీకు నిత్యనిరతిశయ సుఖము కావలయునా? యని అడిగినయెడల వద్దని చెప్పువారు ఉండరు. కాని ఇందులో తాము పొందుచున్న విషయసుఖమే ఈ సుఖమను కొనువారలు కొందరు, మరికొందరు అట్టి సుఖము వేరేయున్నదని తెలిసినను దానిని పొందుట మనకు సాధ్యమా యనిన్నీ, సాధ్యమైననూ బహుక్లేశకరమనిన్నీ సంశయించుదురు గాని ఇట్టి నిత్యనిరతిశయసుఖమును ద్వేషించువారుగాని, కోరనివారుగాని ఉండరు. ఈ సుఖము సర్వులచే కోరబడిన తన స్వరూపమే ఐయున్నను జీవుడు తన అనాద విద్యాప్రభావముచే భ్రాంతియుతుడై దానిని గుర్తించలేక ఆభాస సుఖేచ్ఛాపరుడై, సుఖమునకు బదులు

సాంసారిక దుఃఖములనే పొందుచున్నాడు. శాస్త్రము అనగా శ్రుతి వ భ్రాంతి నివారణార్థమై అనేకవిధములుగ తల్లి పిల్లవానికి బోధించు రీతిని వివిధోపాయములను చెప్పి తిరిగి వాటిలో పొరపాటు పడునేమోయని తలచి చిట్టచివరకు పర్యవసానముగ 'తత్త్వమసి' అను మహావాక్య బోధనతో ఆ సుఖస్వరూపుడవు నీవేను అని చెప్పుచున్నది. ఇంత ఆప్తతతో చెప్పిన వాక్యార్థమును మనము గుర్వీశ్వరానుగ్రహములతో వివేచన చేసికొని శ్రవణ మనన నిదిధ్యసనములు చేయుచు తన స్వస్వరూపమును తెలిసికొని దానిని అనుసంధానమును చేయుచుండవలయును. ఎందుకనగా— ఎవరికైననూ "స్వ" తనకంటె ఎక్కువ ప్రీతిదాయకమైన వస్తువు లోకానుభవములో కనబడుట - దు. శ్రుతికూడా "ఆత నస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అనగా తను అను తనప్రీతికొరకే సర్వము కోరబడుచున్నది. ఎవరు ఏ పనిని చేసినను దానిని తనప్రీతికొరకే చేయుచున్నాడు అని చెప్పుచున్నది. ఐనను ఈ ప్రీతిని తనసత్యస్వరూపమును గ్రహించక తానుగాని తన దేహేంద్రియాదులయందు నేను అను అ మానియై చేయుచున్నాడు. ఇచట విద్వాంసుడు రెండు విషయములను గ్రహించవలయును. తనకు ఈ అ మానములు గలవా? ఒకానొకస్థితియందు అవికలిగినను అవి యావశ్యకమా? వాస్తవమా? తనస్వరూపమెట్టిది? అనియు, శాస్త్రము ఈ కనబడునది తానుకాదు అనిన్నీ, తానుకర్తృత్వభోక్తృత్వములు లేనివాడనిన్నీ, సర్వవ్యాపకుడనిన్నీ, సుఖస్వరూపుడనియు చెప్పుచున్నదిగాన, దీనినిబట్టి విద్వాంసుడు శ్రుతియుక్త్యనుభవములతో విచారణచేసి స్వప్రయత్నముతో తానుఎవరు? తన స్వరూపమెట్టిదై యుండును? ఎట్లుండిన తనస్వరూపము శ్రుతివాక్యసమన్వయమునకు సరిపోగలదు? ఇట్లు సరిపడగల తనస్వరూపము తన శాస్త్రీయానుభవమునకు ఎట్లు సరిపోవుచున్నది? అని విషయనిర్ణయములను తనస్వవిచారణచే చేసి గురువాక్యమననుసరించి నిశ్చయించుకొనవలసియున్నది. ఇందుకుగాను మనమింతవరకు లోగడ చేసిన విచారణ, మరియు తనప్రామాణిక అనుభవములను బట్టిచూచిన కరచరణాదివిశిష్టమైన యీ స్థూలదేహముగాని, మనోబుద్ధి

చిత్తాహంకారప్రాణసంయుక్తమైన సూక్ష్మదేహముగాని నేను అని అనుకొనుట సయుక్తికముగాను ప్రామాణికముగాను గోచరించుటలేదుగదా? ఇట్టితరి తన శరీరములోని స్థూలసూక్ష్మోపాధులను జ్ఞానపూర్వముగా వర్జించిన శేషించునది సాక్షి, లేక ప్రత్యగాత్మయని తెలుపబడుచున్న ఒకవస్తువు తప్ప మరియేమియు లేదుగాన ఇట్టి ప్రత్యగాత్మయే నేను అహం అని నిశ్చయించుకొని అదియే తనస్వరూపముగా తెలిసికొనుటకు తాను గుర్వీశ్వరానుగ్రహములను పొంది చిత్తశుద్ధిని సంపాదించి తన వాస్తవలక్షణములను బాగుగా గుర్తించవలసి యున్నది. ఇట్లు గుర్తించినను ఒకసారి ఆ లక్షణములు తనవి అని తెలిసికొన్నను ఈ అనాద్యవిదా సంస్కారములచే వివిధ భ్రాంతి వాసనారూపముగా వ్రేళ్లు అతిలోతునకు పాకబ యున్నవి. తను ఇప్పుడు అజ్ఞానమహావృక్షముపై యున్నాడు గనుక ఇట్టిమహావృక్షమును నిరూలనము చేయుటకు ఎంతప్రయత్నము కావలయునో మనము ఊహించవలసి యున్నది. ఆకులనన్నింటిని సివేసిన కొమ చిగుర్చును. కొమలనుగూడా నరికిన కొద్దికాలమునకు మొద్దు చిగిర్చి కొమలు యథాప్రకారముగా నుద్భవించును. అతి ప్రయత్నముతో మొద్దును అనగా మొదలును భూమితో సమానముగ సివేసినను తిరిగి కొంతకాలమునకు ఋతువు మారగనే వ్రేళ్లప్రాకి చిగిర్చి తిరిగివృక్షమగును. ఇట్లు కాకుండునట్లు చేయుటకు వ్రేళ్లు ఎంతలోతుగా నున్నవో అంతలోతుభూమిని త్రవ్వి వ్రేళ్లను పూర్తిగా పెళ్లగించి దూరముగా తడిలేనిచోట పారవైచిన వృక్షము తిరిగి పెరగక నిరూలించబడునుగదా! ఇట్లే ఈ యజ్ఞాన మహావృక్షమును సమూలముగా నిర్మూలించుటకు ప్రయత్నము కావలసియున్నది. ఆ ప్రయత్నమే శ్రవణ మనననిదిధ్యసనములు. అజ్ఞానవృక్షనిర్మూలనకు ఇవియే ఆయుధములు. వీటినిగూడా ఒకరోజువాడి అనగా కొంతకాలము ఉపయోగించి వదలివేసిన లాభముండదు. అందుకుగాను ఈ శ్రవణ, మనన, నిదిధ్యసనములను నాయుధములను ప్రారబ్ధప్రతిబంధనివృత్తియై ఫలావగతిపర్యంతము జిజ్ఞాసువు విసుగుచెందక అభ్యసించుచుండవలయును. ఈ యథాసమే బ్రహ్మవిద్యాను

సంధానాభ్యాసము. కాని ఇట్లుచేయుటకు ప్రాజ్ఞులకుకూడ దీనిమీద ప్రీతి నిశ్చయములు కలుగుట కష్టసాధ్యముగా నున్నది. ఇదియును అవిద్యా బలమే. విద్వాంసుడు ఈ అవిద్యాబలమును గ్రహించి దాని నిరూ లనకు శాస్త్రీయోపాయములతో యీ ప్రీతినిశ్చయములను తన తరణోపాయమునకు సంపాదించు కొనవలసియున్నది. తనస్వరూపమును శాస్త్రముచే గ్రహించి నను దానియందు ప్రీతినిశ్చయములు బాగుగ కలుగకపోవుట అసహజ మైనదిగాని సహజమైనది కాదు. ఏలనన ఎట్టి వారికైనను ఇది నేను నాది అనుకొనినతరువాత సహజముగా ప్రీతి కలుగుచున్నది. కలుగకపోవుట అసహజము. దీనికి కారణము అవిద్యారూపప్రతిబంధమనియెగదా మనము తలంచవలయును. ఆ ప్రతిబంధనివృత్తికి ప్రయత్నించువాడే ముముక్షువు. ఇట్టి ముముక్షువు జాగరూకుడై భ్రమ ప్రమాదములకు లోబడక సర్వదా తన సత్య స్వరూపమందే లక్ష్యమునుంచుకొని ప్రారబ్ధానుగతమైన తనకృత్యము లను నిర మానముతో నిర్వర్తించుచుండవలయును. ఎట్లనగా ధనమార్జించ నిశ్చయించిన నటుడు ధనలాభమును కోరుతూ తన నటనకృత్యము లను జనరంజకముగా చేయుచూ అట్టి అ నయకాలములో తన శరీరక్లేశము నకు ఓర్చి ధనమును సంపాదించునట్లు జిజ్ఞాసు తనపరమాష్టమైన స్వస్వరూ పానుభవ, సంపాదన నిమిత్తము ప్రారబ్ధానుగత క్రియలను సక్తతా రహితుడై జరుపుకొనుచూ తన అనుసంధానాభ్యాసములను తగిన యమ నియమములతో సర్వదా జరుపుచుండవలయును. ముముక్షువునకు పైన తెల్పినరీతిన ఇట్టి స్వస్వరూపమందు ప్రీతి నిశ్చయములను సంపాదించు కొనుట యావశ్యకము గనుక సదా తన అనుభవమును శాస్త్రము అనగా శ్రుతివాక్యమునకు సమన్వయము చేసికొనుచు అభ్యాసమును జరుపుచుండ వలయును. ఇట్లు చేసిన తనకు తనసత్యస్వరూపమందు ప్రీతి నిశ్చయములు క్రమక్రమముగా కలుగుచుండును. ఈ ముముక్షువు శాస్త్రజ్ఞునిలాగున బ్రహ్మ స్వరూపమును తెలిసికొని తెలిసికొన్నదానిని వదలక ఆ బ్రహ్మయే తాను అనగ నేను అని శ్రవణజ్ఞాన మాత్రముతో తృప్తిచెందక, తన సత

స్వరూపానుభవమును సంపాదింపదలచినవాడు కావున ఒకసారి ఆ బ్రహ్మ వస్తువునేను ఇదియే వాస్తవము తక్కినదంతయు అసత్యము అని గ్రహించి ననూ తనస్వరూపము ఎప్పుడునూ కర్తృత్వ భోక్తృత్వములతో సంబంధించి నదికాదు అనిన్నీ ఐనను ప్రారబ్ధవశమున ఇప్పుడు అంతఃకరణ విశిష్టుడుగా యుండుటచే అట్టి కర్తృత్వాదులు కొంతవరకైనను తప్పకుండుటను బట్టి అవి కేవలము కర్తృత్వాది ఫలభోగమునకు కల్పితమైన తన అంతఃకరణ ధర్మములు మాత్రమే కాని తనకు సంబంధించినవిగావని తనకు వీటితో ఎట్టిసంబంధము లేదనిన్నీ తెలిసికొని తన పూర్వప్రారబ్ధవిధినిబట్టి అనుభవించుచున్నాననియు, తనకుసాక్షాత్తుగా కర్తృత్వాది సంబంధములు లేవనియు నిశ్చయించి తెలుసుకొనవలయును. అట్టితరి తనసత్యస్వరూపమును సర్వదా సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, సర్వాన్తర్బహిర్వ్యాపక, సజాతీయ విజాతీయస్వగతభేద రహిత, నిత్యనిర్వికారాఖండ అసంగపరిపూర్ణ శుద్ధ చైతన్యమని అనుసంధానమును చేయుచుండవలయును. ఈ ముముక్షువు తన స్వరూపమిట్టిదని గ్రహించినవాడుగాన తనుగాని యీదృశ్యము నేనని గ్రహించి కర్తృత్వాభిమానములను పొందుట ఎంతభ్రమయో గుర్తించవలయును. మూఢుడు కూడా భ్రమయుతుడై యున్నను తాను అను నేను వస్తువునే అన్నిటికన్నను అధికముగా ప్రేమించుచుండునుగదా. అట్టితరి విద్వాంసుడు తనసత స్వరూపమును ఎన్నటికినీ ఎట్టిఅవస్థయందును భ్రమయుతుడై మరవకూడదు. ఈ అనుసంధానములో ముముక్షువునకు పరమావశ్యకమేమన, అహం అను ప్రతీతిలో తనవాస్తవ సత్యస్వరూపమును గ్రహించుటయే. ఇదిరహస్యము. ఎందుచేతననగా ఈ లోకములో ముముక్షువునకున్నూ తదితర సర్వులకున్నూ నేను అను ఒక ప్రతీమీదనే బంధమోక్షము లాధారపడియున్నవి. ఈ నేను అను దానిని అవాస్తవముగా గ్రహించి అనుభవమును పొందువాడు బద్ధుడగుచున్నాడు. అనుభవింపబడు ఈసర్వ దృశ్యము వాస్తవమను భ్రాంతిచేతనే అందరకును దుఃఖ క్లేశము లధికముగా గలుగుచున్నవి. ఎట్లనిన మనకు కలుగుచున్న స్వప్నదృశ్యముల యందును, శబ్ద చలనచిత్ర దృశ్యముల

యందును కలుగుచున్న దృశ్యములు మనలకు కేవల తాత్కాలిక అల్పవికార హేతువులగుచున్నను అసత్యబుద్ధి నిశ్చయముతో వాటిని అప్పుడే మరచి అవి వాస్తవములు కావను దృఢజ్ఞానమువల్ల ఆ దుఃఖక్లేశములను మనము పొందుట లేదుగదా! అట్లే విద్వాంసుడు కూడా నేను నాది అని వ్యవహరించియు అహంప్రత్యయము సత్యమైనది కాదనిన్నీ ఇందు సత జ్ఞానానంద లక్షణముచే తెలియబడు చిత్స్వరూపము అనునదియే తన సత్యవాస్తవ స్వరూపమైనది అని బాగుగా శృతియుక్త్యనుభవ పరిలకుడై గ్రహించిన యడల ఈ వ్యావహారికానుభవములో గోచరించుచున్న అహం నేను అను ప్రతియున్నూ ఈ సర్వదృశ్యమున్నూ స్వప్న చలనచిత్ర దృశ్యములు లాగున వాస్తవము కాదని నిశ్చయమునకు రాగలడు. ఇట్టి దృశ మును అసత్యముగా తెలిసికొన్నవాడైనను ప్రారబ్ధానుసారము కర్మానుభూతి తప్పకపోయినను దానియొక్క దుఃఖక్లేశాదులను తాత్కాలికముగా ఆపాతతః పొందువాడగును. తన జ్ఞానబలముచే ఎల్లప్పుడును తనవాస్తవిక అహం నేను అను అనుభూతిని సత్య జ్ఞానానందలక్షణములతో సదా అనుసంధానము చేయుచుండిన కాల క్రమమున ప్రారబ్ధప్రతిబంధాంతమున తాను సద్వస్తుస్వరూపుడే అగును. అనగా బ్రహ్మ. "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" గాన ఆస్వరూపమునే తాను అని తెలుసుకొనును.

---

# సంకల్పసామర్థ్య నిరూపణ

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనగా మని బంధమోక్షములకు మనస్సుయే కారణమని వచనము తెలుపుచున్నది. ఇది గాకను సంకల్పమనస్సు దృశ్యసంసారమనియు, నిస్సంకల్ప మనస్సుయే

బ్రహ్మ —మోక్షము అని వసిష్ఠ వచనము "సంకల్ప ఏవ సంసారః నిస్సంకల్పోహి ముక్తతా" అని తెలుపుచున్నది. ఇచట నిస్సంకల్ప మనగా జడత్వముగానుండుట యని గాదు. కాని మనస్సుయొక్క దృశ్య విషయానుసంధానములు మాని (అనగా నిరోధించి) సత్యస్వరూపానుసంధానమును చేయుచుండుటయే నిస్సంకల్పమని గ్రహించవలయును. గాన యీ బ్రహ్మవిద్యా నుసంధాన మనగా తన వాస్తవ స్వరూపమును గురించి పునఃపునః చేయు అభ్యాసమేగాని వేరుకాదు. ఇట్టిది మనః కార్యముగాని కాయికము గాదు. కాని సహకరించును. సంకల్పమనగా తాను అనుకొనుట. ఇట్లు తిరిగి, తిరిగి చేయు సంకల్పములే వాసనారూపముగ కాలాంతరమందు గాని సంకల్ప తీవ్రత చేత శ్రీఘ్రకాలములోగాని సద్యఃకాలమందుగాని కూడ కార్యకారులగుచున్నవి. మనకు కలుగుచున్న స్వప్నప్రపంచమంతయు మనలయొక్క వాసనాబలముచే యొకానొకప్పుడు చేసిన సంకల్పఫలములే నిద్రావస్థయందు తన ధీకల్పితములై తన చేతనే అనుభవింపబడుచున్నవిగాని యొకని స్వప్నము మరియొకనికి గోచరమగుట లేదు. దీనినిబట్టి సామాన్యముగ యే జీవుని సంకల్పములు యా వునికే ఫలము నిచ్చుచుండునని గ్రహించవచ్చును. ఇట్లు స్వసంకల్పబలముచే కల్పితములై మనలకు కలుగుచున్న కేవలధీ కార్యములైన స్వప్నాదులు గూడ కార్యకారులుగా యగుచున్నవి. యెట్లన కలగాంచినవాడు జాగ్రద్దశ పొందిన తరువాత కూడ క్షణకాలమైనను తన స్వప్నముచే కలిగిన భయకంపాదులు యీ దేహముతో ననుభవించుచున్నాడు. ఇది యందరికిన్నీ అనుభవములోనిదే—ఇట్లే స్వప్నమువల్ల యింద్రియ స్ఖలనాదులు కలుగుచున్న విషయము బహుజనానుభవమే. ఇంకను వారి, వారికి యిష్టమైన ఆమ్లాది రుచులనుగాని ఫలములనుగాని అనుసంధించగనే వారినోట నీరు కారును. అనగా యిట్టి స్థితి వారి, వారి కావస్తువు యందుండు ప్రీతిబలములను బట్టి యుండును. దీనినే జనులు లోకములో "అది చూడగనే నా నోట నీళ్ళూరిన వనిగాని" "చూచుటకు నీళ్ళూరునట్లున్న దని" గాని అనుచుందురు. ఇది గాక భ్రమర కీటకన్యాయ మొకటి అందరకును తెలిసినదియే.

ఇంకను యువకులకు జాగ్రద్దశలోకూడ వారి దుస్సంకల్పముల వలన కలుగు మనోవికారములచేతగూడ స్ఖలనాదులు కలుగుచుండుననియు, యింకను కొన్ని వ్యాధులకు మనః క్లేశములతో కలుగు సంకల్పములుకూడ కారణముగ నుండునని వైద్యాభిప్రాయము కనబడుచున్నది. దీనిని గ్రహించి కొన్ని చికిత్సలందు అధునికులైన ఘనవైద్యులు వారి చికిత్స్యులకు ( atients) మానసిక చికిత్సయైన సుఖానుసంధానమును అనగా (autosug etion) అనిన "నేను సుఖముగా నున్నాను—నాకేమియు జబ్బులేదు-పోయినది-నాకేమియు భయములేదు" అను మొదలగు స్వసుఖస రణ వాక్యములను అనుకొనుచుండమని చెప్పుచు డాక్టర్లుకూడ "నీకు జబ్బు పోయినది-నీ కెందుకు భయము-నీవు జబ్బును గురించి ఆలోచించవద్దు - త్వరలో మామూలు స్థితి పొందుదువు" అని చెప్పుచు నిమిత్త మాత్రముగా వ్యాధి నిర్మూలనకు తాత్కాలిక ఔషధముల నిచ్చుచున్నారు. అనగా యిది అంతయు రోగియొక్క మానసిక స్థితిని చక్కబరచుటకే గదా.

మనలకు యీ బ్రహ్మ విద్యానుసంధానము గూడ యిటువంటిదే. ఇది మహాభయనివర్తక రసాయనము—రోగభయము తాత్కా కము గనుక తాత్కాలిక చికిత్స సరిపడుచున్నది. గాని మనలకు మాయా మూలకమైన మహాభయము అనాదిగా ఆవరించి యున్నది. గనుక దీర్ఘకాలము బ్రహ్మ విద్యానుసంధానమను యీ స్వస్వరూపానుసంధానము శ్రద్ధాపరులై యాచరించిన గాని యీ సంసారవా ధి నివృత్తియై నిత్యసుఖమును పొందజాలడు.

గాన వివేకులు దీనిని బాగుగ గ్రహించి కేవల సంకల్ప అవృత్తిరూపమైన యీ స్వస్వరూపానుసంధానమను రసాయన ప్రక్రియను వారి, వారి నిత్య నిరతిశయ సుఖప్రాప్తికాములై యాచరించు మహనీయులకు మోక్ష సుఖము కరతలామలకము కాగలదు.

---

# ప్రత్యక్షానుభవ వివేచన

లోగడ జగన్మిథ్యాత్వ నిరూపణమందు ఈ ప్రపంచము త్రికాలముల యందు లేనిది గాన బాధితమగుచున్నదని నిశ్చయింపబడియున్నది. ఐనను ముముక్షువునకు చిత్త ప్రశాంతికిని, అద్వైత సిద్ధాన్తదార్ఢ్య సిద్ధికిని లోకానుభవము అడ్డువచ్చుచున్నది గాన దీనిని శ్రుతి యుక్త్యనుభవములతో పునః పునః వివేచనజేసి యీ సర్వదృశ్యానుభవములు వాస్తవములు కావనియు, కాని యీ అనుభవములు దృఢవాసనా మూలకములైన భ్రాంతి మాత్రములనియు తెలిసికొని నిశ్చయమును పొందుట అవసరముగ నున్నది.

స్వప్నమువలెనే జాగ్రత్తునను కనబడు దృశ్యమంతయును లేనిది మాత్రమే. ఉన్నపరమార్థసత్యము సర్వదా ఒక్కటియే. ఇది యెప్పటికిని ఎవ్విధమునను మారునది కాదు. దీనినే-"ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "మాయామాత్రమిదంద్వైత మద్వైతంపరమార్థతః" అనువాక్యములు తెలుపుచున్నవి. "శతమాతృ సమాశ్రుతిః" ఇత్యాది వ్యవహారములచే శ్రుతి నూరుమంది తల్లులతో సమానమని తెలియుచున్నది. తల్లిసదా పిల్లల క్షేమసౌఖ్యములనే కోరునుగాని తదితరమును కోరదు గనుక అట్టి శ్రుతి రూపములగు వాక్యములను ముముక్షువు విధిగానమ్మి వాటి యర్థములను గ్రహించవలెను.

ఈ దృశ్యానుభవములలో గూడ సతాసతములను వివేచనజేసి వాస్తవమును గ్రహించవలెను. వాస్తవమన్నను సత మన్నను ఒక్కటియే. అవాస్తవమన్నను అసత్యమన్నను ఒక్కటియే. సత పదము మాత్రము రెండర్థములలో వాడుచున్నారు. వ్యావహారిక సత్యమని పారమార్థిక సత్యమనియు. కాని వాస్తవ సత్యమనునది ఎల్లప్పుడును ఒక్కటిగానేయుండును గాని రెండు సత్యములుండుటకు వీలులేదు. అసత్యములు మాత్రము ఎన్నైనను యైన నుండవచ్చును. కనుక పైనుదాహరించిన రెండు సత్యములలో నొక్కటియే సత్యమై యుండవలయును గాని, రెండును సత్యమనుటకు

విలులేదు. ఆ యొక్కటియు నెద్దియను నిర్ణయమును మనలకు తల్లియైన శ్రుతి మాతయే నిశ్చయించి బ్రహ్మ ఒక్కటియే సత్యము, తదితర మేదియు కాదు అని స్పష్టముగ చెప్పుచున్నది. ఐనను రెండవదిన్నీ మాయబంగారమువంటిదిన్నియైన ఈ వ్యవహార సత్యమునే మన మాశ్రయించి నమ్మి లోకానుభవమును పొందుచు సుఖదుఃఖముల ననుభవించుచున్నాము. ఇట్లు మనకు సుఖదుఃఖములను కలిగించుచు మనచే సాధనములుగ గ్రహింపబడుచున్న రాగద్వేషములు, శత్రుత్వమిత్రత్వములు, బంధువిరోధములు, ఇష్టానిష్టములు, క్లేశాక్లేశములు, ప్రియాప్రియములు, కామక్రోధములు మొదలగు నీ సర్వద్వంద్వములు వాస్తవములా? లేక మనచే కల్పితములా? అని వివేచన జేయగా ఈ ద్వంద్వానుభవము లన్నియు మన మానసికవాసనల ననుసరించి కలుగుచున్నవేగాని వస్తుస్వభావమును బట్టి కలుగుట లేదని నిశ్చయమగును.

ఇట్లే దేశకాలాదులు, నామరూపములు గూడ కల్పితములే. ఎట్లన ఈ విషయము క్రింది సంగ్రహనిరూపణచే ధ్రువమగును. ఒక్క పురుషుడే శత్రువు, మిత్రుడు, ప్రియుడు, అప్రియుడుగాను గ్రహించువ్యక్తి భేదము చేతను, కాలభేదము చేతను వ్యవహరింపబడుచున్నాడు గాని ఆ పురుషుని స్వరూపము మాత్రము మారుటలేదు. అనగా వస్తువునందు మార్పేమియును లేదు. ఇట్లే ఒక స్త్రీయే నానారూపములచే వ్యవహరింపబడుచున్నది. ఒకే ఆహారపదార్థము కొందరికి ఇష్టమైనదిన్ని, మరి కొందరి కనిష్టమైనదిన్నీ అగుచున్నది. ఒకవస్తువు ఒకే పురుషునకు ఒకేకాలములో ప్రియము, మరియొక కాలములో అప్రియముగూడ నగుచున్నది. ఒకే మృగము కొందరికి సాధకముగను, మరికొందరికి బాధకముగను ఇతరుల కుదాసీనముగను అనుభవగోచరమగుచున్నది. ఇట్లే ఒకే వస్తువు ఏకకాలమందును, భిన్న భిన్నకాలములందును గూడ ప్రీత్యప్రీత్యుపేక్షలను కలిగించుచున్నది. ఇట్లే సూర్యచంద్ర ప్రసారములును, పంచభూతములును, అనుకూల ప్రతి

కూలభావములతో అనుభవింపబడుచు సుఖదుఃఖములకు హేతువులగుచున్నవి. ఇట్లె బంధుత్వవిరోధిత్వములు ఒకే వ్యక్తియందు కల్పితములై యనుభవింప బడుచున్నది. దేశకాలములు గూడ నెల్లప్పుడు నొక్కటిగనేయున్నను న్న భిన్నాంతఃకరణ ధర్మములనుబట్టి వీటియందును అనుకూల ప్రతికూలభావము లేర్పడుచున్నవి. ఇదే విధముగ నామరూపములున్ను మనః కల్పితములుగ నున్నవి.

ఈ విమర్శయంతయును విపులముగ ఉదాహరణపూర్వకముగ నిరూపణ జేయుటకు ఒక్కొక్క నిరూపణకే ఒక్కొక్క అధ్యాయము కావలసి యుండును. కాన గ్రంథవిస్తరమగునను తిచేతను, అట్టి విమర్శరహితుల విషయప్రయోజనము కలుగదుగావున ఇచట సంగ్రహముగ తెలుపుటయైనది. ఈ విషయమై నిరూపణము సయుక్తికముగ వేదాన్త పంచదశి మొదలగు గ్రంథరాజములలో విస్తారముగ జేయబడియున్నందున నిచట సారసంగ్రహముగ తెలుపబడినదని గ్రహింప బ్రార్థన.

ఇట్లు ఒకే వస్తువుయొక్క అనుభవమువల్ల న్న న్న కాలముల యందు భిన్నభిన్న వ్యక్తులు న్నభిన్న సుఖదుఃఖాదులను పొందుచున్నారు. ఇట్లే సమస్త పదార్థములందు సమస్తజీవులకు అనుభవము కలుగుచున్నది. ఇట్టి సుఖదుఃఖముల నిచ్చు సామర్థ్య మీ వస్తువులయందు కలదా? లేక అనుభవించువారియందు కలదా? అని బాగుగ విమర్శించినయడల ఈ సుఖదుఃఖములు విషయముల ననుభవించువారియందు కనబడుచున్నవిగాని వస్తుస్వరూపములలో మార్పు కనిపించుటలేదు. అవి సర్వదా ఒక్కటిగా తెలియబడు చున్నవి. దృశ్యవస్తువులయందు ఇట్టి మార్పులు లేనిచో వీటిని అనుభవించు జీవులకుమాత్రము తమతమ భావముచే సుఖదుఃఖాది భేదము లెట్లు కలుగు చున్నవి? అనుప్రశ్నకు శాస్త్రము ఈ సుఖదుఃఖానుభవములన్నియు జీవుల యందుండు అనాదివాసనావశమున కలుగుచున్నవనియు ఈ వాసనలు వారు వారు అనగా ఆ వులు జన్మపరంపరగ జేసిన పుణ్యపాపకర్మఫలానుభవ

సంస్కారముచే -వులయందుండి జననాదిమరణపర్యంతము సుఖదుఃఖములను కలిగించుచున్నవనియు ఈ వాసనలచేతనే దృశ్యవస్త్వనుభవముల మూలకముగ నీ సుఖదుఃఖములను వుడు పొందుచున్నాడని తెలుపుచున్నది. కాన దీనిని గురించి విచారణమావశ్యకము.

---

# పిండాండ బ్రహ్మాండ వివేచన

ముముక్షువు తనకు యిప్పుడు అనుభవమువల్ల తెలియుచున్న అహం నేను అను పిండాండము ( Microcosm ) ఇదం ప్రపంచము అను బ్రహ్మాండము( icrocosm ) ఈ రెండును ఒకటియా, లేక రెండును వేరువేరుగా ప్రత్యేకముగ నున్నవా యని నిశ్చయించి తెలుసు కొనవలసిన యావశ్యకత కనబడుచున్నది. ఏలనన తన అనుభవములో ప్రత్యేకము రెండుగా తెలియబడుచున్నవి. గాని శ్రుతి "సర్వంఖల్విదం బ్రహ" "నేహ నానాస్తి కించన" సర్వమును బ్రహ యే, తదితర మేమియు లేదని అన్వయ వ్యతిరేకములతో నిర్దిష్టముగా తెలుపుచున్నది. అద్వైత సిద్ధాంతమందు యెంతవెదకి చూచినను అఖండ సత్పదార్థమొక్కటి తప్ప తదితరమేమియును లేదు. కాని అనుభవములో భిన్నముగా కనబడుచున్నది. ఇట్లగపడుచూ కలుగుచున్న పిండాండ బ్రహాండ యనుభవములు యొక్కటియేనా, లేక రెండు, రెండు న్నములుగా నున్నవా — ఏది వాస్తవము అని అద్వైత సిద్ధాంతము ననుసరించి శ్రుతి, యుక్తి, అనుభవ వివేచనలతో తెలుసుకొనవలసి యున్నది.

పై తెలిపిన శ్రుతి వచనముల వల్లను యింకనూ "మాయామాత్ర మిదంద్వైతం అద్వైతం పరమార్థతః" 'విద్ధిదం సర్వం బ్రహ్మ "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" అను అనేక శ్రుతివచనములను బట్టియన్ని, "భ్రాంతి

మాత్రమిదం విద్వన్ విశ్వంబ్రహ్మణి కల్పితం" అను మొదలుగాగల శంకరభగవద్వచనములను బట్టిన్ని, ఇదం అని తెలియబడుచున్న యీ సర్వదృశ్యము అనగా బ్రహ్మాండమంతయూ కల్పితముగానున్నదని నిశ్చయమగుచున్నది. ఇట్లే అహం అను ప్రతీతిలో విషయమగు శరీరము అనగా పిండాండమును గురించి విచారించిననూ పైనుదహరించిన శ్రుతివాక్యములను బట్టియే సర్వం అను శబ్దమునుబట్టి యీ పిండాండరూపమున నున్న జీవుడు గూడ అందులోనివాడే యగుచున్నాడు.

ఇంకను;— శ్లో॥ శుద్ధాత ని చినా త్రే కూటస్థే ప్రత్యగాత్మని భ్రాంత్యా!
కల్పితమిహ జీవత్వం సన్నిధి దోషాదహంకారస్య॥

శ్లో॥ జపాకుసుమ సాన్నిధ్యా ద్రక్తత్వం స్ఫటికేయథా।
తదహంకార సాన్నిధ్యా జ్జీవత్వం ప్రత్యగాత్మని॥

ప్రత్యగాత్మయైన కూటస్థచిన్మాత్రునియందు అనగా ఆ బ్రహ్మయందే జీవత్వముతోకూడిన పిండాండము కల్పితమాత్రముగ నున్నదని శంకర భగవత్పాదుల వచనములవల్లగూడ తెలియుచున్నది. ఈ పై శ్రుత్యాది వచనములనుబట్టి చూచిన మనలకు యీ రెండుగా తెలియబడుచున్న పిండాండ బ్రహ్మాండములు రెండునూ భ్రాంతియను, యొకే కారణమువల్ల ఏకాధిష్ఠానమైన యొక్క బ్రహ్మ పదార్థమునందే వివర్త కల్పితముగా తోచుచున్నవని స్పష్టమగుచున్నది. అయిననూ వ్యవహారమునకు వీటిని రెంటినీ విడివిడిగా గ్రహించిననూ యీ పిండాండ బ్రహ్మాండములు రెండునూ ఒక్కటియైన అధిష్ఠానమునందు ఒకే కారణముచే కలుగుచున్నవి గాన యీ రెండునూ భ్రాంతి కార్యములై పరమార్థతః యొక్కటిగానే యుండవలయును గాని రెండునూ రెండుగా యుండుటకు వీలులేదని యుక్తిచేగూడ పై వాక్యముల విచారణవలన నిశ్చయమగుచున్నది, అయిననూ యిచట యొక శంక కలుగవచ్చును. అది ఏది యనిన వేదమే బ్రహ్మాండమైన యీ సృష్టినంతయూ యొక క్రమముగా చెప్పుచున్నది. వేదము అను

త్యము చెప్పదుగదా. ఉన్నదానినే గదా చెప్పును. లేనిది ఎట్లు చెప్పును. అని సంశయించవచ్చును. కాని యిట్టి సంశయమునకు అవకాశములేదు. ఏలనన బోధకుగాను చెప్పునదంతయూ యెల్లప్పుడునూ వాస్తవముగానే యుండవలయునను నియమము లేదు. బోధకుగాను చెప్పునప్పుడు కథను యొక క్రమముననే గదా చెప్పుదురు. ఇదిగాకనూ భ్రాంతి, భయాదుల వల్ల కలుగు దృశ్యానుభవములన్నియూ అవాస్తవములు కల్పితములూ యగును. అయిననూ అట్టివానిని అనగా యొకనికి కలిగిన యనుభవమును గురించి మరియొకనికి తెలియజెప్పునప్పుడు ఒకపద్ధతిన అనగా యొక క్రమమునగదా చెప్పును. ఇంకనూ ఎవ్వరైననూ పొరబడినవాడుగాని (భ్రాంతుడు) భయపడినవాడుగాని తనకు రాత్రి చీకటిలో ఒక మనిషి కనుబడినాడనియు, వాడు ఆజానుబాహువు, ఎర్రకళ్లతోను పెద్దగడ్డముతో నున్నాడనియు, వాని చేతిలో కత్తి యున్నదనియు, దూరముగా కనుపడినాడనియు, నేను చాలా భయపడితిననియు, మొదలుగాగల తన అనుభవములను చెప్పునప్పుడు యీ లక్షణములన్నియూ క్రమము ననుసరించియే గదా చెప్పి-నేనచటికి దీపసహాయముతో వెళ్లగా అచట యెవరునూ లేరు, అనియే గదా చెప్పును. అట్లే వేదము వుని అనాది అవిద్యా భ్రాంతులచే కలుగుచున్న యీ బ్రహ్మాండమునంతయూ అనేకవిధములవర్ణించి, తుదకు ఇట్లు కనబడుచున్న అనుభవింపబడునదంతయూ వభ్రాంతియేకాని వేరేదియును లేదు వాస్తవముగా నున్నది బ్రహ్మపదార్థమొక్కటియే తదితరమంతయూ భ్రాంతి అనగా వాస్తవముగాలేనిది, కల్పితము, అసత్యము, అని వేదము చెప్పుచున్నదే కాని యీ బ్రహ్మాండమంతయూ నిజమని చెప్పుట యిందెంతమాత్రము వేద తాత్పర్యము కాదు.

ఇంకనూ యీ పిండాండబ్రహ్మాండములను గురించి మన యనుభవముచే విచారించిననూ యీ రెండునూ పరమార్థతః యొక్కటియేయని ఋజువగుచున్నది. ఎట్లన వుడు తనకు బ్రహ్మాండములో కలుగుచున్న దృశ్యానుభవములే తన పిండాండమందు స్వప్నానుభవములు పొందుచు

న్నాడు. తను నిద్రించిన పరిమిత కాలములో పరిమితప్రదేశమందు అపరిమిత దృశ్య — కాలముల యనుభవములను పొందుచున్నాడుగదా. ఇట్టి దృశ్యానుభవములలో హర్షమోదములను భయకంపాదులను స్వప్నకాలమందు పొందుచూ మెలకువ కలిగినతరువాత కూడ క్షణకాలమాయనుభవమును పొందుచున్నాడుగదా. బ్రహ్మాండములో నున్న యీ వస్తు సముదాయము తనపిండాండములోని కెట్లువచ్చినదని విచారించిన, జాగ్రద్దశలో తనకు బ్రహ్మాండానుభవములు కలుచున్నట్లుగనే, నిద్రయందు గూడ తనకు కలుగుచున్నవి. ఎట్లు కలుగుచున్నవనిన జాగ్రతలో తనకు యెప్పుడైననూ యే కాలమందైననూ బ్రహ్మాండమందు కలుగుచున్న దృశ్యానుభవములే స్వప్నదశయందు తనపిండాండములో చూచుచున్నాడు గదా. ఈ రెంటికినీ ధీ కల్పనయే యగుచున్నది. ఇట్టి బుద్ధియనునదే కల్పితముగాన దీనివలన కలుగుచున్న పిండాండ బ్రహ్మాండములు కూడ కల్పితములై పరమార్థతః యొక్కటియే యగును. గనుక పిండాండములో మాయా ప్రభావమువల్ల జీవుని అనాది అవిద్యా వాసనా సంస్కారములతో నున్న పదార్థములే బాహ్యమందు బ్రహ్మాండములో కనబడుచు వునిచే అనుభవింపబడుచున్నవి. పైన తెల్పినయటుల జీవులకు పిండాండములోని పదార్థములే బ్రహ్మాండములో కనబడుచుండును. బ్రహ్మాండములో కనబడు యనుభవములే పిండాండములోనుండి, స్వప్నదశలో కనబడుచుండును. కాన యివి రెండునూ కల్పితములై వ్యవహార మందున్ననూ పరమార్థతః రెండు కాజాలవు. కొన్ని పురాణాదులలో గూడ బ్రహ్మాండములోనున్న పుణ్యనదీక్షేత్రాది దేవతాస్వరూపములు మొదలుగా గలవనియూ జీవుని పిండాండమందుగూడ నున్నట్లు తెలుపుచున్నవి. కాన యీ పిండాండ బ్రహ్మాండములు రెండునూ కల్పితములనిన్నీ, మిథ్యయనిన్నీ వీటి స్వరూపమును ముముక్షువు బాగుగ గ్రహించి పరమార్థతః యీ రెండునూ యొక్కటియేనని తెలుసుకొనుట యావశ్యకము.

---

# దుఃఖనివృత్తి నిరూపణ

లోకములో సాధారణముగ కలిమివలన సుఖమును, లేమివలన దుఃఖమును వులు పొందుచుందురు. మనలకు కలిమిలేములు కావడికుండలవంటివని లోకమున ప్రసిద్ధ సామెత యున్నది. అనగా ఈ కలిమి లేములు ఎటు మారినను మారవచ్చును. అవి శాశ్వతములు కావు. ఇట్లు కలుగుచున్న సుఖదుఃఖములు మనలకు వాసనాబలముచే అనుకూల ప్రతికూల జ్ఞానమువలన కలుగుచున్నవి. గాన అవి వాస్తవములు గావు. ఈ రెండును వకల్పితములు. ఆగంతుకములున్ను, వాస్తవతః తన సుఖము స్వస్వరూపమే యైనను అట్టి యథార్థస్వరూపమును మరచి తన వత్వకల్పనచే కలుగుచున్న యీ సుఖమును విషయములనుండి ఆభాసగా పొందుటచే ఇట్టి సుఖములు నశ్యములగుచున్నవి, గాన వాస్తవసుఖములు గావు, దుఃఖము ఎట్టిదైనను సర్వదా ఆగంతుకమే. ఇట్టి ఆగంతుకమైన సుఖదుఃఖములను, వాసనాబలముచే కలుగుచున్న సంకల్పములనూ, సర్వ ప్రయత్నములచే త్యజించగా కొంతకాలమునకు అభ్యాసబలముచే మనస్సు సంకల్పరహితమై బ్రహ్మైకాగ్రమగును. ఇట్టి సంకల్పరహిత మనస్కులైన మహనీయుల సుఖప్రకాశములను వసిష్ఠభగవానులు—

శ్లో॥ నతథాభాతి పూర్ణేన్దు ర్నపూర్ణ క్షీరసాగరః ।
నలక్ష్మీ వదనంకాన్తం స్పృహాహీనం యథామనః ॥

అనగా సంకల్పరహితమైన మనస్సు ప్రకాశించునట్లు పూర్ణచంద్రుడు గాని పొంగిన పాల సముద్రముగాని, లక్ష్మీ ముఖముగాని ఏవియు ప్రకాశించవు. అని చెప్పుచున్నారు. ముముక్షువు ఈ వాసనలను బాగుగా గుర్తెరిగి వివేచనజేసి ఇవి తనకు సంబంధించినవి కావనిన్నీ లోగడ అజ్ఞానకాలములో సంపాదింపబడినవిగాన ఇప్పుడు ప్రారబ్ధరూపమున అవి వచ్చుచున్నవి గాని తను ఇప్పుడు వాస్తవమైన తనస్వరూపమును గ్రహించినవాడగుటచే

అట్టి వాసనలు తనకు సంబందించినవి కావనిన్నీ, కేవల అన్తఃకరణధరములనిన్నీ, ఇట్టి కలిమిలేములవల్ల కలుగుచున్న హర్షక్లేశములను తాను పొందనక్కరలేదని తెలుసుకొనవలెను. ప్రారబ్ధానుసారము కాలము గడుపు మహనీయులకు కావలసినదేమియు నుండదు. ఇపుడు తను స్వస్వరూపలక్షణములను గ్రహించి తెలుసుకొనినవాడుగాన నిష్కాముడు. నిష్కామునికి కోరదగినదేమియుండును ! ఈ స్థితినే—

ఆత్మానంచేద్వి జానీయాదయమసీ తి పూరుషః ।
కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమను సంజ్వరేత్ ॥

అనగా నేనే పరమాత్మ నని పురుషుడు ఆత్మ స్వరూపమును తెలిసికొన్నయెడల దేనినిపొందుటకు, ఏ కోరికచేత శరీరక్లేశమును పొందవలయును ? అని పై వాక్యము చెప్పుచున్నది. ఇట్లు తెలుసుకొనుటకు అభ్యాసవుడు తన అహంకారమును త్యజించి తన సత్యస్వరూపమైన ప్రత్యగాత్మస్వరూపమును బాగుగావిచారించి తెలుసుకొనవలయును. ఈ కల్పితమైన నేను అను అహంకారాదులు వాస్తవతః జడములైనప్పటికిన్నీ ఇది ప్రత్యగాత్మకు అతిసన్నిహితమై స్వచ్ఛమై ఉన్నందున అన్యోన్యారోపణము వచ్చినది మనకు వాటి వివేచనసామర్థ్యము లేనందున ఈ సత్యానృతములు రెండున్నూ ఒక్కటిగానే తోచినవి. దానికి దృష్టాంతము, జపాకుసుమ సాన్నిధ్యముచే రక్తతను పొందిన స్ఫటికమే. చూచువారికి ఈ స్ఫటికము కూడ ఎరుపువర్ణముగానే గానవచ్చుచున్నది. కాన ఈ స్ఫటికమును జపాకుసుమ సాన్నిధ్యమునుండి విడదీసినంతనే వేరుప్రయత్నములేక స్ఫటికము తన సహజ స్వచ్ఛశ్వేత ప్రకాశమునుపొందుచున్నది. ఈ ప్రకాశమునకు వేరుయత్నము అవసరము లేదు. దీనినే—

శ్లో॥ జపాకుసుమ సాన్నిధ్యా ద్రక్తత్వం స్ఫటికేయథా ।
తదహంకార సాన్నిధ్యా జవత్వం ప్రత్యగాత్మని ॥

అనగా జపాకుసుమసన్నిధివలన స్ఫటికమందు రక్తత్వము వచ్చినట్లు అహంకారసాన్నిధ్యముచే ప్రత్యగాత యందు ‑వత్వము కలిగినది. అని శంకరభగవద్వచనము తెలుపుచున్నది. గాన జీవవ్యవహారమే భ్రమ. ఈ యహంకారము ఆత్మకు సాంసారికావస్థయందు సర్వదా అతికియుండుటచే దీనిస్వభావము, ఆత్మస్వభావము, విడివిడిగా గ్రహింపబడక పోవుటవలన ఈ అహం అనువాడే జీవుడని భ్రాంతికల్పితమైన వ్యవహారము మనకు కలుగుచున్నది. వాస్తవముగా ఈ యాత్మ శుద్ధసత్యస్వరూపుడు. ఈయనకు జీవత్వముతో ఎంతమాత్రము సంబంధము లేదు. వాస్తవతః ఈ ప్రత్యగాత్మ ‑వులకు భేదములేదనుట యథార్థమైనను భ్రాంతియున్నంతకాలము వుడెవ్వడు ? ప్రత్యగాత్మయెవ్వడు ? అనువిషయమునుగూర్చి వివేకము లేకపోయినది. దీనిని వివేచనముచేసి బాగుగా తెలుసుకొనవలసియున్నది. అహంకారమునందు ప్రతిబింబించియున్న ఆత జీవశబ్దముతో వ్యవహరింపబడుచున్నాడు. ఈ అహంకారాదులకు సాక్షియైన ప్రత్యగాత కు ఏ వికారముతోను, సుఖదుఃఖములతోను సంబంధములేదు. ఆయన అకర్త, అభోక్త స్వప్రకాశుడు, నిత్యుడు, అసంగుడు, సర్వవ్యాపకుడు, చిత్స్వరూపుడు, సత్యస్వరూపుడు, ఆనందస్వరూపుడు, పరిపూర్ణస్వరూపుడుగా నున్నాడు. అహంకారమన్న అంతఃకరణము పరిణామి, వికారి, జడము, అనృతము పరిచ్ఛిన్నైకదేశి, వినాశి కర్తృత్వ భోక్తృత్వములు గలది. ప్రత్యగాత్మ-అహంకారముల కిట్టి ప్రత్యక్ష వ్యతిరేక లక్షణములున్నప్పటికిన్నీ మనము రెంటిని కలిపి అహంకారాభిమానిని జీవుడని వ్యవహరించుచున్నాము. చూచుటకు ఒక్కపోలికయున్నను శర్కర—లవణములను నోటిలో వేసికొని వాటి భేదమును గ్రహించినట్లు మనము అనుభవముచే వివేచనచేసి బాగుగా చూచిన ప్రతిరోజు కలుగుచున్న అవస్థాత్రయమందున్ను, అనగా జాగ్రత్స్వప్న సుషుప్తులయందు మనలను విడవక అనుస్యూతముగా వచ్చుచున్నది యేదియని, అట్లుగాక కొన్నియవస్థలలోనే యుండి కొన్ని యవస్థలయందు లేకుండునది యేదియనిన్నీ బాగుగావిచారించి సూక్ష్మముగా గ్రహించిన ఈ

మూడవస్థలయందు అనుస్యూతముగా అనుభవింపబడుచున్నది, నేను అనునది ఒక్కటియేయని తెలియబడును. ఈ యవస్థాత్రయములో అనుభవింపబడు నేనే భూతభవిష్యద్వర్తమానరూప కాలత్రయమందున్ను, భూతభవిష్యద్వర్త మాన జన్మలయందున్ను అనుభవింపబడు, సత్యస్వరూపుడువాడు, అనునిశ్చయ మీ సత్యనిర్వచనముచే కలుగును. పూర్వముచేసిన సత్యనిర్వచనమును బట్టియు, ఈ నేను అహం అనునదే సత్యమనియు సిద్ధమైనది. అట్టి అహం నేను అనుదానిలో చిజ్జడములను రెండింటిని పంచకోశవివేచనముజేసి అహం అను అంశములో భాగత్యాగముచే తన యథార్థస్వరూపమును తెలుసుకొని స్వానుభవమును పొందుటకు తన సత్యస్వరూపమును నిరంతరము ఫలపర్యం తము అనుసంధానము చేయగా తాను అను నేను సర్వదృశ్య దుఃఖరహితుడైన నిత్యనిరతిశయానన్దాఖణ్డ సుఖస్వరూపుడగును. ఇట్టి వివేకము తత్త్వజ్ఞానికి వదశయందు సదాతృప్తిని యిచ్చుచుండును. నిత్యతృప్తివల్ల దుఃఖము తగ్గుచుండును. తత్త్వజ్ఞాని అగువాడు ఆత్మానాత వివేకముచేత తన ప్రారబ్ధ కర్మ క్షయింపలేదని క్లేశముపొందుచూ, కామము లేనివాడుగనుక స్వల్ప సుఖముచేతనే సంతృప్తి నొందును— వివేకహీనుడు అనగా ఆత్మానాత వివేకము లేనివాడు విషయసుఖములెంత కలిగియుండిననూ కామము నశించక పోవుటచేత దుఃఖమును పొందుచునే యుండును— ఈ అర్థమునే విద్యారణ్యు లిట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ వివేకేన పరిక్లిశ్య న్నల్పభోగేనతృప్యతి ।
అన్యథానంత భోగే ఽ పినైవతృప్యతి కర్హిచిత్॥ ఇంకనూ

శ్లో॥ పరిజ్ఞాయోప భుక్తోహి భోగోభవతి తుష్టయే ।
విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రియేతి న చోరతామ్ ॥

వివేకముతో విషయసుఖంబుల ననుభవించినయడల అనుభవములు దుఃఖ కారణముగాక తృప్తినిచ్చుచూ సుఖమునిచ్చుచుండును. వీడు దొంగ యని తెలిసి వానితో స్నేహముచేసినయెడల వాడు స్నేహితుడగును. కాని దొంగకానేరడు— అని గూడతెలుపుచున్నారు—

---

# అంతఃకరణాభాస వివేచన

ముముక్షువైనవాడు శ్రుతి ప్రామాణ్యముచే పలువిధముల చరమవృత్తి సాక్షాత్కారపర్యంతము దృశ్యమిథ్యాత్వమును స్థిరముచేసి సాక్షిరూపమైన తన సత్యస్వరూపమును బాగుగా తెలుసుకొని అనుసంధానమును చేయుచుండవలయును. ఇట్లు చేయుటకు విషయము బాగుగా మనోగోచరమగుటకు ప్రసిద్ధమైన వ్యవహారదృష్టాన్తములను అనగా యుదాహరణములను ◦సుకొని వివేచనమును చేయవలయును. ఇది ఒకమార్గమై యున్నది. గాన సాక్షియైన తన స్వరూపమును గ్రహించుటకు అనుకూలమైన ఉదాహరణలను సుకొనుదము. ఇందు సాక్షి స్ఫటికశిలవంటివాడు. అంతఃకరణమైన సూక్ష్మోపాధి రామచిలుక ( రము) వంటిది. స్థూలదేహము చిలుక నివసించు గూడు వంటిది. ఈ సుక్ష్మోపాధియైన చిలుక తన అనాద్యవిద్యా కామకర్మఫలములను అనుభవించుటకు సాక్షిరూపమైన స్ఫటికమణి యాశ్రయముచే ఈ సర్వాధిష్ఠానమైన స్ఫటికశిలనే ఆధారము చేసికొని స్థూలశరీర మను గూడులో ప్రవేశించి అనుభవములను పొందుచుండును. ఇట్టి యనుభవములను స్థూలశరీరరూపమైన యీ గూడు శిథిలమగువరకు పొందుచూ అందులోనుండి అది నశించిన వెంటనే తన కర్మఫలములను అనుభవించుటకు తగిన వివిధ ఉపాధులను (స్థూలశరీరములను) సా ·అను స్ఫటికమణి సహాయముతో ప్రవేశించి తన యనుభవములను పొందుచుండును. ఇట్లు చిలుక పొందు అనుభవములలో సాక్షియగు స్ఫటికమణికి ఎట్టి సంబంధము ఉండదు. అది చేయు అన్ని క్రియలును, అనుభవించు సుఖదుఃఖములూ చిలుకవేగాని స్ఫటికమణికి చెందినవి ఎంతమాత్రము కావు. ఐనను ఈ కీరముయొక్క స్వరూపక్రియలను సమస్తకార్యములను సన్నిధిలోనున్న స్ఫటికమణియందు ప్రతిబింబించుచుండును. ఇందువలన చూచువారికి ఈ స్ఫటిక రములు ఒక్కటిగానే గోచరించుచుండును. కాని వివేచన చేసిన ఈ స్ఫటిక లక్షణములకున్ను, కీర లక్షణములకున్ను ఎట్టి సంబంధముగాని పోలికగాని లేదు. ఈ సాక్షియైన

స్ఫటికమణి సుఖదుఃఖములను పొందునదికాదు. అందులో కర్తృత్వాదులూ, గమనా గమనములూ లేవు. సర్వదా తన ప్రకాశముచేతనే ఎట్టి వికారము లేక ప్రకాశించుచుండును. అన్తఃకరణ ఆభాసస్థానీయమైన కీరము సర్వదా సంపాదనేచ్ఛగలిగి, కర్తృత్వభోక్తృత్వములతో సుఖదుఃఖములను పొందుచు, పరుగెత్తుచు, సర్వవికారములను పొందుచుండును. ఇట్టి విరుద్ధ లక్షణముగల రెంటిని ఒకటిగా దలచుటయే, యజ్ఞానము. ముముక్షువైనవాడు ఈ విలక్షణ ధర్మములను కనిపెట్టి యీ రెండున్నూ ఒక్కటి కావని తెలిసికొనవలయును. అది తెలుసుకొనిన పిదప శ్రుతివాక్యము ననుసరించి తన స్వరూపముగా తెలుసుకొన్నవస్తులక్షణములు దేనియందున్నవో తెలుసుకొని దానినే తన స్వరూపముగ శ్రుతి తెలుపుచున్నదిగాన ఈ స్థూలోపాధియైన గూడును, సూక్ష్మోపాధియైన అన్తఃకరణమును, జ్ఞానపూర్వకముగా త్యజించిన, తాను ఈ దృష్టాంతమందలి స్ఫటికమణి లాగున స్వప్రకాశముతో నిశ్చల నిర్వికారుడై శేషించును. దీనినే—

శ్లో॥ అంతఃకరణ సంత్యాగా దవశిష్టేచిదాత్మని ।

అని శంకరభగవత్పాదులు చెప్పుచున్నారు ఇదిగాకను మన యనుభవములో నుండి గ్రహించుటకు అనుకూలమైన ప్రసిద్ధమైన మరియొక దృష్టాన్తమేమనగా—ఘట జలమందు ప్రకాశించు సూర్యుడు. ఈ యుదాహరణమందు మనకుగల సామగ్రిని ప్రత్యేక ప్రత్యేకముగా గ్రహించినయడల అవి :— (1) ఘటము, (2) ఘటపూరితజలము, (3) ఘటజలమందు ప్రకాశించు సూర్యప్రతిబింబము, (4) సూర్యబింబము ఇవి నాలుగు కనబడుచున్నవి. ఇట్లే (1) స్థూలదేహము, (2) సూక్ష్మ దేహము (అన్తఃకరణము), (3) అన్తఃకరణ ప్రతిబింబిత చైతన్యము (ఆభాసుడు), (4) సాక్షి ప్రత్యగాత్మ యని గ్రహించవలయును. ఇందులో మొదటిదైన ఘటమువంటి స్థూలోపాధి కేవలజడము. దీనికి జ్ఞానాజ్ఞానములు రెండునులేవు. ఇందులో జీవరూపమై యున్న సూక్ష్మోపాధికూడా జడమే. ఐనను చైతన్యముతో కలసి

కర్తృత్వభోక్తృత్వములను పొందుచూ స్థూలోపాధియందు తాత్కాలిక నివాసము చేయుచున్నది. ఇది రెండవది ఘటగత జలస్థానీయము. జలమందు ప్రకాశించు సూర్య ప్రతిబింబస్థానీయము అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యము. ఆభాసుడు, మూడవది. దీనికి బింబలక్షణములున్నను ఇది కేవల కల్పిత చిదాభాసము. ఇది ఘటజలమందు ప్రకాశించు సూర్య ప్రతిబింబము జలవికారములను పొందుచున్నట్లు అంతఃకరణగత వికారములను పొందును. ఈయనే ఆభాసుడు. ఇట్టి అభాసుని లక్షణమును——

శ్లో॥ ఈషద్భాసన మాభాసః ప్రతిబింబస్తథావిధః ।
బింబలక్షణహీనస్సన్ బింబవద్భాసతె సహి ॥

అనగా కొద్దిగా భాసించుట ఆభాసము. అటువంటిదే ప్రతిబింబము. బింబధర్మములు లేక బింబమువలె అది ప్రకాశించును గాన ఆభాసము. అని విద్యారణ్యులు తెలుపుచున్నారు. సూర్యుడు సదాస్వచ్ఛప్రకాశరూపుడుగానున్నను యీ ఘటజలగత సూర్యప్రతిబింబము ఆ జల వికారవర్ణములను గ్రహించి ప్రకాశించుచున్నట్లు యీ ఆభాసుడు సూక్ష్మశరీరమైన అన్తఃకరణములో ప్రతిబింబితుడుగాన ఆ యంతఃకరణమందలి శుద్ధమాలిన ధర్మములను గ్రహించును. తన ప్రతి ఫలమునకు ఆధారమైన ప్రత్యగాత్మ స్వరూపమును కూడా తనతోపాటు గ్రహించి తను ప్రత్యగాత్మవలె కనబడుచుండును. మూడవవాడైన ఈయనకు బుద్ధికంటే వేరే స్వరూపము లేదుగాన ఇతను కూడా మట్టిముద్దలాంటివాడే.

శ్లో॥ నహిధీభావ భావిత్వాదాభాసోఽస్తి ధియః పృథక్ ।
యథా మృదల్పమేవోక్తం ధీరప్యేవం స్వదేహతః ॥

అనగా బుద్ధి యున్నప్పుడే ఇతను ఉండుట, లేనప్పుడు లేకపోవుట అని యుండుటచే బుద్ధికంటే ఆభాసునికి స్వరూపము విడిగాలేదు అని విద్యారణ్యవచనము చెప్పుచున్నది. పైన చెప్పినవిధముగ ఈ యాభాసుడు జడ

పదార్థమైననూ స్థూలదేహమువంటివాడు కాడు. స్థూలదేహము నశించిననూ ఈ యాభాసుడు అంతఃకరణోపాధిలోనుండి గమనాగమనములను చేయు చుండును. స్థూలశరీర నాశము తరువాతకూడా సాక్షీ, ఆభాసుడు, అతఃకర ణము, ఈమూడు కలసిన సంపుటము గమనాగమనములను చేయుచూ ప్రారబ్ధకర్మ ఫలానుసారమున వివిధోపాధులను గ్రహించుచుండును. ఇదియే సంసారము. పైన నిరూపించిన ఆభాసునకు అధిష్ఠానము సర్వ హృదయ ముల యందు సర్వదా ఉజ్జ్వలముగా ప్రకాశించుచున్న, మనయుదాహరణ వివేచనములో సూర్యబింబస్థానీయుఁడగు ప్రత్యగాత్మయే. ఈ సంపుటమందలి సత్యపదార్థమైనవాడు ఇతను ఒకడే. ఈయనయే సర్వహృదయములయందు సాక్షిగా ఉన్నాడు. తక్కిన మూడు ఎట్లు కనబడినను అవి ఆభాసములు. మనకు కలుగుచున్న సంసారానుభవమును బట్టి యీ పరిశుద్ధుడైన సాక్షికి గూడ భ్రాంతిని కల్పించవలసియున్నది. ఇట్లు కల్పితభ్రాంతి యుక్తుడగు సాక్షి యనాద్యవిద్యా కామకర్మల ఫలభోక్తృత్వాదులకు కల్పితమైన యీ సూక్ష్మశరీరముతో కల్పితాధ్యాసమునుపొంది సన్నిహితుడై యుండును. కాని అప్పుడుకూడా ఈ సాక్షి వాస్తవముగా నిష్క్రియుడును నిర్వికారుడుగానే యుండును. సాక్షికి భ్రాంతికల్పితమైనను అన్యోన్యాధ్యాసకలిగి గమనాగమన ములను చేయుచూ వివిధోపాధులయందు స్థితుడైన యీ సాక్షి నిష్క్రియుడు ఎట్లు? అంతఃకరణము జడపదార్థము గనుక కర్తృత్వాద్య మానములతో అను భవములను పొందునది యెవరు? అనుశంక కలుగును. దానికి ఇవియన్నియు ఆభాసునికేయని పరిశేషన్యాయముచే ఒప్పుకొనక తప్పదుగాన ఈ యా భాసునివల్లనే సకల సంసారదుఃఖములు కలుగుచున్నవి. గాన విద్వాంసుడైన వాడు ఈయాభాసుడెట్టివాడని విచారించి నిశ్చయించుకొనిన ఆ యాభాసుని స్వరూపస్వభావములు వాస్తవములు కావుగాన వీనిని నిరూపించుట సులభ సాధ్యమగును. పై నిరూపణలో తెలిపినవిధమున ఈ యాభాసుడన్నను, ప్రతిబింబమన్నను ఒక్కటియే అని సిద్ధమగును. ఈ యాభాసుడు దర్పణము లాంటి అంతఃకరణోపాధిలో ప్రతిబింబమువంటివాడు. సాక్షిబింబమువంటి

వాడు. వీరిద్దరూ దర్పణములోయుండి ఒక్కచోట చేరియుండుటచే ఈ యా భాసుడుకూడ బింబమువలె కనబడుచున్నను బింబధర మైన ప్రకాశాదులు ఇతనికి లేవు. కాని అతను బింబప్రకాశమును, తనదిగా గ్రహించి అంతఃకరణమను దర్పణోపాధియందుండు వికారములను పొందుచు సర్వవ్యవహారములు చేయుచున్నాడు. ఇట్టివాడు మనము అద్దములో చూచు ప్రతిబింబము లాంటివాడేగదా ! గాన ఈయన వాస్తవుడో, అవాస్తవుడో అని ఈ వివేచనముచే మనము గ్రహించవచ్చును. ఈయన వివిధ వర్ణములుగల వివిధ దర్పణములయందు మన ముఖప్రతిబింబములను వివిధములుగా గ్రహించునట్లు వివిధోపాధులగు అంతఃకరణ ధర్మములనుపొందుచు వ్యవహరించును. ఈయనను నిర్మూలించుటకు ఈ యంతఃకరణ మనే దర్పణమును బోర్లించుటగాని, సివేయుటగాని చేయవలయును. అప్పుడు ఈయనకు నిలువతావులేక మనలను విడచిపోవును. అప్పుడు ముముక్షువునకు తన స్వరూపమగు కేవల బింబలక్షణములే స్ఫురించును. అభ్యాసపాటవముచే అనుభవమునకువచ్చి తన సత్యస్వరూపమును పొందును. ఇదియే మోక్షము. దీనినే–"కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్" అనగా ఎవడో యొకధీరుడు అమృతత్వమును కోరుచు స్వభావతః విషయా ముఖములైన యింద్రియములను ఆత్మ ముఖముగాచేసి ప్రత్యగాత్మను అనుభవించగలడు. అని శ్రుతి చెప్పుచున్నది.

---

# జీవ పరిశోధనావశ్యకత

ఇచట పరిశోధనమనగా ఒక వస్తువునుగురించి తనకు తెలియని దానిని మానవుడు తన బుద్ధిప్రకాశములను బాగుగా నుపయోగించి ప్రజ్ఞాసామర్థ్యములతో పదార్థసామర్థ్యమును వాస్తవముగ తెలిసికొనుట, దీనినే ఆంగ్లమున esearc అని అందురు. విజ్ఞానశాస్త్రమంతయు దీని మీదనే ఆధారపడి

యున్నది. ఆధునికమందు విద్యుచ్ఛక్తి అణుశక్తిపరిశోధకులునూ, రసాయనాది శాస్త్రజ్ఞులునూ, ఇట్టి పరిశోధనలవల్లనే వారివారి విజ్ఞానమునుపొంది మానవుల సుఖానుభవములకు నుపయోగించుచున్న విషయము అందరకును తెలిసినదే. ఇట్టి పరిశోధనావశ్యకత ఏ మానవులు ఇప్పుడు తమకు కలిగి యున్నస్థితి సౌఖ్యములతోను పదార్థవిజ్ఞానముతోను తృప్తి చెందక వస్తు పరిశోధనను గావించి వాటియొక్క శక్తి సామర్థ్యములను గ్రహించి దాని లాభమును పొందనిచ్ఛగించుచున్నారో అట్టివారికే ఈ పరిశోధనావశ్యకత కలుగుచున్నది గాని జనసామాన్యులకు కలుగుటలేదు. ఇట్లే ఈ బ్రహ్మ విద్య ఆవశ్యకత యనునది గూడ జనసామాన్యులకు కాక, తమ నిత్యనిరతిశయ సుఖము కోరు వులకే యావశ్యకమగుచున్నది. ఇట్టివారు తమతమ అభ్యాస పాటవములచే అఖండ పరిపూర్ణ నిత్యసుఖమును పొందుదురు. జీవ వివేక మనునది జీవ పరిశోధనలవలననే కలుగునుగాని మరియొక విధమున కలు గదు. ఈ వపరిశోధనము జీవవివేకమునకు సాధనముగానుండును. ఆత్మ విచారములేనిది శాస్త్రము ఎంత పఠించినను శబ్దజన్యజ్ఞానము కలుగును గాని ఆత్మానుభవము కలుగదు. ఇట్లు వపరిశోధనవల్ల కలుగు ఆత్మజ్ఞానము నిత్యనిరతిశయ సుఖమైనదై యుండును. కాని దృశ్యపరిశోధనలవల్ల కలుగు విజ్ఞాన సుఖానుభవములన్నియు తాత్కాలికములుగాని నిత్యములగుటలేదు. ఎట్టి జీవునకైనను ఈ దృశ్యపరిశోధనలన్నియు పరిమితి, స్వల్పకాలసుఖ ముల నిచ్చుచున్నవే కాని వుడు తానుకోరు సుఖమును శాశ్వతముగా నిచ్చుట లేదు. ఎట్టి, ఎంతటి సుఖానుభవముల యందైనను సుఖస్యానంతరము జీవు నికి దుఃఖము కలుగుచునేయున్నది. ఇట్టి దుఃఖములలో ప్రబలమైనది మరణ దుఃఖము. సార్వభౌముడుగూడ తనవారు మరణించిన దుఃఖమునుగాని, తన మరణదుఃఖమునుగాని పొందక మరణించుటలేదు. కనుకనే ఇట్టి వదుఃఖ మును ఆత్యంతికముగా నివృత్తిని చేయుటకుగాను, శాస్త్రము మనలకు అమృ తత్త్వసిద్ధి కలుగు నుపాయములను బోధించుచున్నది. శాస్త్రము ఎల్లప్పుడును వునికి సామాన్యముగ తెలియని విషయమునందు ప్రవర్తించునుగాని సర్వుల

కును తెలిసిన సామాన్యానుభవములోనున్న విషయములను బోధించదు. శాస్త్రము, శోధితజీవుడు సుఖస్వరూపమైన పరిపూర్ణ నిరుపాధికబ్రహ్మ యనియు, అంతఃకరణ తాదాత్మ్యాధ్యాస కలిగిన భ్రాంతిజీవుడు ఉపాధివిశిష్ట పరిచ్ఛిన్నజీవుడు అనియు, ఈ పరిచ్ఛిన్న భ్రాంతివలననే, సర్వదుఃఖములు వునికి కలుగుచున్నవనియు తెలుపుచున్నది. కాని శాస్త్రము తెలుపుచున్న అట్టి అద్వి య పరిపూర్ణ సుఖస్వరూపము ఇప్పుడు జీవునికి గోచరించుటలేదు. కాన తన పరిపూర్ణ సుఖస్వరూపమును పొందగోరు జీవునకు, నేను అనుకొను తన స్వరూప పరిశోధన మావశ్యకముగ కనబడుచున్నది. లోకమునందు గూడ పరిశోధనలేనిది, యే వస్తువు యొక్కయూ విశేషజ్ఞానము కలుగుట దు. ఈ విషయ విచారణానుభవపరిశోధనాభ్యాసములవల్ల వభ్రాంతి నివర్తించి జీవుడు తన వాస్తవ సుఖస్వరూపమును పొందగలడు. అప్పుడు జీవునికి సుఖము నిత్యమగును.

వ పరిశోధన మనగా వుడు ఇప్పుడు తనకు కలుగుచున్న దృశ్య దుఃఖము ఆత్యంతికముగా నివర్తింపజేసికొనుటకుగాను, గురుశాస్త్రబోధ ననుసరించి శ్రుతి, యుక్తి, అనుభవ పూర్వకముగా నేను అను తనను గురించి విచారించి తన వాస్తవ స్వరూపమును గ్రహించుట. ఏ జీవునకైనను ఇట్టి విచారణ అనగా ఆత విచారము లేనిదే నిత్యానిత్య వివేకము, తన సత్యస్వరూపజ్ఞానము కలుగదు. జీవుడు అవిచారమువలన సర్వదృశ్య దుఃఖముల ననుభవించుచు సంసారబంధమును పొందుచున్నాడు. శాస్త్రబోధ ననుసరించి తన స్వరూపానుభవముల విచారణ అనగా పరిశోధనను బాగుగ చేసినయెడల ఈ దృశ్యదుఃఖము నివర్తించి నిత్యసుఖమును పొందగలడని,

శ్లో॥ అవిచారకృతోబంధో, విచారేణ నివర్తతే ।
తస్మాత్ జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్ ॥

శ్లో॥ మిథ్యాజ్ఞానస్య విచ్ఛిత్తిః సమ్యగ్జ్ఞానేనసిధ్యతి ।
సమ్యగ్జ్ఞానం పదార్థస్య విచారేణైవ నాన్యథా ॥

అని శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. అనగా యథార్థమగు పదార్థములను అనగా వస్తుయాథార్థ్యమును బాగుగ విమర్శించినచో చక్కని జ్ఞానము కలుగును. ఆ జ్ఞానముచే భ్రాంతి అనగా వస్తువుయొక్క అయథార్థ జ్ఞానము నశించును. ఈ విషయమున విరోధమేమియు ఎట్టివారికిని యుండదు కదా? మరియు జ్ఞానమనునది విమర్శచే అనగా వస్తుపరిశోధనచే కలుగును గాని అన్యథాకలుగదనుట అందరకును స్పష్టమేగదా? అని వీని అర్థము. ఇట్టి వస్తువిచారణమే పరిశోధన యనబడును. మానవుడు ఏ వస్తు వివేకము కోరునో ఆ వస్తువుయొక్క పరిశోధన యావశ్యకమనిన్నీ, అది సాధనమనిన్నీ కూడ తెలియు చున్నది. ఇచట ప్రకరణమును బట్టి మనకు విషయుడు జీవుడు గాన దాని పరిశోధనము ముముక్షువునకు ఆవశ్యకమైయున్నది. కాన త్రికాల జ్ఞానులైన ఋషిపుంగవులవలన వారివారి దివ్యదృష్టి సామర్థ్యములచే ఇట్టి పరిశోధనానుభవములను పొంది శారీరకుని అనగా జీవుని విషయము శాస్త్రోక్తముగ మీమాంసలుచేసి అట్టి నిత్యసుఖోపాయములను, తత్సాధనములను గూడ తెలిపియున్నారు. ఏ ఏ జీవులు యిప్పుడు తమకు కలుగుచున్న లోకానుభవములన్నియు, అనిత్యములయి, దుఃఖకరముగాయున్నవియని తలచి చింతను పొందుదురో అట్టి జీవులకు తమ జీవానుభవ పరిశోధనమును శాస్త్ర సమ్మతిన విచారణ చేసికొనుట యావశ్యకము. ఇచట యొక సంశయమున కవకాశమున్నది. అది ఏదియన పూర్వాచార్యులైన ఆకాలవేత్తలు ఈ విషయ పరిశోధనచేసి మనలకు శాస్త్రముద్వారా తెలిపియున్నారుకదా? అట్టి తరి తిరిగి ఈ పరిశోధనావశ్యకత ప్రతి. జీవునకున్నూ ఎందులకు, తెలిసిన దానిని యుపయోగించుకొనవచ్చునుగదా? యనుశంక. కాని ఇది సరియైనది కాదు. ఏలనన పరిచ్ఛిన్నమూర్తి పదార్థములను గురించి యొకరు చేసిన పరి శోధనాంశములు తదితరులకు నుపయోగపడగలవు. కాని ఆత్మయను శుద్ధజీవ స్వరూపము పరిచ్ఛిన్నమూర్తి పదార్థముకాదు. ఇది అద్వితీయమైన అఖండ పరిపూర్ణ పదార్థము. ఆత్మ యనగా అహం, నేను అని గోచరించుచున్న తానే గాని ఆత్మ తనకు భిన్నముగాలేదు. ఇంద్రియగోచరమును గాదు. ఏలనన

చూచుటకు ఆత తనకన్న అన్యమైన పదార్థముకాదు. కాన ఈ వ పరిశోధన యనునది ఏ జీవునకాజీవుడు ఉపనిషదైక శాస్త్రజ్ఞానము ననుసరించి తాను స్వప్రయత్నముతో శృతి, యుక్తి అనుభవపూర్వకముగ వపరిశోధన చేసికొనుట యావశ్యకమైయున్నది. శృతి, "మాయామాత్రఉమిదంద్వైతమ్, అద్వైతమ్ పరమార్థతః" అని తెలుపుచున్నది. పరమార్థపదార్థమే సత్యపదార్థము. ఆ ఒక్కటియైన సత్యపదార్థమే నేను. నేను, అని ప్రతి జీవునిచేతను తానుగా పరిచ్ఛిన్నభ్రాంతితో అనుభవింపబడుచున్నది. కాని వుడు తన పరమార్థ, అఖండ, పరిపూర్ణ, సత్యస్వరూపమును మరచి భ్రాంతియుతుడై తానుకానట్టి పరిచ్ఛిన్న జడ పదార్థములతో తాదాత్మ్యధ్యాసము పొందినట్లు కనబడుచు దృశ్యానుభవములను చేయుచున్నాడు. ఈ దృశ్యానుభవములన్నియు, వాస్తవములు, నిత్యములు, కాజాలవు ఇవి అనిత్యములై వునికి దుఃఖక్లేశములనిచ్చుచున్నవి. కాన తన నిత్య నిరతిశయ సుఖము కోరు జీవునికి తనను గురించి తన వాస్తవ సుఖస్వరూపమును గుర్తించుటకుగాను పరిశోధన మావశ్యకమగుచున్నది.

ఇట్టి జీవపరిశోధనవల్ల సారాంశమేమి తేలుచున్నది యనిన ఈ అహం, నేను అనుకొను జీవుడును, పరమాత యూ ఒక్కటేనననీ, ఈ వనానాత్వ, విచిత్ర, దృశ్యానుభవములన్నియూ, ఒక్కటి అయిన ఆ పరమాత్మయందే అనాది అవిదా భ్రాంతికల్పితములుగ నున్నవనినీ తెలియుచున్నది. ఏ మానవుడు తన ప్రయత్నముచే, తన, అనాది, అవిదా భ్రాంతిని, శృతి, యుక్తి, అనుభవపూర్వకముగ విచారణచేసి, తన వాస్తవ స్వరూపమును గ్రహించి అనుభవమును సంపాదించునో అట్టి వుడు, తాను బ్రహ్మ యే అగుననియు శాస్త్రము తెలుపుచున్నది. ఇట్టి బ్రహ్మ జ్ఞానముచేత జీవుడు మరచిన తన నిత్య, నిరతిశయ, అఖండపరిపూర్ణ స్వరూపమును గుర్తించి తత్స్వరూపుడే యగునని శాస్త్రము మనకు తెలుపుచున్నది. శాస్త్రి మనినను, యుపనిషత్తులన్ననూ ఒక్కటియే. ఇట్టివి వసంసారతరణోపా

యముకుగాను శృతిమాతచే తెలుపబడిన విషయములు. అందు ఈ తత్త్వ శాస్త్రిమెట్టిది యనిన సిద్ధ రసాయన ఔషధమువంటిది. కాని రసాయన ఔషధము కొంతకాలము మాత్రము ఆరోగ్యసిద్ధినిచ్చును. ఈ తత్వశాస్త్ర రసాయనౌషధము బాగుగ అభ్యసించిన అమృతత్వసిద్ధి నిచ్చును. అనగా జీవునకు మరణభయమును పోగొట్టి వదశయందు కూడ ముక్తి, సుఖము నిచ్చును. కాన సర్వ ముముక్షువులకును ఈ జీవ పరిశోధనము ఆవశ్యకముగా కనబడుచున్నది.

పైన తెలిపినయట్లు ఈ జీవ పరిశోధనమే జీవ వివేకమునకు సాధన మగును. ఇట్టి జీవ పరిశోధన మెట్లుండవలెననగా "కోహంకథమిదం జాతం కోవాకర్తాస్యవిద్యతే" నేను ఎవరు? ఈ ప్రపంచమెట్లు పుట్టినది. దీనికి కర్త ఎవరు?

శ్లో॥ సమస్తం ఖల్విదం బ్రహ్మ సర్వమాత్మే దమాతతమ్ ।
అహమన్య ఇదంచాన్యదితి భ్రాంతిం త్యజానఘ ॥

అనగా స్వశరీర సమస్త ప్రపంచంబును బ్రహ్మ స్వరూపంబుగా ఎరుంగుము. నేను వేరు. ఈ జగము వేరు, అను భ్రాంతిని విడువుమని తెలుపుచున్నది. బ్రహ్మ యన్ననూ, ముఖాత్మ యన్ననూ, ఒక్కటియేయని గ్రహించవలెను. ఇంకనూ,

శ్లో॥ కోనామబంధః కుతఏష ఆగతః ।
కథంప్రతిష్ఠాఽస్య కథం విమోక్షః ।
కోఽసావనాత్మాపరమః క్వఆత్మా ।

అనగా బంధమననేమి? అది ఎట్లు కలిగినది? దాని స్థితి ఎట్టిది? ఆ బంధము యొక్క విముక్తి ఎట్లు? అనాత్మ యననేమి? పరమాత్మ యననేమి? స్వస్వరూప వాత్మ ఎవరు? ఆ జీవ పరమాత్మ లను తెలుసుకొను విధమేది? అను

మొదలుగాగల శాస్త్రీయ విషయ విమర్శయే జీవునికి తన పరిశోధనయు, జీవవివేకసాధనమున్ను అగుచున్నది. ఇంకనూ ఈ విచారావశ్యకతను గురించి యోగవాశిష్ఠమందు వశిష్ఠభగవానులు శ్రీరామచంద్రమూర్తికి ఇట్లు పదేశించుచున్నారు—

శ్లో॥ శాస్త్రావబోధామలయా ధియా పరమపూతయా।
కర్తవ్యః కారణజ్ఞేన విచారోఽనిశ మాత్మనః ॥

మొదట సత్కర్మములుచేసి, ఈశ్వరార్పణము చేయుటచే మిగుల పవిత్రమైనట్టియు, పిదప నివృత్తశాస్త్రార్థమెఱుంగుటచే నిరలమగుబుద్ధిచే ఇది దీనికి కారణము, దీనికి నిదికార్యమని తెలిసినవాఁడై ఆత్మ విచారం బెప్పుడు చేయుచుండవలయును.

శ్లో॥ విచారాత్తీక్ష్ణ తామేత్య ధీః పశ్యతి పరంపదం।
దీర్ఘసంసారరోగస్య విచారోహిమహౌషధమ్ ॥

ఆత్మ విచారమువలన బుద్ధి చురుకుదనమునుపొంది పరబ్రహ్మను చూడఁజాలును. ఆత్మ విచారము సంసారమను దీర్ఘరోగమునకు గొప్ప ఔషధముగదా.

---

# జీవుని సాక్షిభావసుఖము

ఇంతవరకు మనము పలువిధముల శ్రుతి, యుక్తి, అనుభవములతో చేసిన నిరూపణలనుబట్టి ఇదం యను దృశ్యము, వాస్తవముగ ఒక్కటియైన ఆ బ్రహ్మయందే వివర్తముగ భాసించుచున్నదనియు (అనగా భ్రాంతిచే కల్పితమనియు) వ్యవహారమందు మనలకు స్ఫురించుచున్న యీ అహం

అను నేనుఅనువాడుగూడ కల్పితుడేననియూ, అహం అను వాస్తవమైన వాడు పరిపూర్ణుడు, నిష్క్రియుడు, సర్వవ్యాపకుడు అయిన ఆ పరమాత్మ యే మనలో సాక్షిరూపమున భాసించుచున్నాడనియు, యీయనయే అహం, నేను అను మనవాస్తవస్వరూపమనియు నిశ్చయించితిమి. మనలో యీ వాస్తవసాక్షియే సుఖస్వరూపుడని శాస్త్రము మనలకు తెలుపుచున్నది. మన ప్రతియొక్కరిలోనున్న యీ సాక్షి, లోకవ్యవహారములలో సాక్ష్యములిచ్చుటే వృత్తిగా చేసుకొని వించు సాక్షులవంటివాడు కాడు ఇదిగాకను సాక్షమిచ్చి నందున సాక్ష్యత్వ లక్షణముచే యీయన సాక్షియైనవాడు కాదు. మరియేమనిన స్వభావముచే యీయన పరిపూర్ణుడు, స్వప్రకాశుడు, నిష్క్రియుడు, కర్తృత్వాదులు లేనివాడు, అసంగుడును యగుటచే యీ సాక్షీనామము ఆయనయొక్క తటస్థలక్షణములచే వచ్చినదే కాని సాక్ష్యమిచ్చుట ఆయన పనికాదు. అయిననూ శాస్త్రము సాక్షియని వ్యవహరించుచున్నది. ఈయన పరిపూర్ణుడు, సుఖస్వరూపుడనియు గూడ తెల్పుచున్నది. ఈయన యందు సాక్షిరూప కర్తృత్వములు మనము ఆరోపించుచున్నవే గాని యీ సాక్షికి సాక్షిత్వములతో యెంతమాత్రము పనిలేదు. ఎట్లన చలనరహితుడైన సూర్యునియందు యీ రోజున సూర్యుడు రాలేదనిన్నీ అనగా ఉదయించలేదని, సూర్యుడు అస్తమించుచున్నాడనియు, యింకనూ సూర్యుని దయవల్ల (సూర్యప్రకాశమునుబట్టి) నాబట్టలు ఆరినవనియు, మొదలుగాగల కర్తృత్వము లాయనయందాపాదించి మన యనుభవములను పొందుచున్నాము. కాని వాస్తవము విచారించిన సూర్యభగవానునికి మనబట్టలు యెండించుట యొకపనియా ! లేకపోయిననూ ఆయనప్రకాశమును మనము వాడుకొనుచూ ఆయన యిట్లు మనలకు చేసినాడని ఆపాదించుచున్నాము. ఇట్లే మనలోని యీ సాక్షి సర్వవ్యాపకుడైన స్వప్రకాశకుడగుటవల్ల, అందుచే వులకు దృశా దృశ్య జ్ఞానము కలుగుచుండును. ఇంతియే కాని జీవులకర ఫలానుభవములతో యీసాక్షి యెంతమాత్రము సంబంధపడక ఆయన సహజ ప్రకాశముచే జీవులకు జ్ఞానాజ్ఞానములు గోచరించుచుండును, కాన మనలోయున్న

పరమాత్మయైన యీప్రత్యగాత్మనే సాక్షియని వ్యవహరించుచున్నాము. ఈయన సర్వదా సుఖి. అనగా నిత్యసుఖస్వరూపుడు. ఈయన సాక్షిమాత్రుడునూ సుఖస్వరూపుడునూగా యున్నాడు. అట్లుగాక ఆయన సాక్షిస్వభావమును విడిచి యెంతమాత్రము తను, కర్తృత్వభోక్తృత్వాది వికారములను పొందిననూ ఆయన సుఖస్వరూపమునకు భంగము కలుగును.

లోకానుభవములోగూడ, సాక్షియన్నయెడల ప్రేక్షకుని వంటి వాడు. జరుగు కర్తృత్వక్రియాదులలో యెంతమాత్రము సంబంధము యున్ననూ అందుసాక్షిగా నుండుటకు వీలులేదు. జరుగు కార్యక్రమమందు తనకు యెట్టి సంబంధము లేనివాడే సాక్షియగును. ఇట్టి సాక్షి, జరుగుకార్యక్రమములలో తనకు లాభనష్టాదుల సంబంధము యుండదు గనుక అట్టి లాభనష్టములవల్ల కలుగు సుఖదుఃఖముల తానుపొందడు. ఇట్లు కలుగు వైషయిక సుఖదుఃఖములను త్యజించిన మిగులునది తన సుఖస్వరూపమే. ఇదియే నిర్విషయ సుఖము. నిత్యము.

సాక్షి ప్రేక్షకునివంటి వాడని తెలిపియుంటిమిగదా. వ్యాయామ క్రీడారంగములలో అనాయాసముగ ప్రేక్షకునికి కలుగుచున్న యానందము, అందు వ్యాయామకులకు అట్లుండుట లేదుగద! ఇట్లే నాటకరంగములలో ప్రేక్షకులకుండు యానందము పాత్రలను వహించిన నటులకు యుండదు గదా. ఇచట విషయవాస్తవానందమును, సాక్షీమాత్రులుగా నున్న ప్రేక్షకులేగదా పొందుచున్నారు. ఇట్లే యీ జగన్నాటక స్థితులయందు మానవులు, వ్యాయామకులు, నటులలాగున కర్తృత్వాద్యమానరహితులై, జగని థ్యాత్వ నిశ్చయ జ్ఞానపరులై తమతమ దృశ్యానుభవములను నాటకరంగస్థలములోని ప్రేక్షకులలాగున వారివారి ప్రారబ్ధ కర ఫలానుభవములను సాక్షీభావముతో యనుభవించుచుండిన, జీవునికి ప్రారబ్ధకర్మఫలనిర్ణీతమైన యనుభవమువల్ల కలుగు సుఖదుఃఖముల ప్రాసుభవములను పొందక, తాత్కాలిక సుఖదుఃఖములను అభాసములుగా ననుభవించుచుండును. లోగడ వివేచనచేసి నిరూ

పించినయటుల యీ వర్తమాన జన్మకర్మానుభవములన్నియూ ప్రతియొక్క జీవునికి వారివారి ప్రారబ్ధ కర్మ ఫలముగా అనుభవమునకు వచ్చునుగాని మరి వేరువిధమున రావు. వచ్చుటకుగాని వీలులేదు. కాన ఇట్టి ప్రారబ్ధాను భవములతో వునికి కలుగుచున్న యీ జన్మ, విధింపబడిన శిక్షవంటిది. అనగా యెట్టివారికైననూ విధింపబడిన శిక్షాకాలయనుభవము మీరుటకు సాధ్యము కాదుగదా. అయిననూ శిక్షపొందినవాడు తన నడవడిసౌజన్యములచే అధికారుల దయను సంపాదించుకొని కొంత సుఖము పొందునట్లు ముముక్షువైనవాడుకూడ తనజ్ఞాన సౌ.ల్యములచే కొంతవరకు యీ దృశ్యానుభవముల దుఃఖమును కొంతవరకైననూ తగ్గించుకొనవచ్చును. దానికి ఒక్క సత్య జ్ఞానముచే తప్ప యీ ప్రారబ్ధకర్మఫలానుభవముల సుఖదుఃఖ తీవ్రతలను కూడ తగ్గించుకొనుటకు సాధ్యముకాదు. అప్పుడైననూ జీవుడు యీ జన్మమందు తనకు కలుగుచున్న సుఖదుఃఖముల తీవ్రతలు తగ్గించుకొనవచ్చును గాని కరానుభవమును తప్పించుకొనుటకు మహనీయులకు గూడ సాధ్యము కాదు. దీనినే

శ్లో॥ అవశ్యం భావి భావానాం ప్ర కారో భవేద్యది ।
తదా దుఃఖైర్నలిప్యేర న్నలరామయుధిష్ఠిరాః ॥

అని విద్యారణ్యులు తెలుపుచున్నారు. కాన ముముక్షువు దీనిని బాగుగ గుర్తించి తనపరమార్థస్వరూపము కూటస్థ సాక్షివంటిదియని తెలుసుకొని, తన ప్రారబ్ధానుభవములను సాక్షిమాత్రుడుగా యనుభవించుచుండ వలయును. ముముక్షువైనవాడు యిట్లు వివేకముతో సాక్షిభావముగ వున్నఎడల మనలకు రాజమార్గములలో తిరుగు జనుల సంబంధము లాగుననూ, అంగడివీధుల యందునూ ఉత్సవాదులలోను అప్పుడప్పుడు కలుగు సంఘర్షణల లాగుననూ చూచుచూ తనయనుభవములు గూడ నిరాదరణములై తన దుఃఖక్లేశాను భూతిని తగ్గించును. ఇదియే సాక్షిభావ ప్రత్యక్షలాభము. కాని యిట్టి సాక్షి.

వు పేక్షాభావములు దృశ్యానుభవములయందు సాధకుని వివేకముచే కలిగినప్పుడే యది యిహపరసాధనమగును గాని అట్లు గాక అవివేక, మందప్రజ్ఞతా త్సారములతో యిట్టి భావమును మానవుడు అవలంబించిననూ అది తాత్కాలికమై పర్యవసానమున అధికదుఃఖమునకే హేతువగును. అట్లు గాక తననిత్యానిత్యవివేకాదులచే దృశ్యానుభవములయందు కలుగు సాక్షీ భావము తన ప్రత్యక్షానుభవ సుఖసాధనమగును. ఇంకనూ యిట్టివాడు వివేకా భ్యాసపరుడుగాన కాలక్రమేణ అట్టి స్థితి అభ్యాసములు తనబంధవిముక్తికి సాధన మగును. కాని "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" అను శ్రుతివచనము ననుసరించి తత్త్వజ్ఞునికైననూ తన ప్రారబ్ధకర్మ ప్రతి బంధము యున్నంతవరకూ సాక్షాత్కారము కలుగక, తదుపరి తన అభ్యాస పటిమచే సాక్షిభావముగానుండు యీ ముముక్షువు తన వాస్తవ రూపమైన సుఖ స్వరూపమును పొందును లేక అనుభవించుచుండి ముక్తుడగును.

---

# తత్వజ్ఞానముచే వ్యవహారసుఖ నిరూపణ

జగని ధ్యాత్వ నిశ్చయముతో అద్వైతానుభవము (జ్ఞానము)ను సంపా దించిన తత్త్వజ్ఞుడు దేహపాతానంతరమందు తిరిగి జన్మ కారణములేదుగాన ఈ జన్మావృత్తి రహితుడై పరమప్రాప్తినిపొందును. ఇట్టి మహనీయుడు జీవన్ముక్తుడుగా తెలియబడుచున్నాడు. అనగా -వించియుండిన దశయందే సుఖమును పొందుటగాన ఇతడు జీవన్ముక్తుడని చెప్పబడును. -వదశయందు గూడ ఇట్టి తత్త్వజ్ఞుడు తన ప్రారబ్ధానుసారమనుభవించవలసిన అనుభవము లకు ఇట్టి తత్త్వజ్ఞానము చాల అనుకూలమగును. ఎట్లనగా - మన యను భవములో సాధారణముగా సత్యవస్త్వనుభవములచే అధిక సుఖదుఃఖములను పొందుచున్నాము. కల్పితవస్తువులచేకలుగు అనుభవములవల్ల న్యూనసుఖ దుఃఖములను పొందుచున్నాము. ఇది యందరి యనుభవములో నున్నదే.

మనుష్యజన పుణ్యపాపఫలమిశ్రితముగాని, కేవల పుణ్యమువల్ల కాదని శాస్త్రమువల్ల తెలియుచున్నది. కేవల పుణ్యఫలములకు దేవతా జన్మములనుపొంది వారివారి పుణ్యఫలానుభవానంతరము మనుష్యలోకమునకు వచ్చుచుందురని "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" "అనుస్మృతితెలుపుచున్నది. కాన మనుష్య జన్మ మునెత్తిన ప్రతివారు సుఖముతోపాటు దుఃఖమును కూడ అనుభవించవలసియున్నది. ఇట్టి స్థితిలో సుఖము ననుభవించుట అందరికిని ఇష్టమేగాని, దుఃఖానుభవము ఎవరికిని ఇష్టము కాదుగద ! సంప్రాప్తమగు దుఃఖములను దృశ్యసత్యత్వజ్ఞానముతో అనుభవించుట అధిక దుఃఖమునకు హేతువగుచున్నది. జగన్మిధ్యాత్వనిశ్చయానుభవమును పొందినవారికిగాని, లేక తన్నిశ్చయదృఢజ్ఞానము గలవారికిగాని, లోకమున అనుభవింపబడు సర్వవ్యవహారములు అసత్యబుద్ధితో వ్యవహరింపబడునెడల ఆవస్త్వసత్యత్వ జ్ఞానము వారియొక్క దుఃఖానుభవము నాభాసము గావించి తగ్గించును. ఇది ప్రత్యక్షలాభమని గ్రహించవలయును. అనుభవములోగూడ చలన చిత్ర ప్రదర్శనములలో ఎంతఘోరదుఃఖ ప్రదర్శనములను చూచినను అవి మనకు తాత్కాలిక కించిద్దుఃఖమును మాత్రమే యిచ్చును. అదేవిధమైన వాస్తవ దృశ్యమును చూచినప్పుడు ఆదృశ్యమును చూచిన తరువాత రెండు రోజులు నిద్రపట్టక భయదుఃఖములను పొందుచుండును. కేవల ప్రేక్షకత్వములోనే సత్యాసత్యదృశములయందు ఇట్టి యనుభవము కలుగుచుండగా, సత్యదృశ్యాను భవములో ఈ దుఃఖ తారతమ్యమెంతయుండునో ఊహించి తెలుసుకొనవచ్చును. కాన సత్యవస్త్వనుభవదుఃఖముకన్న, అసత్యవస్త్వనుభవము అనగా మిథ్య యని జ్ఞానముచే గ్రహించి అనుభవించు పదార్థదుఃఖాదులు ఎంతన్యూనత పొందునో గ్రహించవచ్చును. ఇది అందరికిన్ని అనుభవ విషయమేగాన ఈ జగన్మిథ్యాత్వజ్ఞానదార్ఢ్యము, మనలకు జీవదశానుభవములకు కూడా చాలా ఉపకరించును. ఇట్టి జ్ఞానసంపాదనచే ఇహపరలాభములు రెండును కలుగుచున్నవిగాన ఇట్టి జ్ఞానసంపాదన వివేకులందరికిన్ని ఆవశ్యకమగుచున్నది. ఇట్టి జ్ఞానము ఆత్మార్థముగాని, పరార్థముకాదు. ఈ జగత్తంతయు సతానృత

రూపమని శ్రుతి తెలుపుచున్నది. ఇందు సత్యాసత్యములు రెండున్నూ కలసి యున్నవి. అందులోని అనృతమును త్యజించి సత్యమును గ్రహించుట ముముక్షువున కావశ్యకము. జగని థ్యాత్వ నిశ్చయదార్ఢ్యమును పొందిన మహనీయులకు రాగద్వేషాదులు కాలక్రమేణ క్షయించును. పరమశత్రువులైన రాగద్వేషాదులు తగ్గుటకు ముఖ్యసాధనమైన మరియొక అంశమును గూడ జాగ్రతతో ఆలోచించవలసియున్నది. అదియేదన—ధనేచ్ఛ లోకములో "ధన మూలమిదం జగత్" "అర్థా బహిశ్చరాః ప్రాణాః" అను లోకోక్తులను బట్టి అర్థసంపాదనకు ప్రాణములను కూడ కోలుపోవుచున్నారు. వ్యవహార సాధనమైన యీ ధనమే అందరిచేతను కోరబడుచూ ప్రరాగద్వేషములు అధిక దుఃఖక్లేశములకు కారణములగుచున్నవి. ఈ విషయము అందకిన్నీ యనుభవమే. ఇట్టి అధిక దుఃఖక్లేశములకు కారణమగుచున్న ధనభోగైశ్వ ర్యముల స్వరూపము నిచట విచారింతము—

ఈ పరమార్థ విషయ నిర్ణయములలో లోకబోధకన్న శాస్త్రిబోధను, శాస్త్రబోధకన్న తత్త్వబోధను అధిక ప్రామాణ్యముతో గ్రహించవలయును. ఎందుచేతననగా – తత్త్వమనగా వాస్తవముగాన దీనినిబట్టి తక్కిన రెండు జ్ఞానములున్నూ అవాస్తవములనిన్నీ, ఐనను వాస్తవ గ్రహణమునకు పరం పరగా ఇవి సాధనములని గ్రహించవలసియున్నది. ఈ ధనభోగైశ్వర్య సంపత్తులు ప్రతివారికిన్నీ వారివారి ప్రారబ్ధకర్మనుబట్టి సంప్రాప్తమగుచున్నవి గాని, కోరుకున్నంత మాత్రమున వచ్చునవి కావు. కోరికలవల్ల కలుగునది దుఃఖముగాని, సుఖము కలుగుటలేదు. అందుచే ప్రారబ్ధానుసారముగా గలుగు ఈ ధన విషయసంపత్తి సుఖదుఃఖములను సక్తతారాహిత్యముగ అనుభవింప వలయునని శాస్త్రిము చెప్పుచున్నది. దీనినే కర కౌశలమని గీతలలో చెప్పు చున్నారు. ఇట్లు సక్తతారాహిత్యముచే చేయుసర్వకర్మలను అనుభవించుటయే జ్ఞానకౌశలము. ఇట్టి కౌశలముచేపొందు అనుభవమువల్ల కలుగు వికారాదులను, అనగా వాటియొక్క మంద ప్రానుభవములను అధిక న్యూనతలతో ననుభ వింపవచ్చును. ఎట్లన, ఎండ ప్రతను అంతటను తగ్గించుట సాధ్యము కాక

పోయినను అపేక్షిత ప్రదేశములయందు ఛత్రపాదుకాది పరికరములచే తగ్గించుకొనునట్లు జ్ఞానమను ఛత్రముచే ఈ కర్మ కౌశలములతో సుఖదుఃఖముల త్రీవ్రతను తగ్గించుకొనవచ్చును. కాని ప్రారబ్ధానుభవము ఎవరికిన్నీ తప్పదు. దీనినే పంచదశిలో—

శ్లో॥ అవశ్యంభావిభావానాం ప్రతీకారోభవేద్యది ।
తదా దుఃఖైర్నలిప్యేరన్ నలరామ యుధిష్ఠిరాః ॥

అనగా కర్మప్రాబల్యముచే తప్పనిసరిగా జరుగవలసిన సుఖదుఃఖాదులకు ప్రతీకారోపాయమున్న యడల నలుడు, రామచంద్రమూర్తి, యుధిష్ఠిరుడు వీరందరు దుఃఖమును పొందుటకవకాశమే యుండెడిదికాదు అని తెలుపుచున్నారు. ఈ సుఖదుఃఖములకు ముఖ్యకారణము అపరిమితధన క్షేత్రగృహాదులను సంపాదించు కోరికయే. కాని ఇవి కోరికచే సిద్ధింపవు. నిష్కామనయా అనగా కోరికలేక చేసినపనులు బాగుగా సిద్ధించును. ఒకవేళ సిద్ధించకపోయినను అధిక దుఃఖకరములు కావు. ఒకరి ఉపకారాపకారమువల్లను మనకవి కలుగవు. మరి యెట్లనిన, వారివారి ప్రారబ్ధకర్మమువల్లనే కలుగుచున్నవి గాని, అన్యవిధముగా కాదు. దీనినే శాస్త్రము—

శ్లో॥ సుఖస్యదుఃఖస్యనకోపిదాతా పరోదదాతీతి కుబుద్ధిరేషా ।
అహంకరోమీతి వృథా మానః స్వకర్మసూత్ర గ్రథితోహి లోకః ॥

అనగా సుఖమును గాని దుఃఖమునుగాని ఇచ్చువాడెవడును ఉండడు. మరొకరివల్ల ఇవి కలుగునను బుద్ధి సరియైనదిగాదు. నేను చేయుచున్నాను అను అభిమానముకూడా మిథ్యయే. సర్వప్రపంచము వారివారి కర్మమను, సూత్రముతో గ్రుచ్చబడియున్నదిగదా! అని చెప్పుచున్నది. కనుక ప్రతి వారికిన్నీ కలుగు సుఖదుఃఖానుభవములు వారికర్మ పరిపాకఫలరూపముగ కలుగుచున్నవేగాని, ఇతర విధముగ కలుగుటలేదు. ఐనను ప్రతి వారికిన్నీ ఈ లైనను ధనమును సంపాదించిన సుఖము కలుగునను కోరిక కలుగు

చున్నది. కాని ధనమువల్లనే అందరికిన్నీ వారు కోరుసుఖములు కలుగుట లేదు. ఎందుచేతననగా ధనము సుఖసంపాదనకు వ్యవహారోపకరణముగాని, సుఖముకాదు. వ వహారమనగా మాయబంగారము వంటిదని పైన చెప్పి యున్నాము. సత్యసుఖస్వరూపము. బహ్మ. అనగాబ్రహ్మ సుఖస్వరూపము. సుఖము పుణ్యఫలము. గనుక ఎవరు ఎంత పుణ్యము నార్జించుదురో, దానిని బట్టి సుఖానుభవము అనుకూలధనాదులున్నూ కలుగుచుండునుగాని, వేరుకాదు. ధనము ప్రపంచాంతఃపాతిగాని వేరుకాదు. సర్వప్రపంచమునకు బ్రహ్మ అధిష్ఠానము—స్వరూపము అందుకని ఈ ధనము కూడ బ్రహ్మ స్వరూపమే గాని, వేరుకాదని తేలుచున్నది. దీనినే "ఈశావాస్యమిదగ్ంసర్వం.... మాగృధఃకస్య స్విద్ధనం" ఇత్యాదిశ్రుతివాక్యములు సూచించుచున్నవి. గనుక ధనము బ్రహ్మ స్వరూపము ఒక్కటియేనని తెలుసుకొని దృశ్యమిథ్యాత్వమును గ్రహించి అనుసంధానమువల్లనే ఆ బ్రహ్మను పొందవలయును. పరమార్థములో అర్థమున్నదిగాని, అర్థములో పరమార్థములేదు. అర్థమన్నను ధనమన్నను ఒకటియేగదా? గనుక పరమార్థలాభమును సంపాదించిన అర్థలాభ దానిలోనే ఇమిడియుండును. ఇట్టి లాభమును అభ్యాసకులు గ్రహించుటకు అవకాశముగలదు. కాలక్రమేణ ఇట్టి జ్ఞానమేన నిత్యనిరతిశయానందరూప మోక్షప్రాప్తికి సాధనమగును.

---

# వేదాంతానుభవము వ్యవహారికి సాధ్యమా

శాస్త్రమును బట్టి అనుభవమన్ననూ, జ్ఞానమన్ననూ, ఒక్కటియే. అనుభవము జ్ఞానము వినాగా కలుగదు. అట్టి అనుభవములు జ్ఞానస్వరూపములను బట్టి యుండును. భ్రాంతిజ్ఞానముచే భ్రాంతియనుభవములునూ, సత్యజ్ఞానముచే సత్యానుభవములును కలుగుచుండును. వేదాంత జ్ఞానమనిననూ తత్వజ్ఞానమనినను యొక్కటియే. తత్వజ్ఞానమనగా పదార్థముయొక్క వాస్తవజ్ఞానము.

అట్టి పదార్థము యిచట బ్రహ్మ. ఈ బ్రహ్మ యే తనయందన్న్యముగానున్న మాయచే మోహితుడై జీవనానాత్వభ్రాంతిని పొందినవానివలె జీవులయొక్క అనుభవములనుబట్టి శాస్త్రము మనలకు తెలుపుచున్నది. ఇట్టిజీవులలో మానవుడు బ్రహ్మకు అతి సన్నిహితుడుగా యున్నవాడు. బ్రహ్మ స్వరూపుడే. కాని తన అద్వితీయ అఖండ పరిపూర్ణ సత్యస్వరూపమును మరచి భ్రాంతుడుగా యుండి అట్టి జీవనానాత్వభ్రాంతితోడ దృశ్య సంసారానుభవములను పొందుచూ, సంసార దుఃఖమునకు పాలగుచున్నాడు. ఇట్టి సంసారదుఃఖమంతయూ మానవునకు తన వాస్తవ స్వరూపమును అనాది అవిద్యాభ్రాంతుడై మరచి నందువలననే కలుగుచున్నది. ఇట్టి సంసారదుఃఖమునుంచి వుని తరణో పాయమునకుగాను వేదాంతశాస్త్రము వునికి తన సత్యస్వరూపమును బోధించుచున్నది. ఇదియే వేదాంతజ్ఞానము. మానవునికి దేహధారణమే వ్యవహారము. ఈదేహధారణ జీవునియొక్క అనాది అవిద్యా భ్రాంతివలన కల్గినది. అనగా భ్రాంతిజ్ఞానము, కల్పితము. భ్రాంతి యెట్టిదైననూ భ్రాంతి జ్ఞానమంతయూ యథార్థజ్ఞానముచే గదా నశించవలయును. వస్తు యథార్థ జ్ఞానము కలుగగనే వస్తువుయందు భ్రాంతి నివర్తించును. అప్పుడు వస్తుయాథార్థ్యము. తెలియును. ఇది అందరకునూ సామాన్యముగ తెలిసినవిషయమే. ఎట్టి వారికైననూ జ్ఞానసామగ్రి లేనిది అనుభవమనునది కలుగుటకు సాధ్యము కాదు. ఎట్టి అనుభవమైననూ సరే. ఇట్టి జ్ఞానములన్నియూ వృత్తివలన కలుగుచున్నవి. ప్రపంచానుభవములన్నియూ యీ వృత్తిజ్ఞానమువలననే కలుగును గాని అన్యథాగా కలుగవు. ఇట్టి వృత్తిజ్ఞానము ప్రత్యక్షమనియు, పరోక్షమనియు రెండువిధముల కలుగును. ప్రత్యక్షజ్ఞానము ఇంద్రియ విషయ సంయోగములచే స్వానుభవము వలన కలుగుచున్నది. దీనినే

irect nowe ge అనెదరు. గ్రంథములద్వారాగాని యితరుల బోధవలన గాని యిట్లుండును అని, పరానుభవములద్వారా తెలిసికొనునది పరానుభవ జ్ఞానము. దీనిని n irect now e e అనెదరు. జీవునికి యిట్టి రెండు జ్ఞానములవలన తప్ప లోకానుభవము కలుగుటకు మరేదియునులేదు. అనగా

పర్యవసాన మేమనిన ఏ జీవునకైననూ ఏదో యొక జ్ఞానములేనిది అనుభవము కలుగుటకు వీలులేదు. ఇది నియమము. ఇట్లుండ మానవుడు తన సమస్త లోకానుభవములను ఒక్క జ్ఞానము వలననే పొందుచున్నాడు. కాని యిట్లు జీవుడు పొందుచున్న సుఖదుఃఖములు లోకానుభవములు భ్రాంతిజ్ఞానమాత్రమనిన్నీ యీస్వశరీర సర్వదృశ్యమంతయూ బ్రహ్మాధిష్ఠానమందు కల్పితమనియు యీ ప్రపంచము అధ్యస్తమనియు "భ్రాంతిమాత్రమిదం విద్వన్ విశ్వంబ్రహ్మణి కల్పితమ్" అని శంకర భగవత్పాదుల వచనమువల్లనూ యింకనూ అనేక శ్రుతి స్మృతి ప్రమాణములవల్లనూ లోగడ ప్రకరణములలో నిరూపించి నిశ్చయించియుంటిమి. ఇది గాకను ప్రపంచమంతయు ముఖ్యముగ జీవ,జగ ములను రెండువిభాగములతో పరిపూర్ణచైతన్యమందు అధ్యస్తముగానున్నది. ఇట్టి ప్రపంచమున వారి, వారి ప్రారబ్ధకర్మఫలముల చొప్పున జీవుని భోగాను భవములకుగాను జడపదార్థములన్నియు యేర్పడియున్నవి. జీవుడు మాత్రము భోగి. జడపదార్థములన్నియు జీవునియొక్క భోగ్యములు. జీవ, జడములు రెండును చైతన్యమునందే యధిష్ఠితముగా నున్ననూ జడపదార్థ ములయందు చైతన్యము సుప్తముగను, కార్యకారి కాకుండగనూ జీవుల యందు మాత్రము ప్రబోధముగను కార్యకారిగను యుండి అందు మానవుల యందు యీ చైతన్య పదార్థము అనుభవ వివేకములతోకూడుకొని యున్నది. విషయమును, తెలిసినదానిని యున్నదానిని అనుభవించుట పశు, మానవులకు అనగా సమస్త జీవులకును సమానముగనే కనపడుచున్నది. కాని మానవు నికి మాత్రము కనుబడని పదార్థమును గ్రహించి తెలిసికొనుటకును, తెలియక యున్న దానిని తన ప్రయత్న సాధనములచే పొందుటకును మానవునకు ఈ చైతన్యప్రకాశము యున్నది. మానవునకు అధికముగా కలిగిన యిట్టి చైతన్యప్రకాశముతో నిత్యానిత్య వివేకము కలిగి తన యథార్థస్వరూపజ్ఞాన మును సంపాదించుకొనుటకు అవకాశమున్నది. ఇచట సంపాదించుట యనగా తెలిసికొనుట యనియే అర్థము. ఇట్టి అవకాశము ఒకమానవునికి తప్ప యితర జీవోపాధులకు లేదు.

మానవునకు యీ దేహధారాణానుభవవ్యవహారములన్నియు వారివారి ప్రారబ్ధ కర ఫలానుభవముకుగాను వచ్చినవేగాని మరేమియును కాదు. పుణ్య పాపకర లన్నియు వ్యవహారకల్పితములు. కర ఫలములన్నియు అనిత్యములు. ఇట్టి కల్పిత, అనిత్య, కర్మఫలానుభవములన్నియు భ్రాంతిజ్ఞానమువలననే వునికి కలుగుచూ అనుభవముల నిచ్చుచున్నవి. ఇట్టి జీవానుభవములనిత్యములై జీవునకు సంసారవరంపరదుఃఖము నిచ్చుచున్నవి. కనుక యిట్టి దుఃఖమును ఆత్యంతికముగా పోగొట్టుకొనుటకు మానవుడు తనభ్రాంతిజ్ఞానమునుతొలగించుకొని తన వాస్తవస్వరూపజ్ఞానమును గ్రహించి స్వానుభవమును పొందవలెను. ఇదియే మోక్షము. బంధమోక్షములు రెండును మానవునికి అనుభవములే. ఈ అనుభవములు రెండును జ్ఞాన, అజ్ఞానములవల్ల కలుగుచున్నవి. విషయజ్ఞానములవల్ల వ్యవహారానుభవములు కలుగుచు పర్యవసానమున దుఃఖమును, నిర్విషయజ్ఞానమువలన సత స్వస్వరూప, నిత్యసుఖమునూ మానవుడు పొందుచున్నాడు. ఇందు ఒకటి విషయజ్ఞానమైన అజ్ఞానము. రెండవది నిర్విషయమైన జ్ఞానస్వరూపము. ఏదియైనను జ్ఞానము ప్రారబ్ధవ్యవహారానుభవములను నిలుపజాలదు. వ్యవహారానుభవములు వుని ప్రారబ్ధ కర్మఫలము. దాని అనుభవములను ఆపుటకు జ్ఞానమునకు సాధ్యము కాదు. కాని అట్టి కర ఫలానుభవముల సుఖదుఃఖములను తగ్గించుటకును నిరూ లించుటకును గూడ జ్ఞానమునకు సాధ్యము. ఇదియే జ్ఞానము యొక్క ఫలము. కాన మానవుడు తన పరమార్థస్వరూపమైన వాస్తవ జ్ఞానమును సంపాదించి, తన ప్రారబ్ధకర ఫలానుభవములను అట్టి జ్ఞానబలముతో సుఖదుఃఖానుభవరహితుడై లేక ఆపాతానుభవములను పొందుచు తన ప్రారబ్ధకర ఫలానుసారమున సర్వవ్యవహారములను అ మానరహితుడై ఫలా సక్తుడుగాక చేయసమర్థుడగును. ఎట్లన యీ ప్రపంచానుభవములన్నియు కృత్రిమ సువర్ణాభరణముల వంటివని ముముక్షువు తనజగని ధ్యాత్వ జ్ఞానముచే గ్రహించి సక్తతా మానరహితుడై ప్రాపంచికానుభవములయందు అనిత్యత్వబుద్ధిచే నిరాసక్తుడగుచు తన కర్మానుభవములను పొందును. తాను

నిష్కాముడుగా నుండును. యథాప్రాప్తముగ ప్రారబ్ధకరా నుభవములను ఉదాసీనుడై యనుభవించుచుండును. జీవునికి తన ప్రారబ్ధకర్మఫలానుభవ ములకున్ను తనసత్యస్వరూప జ్ఞానానుభవమునకున్ను యెట్టి విరోధమున్నూ యుండదు. జ్ఞానియైనవాడు తన ప్రారబ్ధకర ఫలానుసారము సర్వవ్యవహార ములను మిథ్యాజ్ఞానముతో సక్తతారహితుడై చేయుచు, తన వాస్తవపరిపూర్ణ సచ్చిదానందలక్షణములను సదా అనుసంధానము చేయుచుండును. ఈ అను సంధానమనునది వృత్తిసాధ్యమేగనుక వ్యవహారమే యగును. అయిననూ యిట్టి వేదాంతానుభవ దృఢజ్ఞానము తక్కిన వ్యవహారవిషయవృత్తి జ్ఞానముల వంటిదిగాక, నిర్విషయజ్ఞానమగుటవలన మానవునికి జీవదశయందు జీవ న్ముక్తి సుఖమునిచ్చుచు ప్రారబ్ధాంతమందు ముక్తి నిచ్చును. కాన వేదాంత జ్ఞానానుభవము వ్యవహారికి అనగా దేహధారికి పరమసుఖదాయకము సాధ్యమైనదియే గాని అసాధ్యముకాదు.

---

## తత్త్వజ్ఞాని స్థితివ్యవహార నిరూపణ

లోకమునందు ప్రాయశః ఇట్టి బ్రహ్మ విద్యాభ్యాసకుడుగాని లేక తరతమ భావముచే తదనుభవమును పొందిన తత్త్వజ్ఞుడుకాని ఎట్టివ్యవహార లేకసంబం ధములు కలిగియుండకూడదనియు, నిర్వ్యాపారుడై జడునిలాగున యుండ వలెననియు, అట్టివాడు అడవులయందును, కొండగుహలయందును దిగం బరుడై కాని, కాపీనధారియైగాని, పెనుజడలతోను, గడ్డములతోను నివసిం చుచుండుననియు ఒక అభిప్రాయముగలదు. ఇదియునుగాక ఇట్టివారు సామాన్యులకన్న విలక్షణులుగాను మహిమలతో కూడుకొని యుందురనియు, ఉండవలెననియుకూడా సామాన్య జనాభిప్రాయము కనబడుచున్నది. ఇంకను ఈ జ్ఞానము కలిగినతోడనే మానవుడు నిర్వ్యాపారియై వృక్షకుడ్యాదులలాగున

జడత్వమును పొందుననిన్నీ, అట్టివారు మనకగు పడరనిన్నీ వారికి వ్యవహార యోగ్యతయును క్షుత్పిపాసాదులు కూడాయుండవను తలంపు కలదు.

ఎవరెట్లుతలచినను అట్టిజ్ఞానులు జ్ఞానాభ్యాసకులు వారివారి ప్రారబ్ధకర ఫలమునుబట్టి యొక వేళ అట్లుండినసూ ఉండవచ్చును ఐననూ అట్లే యుండవలెనను నియమముగాని, విధిగాని కనబడుటలేదు. అభ్యాసకునికి మాత్రము అభ్యాసదశయందు యమనియమాదులత్యావశ్యకములని వేరుగ చెప్పనక్కరలేదు. అభ్యాసకుల స్థితిపాటవమునుబట్టి ఒకప్పుడు బాహ్యముగాను మరియొకప్పుడు ఆంతరముగాను ఉండవచ్చును. ఇట్టి యమనియమాది సాధనములు వారివారి మనోదార్ఢ్యమును, స్థితులనుబట్టి అభ్యాసకులకు వీటి యావశ్యకతా భేదములుండును అందుకుగాను ఇట్టివి ప్రత్యక్షాప్రత్యక్షములుగా గూడ నుండవచ్చును. తరతమభావములచే వారివారి జ్ఞానానుభవదార్ఢ్యమును బట్టిన్నీ, ప్రారబ్ధకర్మఫలానుభవమును బట్టిన్నీ యిట్టివారుందురుగాని, యీ విధముననే యుండవలెనను విధి, స్వరూపములు కనబడుటలేదు. లోగడ తెలిపినట్లు యెంతమహనీయులైనను దేహధారులై యున్నంతకాలము వ్యవహారానుభవములు తప్పవు. అందుకుగాను ఇట్టిజ్ఞానసంపన్నులు వ్యవహార పరమార్థ జ్ఞానములు రెండునూ కలవారై యుందురు. "ప్రారబ్ధంభోగతోనశ్యేత్" అను వచనముననుసరించి ప్రారబ్ధకర్మఫలానుభవము జ్ఞాన్యజ్ఞానులకు సమానము. గాని ఇట్టికర ఫలానుభవములవల్ల కలుగు సుఖదుఃఖములలో మాత్రము జ్ఞాన్యజ్ఞానులకు తారతమ్యముండును. ఈ విషయమును లోగడ విపులముగా విమర్శించియుంటిమి. శరీరమున్నంతవరకు జ్ఞాన్యజ్ఞానులకు అనుభవము సమానము. గాన ఉభయులకున్ను ద్వైతానుభవము వ్యవహార కాలమందు సమానము. దీనినే "వ్యవహారేద్వైతినస్సర్వే" అని వ్యవహార కాలమందు జ్ఞాన్యజ్ఞాను లిద్దరును ద్వైతులుగానే యుందురు. అద్వైతసిద్ధి జ్ఞాన రూపముగాని క్రియారూపముగా నుండదు. అట్లుండుటకు వీలులేదు. జ్ఞానసంపన్నులు లౌకికకృత్యముల నాచరించునప్పుడు వ్యవహారము మిథ్య

యను నిశ్చయజ్ఞానముతోనున్ను సమాధ్యభ్యాసకాలములలో స్వస్వరూప సత్య నిశ్చయజ్ఞానముతోనున్ను యుందురు. వారుసవ్యసాచులు. ఏది అవసరమైన యెడల అట్టిదానిని నిర్వర్తించుచుందురు. వ్యవహారము చేయుకాలములోగూడ వీరు సామాన్యజనులకన్న కౌశల్యముతో వ్యవహారాదులను చేయుచుందురు. దీనికికారణము వారితత్త్వజ్ఞానబలమే. అనగా వాస్తవజ్ఞానబలము. సామాన్యులవ్యవహారములు కేవలము వ్యవహారజ్ఞానముతోగూడినవే యగుటవల్ల సత్యత్వదార్ఢ్యములు తక్కువగలవిగాను ఆభాసముగాను యుండును. ఎట్లున్నను జ్ఞానియైనవాడు వ్యవహారము నెప్పుడును కోరడు గాని ద్వేషింపక క్లేశపడక యుప్పొంగక ప్రారబ్ధకర మును బట్టి వ్యవహారములను నిర్వర్తించుచుండును వీనిని గురించి విద్యారణ్యులు ఇట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ అవిరోధి సుఖేబుద్ధిః స్వానందేచగమాగమౌ ।
కుర్వన్త్యాస్తే క్రమాదేషా కాకాక్షీవ దితస్తతః ॥

ఇట్టి యోగియొక్క చిత్తము కాకికంటివలె విషయసుఖమును బ్రహ్మానందమును ఇటునటు నాస్వాదించును. యోగి విక్షేపదశయందు విషయసుఖమును, సమాధి దశయందు బ్రహ్మానందసుఖము నాస్వాదించుచుండును.

శ్లో॥ ఏకైవదృష్టిఃకాకస్య వామ దక్షిణనేత్రయోః ।
యాత్యాయాత్యేవ మానన్దద్వయే తత్త్వవిదోమతిః ॥

కాకికి కుడి యెడమకన్నులందొకదృష్టియేకాన ఒకకంటితో చూచునపుడు రెండవకంటితో జూడనట్లు బ్రహ్మవిదునిబుద్ధి విషయానంద బ్రహ్మానందములను భిన్నకాలములలో ననుభవించును.

శ్లో॥ భుంజానో విషయానందం బ్రహ్మానందంచ తత్త్వవిత్ ।
ద్విభాషాభిజ్ఞవద్విద్యా దుభౌ లౌకిక వైదికౌ ॥

రెండుభాషలను తెలిసినవాడెట్లు ఒక్కొక్కకాలమందొక్కొక్క భాష మాట్లాడునో అట్లే బ్రహ్మ విదుడు న్నకాలములందు విషయానంద బ్రహ్మా నందముల ననుభవించుచున్నాడు.

శ్రీ వసిష్ఠభగవానులు జ్ఞానియొక్కచర్య యెట్లుండవలసినదనియు యీ క్రింది శ్లోకమువల్ల నిరూపించుచున్నారు—

శ్లో॥ నవాంఛతానత్యజతా జ్ఞైనప్రాప్తాస్స్వభావతః।
సరితస్సాగరేణేవ భోక్తవ్యాభోగ భూతయః॥

జ్ఞానియగువాడు ప్రాప్తించని యర్థంబుల గోరకయు ప్రాప్తించిన యర్థంబుల విడువకయు ప్రాప్తములగు భోగైశ్వర్యంబులను సముద్రుండు ప్రాప్తములగు నదుల ననుభవించుచుండునటుల భోగించుచుండవలయును. తత్త్వజ్ఞాని యనుభవము లిట్లే యుండును. ఆత వేత్త దుఃఖమును పొందదని శ్రుతులు తెలుపుచున్నవి. అయిననూ యిష్టానిష్టములయందు ఆత్మజ్ఞునకు గూడ ప్రవృత్తి కలుగుచునేయున్నది. దీనినిబట్టి తత్త్వజ్ఞునికి మాత్రము దుఃఖము లేదనుకొనుట యెట్లని శంకించిన-ఉపాధిధర్మము లటుల కనబడిననూ అట్టివాడు విషయలాభాలాభ నిమిత్తము యిచ్ఛారహితుడై ప్రవర్తించును గనుక విషయ సుఖదుఃఖములను పొందడు—ఏలనన యిట్టి జ్ఞాని,తాను సచ్చిదానంద రూపుడని గ్రహించువాడు. తాను పరిపూర్ణుడు అని సత్యజ్ఞానానంతలక్షణములతో తనను తాను తెలిసికొనినవాడు గనుక కోరదగినదేమియును యుండదు—సుఖదుఃఖ ముల నొందడు. కాని జ్ఞానికైనను ప్రారబ్ధకరా నుభవమును అంతఃకరణో పాధి దాని స్వభావమువల్ల జరుపుచునేయుండును. అయిననూ యిట్టి దృఢా పరోక్షజ్ఞానముకలవారికి యిష్టానిష్టప్రాప్తి పరిహారముకొరకు ప్రవృత్తియే యుండదని శ్రుతి ప్రతిపాదించుచున్నది, దీనినే శ్రుతి "అధ్యాత్మ యోగా ధిగమేన, దేవం, మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" అని తెలుపుచున్నది. కాన తత్త్వజ్ఞునకు జీవదశయందుగూడ తత్త్వజ్ఞానముచే యిట్టి సుఖము కలుగు ననుటకు సందియము లేదు— అట్టివాడు నిష్కాముడగుచు దేనిని కోరడు—

## తత్త్వజ్ఞాని స్థితివ్యవహార నిరూపణ

ఇట్టి మహనీయుని గురించియే శ్రుతి "ఆత్మానం చేద్విజానీయాదయ మస్మీతి పూరుషః కిమిచ్ఛన్, కస్యకామాయశరీర మనుసంజ్వరేత్" అని స్పష్టముగా తెలుపుచున్నది— ఇంకనూ

శ్లో॥ వర్తమానేఽపిదేహేఽసి న్ ఛాయావదనువర్తతే ।
అహంతా మమతా భావో జీవన్ముక్తస్యలక్షణమ్ ॥

తత్త్వజ్ఞుని అహంకార మమకారములు ఛాయామాత్రములేకాని బంధములుకావు అని శ్రీ శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు— కావున తత్త్వజ్ఞానమువలన వ్యవహారలోపము కలుగదు- జ్ఞాని ప్రారబ్ధానుసారమున సర్వ వ్యవహారములు అసంగుడై చేయుచుండును. ఇంకనూ ఇచట తత్త్వజ్ఞుడనినను, జ్ఞాని యనినను, తత్త్వజ్ఞానమునెరిగిన అభ్యాసకుడు అనగా తన పరోక్షజ్ఞానమును అపరోక్షముగా పొందుటకు అభ్యాసాదులను చేయువాడు. ఇట్టి అభ్యాసకునకు గూడ "ప్రారబ్ధ మనుభోక్తవ్యం" అను వచనమును బట్టి వ్యవహారప్రవృత్తి కలుగుచునే యుండును— ఇట్లు కలుగునప్పుడు తన వ్యవహారస్థిత్యనుభవములకు కొంతవరకైననూ రాగాది ప్రవృత్తులతో యింద్రియవ్యాపారమావశ్యకమగుచుండును. అట్లు వ్యవహరించు కాలములో, జ్ఞానాభ్యాసకుడైనవాడు యింద్రియములు వాటిప్రవృత్తులతో, తాదాప్యత నొందక వాటిని కేవలతనవ్యవహారానుభవ సాధనముగ, గ్రహించి తన కార్యానంతరము వాటిని గుర్తించుటకుగాని స రించుటకానియుండదు, ఇంతియ కాని పామరుని లాగున తన యింద్రియప్రవృత్తి వశుడుగాడు— జ్ఞానియైనవాడు తనదేహేంద్రియప్రవృత్తి సముదాయమునంతయూ తనకన్న వేరుగ తలచుచు వాటిని, తనయిష్టసిద్ధియైన మోక్షప్రాప్తికి బాహ్యాంతర, కరణములుగ అనగా సాధనములుగా నుపయోగించుకొనుచు తన ప్రారబ్ధకర ఫలాను భవక్షయము చేయుచు ప్రారబ్ధాంతమందు తాను మాత్రము తనసత స్వరూపముతో నిర్విశేషుడగును-

---

# జ్ఞాని అజ్ఞానుల అనుభవ వివేచన

లోకమునందు సాధారణముగ మానవుడు, నిత్యానిత్యవివేకము లేని వాడై ప్రాపంచికసత్యత్వబుద్ధితో తన ప్రారబ్ధకర ఫలానుభవములకుగాను యిప్పుడు కలుగుచున్న దృశ్యానుభవములయందు తన కర్తృత్వాదులు వాస్తవములని నమ్మి యాచరించుచు తనయొక్క కర ఫలములనుగూడ నిత్యములని సత్యములని నము చు అధిక దుఃఖాద్యనుభవములను పొందుచున్నాడు. కాని యీ దృశ్యానుభవముల అవాస్తవికతను, తాను దృశ్యవ్యామోహితుడై గ్రహింపజాలకయున్నాడు. ఇట్టి వారందరును తత్త్వశాస్త్ర దృష్ట్యా అజ్ఞానులని చెప్పబడుచున్నారు. దీనికి కారణము వుడు సత్యము కాని దానిని సత్యమని తలచి, నమ్మి, అనుభవించుటే. ఇట్టి దానినే లోక వ్యవహారమున మోసపోవుటయని చెప్పుదురు. ఇట్టిది జీవుని అనాదిభ్రమచే కలుగుచున్నది. ఇట్టి అనాదిభ్రమమూలకమోసమునుండి తప్పించుకొనుటకు మానవుడు జ్ఞానమును సంపాదించవలెను. జ్ఞాన శబ్దమునకు ముఖ్యార్థము తత్త్వజ్ఞానమనియే. తత్త్వజ్ఞానమనగా వస్తుయథార్థజ్ఞానము ఇచట మనలకు కావలసిన యథార్థజ్ఞానము ఏమనిన వునకు సర్వసంసారదుఃఖములను కలిగించుచున్న యీ ప్రపంచముయొక్క వాస్తవస్థితి జ్ఞానము. ఇది వాస్తవమే అయినయెడల జీవునికి యిప్పుడు కలుగుచున్న అనుభవములన్నియు యథార్థములేయగును. అట్లుగాక యీ దృశ్యము అవాస్తవమైన యెడల జీవునికి, అవాస్తవ పదార్థములతో యిపుడు కలుగుచున్న అనుభవములన్నియు భ్రాంతి మాత్రమేగదా. శాస్త్రము "భ్రాంతి మాత్రమిదం విశ్వం" యీ దృశ్యమంతయు భ్రాంతిమాత్రము అని మనలకు చెప్పుచున్నది. ఇట్టి భ్రాంతిని నివర్తింపజేసుకొనుటకు వాస్తవజ్ఞానము అనగా తత్త్వజ్ఞానము మానవునకు ఆవశ్యకమగుచున్నది. కాన శ్రుతి ప్రమాణగ్రహణమువల్లను, శమదమాద్యభ్యాసములతోడను, శాస్త్రబోధ అనుభవ వివేచనలతోడను సంపాదించిన, నిత్యానిత్య వివేకముతోచేయు అనుసంధానాదులవల్లను ముముక్షువు జగన్ని

ధ్యాత్వ నిరూఢియును తన సత్యస్వరూపజ్ఞానమును సంపాదించుటచే తత్త్వ జ్ఞానముపొందినవాడు, జ్ఞానియనబడును. అయినను ఇట్టి తత్వజ్ఞునకు గూడ ప్రారబ్ధకర్మఫలానుసారము దేహాద్యనుభవములు తప్పవు ఇట్టి దేహాద్యనుభవ ములు జ్ఞానికిని, అజ్ఞానికిని సమానమే. కాని వారివారి జ్ఞాన తారతమ్యములను బట్టి యిట్టి యనుభవములయొక్క సుఖదుఃఖములను, ప్రవత, న్యూనతలతో అనుభవించుచుందురు. ఇచట జ్ఞాని అజ్ఞానులకు అనుభవములు సమానమగు నప్పుడు వాటివల్ల కలుగు సుఖదుఃఖముల తారతమ్యమెట్లు వచ్చునని యోచిం చవచ్చును, క్షుత్పిపాసాది దేహధర్మములు జ్ఞానికిని అజ్ఞానికిని సమానముగానే యున్నను అట్టి దేహధర్మములను అజ్ఞానియైనవాడు వానిని తన ధర్మములుగానే తలచి అట్టి జ్ఞానముతో అనుభవించుచు కర్తృత్వాద్యభిమానములను పొందు చుండును. జ్ఞాని యన్ననో తన జ్ఞానముచే యిట్టి దేహధర్మములన్నియు, తన కల్పితాంతఃకరణ వుపాధిధర్మములుగాని తనవి కావను నిశ్చయముతో కర్తృ త్వాద్యభిమానములు తగ్గించుకొని అనుభవించుచుండును. జ్ఞానికి యిట్లు తెలుసుకొన్నను తన ప్రారబ్ధకర్మ ఫలమును బట్టి యింకను తన దేహతాదాత్మ్యాధ్యా సము యుండును గనుక, యిది తన ప్రారబ్ధఫల శిక్షయని తలచి, స్వల్పాపేక్షలతో దేహధర్మానుభవములను చేయుచుండును. ఈ దేహధర్మములు ఉభయులకు సమానమైనను అజ్ఞాని యీ ధర్మములు తనవని నమ్మి తన ధర్మములుగా అనుభవించుచుండును. కాని జ్ఞాని యిట్టివి తన ధర్మములు కావను నిశ్చయ ముతో యివి అన్యుని ధర్మములను జ్ఞానముతో అనుభవించుచుండును. ఇట్లు జ్ఞాని యజ్ఞానులు దృశ్యానుభవములయొక్క తారతమ్యము చూచిన తన బిడ్డ యందు కలుగు ప్రేమకును, పరుని బిడ్డయందుండు ప్రేమకును యుండు నంత భేదముగానుండును ఎట్టివారికైనను తనకు కలుగు లాభనష్టముల యొక్క సుఖాద్యనుభవములకున్ను తనది అనుకొనుదానియందు కలుగు లాభనష్టములయొక్క సుఖాద్యనుభవములకున్ను తారతమ్యముండునుగదా.

ఈ ప్రపంచమందు మనలకు కలుగుచున్న సుఖదుఃఖానుభవము లన్నియు ఒక్క జ్ఞానమువల్లనే కలుగుచున్నవిగాని అన్యథాగా కలుగుటలేదు.

కాని యీ జ్ఞానములో సత్యజ్ఞానము అనగా యథార్థజ్ఞానమువల్ల సుఖమున్ను, అసత్యజ్ఞానము అనగా భ్రాంతిలేక అయథార్థజ్ఞానము వల్ల దుఃఖమును మానవులు పొందుచున్న విషయము అందరికిన్నీ అనుభవములోనున్నదే. శాస్త్రబోధను బట్టిన్నీ వివేకుల యనుభవమును బట్టిన్నీ కూడ యీ కనబడుచున్న స్వశరీర సర్వదృశ్యమున్ను ఉన్నట్లు కనబడుటయే కాని పరమార్థ సత్యత్వదృష్టితో విమర్శించిన లేనిదేయగుచు అసత్యమై మిథ్యయగుచున్నది. ఈ దృశ్యము యిట్టిది అయినను వుని అనాది అవిద్యాభ్రాంతిచే వాస్తవముగ నున్నదాని వలె తోపింపబడుచు వారి, వారి ప్రారబ్ధకర్మఫలానుసారమున జీవానుభవము లను కలుగజేయుచున్నది. తత్త్వదృష్ట్యా యీ దృశ్యమంతయు యిట్లు అసత్యమైనదైనను అట్టి దానిని సత్యమని నమ్మి వ్యవహరించువారు అజ్ఞా నులు. ఇట్టివారు తమ లోకానుభవములనే, తమయొక్క అవాస్తవిక, అసత్య, భ్రమ జ్ఞానములతో వాస్తవములని నమ్మి వాటి సుఖదుఃఖముల ననుభవించు చుందురు. వీటియొక్క అనుభవములలో దుఃఖాదులు అధికమగుటకు రెండు కారణములు. మొదటిది సత్యముకాని యీ దృశ్యమును సత్యత్వబుద్ధితో అను భవించుట. రెండవది యిట్టి దృశ్యానుభవములన్నియు అవాస్తవికములై భ్రాంతి మాత్రజ్ఞానముతో కూడినవై యుండుట. అసత్య, భ్రాంతిజ్ఞానములచే కలుగు అనుభవములన్నియు విధిగా దుఃఖకరములుగానే యుండును. ఈ విష యము లన్నియు విపులముగా యీ గ్రంథమందే కొన్ని నిరూపణలలో విమ ర్శించి, మానవుడు సర్వదా అయథార్థజ్ఞానమువల్ల దుఃఖమును, యథార్థజ్ఞానము వల్ల సుఖమును పొందుచున్నాడని నిరూపించి నిశ్చయించి యుంటిమి. ఎట్టి మానవుడైనను దుఃఖానుభవమును,యెప్పుడును యెవరును కోరరుగదా. కనుక మానవుడు తనకు కలుగుచున్న దృశ దుఃఖమును నిర్మూలించుటకుగాను లేనిచో తగ్గించుకొనుటకైనను దృశ మిథ్యాత్వజ్ఞానమును శ్రుతి, యుక్తి, అనుభవ పూర్వకముగ బాగుగ వివేచనచేసి వాస్తవజ్ఞానమును సంపాదించవలెను.అప్పుడు యీ దృశ్యము మిథ్య,లేనిదేయని నిశ్చయముగా తెలియుచు తన ఆత్యంతిక దుఃఖరాహిత్యమునకు సాధనమగును ఇట్లు వివేక, విచారణ, పూర్వకముగా

దృశ్యమిథ్యాత్వమును తెలుసుకుని. తన సత్యస్వరూప నిశ్చయానుభవము లను పొందువాడే జ్ఞాని, ఇట్టి జగన్మిథ్యాత్వనిరూఢి జ్ఞానములేనివాడు అజ్ఞాని యనబడును. ఇట్టి వారందరును జగత్తును సత్యమని నమ్మి దృశ్యానుభవముల పొందుచు వారి ప్రారబ్ధకర్మానుసరణమున కలుగు దుఃఖాద్యనుభవములను అధికక్లేశదుఃఖములతో యనుభవమును పొందుచుందురు. దీనికి దృష్టాంతము మానవునకు సత్యసువర్ణకంకణము లభించినప్పుడు కలుగునంత సుఖసంతోష ములు గాని, కోల్పోయినప్పుడు కలుగునంత దుఃఖముగాని, మాయబంగారు కంకణ, లాభనష్టములవల్ల కలుగుట లేదుకదా. ఇదిజన సామాన్యానుభవమే, జ్ఞానియైనవాడు యీ ప్రపంచమంతయు మాయబంగారము వంటిదను నిశ్చయ మైన బుద్ధి కలవాడు గనుక అట్టి లోకానుభవలాభనష్టములయందు అధిక క్లేశదుఃఖాదులను బొందక అల్పసంతుష్టియగుచు అనుభవఫలములను న్యూన తగా అనుభవించును. సర్వదా సముడై యుండును. జ్ఞానియైనవానియొక్క దృష్టి (జ్ఞానము) సదా "దీర్ఘస్వప్నమిదం విద్వాన్ విశ్వంబ్రహ్మణి కల్పితం" అను వచనము ననుసరించి యుండును. కాని యిట్టి వానికైనను ప్రారబ్ధకర్మ ఫలానుభవము తప్పదు. కనుక అట్టి లోకానుభవముల నన్నిటిని జ్ఞానియైన వాడు పామరునివలె గాక, స్వప్నానుభవముల లాగున జాగ్రదనుభవము లెట్టివైనను అనుభవించుచు వానివల్ల అల్ప, తాత్కాలిక దుఃఖానందములను పొందుచుండును ఎల్లప్పుడును అసత్యవస్త్వనుభవములవల్ల కలుగు సుఖ దుఃఖములు సత్యవస్తువుల యనుభవములకన్న అల్పమైనవగుచు తాత్కాలిక ముగ నుండును. ఎట్లన తన స్వప్నములో తాను రాజ్యము పరిపాలించినను లేక భిక్షమెత్తినను తనకు జాగ్రతలో కలుగుచున్న యనుభవము సమానమే కదా. అనగా రాజ్యము పరిపాలించితినని సంతోషపడుటగాని, క్షమెత్తితినని దుఃఖపడుటగాని యుండదుగాదా. కాని స్వప్నములో తాత్కాలికానుభవములు పొందును. ఇట్లే ప్రారబ్ధమున్నంతకాలము జ్ఞానియు తన జాగ్రదానుభవము లన్నిటిని స్వప్నతుల్యముగా అనుభవించుచుండును. కాని అజ్ఞానిలాగున దుఃఖము పొందకుండ తన ప్రారబ్ధకర్మ ఫలక్షయమును గావించుచుండును.

ముముక్షువునకు జ్ఞానమువల్ల  వదశయందు కలుగు పరమలాభమిదియే. ఈ జ్ఞానమే వుని ముక్తికి సాధనమగుచు వదశయందు సుఖము నిచ్చును. జీవునికి శ రధారణమే వ్యవహారము జ్ఞాని, అజ్ఞానుల వ్యవహారము చూచుటకు నొక్క విధమునసే యున్నను, జ్ఞానియైనవాడు సర్వదృశ్యమును కల్పితము అను నిశ్చయముతో అసంగుడై సర్వవ్యవహారములను చేయుచుండును. ఇట్టి కర్మ భావిప్రతిబంధమును వునికి కలుగజేయజాలక కాలక్రమమున మోక్షసాధనమగును. అజ్ఞానియైనవాడు దృశ్యమంతయూ సత్యమని నమ్మి అ మానాసక్తుడై రాగద్వేషములతో కర్మల నాచరించుచుండును-ఇట్టి వ్యవహారములు కర్మఫలము నిచ్చుచూ జీవునకు జన పరంపర కలిగించుచు సంసార చక్రమున త్రిప్పుచుండును-ఇట్టి సంసార ఆత్యంతిక నివృత్తికి జీవునికి తత్త్వజ్ఞానమే సాక్షాత్సాధనముగాని మరియొకటికాదు-చూచుటకు అనగా పరానుభవమునకు జ్ఞాని, యజ్ఞానుల వ్యవహారములు సామాన్యముగనే యుండి, అత్యంత సూక్ష్మదృష్టికిగాని భేదము తెలియబడదు. వారిద్దరును బాహ్యదృష్టికి యొక్క రుననే యున్నను (. వేమనయోగి "ఉప్పుకప్పురంబు నొక్క పోలికనుండు, చూడచూడ రుచులు చాల వేరు" అనినట్లు వీరి స్థితులు అత్యంత  న్నముగయుండును.

---

# జీవుని జన్మపరంపర కథనము

సమస్త జీవులును అనాదికాలమునుండి వారి, వారి మోక్షప్రాప్తి పర్యంతమూ యీ అవిద్యాసంసారచక్రమున వారివారి జన్మవాసనలనుబట్టి ప్రారబ్ధకర ఫలానుసారమున, నానాయోనులయందును జని ంచుచూ జనన మరణ ప్రవాహమున భ్రమణము చేయుచుందురు. ఇట్టి వులలో అనేక జన పుణ్య విశేషపరిపాకమువలన ఆత జ్ఞానమును పొంద ప్రయత్నించు వుడే ముముక్షువు. మోక్షము సుఖస్వరూపము గనుకను సాధారణముగ

అందరు కోరునదియు సుఖమేగనుకను సర్వులనూ ముముక్షువులనే వ్యవహ రించవచ్చును. కాని వీరు కోరునదంతయూ విషయానుభవసుఖముగానే యున్నది. ఇది వాస్తవసుఖము కాదు. గాన యిచట మనకు విషయుడైన ముముక్షువు అట్టి విషయసుఖేచ్ఛాపరుడుగాక, నిర్విషయ సుఖసంపాదనమందు తీవ్రేచ్ఛగలిగినవాడై సాధనచతుష్టసంపత్తియుక్తముగ గుర్వీశ్వరానుగ్రహ ములను సంపాదించుకొని శాస్త్రీయ విధమున తన సత్యస్వరూపజ్ఞానానుభవము లను చేయుచుండుసట్టి ముముక్షు జిజ్ఞాసువు. ఇట్టివాడు ప్రీతి నిశ్చయ పూర్వకమైన పరోక్షజ్ఞానము కలవాడుగానుండును. కావున యిట్టివాడు కొంత వివేకవంతుడై, పూర్తిజ్ఞానఫలమును అనుభవింపజాలనివాడై యుండును. కనుక లోకానుభవములు యితని జ్ఞానాభ్యాసమునకు ఆటంకములుగనుండి దుఃఖాదులను కలిగించుచుండును. ఇట్టి జిజ్ఞాసువులకు కూడ ఆ మ్రయుల మరణము మొదలగునవి బహుసంతాపకరమగుచున్నది. అందుకుగాను జీవుడైన తనకు అనాదిగా కలుగుచున్న జన పరంపరలు, అట్టి జన్మలలో తన యనుభవములను వివేచనచేసి తెలిసికొనిన యెడల తనకు యిప్పుడు కలుగుచున్న యీ దేహాధ్యాసము, యిప్పుడు తనకు కల్పితమైన యీ ఆ ్మయ సంబంధముల మృషాప్రాయత, బాగుగ గోచరించును. అందువలన తన జ్ఞాన సాధనాభ్యాసములు అధికచిత్త విశ్రాంతి, స్థైర్యములతో నడచి మోక్ష సాధనము కాగలదు. ఎంతటి మహనీయులకైననూ దృశ్యానుభవములు, బలీయములై తన సత్యస్వరూపజ్ఞానమును మరుగుపరచును. ఇట్టి నిరోధములు తగ్గుటకై ముముక్షువునకున్నూ-దృశ్యసంసార దుఃఖోపశమనము కలిగించు టకు సాధారణ మానవులకు కూడ యీ వివేచన-సంసార రోగికి రసాయనము వంటిదిగా యుపకరించును. కాని మానవునకు జని ంచగనే తన పూర్వజన ముల జ్ఞానము విస్మరణమగుచున్నది. కాన జీవుడు యే జన్మమున కా జన్మాను భవములే ప్రధానముగ జేసుకొని, సత్యమని నమ్మి, సంసార దుఃఖముల ననుభవించుచున్నాడు. ఇందుకుగాను త్రికాలవేత్తలైన ఋషిపుంగవులు

కొందరు కారుణ్యబుద్ధితో జీవుల తరణోపాయమునకుగాను జ్ఞానబోధార్థమై స్మృతిపౌరాణిక గ్రంథములయందు కొందరు పురుషులయొక్క జన్మ పరంపరలను వారికి జ్ఞానోపదేశసాధనముగ తెలిపియుండిరి. అట్టివి యోగవాశిష్ఠమను మోక్షోపాయగ్రంథమున పెక్కుయుపాఖ్యానములందు తెల్పియున్నారు. కాన వానిలో ఒకటి, రెంటిని యిచట గ్రహించి తెలుసుకొందము.

పుణ్యపావనుల కథ :—పూర్వకాలంబున నొక తపోనిధియైన ఋషి పుంగవునికి పుణ్యుడనియు, పావనుడనియు, యిరువురు పుత్రరత్నము లుండిరి. వారిలో జ్యేష్ఠుండును గుణాధికుండునుయగు పుణ్యుండనువాడు జ్ఞానవంతుడాయెను పావనుండను రెండవవాడు సగము జ్ఞానమునొంది మూఢత్వమును దాటినవాడును, బ్రహ్మ పదంబును పొందనివాడునై యుండెను. ఆ మునీశ్వరుండు నా యిరువురు పుత్రులతోగూడి నొక గిరిప్రాంతమున నివశించుచుండెను. ఇట్లు బహుకాలము గడువగా తండ్రియైన నా ఋషిపుంగవుండు కాలధర్మముచే బ్రహ్మ పదంబు నొందిన వాడాయెను. అట్లు తండ్రియైన నా మునీశ్వరుండు గతించగా జ్యేష్ఠుడైన పుణ్యుండనువాడు యథావిధిని తండ్రికి కర్మలు గావించెను కాని రెండవ కుమారుడైన పావనుడు పితృ మరణ వియోగమును సహించలేక బహుదుఃఖాక్రాంతుడై-భరించ శక్యము కాని చింతతో కృశించుచుండెను. అప్పుడు అన్నయు, ధర లుండునునైన పుణ్యుండు తమ నివద్దకు జని యిట్లు పలుక దొడగెను. అట్టి కథనము, నా మాటలలో వ్రాయుటకంటె వాల్మీకి వాక్కున తెలుపుట శ్రేష్ఠముగాన యిచట అట్టి శ్లోకములను తాత్పర్యార్థముతో నుదహరించుచున్నవాడ.

శ్లో॥ కింపుత్ర దృఢతాం శోకం నయస్యాంధ్యైక కారణం,
పితాతవ ఘనోప్రాజ్ఞ గతఃప్రజ్ఞావతాం వరః.

శ్లో॥ స్వామేవ పరమామాత్మపదవీం మోక్షనామికాం,
స్వభావమభి సంపన్నే కిం పితర్వానుశోచసి.

తా॥ తము డా । అజ్ఞాన మూలంబగు శోకంబు నేల జెందుచున్నాడవు. జ్ఞాన వంతులలో శ్రేష్ఠుడగు నీ తండ్రి మోక్షంబను తనదు పదవిని జెందిన వాడా యెను. స్వస్వరూపంబును పొందిన తండ్రి విషయమున నేల చింతించెదవు.

శ్లో॥ మాతా పితృసహస్రాణి సమ ఽతాని తే సుత,
పుత్ర బాంధవ బృందాని జంతోర్జన్మని జన ని.

శ్లో॥ శోచనీయా యది స్నేహేనా తా పితృసుతా స్సుత,
తద ఽతా నశోచ్యంతే కిమజస్రం సహస్రశః.

తా॥ తము డా ! నీకు తల్లిదండ్రులు అనేక సహస్రసంఖ్యలైనవారు గడచిరి. ప్రాణికి ప్రతిజన్మంబునను బాంధవజాలంబు ఏర్పడుచుండును. తల్లిదండ్రులు పుత్రులు మొదలగువారినిగూర్చి ప్రేమచే దుఃఖింపవలసినయెడల తొల్లింటి జన ంబులయందు గడచిన సహస్రసంఖ్యలగు మాతాపిత్రాదులనుగూర్చి యేల దుః ంపవు.

శ్లో॥ బంధుమిత్ర సుతస్నేహద్వేషమోహదశామయః,
స్వసంజ్ఞా మాత్రకేణైవ ప్రపంచోఽయం వితన్యతే.

తా॥ బంధువులు మిత్రులు పుత్రులు స్నేహము ద్వేషము మోహము ఈ రూప మగు ప్రపంచము తనదు పేరుమాత్రము చేతనే పెరుగుచున్నది.

శ్లో॥ బంధుత్వే భావితో బంధుః పరత్వే భావితః పరః,
విషామృత దశేవేహ స్థితిర్భావనిబంధినీ.

తా॥ బంధువుడని భావింపబడిన వాడు బంధువుడగును. పరుడని భావింపబడిన వాడు పరుడగును. విషామృత దశవలె నీ స్థితి మనోభావమును బట్టి గలిగి నదే యగును.

శ్లో॥ ఏకత్వే విద్యమానస్య సర్వగస్య కిలాత్మనః,
అయంబంధుః పరశ్చాయ మిత్యేషా కలనా కుతః.

తా॥ ఒక్కండయగు నాత సర్వవ్యాపకుండై యుండగా, వీడు బంధువుడు, వీడు పరుడు అనునిట్టి కల్పన మెట్లు కలదు.

శ్లో॥ రక్త మాంసాది సంఘాతాద్దేహాదేరస్థిపంజరాత్,
కోఽహం స్యామితి చిత్తేన స్వయం పుత్ర విచారయ.

తా॥ ఓ తముడా ! రక్తము మాంసము మొదలగు వానియొక్క కూటమి దేహంబుగాన దేహము ఆత్మకానేరదు. అయినను ఎముకల పంజరంబగు నీ దేహంబు మొదలుకొని నేను ఎవ్వడనగుదునో యని నీ యంతట చిత్తమున విచారింపుము.

శ్లో॥ దృష్ట్యాతు పారమార్థిక్యా న కశ్చిత్త్వం న చాప్యహం,
మిథ్యాజ్ఞానమిదం పుణ్యః పావనశ్చేతి వల్గతి.

తా॥ పారమార్థిక దృష్టిచేత నీవును నేనును ఎవరము లేము. ఇకను పుణ్యుడనియు పావనుడనియు భ్రాంతిజ్ఞానమే యగుచున్నది.

శ్లో॥ బభూవుస్తే మహాభ్రేషు శిఖరేషు మహీభృతాం,
బహవో బాంధవాస్సింహాః కిం తానపి న శోచసి.

తా॥ నీ యొక్క పూర్వపు బంధువులగు ననేకసింహంబులు పర్వత శిఖరంబుల యందు ఉన్నవి. వానిని గురించి యేల శోకింపవు.

శ్లో॥ బభూవాథ వశార్ణేషు కపిలో వనవానరః,
రాజపుత్త్రిస్తుషారేషు పుండ్రేషు వనవాయసః.

శ్లో॥ హైహయేషు చ సామంత స్త్రిగర్తేష్వథ గర్దభః,
సాల్వేషు సరఘాపుత్రః పత్త్ర సరలద్రుమే.

శ్లో॥ ఏతాస్వన్యాసు చాన్యాసు బహ్వీషు జనయోనిషు,
జాతోఽసి జంబూద్వీపేస్మిన్ పురాశత సహస్రశః.

తా॥ మరియు నీవు దశార్ణదేశంబులయందు వనగజంబవుగాను, తుషారదేశంబుల యందు రాజుపుత్రుడవుగాను, పుండ్రదేశములయందు వనవాయసమవుగాను, హైహయదేశములయందు సామంతుడవుగాను, త్రిగర్తదేశములయందు గర్దభమవుగాను, సాల్వదేశములయందు దేనెటీగవుగాను, సరళవృక్షంబునందు పక్షివిగాను, ఇవియు నింక నితరములగు ననేక యోనులయందు అనేకవేల మారులు ఈ జంబూద్వీపంబున జన్మించినాడవు.

శ్లో॥ అనంతాః పితరో యాంతి యాంత్యనంతాశ్చ మాతరః,
ఇహ సంసారిణాం పుంసాం వనే పాదప పర్ణవత్.

తా॥ ఈ జగంబున సంసారనిష్ఠులగు పురుషులకు, వనమందలి వృక్షంబులకు ఆకులు రాలిపోయినట్లు అనేకులగు తండ్రులును అనేకులగు తల్లులును పోవుచున్నారు.

శ్లో॥ భావాభావ వినిర్ముక్తం జరామరణవర్జితం,
సంస్మరాత్మాన మవ్యగ్రో మా విమూఢమతిర్భవ.

తా॥ తమ్ముడా ! నీవు భావాభావములును జరామరణంబులును లేనట్టి యాత్మను ఏకాగ్రచిత్తుడవై స్మరింపుము. మూఢబుద్ధివి కాకుము.

శ్లో॥ ఏవం ప్రబోధిత స్తేన తదా పుణ్యేన పావనః,
ప్రబోధమాప ప్రాకాశ్యం ప్రభాత ఇవ భూతలమ్.

తా॥ ఆ పుణ్యునిచేత నిట్లు బోధింపబడినవాడై పావనుండు ప్రభాతకాలమునందు భూతలము ప్రకాశము నొందినట్లు జ్ఞానమును పొందినవాడాయెను.

ఇదిగాకను యోగవాశిష్ఠమునందే యీ జగము మాయికమను నిశ్చయము దృఢపడుటకై శ్రీ రామచంద్రమూర్తికి వశిష్ఠ భగవానులు లోపాఖ్యా

నమును జెప్పియున్నారు. ఇయ్యది బహువిధములైన వర్ణనలతో కూడు కున్నదై, సిద్ధాంతబోధతో అతిరమ్యమైన యొకపెద్ద యుపాఖ్యానము. అందుల మన ప్రస్తుత సందర్భమునకు కావలసిన భాగమునే యిచట సంగ్ర హించుదము. అది యేది అనిన, యీ ఉపాఖ్యానమందు ల అనునామె మహా పతివ్రతయు, ధర్మ లురాలునునై తన తపశ్శక్తివలన సరస్వ దేవి అనుగ్రహముచే జ్ఞానాభ్యాసమును పొందినదాయెను. తదుపరి సంసారము మీద తనకు గలిగిన హేయత్వబుద్ధిని తెలుపుటకుగాను తనదు పూర్వజన్మ ములను జ్ఞప్తికి తెచ్చుకొని సరస్వ దేవికిట్లు చెప్పనారం ంచెను.

శ్లో॥ బ్రహ జ స్త్వవ ర్ణాయా అష్టౌజన శతాని మే,
నానాయోని వ తాని పశ్యామీవాధునా పునః.

తా॥ బ్రహ్మ దేవుని వలన ఈ కల్పముయొక్క ఆదియందు సృజింపబడినది మొదలు నాకు అనేక యోని సంబంధములగునట్టి ఎనిమిది నూర్ల జన్మములు కడచినవి. వానిని యిపుడు మరల చూచుచున్నట్టు ఉన్నదానను.

శ్లో॥ సంసారమండలేదేవి కసి ంశ్చిదభవం పురా,
లోకాన్తరాబ్జభ్రమరీ విద్యాధరవరాంగనా.

తా॥ దేవీ ! పూర్వము ఒకానొక సంసారమండలమునందు గంధర్వలోకమను కమలమునకు తమె దను బోలి యుత్తమ విద్యాధరస్త్రీనిగా ఉంటిని.

శ్లో॥ దుర్వాసనా కలుషితా తతోఽహం మానుషీ స్థితా,
సంసారమండలేఽన్యసి న్ పన్నగేశ్వర కామినీ.

తా॥ అంతటనేను దుష్టవాసనచే కలుషము నొందినదానినై మనుష్యస్త్రీనిగా జన్మించియుంటిని. మరల వేరొక సంసారమండలమునందు నాగాంగననుగా జన్మించియుంటిని.

శ్లో॥ కరంజకుంజ జం ర కదంబవన వాసినీ,
పత్రాంబరవతీ శ్యామా శబర్యహమథాభవమ్.

తా॥ అనంతరము చిరిబిల్వవృక్షములు నిమ్మచెట్లు కదిమెచెట్లుగల వనము నందు వసించుచు ఆకులను వస్త్రముగా ధరించుచు శబరాంగనను (కిరాత స్త్రీని) గా జనించియుంటిని.

శ్లో॥ విహంగ్యా వైరివిన్యస్త వాగురా విపినావనౌ,
క్లేశేన మహతా ఛ్ఛిన్నా అధమా వాసనా ఇవ.

తా॥ అనంతరము అరణ్యప్రదేశమునందు ఒకపక్షినై జనించి యుండగా ఒక యెరుకువాడు నన్నువలతో పట్టెను. అంతట గొప్ప కష్టముతో అధమ వాసనను ఛేదించునట్లు ఆవలను ఛేదించితిని.

శ్లో॥ కర్ణికాక్రోడశయా సువిశ్రాంత మళినా సహ,
పవకుటలకోశేషు భుక్తకింజల్కయా రహః.

తా॥ అనంతరము ఆడుతుమెదనై జనించి తామర మొగ్గలయందగు కింజల్కముల దినుచు తమి గద్దెయొక్క నడిభాగములను శయ్యలయందు మగ తుమెదతో గూడి ఏకాంతముగా విశ్రమించియుంటిని.

శ్లో॥ తతోఽస్త్రీఫల దాతౄణాం కరణాం పరిపాకతః,
రాజాఽహమభవం శ్రీమాన్ సురాష్ట్రేషు సమాశతమ్.

తా॥ అనంతరము పుంస్త్వఫలమును ఈయజాలునట్టి కరలయొక్క పరిపాకముచే సురాష్ట్రదేశములయందు సంపద్యుక్తుడనగు రాజునై జనించి అందు నూరు సంవత్సరములు రాజ్యము చేయుచుంటిని.

శ్లో॥ శాలదళలోలానా మాందోళన దరిద్రతాం,
మశకస్య మయాలోక్య చీనం మశకయా స్థితమ్.

తా॥ బూరుగుచెట్టుయొక్క ఆకు ప్రేలాడుచుండగా దానియందు ఉండి ఉయ్యాల లూగుచున్న అనేకములగు దోమలలో ఒక దోమ ఉయ్యాల ఊగుటకు అవకాశములేక ఊరకుండుటను జూచుచు దైన్యముతో నేనొక యాడుదోమనుగా ఉండితిని.

శ్లో॥ యోనిష్వనేక విధదుఃఖ శతాన్వితాసు
భ్రాంతం మయా బహువిమర్ద సమాకులాసు,
సంసారదీర్ఘసరితశ్చలయా లహర్యా
దుర్వారవాత తరణీ సరణక్రమేణ.

తా॥ అనేక విధములగు దుఃఖశతములతో గూడినట్టియు, అనేక విధములగు సంకటములతో గూడినట్టియు యోనులయందు సంసారమను అతి దీర్ఘమగు నది యొక్క చలించుచున్న ప్రవాహముచేత వారింప దరము గాని గాలిచే ఓడ అనేక ప్రదేశముల కేగినట్లు నేను భ్రమించితిని.

ఇట్లు తన పూర్వజన్మ వృత్తాంతములను సరస్వ దేవి వరప్రసాద ప్రభావముచే తెలుసుకొనినదై యిట్లు భ్రాంతిపడితినని ఆల సరస్వతీదేవికి తెలిపెను. కాన యీ ఉపాఖ్యాన నిరూపణలను బట్టి విద్వాంసుడు తనకు యిప్పుడు కలుగుచున్న యీ జన్మానుభవములు యెట్టివై యుండవచ్చునో యూహించవచ్చును. ఇట్లు స్వశరీర దృశ్యానుభవముల మిథ్యాత్వము గ్రహించి నిశ్చయమును పొందిన అట్టి నిశ్చయమే తన సత్యస్వరూపజ్ఞానమునకు సాధనమై ముముక్షువైన తన యిహలోకానుభవములను దుఃఖరహితముగను లీలా మాత్రముగను యనుభవింప సమర్థుడగును. కనుక జీవుని యీ జన్మ పరంపరా కథనజ్ఞానము తన అవివేకమును పోగొట్టి యిహపరలోకసుఖములు రెంటికిని సాధనమగుచున్నదని గ్రహించవలెను.

---

# జీవవివేకము

జీవ వివేకమనగా జీవునికి కలుగవలసిన వివేకము. ఈ వివేకమును సంపాదించవలసిన యావశ్యకత యేమి యనిన, జీవుడు యిప్పుడు పొందుచున్న దృశ్య సంసారదుఃఖరాహిత్యమునకుగాను కోరునట్టి నేను దుఃఖి

దార్థము-బ్రహ్మ. ఈ బ్రహ్మయే తన యందు న్నముగానున్న మాయా ప్రభావముచే జీవ నానాత్వభ్రాంతిని పొందినట్లు, వానుభవమువల్ల తెలియు చున్నది. కాని యిది వాస్తవముకాదు. అయిననూ యీ భ్రాంతియుత నానా జీవులకు దృశ్య సంసారదుఃఖానుభవములను యీ మాయాశక్తియే అనాదిగా కల్పించుచూ, ప్రపంచానుభవముల నిచ్చుచున్నది. ఈ ప్రపంచము భ్రాంతి కల్పితముగాని మరేమియునూ కాదు. ఈ జీవుడునూ యిట్టివాడే. కాన యీ దృశ్యమంతయు కల్పితప్రపంచమే. కేవల అనాది జీవభ్రాంతి కల్పి తము. ఈ సమస్తభ్రాంతియునూ ఒక్క తత్త్వజ్ఞానము వల్లనే నశించును గాని వేరు మార్గములేదు, తత్త్వజ్ఞానమనగా సత్యవస్తు యథార్థజ్ఞానము.దీనికి గాను మనలకు భ్రాంతిని కలుగజేయుచున్న యీ మాయాశక్తిని గురించి కొంత విచారణ మావశ్యకము. మాయ, అనగా యథార్థమున లేని వస్తువును యున్నట్లుగా కనపరచుట. ఈ మాయాశక్తి అఘటనఘటనా సామర్థ్యములు గలది. ఈ మాయాశక్తిచేయు కార్యములను గురించి యిది యెందుల కిటుల నున్నదని అనుటకు వీలు-దు. ఉన్నదని చెప్పుటకునూ, లేదని చెప్పుటకునూ కూడ వీలుకాదు ఈ ప్రపంచము యిట్టిదే. లేదని చెప్పుదమా కనబడుచూ జీవులచే అనుభవింపబడుచున్నది. ఉన్నదియని చెప్పుదమా కనబడుటయేగాని వాస్తవికతగా లేదు. ఇందులకుగానే శాస్త్రము యీ మాయా కార్యమును గురించి (ప్రపంచము) అనిర్వచనీయమని తెలుపుచున్నది. అనగా ఎట్లు చెప్పు టకునూ వీలుకానిది.

ఇట్టి మాయాశక్తిచే వుడు అనాది భ్రాంతియుతుడై, పరిచ్ఛిన్న భ్రాంతినిజెంది యీ దృశ్యమందు అసక్తుడై, యీ పరిచ్ఛిన్న ఉపాధులే తాను అనగా నేను-అహం, అని తలచి తన పుణ్యపాపకర లచే సుఖదుఃఖములను పొందుచూ యీ సంసారదుఃఖమునకు పాలగుచున్నాడు. కాని జీవుడు తన వాస్తవస్థితిని విచారించి సత్తెరిగిన యెడల యిట్టి దృశ్య సక్తతానుభవదుఃఖ ములను పొందనవసరము లేదు. ఎట్లన యీ దృశ్య, పరిచ్ఛిన్న, న్న న్న,

విచిత్రానుభవములన్నియూ మాయా కల్పితములనిన్నీ, జీవునికి తన వాస్తవ స్వరూపము అద్వితీయ, అఖండ, నిర్వికార, అసంగ, పరిపూర్ణస్వరూపమని యింతవరకూ మనము చేసిన నిరూపణ, విచారములను బట్టిన్నీ, అనుభవ వివేచనలను బట్టియు గూడ నిశ్చయించి యుంటిమి. ఇది గాకనూ జీవుడు తన వివేకముచే తనకు కలుగుచున్న సమస్త దృశ్యానుభవపదార్థములయొక్క షడ్భావ వికారాదులచేతనూ, వీనియొక్క దేశకాలవస్తుపరిచ్ఛిన్నత్వముల బట్టిన్నీ యీ స్వశరీర సర్వదృశ్యము అనిత్యమని, దృశ్యమిథ్యాత్వమును దృఢముగా గ్రహించి నిశ్చయమును పొందవచ్చును. జీవునికి తన అనుభవ వివేచనలను బట్టిన్నీ మనము యింతవరకునూ చేసిన శాస్త్రవిచారణను బట్టిన్నీ కూడ తాను, నేను అనుకొను ఒక్క అహంపదార్థము తప్ప తనకు తన అవస్థాత్రయమందున, కాలత్రయమందునను కూడ అబాధితముగా కనబడుచూ స్ఫురించుచున్నదిగాని మరివేరొండు పదార్థమేదియునూ కనబడుటలేదు. బాగుగ విచారించి చూచిన పరమార్థ సత్యత్వ లక్షణము యీ అహం అను ఒక్క పదార్థమునకే వర్తించుచున్నది. ఇది ఒక్కటియే వాస్తవముగా కనబడుచున్నది. కాని యిట్టి తన పరమార్థ లక్షణములను తనయందు గుర్తించలేక జీవుడు మాయావృతుడై పరిచ్ఛిన్నత్వ దుఃఖత్వములను తనయందు అజ్ఞానముచే పొందుచున్నాడు గాని యిట్టి నానావిధానుభవములన్నియూ వాస్తవములు కావు. భ్రమయుతులైన యిట్టి జీవులను ఉద్ధరించుటకే శ్రుతిమాత "ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ", నేహ నానాస్తికించన" యని అన్వయ వ్యతిరేకములతో తెలుపుచూ యీ అహం అను పదార్థము బ్రహ్మమే. "అహం బ్రహ్మాస్మి" "తత్త్వమసి" అను మాహావాక్యములతో బోధించుచున్నది. దీనిని తెలిసికొను మార్గము జీవునికి తెలుపుటకు గాను "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" "తద్విజిజ్ఞాసస్వ" అని వాక్యములు జిజ్ఞాసువుని విధించుచున్నవి. ఇందుకుగాను వివేకముగల ప్రతి జీవుడును యీ తన వాస్తవస్వరూపమైన బ్రహ్మ స్వరూపమును గుర్తించి, విచారణచేసి, యథార్థమును నిశ్చయముగ తెలుసుకొనుట జీవుని నిత్యనిరతిశయ సుఖమునకు యావశ్యకమైయున్నది.

సామాన్యముగ వివేకియగు మానవుడు తన స్థూలశరీరము, తన మనోబుద్ధి చిత్త అహంకారములకు హేతువగుచున్న అంతఃకరణము లేక సూక్ష్మశరీరము, తన ఆత్మయు యీ మూడునూ యున్నవని తలచును. కాని యివి యెట్లున్నవి? ఎట్లు తనకు దృశ్యానుభవములను కలిగించుచున్నవి? వీటి సంబంధమెట్టిది? వీటి యాథార్థమేమియని విచారించక, కేవల విషయాసక్త ప్రవృత్తుడై జీవితకాలమును గడపుచు యీ వుడు తన పరమార్థస్థితిని తెలుసుకొనుటలేదు. ఇందుచే జన్మ పరంపరావృతుడై దుఃఖక్లేశములను పొందుచున్నాడు. పయిన తెలిపినట్లు మానవుడు తనకు స్థూల, సూక్ష్మదేహములు, ఆత్మయు వున్నవని తలచుచున్ననూ, యీ స్థూలదేహమే అహం, నేను అనుకొనువారు కొందరునూ, అంతఃకరణమునే నేను-అహం అనుకొనువారు కొందరునూ, ఆత్మాంతఃకరణములను విభాగించి గుర్తించ లేక ఆ రెంటినీ చేర్చి అహం-నేను అనుకొనువారు మరి కొందరునూ మానవులలో కనబడుచున్నారు. కాన యీ మూడింటికిగల సంబంధమెట్టిది? దీని స్వభావమెట్టిది? యని తెలిసికొనుటకు మన యనుభవముల వివేచనచేసి చూచిన యీ మూడింటి యథార్థమును మనకే తెలియగలదు. ప్రతివారును నా దేహము, నా అంతఃకరణము (అనగా సూక్ష్మ శరీరము) అని యేదో యొక సందర్భమున స్మరించుచుండుట అందరి యనుభవములో నున్నదే. ఇది అందరకునూ తెలిసిన విషయమే. మానవుడిట్లనుకొనునప్పుడు తనది అని యనుకొనుట యొక కర్త యున్నప్పుడు గదా నాది యనుకొనుటకు సంభవము. దేనికైనను కర్త లేనిచో నాది యనుకొనుట సంభవింపదు. ఇట్టి తరి యీనేను అనుకొను కర్త యెవరు అని విమర్శించిన వాస్తవమైన కర్త యెవరును యిట్లనుకొనుటకు కనబడుటలేదు. ఈ స్థూలదేహము, అంతఃకరణము, ఆత్మ యను మూడింటిలో యీ స్థూలదేహము, అంతఃకరణములు రెంటినీ గదా నావి యని మానవుడు తలచుచున్నాడు. కాని యిట్లు తలచునది యెవరు అనునది మనము గట్టిగా విచారించి తెలుసుకొనుటలేదు. పరిశేషన్యాయమునుబట్టి చూచిన అట్టివాడు ఆత్మ యేగదా కావలయును. మానవుడు స్మరించుచున్న యీ ముగ్గురిలో

యిద్దరిని అ మానించువాడు మూడవవాడేగదా కావలయును. ఇచట పరిశేష న్యాయమునుబట్టి చూచిన అట్టి మూడవవాడు ఆత యే యగుచున్నాడు గాని మరెవ్వరునూ కనబడుటలేదు. కాని వాస్తవమున ఆత లక్షణములను బట్టి చూచిన యీ ఆత నిరవయవి, నిష్క్రియుడు, నిర్వికారుడు, అసంగుడు గాన ఆయనకు యివి నావి యనుకొను కర్తృత్వాదులుండుటకు వీలులేదు ఇదిగాక యీ స్థూల సూక్ష్మశరీరములను సుకొని చూతుమా యివి రెండునూ అనాత పదార్థములు కల్పితములే గనుక జడములు. వీటికి స్వభావసిద్ధముగ జ్ఞానశక్తి లేదు. కాన వీటికి కర్తృత్వాద్య మానములు సహజముగా యుండుటకు వీలు లేదు. ఆత యన్ననో జ్ఞానస్వరూపుడు, పరిపూర్ణుడు, స్వప్రకాశుడు. కాని పయిన తెల్పిన యటుల యిట్టి నిత్యపరిపూర్ణ స్వరూపుడగు ఆత యే నానాజీవ భ్రాంతి కల్పితుడై, అంతఃకరణ ధర ములగు పరిచ్ఛిన్నత్వ, దుః త్వ, జడత్వములతో తాదాత్మ్యాధ్యాసమును పొందినవానివలె అగుపడుచూ యీ అంతః కరణ ధర ములను తనవి అని అంతఃకరణోపాధితో యన్యోన్యాధ్యాసమును పొందుచున్నా[illegible] ఇదియే జీవభ్రాంతికి ఘట్టము. ఇందుచేతనే ప్రతి మానవుడునూ ఆత్మాంతః కరణముల ధర్మవైలక్షణ్యములను బాగుగ గుర్తించలేక యీ అంతఃకరణమే ఆత్మయని భ్రాంతిచే పొరబడుచున్నాడు. ఇందువలననే పండితులు గూడ యిచట భ్రాంతి చెందుచున్నారు. ఇట్టి భ్రాంతిని విడగొట్టి యీ స్థూలోపాధ్యంతఃకరణములు రెండునూ అహం-నేను అనుమాట కర్థము కాదనిన్నీ, తాను కేవల జ్ఞానస్వరూపుడగు ఆత యేయని గ్రహించుటయే జీవవివేక మనబడును. కాని యితర పాండిత్యములు వ వివేకము కాజాలవు ఈ నేను అను అహంప్రత్యయమునకు సాక్షీ, ప్రత్యగాత , పరమాత్మ, బ్రహ్మయను పర్యాయపదములచే తెలియబడు ఆత యే నేను అని తెలుసుకొనిన జీవుడు కాలక్రమమున తన కర్తృత్వాదులు నశించి జీవన్ముక్తి సుఖమునుపొంది తన ప్రారబ్ధాంతమందు ముక్తిని బడయును. అయిననూ మన జ్ఞాన దారుఢ్యముకొరకు యీ స్థూల సూక్ష శరీరముల కర్తృత్వాది ధర ములెట్టివో విచారింతము.

ఇప్పుడు మన మనుభవించుచున్న కరచరణాది విశిష్ట యీ స్థూల దేహము యెట్టిదనిన ప్రతి జీవియొక్క అంతఃకరణము అనగా సూక్ష్మ దేహము తన ప్రారబ్ధకర్మఫలానుభవముకుగాను ఆర్జించినయొక యుపాధి. ఈ యుపాధియే స్థూలశరీరము. ఈ స్థూలశరీరము సూక్ష్మో పాధియైన అంతఃకరణ వోపాధి ఆర్జితమైయున్నది. ఈ స్థూలోపాధి యాజమాన్యమంతయూ సూక్ష్మోపాధియైన అంతఃకరణమునదై యున్నది. ఈ అంతఃకరణ వోపాధి తన అనాది అవిద్యాకామకర్మఫలములనుబట్టి ఉచ్ఛనీచోపాధులతో సుఖదుఃఖములను యే జన కాజన్మలో యనుభవించుచూ ఆ జనా ంతమందు తన ప్రారబ్ధ ఫలానుభవము రినవెంటనే యీ దేహమను స్థూలోపాధిని, దాని ద్వారా స క్తతా మానములతో తాను సంపాదించిన పుత్ర, మిత్ర, కళత్ర, క్షేత్ర, ధన, ధాన్యాదులను ఆ దేహోపాధితో సహితముగ దహన సంస్కారములకు యుపయోగించిన ఘటము లాగున అచటనే పారవైచి దానియందు నిర మానముగలది యగుచు మరయొక యుపాధిని తన వుత్తర ప్రారబ్ధకర్మఫలానుభవములకుగాను యీ సూక్ష్మో పాధి స్వీకరించుచుండును. ఇట్లు స్వీకరించునపుడు తాను స్వీకరించు స్థూలోపాధులందు వస్త్రరూపమున యీ దేహోపాధి తాదాత్మ్యమును పొందుచూ ఆయుపాధి తానుగనే ప్రారబ్ధాంతము వరకు యీ తన స్థూలోపాధిని దేహతాదాత్మ్యముతో బంధించియుంచి తన కర ఫలానుభవములను యీస్థూలోపాధియను దేహముల ద్వారా పొందుచుండును. ఇందుకుగానే ప్రారబ్ధానుభవములు బ యమగుచున్నవి. ఈ అంతఃకరణమను సూక్ష్మ శరీరి తన మోక్షప్రాప్తి పర్యంతము యిట్టి వివిధోపాధిగ్రహణములతో చర్వితచర్వణముగ భ్రమణము చేయుచుండును. ఇట్లు చేయుటలో యే జన్మ కాజన యందు తన స్థూలదేహముద్వారా స క్తతా మానములతో కర ల నాచరించుచూ పుణ పాపఫలములను తన కర్తృత్వాదికముగ పొందుచుండును. ఇదియే జీవుని అనాది అవిద్యామహిమ. ఈ మహిమయను అవిద యే వునకు సంసారదుఃఖమును కలిగించుచున్నది. వుడు తాను నేను ఆత స్వరూపుడనని తెలుసుకున్ననూ యీ జ్ఞానముతోడ పారబ్ధానుభవము విధిగా

కనబడుచున్నది. వాస్తవమున పరమార్థజ్ఞానము కలిగిన జీవునినైననూ యీ యుపాధి, దాని ధర్మములు జీవుని ప్రారబ్ధకర ఫలానుభవాంతము వరకు వదలదు. జ్ఞానియైన వానిని గూడ యీ యుపాధి ధర్మములు తేలికగా విడిచి పెట్టవు. కాని అట్టివారు, వారి ప్రారబ్ధాంతమందు స్థూలోపాధి విలయమై స్వరూపజ్ఞాన లాభమును పొందుదురు. ఇది స్థూలోపాధి చరిత్ర. ఇంక యీ అంతఃకరణము అయిన సూక్ష్మోపాధి ధర ముల విచారింతము.

ఈ సూక్ష్మశరీరి స్థూలశరీరము లాగున తేలికగా ఒకజన తో వదలి వెళ్లువాడు కాడు. వునికి కలుగుచున్న కర్తృత్వా మానములు, సుఖదుఃఖాను భవములూ అన్నియూ వాస్తవముగా యీ అంతఃకరణ ధర ములే యైననూ తన కర్తృత్వాది ధర ములతో ఆత్మను భ్రాంతియుతునిగా చేసుకొని ఆత ప్రకాశముతో తన కర ఫలానుభవములను చేయుచుండును. ఇందులకుగాను వుడు తన వివేకముతో తన వాస్తవస్వరూపమైన ఆత ధర్మములను మాత్రము గ్రహించి తాను వాస్తవమున ఆత స్వరూపుడైన కర్తృత్వాది రహితుడు గనుక యీ కర్తృత్వాద్య మానములు, విషయసుఖదుఃఖములు తనకు సంబంధించి నవి కావని తెలుసుకొనిన యెడల అట్టి వుడు తన యనుభవములను, కర లను కర్తృత్వాద్యభిమాన రహితుడై యాచరించుచుండును. కర్తృత్వాదులు నశించగనే యీ సూక్ష్మోపాధి క్షయమొందును. జీవుని భ్రాంతిచేత పరిచ్ఛిన్న గ్రహణత్వములను పొందుటచే యీ కర్తృత్వాదులు కలిగినవి. వాటి కర ఫలానుభవము కొరకు జీవునకు యీ సూక్ష్మోపాధి కల్పితమైనది. కల్పిత మైన యుపాధి గనుకనే జీవునికి తన వాస్తవ స్వరూపజ్ఞానము కలుగగనే యీ అంతఃకరణము అధిష్ఠానమునందు లయమైపోవును. అయిననూ యీ అంతఃకరణోపాధి కర్తృత్వాదిధర ము లెట్టివని, మనము వివేచన చేసి తెలిసికొనిన యెడల యీ అంతఃకరణ కర్తృత్వాది ధర ములుకూడ కల్పిత ములని మనకే స్పష్టపడును.

ఎట్లన యీ అంతఃకరణమను సూక్ష్మోపాధి స్థూలోపాధి లాగున ప్రతి జన్మాంతమునందు తన శరీరమును వదలక తాను ఆయా జనలలో అ మానా

సక్తులతో ఆచరించుచుపొందు పుణ్యపాపకర్మఫలానుభవములకుగాను అనేక యుచ్చనీచోపాధులతో జన్మలపొందుచూ తిరిగి యాజన్మలో తన కర్తృత్వాద్యభిమానములతో కర్మల నాచరించుచూ ఆ కర్మఫలములను జన్మపరంపరతో అనుభవించుచుండును. అట్లనుభవించుటలో యే జన్మకాజన్మలో ఒక స్థూలోపాధిని సంపాదించి దాని ద్వారా పుత్రమిత్ర కళత్ర క్షేత్రగృహ ధనధాన్యాదులను సంపాదించుచూ ఆ యుపాధి ప్రారబ్ధకర్మఫలానుభవాంతమున యెట్లున్నదట్లు విడచుచూ యీ స్థూలోపాధిని వదలి నిర్దాక్షిణ్యముగా వెళ్లును. ఇట్లు ప్రతి జన్మయందున నాది, నాది యను అ మానముతో సంపాదించుచూ, కర్తృత్వాద్యభిమానములతో ప్రారబ్ధకర్మఫలము ననుభవించుచూ పూర్వవాసనా సంస్కారములను బట్టి కర లాచరించుచూ వాటి సుఖదుఃఖఫలములనుభవించుచుండుటకు ఆ కర ఫలానుభవములకు తగిన యుపాధులను మరల మరల గ్రహించుచూ జన్మపరంపరలు పొందుచుండును. ఈ అంతఃకరణోపాధి జీవుడు యాత్రాపరుడు వంటివాడు. ఈ స్థూలోపాధులన్నియూ యీ అంతఃకరణోపాధి జీవునకు యాత్రికునకు మార్గమధ్యమందుండు ధర శాలల యుపయోగము వంటివే. జీవునికి యీ జన పరంపరలోని సంబంధములు, సంపాదన లన్నియూ గూడ యిట్టివే యగుచున్నవి. కాని యేమియున్నా నిత ములు కావు. అయిననూ యీ కల్పితాంతఃకరణము తన కర ఫలానుభవములకుగాను వివిధజన లలో వివిధ యుపాధులద్వారా కర్తృత్వాద్యభిమానములతో తన అనుభవములను చేయుచుండును. ఈ జీవానుభవములన్నియూ యాత్రీకులకు మార్గమధ్య ధర్మశాలలవంటివై వీటి యుపయోగము తాను వించియున్నంత కాలము నిరభిమానముగా వాడుకొనదగినవేగాని అంతకన్న వేరు కాదు.అయిననూ జీవుడు వ్యామోహితుడై తన కర్తృత్వాద మానములను వృథాగా పొందుట మూలమున తాను విధిగా ప్రారబ్ధానుసారము అనుభవించవలసిన అనుభవములు, చేయు కర లు, కర ఫలదాయకములై జీవుని మరల మరల బంధించుచున్నవి. కాన వివేకియైన జీవుడు తన యావత్తు కర ఫలానుభవములను సక్తతాభిమాన రహితుడై తన ప్రారబ్ధకర ఫల ప్రాప్తమున

సుఖదుఃఖముల ననుభవించుచుండిన ప్రారబ్ధము క్షయించును. కాని అట్టి కర్మానుభవములు తిరిగి తనకు జన్మకారణముకు కర్మోత్పత్తికి హేతువులు కావు. కాన జీవుడు తన వివేకముచేత తనకు యిప్పుడు కలుగుచున్న సుఖదుఃఖ కరా నుభవములయందు తన వాస్తవ సంబంధము ఎంతవరకు కలదు అని విచారించిన యెడల, వివేకులకు తాను యీ దృశ్యానుభవములతో పొందుచున్న దుఃఖక్లేశములు, సక్తతా మానములు, రాగద్వేషాదులు భ్రాంతి మాత్రమే యనియు అయినను ప్రారబ్ధానుసార దేహయాత్ర తప్పదు గనుక పుణ్యక్షేత్రమునకు పోవుయాత్రికుడు మార్గమధ్య వసతి గృహములను తానున్నంతకాలము నిరభిమానముతో శుభ్రపరచుకొని జాగ్రతలను చేసుకొని తిరిగి పయనముకామునకు వెళ్లునపుడు యెట్లు నిర మానియై సక్తతారాహిత్యముగ వదలి వెళ్లుచున్నాడో అట్టి మనోగతినే తాను అనగానేను అనుకొను యీ యుపాధితో పొందుచున్న యనుభవములయందును, చేయుచున్నకర్మల యందును సంపాదించుచున్న కుటుంబ, పుత్ర, మిత్ర, కళత్ర, క్షేత్ర, గృహ, విత్తాదులయందును గూడ వుంచవలెనుగాని, యీ దేహమును నేను, యీ సంపాదనలన్నియు నావి, యను వ్యవస్థారహితమైన దురహంకార, సక్తతా మాన, ఆవేశములను పొందుట వ్యర్థము, తనకు బంధహేతువుయని తెలుసుకొనుటయే జీవవివేకము. ఇంకను జీవుడు తన సంసారదుఃఖకారణమును పైన నిరూపించిన యట్లు తెలిసికొని—తన బుద్ధిని సంస్కరించుకొనుటచే కాలక్రమమున చిత్తశుద్ధి పొందుచుండును-ఈ చిత్తమనునది రెండు విధములయుండును-అవి ఏవియన :—

శ్లో॥ మనోహిద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవచ ।
అశుద్ధం కామసంపర్కా చ్ఛుద్ధం కామవివర్జితమ్ ॥

సంకల్పవికల్పాదులతో గూడినమనసు మలిన చిత్తమగును. కామ రహితమైనది నిర్మలచిత్తమనబడును. రాగద్వేషాదికామ సహితమగు మనసు బంధకారణమున్నూ, నిష్కామమగుమనసు మోక్షసాధనమున్నూ అగును, దీనినే

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః ।
బంధాయవిషయాసక్తం ముక్త్యైనిర్విషయం స్మృతమ్ ॥

అని విద్యారణ్యులు స్పష్టముగా తెలుపుచున్నారు-కాన వివేకియైన ముముక్షువు తన మనసునుండి సర్వకామములను ప్రయత్నబలముచే పోగొట్టుకొనవలయును. ఇచట ప్రయత్నమనగా నిత్యానిత్య వివేకజ్ఞానముచే విచార మననాదులు చేయుట-జీవునకు ఎంతదుఃఖక్లేశములు కలుగుచున్ననూ తాను జాగ్రద్దశలో తను అంతఃకరణ ప్రేరితుడై విషయ చింతన చేయునప్పుడు కలుగుచున్నవేకాని, తన సుషుప్తికాలములో అంతఃకరణము విలీనమై విషయ చింతన తనకు లేని కాలములో తాను సుఖముతప్ప మరియొకటేదియునూ, అనుభవించుటలేదుగదా-అందుకుగాను వివేకి, సర్వదా తన విషయ చింతనమును, సంకల్పములను త్యజించుటకు ప్రయత్నించుచున్న యెడల చిత్తము క్రమక్రమమున ఉపశమించుచుండును-అప్పుడు సత్పదార్థము గోచరించుచు, తన మనసు ప్రశాంతమగుచుండును. ఇట్టి వానికి కలుగు పరమ లాభమును గీతలలో :—

శ్లో॥ ప్రశాంత మన సంహ్యేనం యోగినం సుఖముత్తమం ।
ఉపైతిశాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥

అనగా యిట్టి మహనీయుడు గుణవివర్జితుడై, పుణ్యాపాపరహితుడగుచు శాంత మనస్కుడై ఆ బ్రహ్మానంద సుఖమును పొందునని శ్రీ కృష్ణ భగవానులే తెలుపుచున్నారు-కాన యిట్లుండుటకు ప్రయత్నమే వవివేకము.

---

## మిథ్యాత్వానుభవ వివేచన

మన గ్రంథ పాఠకులకొక మనవియేమనిన ఈ గ్రంథమందచటచట స్వశరీరమిథ్యాత్వమును గూడ దృశ మిథ్యాత్వానుసంధానములలో చేర్చి

నాడను. ఇది యెచటనూ లేదే! ఇట్లు చేర్చుట సమంజసమా? యను శంక కొందరకు కలుగవచ్చును. కాని అట్టి శంకకు ఎట్టిఅవకాశము లేదని నా శాస్త్రీయ నిరూఢి. ఏలనన అద్వైతసిద్ధాంతము ముఖ్యముగా సర్వదృశ్యమును మిథ్యయని వునికి తెలుపుచున్నది. మిథ్య యనగా భ్రాంతికల్పితము ఈ సర్వదృశ్యభ్రాంతి నశించనిదే, వునికి సంసారదుఃఖము నశించి తనసత్యస్వరూపమైన మోక్షసిద్ధి కలుగదని శ్రీ శంకరభగవత్పాదులు స్పష్టముగా తెలుపుచున్నారు. సర్వదృశ్యము యనినప్పుడు నేను అని తలచుచున్న తన స్థూలసూక్ష్మ శరీరాదులుగూడ సర్వదృశ్యములో చేరినవియే కాని తదితరములుకావు. మానవుని స్వశరీరాదులు గూడ మిథ్యయై కేవలకల్పితమాత్రముగ నున్నవి. అయిననూ మానవులు సాధారణముగ, దృశ్యమనగనే తమకన్న న్నముగ భావించి దృశ్యమును చూచుచుందురు. మానవులు సాధారణముగ తమస్థూలసూక్ష్మ శరీరములు దృశ్యకోటిలోనివై కల్పితములనిన్నీ, అవి పరమార్థ వాస్తవములు కావనిన్నీ గుర్తించుటలేదు. కాని అవి వాస్తవములనియే తలచి తమ వ్యవహారములను చేయుచున్నారు. ముముక్షువునకు స్వశరీర సర్వదృశ్యమిథ్యాత్వ గ్రహణనిశ్చయము లత్యావశ్యకము కాన ఈ స్వశరీరాదులను దృశ్యకోటిలో చేర్చుటయే న్యాయము. అయిననూ యిది నూతనప్రక్రియయని జిజ్ఞాసువులు తలంచకూడదు. ఏలనన శాస్త్రమును సమస్తపూర్వాచార్యుల బోధలన్నియునూ గూడ యీ స్వశరీరమిథ్యాత్వమునే ముఖ్యముగ జీవునకు బోధించుచున్నవి. అందులకుగాను ముఖ్యముగ స్వశరీరాదుల మిథ్యాత్వ దారుఢ్యమునకున్నూ, గ్రహణ సౌలభ్యమునకున్నూ, దృశ్యకోటిలో జేర్చి, అనుసంధానక్రమమును తెలుపుటయైనది. ఇట్లు చేర్చుటలో ముముక్షువునకు విస్పష్టతకలుగును. కాన అనుసన్ధానాదులయందు చేర్చడమైనది.

మరియొక చిన్నవిషయమిచట విమర్శింపవలసియున్నది. అది యేది యనిన మిథ్యాత్వగ్రహణ మనగా శరీరాదులు లేవని యనుకొనుటకాదు.

కాని అవి వాస్తవము కాదని గ్రహించుట. వాస్తవముకాని మాత్రమున ప్రయోజనకారులు కాకపోవు ఎట్లుగ్రహించిననూ యీ శరీరము లెచటికిని పోవునవికావు. శరీరానుభవము ప్రారబ్ధాధీనము. మానవుడు తనశరీరమును ఎట్లు గ్రహించినను అది కర్మ ఫలానుభవమునకుగాను తన ప్రారబ్ధాంతము వరకును యుండును. కనుక స్వశరీరమిథ్యాత్వమును మానవుడు నిశ్చయముగా గ్రహించి తన వాస్తవస్వరూపమును తెలుసుకొనుటచే అర్థ పరమార్థ లాభములు రెండునూ కలుగును. అనగా యీ స్వశరీర మిథ్యాత్వనిశ్చయ జ్ఞానము, మానవుడు తను విధిగా యనుభవింపవలసిన ప్రారబ్ధకర్మ ఫలానుభవ వ్యవహారములందుగూడ తన అధికసుఖానుభవములకు నుపయోగించుచు, కాలక్రమమున మోక్షసాధనమగును. ఇంతియేకాని యీ జ్ఞానము మానవునికి తన వ్యవహారానుభవ ప్రతిబంధమని తలచకూడదు. అట్లుగాక యీ జ్ఞానము మానవునికి వ్యవహారానుభవ సౌలభ్యతను, సుఖమును యిచ్చును. కావున ముముక్షువులైనవారు యిట్టి స్వశరీర మిథ్యాత్వములను నిస్సంశయముగ తెలిసికొనుట యావశ్యకము. ముముక్షువు తనయుపాధి మిథ్యాత్వమునెప్పుడు నిశ్చయముగ గ్రహించగలుగునో యప్పుడు సర్వోపాధుల దృశ్యమిథ్యాత్వమును యిట్టిదియేనని సులభముగా గ్రహించగలిగి వాస్తవమైన దృశ్యాధిష్ఠానజ్ఞానము పొందును. ఇట్టి జ్ఞానమే కాలక్రమమున తనకు మోక్షసాధనమగును. దీనినే శ్రీ శంకర భగవత్పాదులు:-

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానందలక్షణే ।
బ్రహ్మైవ సకలం విశ్వంభోక్తృ భోగ్యాదిలక్షణమ్ ॥

అని తెలుపుచున్నారు. కనుక సర్వాధిష్ఠానజ్ఞానము సర్వమిథ్యాత్వ జ్ఞానమువలనగాని కలుగదు. సర్వదృశ్యమిథ్యాత్వజ్ఞానము కలుగగనే సర్వాధిష్ఠానస్వరూపమైన సచ్చిదానందలక్షణములు కలుగును. ఇట్టి మహనీయుడైన ముముక్షువు తన సర్వవ్యవహారములను, వ్యవహారాధిష్ఠానమైన శ్వేతాంబర పటమునందు కనబడు శబ్ద చలనచిత్రముల లాగున చూచుచు సర్వాధి

ష్ఠానమైన తన సత్యస్వరూపమునందే ఈ వ్యవహారములన్నియునూ తన ప్రారబ్ధకర ఫలాను సారమున అధ్యస్తములై కలుగుచున్నవను జ్ఞానముతో తన కర్తృత్వ భోక్తృత్వాదులయందు సక్తతారహితుడై యథాప్రాప్తమున తన తన ప్రారబ్ధమును గడుపుచుండును. ఈ ముముక్షువు తనవ్యవహారాను భవములయందు మిథ్యాత్వమును అనగా వాటి అసత్యత్వమును బాగుగ గ్రహించినవాడు కావున అట్టి అనుభవములయందు అధికసక్తతానుభవములు లేనివాడై వాటిచే కలుగు సుఖదుఃఖములను పామరునివలె పొందక, ఛాయా మాత్రముగ ననుభవించుచూ తన ప్రారబ్ధకర లను సక్తతారహితముగ, యథాప్రాప్తమున చేయుచుండును. ఇట్లు తానాచరించు నిర మాన కర లు తనకు భావిబంధము గలిగింపజాలవు. కాలక్రమమున తన అభ్యాసపాట వములచే, తన సత్యస్వరూపమైన అఖండసచ్చిదానంద స్వరూపమును గుర్తించగలుగును. ఇదియే వుని పరమముక్తి, మోక్షము అగుచున్నది.

---

## అనుభవ వివేకము, పురుషప్రయత్నావశ్యకత

ఈ ప్రారబ్ధమును గురించి "నాభుక్తంక్షీయతేకర కల్పకోటి శతైరపి" అనిన్నీ "అవశ్యమను భోక్తవ్యంకృతం కర శుభా శుభం" అనిన్నీ శాస్త్ర వచనములు తెలుపుచున్నవి, గాన జన్మించిన ప్రతిమానవునకున్నూ పామర పండితులకు గూడ ప్రారబ్ధకర ఫలానుభవము తప్పుటలేదు. లోకమందు కొంద రకు, ప్రారబ్ధము చొప్పున అనుభవము కలుగుచుండ పురుషకారమావశ్య కమా? ప్రారబ్ధములో ఉన్నది జరుగును. లేనిది జరుగదు అని కొంతమంది ప్రారబ్ధశబ్దము నన్వయించుకొని సంశయచిత్తులగుచున్నారు. ఇందు నిజా నిజములు గ్రహించుట యావశ్యకముగదా ?

ఈ ప్రారబ్ధమనగా జీవుని సంచితకర లో కొంతభాగము కాలపరి పాకముచే వర్తమానజన్మమందు అనుభవించుటకు గాను విభాగము అయిన

కర్మ. దీని స్వరూపము ఎట్టిదనిన అంబులపొదిలోనుంచి తీసి ధనస్సునందు ఎక్కుపెట్టి విడువబడిన బాణమువంటిది. ధనస్సునుంచి విడువబడిన బాణాగ్రము దాని నిశిత, ఉరవడులను బట్టి ఎచటనో తగుల వలయునుగాని వేరు అగుటకు వీలులేదుగదా? గనుకనే ఇట్టి ప్రారబ్ధ కర్మ ఫలానుభవముకొరకే మానవునికి జన్మాదులు కలుగుచున్నవి. ఇచట ఈ విషయగ్రహణసౌలభ్యముకుగాను ఈ క్రింది ఉపమానములు తీసుకొనబడి చెప్ప బడుచున్నవని పాఠకులు గ్రహించుదురుగాక. మానవులు ఇట్లు జనను పొంది వారివారి కర్మఫలముల ననుసరించి జీవయాత్రనుగడుపుట రైలుప్రయాణముచేయుటవంటిది. ఎట్లనగా, మనము వారివారి కర్మఫలమనుద్రవ్యముతో టిక్కెట్టును సంపాదించి ఆ టిక్కెట్టు తరగతులను బట్టి, అనగా వారివారి కర్మఫలసంపాదనార్హతను బట్టి ఆయా స్థితికితగు పరిస్థితులలో జన పొంది ఈ ప్రారబ్ధమను రైలుబండియందు స్థితులై కర్మఫలానుభవము కొరకు జీవిత మనుప్రయాణమును చేయుచున్నాము. ఈ ప్రారబ్ధముకూడ ధూమశకటము లాగుననే ప్రవచలనాదిశక్తులు కలిగి పరుగిడుచు వారివారి స్థితిగతులను అనుభవములను కల్పించి, (అనగా రైలుస్టేషనులవంటివి) అనుభవింప చేయుచుండును.

ఈ ప్రారబ్ధ ఫలము మానవునకు నెత్తిమీద బరువుమూటవంటిది. ఈ జీవుడు అయిన మానవుడు తనకర్మఫలమను బరువుమూటను శిరముననుంచు కొని రైలుబండిలో కూర్చునియున్న ప్రయాణీకుడు వంటివాడు. ఇట్లు ప్రయాణముచేయునపుడు వివేకుడైన ప్రయాణీకుడెవ్వడును తనశిరస్సుమీద బరువుమూటను తననెత్తిమీదనే ఉంచుకొనునా? రైలుబండి ఎక్కగనే తన తల మీదనున్న బరువుమూటను తీసి రైలుబండి చెక్కమీద పెట్టిగదా ప్రయాణము చేయుచున్నాడు. అట్లుగాక ఒకానొక యవివేకి తనమూట తననెత్తిమీద యుండిన ఫలమని తలచిగాని ప్రయాణపు బండికి బరువుతగ్గునను ఉద్దేశ్య ముతోగాని యామూటబరువును ప్రయాణకాలమంతయు తన శిరమున

మోయుచుండిన యడల అట్లు చేయుట తన యధిక క్లేశమునకే కారణమగుచున్నది గాని రైలుబండికి ఎట్టితారతమ్యములేదుగదా? నెత్తినుంచి బరువు సిరైలుచక్క మీదనుంచినప్రయాణీకుడును, బరువు మూటను తనతలయందే యుంచుకొని మోయుచున్నప్రయాణీకుడును, ఉభయులకు గమ స్థానము చేరుటలో కాలభేదమించుకయైనను ప్రయాణపుబండివల్ల కలుగుటలేదు. ఈ ప్రారబ్ధమను ధూమశకటము గమ్యస్థానమునకు ఉభయులను ఏకకాలమందే చేర్చుచున్నది. కాని ప్రయాణకాలములో ఒకనిది సుఖానుభవము, మరియొకనిది క్లేశ దుఃఖానుభవము. ఇది గాకను ప్రయాణముచేయుకాలములో మన రైలుపెట్టెలో కూర్చునియుండు వారు మన కుటుంబ బంధువులు అనగా భార్యాపుత్రాదులవంటివారనియే గ్రహించవలెను. ఎట్లనగా యీ భార్యాపుత్రాది బంధువులందరును గూడ వారి, వారి, కర ఫలములను టిక్కట్లతో, మనరైలుపెట్టెలో నెక్కుయితరులవలెనే వారి కర్మఫలమును బట్టి మనము కూర్చున్న రైలుపెట్టె అనగా మనకుటుంబములోనికి వచ్చినవారేగాని, కుటుంబములోని యందరి టిక్కట్లునూ యొక్క స్టేషనుకే అయివుండవలెనను నియమము లేక యెవరి స్టేషను రాగానే అనగా యెవరికరా నుభవము పూర్తికాగానే వారు తక్కిన వారికొరకాగక వారిస్థానములకు పోవుచుందురు— ఇట్టిదియే యీ కుటుంబ కలియికలు. అయిననూ రైలుపెట్టెలో ప్రయాణము చేయుచున్నంతకాలము యొకరినొకరు ఆదరముతో చూచుచూ, వారివారి స్నేహాతిశయములచే యొకరి కాఫీ, పండ్లు, ఫలహారములు వారితోటిప్రయాణీకులకుగూడ యిచ్చుచు స్నేహసంభాషణలతో కాలముగడుపుతూ చేయుప్రయాణము బడలిక యనిపించక సుఖదాయకమగుచున్నదిగదా. అట్లే మనకుటుంబములోనివారలతో వ్యవహారము గూడ యావశ్యకమైన ప్రీతి యాదరణములతోయుండి— వివేకియైనవాడు వారలతో తనసంబంధము తోటిప్రయాణీకులవంటిదేనని—— నిశ్చయముగా తెలుసుకుని ప్రారబ్ధశకటమందు తనకుటుంబమను పెట్టెలో పయనము చేయుచుండిన ధీరమనస్కునకు భయమేమియుండును. ఇట్టిదియే

వివేకానుభవము. కాన దీనిని బట్టి మానవుని వివేకబలముచే ఈకర్మ ఫలాను భవములను సుఖదుఃఖతారతమ్యములతో ననుభవించవచ్చునని గోచరించుచున్నది. దీనిని గురించి లోగడ నిరూపణలలో కొంత విచారించియుంటిమి.

అయినను ఇచట యొక ప్రశ్నకు సంభవము కనబడుచున్నది. ఏది యన, ప్రయాణికుని మూట ప్రత్యక్షము కనుబడుచున్నది. గనుక అట్టి బరువును తన శిరస్సునుంచి తీసి క్రిందయుంచుట సాధ్యముకాని, ఈ కర్మ ఫలమను మూట ఎవరికెనికనుబడుట లేదే:— దీనిని నెత్తిమీదనుంచి తీసి క్రింద పెట్టుటగాని, విడుచుటగాని, ఎట్లుసాధ్యమను శంక కవకాశమున్నది. కాని ఇట్లు శంకింప పనిలేదు. ఈ కర్మఫలానుభవమనుమూటగూడ అనుభవరూపముగా అందరకును తెలియబడుచునే యున్నది. ఇట్టిదానిని తన శిరస్సునుండి క్రిందపెట్టుట యనగా తన కర్తృత్వాదులను వదలుట. తన సమస్త అనుభవములను తను చేయుసర్వకర్మలను నిరభిమానుడై ఫలాభిసంధిలేక సక్తతారహితుడై యనుభవించుట, చేయుచుండుటయే. తన శిరస్సుమీదిభారమును తగ్గించుకొనుట. ఇదియే పురుషప్రయత్నము. ఇట్లు పురుషప్రయత్నముతో అద్వైత సిద్ధాంతస్వరూపమందు ప్రీతి, నిశ్చయములను పొందవలయును. ఇట్లు చేయుటకు ఈ స్వశరీర, సర్వదృశ్య, మిథ్యాత్వజ్ఞాన నిశ్చయములవల్లగాని సంభవముగాదు. ఈ దృశ్యమిథ్యాత్వమును సవిస్తరముగా లోగడనే నిరూపించి యుంటిమి. ఇట్టి మనోనిశ్చయముగల జిజ్ఞాసువునకు దృశ్యపదార్థానుభవములయందు అసత్యత్వనిశ్చయము, అనగా ఈ సర్వదృశ్యము వాస్తవము కావను జ్ఞానమువల్ల తనకు దృశ్యానుభవవిషయములందు సక్తత క్రమక్రమముగా తానుగనే తగ్గుచుండును. ఈ సక్తతారహితవిషయానుభవమే కర్తృత్వాభావనలు తగ్గుటకును, నిరూలమగుటకును మిక్కిలి యుపకరించును. కాని ఎట్లు చేసినను ప్రారబ్ధమను ధూమశకటము అతితీవ్ర గమనచలనాదులతో ప్రయాణము సలుపుచు పరుగిడుచుండును. ఇట్టి తీవ్ర గమన చలనాదులు ప్రయాణకాలములో నాటసాధ్యముకాక తనభయప్రమాదములకు హేతువగుచుండును.గాన ఇట్టి భయప్రమాదములనుండి రక్షింపబడుటకు

రైలుపెట్టెలయిరుప్రక్కలను తలుపులుండును. ఆ తలుపులు మూయుటయను ప్రయత్నజాగ్రతలచే ప్రయాణము సురక్షితముగా జరుగుచున్న విషయమందరకును తెలిసినదే. తలుపులున్నను మూయుట అను ప్రయత్నము లేకపోవుప్రయాణీకుడు ఎంతకష్టములపాలగునో ఇదియును యూహింపతగియే యున్నది. ఇట్లే ఈ ప్రారబ్ధకర్మానుఫలభవముకుగాను జీవయాత్ర చేయువాడు భయప్రమాదములనుండి తప్పించుకొనుటకున్నూ, తనప్రయాణకాల సౌకర్య లాభములపొందుటకున్నూ వివేకి అయినవుడు తనపురుషప్రయత్నములనుకవాటములను వాడుచు ప్రారబ్ధమను బండియందు వయాత్రను సలుపుచుండవలయును. పురుషప్రయత్నమను వివేకసాధనము ను మనలకు పరమేశ్వరుడు దయామయుడై మన వయాత్రను సురక్షితముగ గడపి పరమగమ్యస్థానమైన మోక్షము సంపాదించుటకొరకు అనుగ్రహించి మానవులకిచ్చియున్నాడు. గనుక ప్రారబ్ధమనుభవించుచు ఫలప్రాప్తిపొందుటకును ప్రయాణకాల సంరక్షణార్థముకుగాను వునికి విధిగా పురుషప్రయత్న మావశ్యకము.

ఇట్టి పురుషప్రయత్నములేనిది ఫలము సర్వదా అనుభవకారియగుటలేదు. ఎట్లన యిరువురు బాటసారులు కలరు. అందు ఆహారసామగ్రి, అనగా బియ్యము, ఉదకము, కర్రలు ఉన్నవాడొకడు, ఇట్టివి ఏమిన్నీ ఎట్టివిధమైన సామగ్రిలేనివాడొకడున్నూ వుండిరి. వీరిరువురకున్ను మార్గమధ్యమందు ఆకలిబాధ కలిగినది. కొంతకాలమిరువురును సమానముగనే బాధనొందిరి. కాని ఆహారసామగ్రియున్నబాటసారికి జ్ఞాపకముకలిగి ఆ బియ్యమును, నీళ్లలోపోసి కట్టెలను రగులజేసి దానిమీదయుంచుట అను పురుషప్రయత్నము చేయగా స్వల్పకాలములోనే వాని ఆహారము సిద్ధమై భుజించి ఆకలిని పోగొట్టుకొనినవాడాయెను. గాని సామగ్రిలేనివాడు ఎంత ప్రయత్నించినను ఆహారము సమకూరలేదు. అనగా అదృష్టఫలలోపమని తెలియవలెను. గాన పురుషప్రయత్నము లేనిచో అదృష్టమున్న వారికిగూడ సర్వదా ఫలకారిఅగుటలేదు గానపురుషప్రయత్నముగూడ ప్రారబ్ధమునుసరించి

వివేకుడై చేయుచుండుట మానవుని కావశ్యకము. ప్రారబ్ధకర ఫలము --దృష్ట-- అదృష్టములు రెండింటితోను కలసివుండును-దృష్టఫలము ప్రత్యక్షము గాని అదృష్టఫలమును, కార్యకారి చేయుటకు (పొందుటకు) నిమిత్త కారణముండవలయును. ఇట్టి నిమిత్తకారణమే పురుష ప్రయత్నమనబడు చున్నది. పైన ఉదహరించిన ఇరువురి బాటసారుల ఆకలి ఉదాహరణమును బట్టి అదృష్ట సామగ్రియున్ననూ పురుషప్రయత్నము లేనిది కార్యసిద్ధి అగుటలేదు. ఇట్లు ఒకకార్యసిద్ధిని సాధించుటకుగాను మనలకు ఉన్న అదృష్టము అనగా ప్రారబ్ధకర ఫలము బలముగనున్నదా, లేక దుర్బలముగ నున్నదా, యని తెలిసికొనుటకు మనముచేయు పురుషప్రయత్నమే మనలకు సాక్ష్యమిచ్చును. అనగా అల్పప్రయత్నముతో కార్యసిద్ధి అయినయడల అదృష్టఫలము బలమైనదనియు,విశేషప్రయత్నముతో సిద్ధించిన అదృష్టఫలము యున్నను దుర్బలమైనదై విశేషప్రయత్నబలసహకారముతో సిద్ధించినదనియు, విశేషప్రయత్నము చేసినను కార్యము సిద్ధించనియడల అట్టివిషయకమైన అదృష్టఫలమెంతమాత్రము తనకు లేదని గ్రహించవలెను. వివేకుడైనవాడు ఇట్టిగ్రహణముతో ఇప్పుడతను చేయు పురుషప్రయత్నమే భావికాలమున తనకదృష్టఫలముగ పరిణమించునని తెలికొని ప్రయత్నము చేయుచుండవలయును. పర్యవసానమేమనగా అదృష్టఫలప్రాప్తి ఫలానుమేయముగానే తెలియబడునుగాని అన్యథా గాదు. ఇట్టిప్రారబ్ధఫలమును పొందుటకు నిమిత్తకారణావశ కతను నిరూపించుట భగవంతుడైన శ్రీకృష్ణుడు అర్జునునిచే, యుద్ధము చేయించి జయమును ఒనగూర్చినాడు. ఆయనసర్వశక్తుడైన పరమేశ్వరుడే అయినను, వారిఅదృష్టఫలమున్నను పాండవులకు విజయము, వారిరాజ సంపాదనయున్నూ నిమిత్తకారణముగా ఉండవలసిన పురుషప్రయత్నమను యుద్ధమునుచేయించి ప్రసాదించియున్నాడు. గాని అన్యథా యిచ్చివుండలేదు. ఈ విషయము యుద్ధముచేయుటకు భయముతో వెనుదీసినప్పుడు శ్రీ కృష్ణభగవానులు "నిమిత్తమాత్రంభవ సవ్యసాచిన్" అని అర్జునునికి తెలిపియున్నారు. గాన ఈ పురుషయత్నమునకిట్టి యావశ్యకత ఉన్నది.

గాన ముముక్షువు ఇట్టిపురుషప్రయత్నముతో అద్వైతసిద్ధాంతమందు ప్రీతినిశ్చయములను సంపాదించి తనకార్యసిద్ధి ఉత్తరజన్మమందైనను సాధించగలనను నిశ్చయముతో ప్రజ్ఞనుసంపాదించి సర్వదా సత్యస్వరూపమును అనుసంధానము చేయుచుండు జిజ్ఞాసువునకు, శ్లో॥ తేషాంసతతయుక్తానాం। భజతాం ప్రీతిపూర్వకం। దదామిబుద్ధియోగంతం। యేనమాముపయాంతితే ॥ అని భగవద్వచనము తెలుపుచున్నది. అనగా మోక్షార్థియై తన సత్య స్వరూపమును పొందగోరుచు పురుషప్రయత్నముతో అనుసంధానాదులను చేయువానికి అట్టిబుద్ధిని నేనే యిచ్చెదను అని పరమేశ్వరుని వాక్యము తెలుపుచున్నది. గాన అట్టి మహనీయులకు సత్యస్వస్వరూపజ్ఞానము కాలక్రమముగ తనంతటతానుగనె గోచరించుచుండును.

---

# స్వస్వరూపసుఖ ఆవశ్యకత, సంభావితము

స్వ శబ్దమునకు వాస్తవికార్థమేది యనిన, యథార్థమున ఆత స్వరూపుడైన తాను అను నేను అనియే. స్వరూపసుఖ మనగా నిర్విషయక సుఖము. అనగా స్వరూపమే సుఖముగాకలది. ఇదియే ఆత . ఇట్టిసుఖము మరియొక విషయాపేక్ష లేక నిత్యమై పరిపూర్ణమైయున్నది. ఇదియే మానవుని పరమార్థసత్యస్వరూపమై యున్నది. కాని దీనిని మానవుడు తన అనాది అవిద్యా వభ్రాంతిచే తెలుసుకొనలేకున్నాడు. ఇదియే వభ్రాంతి. ఇట్టి భ్రాంతిని మానవుడు స్వప్రయత్నముచే పోగొట్టుకొని యిట్టి స్వరూప సుఖపదార్థము తాను ఏ యని తెలుసుకొనినయెడల అట్టి స్వరూపసుఖము మానవునికి నిత్యమై శాశ్వతముగా నుండును. విషయ సుఖములన్నియు అనిత్యములు, అశాశ్వతములు.

## బ్రహ్మ విద్యానుసన్ధాన దర్పణం

మానవులు వారివారి యిచ్ఛానుసారము యెట్టి పుణ్యపాపకార్యములను చేయుచున్నను ప్రతిమానవుడును సర్వదా కోరునది తన సుఖము. దీనిని అన్నిటికంటె అధికముగా కోరుచు తెలిసియో తెలియకయో యిట్టి తనసుఖము శాశ్వతముగా నుండవలెననిగూడ ప్రతిమానవుడును కోరుచుండును. ఇది సహజము. కాని యిట్లుపొందుచున్న సుఖము, విషయసుఖములగుటచే తాత్కాలికములగుచు స్వభావముచే నశించుచున్నవి. అందువలన మానవుడు కోరికపరంపర గలవాడై దుఃఖమును పొందుచుండును. అయినను యిట్లే సుఖస్యానంతరం దుఃఖము, దుఃఖస్యానంతరం సుఖానుభవములను పొందుచు మానవ వులందరును అనగా జనసామాన్యులు, యీ సాంసారిక వితానందములనే పొందుచు తృప్తి నొందుచున్నారు. తృప్తినొందినవారికి కోరదగినది ఏమియుండును? కాని యీ తృప్తిఅనిత్యమై అవివేకమువల్ల కలుగుచున్నది. ఇట్టివారికి ఈ అద్వైత మోక్షశాస్త్రముయొక్క ఆవశ్యకత కనుబడదు. కాని కొందరు సుకృత వులు యీ విషయసుఖములు అనిత్యములు దుఃఖపూరితములు యని తలచి శాశ్వత సుఖమొక్కటి యున్నదా, అట్లుండిన దానిని సంపాదించుట యెట్లు అని చింతించుచుందురు. అనగా యిట్టివారు విషయసుఖానుభవములతో విసగటచెందినవారు. వీరే శాశ్వత సుఖమును వాస్తవముగా కోరువారు. ఇట్టివారు వారి నిత్యానిత్య వివేకముచే దృశ్యసుఖములతో తృప్తినొందనివారు. కాన వీరిని గురించియే శాస్త్రము మోక్షసుఖ ప్రాప్తి సాధనములను తెలుపుచున్నది.అద్వైతసిద్ధాంత సారాంశము."జగన్మిథ్యాబ్రహ్మసత్యం" అనితెలుపుచున్నది. దీనినే వుని నిత్యనిరతిశయ సుఖప్రాప్తికిగాను అనేక శ్రుతి, యుక్తి, అనుభవ ప్రమాణములతో శాస్త్రము బోధించుచున్నది. అయినను యిచట కొందరు, యీ కనబడుచు అనుభవింపబడుచున్నజగత్తును అనగా సర్వదృశ్యమును లేనిది, సత్యము కానిది, మిథ యనుకొనుట యెందులకు అని సంశయించుదురు. మనలకు యిప్పుడు కనబడుదానిని వదలి కనబడనిదానికి ప్రయత్నించి తెలుసుకొనుట యెందులకని తోచవచ్చును. కాని యీ సంశయము మన లోకానుభవ వివేచన

వల్లనే తెలియగలదు. మొదటిపక్షము శాస్త్రప్రమాణము ననుసరించి చూచిన తత్త్వశాస్త్రము యెల్లప్పుడును మనలకు తెలియనిదిని, ప్రస్తుతము కనబడని వాస్తవవిషయములనే చెప్పునుగాని, సర్వులకును తెలిసి ప్రతిదినమునను మానవుడనుభవించు విషయములందు ప్రవర్తించదు. అనగా, బోధించదు. ఎందులకనిన అట్టి విషయానుభవములు బోధయొక్క యావశ్యకత లేకుండగనే, సహజప్రవృత్తి ధర్మములుగ కలుగుచున్నవి. కనుక శాస్త్రబోధ అట్టివానియందు అనావశ్యకము. మానవునకు సామాన్యముగ తెలియని అపూర్వవిషయమునే శాస్త్రము బోధించును గాన శాస్త్రవచనము ఆప్తవాక్యము వంటిది. వాస్తవమైన ఆప్తుడు యెల్లప్పుడును మిత్రుని క్షేమశ్రేయస్సులను కోరుచుండువాడుగనుక అట్టి ఆప్తవాక్యము సదా వినదగినదిగా నుండును.

సదా మానవుడు తనకు కనబడనిదానిని అనగా ప్రస్తుతము తెలియబడకుండుదానిని గూడ, తన ప్రజ్ఞతో వివేచనచేసి, ప్రయత్నించి, సాధించి దానిలాభమును తన సుఖముకొరకు పొందుచున్నాడు. ఇది సర్వదా జరుగుచున్న విషయమే. ఇది రెండవపక్షము. ఎట్లన సుమారు కొన్ని శతాబ్దములకు పూర్వము మానవులు అప్పుడు అనగా ఆకాలములో తమకు కనబడుచూయుండిన పాడిపంటలు, పశుసంపద, సాధనసామగ్రులతో తృప్తిచెంది వించుచుండెడివారు. మరికొంతకాలమునకు మానవుని వివేకముతో అప్పుడు తమకు కనబడనిదిని, తెలియనిదిని అయిన నీటి ఆవిరిశక్తిని ( ower o Steam ) కనుగొని మరి కొంతకాలమునకు విద్యుచ్ఛక్తి (e ectricity) అను శక్తియొకటి యున్నదని తెలుసుకొని దానిని సంపాదించి తదుపరి యిప్పుడు అణుశక్తి (atomic ener y)అనుశక్తినిగూడ కనుగొని యున్నారు. ఈ శక్తులన్నియు ఒకానొకకాలమున మానవునికి కనుబడక యుండినవియేగదా? ఇట్లు కనుబడకయుండిన శక్తి, పదార్థములను కనుగొనియేగదా మానవుడు, ఐహికభోగా వృద్ధిని పొందుచున్నాడు. ఇట్టి శక్తి, పదార్థములను వివిధసాధనములచే సంపాదించి మాన‑లు వారి సుఖము

కొరకేగదా యుపయోగించుకొనుచున్నారు. కాని యిందు నిత్యమై శాశ్వత సుఖమునిచ్చుశక్తి, పదార్థములెవ్వియూ కనుబడుటలేదు. అయినను మానవులు, యీ శక్తి,పదార్థములను వివిధసాధనములచే సంపాదించి వారి తాత్కాలిక సుఖముకొరకే యుపయోగించుచున్నారు. ఈ శక్తి పదార్థములను యెట్లు వాడుచున్నను అనగా యంత్రములు పనిచేయుటకుగాను, మానవచికిత్సకు ఆసుపత్రులయందుగాని యంత్రములు నడుపుటకు e ectr ic tra:ns, aero-anes an su marines) వగైరాలకుగాని, యుద్ధముచేయుటకు Atom om s మొదలగు ఆయుధసామగ్రులకు గాని, వేనికి వుపయోగించిననూ మానవులు వారువారు కోరుచున్న సుఖమునకేగదా యిట్టి శక్తులను వాడుకొనుచున్నారు. కాని యిందు యేదియు మానవునకు అమృతమై శాశ్వతసుఖమును యివ్వజాలకున్నది. అయినను యిప్పుడు యిట్లు తెలియబడుచున్న యీ శక్తి పదార్థములు సర్వదాయున్నవియే యైననూ, మానవుడు అట్టిశక్తి, పదార్థములున్నవనిగాని, ఉన్నవని తెలిసిననూ సంపాదించు సమర్థత లేకుండుటవల్లగాని, కొన్నిశతాబ్దములక్రిందట మానవుడు అప్పటికి యున్నవానితో తృప్తిజెంది, అప్పటి కదియే వారి పరమసుఖమని తలచి యనుభవించుచుండెడివారు కాని కొంతకాలము తదుపరి మానవుని ప్రజ్ఞా వివేకములతో అప్పటికి వారికి కనబడనిశక్తి, పదార్థములను సంపాదించి యిప్పుడు మానవసౌఖ్యమునకు వాడుకొనుచున్నారు. అప్పటికి లేనివి అనగా అప్పటి మానవబుద్ధికి గోచరించనివి, అనియే అర్థముగాని అప్పు శక్తి, పదార్థములు లేవని యర్థముకాదు. ఈ శక్తి, పదార్థములు మానవుడు తెలిసికొని సంపాదించిననూ, తెలియక విడచిననూ యెప్పుడునూ ఉన్నవియే. మానవుడు యున్నదానిని సంపాదించగలడుగాని, లేనిదానిని యెప్పుడునూ సంపాదించలేడు. ఇది నియమము. ఇట్లు తనకు తెలియని దానిని కనుగొని దానిని మానవుడు సర్వదా తనసుఖముకొరకు ఉపయోగించుకొనుచున్నాడు. మానవుడు యెన్నిప్రయత్నములు చేసిననూ తన సుఖముకొరకే గదా.కాని మానవులు యెంత వ్యవప్రయాసలతో యీ శక్తి, పదార్థములను సంపాదించిననూ వాటివలన

శాశ్వతసుఖము వునకు కలుగుటలేదు. ఏలనన యిట్టి శక్తి, పదార్థములు కల్పితములుగాన స్వభావముచే నశించునుగాని శాశ్వతముగా నుండజాలవు. కనుకనే శాస్త్రము మానవునకు సర్వదా ఏకరూపమై, నిత్యమై, నిరతిశయ సుఖము అనగా శాశ్వతసుఖము యొకటి యున్నదని తెలుపుచున్నది. ఇట్టి శాశ్వతసుఖమును మానవులందరును కోరునదియేగదా? ఎట్టిమానవుడై నను తన దుఃఖమునుగాని, తననాశమును గాని యెప్పుడును కోరడు. ఆత హత్యచేసుకొను మానవుడుకూడ తన సుఖమునపేక్షించియే అవివేకముతో యుచున్నాడు.

శాస్త్రము మానవుని శాశ్వతసుఖము మోక్షప్రాప్తికిగాను సత్యమై యున్నదే తెలుపుచున్నదిగాని, లేనిదినీ అసత్యమైనదినీ, అసాధ్యమైనదినీ తెలుపదు. మానవసాధ్యముకానిదానిని శాస్త్రము బోధించదు. బోధించిననూ ప్రయోజనముండదుగాన అట్లు శాస్త్రము ప్రవర్తించదు. కాన మోక్షార్థి (అన గా శాశ్వతసుఖమును కోరువాడు) యిట్టి నిత్యనిరతిశయసుఖము అనగా తన శాశ్వతసుఖమును శాస్త్రీయ సాధనాభ్యాసములచే సాధ్యముకాని అన్యవిధముగా కాదు. ఈ శాశ్వతసుఖమనునది నిత్యమైన సత్యముకాన దీనిని సంపాదించు టకు వివేకులకు సర్వదా సాధ్యమగుచున్నది. కాని యీ కాలమునందు మన లకు సాధ్యమాయను సంశయమునకు అవకాశములేదు. మానవులకు తమసుఖము శాశ్వతముగా యుండవలెనను కోరికమాత్రము యుండును గాని తాను కోరు యిట్టి శాశ్వతసుఖము పొందుటకు సాధనములు యీ దృశ్య పదార్థములతో అనగా ఇప్పుడు తనకు తెలిసిన విషయపదార్థముల వలన కలుగుటలేదు. గనుకనే శాస్త్రము అట్టి శాశ్వతసుఖము ఒక్కటి యున్నదని తెలుపుచూ, దానిని పొందు సాధనములను గూడ చెప్పుచున్నది. ఎట్టి శక్తి స్థితి, పదార్థములనైననూ మానవుడు సాధన ప్రయత్నములచేగదా సంపా దించదగియుండును. సాధన, ప్రయత్నములు చేయని యెడల మానవునకు ఎట్టి సిద్ధియునూ కలుగదు.

ప్రస్తుత కాలములో మానవుడు సమస్త శబ్దశక్తులునూ ఆకసములో నున్నవియని తెలిసికొనియే గదా అట్టి శక్తిని సంపాదించి

అనుభవించుటకుగాను రేడియో యంత్ర సాధనములవల్లగదా దానిని స్వాధీనము చేసుకొని మన యనుభవములను పొందుచున్నాము. ఇట్లే తత్త్వశాస్త్రము మనలకు, నిత్యనిరతిశయ స్వరూపసుఖమొక్కటి యున్నదనియు, అట్టిది దృశ్యరహితమై, ఆకసమునందు సమస్త శబ్దశక్తి యున్నటులనే, ఉన్నదనియు దానిని మానవుని సంస్కృత మనస్సను సాధనము చేతనే పొందబడును గాని అన్యధాగా పొందుటకు వీలులేదని శాస్త్రము తెలుపుచున్నది. కాన జిజ్ఞాసువులు కేవల విషయసుఖములవల్ల అజ్ఞానముచే తృప్తిజెందక శాస్త్రము తెలుపు నిత్యనిరతిశయ సుఖము పొందుటకు శాస్త్ర సాధనములనే ఆశ్రయించి అభ్యసించి పొందవలయును. కాని మరియొకవిధమునకాదు. ఇట్టి శాశ్వతసుఖము యొకటి యున్నదాయని సంశయించుట కెంతమాత్రము అవకాశములేదు. లోకానుభవమునందుగూడ యొక పదార్థము,యున్నదా లేదా యను సంశయము తోచినప్పుడు,అట్టి పదార్థము అధికసంఖ్యాకుల వల్లగాని అల్పసంఖ్యాకులవల్లనూగాని అనుభవింపబడినయెడల అట్టి పదార్థమొకటి యున్నదని యొప్పుకొని నమ్ముచున్నాము. ఇట్లే యీ నిత్యనిరతిశయ సుఖమును గురించి దానియనుభవమును పొందిన మహనీయులు పౌరాణికకాలానుభవముల నుంచినీ కొన్ని శతాబ్దములక్రింద అట్టి అనుభవమును పొందిన శంకరాది పూర్వాచార్యులవల్లనూ, తదుపరి కొన్ని శతాబ్దములకు విద్యారణ్య, మధుసూదన సరస్వత్యాది మహనీయులవల్లనూ, క్రిందటి శతాబ్దము, యీ శతాబ్దమునందుకూడ రామకృష్ణపరమహంస, వివేకానందస్వామి, స్వామీ రామతీర్థ మొదలగు ప్రసిద్ధిగాంచిన వన్ముక్తవ్యక్తులవల్లనూ, యింకనూ గుప్తముగా నుండి సిద్ధిని గాంచిన అనేక మహనీయుల చేతనూ యిట్టి వన్ముక్తి యనుభవమును, నిత్యనిరతిశయానందమును వారివారి యనుభవపూర్వకముగా చెప్పి యుండుటచే వివేకియైనవాడు యిట్టి శాశ్వతసుఖసంపాదనను గురించి సంశయించుటకు లేశమైననూ అవకాశములేదు. కాన వివేకియైన మానవునికి తన ముక్తినిపొందుటకు పురుషప్రయత్నమావశ్యకము—ఇయ్యది శాస్త్రీయముగా నుండవలెను. శాస్త్రీయమనగా యిచట ఉపనిషద్బోధయనియే గ్రహించవలెను.

# ముముక్షువునకు శ్రద్ధోత్సాహాద్యావశ్యకత

లోకమునందు ఎట్టివారికైనను వారుకోరునది సంపాదించుటకు ధైర్య సాహసములు, పట్టుదల, ఉత్సాహము, ఉపాయము ఎట్లవసరమో, ఈ బ్రహ్మ విద్యాభ్యాసకుడైన ముముక్షువునకు తనమోక్షసిద్ధికి నిత్యాభ్యాసముతో పాటు శ్రద్ధ,ఉత్సాహము,తృప్తి, సంతోషము పట్టుదల,సిద్ధాన్తమందు ప్రీతి-నిశ్చయ-దార్ఢ్యములు, తాను సిద్ధిని సంపాదించి -రుదునను నిశ్చయము, శాస్త్రము తెలిపినట్లు ఫలము తనకు తప్పకకలుగునను విశ్వాసము, దానిని సంపాదించు ధైర్యము, శాస్త్రప్రామాణ్యము మొదలగునవి సర్వదా స్వప్రయత్నముతో సంపాదించుచుండుటావశ్యకము. లేనిచో అభ్యాసకునకు కొంతకాలమైనపిదప— నేనిట్టి యభ్యాసమును చేయుచున్నానేగాని ఫలముకలుగునా— నాకిదిసాధ్యమా— ఇట్టి ఫలము ల ంచువరకు నేను జీవించియుందునా— లేనిచో నేను చేయు ప్రయత్నము నిష్ఫలమగునేమోయనిన్నీ, ప్రతిదినమున నిరంతరము ఇట్టి యనుసంధానాదులు, అనగా అనుకున్నదానినే తిరిగి తిరిగి యనుకొనుట ఎంతకాలము చేయగలము-- చేసినను అనుకున్నంతమాత్రమున అట్టి స్థితి కలుగుట ఈ కాలములో సంభవమా--- అని శంకాసంశయములు కలుగుచుండును. కొంతకాలమునకు సంశయగ్రస్తుడై నిరుత్సాహమును పొందిన అభ్యాసపటిమ తగ్గును. మరికొంతకాలమునకు విఘ్నాయత్తచిత్తుడై తనయభ్యాసములకే భంగమును కలిగించుకొనును. గాన ఇట్టి యోగభంగములు కలుగకుండుటకుగాను అభ్యాసపరుడు బలమును సంపాదించుకొనవలసియున్నది. బలములేనిదే, దేనిని పొందుటకును సాధ్యము కాదు గదా ! ఇచట బలమనగా— సాధనానుకూలమగు పైనచెప్పిన గుణసంపదయే. ఇట్టి బలమును సంపాదించుటావశ్యకమని,"నాఽయమాత్మా బలహీనేనలభ్యః" అని శ్రుతి బలము లేనివానిచేత ఆత్మ పొందబడదని చెప్పుచున్నది.

గనుక కార్యదీక్షయందు పైనతెలిపిన శ్రద్ధోత్సాహాదులను సంపాదించుచుండవలయును. పట్టుదల-ఉత్సాహములతో నభ్యసించిన విద్యయెప్పుడును

ఊరకపోదు. ఎంతెంత అభ్యసించిన, అంతంత అభ్యాసపాటవమును బట్టి ఫలము కలుగుచునేయుండును. ఇచట ముముక్షువున కావశ్యకములైన గుణములలో సంతోషమనగా- ఉన్నదానితో తృప్తినొంది, లేనిదానిని కోర కుండుట. దీనినే నిత్యతృప్తియందురు. ఇదియే సంతోషము— ధైర్య మనగా ఫలమును పొందగలనను నిశ్చయము— ఉత్సాహమనగా- ప్రీతి నిశ్చయములతో అనుసంధానాదులను చేయుచుండుట— తితిక్షయనగా- తో ష్ణధర్మములను శరీరక్లేశములను సహించు శక్తి— శ్రద్ధయనగా గురువేదా ప్తవాక్యములయందు అచంచలమైన విశ్వాసము అని గ్రహించవలయును. తక్కిన శబ్దములకర్థము స్పష్టము

ఇట్టి బ్రహ్మవిద్యాభ్యాసమునకు దీనిని ఎంతకాలమనుష్ఠించినను, అను ష్ఠానఫలమూరకపోదు. గాని అభ్యాసమును బట్టి అంతంతఫలము కలుగుచుం డును. మధ్యలో అనివార్య విచ్ఛిత్తి ఏదియైన సంభవించినను అభ్యాసలాభము కలుగక మానదు. ఇట్టివానినే యోగభ్రష్టుడనికూడ నందురు. గీతలలో అర్జునుడు ఇట్టిసంశయముతోడనే ముముక్షువున కభ్యాసకాలమధ్యమున మర ణము సంభవించిన వానిగతియేమి? అని యడుగగా శ్రీకృష్ణభగవానులు—

శ్లో॥ "పార్థనైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
నహికల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥

,, ప్రాప్యపుణ్య కృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః ।
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టో జాయతే ॥

అనగా— అట్టి యోగభ్రష్టునకు ఈ లోకమందుగాని, పరలోక మందుగాని వినాశములేదు. మంచి పనిని జేసినవాడెవ్వడును దుర్గతిని పొందడు సుమా! అటువంటి యోగభ్రష్టుడు పుణ్యలోకములకు బోయి అచట చాలా కాలము నివసించి ఆచారవంతులగు శ్రీమంతులయిళ్లలో బుట్టును, అనుమొద లుగాగల సమాధానమును తెలుపుచు, ఇంకను—

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతిమత్వాభజంతే మాం బుధా భావసమన్వితాః ॥

,, మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ ॥

అనగా అహం నేనే అన్నిటికి కారణము. నేనే అన్నిటికి అధిష్ఠానము అని వివేకులు తెలుసుకొని ప్రీతిభావముతో గూడినవారై నన్ను సేవింతురు. (అనగా అచట అహం అను శబ్దమునకు లాక్షణికార్థమును మాత్రము అనగా తన స్వస్వరూపమైన ప్రత్యగాత్మ స్వరూపమునే గ్రహించుట— సేవించుటయనగా ప్రీతిపూర్వకానుసంధానాదులను చేసుకొనుచుండుట.) ముముక్షువులు సర్వేంద్రియమనః ప్రాణాదులను నాయందే లగ్నముగావించి నన్నుగూర్చియే పరస్పరము ప్రశ్న ప్రతివచనముల జరుపుకొనుచు నిత్యతృప్తులై విహరించుచుందురు. అని చెప్పుచు—

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగంతం యేనమాముపయాంతితే ॥

అట్టివారికి ఏయుపాయముచే నన్ను అనగా ఇచట స్వస్వరూపమును పొందుదురో అట్టిబుద్ధిరూపమగు నుపాయమును ఇచ్చుచున్నాననిగూడ చెప్పియున్నాడు. గాన బ్రహ్మ విద్యాభ్యాసకుడైన ముముక్షువు ఇట్టి అనుసంధానాభ్యాసముతో పాటు శ్రద్ధ, సంతోష, తితిక్షాదిగుణములగూడ వృద్ధినొందించుకొనవలయును.

బ్రహ్మ విద్యాభ్యాసి తాను గురూపదేశపూర్వకముగ చేసిన శ్రవణముచేతను, శ్రుతియుక్త్యనుభవములతో తాను చేసుకొను మననాదులచేతను తన స్వస్వరూపమును బాగుగ ఈ విధమున గుర్తించి అనుసంధానముజేసిన అభ్యాసకునకు సుకరముగను సుబోధకముగను నుండును. ఎట్లనిన— తానుచేసిన

శ్రవణమననాదులచే తనస్వరూపము అద్వితీయ— అఖండ స్వప్రకాశమని గ్రహించినను తానిప్పుడు ప్రారబ్ధకర్మఫలానుభవముచే సశరీరుడై ఉభయాత్మకుడుగనున్నాడు. ఉక్త ఉభయాత్మలలో నొకటిసత్యమైనదియు, మరియొకటి అసత్యమైనదియునై యున్నది. అందురెండవది అంతఃకరణవిశిష్టమై వ్యవహారమునకు మాత్రము యోగ్యమగుచున్నది. ఐనను ఇదియే తన స్వరూపగ్రహణానుభవములను పొందుటకు సాధనము ఇదితప్ప వేరుసాధనములేదు. ఇదియే తనకు సత్యస్వరూపసిద్ధిని కలిగించి, తాను నివర్తించును అని ముముక్షువు గ్రహించవలెను. ఇట్లు గ్రహించి యీ అంతఃకరణవిశిష్టాత్మను తనప్రారబ్ధకర్మ ఫలానుభవమునకున్ను, తనపరమాభీష్టమైన స్వస్వరూపసిద్ధికి మాత్రమే ఉపయోగించుచుండవలయును. గాని దీనినే స్వస్వరూపముగా నెంచకూడదు. ఇదిమిథ్య. ముముక్షువు తన స్వస్వరూపానుసంధానకాలములో ఈ విశిష్టాత్మ కల్పితము, లేనిదే యగుచున్నను, తన మోక్షసిద్ధికి ముఖ్యసాధనమని గ్రహించి తానిప్పుడు చేయుచున్న అద్వితీయానుసంధానస్వరూపమే తన స్వరూపము, సత్యాత్మ యనుజ్ఞానముతో ఇట్లు అనుసంధానము చేయవలసియున్నది.

నేను కేవలప్రత్యగాత్మ స్వరూపుడను— సంవిత్స్వరూపుడను— "అహం సర్వమిదం విశ్వం పరమాత్మాఽహమచ్యుతః" — సర్వమును పరమాత్మను నేనే గాని వేరేమియున్నిలేదు. నాస్వస్వరూప మద్వితీయము— అఖండము— భేదరహితము— నేను పంచభూతాత్మక దృశ్యమునకు అధిష్ఠానము. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" అను శ్రుతిపైయర్థమునే బోధించుచున్నది. ఈ సర్వదృశ్యము నాయందే 'రజ్జుసర్పవత్" భ్రాంతికల్పితముగానున్నదిగాని, వాస్తవమున ఈ దృశ్యముతో నాకెట్టి సంబంధమునులేదు—— ఈ దృశ్యవికారములు చిత్రములు కేవలవ్యవహార సాధనములు మాత్రమే గాని, ఇవి నన్నెంతమాత్రము అంటవు— నేను నిర్మలాకాశములాగున సర్వవ్యాపకమై అసంగమైనవాడను—నేను పరిపూర్ణుడను. ఈ సర్వదృశ్యమున్నా నన్నువిడచి ఇంచుకయైనను లేదు. నాయందే అధ్యస్తము. నేను సూర్యుని

లాగున ప్రకాశరూపుడను. కాని నాది స్వప్రకాశము. ఇచట ప్రకాశమనగా జ్ఞానము. నేను స్ఫటికమహాశిలలాగున నిరచలుడను— అచలుడను— ఇట్టి నాయందే యీ సర్వదృశ్య చలన శబ్దాదులు వివర్తముగానున్నవి. ఏదియెట్లున్నను నాస్వరూపము సదా నిత్యమై ఒక్కటిగానేయుండును. నేను సర్ప భ్రాంతికి రజ్జువు పరిపూర్ణాధిష్ఠానమైనట్లు అనగా రజ్జువును విడచి సర్పమించుకయైనను కనబడనటుల ఈ సర్వదృశ్యమునకు పరిపూర్ణాధిష్ఠానము నేనేయైయున్నాను. నేను పరిపూర్ణుడను. నన్నువిడచి యీదృశ్యమించుకయైనను లేదు. గాన నాస్వరూపమెట్టిదనిన:- సర్వాధిష్ఠాన—స్వప్రకాశ—నిత్య—నిశ్చల—నిరతిశయ—నిర్వికార—అఖండ—దృశ్యరహిత — పరిపూర్ణ—శుద్ధ చైతన్య స్వరూపుడను—నేను కేవలచిత్స్వరూపుడను—అని అర్థజ్ఞానసహితముగ విసుగు చెందక సదా ఫలావగతి పర్యంతము అనుసంధానాభ్యాసములను చేయు ధీరునకు ముక్తి కరతలామలకము. కానియిది సర్వులకును సులభసాధ్యము కాదు. అసాధ్యమునూకాదు. మరేమన—సముచిత ప్రయత్నసాధ్యము. ఇట్టిముక్తి ఒకానొకధీరుని చేతనే పొందబడుచున్నది. అని" కశ్చిద్ధీరః ప్రత్యగాత్మనమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్" ఇట్లు శ్రుతి తెలుపుచున్నది.గాన ముముక్షువు సర్వవిధముల శ్రద్ధోత్సాహాది గుణసంపాదన మొనర్చుచు అనుసంధానాదులను ఫలపర్యంతము చేయుచుండవలెను. కాని స్వప్రయత్నమునందు నిరుత్సాహమును పొందకూడదు. ఇట్లాచరించు మహనీయులకు ఫలము తప్పకకలుగుననిః-

శ్లో॥ అనుభూతే రభావేపి బ్రహ్మాస్మీత్యేవ చిన్త్యతామ్ ।
అప్య సత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కింపునః ॥

అనగా బ్రహ్మానుభవము లేకపోయినను నేనే బ్రహ్మను" అని ధ్యానమును చేయుచుండవలయును. ధ్యానమువలన లేనిదినైతము లభించును. స్వస్వరూపమగు బ్రహ్మము లభించునని వేరుగచెప్పవలయునా? లభించియేరును. అనియున్న,

శ్లో॥ విచారయన్నామరణం నైవాతనం లభేతచేత్ ।
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయేసతి ॥

అనగా యావజ్జీవము విచారించినను బ్రహ్మ సాక్షాత్కారము కలుగకున్న నిరాశజెందకూడదు. ప్రతిబంధము తొలగగనే జన్మాంతరమునందు బ్రహ్మ సాక్షాత్కారము శాస్త్రప్రమాణముచే కలుగును. అని శ్రీ విద్యారణ్యులు తెలుపుచున్నారు. మరియు,

శ్లో॥ బహువారమధీతేపి యదానాయాతి చేత్పునః ।
దినాన్తరేఽనధీత్యైవ పూర్వాధీతంస్మరేత్పుమాన్ ॥

అధ్యయనము చేయువారు అనేకమారులు చదివినను ఆ గ్రంథము ముఖస్థము కాదేని ఆదినమున స్వస్థతగాబరుండి మరుదినమున లేవగనే స్మరించినంతమాత్రమున అదితప్పక ముఖస్థమగును, అనియు పంచదశీకారులు ప్రతిపాదించియున్నారు. కావున ముముక్షువు ఎంతమాత్రమును నిరుత్సాహము నొందక, నిత్య నూతనాధికోత్సాహముతో తప్పకఫలముకలుగునను దృఢ విశ్వాసముతో బ్రహ్మానుసంధాన ప్రయత్నపరుడగుట సర్వవిధముల ఆవశ్యకము, శ్రేయోదాయకము, మోక్షసాధనము.

---

## ముముక్షువునకు
## వైరాగ్య బోధోపరతుల యావశ్యకత

ముముక్షువైన అభ్యాసకునికి వైరాగ్యము, బోధ, ఉపరతి, యీ మూడును నొకటితోనొకటిచేరి తత్వబోధకు తోడ్పడుచునుండును. గాన యీ మూడును ముముక్షువునకు యావశ్యకములు, అయినను ఒక్కొక్కనియందు

ప్రారబ్ధకర ఫలానుసారమున యిందు నొకటికాని రెండుగాని లేకపోవచ్చును. కాని బోధ, యను తత్వజ్ఞానము మాత్రము యీ మూడింటియందును ప్రధానమగుచున్నది. దీనినే

శ్లో॥ తత్త్వబోధః ప్రధానం సా త్సాక్షాన్మోక్ష ప్రత్వతః ।
బోధోపకారిణా వేతౌవైరాగ్యోపరమావుభౌ ॥

అని తక్కిన రెండును యీ తత్త్వబోధకు సహాయకారులగును. అయినను ఒకానొకనియందు నేదోయొక పాపప్రారబ్ధ వశంబున వైరాగ్యముగాని, ఉపరతి గాని లేక రెండునుగాని లేకపోవచ్చును. జనాంతరపుణ్యముచేత ఒకానొక మహాపురుషునియందు వైరాగ్యబోధోపరతులు మూడును యుండవచ్చును. కాని తత్త్వబోధ మోక్షమును కలుగజేయును గనుక ముఖ్యము. ఏవి యున్నను నేది లేకపోయినను తత్త్వజ్ఞానము లేనిది మోక్షము సిద్ధింపదని

శ్లో॥ వైరాగ్యోపర పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే ।
యస్యతస్యనమోక్షోఽస్తి పుణ్యలోక స్తపోబలాత్ ॥

అనగా వైరాగ్యంబును, ఉపరతియు పూర్ణముగానుండి తత్త్వజ్ఞానము లేకపోయిన యెడల మోక్షము కలుగదు. కాని వైరాగ్యోపరతులనెడు తపోబలము వలన పుణ్యలోకావాప్తి కలుగుచున్నది. ఎప్పటికిని మంచిపని వ్యర్థము కాదు. అయినను వైరాగ్యోపరతులు లేక తత్త్వజ్ఞానము మాత్రముండిన మోక్షసాధనమగునని

శ్లో॥ పూర్ణేబోధే తదనౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదాతదా ।
మోక్షో వినిశ్చితః కింతు దృష్ట దుఃఖం న నశ్యతి ।

అనగా తత్త్వజ్ఞానము పూర్ణముగానుండి వైరాగ్యోపరతులు లేనియెడల మోక్షము తప్పకకలుగును. కాని -వను క్తిసుఖము కలుగనేరదు. ప్రారబ్ధము

వలన గలుగు దుఃఖము వదశయందు నశింపదు. వైరాగ్యమునకవధి సత్య లోకాధిపత్యము లంచునవినను నపేక్షకపోవుట. జ్ఞానమునకవధి దేహము నేననియెడి దృఢజ్ఞానము అవివేకదశయందెట్లుండునో యట్లు ఆత్మస్వరూపము నేననెడి దృఢ నిశ్చయము కలిగియుండుట. ఉపరతి కవధి గాఢముగా నిదిరించునపుడు ప్రాపంచిక సర్వవ్యవహారములను మరచినట్లు నిఖిల వ్యవహారములందు జోక్యములేక యుండుట. తత్త్వజ్ఞానులలోగూడ కొందరు రాగద్వేషాది తారతమ్యములు గలవారుగా యుందురు. ఏలనన ప్రారబ్ధకర ఫలము లనేకవిధులుగా నుండుటచేత యాయాజ్ఞానులు ఆయావిధముల వారి వారి ప్రబల ప్రారబ్ధకర ఫలవశమున వర్తించినను వారి జ్ఞానమునందెంత మాత్రము భేదముండదనియు, అట్టి అఖండపరిపూర్ణాత్మబోధ ననుసరించి ముక్తియందు తారతమ్యము లేదనియు, నిదియే వేదాంత సిద్ధాంతమనియు, విద్యారణ్యముని యిట్లు తెల్పుచున్నారు

శ్లో॥ కృష్ణోభోగీ శుకస్త్యాగీ రాజానౌ జనక రాఘవౌ ।
వశిష్ఠఃకర్మ కర్తాచ కర్కటీ పిశితాశనీ ॥ వేశ్యారతో
వామదేవః పింగ వేశ్యకామినీ । అష్టైతే జ్ఞానిన స్సమాః ॥

అను పై వచనము ఈ అర్థమునే తెల్పుచున్నది. కాన ముముక్షువైన అభ్యాసకుడు, యీ తత్త్వజ్ఞానము, యింత ప్రధానమై తన మోక్షప్రాప్తికి సాక్షాత్సాధన మగుచున్నది. గాన వైరాగ్యోపరతులు ప్రారబ్ధబలవశమున యించుక లోపించియున్నను నిరుత్సాహము చెందక వాటిని పెంపొందించు యత్నముతో యీ తత్త్వజ్ఞానమును గురుముఖతః శ్రవణ, మనన నిదిధ్యాసనములను పురుష ప్రయత్నముతో సర్వదా అభ్యసించుచు తన సత్యస్వరూపమైన ఆత్మానుసంధానమును మరువక సర్వదా ప్రీతి నిశ్చయములతో చేయుచుండవలయును. ఇదియే మోక్షమార్గమునకు పరమసాధనమగును.

---

# ముముక్షువునకు చిత్తనాశ ప్రయత్నము- వృత్త్యాలంబన ఆవశ్యకత

మోక్షేచ్ఛకలిగి సాధనచేయు జీవుడు ముముక్షువు అనబడును. ఇట్టి ముముక్షువునకుతన సత్యస్వరూపోపలబ్ధిపర్యంతము సాధనము లావశ్యకములు. ఇట్టి సాధనములతో బ్రహ్మ విద్యానుసంధానాదులు ముఖ్యమగుచున్నవి. ఇట్టి ముఖ్య సాధనములను అభ్యసించుటకు సాంఖ్యయోగములు రెండును ఆవశ్యకములు. సాంఖ్యమనగా సత్యజ్ఞానము. ఈ సత్యజ్ఞానము స్వశరీర సర్వదృశ మిథ్యాత్వమును గ్రహించి నిశ్చయించుకొని యిట్టి మిథ్యాత్వమునకు సత్యాధిష్ఠాన సత్యస్వరూపము తనే అని గ్రహించి ప్రీతి నిశ్చయములను సంపాదించి తదనుభవములను పొందవలెను. దీనికి అంతకి ఆవశ్యకమైన విచారణ ఇంతవరకు శ్రుతి యుక్త నుభవములతో నిరూపించి నిశ్చయించి యున్నాము.

దీనివలన జిజ్ఞాసువులైన ముముక్షువులకు పరోక్షజ్ఞాన నిశ్చయము కలుగును. ఇట్లు కలిగినను తత్ఫల ప్రాప్తికి అనగా స్వానుభవమును పొందుటకు యవలసిన అభ్యాస సాధనములన్నియు ముందేయున్నవి. ఏలయన ఈ ముముక్షువు శ్రుతి ప్రామాణ్యమును శిరసావహించినవాడు. ఐనను 'తత్త్వమసి' 'అహంబ్రహ్మాస్మి' అనుమహావాక్యములచే పరోక్షముగ గుర్వీశ్వర ప్రసాదముల సహాయముతో తెలిసికొన్న సత్య పదార్థము సర్వజగదధిష్ఠానము తాను అనగా నేను అని స్వానుభవమును పొందుటచే గాని తాను సత్యస్వరూపుడు కాడు. ఇదియేగదా ముముక్షువుయొక్క ఆశయము. ఇట్టి పరమావధిని పొందుటకు పూర్వాచార్యులబోధను శిరసావహించి ఎంత విచారణచేసి వివేక నిశ్చయములను సంపాదించిన ఎంత మహనీయులకైనను స్వానుభవమును పొందుట అనగా అపరోక్షముగా సత్యజ్ఞానమును పొందుట చాలా క్లేశ సాధ్యము. ఇట్టి క్లేశమునకు ముఖ్య హేతువు చిత్తవిక్షేపము. ఇట్టి చిత్త విక్షేపములు చిత్తనిగ్రహమువల్లగాని శాంతించవు గాన ముముక్షువునకు చిత్త నిరోధాభ్యాసము చాలా యావశ్యకము. ఈ చిత్త నిరోధమునే యోగమని

"యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని పాతంజల సూత్రము తెలుపుచున్నది. ఈ చిత్త నిరోధాభ్యాసము చాలా క్లేశకరము. ఐనను "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" అను యోగసూత్రము అభ్యాసవైరాగ్యములచే చిత్త నిరోధము అనగా చిత్తనాశమును పొందవచ్చునని తెలుపుచున్నది.

నిత్యానిత్యవివేక, తత్త్వవిచారణలచే జగన్మిథ్యాత్వజ్ఞానమును సంపాదించిన యడల యీ చిత్తవిక్షేపము కొంతవరకు ఉపశమించును. ఐనను తన సత్యస్వరూపము గోచరించినగాని చిత్తవిక్షేప, ఆవరణ రాహిత్యములు కలుగవు. ఒకవేళ చిత్తవిక్షేప రాహిత్యము కలిగినను ముముక్షువు స్వశరీరాభిమానమును పూర్తిగా నిర్మూలించుటకు ఇంకను తన సత్యస్వరూప గ్రహణ దార్ఢ్యమును సంపాదించవలసియున్నది. దీనికిగాను ముముక్షువైనవాడు తన వృత్తిని నిరాలంబనముగా యుంచక సదా స్వస్వరూపానుసంధానాలంబనముతో యుంచవలయును. ఇట్లు చేయక ఈవృత్తిని నిర్విషయకముగా ఉంచిన యడల అది దృశ్యవిషయ ఆలంబనగలదికాగలదు. ఇదియే అజ్ఞానము. "అభావ ప్రత యాలంబనావృత్తిః నిద్రా" అని పతంజలి తెలుపుచున్నాడు. ఇట్టి స్థితి కేవలము తమః ప్రధానమైనది. ఇదియే అజ్ఞానము. ఇట్టి నిద్రాతమోవృత్తులను నిర్మూలించుటకు ముముక్షువునకు సద్వస్తుగ్రహణము అనగా స్వస్వరూపానుసంధానము సతతమావశ్యకము. ఇదియే అజ్ఞాననివృత్తికి సాక్షాత్సాధనము. గనుక ముముక్షువునకు చిత్త విక్షేపనివృత్తి, చిత్తాలంబన సాధనములు అత్యావశ్యకములు. ఈ చిత్తాలంబనకు వృత్తి వ్యాప్తి యావశ్యకమైయున్నది. కనుకనే "బ్రహ్మణ్యజ్ఞాననాశాయవృత్తి వ్యాప్తిరపేక్షతే" అని శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. గాన ముముక్షువునకు ఈ సర్వదృశ్యమిథ్యాత్వమును గ్రహించుటకు తత్త్వజ్ఞానయుక్త మనోనాశములావశ్యకములు. సద్వస్తుగ్రహణమునకు స్వస్వరూపానుభవము సర్వదా వృత్త్యాలంబనము కావలసియున్నది.ఈ స్వస్వరూపాలంబనమే భక్తియని "స్వస్వరూపానుసంధానంభక్తిరిత భిధీయతే" అని శంకర భగవత్పాదులు చెప్పుచున్నారు. ఈ అద్వైత భక్తియే సాక్షాన్మోక్షసాధనము. ద్వైతభక్తి పరంపరగా సాధ

సము. గనుక ముముక్షువు ఈ అద్వైతభక్తి ననుసరించి సర్వదా తన స్వరూపానుసంధానమును వృత్త్యాలంబనతో చేయుచుండవలయును. ముముక్షువున కాలంబన ప్రత్యయము తన సత్యస్వరూపము. గాన నేను అహం అను ప్రత్యయములో తన వాస్తవ స్వరూపమైన చిదంశమును మాత్రము పూర్ణముగా తత్త్వంపదముల భాగత్యాగ లక్షణచే వివేచన చేసి నిశ్చయించుకొనవలయును. తాను ప్రారబ్ధానుసారముగనే పనులు చేయుచున్నను తన పూర్ణ వల చిత్స్వరూపమును మరువకూడదు. అట్టి తన సత్యస్వరూపమును సదా గుర్తించుచు ఈ కరచరణేంద్రియాది స్థూలశరీరమును, ఈ మనోబుద్ధి చిత్తాహంకార ప్రాణ సంఘాతమైన సూక్ష్మ శరీరమును తానుగానని నిశ్చయించుకొనవలయును. ఇట్టి నిశ్చయమును పొందినను తాను ఇంతకుముందు అనాద్యవిద్యాభ్రాంతి కల్పితుడై అజ్ఞానముచే చేసిన ప్రారబ్ధకర ఫలముల అనుభవమునకు ఇట్టి కల్పితదేహము తనకు కారణమై యీ సంసారమును కల్పించుచున్నది. గాని వాస్తవములో తనకెట్టి సంబంధము ఈ దేహాదులతో లేదని తెలిసికొనవలయును. ఈ ప్రారబ్ధము విధించిన శిక్షవంటిదిగాన శిక్షాకాలాంతమువరకు ముముక్షువు అతిజాగరూకతతో అ మానసక్తతారాహిత ముగ వయాత్రను గడపుచు బ్రహ్మానుసంధానపరుడై తన సత్యస్వరూపమును వృత్తి వ్యాప్తితో సదాగ్రహించుచుండవలయును. ఈ వయాత్రను ముముక్షువు నాటకమందు నటుని ప్రదర్శనములాగునే అనుభవించుచుండవలయును. అనగా సుఖదుఃఖములను నాటకరంగమందు ప్రేక్షకుడు పొందుచున్నట్లు అనుభవించవలయును. ప్రారబ్ధానుసారముగ వచ్చిన యీ వయాత్రానాటకము పూర్తియైన తదుపరి ప్రతిబంధనివృత్త్యనంతరము నాటకములతో పనియుండదు. ఉన్నను అట్టివి వాస్తవముగా బంధకములు గానేరవు. కాని ప్రారబ్ధ ప్రతిబంధము తీరిన వెంటనే తన నిత్యనిరతిశయ శాశ్వతసుఖ స్వరూపమును పొందు ఇట్టి వారిని గురించియే.

శ్లో॥ తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥

అనగా సర్వదా స్వస్వరూపానుసంధానమును చేసికొనువారు జ్ఞానముచే పుణ్యపాపాదులను క్షీణింపచేసినవారై పునరావృత్తి రహితమైన శాశ్వత పదమును పొందుదురు. అని శ్రీ కృష్ణ భగవానుడు తెలుపుచున్నాడు.

ఇట్టి పునరావృత్తి రాహిత్యమును కోరువాడు ముముక్షువు గనుక పై నిరూపణలను బాగుగా గ్రహించి స్వానుభవములో తెచ్చుకొనుట ఆవశ్యకము. దీనికిగాను ముముక్షువు సంకల్పరహితుడుగానుండవలయును. ఇట్లుండుటయే చిత్తనాశసాధనమై మోక్షప్రాప్తి సాధనమగును.

శ్లో॥ సంకల్పిత్వంహిబంధస కారణం తత్పరిత్యజ ।
మోక్షస్తు నిస్సంకల్పత్వం తదభ్యాసంధియాకురు ॥

అని వాసిష్ఠవచనము తెలుపుచున్నది.

ఇట్లు అభ్యసించుచు సదా తను అను నేను సర్వాధిష్ఠాన స్వప్రకాశ నిత్యనిరతిశయ పరిపూర్ణ సంవిత్స్వరూపుడనని తన అఖండస్వరూపమును అనుసంధానమును చేసికొనవలయును. చిత్తము నశించుటకు యోగము, జ్ఞానము అని రెండు మార్గములు కలవు. వీటిని ముముక్షువులు వారివారి వాసనానుకూలతనుబట్టి గ్రహించి అభ్యసించుచుండవలయును. దీనినే—

శ్లో॥ అసాధ్యఃకస్యచిద్యోగః, కస్యచిద్ జ్ఞాననిశ్చయః ।
ప్రకారౌద్వౌ తతోదేవో జగాద పరమేశ్వరః ॥

అని ఒకరికి జ్ఞానము తేలికగాను, మరియొకరికి యోగము తేలికగాను ఉండును. వారివారి వాసనా సామర్థ్యమును బట్టి గ్రహించుటకు పరమేశ్వరుడు రెండింటిని ఉపదేశించెనని వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు.

## వృత్తి దాని పరమ ప్రయోజనము

వృత్తి యనగా విషయములను గ్రహించు మనః పరిణామము. మనస్సుయే విషయాకారాకారత నొందుట వృత్తియనబడును. ఈ వృత్తి

యనునది అంతఃకరణ ధర్మము. ఇది జడము. ఐనను వునకు భావాభావములు రెంటికిని ఈ వృత్తియే ఆధారమగుచున్నది. జీవుడు భావవృత్తిచే వస్తుదర్శనమును అభావవృత్తిచే వస్తులోపమును పొందును. ఈ వృత్తియే వునికి ఆత సాక్షాత్కారమునకు సాధనమగుచున్నది. దీనినే "అజ్ఞాననాశాయ వృత్తి వ్యాప్తి రపేక్షితే" యని పంచదశికారులు తెలుపుచున్నారు. వునికి వ్యవహారమంతయు ఈ వృత్తి మూలకముగనే జరుగుచున్నది. ఈ వృత్తి ధర్మములే వునకు జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడు యవస్థలను కల్పించుచున్నవి.

జాగ్రత యనగా ఇంద్రియ సంకర్షణముతో వృత్తిద్వారా విషయములను గ్రహించుట. స్వప్నమనగా పదార్థములతో ఇంద్రియ సంకర్షణములేక కేవల వృత్తిచే విషయములనుగ్రహించుట. సుషుప్తియనగా వృత్తి, అజ్ఞానమునందులయమై తాత్కాలికముగ వునికి అఖండాకారమునయుండుట. ఈ స్థితియే సర్వ వులకు అజ్ఞానదశలో తాత్కాలికసుఖము నిచ్చుచున్నది. ఇట్టి మూడవస్థలు జీవునికి ఈ వృత్తి నిమిత్తముననే కలుగుచున్నవి. ఈ స్థితులన్నియు వుని ప్రయత్నము లేకుండగనే ఆయా వుల ప్రారబ్ధకర్మములనుబట్టి నైసర్గికముగా సంభవించుచున్నవి. ఇదియే వుని సంసారస్థితి కాన యిట్టి సంసారదుఃఖస్థితినుంచి తప్పించుకొనదలచిన వుడు తన శాశ్వతసుఖమునకుగాను యిట్టి తన వృత్తినే శాస్త్రీయ ప్రయత్నముతో వివేకముగ నుపయోగించుకొనిన యెడల ముముక్షువునకు యీ వృత్తియే మోక్షసాధనమగును. ఎట్లనిన మానవునకు యీ అజ్ఞానవృత్తితో అప్రయత్నముగనే జాగ్రత్స్వప్నసుషుప్తులు కలుగుచున్నట్లు, ముముక్షువు జ్ఞానవృత్తిచే తన స్వప్రయత్నముతోడ జాగ్రజ్జాగ్రత, జాగ్రత్స్వప్నము. జాగ్రత్సుషుప్తులను అభ్యాసముతో సంపాదించిన యెడల అవియే మోక్షసాధనములగును. ఎట్లని విచారింతము—

ఈ మూడు స్థితులయందునూ జాగ్రతయను యొకే శబ్దము వాడబడియున్నది. ఇంద్రియవృత్తిచే విషయప్రకాశము జాగ్రత యనబడును. వునకు అజ్ఞానముచే వ్యవహారకాలమందు యీ మూడు స్థితులునూ కలుగుచున్నవి. కాన వాటిని జ్ఞాన పూర్వకముగ గ్రహించిన యెడల ముముక్షువు యథార్థమును

తెలిసికొనగలడు. కాన జీవుడు యిట్టి తన మూడు స్థితులనున్నూ శాస్త్రీయ వృత్తి జ్ఞానముతో గ్రహించిన యెడల అట్టి మూడు అవస్థలూ లేక స్థితులున్నూ యొక్కటియేనని తెలియగలడు. కాన జీవుడు ఈ తన మూడు అవస్థల యథార్థమును తన వృత్తి జ్ఞానము తోడనే తెలిసికొనవలయునుగాని అన్యమార్గములేదు. సుఖము ప్రతిజీవుని చేతను కోరబడుచు, ప్రతి వుని చేతను ఒక్కవిధముననే వారివారి సుషుప్తియం దనుభవింపబడుచున్నది. ఈ సుషుప్తియందు సర్వజీవులకును ఒక్క విధముననే సుఖము తాత్కాలికముగనైనను కలుగుచున్నది. కనుకనే సర్వ వులు తమ పనులనైనను విడచి యీ సుషుప్తిసుఖమును కోరుచు యనుభవించుచున్నారు. కాని యిట్టి సుఖానుభవము తాత్కాలికమే యగుచున్నది కాని వునికి శాశ్వతముగా నిలుచుట లేదు. ఏలనన వునికి నిత్యసుఖమన్నను, మోక్షమన్నను యొక్కటియేనని లోగడనే నిశ్చయించియుంటిమి. కాని సుషుప్తియందు కలుగుచున్న సుఖము, వృత్తి అజ్ఞానమునందులయమై, అజ్ఞానమువల్లనే సుఖాభాసమున కలుగుచున్నదికాన అట్లు కలుగుచున్న సుఖము తాత్కాలికమై తమోగుణ ప్రధానమగుచున్నది. కాన జ్ఞానపూర్వకముగ యీ సుఖము వునికి సుషుప్తియందు కలుగుటలేదు. అందువలననే తాత్కాలికమై అనిత్యమగుచున్నది. కనుక యీ సుఖమును సుఖస్వరూపమున నిత్యముగా పొందుటకు యీ సుషుప్తి స్థితిని జీవుడు, వృత్తిజ్ఞానపూర్వకముగా నభ్యసించిన యెడల కాలపరిపాకమున ఒకరూపమైన వృత్తి నశించి జీవుడు తాను జ్ఞాన స్వరూపుడుగా మిగులును. ఇదియే సుఖస్వరూపము, నిర్విశేషము, శాశ్వతసుఖము. కాన వుడు యిట్టి స్థితిని సంపాదించుటకు అనగా తన పరమార్థ స్వరూపమును పొందుటకు జాగ్రతతోనే అనగా శాస్త్రీయ వృత్తిజ్ఞానముతోడనే జాగ్రజ్జాగ్రత, జాగ్రత్స్వప్నము, జాగత్సుషుప్తులను క్రమముగ నభ్యసించుచుండవలయును.

జాగ్రజ్జాగ్రత యనగా వుడుతన వృత్తి జ్ఞానముతోడనే యీ స్వశరీర సర్వదృశ్య మునూ మిథ యని నిశ్చయముగా గ్రహించుట.

జాగ్రత్స్వప్న మనగా తన వృత్తిజ్ఞానము తోడనే జ్ఞానపూర్వకముగ యీ స్వశరీర జగత్తునంతయు దృశ్యసక్తతా మాన రహితుడై స్వప్నపదార్థ ముల లాగున చూచుచూ అనుభవించుట.

జాగ్రత్సుషుప్తియనగా తన జాగ్రద్దశయందే స్వశరీర సర్వదృశ్య మునూ తన సుషుప్తిలో లాగుననే చూడక, వినక, తెలిసికొనక, అఖండాను భవము ననుసంధించుచూ అనుభవించుట.

ఈ ముముక్షువు యిట్టి స్థితిని శాస్త్రీయప్రక్రియలచే జ్ఞానపూర్వకముగ నభ్యసించువాడు గనుక కాలక్రమమున తాను, తనకు సహాయముగా ౦సు కొనిన వృత్తి నశించి తాను మాత్రము జ్ఞానరూపుడై మిగులును. జీవుని బంధమోక్షములు రెంటికిని యీ వృత్తియే కారణమగుచున్నది. దీనినే :—

శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా, బ్రహ్మాకారతయా పునః ।
వృత్తి విస రణం సమ్యక్ సమాధిజ్ఞాన సంజ్ఞకం ॥

నిర్వికారవృత్తిచేత అనగా విషయానుసంధానములేని వృత్తిచే మరల బ్రహ్మాకారత్వముగా అనగాద్వైతానుసంధాన శూన్యముగ నుండుటయే జ్ఞానము సమాధి యగుచున్నదని శ్రీ శంకరులు తెలుపుచున్నారు. కాన ముముక్షువు తన వృత్తిని దృశ్యపరిచ్ఛిన్నాకారములనుంచి మరల్చి సదా అపరిచ్ఛిన్నమైన తన పరిపూర్ణ స్వరూపమునే ప్రత్యగ న్నముగ అఖండాకారవృత్తితో గ్రహించుచుండవలెను. ఇట్లాచరించు చిత్త శుద్ధిగలవారలకు బ్రహ్మాకారవృత్తి జ్ఞానముకలుగునని :—

శ్లో॥ అనేనైవ ప్రకారేణ వృత్తిర్బ్రహ్మాత్మికాభవేత్ ।
ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరం ॥

అని గూడ శ్రీ శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. కనుక వుడు యిప్పుడు తన వృత్తితో అప్రయత్నముగ సర్వమును ఖండ, ఖండాకార వృత్తిగ తెలిసికొనుచున్నాడు. కాని యీ సర్వమునే తన వృత్తి ప్రయత్న

ముతో అఖండాకారవృత్తిని గ్రహించిన యెడల అప్పుడు యుండునది తన యొక్క అఖండ పరిపూర్ణ స్వరూపమొక్కటియేకాని మరియేమియును యుండదు. దీనినే శ్రుతి "ఏకమేవాద్వి యం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" అని అన్వయవ్యతిరేకములతో స్పష్టముగా జీవునకు తెలుపుచున్నది.

---

## ముముక్షు వ్యవహారాచరణావశ్యకత

ముముక్షువు శాస్త్రశ్రవణాదులచే ఈ స్వశరీరసహిత సర్వదృశ్యము సర్వాధిష్ఠానమైన బ్రహ్మయందు అధ్యస్తమని తెలుసుకొని, దానిని విడచి అధిష్ఠానమైన బ్రహ్మయే తాను అని సర్వదా గ్రహించవలసియున్నది. ఇట్లు గ్రహించుటకు ఈ క్రింది వాసిష్ఠ శ్లోక నిరూపణ సహకరించును.

శ్లో॥ సంవేద్య సంపరిత్యాగా త్ప్రాణ స్పందనవాసనే ।
సమూలం నశ్యతః ప్రం మూలచ్ఛేదాదివద్రుమః ॥

మొదలు ఛేదింపగా వృక్షము నశించునటుల దృశ్యమును విడువగా వాసన, ప్రాణచలనము ఈ రెండును సమూలముగా నశించుచున్నవి.

శ్లో॥ సంవిదం విద్ధి సంవేద్య బీజం ధీరతయావినా ।
నసంభవతి సంవేద్యం తైలహీన స్తిలోయథా ॥

నువ్వు గింజలేక నూనె సంభవింపనియట్లు దృక్కులేక దృశ్యము సంభవించదు. కావున దృశ్యమునకు దృక్కు వమని యెరుగుము.

శ్లో॥ నబహిర్నాన్తరే కించిత్సంవేద్యంవిద్యతేపృథక్ ।
సంవిత్ స్ఫురతి సంకల్ప్య సంవేద్యంపశ్యతిస్వతః ॥

లోనగాని, బయటగాని దృశ్యము కొంచెమైననులేదు. దృక్కే దృశ్యమును కల్పించి దానిని ప్రకాశింపజేయును. ఈ యర్థమును దృష్టాంతముతో

నుపపాదించుచున్నాడు—

శ్లో॥ స్వప్నేయథాత మరణం తథాదేశాన్తర స్థితిః ।
స్వచమత్కారయోగేన సంవేద్యంసంవిద స్తథా ॥

స్వప్నమునందు దృక్కుయొక్క చమత్కారముచే తన మరణమును, దేశాంతర గమనమును ఎటుల తోచుచున్నదో అటులనే జాగ్రత్తునందు దృశ్యము సంభవించుచున్నది.

శ్లో॥ పూర్వదృష్టమదృష్టంవా యదస్యాః ప్రతిభాసతే ।
సంవిద స్తత్ప్రయత్నేన మార్జనీయం విజానతా ॥

మున్నుచూడబడినదిగాని, చూడబడనిదిగాని యేవస్తువు దృక్కుయొక్క సాన్నిధ్యమువలన తోచుచున్నదో ఆ వస్తువును పండితుడగువాడు ప్రయత్నముచే తొలగించుచుండవలయును.

శ్లో॥ తదమార్జన మాత్రంహిమహాసంసారతాంగతమ్ ।
తత్రమార్జన మాత్రంతు మోక్ష ఇత్య ధీయతే ॥

ఆ దృశ్యమును మరువకుండుట మాత్రమే మహాసంసారమనియు, ఆ దృశ్యమును మరచుట మాత్రమే మోక్షమనియు చెప్పబడుచున్నది.

ఈ పైన తెల్పిన విధమున ముముక్షువు గ్రహించినను, దృశ్యమైన అధ్యస్తము- అధిష్ఠానమైన బ్రహ్మముకన్న వేరుగా నుండుటకు వీలులేదు. గాన ఈ సర్వదృశ్యము బ్రహ్మాన్నముగానే యుండవలెను, గాని బ్రహ్మను విడచి న్నముగా యుండుటకు వీలులేదు. ఏలనన నిరధిష్ఠానభ్రాంతి కలుగుటకు వీలులేదని లోగడనే నిశ్చయించితిమి. అధ్యస్తమైన యీ ప్రపంచము సత స్వరూపుడైన బ్రహ్మ యందు (రజ్జుసర్పవత్) అధిష్ఠితమైయున్నది. గనుక కల్పితమైననూ ప్రపంచమునకు గూడ నాశము ఎప్పటికిని లేదు. కాని మిథ్యాత్వమనగా జ్ఞానముతో ఈ ప్రపంచము కల్పితము, వాస్తవముగా లేదని

తెలుసుకొనుట. ఇట్టి తెలుసుకొనిన జ్ఞానులకుగూడ ఈ ప్రపంచము కనబడు చునే యుండును గాని, సత్యముగా తోచదు. శబ్దచలనచిత్ర పటము లాగున తోచుచుండును. ఇట్లు వాస్తవముగా కనబడకుండయుండుటయే మిథ్య—గాని ఇట్లు గ్రహించి అనుభవమును పొందు మహనీయులకైనను ప్రారబ్ధకర్మఫలాను భవము తప్పుటలేదు. దీనిని అనుభవించియే రవలెను. గనుక ముముక్షువైన వాడు ప్రారబ్ధప్రాప్తఫలము ననుభవించుచు తను ఇప్పుడు చేయు కర్మలచే ముందు కర ఫలము కలుగకుండునట్లు చేసుకొనవలయును. లేనిచో కర ఫలము ననుభవించుటకు తిరిగి ఉత్తర జన్మపరంపరలను పొందుచునే యుండవల యును. ఒకవేళ ఎవరైనను నేను కర్మచేయను, అప్పుడు నాకు కర్మఫల మెట్లు కలుగునని అనుకొనవచ్చును. కాని అట్లు కర చేయకుండుటకు సాధ్యము కాదని శ్రీకృష్ణ భగవానులు—

"నహికశ్చిత్క్షణమపి జాతుతిష్ఠత్యకర కృత్"

అని జన్మించినవాడు ఒక్క నిమిషమైనను ఏదోయొక కర్మ చేయక యుండుట సాధ్యము కాదని చెప్పుచున్నారు. ఇంకను "సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి" అని చెప్పుచున్నారు. గాన కర చేయుట యెవరికిన్నీ తప్పుటలేదు. కాని కర్మఫలము పొందకుండ చేయవలయును. జ్ఞానియైనను ప్రారబ్ధానుసారముగ ఇట్లు చేయు కర్మల ఫలములంటకుండ విముక్తుడగుటకు ఉపాయమును గూడ గీతాచార్యుడైన భగవంతుడే చెప్పు చున్నాడు—

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తోహ్యాచరన్కర పరమాప్నోతి పూరుషః ।

అనగా ఎల్లప్పుడును చేయవలసిన కర లను సక్తతారహితముగా చేయుము. ఇట్లు ఫలాపేక్ష కుండ కర్మలను చేయువాడు మోక్షమును పొందును. అని చెప్పి "అనాశ్రితఃకర్మఫలం కార్యంకర కరోతియః । ససన్యా

స్త్రీచ యోగీచ" ఫలాపేక్ష లేక కర్మలను చేయువాడే సన్న్యాసి, యోగి అని కూడా చెప్పుచున్నాడు. గాన ముముక్షువైనవాడు సర్వకర్మలను దేహయాత్రాది క్రియలనుగూడ ఫలాభిసంధిలేనివాడై సక్తతారాహిత్యముగ యాచరించవలయును. ఇట్లు చేసిన కర్మలు తనకు ఉత్తర ప్రతిబంధములు కాజాలవు. గాని ఇట్లు చేయుటకు అంతఃకరణ తాదాత్మ్యము, ప్రత్యక్షదృశ్యానుభవములు ఆటంకములు కలిగించి సక్తతానుబంధములను సదా కలుగజేయుచుండును. ఇందుకుగాను జగన్మిథ్యాత్వదార్ఢ్యము అంతఃకరణోపాధ్యవాస్తవికతా జ్ఞాన దృఢత్వమును సంపాదించుకొనుటకు ముముక్షువు సత్యవస్తు జ్ఞానాభ్యాసముతో పాటు ఈ జగన్మిథ్యాత్వ దార్ఢ్యమునుగూడా వృద్ధిచేసుకొనుచుండిన యడల విషయసక్తతాచిత్త చాంచల్యములు క్రమక్రమముగా తగ్గుచుండును. సాధనకు చాలా సహకరించును. అభ్యాసకునికి ఇచట రెండు స్థితులు కనబడుచున్నవి. స్వశరీరజగత్తుల మిథ్యాత్వమును గ్రహించి అవి తాను కాను అని నిశ్చయించుకొనుట ఒకటి, ప్రారబ్ధాను గుణముగ వచ్చిన సర్వకర్మలను ఫలాపేక్షారహితుడై యాచరించుట రెండవది. ఇది సాధ్యమా, కాదాయని కొంత విచారింతము. లోకములో యాత్రికుడైన బాటసారి (పాంథుడు) ఆయా యాత్రాస్థలములందు సత్రములలో (ధర్మశాలయందు) ఆగి అటు పిమ్మట తను ఉన్నకాలములో తను ఉన్న ప్రదేశమును బాగుచేయుచూ సౌకర్యములను కల్పించుకొని తను ఉన్నశాలయందు సక్తత లేక కాలమును గడపి యాత్రాసంతరము నిర్మమానిగా పోవుచున్నాడుగదా! ఐనను అధర్మశాలయందు తను ఉన్నకాలములో నిర్మమానముగా తనకు కావలసిన సౌకర్యములను మాత్రము చేసుకొనుచున్నాడు గదా! ధర్మశాలయొక్క అనుభవమును పొందుచున్నను, ఆ శాల తనదికాదను జ్ఞానముచే దానియందు అభిమానము కలుగుటలేదు. మనము లోకములో కల్పిత పదార్థములవల్లనైనను. అన్యుల వస్తుసముదాయమువల్లనైనను అనుభవమును పొందుచున్నాము. గాని అచట సక్తతా మానములు జనించుటలేదు—ఎందువల్ల ననగా అట్లు అనుభవించు వస్తువులయందు తనవి కావనిన్నీ, కల్పితమనిన్నీ నిశ్చయ

జ్ఞానముతో అనుభవమును పొందుచున్నాము. గనుక వాటియందు సక్తతా మానములు కలుగుటలేదు—ఇట్లే ఈ స్వశరీరసర్వదృశ్య కల్పితమిథ్యాత్వము లను శ్రుతి యుక్త్యనుభవపూర్వకముగా బాగుగా విచారించి నిశ్చయించు కొన్న యడల ఈ ముముక్షువునకున్నూ యాత్రికుని ధర శాలా నివాసము లాగున సక్తతా మానములు కలుగవు ఇట్లే ముముక్షువునకు దృశ్యమందు నిశ్చయాదృఢతవల్ల సక్తతాభిమానములు ఒకప్పుడు కలిగినను అభ్యాస పాటవములచే కాలక్రమేణ తగ్గుచుండును. ఇందుకుగాను లోగడ మనము విపులముగా జగన్మిథ్యాత్వ, అంతఃకరణ కల్పితత్వములను గురించి చేసిన విమర్శయంతయును జ్ఞప్తినందుంచుకొని ముముక్షువు సదామననాదులను చేయుచుండిన తప్పక కాలక్రమముగా అభ్యాసపాటవములను బట్టి ఈ సర్వ దృశ మిథ్యాత్వజ్ఞానమును వృద్ధిపొందించుట బ్రహ్మవిద్యా ప్రాప్తికి అను కూలించునని వేరుగా చెప్పపనిలేదు. ఇంకను విచారించిన యీ ప్రపంచము గూడ నజ్ఞానవశమున ఒక విధముననున్న బ్రహ్మ వస్తువును మరియొక విధ ముగా భావించుటచే, అనగా – పరిపూర్ణ అపరిచ్ఛిన్న జ్ఞానమునకు బదులుగా పరిచ్ఛిన్న న్న న్న అజ్ఞానోపాధులుగ భావించుటచే జనించినదియే యీ ప్రపంచము. త్రికాలములయందును ఈ ప్రపంచము ఆ బ్రహ్మముకన్న వేరుకాదు. ఐనను ఈ అనాద్యవిద్యచే ఇట్టి దృశ్యభ్రాంతి చూచువారి దోష ముచే కలుగుచున్నదిగాని సహజ వస్తువునకు సంబంధించినదికాదు. ఎట్లన స్థాణువును భ్రాంతిచే దొంగగా భావించినపుడుగాని, తిరిగి దీప సహాయముచే ఇది స్థాణువనీ దొంగ కాదనిన్నీ, భావించినపుడుగాని చూచువాని దృష్టియందే మార్పు కలుగుచున్నది కాని, చూడబడు స్థాణువునందెంత మాత్రము భ్రాంతి వున్నకాలములోగాని, భ్రాంతి నివృత్తియైన కాలములోగాని స్థాణువుయందు ఎట్టి వికారమునూ కలుగుటలేదు. ఇట్లే బ్రహ్మ యందు ఈ ప్రపంచము కూడా చూడబడుచున్నది. స్వప్నములో మనమెన్ని వికారదృశ ములను చూచినను ఆ వికారములు మనకేమియూ యంటనట్లు ఈ ప్రపంచవికారము లెన్ని కలుగు చున్నను (అన్నియు కల్పితములు గనుక) ఆ పరమాత్మను ఇంచుక ఐనను అంటజాలవు. దీనినే—

శ్లో॥ అనాది కా ׀న నిర న్త వాసనా దోషేణదుష్టాపురుషస్యబుద్ధిః ।
నానావిధం విశ్వమిహ ప్రసూతే స్వప్నాదివద్బ్రహ్మణి
కేవలేఽద్వయే ॥

అనగా అంతములేని అనాదియైన వాసనాదోషముతో కూడిన పురుషుని బుద్ధి, స్వప్నాదులవలె శుద్ధ బ్రహ్మయందు నానావిధ ప్రపంచమును కల్పించును, అని శంకర భగవత్పాదులు చెప్పుచున్నారు. గాన ఈ జాగ్రత్స్వప్నములు రెండునూ బుద్ధి కల్పితములే అని ముముక్షువు తెలుసుకొని నిశ్చయమును పొందవలెను. ఇంకనూ శ్రీ రామచంద్రమూర్తికి వసిష్ఠులవారు-ముముక్షువునకు హితమును గురించి :—

శ్లో॥ దిక్కాలా ద వచ్ఛిన్న మదృష్టోభయకోటికం ।
చిన్మాత్రమక్షయంశాంతమేకం బ్రహ్మాసి నేతరత్ ॥

శ్లో॥ ఇతి మత్వాఽహమిత్యంతరు క్తాము క్తవపుర హాన్ ।
ఏకరూపం ప్రశాంతాత్మామౌనీస్వాత సుఖోభవ ॥

అనగా దేశ కాలవస్తు పరిచ్ఛేద రహితంబును, ఆద్యంతరహితంబును, చిన్మాత్రంబుననగు *బ్రహ్మంబే నని, నిశ్చయించి* అ మానములేనందున, *విడువబ నదియూ*, ప్రారబ్ధవశంబున *విడువబడనిదియూ* నగు శ రము కలవాడవును, శాంత చిత్తుండవును, నాతా రాముండవునగుము, అని బోధించుచున్నారు—గాన ముముక్షు వ్యవహారావశ్యకత ఇదియే.

---

# ముముక్షువుకు అనుసంధానావశ్యకతా నిరూపణ

ఇట్లు తెలుసుకొనుటకు వివేచనజేసి అహంపదార్థములోని స్వశరీరాదులనున్ను, ఇదం పదార్థములోని ప్రపంచదృశ్యమంతటినిన్నీ త్యజించవలసి

యున్నది. త్యజించుటయనగా—ఈ స్వశరీరాది సర్వదృశ్యమునున్ను శ్రుతి యుక్త్యనుభవములతో అన్వయ వ్యతిరేకసహితముగ వివేచనజేసి త్రికాలములయందును అనుస్యూతముగ నుండునది కానందున మిథ్యయనిన్నీ, సత్యముకాదనిన్నీ సంశయవిపర్యయరహితముగ గ్రహించుటయే ఈ సర్వ దృశ్యము వాస్తవము కాదనిన్నీ, ఇందు సుఖములేదనిన్నీ, ఐనను వలము వ్యవహారమునకు మాత్రము ఆవశ్యకమనిన్నీ తెలియవలెను. అట్టివ్యవహారము అనాదిభ్రాంతికల్పితమనియు తెలిసికొని, తన సత్యస్వరూపమును అనుభవములోనికి తెచ్చుకొని తద్ద్వారా దుఃఖమును పొందకుండుటయే ముముక్షువునకావశ్యకముగాని, దృశ్యమును నశింపజేయుటగాదు, విడిచి పెట్టుటకు దృశమెచటికినీ పోవునదికాదు. శ్రుతియుక్త్యనుభవవిచారములచే నిత్యానిత్య పదార్థనిశ్చయజ్ఞానమును పొందుటే. అనగా—వ్యవహారసత్యము వాస్తవమైనదిగాదనియు,పరమార్థసత్యమగు తనస్వరూపమేవాస్తవమైనదనియు నిశ్చయరూపానుభవమును సంపాదించుకొనవలయును. వాస్తవ బంగారమును గోరువాడు మాయ బంగారముతో తృప్తినొందడుగద! కనుక సర్వ ప్రయత్నములచేతను ముముక్షువునకు ఈ భ్రాంతినివర్తనోపాయ మావశ్యకము.

ఆత్యంతిక దుఃఖనివృత్తినిగోరువాడు అద్వితీయ అఖండ వస్తు జ్ఞానము సంపాదించుకొనవలెను. దుఃఖరాహిత్యమునకిట్టి జ్ఞానమావశ్యకము. అందుచేతనే శ్రుతి- "ద్వితీయాద్వై భయంభవతి" అని చెప్పుచున్నది. రెండు వస్తువులు స్ఫురించునప్పుడే ఏభయమైనను కలుగునుగాని, తానొక్కడే సర్వమునై నయడల ఎట్టి భయము నుండదుగద! ఐతే అందరికిని ఈ దృశ్యమొకేవిధముగ కనపడుటలేదు. దీనికికారణము పూర్వ సంస్కారవాసనాబలమే. ఈ విమర్శనంతయును లోగడనిరూపణములలో జేసి నానాదృశ్యమిథ్యాత్వమును, ఏకాధిష్ఠాన సత్యత్వమును నిరూపించి నిశ్చయించియుంటిమి. అట్టి నిశ్చయమేమనగా—సత్యవస్తువునకు భ్రాంతికల్పితములైన వికారము లెంతమాత్రమును అంటవు. ఆవికారములను సత్యవస్తువు పొందదు. కాని సర్వాధిష్ఠానమైన అద్వితీయ బ్రహ్మయందు దృశ్య నానాభేదభ్రాంతులు గలుగుచు

చున్నవి. దీనికి కారణము అనాద్యవిద్యయేయని తెలిసికొని ముముక్షువు సర్వదా తాను వాస్తవముగ నిత్య నిర్వికార స్వప్రకాశ పరిపూర్ణ సర్వాన్తర్బహిర్వ్యాపకుడై యున్నవాడని నిశ్చయించుకొని సర్వదా తన సత్యస్వరూపమును అనుసంధానము చేసుకొనవలయును. స్వశరీర సర్వదశ్యము త్రికాలములయందును, అవస్థా త్రయమందును అనుసూతముగ అనుభవింపబడుట లేదు గాన, పరమార్థతః ఇది సత్యమైనది కాదనిన్నీ, భ్రాంతికల్పితమైన కేవలవ్యవహారమునకే యోగ్యమనిన్నీ నిశ్చయించి తెలిసికొనవలెను. దీనినే-

శ్లో॥ నామరూపాదయోయత్ర కల్పితాశ్చిత్త విభ్రమాత్ ।
వ్యోమ్నీవనగరం యత్ర బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్॥

'శుద్ధమైన ఆకాశమునందు గంధర్వనగరాదులను కల్పించినట్లు, ఏ బ్రహ్మ యందు చిత్త విభ్రమముచే నామరూపాదులు కల్పింపబడినవో అట్టి బ్రహ్మ యే నీవై యున్నావు'' అని శంకర భగవత్పాదులు చెప్పుచున్నారు.

ముముక్షువునకు జ్ఞానపూర్వకముగ స్వశరీర సర్వదృశ్యత్యాగము, అధిష్ఠాన స్వస్వరూప గ్రహణమున్ను ఆవశ్యకమైయున్నది. కాన స్వశరీర సర్వదృశ్యమిథ్యాత్వానుసంధానము నిట్లుచేయవలయును—

"నాహందేహః, నాహంపాణిపాదాది మాత్రః, నాహంచక్షురాదీన్ద్రియాణి, నాహం ప్రాణః, నాహంమనః, నాహమన్తఃకరణం, నాహమహంకారః, నాహంబుద్ధిః, నాహంచిత్తం, నాహమన్తఃకరణాది కారణీభూతా జ్ఞానరూపః, నాహంకారణశరీరం, నాహంచిదాభాసః, నాహం ద్రష్టా, నాహందృశ్యం, నాహంస్రష్టా''

అని యీవిధముగ నీదేహాది సర్వదృశ్యము తాను కానని నిషేధించి పరిశేషించిన జ్ఞానస్వరూపము తానుయను జ్ఞానమును సంపాదించి తనస్వస్వరూపమును అనుసంధానము జేసికొనవలసియున్నది. ఇట్టి పరమాత్మ స్వరూప

మగు స్వస్వరూపమును గ్రహించుటకు ప్రమాణమైన వచనములు శ్రుతిస్మృతులయందు లబ్ధమగుచున్నవి—

శ్రుతి "యస్మాత్పరం నాపరమస్తి కించిద్యస్మాన్నాణీయోనజ్యాయోఽస్తి కశ్చిత్ ।
వృక్ష ఇవ స్తబ్ధో దివితిష్ఠతేకస్తేనేదంపూర్ణంపురుషేణసర్వమ్ ॥

,, "సయఏషోఽన్తర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషోమనోమయః, అమృతోహిరణ్మయః"

"దేనికంటె ఉత్కృష్టమైనదిగాని, అపకృష్టమైనదిగాని, చిన్నదిగాని, పెద్దదిగాని, మరియొక్కటిలేదో, అట్టిపూర్ణుడైన పురుషుడు కదలికలేనివృక్షమువలె ప్రకాశమానమగు స్వస్వరూపమునందు ప్రతిష్ఠితుడై, అద్వితీయుడై యున్నాడు. సమస్తప్రాణుల హృదయాకాశములో ఈ పురుషుడు మనోవ్యాపార మాత్రముచే గ్రహింపబడువాడై పరమసుఖరూపమైన జ్యోతిస్సుగ విలసిల్లుచున్నాడు' అని పై శ్రుతివాక్యములు చెప్పుచున్నవి.

ఇట్టిపరమాత్మస్వరూపమును శ్రీకృష్ణ భగవానుడు గీతలలో అర్జునునకు క్రిందివిధముగ చెప్పుచున్నాడు—

శ్లో॥ జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాది మత్పరం బ్రహ్మ నసత్తన్నా సదుచ్యతే ॥

శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥

శ్లో॥ బహిరన్తశ్చ భూతానాం అచరం చరమేవచ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికేచతత్ ॥

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితమ్ ।
భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥

శ్లో ॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృదిసర్వస్య ధిష్ఠితమ్ ॥

ఏపరమాత స్వరూపమును తెలిసికొన్నమాత్రమున అమృతత్వము ప్రాప్తించునో అట్టిస్వరూపమును నిరూపించుచున్నాను. ఆస్వరూపము అనాదియై నేనే (భగవానుడే) పరాకాష్ఠగానుండి సదసద్విలక్షణముగనున్నది. మఱియు ఇంద్రియములకు విషయగ్రహణ సామర్థ్యము నిచ్చునదై, స్వతః ఇన్ద్రియ రహితమై, అసంగమయ్యు సర్వప్రపంచాధిష్ఠానమై గుణరహితము గుణములభుజించునదియునై యున్నది. అట్లే సర్వభూతాన్తర్బహిర్వ్యాప్తమైయున్నది. అది సూక్ష మగుటచే ఇన్ద్రియగ్రాహ్యమగునదికాదు. సర్వప్రాణులయందు ఏకమైయుండియు, న్న న్నముగనున్నట్లు గోచరించుచున్నది. భూతముల ఉత్పత్తి స్థితి లయములకు కారణమైయున్నది. చంద్రసూర్యాది జ్యోతిస్సులకు మించిన జ్యో రూపమై, సర్వప్రాణుల హృదయములలో విలసిల్లుచున్నది. ఇదియేజ్ఞానము. జ్ఞేయము,

శ్లో ॥ ఇతిక్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయంచోక్తం సమాసతః ।
మద్భక్తఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥

'ఇట్టి క్షేత్రాదిరూపముతోనున్న నాస్వరూపమును తెలిసికొన్న నాభక్తుడు నాస్వరూపమే యగును.

శ్లో ॥ బ్రహ్మైవపంచభూతాని బ్రహ్మైవభువనత్రయమ్ ।
బ్రహ్మైవాహం బ్రహ్మచత్వం బ్రహ్మణోనాస్తికించన ॥

శ్లో ॥ అన్తః పూర్ణం బహిః పూర్ణం స్వయ మద్వయ మక్రియమ్ ।
యదనన్తం పరంజ్యోతిః బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥

శ్లో ॥ నస్థూలోఽసి నసూక్ష్మోఽసి నాఽపి కారణవిగ్రహః ।
బ్రహ్మైవాఽసి నసందేహః ప్రత్యగ్భోదైకలక్షణః ॥

శ్లో ॥ చిదేవపంచభూతాని చిదేవభువనత్రయమ్ ।
చిదేవాహం చిదేవత్వం సర్వమేవ చిదేవహి ॥

'పంచభూతములు, పంచభూతవికారములగు మూడులోకములు, ఆచార్యుడనైన నేను, అన్తేవాసినైననీవు, సర్వముబ్రహ్మయేగాని వేరుకాదు. అన్తర్బహిర్వ్యాప్తము, అద్వితీయమునైన బ్రహ్మయేనీవు. స్థూలసూక్ష్మకారణములను విభాగములు నీలోలేవు. నీవుబోధస్వరూపుడవు." అని శంకరభగవద్వచనము మొదలగునవి తెలుపుచున్నవి. ఇట్లు తెలుపబడిన స్వరూపమునెట్లుగ్రహించి తెలిసికొనవలసినదిన్నీ ఈ క్రింది పూర్వాచార్యుల వచనములు తెలుపుచున్నవి—

శ్లో ॥ జగద్భావంపరిత్యజ్య బ్రహ్మమాత్రత్వభావనా ।
వాసనాపక్షయోపాయః సులభస్సూరి సమ్మతః ॥

శ్లో ॥ సన్మాత్రత్వావలోకనసదాసర్వత్ర సర్వతః ।
వాసనాక్షయమాయాతి సత్యమత్ర నసంశయః ॥

శ్లో॥ త్యక్త్వాబాహ్యమిదం మనోనిలయనం తుచ్ఛంమృషేతిస్వయం
బుధ్యానిశ్చలయా గురూక్తిపరయా విజ్ఞాయతత్త్వంమునే ।
బ్రహ్మణ్యస్తభిదే చిదాత్మని సదానన్దేఽద్వయే నిర్గుణే,
నస్యాస్తగతే స్సుఖేనవసత స్తూష్ణీం కిమన్యైర్భ్రమైః ॥

"కనిపించుచున్న ప్రపంచమందు ప్రపంచభావమును విడచి బ్రహ్మభావనజేయుట సకలవాసనాక్షయమునకు సులభోపాయము. సర్వత్ర సద్వస్తుభావనచే నిస్సంశయముగ వాసనలన్నియు నశించును. మనస్సునాకర్షించుచున్న సర్వ ప్రపంచమును విడనాడి గురూపదేశముచే తత్త్వమును స్థిరబుద్ధితో గ్రహించి ద్వైతభావములేని యానందస్వరూపము నిర్గుణమునగు బ్రహ్మయందైక్యమునొంది సుఖస్థితిలోనున్నవారికి ఇతరభ్రాంతులచే కావలసినదేమున్నది!

కనుక జిజ్ఞాసువు ఏవిధముచేతనైనను ధీ వృత్తినాశ్రయించి స్వప్రజ్ఞచే చిత్త చికిత్సజేసికొని తనదీర్ఘసంసారవ్యాధిని నిశ్శేషముగ నిర్మూలించుటకు తానే సమర్థుడుకాని, ఇతరులుకారు. గుర్వీశ్వరానుగ్రహమువల్లగాని యీ సమర్థతకలుగదు. దానిని సంపాదించి శ్రుతియుక్త్యనుభవములతో నిత్యానిత్య విచారణజేసి శ్రుతిమాతచే తెలుపబడిన తత్త్వమస్యాది మహావాక్య శ్రవణమనన నిదిధ్యాసలవల్ల గలుగు అపరోక్షానుభవరూపముగ పొందిన ఆ జ్ఞానము నిత్యమగును. అదిఎన్నటికిని నశించునదిగాని మార్పు జెందునదిగాని కాదు. ఇదియె అహం, మమ, అ మానసక్తతావాసనలను నిశ్శేషముగ త్యజించి సర్వదృశ్యాధిష్ఠాన నిత్యపరిపూర్ణ స్వప్రకాశ చైతన్యమేతాను అనగా—నేను అను నిశ్చయముతో గ్రహింపబడవలసియున్నది. నివిషయమున సంశయరహితచిత్తుడై దశమునికథయందు దశముని లాగున నిశ్చితస్వరూపుడగుటయే అపరోక్షజ్ఞానమగుచున్నది. ఎట్లనిన—

శ్లో ॥ దశమోఽసీ తివాక్యోత్థానధీ రస్య విహన్యతే ।
ఆదిమధ్యావసానేషు ననవత్వస్య సంశయః ।
ఏవం తత్త్వమసీత్యసా
సమ్యక్ జ్ఞాతత్వమర్థస్య జాయేతైవ ప్రమాదృఢా ॥

'నేను పదియవవాడనను నిశ్చయము కలిగినపిమట మఱియెప్పుడును నవత్వసంశయము కలుగనట్లు, తత్త్వమసి మహావాక్యముచే దృఢమైన అద్వి ॰యాత బుద్ధి కలిగినవానికెప్పుడును ద్వైతము భాసించదు" అని విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు. ఇట్టిజ్ఞానము- మనము క్రొత్తగా సంపాదించవలసిన పదార్థముకాదు. సర్వులకునిది ప్రాప్తమేయైయున్నది. కనుక దీనిని తెలిసికొనుటయే పొందుటగాని, లేనిదానినిసంపాదించుట ఏమియును కాదు. ఇట్టిజ్ఞానము ప్రతివారియందును వారివారి కంఠమునందు హారములాగున సదాయున్నను మఱచినవారగుచున్నారు. దీనినే—

శ్లో॥ ఆత్మా తుసతతం ప్రాప్తోఽప్యప్రాప్తవదవిద్యయా ।
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణంయథా ॥

శ్లో॥ స్థాణౌపురుషవద్భ్రాన్త్యా కృతా బ్రహ్మణి జీవతా ।
జీవస్యతాత్త్వికేరూపే తస్మిన్ దృష్టే నివర్తతే ॥

'ఆత్మ వస్తువు స్వస్వరూపమగుటచే సర్వులకు సర్వదా ప్రాప్తమైయున్నను తన కంఠమందున్న హారమునువలె అజ్ఞానముచే విస్మరించి, మరల జ్ఞానముచే గ్రహించుటయే ప్రాప్తియని చెప్పబడుచున్నది. స్థాణువును పురుషుడని భ్రమించినట్లు బ్రహ్మను జీవునిగ భ్రాంతిచే లోకము గ్రహించుచున్నది. జీవుని నిజస్వరూపమును గుర్తించినపుడా జీవత్వము నివృత్తమగును, అనిశంకరభగవత్పాదులు ఇట్టి జ్ఞానము అందరికిని ప్రాప్తమైయున్నదని తెలుపుచున్నారు. దీనినే—

"బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"

బ్రహ్మయేయైయుండి బ్రహ్మనుపొందుచున్నాడు అని శ్రుతితెలుపుచున్నది. ఐనను శ్రుతిమాత ఇంతప్రత్యక్షముగ 'తత్త్వమసి" ఆ బ్రహ్మము నీవేయని స్పష్టముగ తెలుపుచున్నను పామరులకే కాక విద్వాంసులకుగూడ నిట్టి వాక్యమందు ప్రీతినిశ్చయములు కలుగుటలేదు. ఇదియే అవిద్యావాసనాబలవైచిత్ర్యము. దీనినే భగవత్పాదులిట్లు వివరించి తెలుపుచున్నారు—

శ్లో॥ సూతకాది నిరాకారం సాకారమివ పశ్యతి ।
స్వస్మిన్ దృఢవ్రతయేన సూతకం హమితి స్ఫుటమ్ ॥

శ్లో॥ నతథాబోధితః శ్రుత్యా ముహుస్తత్త్వమసీత్యలమ్ ।
విద్వానపి విజానాతి స్వతత్త్వం మహదద్భుతమ్ ॥

శ్లో॥ అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి
జ్యోతిష్కవాచోపవసన్తి భక్త్యా ।

శ్రుతే స్త్వహో త త్త్వమసీతివాక్యం
నవిశ్వస స్త్యద్భుత మేతదేవ ॥

శ్లో ॥ శ్రుత్వా త త్త్వమసీత్యేవం బోధ్యమానోఽప్యనేకధా ।
నవిజానాత్యయం త త్త్వ మీశానుగ్రహవర్జితః ॥

"ఆకార రహితమైన జాత—మృతాదా శౌచమును ఉపదేశవాక ముచే గ్రహించి, నేను "ఆశౌచముగలవాడ" నని గట్టిగా తెలిసికొనునట్టి విద్వాంసుడుకూడ, త త్త్వమస్యాదివాక్యములు బోధించునట్టి ఆత త త్త్వమును మాత్రము తెలిసికొనుటలేదు. ఇది అత్యాశ్చర్యకరము. నేడు అష్టమి, నవమి చతుర్దశి యను జ్యోతిష్కుని వచనములను సైతము నమ్మి ఉపవాసాది కృత్యములను నిర్వర్తించు విద్వాంసులుగూడ శ్రుతిచెప్పినట్టి 'త త్త్వమసి' యను వాక్యమును విశ్వసించుటలేదు. ఈ యజ్ఞానమహిమ నేమనవలయును ? శ్రుతి "త త్త్వమసి" యని యనేకవిధముల బోధించుచున్నను ఈశ్వరానుగ్రహము లేనివాడు ఈ త త్త్వమును గుర్తింపజాలడు.

ఈ పై వచనములనుబట్టిచూడగా పండిత పామర సాధారణముగ లోకములో వృత్తి సంపాదనా ప్రధానులగు పురోహిత జ్యోతిష్కులు చెప్పు వచనములమీదయున్న విశ్వాసముగూడ నూర్గురుతల్లులతో సమానమగు శ్రుతి వాక్యమందు కలుగుటలేదు. దీనికికారణము ఈశ్వరానుగ్రహము తక్కువగా ఉండుటేయని చెప్పవలసియున్నది. కనుక ఎన్ని ప్రయత్నములచేనైనను శ్రుతివాక్యమందు ప్రీతినిశ్చయ విశ్వాసములను సంపాదించుట ముముక్షువున కావశ్యకమైన మోక్షసాధన మార్గమగును. శ్రుతి స్మృత్యనుభవములనుబట్టి విమర్శజేసి చూచినయెడల శుద్ధజీవుడుగా గ్రహింపబడిన 'నేను' అను పదార్థము (అహం) నిత్యము, పరిపూర్ణమునగు ఆ బ్రహ్మమేగాని తదితరము కాదు. వాస్తవములో బ్రహ్మేతరమేదియును లేదు. మోక్షమనగా తనసత్య స్వరూపానుభవమును పొందుటే. అనగా మరచినదానిని జ్ఞప్తికితెచ్చుకొనుట,

దానిని స్థిరముగ నిలుపుకొనుట. ఇంతకంటే వేరులేదు. ఇదియే నిత్యసుఖము. ఆనందస్వరూపము. దీనినే శ్రుతి-"ఆనన్దోబ్రహ్మేతివ్యజానాత్" ఆనందమే బ్రహ్మయని తెలిసికొనెను. "యోవేదనిహితంగుహాయాం పరమేవ్యోమన్, సోஉశ్నుతే సర్వాన్కామాన్సహ" సర్వోత్కృష్టమైన హృదయాకాశమందున్న వస్తువును తెలిసికొనినవాడు సమస్తకామములను ఏకకాలమందు పొందును" అని చెప్పుచున్నది.

కాని అజ్ఞానము అనాది గనుక అవగతి పర్యన్తము అనుసంధాన మావశ్యకము. ఏలయన-ఈ సత్యజ్ఞానానుభవము వల్లనే నిత్యసుఖము కలుగును గాని కేవలము శబ్దమాత్రముగ తెలిసికొనుటచే అట్టిసుఖము కలుగదు. లోకవ్యవహారములోగూడ కేవలశబ్దజ్ఞానముకన్న అనుభవము అధికసుఖమునకు హేతువుగా కనబడుచున్నది. సామాన్య జ్ఞానము అనగా-అనుభవము లేని జ్ఞానము అంతగ ఉపయోగపడుటలేదు.ఏదోయొక జ్ఞానములేనిది వ్యవహార పరమార్థములలో దేనినిన్నీ పొందలేముగదః కనుక అనుభవమును సంపాదించుటకు జ్ఞానమత్యావశ్యకమైనను కేవల శ్రుతిపఠనజ్ఞానమే పూర్ణసుఖహేతువగుటలేదు. కనుక ఫలముకోరు ప్రతివారు జ్ఞానానుభవములను రెండింటిని సుఖముకొరకు సంపాదించవలసియున్నది. జ్ఞానశబ్దార్థమును బాగుగ పరి లించిన పరమార్థములో జ్ఞానానుభవములు రెండును ఒకటియేయగును. కాని వ్యవహారములో జ్ఞానము—అనుభవము రెండును న్న న్నములుగనున్నవి. ఇందులో జ్ఞానముకన్న అనుభవము అధికసుఖములకు హేతువగుచున్నది. ఇది అందరికిని తెలిసినవిషయమే. ఐనను బాగుగా విచారించిన ఈ సుఖదుఃఖములకు అనుభవముకన్న జ్ఞానమే ముఖ్యకారణముగ కనబడుచున్నది. ఎట్లనగా—లోకములో అనుభవము కర్తృత్వభోక్తృత్వములచే కలుగుచున్నది గాని వేరువిధముగ కనబడుటలేదు. ఈ కర్తృత్వ భోక్తృత్వములు జ్ఞానము వల్లనే కలుగుచున్నవిగాని, అన్యథా కలుగుటలేదు. ఎట్లనగా—మనము సంపాదించిన గృహకళత్రక్షేత్రాదులలో 'ఇదినాది" 'ఇదినాదికాదు" అను జ్ఞానములోనే అనుభవము అనుభవరాహిత్యము కలుగుచున్నవిగాని, జ్ఞానము

వినాగా కలుగుటలేదు. జ్ఞానమే సుఖదుఃఖములకు హేతువగుచున్నదిగాని వాస్తవావాస్తవస్థితులు కారణమగుటలేదు. మరియొక విషయము—"నాది" అనుకొనుటవల్లరాగము, "నాదికాదు" అనుకొనుటవల్ల నిర మానము కలుగుచున్నది. వాసనానుసారముగ ఒకేవస్తువునందు ప్రీతి—ఉపేక్ష—ద్వేషములు కలుగుచున్నవి. ఈ రాగ—ద్వేష—ఉపేక్షాస్థితులుకూడ అనుకూల ప్రతికూల ఉపేక్షాభావములను బట్టి కలుగుచున్నవి. ఈ భావములుగూడ జ్ఞానము వినాగా కలుగుటలేదు. అందుకుగాను. జ్ఞానసంపాదన మావశ్యకము.

ఈ జ్ఞానములలో వాస్తవా వాస్తవజ్ఞానములు రెండుకనబడుచున్నవి. మొదటిజ్ఞానము సత్యము. రెండవజ్ఞానము మిథ్య. సత్యజ్ఞానముచే ఈ మిథ్యాజ్ఞానమును బాధించి అనుభవమును పొందవలయును. కనుక అసత్యమైన ఈసర్వదృశ్యజ్ఞానమును త్యజించి ఆన్తరసత్యపదార్థ జ్ఞానపూర్వకముగ ప్రీతినిశ్చయములతో సర్వదా స్వస్వరూపానుసంధానాభ్యాస మావశ్యకము. ఇట్లు చేసినవారికి ప్రతిబంధనివృత్త్యనంతరము, ఆ పరబ్రహ్మస్వరూపము వ్యక్తమై తత్స్వరూపము తానను అనుభవము తప్పక కలుగును. అట్టి అనుభవస్వరూపము నీక్రిందిశ్లోకములు తెలుపుచున్నవి—

శ్లో ॥ నిత్యం సర్వగతం శాన్తం నిరవద్యం నిరంజనమ్ ।
నిష్కలం నిష్క్రియం శుద్ధం తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

శ్లో ॥ కేవలం సత్యసంకల్పం శుద్ధం బ్రహ్మాస్మ్యహంపరమ్ ।
పుణ్యపాపవినిర్ముక్తం కారణం జగతః పరమ్ ॥
అద్వియం పరంజ్యోతిర్బ్రహ్మాస్మ్యానన్దమవ్యయమ్ ॥

"నేను నిత్యమై సర్వగతమై, శాన్తమై, దోషరహితమైన పుణ్యపాపాదిశూన్యమై, నిరవయవమై, శుద్ధమై, ప్రాప్యస్థానమై, జగత్తుకుమూలకారణమై, అద్వియమై, సర్వోత్కృష్ట జ్యోతిస్స్వరూపమై ఆనన్దరూపమై నాశరహితమైన పరబ్రహ్మమై యున్నాను.

శ్లో ॥ ఏవమాది గుణైర్యుక్తం సత్త్వాదిగుణవర్జితమ్ ।
ఆవిష్టం సకలం బ్రహ్మ సదాధ్యాయేత్స్వకర్మకృత్ ॥

"ఇట్టి బ్రహ్మ స్వరూపమును సర్వదా ధ్యానించవలెనని" పై వాక్యమున వషిష్ఠభగవానులు చెప్పుచున్నారు.

ఈ సర్వదృశ్యదేహాదులు బ్రహ్మాధిష్ఠానమందు భ్రాంతిచే అధ్యస్తములైయున్నవి. ఈ యధ్యస్తము అవిద్యాకారమై అనాదిజన పరంపరగా వచ్చుచున్నందున ఈ యధ్యాస ప్రబలము. ఐనను పైనజెప్పిన తిని దృఢ ప్రయత్నములచే నశించును. సత్యస్వరూపానుభవము తప్పకకలుగును. వస్త్వనుభవమును పొందుటకు మనన—నిదిధ్యాసనముల నిరన్తరాభ్యాస మావశ్యకమని "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను బ్రహ్మ సూత్రము తెలుపుచున్నది.

ఇట్టిజ్ఞానమును గురుముఖతః గ్రహించవలసియున్నది.

"ఆచార్యవాన్ పురుషోవేద"

'గురుముఖతః ఉపదేశమును పొందినవాడే తత్త్వజ్ఞానికాగలడు" అని శ్రుతియును, "నవినా గురుసంబంధం వాక్యస్య శ్రవణం"

'గురూపదేశములేనిదే మహావాక శ్రవణముండదు" అని సురేశ్వరాచార్య వచనము,

తద్విద్ధి ప్రాణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః"

తత్త్వవేత్తలనునమస్కరించి, సేవించి ప్రశ్నించినయడలవారు పరమాత స్వరూపమునుపదేశింతురుగాన ఆవిధముగ దానిని పొందుము" అని గీతావచనమున్నూ తెలుపుచున్నది. ఇందుచే తనస్వస్వరూపమును ఈవిధముగ అనుసంధానము చేగ్రహణముచేయవలయును. అనగా—ఇట్లు స్వస్వరూపానుసంధానమును

చేసికొనవలయును. ఇట్లుకాక, తనకంటె తనచే ఉపాసింపబడెడు దేవత వేరు అనుభావముతో ఉపాసించువాడు పశుతుల్యుడని—

"యోఽన్యాందేవతాముపాస్తే అన్యో ఽసావన్యో ఽహమస్మీతి,నసవేద యథాపశురేవం సదేవానామ్"

అని ఈశ్రుతివాక్యము తెలుపుచున్నది. ఇంకనూ పూర్వకాలంబున——దండకారణ్యమందు శ్రీరామచంద్రమూర్తికి మహాదేవునిచే బ్రహ్మ స్వరూప కైవల్యమోక్షప్రదాయకమగు జ్ఞానము, పద్మ పురాణమందిట్లుపదేశింపబడియె. నద్దానిని ముముక్షు జనోపయోగంబునకై నిచట యుదహరించుచున్నాడ—ఈ ఆత్మజ్ఞానమనునది:—

శ్లో॥ నకర్మణా మనుష్ఠానై ర్నదానై స్తపసాపి వా।
కైవల్యం లభతే మర్త్యః కింతు జ్ఞానేన కేవలమ్॥

ఏలాటి పుణ్యకార్యముల నాచరించుట చేతను, ఎటువంటి దానముల చేతను, ఎట్టి తపంబులచేతను, మానవుడు కైవల్యపదంబు నొందజాలడు. కేవలమొకజ్ఞానముచేతనే నొందదగును.

శ్లో॥ చిద్రూప ఆత్మా యేనైవ స్వదేహ మ పశ్యతి।
ఆత్మైవహి పరంబ్రహ్మ నిర్లేప స్సుఖనీరధిః ॥

జ్ఞానానందములకు పరిమితిలేని యేఆత్మ తనను తానే తెలిసికొనువాడో, అతడే దుఃఖరహితుడగు పరబ్రహ్మ యనబడును.

శ్లో॥ యస్తు శాంత్యాది యుక్తస్సన్మామాత్మత్వేన పశ్యతి।
సజాయతే పరంజ్యోతి రద్వైతం బ్రహ్మ కేవలమ్॥

ఎవ్వడు శాన్త్యాదులతో గూడి నన్ను పరమాత్మగా చూచునో వాడు సాయుజ్యమును, పిమ్మట నుత్కృష్టమగు పరంజ్యోతియై కేవలమద్వైత మగు కైవల్యముక్తిని బొందును. మరియును:—

శ్లో॥ ఆత స్వరూపావస్థానం ము_క్తిరిత్య ధీయతే ।
సత్యం జ్ఞానమనంతం యదానందం బ్రహ్మ కేవలమ్॥

శ్లో॥ సర్వాధర విహీనంచ మనోవాచామగోచరమ్ ।
సజా -య విజా -య పదార్థా నామసంభవాత్ ॥

ఆత్మ స్వరూపములో కలిసిపోవుటయే ము_క్తియని చెప్పబడినది. సత్య జ్ఞానానందమయమై నిర్వికారమై, స్వధర హీనమై, మనోవాగగోచరమై, సజా య, విజా య, స్వగతభేదరహితమై యద్వైతమగు నీరూపును (అనగా నారూపమేనని) తలంపుము.

శ్లో॥ మమస్వరూపజ్ఞానేన యదాఽవిద్యా ప్రణశ్యతి ।
తదైక ఏవ వర్తేఽహం మనోవాచా మగోచరః ॥

శ్లో॥ సదైవ పరమానంద స్స్వప్రకాశశ్చిదాత్మనా ।
న కాలం పంచభూతాని నదేశో విదిశశ్చన ॥

శ్లో॥ మదన్యం నా_స్తి యత్కించి_త్తదా వ_ర్తేఽహమేకలః ॥

నాయొక్క అనగా ముముక్షువు తనయొక్క నిరుపాధిక స్వరూపమును తెలిసికొనుటచేత, నెప్పుడు ద్వైతజ్ఞానము నశించునో అప్పుడు నేను అను తను మనోవాక్కులకగోచరుడై యక్కడ యుండును.జ్ఞానాత్మచే ప్రకాశుడనై యెల్లప్పుడు పరమానందము గలవాడనై యుండును. నన్నువిడచి దేశకాలాది భూతములులేవు. నాకంటె న్నమైనదించుకయు లేకుండ నేనొక్కడనే యున్నాను— అని హృదయములో నిష్ఠమగు మనంబుచే అనుసంధానాదులను గావించి నన్ను (అనగా తనను) జ్ఞానస్వరూపమున తెసుకొనిన వారు ము_క్తిని బొందుదురు.

శ్లో॥ కూటస్థానీహ కరాణి కోటిజన్మా ర్జితాన పి ।
జ్ఞానేనైవ వినశ్యంతి నతుకర్మాయుతైరపి ॥

కోటిజన్మార్జితములైనను చెడకేకరీతినుండు కర లు జ్ఞానము చేతనే నశించును. కర్మా చరణములచే నశించవు—అనికూడా తెలుపుచున్నారు. కాన ముముక్షువునకు సర్వవిధములచేతను ఆత్మ జ్ఞానమునకు ఈ స్వస్వరూపాను సంధానాదులు ఆవశ్యకమగుచున్నవి.

---

# ముముక్షు స్థితి వ్యవహార నిరూపణ

జగన్మిథ్యాత్వమును తెలిసికొని, పరిపూర్ణజ్ఞానమును పొందిన మహనీయులకు కూడా ఈ లోకమున ప్రారబ్ధానుభవము తప్పుటలేదు. "నా భుక్తం క్షీయతే కర కల్పకోటి శతైరపి" అను వచనము ఈ విషయమునే చెప్పుచున్నది. గాన ఈ ప్రారబ్ధానుభవము జ్ఞానులకే తప్పకయుండునపుడు సామాన్యజనుల విషయమై చెప్పెడిదేమున్నది? ఈ ప్రపంచమును పరమేశ్వరుడు వులకు తండ్రికుమారునికి కుటుంబభారమునప్పజెప్పి ఆస్తినిచ్చినట్లు సర్వదయామయుడై యుండుటచే వారి తరణోపాయభారమును వారి మీదనే యుంచి ప్రసాదించియున్నాడు. తండ్రి కుమారునికి ఆస్తి రక్షణోపాయముగ విద్యాబుద్ధులను కలుగజేయించునట్లు ఈ వులకు వారి జ్ఞాన సంపాదనకు కావలసిన వివేకమును ఇచ్చి, ఆ వివేకముతో పాటు వయసు వచ్చిన కుమారునకు తండ్రి స్వాతంత్ర్యమిచ్చునటుల ఈ వులకు స్వాతంత్ర్యమును కూడా ఈ పరమేశ్వరుడిచ్చియున్నాడు. తండ్రి యిచ్చిన ఆస్తినిగాని స్వాతంత్ర్యమును గాని బాగుచేయుట - లేక - పాడు జేసుకొనుట కుమారుని ప్రజ్ఞా విశేషమునుబట్టి యున్నట్లు ఈ ప్రపంచానుభవమును వివేకముతో వాడుకొనుచు స్వప్రజ్ఞా విశేషములచేత ముక్తుడగుటకున్నూ, బద్ధుడుగానేయుండుటకున్నూ స్వాతంత్ర్యమును వులకు కలుగజేసి ఆభారమును వులయందే యుంచినాడు. గాన వివేకియైనవాడు దయామయుడైన పరమేశ్వరుడు ప్రసాదించిన ఈ ప్రపంచానుభవములతో తన ప్రజ్ఞా విశేషమును చేర్చి ముక్తిని పొందు

టయో, లేక బద్ధుడుగానే ఉండుట మంచిదో దీనిని వుడే నిశ్చయించుకొన వలసియున్నది. ఇట్లు నిశ్చయమును పొందిన జీవులలో ముక్తిని సాధించ వలెనని యిచ్ఛయించి నిశ్చయించుకొను జీవుడే ముముక్షువు. ఇట్టి ముముక్షువు తనకు విధించిన శిక్షవంటి ప్రారబ్ధానుసారముగ కరా నుభవమును పొందుచూ స్వప్రయత్నముచే గుర్వీశ్వరానుగ్రహములను సంపాదించి తగిన యమనియ మాదులను పాటించుచూ శ్రవణమననాదులు చేయుచుండవలెను.

ఇట్లు చేయుటకు చిత్త విక్షేపాదులు బాధించుచుండును. తదుపశమ నార్థమై తత్త్వవిచారణకూడా ఆవశకము. తత్త్వనిశ్చయమువల్ల చిత్తవిక్షే పాదులు—అభిమాన, సక్తతలు క్రమముగా తగ్గును. తత్త్వనిశ్చయమనగా జగన్మిథ్యాత్వనిశ్చయముతో స్వస్వరూప గ్రహణము. దీనిని సంపాదించుటకు ముముక్షువైనవాడు భ్రమ ప్రమాదరహితముగా దీర్ఘకాల పర్యంతము, ఆమరణాన్తముగాని విసుగుచెందక స్వస్వరూపానుసంధానమును చేయవల యును. ఇట్లు బ్రహ్మానుసంధానమును చేయుటకు అన్తఃకరణమును ఆశ్ర యించి సద్వృత్తులను సంపాదించి వాటిద్వారా అనగా పరిశుద్ధమనస్సుతో బ్రహ్మ లక్షణములను తనవే అని అనుసంధానమును చేయవలయును. స్వశరీ రము, అన్తఃకరణము, మనోవృత్తులు ఇవియన్నియు మిథ్యయైన ప్రపంచా న్తర్గతములే. ఐనను బ్రహ్మ సాక్షాత్కారఫలపర్యంతము ఈయన్తఃకరణమునే ఆశ్రయించి, అనగా సహాయముగా సికొని ప్రయత్నమును చేయవలయును. ఇది తప్ప వేరుదారిలేదు. గనుక ముముక్షువైనవాడు ఆహార విహారాదులచే నియమ లుడై యథాశక్తి యమనియమాదులను పాలించుచు బ్రహ్మాభ్యాసా దులకు దేహసంరక్షణ దేహధారణములను యథోచితముగా చేసికొనుట యావశ్యకము. దేహస్థితి స్వస్థముగా లేనియడల అభ్యాసాదులు జరుగవు. అట్టి తరి ముముక్షువునకు జీవితాశయమైన బ్రహ్మ జ్ఞానసంపాదనకే భంగము కలుగును. శాస్త్రము 'వన్ భద్రాణిపశ్యతి' అని చెప్పుచున్నదిగాన ఈ దేహధారణ స్వస్థతలకు అవసరమగు కార్యములను నిర్వర్తించుటలో

ఔదాసీన్యము పనికిరాదు. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్' అనికూడా అ జ్ఞులు చెప్పుచున్నారు.

ఇట్లు దేహరక్షణ జేసికొనుచు సర్వకాలములయందు బ్రహ్మాభ్యాసపరుడై తన ప్రారబ్ధానుసారవ్యవహారములను నెరవేర్చుచుండవలయును. బ్రహ్మాభ్యాసమనగా—

శ్లో॥ తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

అనగా మనసుచేత తత్త్వమును చింతించుటయు,దానినే నోటితో చెప్పుటయు, ఒకరికొకరు పరస్పరముగా బోధించుటయు, ఈ లాగున ఆ బ్రహ్మతత్త్వైకపరులై యుండుటను పండితులు బ్రహ్మాభ్యాసమని అనుకొనెదరు, అని పంచద వచనము చెప్పుచున్నది. ఇట్లు సదానుసంధానమునుచేయుచు ప్రారబ్ధానుగత వ్యవహారములను నిర్వర్తించుట సాధ్యమా ? అను శంకకు సమాధాన వచనముగ సాధ్యమని నిరూపించుచు,

శ్లో॥ పరవ్యసనినీ నారీ వ్యగ్రాపిగృహ కర్మణి ।
తదేవాస్వాదయత్యన్తః పరసంగరసాయనమ్ ॥

అనగా అన్యాసక్తయైన స్త్రీ గృహకార్యాదివ్యాసక్తురాలై యుండియు మనసులో ఆపరసంగసుఖమునే ఆస్వాదించుచుండును అని విద్యారణ్యులు చెప్పుచున్నారు. ముముక్షువైనవాడు ప్రపంచాన్తఃపాతియైన స్వశరీరాన్తఃకరణముల సహాయముతో బ్రహ్మానుసంధాన సమాధులను ఆమరణాన్తముగాని, ప్రతిబంధరాహిత్యము వరకుగాని దీక్షతో ఆచరించిన కాలపరిపాకమున ఫలమును కలిగించి ఈయన్తఃకరణోపాధి తనంతట తానే నశించును. అపుడు తాను కేవల సాక్షిరూపుడై విలసిల్లును. దీనినే—

శ్లో॥ అన్తఃకరణ సంత్యాగాదవశిష్టే చిదాత్మని ।
అహంబ్రహ్మేతివాక్యేన బ్రహ్మత్వంసాక్షిణీక్షతే ॥

అనగా అన్తఃకరణ పరిత్యాగమును చేయుటవలన కేవల చిదాత యే మిగులగా 'అహంబ్రహ్మ' అనువాక్యముచే 'సాక్షియే బ్రహ్మ' అని గ్రహించును, అని శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. గాన బ్రహ్మజ్ఞానఫల పర్యంతము దేహధారణానుకూల వ్యాపారమును, అన్తఃకరణ శుద్ధిని రక్షించు కొనుచు ప్రారబ్ధానుసారముగ యథాప్రాప్తమైన తన కర్మఫలములను నిర మానుడై అనుభవించుట మొదలగు ప్రాపంచిక వ్యవహారము ముముక్షువు నకు తప్పదు. ఇట్లు తెలిసికొని జ్ఞానాభ్యాసమును జేయుచూ ప్రారబ్ధాంతము వరకూ జీవితమును గడిపియే సార్థకతను పొందవలయును. వేరుదారిలేదు. ఇట్టి ముముక్షువు నేను అహం అని కలుగు ప్ర తిలో తనకు ప్రారబ్ధవశమున సంప్రాప్తమైన కరా నుభవమును పొందునపుడు అనగా వ్యవహారకాలములో వాస్తవతః తను పరిపూర్ణుడై ననూ ఇప్పుడు శ రబద్ధుడై పనులను నిర్వర్తించు చున్నానని స్వస్వరూపానుసంధాన కాలములో తన దేహాదులు లేవనియు, ఉన్నను ఆభాసములనియు వివేచనలతో స్థూలసూక్ష శరీరములను జ్ఞానపూర్వక త్యాగమును చేసి నేను అహం తను కేవల దృశ్యరహిత పరిపూర్ణ సంవిద్రూపు డని బాగుగ గ్రహించి వ్యవహారకాలముతో అన్తఃకరణ సహితుడుగాను, సమాధి కాలములో ఈ సర్వదృశ్య రహితుడుగాను సద్వృత్తి సహాయమున సత్యస్వస్వరూపాలంబనతో సత్యజ్ఞానానంద లక్షణములను గ్రహించవలెను.

ఇట్టి కాలములో ఒక్కవృత్తి మాత్రమే అపేక్షితము తప్ప ఇతర శరీరధర ములతో సంబంధమును పొందకూడదు. వ్యవహారకాలములో గూడ ముముక్షువు శ రాదుల మిథ్యాత్వమును నిశ్చయించుకున్నను, ప్రారబ్ధాను సారమున శరీరయాత్రకు అంతఃకరణేంద్రియముల సహాయము కావలసి యున్నది. ఐనను హస్తపాదాదుల గోలుపోయిన దురదృష్ట వులు కృత్రిమా వయవసాహాయ్యముతో జీవితమును గడుపునట్లు ముముక్షువు ప్రారబ్ధము ననుభ వించవలెనుగాని, వాని తాదాత్మ్యమును పొందకూడదు. ఇట్లు దేహతాదాత్మ్య మును జ్ఞానపూర్వకముగ దేహపాటవస్థితులనుబట్టి సాధ్యమైనంతవరకు నిరభి మానుడై, అనగా - దేహవాసనను తగ్గించుకొని శమదమాదులను, స్థితికి

వీలగు యమనియమాదులతో అనుసంధాన వాక్యార్థములను మనోగోచరము జేసికొని అనుసంధానమును సర్వదా చేయుచుండవలెను. ఎట్లనగా—

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి ।
(నివేశిత) మనోఽనస్తే సంవిన్మాత్ర పరోభవ ॥

అనగా మాటలాడుట, విసర్జనము చేయుట, గ్రహించుట, ఉన్మీష నిమేషములను చేయుట మొదలగు వ్యాపారములను చేయుచున్నను సర్వకాలములయందు చిత్తమును పరమాత్మనియందుంచినవాడవై సంవిదేకపరాయణుడవుకము .

శ్లో॥ మమేదం తదయం సోఽహమితి సన్త్యజ్యవాసనామ్ ।
ఏకనిష్ఠతయాఽన్తస్థ సంవిన్మాత్ర పరోభవ ॥

అనగా ఇదినాది, అది, ఇది, నేను అను వాసనలను వదలిపెట్టి కేవల సంవిత్స్వరూపమందే అంతర్నిష్ఠగలవాడవు కమ్ము.

శ్లో॥ మలం సంవేద్యముత్సృజ్య మనో నిరలయన్ పరమ్ ।
ఆశాపాశానలంఛిత్వా స్వసంవిత్తిమయోభవ ॥

అనగా దృశ్యమనేమలమును పరిత్యజించి, మనస్సును స్వచ్ఛముగా జేయుచు, కోరికలనే పాశముల సంపూర్ణముగా త్రెంచి స్వస్వరూపమైన చిన యుడవు కము .

శ్లో॥ ఉపేక్షితే లౌకికే ధీ ర్నిర్విఘ్న బ్రహ చింతనే ।
నటవ ద్వ్రమాస్థాయ త్తి నిర్వహత్యేవ లౌకికమ్ ॥

లౌకిక వ్యాపారములందుపేక్షజేసి బ్రహ చింతనమందే బుద్ధిని ఉంచిన నటకుని వృత్తివలె లౌకిక వ్యవహారముకూడా సిద్ధించును.

శ్లో॥ బుద్ధింనియమ్య నైవోర్ధ్వం ధారయేన్నామరూపయోః ।
ప్రాగనభ్యాసినః పశ్చాద్బ్రహ్మాభ్యాసేన తద్భవేత్ ॥

మొట్టమొదట బుద్ధిని నియమించి, తరువాత నామరూపములను చింతించక పోయినచో ప్రథమతః విషయానుసంధానరహితునికి తరువాతచేసిన బ్రహ్మాభ్యాసముచే తత్స్వరూపము సిద్ధించును, అని వసిష్ఠభగవానులు రాజైన శ్రీరామచంద్రునకు చేసిన ఆత్మానుసంధానోపదేశమైయున్నది. గాన ఎవ్వరికైనను ఇట్టి బ్రహ్మానుసంధానమె సాక్షాన్ముక్తి సాధనముగాని మరియొకటి కాదు. ఇటుల తెలుసుకొన్నను ఇచట ఒక చిన్న శంక కలుగును. ఏమనగా— ఇట్లు సర్వదా బ్రహ్మాభ్యాసము జేయుట సంసారములోనున్న గృహస్థాది సామాన మానవులకు సాధ్యమా ! అని తలంపవచ్చునుగాని, ఈ శంకకు ఎంతమాత్రము అవకాశముకనబడుటలేదు. ఇట్టి సందేహమును నివృత్తిజేయుటకే పరమేశ్వరుడు మానవరూపుడై, అందులోను సంసారనిమగ్నమైన రాజవంశములో సంసారియై శ్రీరామచంద్రుడు జ్ఞానసంపాదన విధివిధానములను తాననుసరించి లోకమునకాదర్శమును జూపియున్నాడు. జీవిత, స్థితి, కార్యములన్ననో, రాజ్యభారముగల బలి, ప్రహ్లాద, రామ, యుధిష్ఠిరాదులకెక్కువయో, లేక మనలకో, పండితవర్యులే యూహింతురుగాక. వీరందరు పౌరాణిక దేవ సంభూతులు—అవతారపురుషులు—గాని సామాన్య మానవులమైన మనకు సాధ్యమా యనుకొనవచ్చును. ఇట్లనుకొనుటకున్నూ అవకాశము కనబడుట లేదు. ఏలనన కొద్ది శతాబ్దముల క్రిందటివారైన విద్యారణ్య-అప్పయ దీక్షిత-మధుసూదనసరస్వతి ఇత్యాదులు బ్రహ్మవిద్వరిష్ఠులై వారు రచించిన అద్వైత శాస్త్రసిద్ధాంతబోధక గ్రంథములచే ఇప్పటికిన్నీ వారు ప్రకాశించుచున్న విషయము పండితలోకమంతకును విశదమేకదా ! ఇందులో విద్యారణ్యస్వామి 'మన్త్రిమాధవః' అనిన వారి లౌకిక ప్రావీణత, బాధ్యతలెంత ఉంచవలయునో యూహించవలయును. ఇదిగాకను, సుమారు ఈ శతాబ్దములోనే శ్రీరామకృష్ణ పరమహంస — వివేకానందులు—స్వామిరామతీర్థ — స్వామిశివానంద— ఇత్యాది మహనీయులు బ్రహ్మత్వమునుపొందిన విషయము లోకప్రసిద్ధమే

గదా ! గనుక ఇంకను లోకమునకు తెలియబడని బ్రహ్మజ్ఞులెందరోయుండ వచ్చును గదా! గనుక ఇట్టి విద్య దుర్ఘటము, మనకసాధ్యమని తలంచ కూడదు. ఇదిగాక గృహస్థాశ్రమములోనుండి జ్ఞానపరులై బ్రహ్మవిద్వ ర్యులై 'సన్న్యాసప్రాయవాంశ్చ" అనునట్లు ప్రారబ్ధానుపరులై ముక్తిని బడ సిన ఉత్కృష్టవులు మహనీయులెందరో యుండవచ్చును. గాన ఇట్టి బ్రహ్మ విద్యానుసంధానము సర్వులకు గ్రాహ్యము, సాక్షాన్ముక్తిదాయకమైయుండునని వేరుగ జెప్పనేల! ముముక్షువునకు ఇంకొక సందేహమును నివర్తింపజేసికొనుట యావశ్యకము. ఏదియనగా—జ్ఞానమనునది కనబడు వస్తువుకాదే, దీనినెట్లాశ్ర యించుట ? అని తోచవచ్చును గాని లోకానుభవములో గూడ మనకు అన్ని వస్తువులు ప్రత్యక్షములుగా లేవు, వాయువు అనుభవముచేతగాని వస్తుసంశ్లేష, చలనములవల్ల గాని గ్రహింపబడుచున్నదే గాని స్వరూపతః కాదు. ఇట్లే యిప్పుడు ఆధునికమైన విద్యుచ్ఛక్తియునూ గూడ ఉదాహరణముగ కనబడు చున్నది. కేవల విద్యుచ్ఛక్తిస్వరూపమెవ్వనికిని తెలియబడుట లేదుగాని ఇదియే ఉపాధి సంశ్లేష సంయుక్తమైనప్పుడు దీని శక్తి యెంతయున్నది—ఎట్లున్నది— ఉన్నదాలేదా అని మన యనుభవమునకు గోచరమగుచున్నది. గాని నిరుపాధిక ముగ కనబడదు. ఇట్లే యీజ్ఞానము నిరుపాధికముగాన కనబడదు—కాని విద్వాం సుడు అంతఃకరణ వృత్తిద్వారా ఇట్టి జ్ఞానమును తెలిసికొనవలయును. వేరు దారి లేదు. ఇట్లు అనుభవము కలిగిన పిదప[redacted]జ్ఞానము మాత్రమే నిలచి వృత్తి నశించును ఈ వృత్తియే చరమవృత్తి. ఇట్టి జ్ఞానమే సత్యరూప జ్ఞానమనబడును. ఇదియే సాక్షాత్కారము, ముక్తియు అగుచున్నది. కాని అభ్యాసకాలములో ఇచట ఒక రహస్యమును గ్రహించవలసియున్నది. ముముక్షువు ఎంతవాడైనను అజ్ఞాన కాలములోవలె జ్ఞానకాలములో కూడా అతనికి ప్రారబ్ధబలమువల్ల అవశుడై కొంచెమైనను పాపకార్యములు చేయవలసివచ్చినచో చేయకతప్పదు. ఐనను అత నికి తత్త్వజ్ఞానబలముండుటచే ఈ క్రియనిషిద్ధమైయున్నను, అది సంసారికిలెవ అతనిని బాధించదు, సంసారి సదేహుడై తన అపరిచ్ఛిన్నత్వ పూర్ణత్వములను మరచినవాడు. జ్ఞాని ఈపరిచ్ఛిన్నత్వాదులను త్యజించి తన సచ్చిదానందస్వరూప

మును గ్రహించినవాడు గాన అజ్ఞాన్యధికారికమైన విధి నిషేధములు ఇతనిని బంధించవు. ఈలాగున నిషిద్ధాచరణము అత్యంత ప్రబలప్రారబ్ధమున్నప్పుడే సంభవించునుగాని సామాన్యముగా జ్ఞానియొక్క ప్రవృత్తి నిషిద్ధముగా ఉండుటకు వీలుండదు గాన ఈ శంకకు తావులేదని శాస్త్రము చెప్పుచున్నది. ముముక్షువగు అభ్యాసకుడు తన గతమును చింతింపక అవియన్నియు భ్రాంతి యుతుడై లోగడ చేసిన తన అంతఃకరణ ధర్మములుగాని, తనవికావు, తనకు అంతఃకరణముతో ఎట్టి సంబంధమూ లేదు. ఈ యన్తఃకరణము తనకు సాధనము గాని తానుకాదు, అను నిశ్చయముతో తను ఇప్పుడు సచ్చిదానంద స్వరూపుడైన అఖండ పరిపూర్ణ చైతన్యమాత్రుడేనని అనుసంధానమును చేయవలయును. విద్వాంసుడు గతించిన దానిని గురించి చింతింపకూడదు. దీనినే—

శ్లో॥ భూతం న కిమపి చింతయతి, భావిచ కించిన్న చింతయతి ।

అని వచనము తెలుపుచున్నది. ప్రతి మానవుడున్నూ తన పూర్వ ప్రారబ్ధకర్మనుబట్టి యీ జన్మయందు "బుద్ధిఃకర్మానుసారిణీ" అను శాస్త్ర వచనమునుబట్టి తన బుద్ధి ప్రేరితుడై కర్మలను చేయుచుండును. ఇట్లు చేయుటలో తన సుఖశ్రేయస్సులను ప్రతివాడును కోరుచుండును. ముముక్షువైనవాడు తన నిత్యనిరతిశయ సుఖస్వరూపమును పొందదలచి ప్రయత్నము చేయువాడు ఇట్లు తమ బుద్ధి ప్రేరణతో చేసిన కర్మములు శాస్త్రానుకూలముగా నున్నవా, శాస్త్రవిరుద్ధముగానున్నవా అని పరిశీలించుకొనుట ఆవశ్యకము. ఎందుచేతననగా పైన చెప్పిన వివిధ జీవులును ఏదోయొక విధమున సుఖమును కోరువారై యున్నారు. ఇట్టి సుఖమును పొందుటకు ఏమి చేయవలయును? ఎట్లు చేయవలయును? అని తెలుసుకొనుటకు ప్రమాణము శాస్త్రమే నని,

శ్లో। తస్మా చ్ఛాస్త్రంప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥

అనగా నీ కర్మాచరణలో ఇది చేయతగినది, ఇది తగనిది అను నిర్ణయమునకు శాస్త్రమే ప్రమాణముగా నుండవలయును. కనుక నీవు శాస్త్రముచే బోధింపబడినకర్మ మంచి చెడు అను విమర్శ లేక చేయవలెను. అని, భగవంతుడు చెప్పి, పైన—

శ్లో॥ యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతేకామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్ ॥

అనగా ఎవడు శాస్త్రమును వదలిపెట్టి తన యిష్టానుసారముగ వర్తించునో అతనికి మోక్షసిద్ధిగాని, ఉత్కృష్టగతికాని ఉండనేయుండదు, అని చెప్పుచున్నాడు గావున తాను చేసే పనులను చేయుటకున్ను, చేయకపోవుటకున్ను శాస్త్రమునే ప్రమాణముగా నుంచుకొనవలయును.

కాన సుఖము గోరు ప్రతి జీవుడును ఇట్లు తెలుసుకొని తన కర్మలను చేయవలయును. ఈలాగున సత్కర్మానుష్ఠానాదులవల్ల మనకు అభ్యుదయము కలుగును. ఇట్టి కర్మలే నిర్మానముగ అనగా మోక్షేచ్ఛతో చేసిన యెడల చిత్తశుద్ధి కలుగును. అది కలిగిన తరువాత మోక్షార్థియైనవాడు ఈ కర్మలవల్ల తనకు కలుగు పుణ్యపాపములు రెండున్నూ కలుగకుండునట్లు చేసుకొనవలయును. ఏలనన కర్మ మెట్టిది యైనను, ఎంతకాలమునకైనను ఫలమును ఇచ్చి రవలయును. ఈ సత్కర్మలు అత్యావశ్యకమైన అభ్యుదయము నిచ్చుచూ, చిత్తశుద్ధిని ఇచ్చుట మూలముగనే మోక్షము నీయగలవు. ముక్తియనగా నిరతిశయ పరిపూర్ణ శాశ్వత సుఖ స్వరూపము. కాన ప్రారబ్ధ ఫల ప్రేరితమైన కర్మలను ముముక్షువు ఆచరించవలసియున్నను, అట్టి పుణ్య పాప రూప కర్మలు తనకు బంధకములు కాకుండునట్లు ప్రయత్నము చేయవలెను. ఇట్లు చేసుకొనుటకు ఒక్క ఉపాయమును శాస్త్రము తెలుపుచున్నది. అది యేదియన—తను ఈ కర్మలయొక్క కర్తృత్వాద్యభి

మానములను వదలుకొనుటయే. ఇట్లు చేయుట సాధ్యమా ? అనిన యెడల, సాధ్యమనియు, నిశ్శ్రేయసమును కోరువాడు ఇట్లే చేయవలయుననియు,

శ్లో॥ తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

అనగా ఎప్పుడు చేయవలసిన సమస్త కర్మలను అభిమానసక్తతారహితముగ చేయుము. ఈలాగున కర్మచేయు పురుషుడు శ్రేష్ఠ పురుషార్థమగు మోక్షమును పొందగలడు. అని గీతావచనము చెప్పుచున్నది.

కర్మ ఫలములు సదా కర్తనాశ్రయించియుండును. ఈ కర్తృత్వాదులు పరిచ్ఛిన్నత్వ భిన్నత్వము లున్నప్పుడే కలుగుటకు సాధ్యముగాని, అవి లేనిచో కలుగుటకు వీలుండదు. ఈ విషయమంతయు కర్తృత్వాభాస నిరూపణమందు లోగడ విపులముగా వివేచన చేయబడినది. గాన అందు తెలిపిన విధమున ముముక్షువు తన స్వరూపము పరిపూర్ణ అద్వితీయమని నిశ్చయమును పొందవలెను. శ్రవణాదులచే ఇట్లు తెలిసికొని దీర్ఘకాలానుసంధానాదుల పరిపాకపాటవముచే తన అద్వితీయ పరిపూర్ణ స్వరూపానుభవమును పొందిన యెడల ప్రారబ్ధానుసారమున తను చేయు కర్మ ఫలము లాతనిని బంధింపజాలవు, గాన అట్టి వారికి ఈ కర్తృత్వాదులు వాటి యంతట అవియే నశించును. తానుమాత్రము నిత్యనిరతిశయ సుఖస్వరూపముతో శేషించును.

ప్రారబ్ధానుసారమున ప్రాప్తమైన కర్మలను అభిమాన సక్తతారహితముగా అనుభవించుచూ స్వల్ప దోషమైనప్పటికినీ ధనార్జనము మొదలైన వాటిని చేయు ముముక్షు గృహస్థునకు అతి లాభము సిద్ధించునని వసిష్ఠులవారు ఈ విధమున చెప్పుచున్నారు.

శ్లో॥ దేశక్రమేణ ధన మల్ప విగర్హణేన తేనాంగ సాధుజనమర్జయ
మానపూర్వమ్ ।
తత్సంగమోత్థ విషయాద్యవహేళనేన సమ్యగ్విచార విభవేన
తవాత లాభః ॥

దేశకాలాదుల ననుసరించి అల్పదోషముతో ధనము నార్జించి దానిచే గౌరవపురస్సరముగ సాధుజనులు సంగ్రహించి వారి సహవాసమువలన ఏర్పడిన విషయ వైరాగ్యముచే తత్త్వ విచార సంపత్తి మూలమున నీకు ఆత్మ లాభము గలుగును, అని వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు

జ్ఞానాభ్యాసకుడు ముముక్షువు. ఔపచారికముగా గ్రంథమందు యిట్టి ముముక్షువునే జ్ఞాని యనిగూడ వ్యవహరించుచున్నాము. ఏలనన వాస్తవమైన జ్ఞాని తత్స్వరూపుడేగనుక యింద్రియ గోచరుడు కాడు. ఇంద్రియ గోచరుడగు జ్ఞానాభ్యాసకుడు గూడ ఆ తరగతిలోనివాడేగనుక, శాస్త్రము పూర్తి కాకపోయినను తర్కశాస్త్రము కొంత చదువువారినైనను తార్కికులనియూ, అట్లే వైయాకరణులనియూ, వేదాన్తులనియు వ్యవహరించుచున్నట్లు యిచట గూడా చెప్పబడు చున్నాడు. అయిననూ యెట్టి ముముక్షువు యెంత జ్ఞాని యైననూ శరీరధారియై యున్నంత కాలము వ్యవహారిగానే యుండును. ఏలనన శరీరధారణ యున్నంత కాలము ప్రారబ్ధానుగతమైన శరీరధర్మములు విడువవు. ఈ ప్రారబ్ధము అంతఃకరణ ధర్మము. ప్రారబ్ధమున్నంత కాలము అంతఃకరణము వుని విడువదు. -వుడు తాను అజ్ఞానకాలములో చేసిన అనాది కర్మ ఫలము, వర్తమానోపాధితో అనుభవమునకు సిద్ధమైన కర్మ ఫలము ప్రారబ్ధమనబడును. ఇది మహా బలయమైనది. అనుభవముచే గాని నశించదని వచనములు తెలుపుచున్నవి. ఈ జ్ఞానాభ్యాసకుడు గూడ ఇట్టి పరిస్థితులలోని వాడే. అయినను ఒకానొక మానవుడు ఒక్క గొప్ప ఆస్తికి తాను ఉత్తర వారసునని విని తన వంశ వృక్షమంతయూ బాగుగ పరిశీలించి విచారించి యీ ఆస్థికి తాను తప్ప మరితరులెవ్వరునూ ఉత్తర వారసులు లేరు,

ఆస్తితనకే వచ్చునని నిశ్చయించి అట్టి జ్ఞానమును పొంది తదనుకూలముగ వ్యవహరించునట్లు ఈ జ్ఞానియైన వాడు కూడ యట్లే వ్యవహరించును. ఎట్లన జ్ఞాని, వ్యవహారులిద్దరికిని తామే యుత్తర వారసులమను నిశ్చయము, తృప్తి, సంతోషములును గలవు. ఇద్దరును ఉత్తర వారసులే, కాని సద్యః ఫలానుభవము లేదు. ఎట్లన, వ్యవహారికి వాని సాక్షాదనుభవమునకు ప్రస్తుతము ఎనుబది అయిదు సంవత్సరములు దాటిన వారసజీవి యొకడుండును. అట్టిచో యావదాస్తి పరిపాలనా భోగములు అచిరకాలములో తనకు తప్పక వచ్చునను సంతోష నిశ్చయములతో కాలము గడుపుచుండును. ఇది గాక తన ఉత్తర వారసత్వహక్కు లాభమును గూడ ఎట్లు తానిప్పుడనుభవించుచున్న గృహ క్షేత్రాదులు తనవి కావను జ్ఞానముతో తాత్కాలికావుసరమైన మరమ్మతులను చేయించుచూ తన జీవితమున కెట్లు వాటి ప్రయోజనమును పొందుచుండునో అట్లె యీ జ్ఞానియైన వాడు యీ భౌతిక శరీరాంతఃకరణములు తాను కాననియూ, యీ దృశ్య పదార్థములు వాస్తవమున, తనవి కావనియూ గ్రహించిననూ యాత్రికులు ధర్మశాల ననుభవించులాగున ననుభవముల చేయుచూ జీవ యాత్రను గడపు చుండును. సక్తతా మానములు క్షీణించిన వాడై యుండును. సత్రశాలలో యున్నంత కాలము యాత్రికుడైనను తనకు కావలసిన వసతి పరిశుభ్రతలను చేసుకొన వలయునుగదా.

కొందరకు యిచట యొక చిన్న సంశయము కలుగవచ్చును. అది యేదియన లోకమునందు వ్యవహారములోని ఉత్తరవారసు తన వర్తమాన వారసు వయసును, వారసునియొక్క వయః పరిణామమునుబట్టి తన వర్తమాన వారసు వార్ధక్యమును పొందినట్లు తెలుసుకుని తనకు సంపూర్ణాధికారము అచిరకాలములో రాగలదను నిశ్చయముతో నుండును. అట్లుగాక తన వర్తమాన వారసు బాలుడుగాగాని, యువకుడుగాగాని యుండినయెడల నిరుత్సాహము చెంది తన లాభమును సంశయించుచుండునుగదా. కాని యీ జ్ఞానాభ్యాసకుని వర్తమాన వారసుయైన యాతన అంతఃకరణ మనెడి వారసు ప్రస్తుతము యే వయః పరిణామములో యున్నదినీ, బాలుడో, యువకుడో,

వృద్ధో యెట్లు తెలియును జ్ఞానికి తన వర్తమాన వారసు బాలుడుగాగాని, యువకుడుగాగాని తను ఆశించు అచిరకాల స్వలాభ ప్రాప్తియుండదుగదా. ఈతని అంతఃకరణ వర్తమానవారసు బహువృద్ధని మీరెట్లు నిశ్చయించగలరను శంక కలుగవచ్చును. కాని ఈ శంక సరియైనదికాదు. ఏలనన యీ జ్ఞానాభ్యాసకుడు తన శ్రవణ, మనన, నిదిధ్యాసనాద్యభ్యాస పాటవబలముచే తన వర్తమాన వారసుని బలమును తగ్గించివైచును. కాని వాడు జీవచ్ఛవము లాగున యుండును. ఈ సంగతి జ్ఞానియైనవాడు తన అభ్యాసాదులవలన గలిగిన జ్ఞానపటిమచే గ్రహించగలడు. అట్టి అభ్యాసపటిమవలన జ్ఞానదారుఢ్యము కలిగినవాడే తన వర్తమాన అంతఃకరణవారసు క్షణకాలములో యున్నాడనియూ, ప్రారబ్ధాంతమున తనను వదలి వెళ్లుననియూ నిశ్చయముతో తెలుసుకొనగలడు. ప్రస్తుతము వార్ధక్యముననున్న తన అంతఃకరణ ధర్మములను అతి వార్ధక్యములో నున్న గృహయజమానుని మాటలన్నియూ బంధుజనము పాటించనట్లు పాటింపక, అయినను తప్పునదికాదుగనుక ఈ జ్ఞాని గూడా తన స్థితి దేహధారణానుకూల వ్యాపారములను మాత్రము ప్రారబ్ధానుసారము యథాప్రాప్తముగ నాచరించుచు వనుక్తి సుఖముతో ప్రారబ్ధము ననుభవించుచుండును. ఆత యాథార్థ్యజ్ఞానము గల పురుషుడు జ్ఞాని యనబడును. దేహధారణతో యున్నంతకాలము యీ జ్ఞానియైన వానికి ఉభయ భాషావిదునిలాగున వ్యవహార, పరమార్థజ్ఞానములు రెండునూ యుండును. అట్లే వ్యవహరించుచుండును. ఈ విషయమునే క్రింది యీ సురేశ్వర వచనము స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ సర్వ మేవానుజానాతి, సర్వమేవనిషేధతి,
భేదాత లాభోఽనుజ్ఞాస్యాన్నిషేధోఽతత్స్వభావతః॥

ఇట్టి జ్ఞాని తన హృదయమందు స్వచ్ఛమైన ప్రతగాత్మ స్వరూపమును గాంచుచుండి సకలమైన అంతఃకరణాది ప్రపంచము కలదనియూ, లేదనియూ దలంచుచుండును. అది ఎట్లనిన వ్యవహార స్వభావముచే తన

ప్రారబ్ధ ఫలానుభవముకు సకలమైన ప్రపంచము కలదనియూ, ఆత్మ స్వభావము ననుసరించి ప్రపంచమేమియూ లేదని భావించుచుండును—అని తెలుపుచున్నారు.

అందువలననే జ్ఞాని యనుభవములు సక్తతా మానములు లేనివై యుండును—అనగా క్షీణించి యుండునని శాస్త్రము తెలుపుచున్నది.

ఇట్లే ఈ జ్ఞానియైనవాడు తన వంశవృక్షమును గూడ శాస్త్రబోధవలన బాగుగ తెలుసుకొని తానే పరిపూర్ణుడైన వారసునని నిశ్చయమును పొందును. అట్టి నిశ్చయముతోడనే తృప్తి సంతోషములతో తనప్రారబ్ధమును గడుపుచుండును. కాని ప్రారబ్ధగతమైన యీ అంతఃకరణ వర్తమాన వారసు విడువదు. అయినను యిట్టి జ్ఞానియైనవాడు నిత్యతృప్తుడై జీవన్ముక్తి సుఖముతో యథా ప్రాప్తానుభవమును చేయుచూ తన ప్రారబ్ధక్షయమునకుగాను నిరీక్షించుచుండును.

## ముముక్షువునకు విధి, కర్తవ్యతలు

ఇచట ముముక్షువనగా నెట్టివాడనిన సాధన చతుష్టయ సంపద్యనంతరము, గుర్వీశ్వరానుగ్రహములను సంపాదించి—జగని ధ్యాత్వ నిశ్చయ జ్ఞానము కలిగి శ్రవణమననాదికము వల్ల తన సత్యస్వరూపమును బాగుగ తెలుసుకొని స్వానుభవమునకుగాను నిరంతరాభ్యాసాదులను చేయుచుండువాడు. ఇట్టివానికి ఈ బ్రహ్మవిద్యానుసంధానప్రక్రియ రసాయన సేవవంటిది. కాని యీ బ్రహ్మానుసంధానాభ్యాసము, స్వానుభవఫలమును బడయుట మాసములు, సంవత్సరముల లెఖ్ఖతోగాక జన్మలలెఖ్ఖన, అనగా ఫలావగతి పర్యంతము అనుసంధానాదులను యాచరించుట యీ ముముక్షువునకు కర్తవ్యమై

యున్నది. ఇట్టి అనుసంధానాదులను నిర్విఘ్నముగను తనవిక్షేప ఆవరణాది చిత్తదోషరహితముగను అభ్యసించు సాధన దార్ఢ్య సిద్ధికొరకు, సాధుసంగమ సచ్ఛాస్త్రములు, శ్రవణాదికమును శాస్త్రము విధించుచున్నది. ఈ సాధు సంగమ సచ్ఛాస్త్రశ్రవణాదికములవల్ల, ముముక్షువునకు చిత్తశాంతియును, జగన్మిథ్యాత్వ జ్ఞాన నిరూఢియు వృద్ధియగుచూ, తన సాధనాభ్యాసములకు సహకరించును. ఎట్టి వారికైననూ ప్రారబ్ధానుభవము బలీయమై విధిగా కన బడుచున్నది. వారువీరు యననేల మహనీయులైన జ్ఞానులకుగూడ ప్రారబ్ధ కర్మ ఫలానుభవము తప్పుటలేదు. ఇక మోక్షార్థియైన సాధకుడు అనగా యీ ముముక్షువు విషయము చెప్పనేల? ఇట్టి ప్రారబ్ధ కర్మ ఫలానుభవములు వారివారిప్రారబ్ధకర్మఫలమునుబట్టి సుఖ, దుఃఖ, భోగ, క్లేశములు చిత్రవిచిత్ర ములుగా న్యూనాధిక్యతలతో అనుభవములు వునికి సంప్రాప్తమగుచుండును. ఇట్టి అనుభవములలో సాధకుడైన యీ విద్వాంసుని గూడ కర్తృత్వాది దేహా ధ్యాసములు బలీయములై అనుభవముల నిచ్చుచుండును. ఈ సాధకునకు తన ప్రారబ్ధకర్మ ఫలానుసారమున మిక్కుటమైన భోగైశ్వర్యములుసంభవించిననూ లేక అతిదుఃఖ క్లేశములు సంభవించిననూ యీ దృశ్యానుభవములను తన కర్తృత్వాది దేహాధ్యాసములతో తనయొక్క జగన్మిథ్యాత్వ జ్ఞాననిరూఢి చాలక, దృశ్యానుభవములయందు తనకు వాస్తవికత బుద్ధిని కలుగజేసి తన జ్ఞాన స్థైర్యమును లోపింపజేసి, తన ఆశయ, అభ్యాసములకే భంగము కలి గించును. ఇట్టిది సహజము. ముముక్షుజిజ్ఞాసువులకు బహుప్రమాదము. కాన ముముక్షువైనవాడు శాస్త్రశ్రవణాదులచే జగన్మిథ్యాత్వ జ్ఞానము సంపాదించి ననూ; తన వితానుభవము లందునూ పర వితానుభవములనుగూడ బాగుగ శాస్త్ర, యుక్తి, అనుభవములతో వివేచనచేసి సతతము యీజగదసత్యస్థితిని అనగా మిథ్యాత్వమును సర్వదా గ్రహించుచునే, తన జగన్మిథ్యాత్వభావనను దృఢపరచుకొనవలయును గాని వేరుదారిలేదు.

ఇంతచేసిననూ యీ దేహతాదాత్మ్యతా, కర్తృత్వా మానములు వుని విడువక క్లేశ దుఃఖములను కలిగించుచునే యుండును. వునికి యిట్టి క్లేశ

దుఃఖములు ముఖ్యముగా విషయభోగా లాషల వల్లనూ విషయ చింతనవల్లనూ కలుగుచుండును. ఎంత విరాగియైననూ యీ విషయవాంఛలు యేదోయొక విధమున క్రిందికి అనగా సంసారమున పడత్రోయుచునే యుండును. దానినే:

శ్లో॥ విషయా ముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః ।
విక్షేపయతి ధీదోషైర్యోషా జారమివ ప్రియమ్ ॥

జారునియందు స్త్రీ పరపురుషుని జూచి తన హావభావవిలాసములచే వానిని మోహింపజేయునట్లు సత్పురుషుడైననూ, పండితుడైననూ, విషయా వాంఛితుడయ్యేనేని విస్మృతి కలిగించి తన ఆత్మతత్వచింతనమునుండి మరలించి నానావిషయ ప్రవృత్తులను కలిగించి భోగలంపటునిగ చేసి చెరచునని శ్రీ శంకర భగవత్పాదులు తెల్పుచున్నారు. ఇంకనూ శ్రీ వశిష్ఠభగవానులు యీ విషయభోగ చింతనాదులచే కలుగు విషము వునికి సర్పవిష ప్రమాదము కన్నను అధిక ప్రమాద హేతువని తెల్పుచున్నారు. ఎట్లన సర్పవిషము యీ జన్మమునందు మాత్రము ప్రమాదమును కలిగించును. కాని విషయభోగ చింతనాదులవల్ల కల్గువిషముసంకల్ప, సంస్కార, వాసనారూపముల బరిణమించి అనేకజన్మలనుచెరచును. కాన ముముక్షువైన వాడుతనస్థితి, దేహధారణావశ్యకమైన విషయములను మాత్రము యెట్టిసక్తతా మానచింతలు లేనివాడై, ప్రారబ్ధకర ఫలానుసారమున యనుభవించుచుండ వలయును. అప్పుడు తన కర్తృత్వాభిమానరహితముగ అనుభవించుకర్మ ఫలానుభవములు తనకు పునర్జన హేతువు కాజాలవని శాస్త్రము తెలుపుచున్నది. కాన ముముక్షువునకు -వైరాగ సంపాదన మావశ్యకమైయున్నది. ఇందుకుగాను ముముక్షువునకు సర్వదా సర్వవిధములచేతను యీ స్వశరీరసర్వ దృశ్యానుభవముల అవాస్తవికతను అనగా అసత్యత్వమును శ్రుతి, యుక్తి, అనుభవములతో విచారణ చేయుచుండుట ఆవశ్యమై యున్నది. ఇట్టిజగన్మిథ్యాత్వ జ్ఞాన సతతాభ్యాసముల వల్ల కాలక్రమేణ యీ ముముక్షువునకు కోరికలు క్షీణించి తన ప్రారబ్ధ కర్మఫలానుభవములందుకూడ అనుభవములను

ఆభాసమాత్రముగను తాత్కాలికముగను యిచ్చుచుండును. ఈ స్వశరీర సహిత జగని ధ్యాత్వజ్ఞాన నిరూఢియే ముముక్షువునకు దృశ్యానుభవ దుఃఖము లను నిమిత్తమాత్రముగ కల్గించుచూ, తన స్వస్వరూపానుసంధానాభ్యాసము లకు తోడునీడగ యుండును. అప్పుడు తన జ్ఞానాభ్యాసాదులను పటిమతో యాచరించుటకు సమర్థుడగును ప్రజ్ఞ కలుగును. అయిననూ ముముక్షువునకు యీ ప్రజ్ఞను సంపాదించినంతమాత్రమున తన కార్యసిద్ధి కాజాలదు. ఏలనన యీ ప్రజ్ఞ దృశ్యత్యాగజ్ఞానమువరకే సిద్ధించును. కాని ముముక్షువునకు సర్వదృశ్యత్యాగము, సత్యస్వస్వరూపగ్రహణము కావలసియున్నది. ఈ జ్ఞానముగూడ జగని ధ్యాత్వజ్ఞానములాగుననే ఒకసారి తెలుసుకొని స్మరించి నంతమాత్రమున నిలుచునదికాదు. ఏలననగా యీ జీవుని అనాది అవిద్యా కామ కర్మలవలన విక్షేప ఆవరణాది దోషములు తన చిత్తమును విడువక సతతము బాధించుచుండును. ఏలనన యీ సంసారదుఃఖమంతయూ జీవునికి తన అఖండ, అద్వి య, పరిపూర్ణ, సచ్చిదానంద స్వరూపమును అనాది అవిదా భ్రాంతియుతుడై మరచి దృశ్యపరిచ్ఛిన్నత్వ, వికారిత్వములను నామ రూపములతో వాస్తవములని నమి తన అవిద్యాదోషమువలన గ్రహించుటచే కలుగుచున్నవి. కాన తన అవిద్యను నిరూ లించుట ముముక్షు కర్తవ్యము. ఇవి జీవునికి అనాదిదోషములు గనుక యిట్టి తన అనాది అవిద్యాదోషములను పోగొట్టి, కేవల విద్యారూపమైన తన స్వస్వరూపమును బాగుగ గ్రహించి స్వాను భవము పొందుటకు ఈ బ్రహ్మానుసంధానము చిరకాల సతతాభ్యాసము చేయ వలయును. అట్లు చేయగా కాలక్రమమున భ్రమరకీటక న్యాయమున యీ ముముక్షువు తన అభ్యాస పటిమచే తన వాస్తవస్వరూపమైన పరబ్రహ్మ స్వరూప మును తాను పొందునని శాస్త్రము చెప్పుచున్నది. కాన ముముక్షువునకు యీ బ్రహ్మానుసంధానము అమృతము సేవించుట వంటిది. జగని ధ్యాత్వజ్ఞాన నిశ్చ యమును సంపాదించిన ముముక్షువునకైననూ, తన సత్యస్వరూపజ్ఞాన నిశ్చ యానుభవములు పొందువరకునూ కర్తృత్వాది దేహాధ్యాసములు బాధించుచునే యుండును గనుక వాటి నివారణార్థమై తన స్థూలసూక్ష్మ శరీరముల అవాస్త

వికత అనిత్యత్వములను పలువిధముల సర్వదా స్వ, పరానుభవములనుబట్టి విచారణ వివేచనలుచేసి వాస్తవమును నిత్యానిత్యవివేక పూర్వకముగ గ్రహించు చుండుట ముముక్షువునకు విధియై యున్నది. ఇట్లు గుర్వీశ్వరానుగ్రహము తోనూ, శాస్త్రజ్ఞానముతోనూ స్వశరీర సర్వదృశ్య మిథ్యాత్వ నిశ్చయజ్ఞాన మును యెంత సంపాదించిన అంత చిత్త స్థైర్య విశ్రాంతి కలుగుచూ తన సత్య స్వస్వరూపానుసంధానమునకు అంతంత అనుకూలించుచుండును. కనుక ముముక్షువు కేవల వాగ్రూపమున అనుసంధానశబ్దము నుచ్చరించుచున్నమాత్ర మున అతిశయఫలము కలుగక ... ఘ ఫలపర్యవసానము కాజాలదు. కనుక అహం నేను అను తనకు పరిచ్ఛిన్నత్వము, కర్తృత్వాదులవలన కలుగుచున్న అనుభవములు తన అజ్ఞాన కాలకృత ప్రారబ్ధకర్మ ఫలములు గనుక యిప్పుడు తనకు కలుగుచున్న అనుభవ సముదాయ మంతయు కేవల తన భ్రాంతి మాత్రము కల్పితములు అవాస్తవములని గ్రహించిననూ ప్రారబ్ధకరా నుభవ మెవ్వరికినీ తప్పదు గనుక అట్టి అనుభవములను అవాస్తవికములని దృఢ నిశ్చయ జ్ఞానముతో యనుభవించవలయును ముఖ్యముగా ముముక్షువైన జిజ్ఞాసువునకు తెలియవలసినదేమనగా తనకు యిప్పుడు కలుగుచున్న పరి చ్ఛిన్న, స్వభిన్న, విచిత్ర, వికారిత్వ ధర ములు తనయొక్క స్థూల, సూక్ష శరీరముల ధర్మములేకాని, అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపుడైన తనకు యెట్టి ధర మును ఉండుటకు వీలులేదని గ్రహించి దృఢానుభవమును పొందవలయును. ఇంకనూ యీ దృశ్య పరిచ్ఛిన్నత్వ, వికారిత్వములను చూచునపుడును అనుభవించునపుడును యివి యన్నియు బ్రహ్మవివర్త స్వరూ పములేగాని బ్రహ్మ భిన్నమేదియు కాదని "యథైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం స్యా ద్వికారో నామధేయో, మృత్తికేత్యేవ సత్యమ్" అను వచ నము చెప్పిన ఒక్కటియైన మృత్పిండము అనేక ఘటశరావాదులుగ కన బడుచున్ననూ, కల్పితనామరూపములను నివేసిన వాటి యన్నిటియందు సత్యమైన పదార్థము మృత్తు ఒక్కటియే యగుచున్నట్లు యీజగద్భిన్నత్వ, పరిచ్ఛిన్నత్వ, వికారిత్వ పదార్థములన్నిటికినీ అధిష్ఠానము బ్రహ్మ యొక్క

టియే యనిన్నీ తదితరములన్నియూ కల్పితములనిన్నీ యెరుగవలయును. ఈ దేహమందు నామరూపములు కల్పింపబడి యిదియే నేను అనుభ్రాంతి కలుగుచున్నది. ఇదియంతయూ కల్పితము. ఇట్లే యీ నాయొక్క స్థూలదేహములో నున్న సూక్ష్మ దేహము లేక అంతఃకరణముగూడ విచారించినయెడల నేను అనునది అగుటకు వీలులేదు. ఇదియును నాపనిముట్టు మాత్రమే అయి వున్నది. కాని యిది మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, యను పరిణామములతో కూడుకొని నన్ను భ్రాంతియుతునిగాజేసి సదా సుఖదుఃఖములతో కూడిన సంకల్ప సహిత కర్తృత్వాద్యహంకారములను కలుగజేయుచు నన్ను-నేను, నాది అను అ మానములతో యీ దృశ్య సంసారమునందు నిమగ్నుని చేయుచున్నది. బాగుగ విచారించి వుని యనుభవములను బట్టి చూచిననూ, దృశ్యపదార్థములనుబట్టి చూచిననూ దేనికినీ నిత్యత్వము కనబడుటలేదు. కాని యీ ప్రపంచము ఎల్లప్పుడునూ కనబడుచూ అనుభవింపబడుచున్నదే, లేకపోవుట యెట్లనినయెడల యీ వ్యవహార నిత్యత్వము భ్రాంతియేకాని వేరు కాదు. ఎట్లనిన నదిని మనము యెల్లప్పుడునూ యున్నట్లే చూచుచుండిననూ సదా నదిలోనిజలము ప్రవాహరూపమున మారుచునేయుండును. నదిలో ఒకక్షణమున ఒక్కచోటనుండుజలము మరుక్షణమున అచటయుండదు ప్రవాహమువల్ల పాతనీరుపోయి కొత్తనీరు వచ్చుచునేయుండును. కాని మనము ఆ నీటి విభాగమును కనిపెట్టజాలక నదిలోని జలమును నిత ముగనే సుకొనుచున్నాము కాని యీ నిత్యత్వము నదిలోని జలముయొక్క లక్షణముకాదు. చూచువారు యీ ప్రవాహ జలమును వారు చూచినంతవరకు నిత్యమైనదిగా చూచుచున్నారు. ఇదియే ప్రవాహ నిత్యత్వము ప్రవాహ నిత్యత్వ మనగా నిత్యముకానిది అనియే అర్థముకాని వేరుకాదు. ఎట్లన మాయబంగారము యనునప్పుడు ఆ చూచునది అసలు బంగారము కాదు అని చెప్పుటకే మాయ అను శబ్దముతో చేర్చి అది బంగారము కాదని తెలుసుకొనుచున్నాము. ఇట్లే వ్యవహార సత్యమనునది కూడ మాయ బంగారము వంటిదని లోగడ నిరూపించి యుంటిమి. గనుక ముముక్షువు యింతవరకు మనము చేసిన పూర్వాపర విచారణలబట్టిన్నీ

తాను శ్రుతి, యుక్తి, అనుభవములతో సప్రమాణముగా విచారించియూ స్వశరీర జగన్మిథ్యాత్వ జ్ఞానమును పొంది, యిందు అనుసంధాన ప్రకార నిరూపణయందు తెలియజేసిన అనుసంధాన శబ్దార్థములను బాగుగ గ్రహించి తన సత్యస్వరూపమును సర్వదా యీ క్రింది ప్రకారమున ఆత్మ విచారమును సత్యస్వరూపానుసంధానమును చేయుట ముక్తిదాయకము. ముముక్షువునకు యీ ప్రత్యగాత్మను మనసు చేతనే గ్రహించ దగినదని "మనసైవేద మాప్తవ్యమ్" అని శ్రుతి తెలుపుచున్నది. ఇంకను తాను అనగా ప్రత్యగాత్మ అను అహం-నేను దేహేంద్రియాదులకంటె వేరనియు, ప్రపంచము మిథ్యయనియు, సర్వదా చింతనము చేయుచుండ వలయుననియూ, ప్రత్యగభిన్న పరమాత్మ ధ్యానముచేత విపరీతభావన నశించుననియు విద్యారణ్యులు తెలుపుచున్నారు. "ఆత్మా నంచేత్" అను శ్రుతి సత్యజ్ఞానానంత స్వరూపమైన పరబ్రహ్మముకంటె వేరుకాని ప్రత్యగాత్మ స్వరూపమును ప్రత్యక్షముగా తెలుసుకొనెడు అపరోక్ష జ్ఞానమును తెలుపుచున్నది.

ముముక్షువు సర్వదా యిట్లు ఆత్మ విచారము చేసుకొనుచుండవలయును. ఇంతవరకునూ చేసిన శ్రుతి, యుక్తి, అనుభవముల విచారణనుబట్టి యెవ్విధముగా చూచిననూ యీ కనబడుచున్న హస్తపాదాదియుతమైన దేహముగాని లేక నన్ను నా సుఖదుఃఖ కర్తృత్వాదులతో నాకు రాగద్వేషాదులను కల్గించుచున్న యీ అంతఃకరణముగాని నేను అని అనుకొనుటకు యెంతమాత్రము అవకాశము కనబడుటలేదు. నేను అను పదార్థమే వాస్తవముగా లేనప్పుడు యీ దృశ్య, జీవ, జడ, వస్తుసముదాయము నంతయు నాది నాది యని సతతాభిమానపరుడనై వాటి సంశ్లేషవిశ్లేష వికారాదులయందు మమత్వభ్రాంతి చెంది సర్వదా రాగద్వేష సక్తతా మానములతో పూరితుడనై వాటిచే కలుగు ఆభాస సుఖమును, దుఃఖక్లేశములను నొందుచూ యీ నా పరిమిత జీవిత కాలమును గతపుట వివేక శూన్యముగా కనబడుచున్నది. వాస్తవమున నేను అను పదార్థమే కనబడనప్పుడు నాది యనునది యెచటనుంచి వచ్చును. ఇది అంతయూ నా అనాది అవిద్యా భ్రాంతి కల్పితమున కనబడుచున్నదే గాని

మరియొక విధముగా కాదు. అయిననూ "ప్రారబ్ధం భోగతో న శ్యత్" అను శాస్త్రవచనమును బట్టి ప్రారబ్ధ మనుభవింపవలసి యున్నది. కాని యిట్టి జీవితానుభవములతో వాస్తవమున నా కెట్టి సంబంధము లేదనిన్నీ స్వశ ·ర సర్వదృశ్యమంతయూ మిథ్యా మాత్రమేకాని వేరుకాదనిన్నీ యెన్ని విధముల నేను యెంత తెలుసుకున్ననూ యీ దేహతాద్యాపము నన్ను విడుచుట లేదు. ఇందుమూలమున నాకు అహం, మమత్వాది య మానము లేర్పడు చున్నవి. కాని యివి వాస్తవములు కావు. ఇప్పుడు నేననుభవించుచున్న దేహధారణమే నాకు వ్యవహారమును కలిగించుచున్నవి. వ్యవహారమనగా మాయబంగారమువంటిదనిన్నీ, కాని మాయబంగారుయొక్క తాత్కాలిక ఛాయా, ప్రతిభ, లాభములు పొందుచున్న లాగుననే యీ లోకమునందు కలుగుచున్న సమస్తవిషయ భోగజాల సుఖములున్నూ అత్యంత తాత్కాలిక ములై పర్యవసానమున నాకు దుఃఖమునే కలుగ జేయుచున్నవి. ఇట్లు నేను యెంత గ్రహించిననూ నా ప్రారబ్ధ కర్మ ఫలాను భవమునకు నాకు యిప్పుడు సంప్రాప్తమైన దేహధారణాద్యనుభవములతో కూడుకొని యున్న యీ నా వితయాత్ర నాకు విధింపబడిన శిక్షవంటిది. కాన నాకు అనుభవము తప్పదు, అయిననూ వీటి అవాస్తవికతను యిప్పుడు తెలుసుకొంటిని. గనుక నాకు యిప్పుడు కలుగుచున్న నా జీవితానుభవము లన్నియూ అవాస్తవములుగనే నే ననుభవింపవలయును గాని వాటిని నా వాస్తవానుభవములుగా తలచి భ్రమచెందకూడదు. ఈ దేహతాదాప్యాధ్యాస ముతో నాకు యిప్పుడు కలుగుచున్న సుఖదుఃఖానుభవముల నన్నిటినీ చిత్ర ఛాయా ప్రదర్శనముల లాగున అల్పసక్తతా మానములతో యనుభవింతును గాక. ఇట్టి అనుభవములవల్ల నాకు సుఖ దుఃఖాది క్లేశములు తగ్గుచున్నవి. ఇట్లు సక్తతా మాన రహితముగ చేయుచున్న నా కరా నుభవములు, పునర్జ స కు కారణమగుచున్న కర ఫలాంకుర రహితములగునని శాస్త్రము తెలుపు చున్నది. కాన యిందుమూలమున నాకు సంసారహేతువగు జనా ంకుర వాసనలు నశించుచున్నవి. ఇందుమూలమున నా భావి ప్రతిబంధములు తొలగి

మోక్షప్రాప్తిని తప్పక బడయగలనను నిశ్చయముతో సర్వదా స్వస్వరూపాను సంధానాదులను చేయుచూ ముముక్షువు తన జీవయాత్రను నడుపుకొనుట యావశ్యకమని గ్రహించవలయును.

ఆత్మాను సంధాన వివరం :-

అహం-నేను జనన మరణ రహితుడను, నాకు జరామరణములు లేవు, నేను నిత్యుడను. సర్వపరిపూర్ణుడను.

అహం-నేను సత్యజ్ఞానానంత లక్షణుడను అనగా యివి నా వుపలక్షణములు. వాస్తవతః నేను లక్షణరహితుడను.

అహం-నేను సాక్షి, ప్రత్యగాత్మా, శివః, శాంతః.

అహం-నేను దృశ్యరహిత, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, సజాతీయ, విజాతీయ. స్వగతభేదరహిత, నిత్య, నిరతిశయ, అద్వితీయ, అఖండ, పరిపూర్ణ చైతన్యః

అహం--నిరవయవః, త్రివిధ భేదరహితః, పరిపూర్ణః తస్మాత్ నిష్క్రియః నాహంకర్తా, నాహంభోక్తా, అహం అసంగః, నిర్వికారః, నిర్గుణః, సర్వాంతర్బహిర్వ్యాపకః

అహం-కేవల చిత్స్వరూపః, అఖండజ్యోతిరాకారః,

అహం-సర్వాత్మకః, పరమాత్మా —సర్వాధిష్ఠానః

అహం-సర్వోపాధి విముక్త, సర్వాధిష్ఠాన స్వప్రకాశ, అద్వితీయ, అఖండ, చైతన్యః "బ్రహ్మైవాహం, బ్రహ్మైవాహమస్మి".

అహం-జగదుత్పత్తి, స్థితి, లయ, వివర్తోపాదాన కారణః అనగా యీ జగదుత్పత్తిస్థితిలయములన్నియు అఖండ అద్వితీయ పరిపూర్ణ స్వరూపుత

నైన నాయందే భ్రాంతిమాత్రముగా కలుగుచున్నవి. ఎట్లనిన స్వప్న మున నిద్రాశక్తిచే సమస్త దృశ్యానుభవములు నాయందే కలుగు చున్నట్లు నా జాగ్రద్దశయందు మాయాశక్తిచే యీ స్వశరీర సర్వ దృశ్యానుభవములుకల్పింపబడుచున్నవేగాని వాస్తవమున సర్వాధిష్ఠాన మైన నా అహం స్వరూపమున తెలియబడుచున్న పరిపూర్ణ చైతన్యము తప్ప వేరేదియును లేదు. అహం నేను అను ప్రత్యయమునకు వాస్త వికార్థము యేమనిన సర్వోపాధి వినిర్ముక్త, దృశ్యరహిత, సర్వా ధిష్ఠాన, స్వప్రకాశ, పరిపూర్ణ చైతన్యమే యని యర్థము కాని యీ దృశ్య పరిచ్ఛిన్న శరీరములు కావు. తనదైన యిట్టి పరమాత్మ స్వరూపమును భగవంతుడు "నిత్యస్సర్వగతస్థాణు రచలోయం సనాతనః"అని క్లుప్తముగా అర్జునునకు గీతలలో తెలుపుచున్నాడు. కాన ముముక్షువు యిదియే తన వాస్తవ స్వరూపమని నిశ్చయముగా గ్రహించి తత్స్వరూప ప్రాప్తికి నిరంత రానుసంధానము చేయు చుండుటే ముముక్షువునకుకర్తవ్యము. ప్రారబ్ధ మనుభవించుట విధియై యున్నది. అనగా ప్రవముముక్షువునకు కర్తృత్వాభిమాన రహి తముగా నిర్లిప్తతతో యథాప్రాప్తముగా తన ప్రారబ్ధకర ఫలసుఖ దుఃఖముల ననుభవించుచూ సదా తన సత్యస్వరూపానుసంధానాదులను యాచరించుచుండవలయును. ముముక్షువునకు, ఒకటి కరా నుభవము విధి రెండవది-సతత స్వస్వరూపానుసంధానాచరణలు కర్తవ్యము లగుచున్నది. ఇదియే తన జన్మరాహిత ము - మోక్షసాధనమునకు సాక్షాత్సాధనమగు చున్నది.

# జ్ఞాననిరూపణ

జ్ఞానము అనగా తెలివి. ఈ జ్ఞానమే మనకు మోక్షము కలుగుట కాధారమగుచున్నది. అద్వైత సిద్ధాన్తమున ముఖ్య జ్ఞాన మొక్కటియెగాన, నానా జ్ఞానములు లేవు. వ్యవహారమందు గూడ సత్య సువర్ణ స్వరూప లక్షణములెప్పుడును ఒక్కటియైయుండునుగద! అనగా-వాస్తవమైన బంగారము యొక్క బరువు, వన్నె, పసిమి మొదలగు లక్షణము లెప్పుడును ఒక్క విధముగనే యుండునట్లు సత్య లక్షణము లెల్లప్పుడును ఒక్కటిగనే యుండును. మాయబంగార మెన్ని విధములనున్న నుండ వచ్చునుగాని, అసలు బంగారము మారుటకు వీలులేదు. అట్లె యీవాస్తవ జ్ఞానములో ప్రకార భేదములు లేవు. అయినను జ్ఞానముకాని వృత్తులను గూడ గౌణముగ జ్ఞానమని వాడుచున్నాము. కాని సత్య జ్ఞానమెపుడును ఒక్కటియే. అనేకము లుండుటకు వీలులేదు. ఇది సత్యజ్ఞానము కాని వృత్తి జ్ఞానములగూర్చి చేయు నిరూపణయేగాని వేరుకాదు. ఇదియె అజ్ఞానమని, ఈ యజ్ఞాన మనాదియని, ఐనను సాంతమనిన్నీ, నశించునదనిన్నీ శాస్త్రము చెప్పుచున్నది. ఇంకనూ ఈయజ్ఞానమువల్లనే సర్వ సంసార దుఃఖములు గలుగుచున్నవి. ఇట్టి సంసార దుఃఖము ఆత్యంతికముగ నివర్తించుటకు జ్ఞానము కన్న వేరుసాధనము, మార్గములేదు. దీనినే "జ్ఞానాదేవతు కైవల్యమితివేదాన్త డిండిమః" అనిన్నీ, "సత్య జ్ఞానమనన్తం బ్రహ్మ" ఆబ్రహ్మ జ్ఞాన స్వరూపుడే యనిన్నీ, "సర్వంఖ ల్విదం బ్రహ్మ" ఈ దృశ్య మంతయు బ్రహ్మ స్వరూపమనిన్నీ శ్రుతి స్మృతి వచనములు తెలుపుచున్నవి.

పై వచనముల సారాంశమేమనగా—బ్రహ్మ-ప్రపంచములు రెండును జ్ఞానమే అని తేలుచున్నది. కాని జ్ఞాన మొక్కటి కన్న నుండుటకు వీలులేదు.

కనుక ఈ బ్రహ్మ - ప్రపంచములు రెండిటిలోను ఒక్కటియే నిజమై యుండవలెనుగాని, రెండును నిజమగుటకు వీలులేదుగద ! ఇట్టి నిజానిజముల నిశ్చయించుటకిది బ్రహ్మ విద్యా ప్రకరణము గనుక పరమార్థ సత్యలక్షణములను బట్టి గుర్తించవలసి యున్నది. వాస్తవములో సత్యమనునదియిదియెగద! వ్యవహారసత్యము మాయ బంగారము వంటిదని లోగడనే చెప్పి యుంటిమి. పై వచనములను బట్టి బ్రహ్మ-జ్ఞానముల కభేదమే గోచరించుచున్నది గాని, జ్ఞానము వేరు, బ్రహ్మ వేరు కాదని తేలుచున్నది. ఈ జ్ఞానమె బ్రహ్మ ఐన యడల, ఎట్టి జ్ఞానము బ్రహ్మ? అనునప్పుడు "సత్యంజ్ఞాన మనన్తం బ్రహ్మ" అను వాక్యమువల్ల ఈ జ్ఞానమును సత్యానంత లక్షణములచే గుర్తించవలసి యున్నది. ఇట్టి సత్యవస్తువేదియని విచారించిన, సత్యమనగా — "యద్ధి యద్రూపేణ నిశ్చితంతద్రూపంచేన్న వ్యభిచరతి తత్సత్యం" అనిభాష్యకారులు తెలుపుచున్నారు. కాన ఈ లక్షణములను బట్టి అట్టి సత్యవస్తువు కాలత్రయ అవస్థాత్రయ అబాధిత మైనదిగ నుండవలెను. ఇట్టి అబాధిత వస్తువు లోగడచేసిన వివేచనా విచారములవల్ల జ్ఞానమూ బ్రహ్మ కన్న నితర పదార్థము కాదని నిరూపించి యుంటిమి. ఇట్లే యీ అనంత లక్షణమును సికొనిన దేశ, కాల, వస్తు పరిచ్ఛేదరహితత్వమే అనన్తత్వమని తెలియుచున్నది. ఈ లక్షణము దృశ పదార్థములలో దేనియందును వర్తించక ఒక్క బ్రహ్మ కేవర్తించుచున్నది. కనుక ఈ సత్య-అనన్త లక్షణములచే సిద్ధించిన జ్ఞానమె బ్రహ్మ అని గ్రహించవలయును. ఇట్టి సత్య-అనన్త లక్షణములచే సిద్ధించిన జ్ఞాన స్వరూపుడు తానేయగును.

ఐనను అట్లు తెలియబడుట లేదు. ఎందు చేతననగా - జీవుడు తన యొక్క పరిపూర్ణ జ్ఞాన స్వరూపమును అవిద్యా వివశుడై మరచి తన స్వరూపముగా నట్టి పరిచ్ఛిన్న కల్పిత యుపాధి నాశ్రయించి భ్రమయుతుడగుచున్నాడు. పైన ఉదాహరించిన లాగున సత్య-అనన్త-జ్ఞాన రూపము బ్రహ్మ, ఇదియే అధిష్ఠానము. పరిచ్ఛిన్న న్న న్న అవాస్తవములు కార ములు. అనగా సర్వ దృశ్య ప్రపంచమూ అధ స్తము. ఈ న్న న్న పరిచ్ఛిన్న

అవాస్తవ జ్ఞానములు అనగా అధ్యస్తము. ఈ దృశ్యము తాను కాననియుం. తను అఖండ పరిపూర్ణ సత్య జ్ఞాన స్వరూపుడననియు తెసిసికొని, అనుభవములోనికి తెచ్చుకొని నిలుపు కొను మహానుభావుడే వన్ముక్తుడై పిదప విదేహముక్తి కైవల్యమును పొందును. "జ్ఞానాదేవతు కైవల్య మితివేదాన్త డిండిమః" అని చెప్పబడు జ్ఞాన మిదియే. ఇది సర్వదా ఒక్కటిగాను, ఏకరూపముగాను నుండునుగాని, ఎప్పటికిని, ఎవ్విధముగను మార్పు జెందునదికాదు.

"దృశ్యాऽసంభవ బోధోహి జ్ఞానం జ్ఞేయంచ కథ్యతే ।
తదభ్యాసేన నిర్వాణ మిత్యభ్యాసో మహోదయః ॥"

సర్వ దృశ్య మిథ్యాత్వ జ్ఞానమే జ్ఞానమనియు, ఇట్టి జ్ఞానాభ్యాసమె అపరోక్ష జ్ఞాన ప్రాప్తి ద్వారా మోక్షమును గలుగ జేయుననియు పై వసిష్ఠ వచనము తెలుపుచున్నది.

చిత్-చైతన్య-జ్ఞాన-సంవిత్-బ్రహ్మ పదములు పర్యాయములు. అనగా నివియన్నియు బ్రహ్మనే బోధించును. మహాసముద్ర నదీ కూప తటాకాదుల యందు జలమంతయు నొక్కటే యైనట్లు ఈజ్ఞానముగూడ సదా ఒక్కటిగానే యున్నది. కాని ఆయా ఉపాధ్యన్తర్గత దోషములను శుద్ధజలము పొందుచున్నట్లు, ఆయా భ్రాంతి వైచిత్ర్యములను బట్టి యీ ఒక్కటైన జ్ఞానమే అనేక దృశ్యములుగ తోచుచున్నది. భ్రాంతిని నిర్మూలించిన యడల ఈ దృశ్య వైచిత్ర్యములు కానరావు. అప్పుడు యథార్థమైన ఒక్క జ్ఞానమే స్ఫురించి, దృశ్య - న్న - చిత్రరూపము లుపశమించును. అంతవరకు నొక్కటి యైన సముద్రజలమే నురుగు తరంగములు బుద్బుదములు మంచు గడ్డలుగా కనబడునట్లు ఈ న్న భిన్న దృశ్యములు కనబడుచుండును. ఈ దృశ్యములన్నియు జలాకాశ మేఘాకాశ ఘటాకాశాదు లన్నియు వేరు వేరు కాక, ఒకే మహాకాశమైనట్లు ఈ ప్రపంచ దృశ్య చిత్రములన్నియు

సత జ్ఞానము కన్న వేరుకావు. కాని ఎందుకిట్లు కనబడుచున్నవనగా-"భ్రాన్తి వైచిత్ర్యాత్ సృష్టి వైచిత్ర్యం" అని వచనము తెలుపుచున్నది.

వ్యవహారములో ఏకార్యమునకైనను రెండు ముఖ్య కారణము లుండ వలయును. ఉపాదాన కారణము. నిమిత్త కారణము. ఇందులో మొదటిది-ఘటాదులకు కారణమైన మృత్తు వంటిది. ఇదియే కార్యోత్పత్తి స్థితి లయములకు ఆధారమగు చున్నది. రెండవ కారణమైన నిమిత్త కారణము కేవలము దండ చక్రకులాలాదుల వలె ఉత్పత్తికి మాత్రము కారణమై, స్థితి నాశములతో సంబంధపడదు. జగదుత్పత్తికి ఉపాదాన కారణమైన జ్ఞానమే అవిద్య-భ్రాంతియని చెప్పబడు అజ్ఞాన సంబంధముచే నిమిత్త కారణము గూడనగుచున్నది. ఈ అజ్ఞానమునకు జ్ఞానమే ఆశ్రయముగాని మరియొకటి కాదు. కనుక ఈ జగదుత్పత్తికి నిమిత్తోపాదాన కారణములు రెండును జ్ఞానమేయని చెప్పవలసి యున్నది. ఇందుచే అజ్ఞాన కల్పితమైన యీ సర్వ జగద్దృశ్యమునకు దీని కుపాదాన కారణమైన జ్ఞానములోనే పర్యవసానము గాని వేరులేదని సిద్ధాంతము తెలుపుచున్నది.

పైన ఉదాహరించినట్లు ఒక కార్యమునకు రెండు కారణములుండు నట్లె ఒక్కటియైన వస్తువు భిన్న న్నాకారములుగ మారుటకు, కనబడుటకు, అనగా-వికారము నొందుటకు ఆరంభ-పరిణామ-వివర్తము లను మూడు ప్రకారములు వ్యవహారములో గలవు. ఇందు ఆరంభకారణమనగా-పటమునకు తంతువులు కారణములగుట. పరిణామ కారణమనగా-ఉపాదానమైన యొక్క వస్తువే మార్పుజెంది అనేక వస్తువులుగా మారుట, అనగా-క్షీరము దధిగాను, సువర్ణము భూషణములుగాను, మృత్తు ఘట శరావాదులుగాను మారుట. ఈ పై రెండు విధములు మూర్తములైన జడపదార్థము లందే సంభావితములు. వివర్త కారణమనగా-ఉపాదానమైన ఒకే వస్తువు ఎట్టి వికారము జెందక అనేక దృశ్యములుగా కనబడుట. అనగా ఒక్కటియైన రజ్జువునందు సర్పాదులు పూర్వ సంస్కార బలముచే కనబడునట్లు. ఇట్టివివర్తము

నకు ముఖ్యముగ పూర్వ పూర్వభ్రమ మూలకమైన సంస్కారమే కారణమగు చున్నది. భ్రాంతి స్వరూపాజ్ఞానమువల్ల గలుగునది.

లోకమున అజ్ఞాన కల్పితమగు ప్రతిదిన్నీ అసత్యమనుట అందరికిని తెలిసిన విషయమే. రజ్జువునందు సర్ప భ్రాంతిని, మందాంధకారము, పూర్వ సర్పజ్ఞాన జనితసంస్కారముల వల్ల నెట్లుపొందుచున్నాడో, అట్లే యీ అనాది అవిద్యా కామకర్మ సహిత సంస్కారము వల్ల తన వాస్తవమైన నిత్య బుద్ధ ముక్తస్వరూపమును మరచి వత్వ భ్రాంతిని పొందుచున్నాడు. దీనినే—

"అజ్ఞానదోషేణతు యత్ర యత్ర ప్రకల్పితం తత్తు మృషైవ దృష్టమ్।
రజ్జ్వాదికే వస్తుని సర్పతాది యథా తథై వాత్మని జీవతా మృషా"

అజ్ఞాన కల్పితములగు సర్పాదులు మిథ్యా భూతములైనట్లు, అజ్ఞాన దోషముచే కల్పితమగు ప్రపంచమంతయు మిథ్యయెయని శంకరభగవత్పా దులు తెలుపుచున్నారు. ప్రకాశాదుల సాహాయ్యమువల్ల అధిష్ఠానరజ్జు జ్ఞానము కలిగినగాని సర్పభ్రాంతి భయాదులు వదలకుండునట్లు, ఈ వత్వ భ్రాంతి అధిష్ఠాన జ్ఞానముచేగాని విడువదు, యథార్థ జ్ఞానము కలిగినగాని భ్రాంతి నివృత్తి కలుగదు. దీనినే—

శ్లో॥ రజతం రజతత్త్వంచ చాకచక్యంచ పాండిమా
సకలం శుక్తిరేవాసీ చ్ఛుక్తి తత్త్వావధారణాత్॥

" తథైవ బ్రహ్మణి జ్ఞాతే స్యాత నా కేవలాత ని
బ్రహ్మైవ సకలం విశ్వం స్థూల సూక్ష్మాది సంజ్ఞితమ్ "

అధిష్ఠానమగు శుక్తి జ్ఞానము కలిగినపుడు అంతకు పూర్వ మజ్ఞాన ముచే భాసించిన రజతము, రజతత్త్వము, తళ తళలాడుట, ధవళ వర్ణము మొదలగునవన్నియు లోపించి శుక్తి మాత్రముగ శేషించినట్లు, అధిష్ఠాన బ్రహ్మ జ్ఞానము కలిగినపుడు స్థూలసూక్ష్మ రూపమగు సమస్త ప్రపంచము

అదృశ్యమై బ్రహ్మ మాత్రముగా మిగులును. అని పై వచనములలో చెప్పి నట్లు ఈ జీవభ్రాంతి, రజ్జువునందు సర్పభ్రాంతిలాగున తనయందే అజ్ఞాన మను అంధకారముచే పూర్వవాసనా కల్పితమై యున్నది. పూర్వవాసన యనగా-పూర్వపూర్వభ్రాంతిచే గలిగిన సంస్కారమును. ఈ సంస్కారములే ఉత్తరోత్తర భ్రాంతికిని, తద్ద్వారా వాసనకును కారణ మగుచున్నవి. ఈ భ్రాంతులను అధిష్ఠాన సత్యజ్ఞానము వల్ల పోగొట్టుకున్న యడల సర్వము జ్ఞాన స్వరూప మగును. ఎట్లనగా—

శ్లో॥ శుక్తిజ్ఞానాద్యథా రూప్యం, రజ్జుజ్ఞానాద్యథోరగః ।
తథాధిష్ఠాన బ్రహ్మ జ్ఞానా ద్విశ్వం నదృశ్యతే॥

శుక్తి జ్ఞానముచే రజతము, రజ్జుజ్ఞానముచే సర్పము బాధింపబడునట్లు అధిష్ఠాన సత్యజ్ఞానముచే ప్రపంచము బాధితమగునని చెప్పి, అనంతరము అంతయు చిత్స్వరూపమేయగునని శ్రీశంకరులు చెప్పుచున్నారు—

శ్లో॥ చిదేవ పంచభూతాని చిదేవ భువనత్రయమ్ ।
చిదేవాహం చిదేవత్వం సర్వమేతత్ చిదేవహి॥

చిత్ అన్నను, జ్ఞానమన్నను ఒక్కటియేగద ! ఇట్టి జ్ఞానమునే "జ్ఞానా దేవతుకైవల్య మితి వేదాన్తడిండిమః" అనువచనము కైవల్య సాధనముగ జెప్పుచున్నది. దీనినే— "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ! తత్స్వ యంయోగసంసిద్ధః కాలేనాత్మనివిందతి" అని గీతావచనము తెలుపుచున్నది, ముముక్షువున కిట్టి జ్ఞాన సంపాదన మావశ్యకము, ఇచట సంపాదన మౌపచారి కము. జ్ఞానము నిత్యసిద్ధముగాని సంపాదింపబడునది కాదు. భ్రాంతినే తర్జించవలసియున్నది. భ్రాంతి నిరూలనముకు ప్రయత్నముగాని, జ్ఞాన సంపాదనకు ప్రయత్నముకాదు. ఆ సద్వస్తువు సర్వత్ర నిత్యసిద్ధమని తెలిసి కొనుటే మన కర్తవ్యము. దీనినే శ్రుతి—

"యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ"

అని తెలుపుచున్నది. దీనినే శంకర భగవత్పాదులు—

శ్లో॥ ఆత్మాతు సతతం ప్రాప్తోఽప్యప్రాప్త వ దవిద్యయా
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా ॥

,, స్థాణౌ పురుషవ ద్భ్రాన్త్యా కృతాబ్రహ్మణి వతా ।
వస్య తాత్త్వికేరూపే తస్మిన్ దృష్టే నివర్తతే ॥

సర్వదా సిద్ధమైయున్నను ఆత్మస్వరూపము తన కంఠములోని హారమును మరచినట్లు అజ్ఞానముచే మరువబడుచున్నది. అజ్ఞానము నశించునపుడు క్రొత్తగా పొందినట్లు భాసించుచున్నది. స్థాణువు (మొద్దు)ను జూచి మనుష్యుడనుకొనినట్లు బ్రహ్మయే జీవుడుగ వ్యవహరింపబడుచున్నాడు. వునియొక్క తాత్త్విక స్వరూపమును గ్రహించినపుడు వత్వ భ్రాంతి నివర్తించునని తెలుపుచున్నారు.

ఈ బ్రహ్మవస్తువు మన అందరి హృదయములందును సర్వదా సాక్షి రూపముగనున్నది. ఈ విచారణవలన ఆ ప్రత్యగాత్మయే మన సత్స్వరూపమనియు, పరమాత్మయనియు గ్రహించవలెను. దీనినే—"స ఆత్మా తత్త్వమసి" "ఆబ్రహ్మ నీవె" యని శ్రుతి తెలుపుచున్నది. కాన శ్రుతికి వబ్రహ్మైక్యమును చెప్పుటలోనే ముఖ్య తాత్పర్యము. ఈ స్వస్వరూపమే నిత్య నిరతిశయ సుఖము.

శ్లో॥ తత్త్వం పదార్థౌ సువిచార్యయేన బ్రహ్మోహమిత్యేవధియాత్వనాత్మని
ప్రధ్వంసితాఽహం మతి రత్రసమ్యక్ స ఏవ కైవల్య సుఖం
సమశ్నుతే ॥

,, అంతఃకరణ సంత్యాగాదవశిష్టే చిదాత్మని ।
అహం బ్రహ్మేతి వాక్యేన బ్రహ్మత్వం సాక్షిణీక్షతే ॥

తత్—త్వం అను రెండు పదార్థములను వివేచన మొనర్చి యీరెండును ఒకే పదార్థమని గ్రహించినట్టివాడు శరీరాదులయందు అహం బుద్ధిని త్యజించి మోక్షమును పొందును. అహంకారమును త్యజించగా చిద్రూపమైన యాత యే మిగులును "అహం బ్రహ్మాసి" యను వాక్యముచే ఈ చిదాత యే బ్రహ్మ మని తెలిసికొనును. అని శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. ఈ సాక్షినే మనము జ్ఞానస్వరూపునిగానున్ను, ఈయననే ". ను"గానున్ను తెలిసికొనవలెను. వేదాంత సిద్ధాంతమందు ఆత యే జ్ఞానరూపుడు. కాన నీ నిరూపణమే సర్వోపదేశములకు నాధారమని తెలుసుకొనవలయును. అందుకుగాను సర్వానుభవ సిద్ధంబును, ప్రత్యక్షమును, సుఖముగ బుద్ధికి గోచరమగునదియునగు అనుభవమునుగూడ -సుకొని జ్ఞాన నిత్యత్వమును నిరూపించుటకు యత్నించుదము.

ఇంతవరకు పలువిధముల యీజ్ఞానమును గురించి శ్రుతి స ృతి వచనములతోను, పూర్వాచార్యుల వాక్యములతోను యింకనూ కొన్ని యుదాహరణలతోను విమర్శించి యుంటిమి. అయిననూ యీజ్ఞాన నిత్యత్వమును బాగుగ గ్రహించుటకు మన అనుభవమును గూడ -సుకొని విమర్శించిన గ్రహణమునకు సులభముగా నుండును. నిత్య, సత్య శబ్దముల కర్థ మొక్క-టియే యని లోగడనే తెలిపి యుంటిమి.

నిత్యమన్ననూ సత్యమన్ననూ అర్థమొక్క-టియే. చూడబడునట్టి పదార్థములకంటె జూచునట్టి జ్ఞానము భిన్నము కావలయును. ఏలనన చూడబడు వస్తువకంటె జూచు పదార్థము న్నముగా నుండవలెననుట నియమము.

అయిననూ వీనిస్వరూప స్వభావములకు భేదము తెలియక పోవుటచే అది ఏకమేనని తలంచుచున్నాము. కాని భేదమనునది పదార్థములకు మాత్రమే కలదనియు, నాభేదముతో జ్ఞానమున కెట్టి సంబంధము యుండదనియు తెలిసికొన లేకున్నాము. కాని విచారించిన పదార్థములు భిన్నము

లైననూ వానిని చూచు జ్ఞానము సదా ఏక రూపమని స్పష్టమగును. మనలకు ప్రతిదినమున్నూ కలుగుచున్న జాగ్రదా ద్యవస్థలందు దేనినిబట్టి చూచిననూ ఈ జ్ఞానము నిత్యమని అనగా అవస్థాత్రయమందును అనుభూతి యగు చున్నట్లు నిశ్చయమగును. ఇట్లు మనలకుకలుగుచున్న మూడవస్థలయందున్నూ భేదమనునది ఆయా యవస్థలయందునూ దృశ్య పదార్థముల యందును కలుగు చున్నది కాని జ్ఞానమనునది యీ అవస్థాత్రయమందునూ యొక్కటి గానే యుండి ఏక రూపమై కనబడుచున్నది. జాగ్రత్జ్ఞానమైననూ స్వప్న జ్ఞాన మైననూ జ్ఞాన యొక్కటియే గదా. ఇక మూడవదియగు సుషుప్త్య వస్థను గూర్చి చూచిననూ నిదురనుంచి మేల్కాంచి నప్పుడు, "నాకు నిదురలో నేమియు తెలియలేదు, సుఖముగా నిద్ర పోయితిని" అని వ వహరించుట సర్వ సామాన్యముగా అందరి యనుభవములో నున్న విషయమే. దీనిని బట్టి చూచిన సుషుప్త్యవస్థయందునూ తనకు కలుగుచున్న అనుభవమును గ్రహించు వాడొక్కడుండి ·రవలయునని విశద మగుచున్నది. ఇదియే జ్ఞానము.

జ్ఞానము అనుభవమనియు, స్మృతి యనియు రెండు విధములుగ నున్నది. అనుభవములు ప్రత్యక్షాదులు అనగా యింద్రియములతో విషయ ములను గ్రహించుట చేతగాని, పోలికచేత పదార్థముల నూహించుట కాని, పరుని యుపదేశముచే నొక విషయము నిర్ణయించుట అను మొదలగునవి యనుభవములు. ఇట్టి యనుభవముల వలన జనించి చిత్తమందు దృఢమై యున్న సంస్కారము కాలాంతరమున సంకల్పరూపమై ప్రకట మగుట అనగా స్ఫురించుట స్మృతి. సుషుప్త్య వస్థయందునూ జ్ఞానము కలదు. కాని అది, ఇంద్రియాది సర్వ పదార్థములను తన యందు ·నము చేసుకొని, యున్న అవిద్యను మాత్రము చూచుచుండును. అవిద్య యనగా అజ్ఞానము. ఇట్లు సుషుప్తి యందు కూడ జాగ్రత్స్వప్న యవస్థలయందు వలెనే చూచువాడు యొకడున్నగాని సుషుప్తి నుంచి లేచిన పిదప తన యనుభవము స రించు టకు యొకడు యుండవలెనుగదా. ఇట్లున్న వాడే సాక్షి. ఈయనయే జ్ఞాన

స్వరూపుడు. పయిన చేసిన నిరూపణ వలన ఒక్కదినమున నున్న మూడవ స్థలయందునూ, జ్ఞానమునకు భేదములేదనుట స్పష్ట మైనది కదా. ఈ సిద్ధాంత మును బట్టి ఒక దినమందు వలెనే మరియొక దినము నందును కలుగుచున్న జ్ఞానమునకు భేదముండ దనుట అనగా యెట్టి భేదములేదని స్పష్టమగు చున్నది. ఇట్లే విచారించినచో ఎన్ని దినములు గడచిననూ, ఎన్ని మాస ములు సంవత్సరములు గడచిననూ, యుగములూ, కల్పాంతములూ గడచి ననూ జ్ఞానము మాత్రము యొక్కటియే యనుటలో వివాదమునకు అవకాశ ముండదు, ఏలనన వర్తమానకాలమున నెట్లో భూతభవిష్య త్కాలముల యందునూ, ఎన్నిదినమాస, సంవత్సర యుగంబులకు పూర్వమైననూ జ్ఞాన మొక్కటియే యగును. ఏది ఎటుల మారిననూ జ్ఞానమునకు మార్పులేదు. అన్ని పదార్థములకునూ ఉత్పత్తి కలదు కాని ఒక్క జ్ఞానమునకు మాత్రము లేదు. అదియే సర్వ సాక్షి. ఈ సర్వ సాక్షియగువాడు ఉత్పత్తి నాశములను గ్రహించుటకు గూడ నుండవలయును గదా. కాన ఈయన నిత్యుడు. ఈయనయే చేతనుడు. స్వయం ప్రకాశుడు. దీపము తనంత వెలుగుచూ చుట్టునున్న పదార్థముల ప్రకాశింప జేయునట్లు ఈ జ్ఞానము తనంత తానే వెలుగుచు సర్వ ప్రపంచమును ప్రకాశింప జేయుచున్నది.

ఈ జ్ఞానమును పరుడు గ్రహింపలేకున్ననూ తనంత తానే తెలుసుకొన వచ్చును. ఈయన అనుభవ వేద్యుడు గాని తదితరముగా తెలియబడు వస్తువు కాదు. ఏలనన ఈయన అవయవ రహితుడైన అఖండ అద్వయ పరిపూర్ణ స్వరూపుడు. శరీరము పరచ్ఛిన్నమై అవయవములు కలది. కావున నొక యవయవము చేయు కార్యమునకు మరియొక అవయవము కర్త కావచ్చును. జ్ఞానమున కన్ననో యెట్టి అవయవములుకాని క్రియలు కాని లేవు. కావున ఎట్లు చూచిననూ సర్వ సాక్షియగు నీ జ్ఞానము స్వయముగ గాని పరులచే గాని తెలుసుకొనబడునది కాదు. ఇయ్యది అపరోక్షమై ఆత్మ రూపమై అనుభ వింప బడు సత్య వస్తువేకాని వేరుకాదు. నిత్యత్వ మనిననూ సత్యత్వ మని ననూ ఒక్కటియే యని లోగడనే తెలిపి యుంటిమి. ఈ నిరూపణ వలన

జ్ఞానము సత్యమని తేలినది. జ్ఞానమొక్కటి తప్ప తక్కిన వేవియు నిత్యము కాని సత్యము కాని స్వప్రకాశము కాని అనగా స్వస్వరూప భూతములు కాని కావు. ఆ జ్ఞానమే -వుడు. అదియే స్వస్వరూపము. స్వప్రకాశంబును నిత్యంబు నగుటచే జ్ఞానమే ఆత . ఈ జ్ఞానమను ఆత యే సకల -వులకునూ పరమానంద రూపుడుగ నుండి పరమ ప్రేమా స్పదుడగుచున్నాడు. దీనినే "ఇయ మాత్మా పరమానందః పరప్రేమాస్పదం యతః" అని విద్యారణ్యులు తెలుపుచున్నారు. గనుకనే తన నాశము నెవ్వడునూ కోరుటలేదు. ఏదియెట్లు పోయిననూ తాను మాత్రము చక్కగా నుండిన చాలునని ప్రతివాడును కోరుచుండును. ఏ పదార్థములయందు ప్రేమ యుండునో అవి యెల్ల నియతముగ నానంద రూపములై యుండ వలయును. కావున ఏ పదార్థ మెంత యానంద మొసగ గలదో దానియం దంత ప్రేమ యుండునని సిద్ధాంత మగుచున్నది. ఇది సర్వానుభవ సిద్ధమే. ఈ కారణముల వలన దేని యదంలి ప్రేమకంటె నధిక మగు ప్రేమ మరియొక దానిపై నుండదో యది పరమానంద రూపము పరమ ప్రేమాస్పద వస్తువనుటలో సంశయము లేదు. కావున యీ జ్ఞాన స్వరూపుడైన జీవుడు సామాన్యముగ నానంద రూపుడే గాక పరమానంద రూపుడై సర్వులకూ పరమ ప్రీతికి ఆస్పదుడగుచున్నాడు. సర్వాధికమగు ప్రేమ దేని యందుండునో అది పరమానంద రూపము కావలయు. అట్టి ప్రేమ వాస్తవముగ -వుడు జ్ఞాన స్వరూపుడే గనుక ప్ర వారికిన్ని ఇట్టి అధిక ప్రీతి తన యందే కలుగుచున్నది. కావున ప్రతివారికినీ జ్ఞాన స్వరూపుడైన ఆత యందలి ప్రేమ స్వార్థమే కాని పరార్థము కానేరదు. కాన ముముక్షువు తన సత్య స్వరూపమైన ఇట్టి నిత్య, పరిపూర్ణ జ్ఞాన స్వరూపమును శృతి యుక్త్యనుభవములతో విచారము చేసి స్వానుభవమును పొంది పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడగుటయే మోక్షము.

కాని -వుని మోక్షప్రాప్తికి ఈ పరిపూర్ణజ్ఞానము, నేను అహం అని శ్రవణ, విచారములవలన తెలుసుకున్ననూ, అట్టి జ్ఞానము జీవునియొక్క అనాది అవిద్యాదోషమువలన నిలువక తన చిత్తమునకు విక్షేప ఆవరణాదులు

కల్పించుచుండును. దీనికిగాను యిట్టి జ్ఞాన స్వరూపుడను నే, నని తనకు జ్ఞాన సాక్షాత్కార పర్యంతమూ బ్రహ్మ స్వరూపమును తానుగా అనుసంధానము చేయుట ముముక్షువున కావశ్యకమై యున్నది. బ్రహ్మ యన్నను, జ్ఞానమన్నను ఒక్కటియే. ఇట్టి బ్రహ్మజ్ఞానము అభ్యాసపాటవముచేతగాని పొందబడదు. ఈ అభ్యాస మనునది యెవరికైననూ వస్తుసిద్ధికి పరమ సాధనము. దీనినే "అభ్యాసా త్సర్వ సిద్ధిః, స్యాదితివేదానుశాసనం" అని వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. కాన జిజ్ఞాసువు ఆ బ్రహ్మ స్వరూపమే తానుగా నిరంతరము అనుసంధానాభ్యాసము చేయుచుండవలయును. గనుక ముముక్షువు అభ్యాస పాటవమునకుగాను యిచటగూడ తత్స్వరూపమైన జ్ఞాన, అనుసంధాన వాక్యములను ఉదహరించుచున్నాడ.

నేను అహం సాక్షి—ప్రత్యగాత —శివః—శాంతః—అసంగః. అహం జగదుత్పత్తి, స్థితి, లయ, వివర్తకారణ, సర్వాధిష్ఠాన—స్వప్రకాశ—సజా య, విజా య. స్వగతభేదరహిత—నిత్య—నిరతిశయ-దృశ్యరహిత—అఖండ పరిపూర్ణ చైతన్యః—నాహంకర్తా—నాహంభోక్తా—అహం నిష్క్రియః—నిత్య సుఖస్వరూపః—బ్రహ్మైవాహం—బ్రహ్మైవాహం.

ఇంకనూ బ్రహ్మ జ్ఞాన మన్ననూ సత్యజ్ఞాన మన్ననూ ఒక్కటియే. బ్రహ్మ యన్ననూ శుద్ధజీవుడన్ననూ యొక్కటియే. కాని ఆజీవుడే తన సత్య జ్ఞానమును భ్రాంతియుతుడై మరచి అనృతజ్ఞానముతో ఈ దృశ్య సంసార మనుభవించుచూ దుఃఖము పొందుచున్నవానివలె కనబడుచున్నాడు. అట్టి దుఃఖము మరల తనకు అనగా వునికి యెన్నటికినీ కలుగకుండుటకు యొక్క బ్రహ్మజ్ఞానమే శరణ్యము కాని తదితర మేమియునూలేదు. వ్యవహారములో అర్థ సంపాదనకు సువర్ణ మెటుల నున్నదో పరమార్థమున ఈ బ్రహ్మజ్ఞానమటువంటిది. ఈ బ్రహ్మ జ్ఞానము ఇహపరముల రెంటికినీ సువర్ణ ప్రాప్తివంటిది. సాక్షాత్సుఖసాధనము. కాని సువర్ణము అర్థపరమార్థముల

రెంటికినీ పరంపరా సుఖసాధనమే యగుచున్నదిగాని సాక్షాత్సుఖసాధనము కాజాలదు. అయినను సర్వులు ఈ సువర్ణమునందు వారివారి అ ష్ట వస్తు సిద్ధి సంపాదనాసామర్థ్యము సౌలభ్యము తక్కిన వస్తుసముదాయముకన్న ఈ సువర్ణ మునందే ఎక్కువయుండుటచే అందరును సువర్ణమునే కోరుచుందురు. దీనికి ముఖ్యకారణము జీవునికి కావలసిన సుఖసంపాదనేచ్ఛయే. స్వసుఖము అందరిచేతను కోరబడునదియేగదా !

భూమిలో గనులయందు బంగారము మట్టితో కలిసి మానవుల స్థూల దృష్టికి కనబడకయుండునట్లు ఈ ప్రపంచమునందు సత్యానృత జ్ఞానములు కలిసిన వగుటచే, అనృతజ్ఞానము జీవుని భ్రాంతునిగా గావించి సత్యజ్ఞాన మును మరుగు పరచి కనబడకుండ చేయుచున్నవి. ఇదియే మానవునికి కలు గుచున్న అజ్ఞానము. సానపట్టిన రాయిని గూడ, రత్న పరీక్షకుడు తన జ్ఞానముచే యిది రత్నమని గ్రహించి దానిని శుభ్రపరచి. సానపట్టించి, ఆ రత్నము యొక్క పూర్తి ప్రకాశ వికాసములను బయటికి తెచ్చి ఆమణివల్ల లాభము పొందునట్లున్నూ— రసాయన శాస్త్రజ్ఞుడు సువర్ణమిశ్రితమైన మట్టి రాళ్లను పరిశోధనచేసి అందు మట్టిని వేరుపరచి రసాయనములచే శుద్ధపరచి స్వచ్ఛ సువర్ణ లాభమును పొందుచున్నట్లున్నూ, ముముక్షువగు జీవుడు శాస్త్ర విచారము, తన యనుభవ పరిశోధన విచార, ప్రయత్నములచే ఈ ప్రపంచ రూపమున భాసించుచున్న సత్యానృత సంబంధములను వేరుచేసి అనగా విడ గొట్టి, తాను కేవల సత్యస్వరూపుడను జ్ఞానమును (సత్యజ్ఞానమునే) సంపా దించిన యెడల అప్పుడు ఈ మృత్తు సమానమగు అనృత జ్ఞానము తనను (జీవుని) బంధింప జాలదు. అయినను బంగారమున్న వారికి గూడ మట్టి యెట్లవసరమో అట్లే బంగారమును సత జ్ఞానముతోనూ మట్టిని వుపేక్షాభావ ముతోడనూ జీవదశ యందనుభవించును. ఇట్టి వుడు తన ప్రారబ్ధోపాధి విలయమున అనగా తనకు మట్టితో సంబంధావశ కతలు ‌ఈరిన తదుపరి తన సత్యస్వరూపమైన కేవల సువర్ణరూపముతో అనగా నిత్యశుద్ధ జ్ఞాన ముతో తత్స్వరూపుడే యగును. వ్యవహారము నందు సువర్ణమున కిట్టి లక్ష

ణములు యుండుట చేతనే శ్రుతి గూడ ఆ పరమాత్మ యొక్క కల్పితసగుణ రూపములను వర్ణించు నప్పుడు హిరణ్యరూపుడని, హిరణ్యగర్భుడని మొదలు గాగల శబ్దములతో ప్రకాశ శై ష్ఠ్యతలను నిరూపించినది. అచట గూడ హిరణ్యసాంకేతిక రూపమును తీసివేసిన యెడల మిగులునది పరమాత్మయే. ఇట్లే ప్రపంచానుభవములలో గూడ మృత్తు సువర్ణములను వేరుచేసిన మిగులు నది, వ్యవహారమునందు సర్వాధిక సుఖముల నిచ్చుచున్న కేవల సువర్ణమే గదా. అట్లే సత్యానృత జ్ఞానములతో కలిసి యున్న ఈ ప్రపంచానుభవముల యందు జడాంశమైన అనృతజ్ఞానమును త్యజించిన శేషించునది సత్యజ్ఞానమే. ఇదియే వుని నిత్య, నిరతిశయ సుఖ స్వరూపము.

ఈ ప్రపంచమున వునికి కలుగుచున్న సమస్తానుభవములు జ్ఞాన మాత్రములుగానే యున్నవి. అనగా జ్ఞానము లేనిదే ఎట్టి అనుభవమును కలుగుటకు వీలులేదు. కాన ఏ జీవునికైనను సుఖదుఃఖములు ఆయావస్తువు లయందు తనకు తన వాసనానుకూలత ననుసరించి కలుగుచున్న అనుకూల ప్రతికూల జ్ఞానముల వల్లనే కలుగుచున్నవి గాని కేవల వస్తుసముదాయము జీవుని సుఖదుఃఖములకు హేతువగుట లేదు. ఈ విషయమంతయు విపుల ముగ లోగడ నిరూపించి యుంటిమి. -వుని సుఖదుఃఖములకు అనగా బంధ మోక్షములకు ఈజ్ఞానమే సాధనమగుచున్నది. ఇట్టి జ్ఞాన సాధనయందు జ్ఞానము అవాస్తవ, అనృతజ్ఞానము దుఃఖమునూ, సత్య—యథార్థజ్ఞానము సుఖమునూ యిచ్చుచున్న విషయము ప్రపంచానుభవములలో గూడ నున్నదే, ఇది వివేకు లందరకునూ తెలిసిన విషయమే. ఇట్లే పారమార్థికము నందుగూడ జీవుని నిత్యనిరతిశయ సుఖసంపాదనకు సత్యస్వస్వరూప జ్ఞానమే సాధనమని గ్రహించవలయును.

# జ్ఞాన్యజ్ఞానులకు ప్రారబ్ధ ఫలభోగము సమానము

తత్త్వ జ్ఞానము జీవునకు సంచిత ఆగామి కర్మలను నశింపజేయును గాని ప్రారబ్ధ కర్మమును మాత్రము నశింపజేయ జాలదు. కాన సర్వజీవులునూ వారి వారి ప్రారబ్ధకర్మఫల భోగముల ననుభవించియే తమ తరణోపాయమును పొంద వలయును గాని వేరు దారి లేదు. కావున జ్ఞానాజ్ఞానులకు వారి వారి ప్రారబ్ధకర్మఫల భోగములు సమానముగా నుండును. "నా భుక్తం క్షీయతే కర్మ" అను వచనమును బట్టి ఎంతటి వారికైననూ ప్రారబ్ధకర్మ ఫలభోగము అనుభవింపనిదే దాటుటకు వీలులేదు. దీనిని నిరూపించుట విద్యారణ్యులు పంచదశి యందు, "అవశ్యం భావి భావానాం ప్రతీకారో భవేద్యది", అను శ్లోకము వలన నిరూపించి యున్నారు. ఇంకనూ అయోధ్యకు రాజైన శ్రీ రామచంద్రమూర్తి వనవాసమందు, సీతాపహరణమైన రాత్రి, రామలక్ష్మణులిద్దరునూ, సీతాదేవి కొరకు వెదకు వారగుచున్న కాలమందు వారికాహార మెచటనూ గానక, జనక మహారాజు పట్టణమైన మిధిలానగర ప్రాంత వనమందు, రామచంద్రమూర్తి తమ్ముడగు లక్ష్మణునితో" మిధిలాయా మన్నపూర్ణాయాం, వయ మన్నస్య కాంక్షిణః" అనగా (మన మామగారి) రాజధానియైన మిధిలా పట్టణ మంతయూ, అన్నపూరితమై యున్ననూ, మనము మాత్రము అన్న కాంక్షులమై యున్నామని "(వారి ప్రారబ్ధకర్మఫల బలమును సూచనచేయుచూ) శ్రీ రామచంద్రమూర్తి తమ్ముడగు లక్ష్మణునితో వచించినట్లు తెలియుచున్నది.

మూఢజ్ఞాన వశమున సుకృత దుష్కృతకర్మలను ప్రారబ్ధఫల ప్రేరితుడై సంతోషముగ తానే చేయుచుండును. కాని తాను చేసిన ప్రారబ్ధ కర్మ

ఫల మనుభవించ వలసి వచ్చినప్పుడు అతి దుఃఖముతో ననుభవించును. ఇది లోక సహజము. దీనిని బోధించుటకే కృష్ణ పరమాత్మ యైన భగవంతుడు వారి అవతార కార్యము లన్నియూ, సమాప్తి యైన పిదప విశ్రాంతికి గాను యొక వనమునందు విశ్రమించి యుండగా నొక బోయవాడు శ్రీ కృష్ణ స్వామివారి కాలి బొటన వేలి నాడించు సమయమున నద్దానిని దూరము నుండి చూచి చిలుక తల యని తలచి బాణము విడచినట్లున్నూ, కాలి బొటన వేలు ఆయుస్థానముగాన వారి నిర్యాణ మాసన్న మైనట్లున్నూ, అట్టి సమయమున ఆదారినే అక్రూరుడు పోవుచుండగా శ్రీ కృష్ణస్వామివారు వారి నిర్యాణ మిట్లు జరిగినదని ధర్మరాజాదులకు తెలుపవలసినదిగా ఈ క్రింది శ్లోకమును చెప్పినట్లు తెలియుచున్నది.

శ్లో॥ హసద్భి క్రియతే కర , రుదద్భి : రనుభూయతే !
అకారణహతోవా ి, తస్యేదం కర ణః ఫలం॥

అనగా ివులు నవ్వుతూ కర లను చేయుదురు. కర ఫలము లనుభవించవలసి వచ్చినప్పుడు అతిదుఃఖపడుదురు. నేను రామావతారములో అకారణముగా వాలిని వధించిన ఫలమిదియని శ్రీకృష్ణ భగవానులు చెప్పినట్లు తెలియుచున్నది.

అవతార పురుషులకే ప్రారబ్ధకర ఫల మింత బ ియముగనున్న, సామాన్యుల విషయమున జెప్పవలసినదేమున్నది. కావున ప్రారబ్ధ కర ఫల భోగములు జ్ఞాని అజ్ఞానులిరువురికినీ సమానము. కాని అట్టి కర్మ ఫలభోగము లందు వారివారికి కలుగు సుఖ దుఃఖానుభవములకు మాత ్మే తారతమ్యా ముండును. తత్త్వ జ్ఞానమునకు ప్రారబ్ధ కర ఫల భోగమును నశింప చేయు శక్తి లేనిదని విద్యారణ్యులు ।

శ్లో॥ నిర్బంధ స్తత్త్వ విద్యాయా ఇంద్రజాలత్వ సంస్మృతౌ ।
ప్రారబ్ధ స్యాగ్రహా భోగే - వస్య సుఖ దుఃఖయోః॥

అనగా తత్త్వ జ్ఞానముచే ఈ జగత్తంతయునూ ఇంద్రజాలము వలె మిథ్య యగునని తెలియబడును గాని ప్రారబ్ధ కర్మ ఫలభోగమును నశింప జేయుటకు వీలుకాదు. ఇట్టి ప్రారబ్ధమునకు వునికి సుఖ దుఃఖముల నిచ్చుటకు శక్తి గలదు గాని భోగ్యమగు జగత్తు మిథ్యయని తెలుపు శక్తి ఈ ప్రారబ్ధమునకు లేదు. తత్త్వ జ్ఞానమునకు ప్రారబ్ధ కర్మ ఫల భోగమును లేకుండ జేసెడి స్వభావము లేదు. దీనిని బట్టియే జగని ధ్యాత్వ జ్ఞానము భోగమునకు బాధకరము గాదని తెలియుచున్నది.

లోకానుభవముల యందు వునకు వారి వారి జ్ఞాన బలములను బట్టి సుఖదుఃఖ తారతమ్యము లుండును. జ్ఞాని యొక్క కర్మానుభవములు విషయ సక్తితా రాహిత్యముగ నుండును. కాన జ్ఞానికి యవి భావి సంసార బంధ హేతువులు కావు. అజ్ఞాని తన కర్మ ఫలములను విషయాసక్తతలతో అనుభవించుచుండును గాన, అట్టివి అజ్ఞునికి భావి బంధ హేతువులై సంసారమును పెంపొందించు చుండును. కావున వుడు వివేకియై తాను విధిగా ననుభవింపవలసియున్న ప్రారబ్ధకర్మ ఫలమును యనుభవించుట కేవల తన ప్రారబ్ధకర్మ ఫల క్షయము కొరకే నను నిశ్చయముతో విషయానుభవ సుఖ దుఃఖములను సక్తుడుగాక యనుభవించు ముముక్షువు కాలక్రమమున తన అనుసంధానాదుల పటిమనుబట్టి ముక్తుడగును. కాని మేము జ్ఞానులము, ప్రారబ్ధము ననుభవింప నవసరము లేదనిగాని, లేక తాను విషయాసక్తతా పూరితుడై యనుభవించు క్రియానుభవములు వారిని బంధింపజాలవని తలుచుట శుద్ధ అవివేకమునూ, తనను తానే మోసగించుకొనుటయును అగును. కాన ముముక్షువైనవాడు తన ప్రారబ్ధకర్మ ఫల భోగములందు స్వప్నములోనైననూ సక్తతనొందక, తనకు తప్పకుండినట్టి ప్రారబ్ధకర్మ ఫలములను యథా ప్రాప్తముగా నిర్లిప్తుడై భోగమునొందవలయును. ముముక్షు జిజ్ఞాసువునకు తాను చేయు కర్మ ఫలములనుండి తప్పించుకొనుటకు ఇది యొక్కటియే

యుపాయము. అట్టి వా రాచరించు కర్మలు చేయని కర్మలతో సమానమని గీతలలో :—

శ్లో॥ త్యక్త్వా కర్మ ఫలాసఙ్గం నిత్య తృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవకిఞ్చిత్కరోతి సః ॥

అనగా కర్మలయందు మానమును ఫలాసక్తిని విడిచి వెనుక చెప్పిన జ్ఞానము చేత నిత్య తృప్తుడై, ఆశ్రయ రహితుడై కర్మముల జేయుటకు ప్రవర్తించినను, వాడేమియు చేయనివాడే యగునని శ్రీకృష్ణ భగవానులు తెలుపు చున్నారు.

## ఆత్మాంత కరణ ధర్మముల వైలక్ష్యణ్యము

ఈ అంతఃకరణ, ఆత్మ ధర్మములను గురించి లోగడ నిరూపణలలో వివరించియుంటిమి. కాని ప్రతి మానవునకున్నూ తన స్థూల శరీరములో యున్న యీ ఆత్మ, అంతఃకరణ ధర్మములను అన్యోన్య తాదాప్యాధ్యాస ముల వలననే సంసారము కలుగుచున్నందువలన యీ సంసార దుఃఖము నివర్తించుటకుగాను మనలోయున్న యీ ఆత్మ, అంతఃకరణ ధర్మములను వేరువేరుగా వివేచనచేసి వాటియొక్క వైలక్ష్యములను బాగుగా తెలుసుకొనిన యెడలగాని ముముక్షువునకు తనకు యిప్పుడు కలుగుచున్న అధ్యాసమును నివర్తింపజేసుకొని తన సత్స్వరూపమును గుర్తించి అనుసంధానాదభ్యాస ములను చేయుటకు సుసాధ్యముగ నుండదు. గనుక వీటియొక్క విలక్షణ ధర్మములను యీ క్రింధివిధమున గుర్తించవలసియున్నది.

ఆత్మ ధర్మములు :—ఆత్మ ధర్మములని చెప్పుటయేకాని యివి ఔపచారి కము. ఏలనన—ఆత్మ ధర్మ రహితుడు అయినను బోధకొరకు తెలుపబడు చున్నవి. ఈయన కేవల సత్ జ్ఞానానంత స్వరూపుడునూ, సచ్చిదానంద లక్ష

ణములను అస్తి, భాతి, ప్రియత్వములతో ప్రకాశించుచు స్వశరీర సర్వాధిష్ఠానమైన, నిర్వికార, అఖండ, అద్వితీయ పరిపూర్ణ చైతన్యము—ధర్మరహితుడు.

అంతఃకరణ ధర్మములు—అనృత, జడ, దుఃఖము.

ఆత్మసత్యవస్తువు—అంతఃకరణము కల్పితోపాధి.

ఆత్మ అవినాశి అనగా నాశము లేనిది. అంతఃకరణము—వినాశి అనగా నశించునది,

ఆత్మ సర్వాంతర్బహిర్వ్యాపకమైనది—అంతఃకరణము ఏకదేశి.

ఆత్మ స్వప్రకాశము—అంతఃకరణము పరప్రకాశ్యము. అనగా ఆత్మ చేతనే ప్రకాశింపబడునది.

ఆత్మ కర్తృత్వాదిరహితుడు—అంతఃకరణము కర్తృత్వాది ధర్మములు గలది.

ఆత్మ నిర్వికారి అనగా వికార రహితుడు—అంతఃకరము సర్వవికారములను పొందునది.

ఆత్మ పరిపూర్ణము, అపరిచ్ఛిన్నమైనది—అంతఃకరణము పరిచ్ఛిన్నమైనది.

ఆత్మ కేవల సుఖస్వరూపుడు—అంతఃకరణము జడము, దుఃఖరూపము.

ఆత్మ అవస్థాత్రయాబాధితమైనది—అంతఃకరణము సుషుప్తిదశలో అజ్ఞానమందు లయమగుచున్నది.

ఆత్మ నిత్యుడు—అంతఃకరణము అనిత్యమైనది.

ఆత్మ సత్యపదార్థము—అంతఃకరము అసత్యమైన కల్పితపదార్థము.

ఆత జనన మరణ రహితుడు—అంతఃకరణము జనన మరణ ధర్ములు గలది.

ఆత షడ్భావవికారరహితుడు—అంతఃకరణము షడ్భావ వికారములను పొందునది.

ఆత ఏకము, పరిపూర్ణము, అపరిచ్ఛిన్నము—అంతఃకరణములు అనేకములు, న్న న్న పరిచ్ఛిన్న కల్పితములు.

ఆత అధిష్ఠానము, సిద్ధము—అంతఃకరణము అధ్యసము, కల్పితము.

ఆత అచలుడు—అంతఃకరణము గమనాగమనములు కలది.

ఆత నిర్విశేషము—అంతఃకరణము సవిశేషము.

ఆత్మ అద్వి యము—అంతఃకరణము సద్వితీయము అనగా అనేకములు.

ఆత అఖండము—అంతఃకరణము న్న న్న పరిచ్ఛేదములుకలది.

ఆత ధర రహితుడు—అంతఃకరణము సుఖదుఃఖ కర్తృత్వాది గమనాగమన ధర ములు గలది.

ఆత త్రివిధభేద రహితము—అంతఃకరణము సర్వభేద ధర్మములు గలది.

ఆత నిష్కళంకుడు—పుణ్య పాపములు అంతఃకరణ ధర ములే కాని ఆత వి కావు.

ఆత నిరవయవి, ని ష్క్రియుడు—సర్వ ్రియలను చేయునది యీ కల్పితాంతఃకరణ యుపాధియే.

ఇచ్చట యొక చిన్న సందేహమున కవకాశమున్నది. అది యేది యన సర్వక్రియలను యీ స్థూలదేహముచేతనే నిర్వర్తింపబడుచున్నవి. అట్టి

తరి యీ క్రియాదికములన్నియు అంతఃకరణ ధర్మము లనుకొనుట యెట్లని శంకించవచ్చును. కాని యీ చేయబోవు వివేచనవలన అట్టి సందేహమునకు అవకాశము కలుగుటకు వీలులేదు. ఎట్లన స్థూలదేహము కేవల జడము. కాష్ఠము వంటిది. దీనికి జ్ఞానమనునదియే లేదు. దీని సారథ్యమంతయును అంతఃకరణమువల్ల జరుపబడుచున్నది. అంతఃకరము నేది తలంచి కోరిన అట్టి వాటినన్నియు సాధించి, క్రియలను నిర్వర్తించుచుండుటయే యీస్థూలోపాధి పనియై యున్నదిగాని వేరుకాదు. ఈ స్థూలశరీరము అంతఃకరణమునకు సేవకుని వంటిది. అయినను యీ అంతఃకరణోపాధులు స్థూలశరీరము లాగున కేవల జడముగాక చిత్‌జడముల సంమిశ్రితమై యున్నది. ఈ స్థూల దేహమునకు కలుగుచున్న సమస్త సుఖదుఃఖధర్మములు అంతఃకరణము చేతనే గ్రహింపబడుచున్నవిగాని స్థూలదేహముచే గాదు. కాన యీ సుఖ దుఃఖములు బాహ్యముగా యీ స్థూలదేహముచే పొందబడుచున్ననూ యిట్టి యనుభవములన్నియు అంతఃకరణ ధర్మములనుగానే తెలిసికొనవలయును. అంతఃకరణము లేనియెడల యీ స్థూలశరీరమును దహనము చేసిననూ దానికి తెలియదు. అనగా అట్టి తెలివి దానికి లేదు. ఇది యంతయునూ అంతఃకరణమునకే యున్నదిగాని యీ స్థూలదేహమునకు కలుగుచున్న సుఖ దుఃఖములు అంతఃకరణ ధర్మములే యని గ్రహించవలయును. కావున ముముక్షువైనవాడు యీ జనన మరణాదులు, క్షుత్పిపాసాదులు, క్రియా కర్తృత్వాదులు, సుఖ దుఃఖానుభవములు, పుణ్య పాపఫల కర్తృత్వ భోక్తృత్వములు యివి యన్నియు తనలో కల్పితముగా నున్న అంతఃకరణ ధర్మములే యనిన్నీ తన సత్యస్వరూపము వల ఆత యే యనిన్నీ కావున యీ ధర్మములు తనకు సంబంధించినవి కావనిన్నీ. అయిననూ తన అనాది అవిద్యా కామ కర్మలచే భ్రాంతుడై యింతవరకునూ, తన కల్పిత అన్యోన్యాధ్యాసతో చేసిన కర్మఫలముగా యిట్టి అంతఃకరణ తాదాత్మ్యాధ్యాస, కేవల సత్య స్వరూపుడైన తనకు కలిగినదనిన్నీ, యిప్పుడు అట్టి తాదాత్మ్యమును తన సత్యజ్ఞానముచే త్యజించినందున తనను యిప్పుడు యీ అంతఃకరణ ధర

ములు బాధింపజాలవనిన్నీ అయిననూ యిప్పుడు తను ప్రారబ్ధకర్మఫలబద్ధుడై యున్నందున వీటిని అన్యధర్మములుగా తెలుసుకొని సక్తతా మానరహితుడై వయా తను గడపుచు తన స్వస్వరూపమును సర్వదా అనుసంధానము చేయు చుండుటయే ముముక్షు కర్తవ్యమై యున్నది. ఇదియే మోక్షసాధనమునకు సాక్షాన్మార్గమై యున్నది.

# రాజ విద్య

ఈ బ్రహ్మ విద్యకు రాజ విద్యయనికూడ వ్యవహారముకలదు. దీనిని గీతలలో శ్రీకృష్ణ పరమాత్మ .

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥

అనగా ఈ జ్ఞానము విద్యలలో శ్రేష్ఠము. రహస్యములలో అతి రహస్యము. మిక్కిలి పవిత్రమైనది. ప్రత్యక్షగోచరమగు ధర్మ మార్గము. నాశములేనిది, ఖర్చులేనిది, సుఖకరము అనిచెప్పుచున్నారు. ఇదిగాక "అప్రాప్య మాం నివర్తన్తే, మృత్యు సంసారవర్త్మని" అనగా జ్ఞానస్వరూపుడనైన నన్ను పొందనివారు మృత్యువుతో గూడిన సంసార మార్గమునే మరల చేరుదురు. అనిన్నీ చెప్పుచున్నారు. ఇదిగాక-

శ్లో॥ మయా తతమిదం సర్వంజగదవ్యక్త మూర్తినా ।
మత్స్థాని సర్వ భూతాని నచాహంతేష్వవస్థితః ॥
నచమత్ స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరమ్ ।
భూత భృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః ॥
యథాకాశ స్థితోనిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ ॥

అనగా ఈ జగత్తంతయు దృష్టి గోచరముకాని నామూర్తిచే వ్యాప్తమైయున్నది. సర్వ భూతములు నాయందున్నవిగాని, నేను మాత్రము వాటిలో లేను. ఆభూతములు నాయందుండి కూడ నాయందు లేవు. ఇట్టి విలక్షణమైన శక్తిని గ్రహింపుము. ఇదియెట్లనగా ఆకాశమందలి వాయువు సర్వత్ర వ్యాపించి యున్నను ఆకాశమునకు ఏవిధమైన వికారము లేనట్లు ఈ భూతములు నాయందున్నను వాటి మూలమున వికార మెద్దియు నాయందు లేదని నిశ్చయించుకొనుము అనియు భగవంతుడే భావించవలసిన తనస్వరూపమును చెప్పియున్నారు గాన మహాకాశమంతటను నిత్యము సంచరించు వాయువు ఎట్లు ఆకాశమందుండునో అట్లే సర్వభూతములు నాయందున్నవని తనవాస్తవస్వరూపమైన జ్ఞానమునకున్నూ, జడస్వరూపమైన జగత్తునకున్నూ గలసంబంధ మిట్టిదని ఈ లాగున తెలుసుకొనవలయును. మహాకాశమునందు సర్వదా వ్యాపించి వాయువు ఉండినను సంబంధమును పొందని యట్లు సర్వ వ్యాపక జ్ఞానస్వరూపుడైన ఆత్మ యందు యీ ప్రపంచమంతయూ ఏవిధములో కూడ సంబంధపడక అసంగముగాయుండి మనలకు ఈ సర్వదృశ్యము అధ్యస్తమై కనబడుచున్నది. గాన జ్ఞాన, జగత్తులకు ఎట్టి సంబంధములేదు. అధిష్ఠానము తెలియక పోవుటచే అది జగత్తుగా భాసించుచున్నది గాని వాస్తవముగా వేరు జగత్తులేదు. వాస్తవముగా నున్నది ఇది అను సన్మాత్ర బోధక శబ్దముచే తెలియబడుచున్న బ్రహ్మ యొక్కటియేగాని రెండవదిలేదు.

ఇట్టి జ్ఞానమును రాజవంశ పరంపరగా వచ్చుటచేతను, విద్యలలోకెల్ల శ్రేష్ఠమైన విద్యయగుటచేతను, రెండువిధములుగా రాజవిద్యయని చెప్పవచ్చును. గనుకనే ఈ ఉత్కృష్టమైన విద్యను అర్జునునితో నీవు నాకు సఖుడవు, భక్తుడవు గనుక ఈ ఉత్తమవిద్యను తెలిపితినని శ్రీకృష్ణ భగవానుడు—

శ్లో॥ భక్తోసిమే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ।

అని చెప్పియున్నాడు. గాన ఇట్టి రాజవిద్యను ముక్కుమూసికొని అడవులలో నున్నవారేకాక అర్థార్జనక సంపాదించుకొని ప్రారబ్ధకర్మమును అనుభవించు వ్యవహారులుగూడ అభ్యసించి ప్రత్యక్ష లాభమును అవశ్యముగా పొందవచ్చునని తెలియుచున్నది.కాని ఇట్టి బ్రహ్మ విద్య మనకెందుకని తలచుటగాని, మనము సాధించగలమా యనిగాని తలచుట దౌర్బల్యముగాని మరేమియూ కాదు. పురాణేతిహాసములలో ఎచట చూచినను ఇట్టి విద్య సర్వరాజ్యభారము కలిగి లౌకిక ప్రజ్ఞావంతులయిన రాజులచేత సంపాదింపబడినదిగా తెలియుచున్నది. గాన ఎట్టి సంసారికైనను, ఎంత లౌకిక పరిపాలనావశ్యకతయున్న వులకైనను ఇట్టి విద్యను సంపాదించుట, దాని వాస్తవసుఖము ననుభవించుట, యసంభవము కాదు. కాని శ్రుతివాక్యమందు ప్రామాణ్యబుద్ధినుంచి, అనుష్ఠానాదులచేతను, సాధు సంగమ సచ్ఛాస్త్ర పరిశీలన సంపాదించి, కొంతవరకైనను యమనియమాదులతో చిత్త విక్షేపమును తగ్గించుకొని యీ విద్యాప్రాప్తి ప్రయత్నమును చేయవలయును. కొంతవరకైనను చిత్త విక్షేపాదులను తగ్గించుకొననివారికి అట్టి విద్యాభ్యాసము క్లేశకరముగాని, చిత్తమును స్వాధీనము జేసికొని శమదమాదులను పొందినవారలకు ఈ విద్యకన్న సులభమైన ఉపాయములేదని బృహస్పతి తన కుమారుడైన కచునకు—

శ్లో॥ అపి పుష్పావదళనా దపి లోచనమీలనాత్ ।
సుకరోఽహంకృతేస్త్యాగో నక్లేశోఽద్యమనాగపి ॥

అనగా పుష్పములను కోయుటకంటెను, కన్ను మూయుటకంటెను, అహంకారమును విడచుట సులభము. ఇందు కొంచెమైనను కష్టములేదు. అని చెప్పియున్నాడు.

శ్లో॥ ఏకమాద్యంత రహితం చిన్మాత్రమమలం తతమ్ ।
ఖాద ప్యతితరామచ్ఛం విద్ధి తేసర్వవేదనమ్ ॥

శ్లో॥ తదేవభావయన్ సాధు శ్శాంత స్తిష్ఠగతవ్యధః।
మిథ్యారూపో హ్యహంభావో యతే తత్త్వభావనాత్ ॥

మఱియు ఆద్యంతరహితమై, ఏకమై, చిన్మాత్రమై, ఆకసముకంటెను స్వచ్ఛమైన యాతవస్తువు కలదు. దానినే భావించుచు సర్వవ్యధలను వదలిపెట్టుము. ఈలాగున తత్త్వచింతన చేయుటవలన మిథ్యారూపంబగు అహంకారము లయమగును అనిన్నీ చెప్పెను. ఇది యంతయు మనము ఇంతవరకు చేసిన వివేచనమునే బలపరచుచున్నదని గ్రహించవచ్చును.

శ్లో॥ అయంసోఽహమితి వ్యర్థం ప్రత యంత్యజపుత్రక ।
తుచ్ఛం పరిమితాకారం దిక్కాల వివ కృతమ్ ॥

తుచ్ఛము పరిమితాకారమును, దేశకాలవస్తుపరిచ్ఛిన్నము నగు ఈ యహంకారమును నేనని భావింపకుమనియు చెప్పియున్నాడు.

శ్లో॥ బుద్ధిపూర్వం విచార్యేదం యథావస్త్వవలోకనాత్ ।
సత్తాసామాన్య బోధోయ స్సమోక్షశ్చేదనన్తకః ॥

ఈ జగమును శ్రుతియుక్త్యనుభవములచేత నాలోచించి (విచారించి) పరమార్థమును నిశ్చయించుటవలన బుద్ధిపూర్వకముగా సత్తామాత్రమందు (జ్ఞానమందు) పర్యవసానమొంది బోధకల్గెనేని అది పునరావృత్తిరహితమగు మోక్షమగుచున్నదని వసిష్ఠభగవానులు చెప్పియున్నారు.

శ్లో॥ విచార్యా ఽఽర్యైస్సహాలోక శాస్త్రాణ ధ్యాత భావనాత్ ।
సత్తాసామాన్య నిష్ఠత్వం యత్తద్బ్రహ్మ పరం విదుః ॥

అనగా అధాత శాస్త్రములను గురు ముఖంబునజదివి విచారించి ఆత తత్త్వమును చిత్తమునం దనుసంధానముజేయగా సత్తామాత్రంబున నునికి యేది గలదో అదియే పరబ్రహ్మంబుగా నెరుంగుము, అనియు చెప్పుచున్నారు. గాన ముముక్షువైన జిజ్ఞాసువునకు ఫలప్రాప్తి నొందుటకు స్వవిచార స్వస్వరూపానుసంధానములుతప్ప వేరుదారి కనబడుటలేదు. వుడు దీనివల్లనే అమృతుడగును గాని అన్యమువల్ల గాడు. ఐనను సామాన్యముగా ఒక సంశ

యము కలుగును. ఎంతటి మహనీయులనైననూ మనము మరణ రహితు లనగా చూచుటలేదే ! అవతార పురుషులుగూడ మరణించుచున్నారే ! గాన ఈ యమృతత్వ మెవరికి ? ఇది యెట్టిది ? అను శంక యున్నది. సాధారణ ముగా మరణశబ్దమున కర్థము ఈ పాంచభౌతిక దేహపాతమే యగుచున్నది. గాని యిట్లు జ్ఞాని విషయమున కాదు. శరీరము పరిణామరూపము. పరిణా మము గల వస్తువు ఎప్పుడయినను నశించవలసినదే. కాని యీ అమృతత్వ మును పొందువాడు ఇట్టి వికార పరిణామములు గలవాడుకాడు. తన సత్య స్వరూపమును గ్రహించినవాడుగాన తను నిర్వికారుడు. అనగా వికార రహి తుడు. ఇట్టివాడు లోగడ అవిద్యా ప్రభావముచే వివిధ వికారములు గలవాడై జన పరంపరగా ఉపాధులను గ్రహించుచున్నవాడైననూ ఇప్పుడు విద్వాం సుడు అనగా జ్ఞాని. ఇట్టి వానికి వికారముగల ఉపాధి గ్రహణమే మరణము. ఇప్పుడు తను పరిపూర్ణుడని తన స్వరూపమును తెలిసికొనినవాడుగావున యింక పరిచ్ఛిన్నమైన ఉపాధి గ్రహణ మసంభవము. ఇట్లు తిరిగి పునరా వృత్తి గలుగకుండుటయే అమృతత్వముగాని పాంచభౌతిక శరీర నాశము యిట్టి విద్వాంసునకు మరణము కాజాలదు. ముందునూ యిట్టి వికారముగల పరిచ్ఛిన్నోపాధులతో గూడిన జన కు అవకాశముండదు. ఈ జనన మరణ ములు జీవుడు గ్రహించిన పరిచ్ఛిన్నత్వ భ్రాంతి జ్ఞానములచే కలుగుచున్నవి. ఇచ్చట విద్వాంసు డనగా ఇట్టి భ్రాంతి జ్ఞాన నివర్తకమును సంపాదించిన బ్రహ్మ జ్ఞాని శ్రుతి "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి" అని తెలుపుచున్నారు.

గనుక ఇట్టి మహనీయునకు జన్మరాహిత్యమే అమృతత్వముగాని పాంచభౌతిక శరీర నాశము మరణము కాదని గ్రహించవలెను. ఈ అభి ప్రాయమునే "అత్రబ్రహ్మ సమశ్నుతే" అని శ్రుతి చెప్పుచున్నది. అనగా అజ్ఞులవలె విద్వాంసునికి ప్రాణాదుల ఉత్క్రాంతి రూపమైన మరణములేదు అని భావము.

# జ్ఞానసాధనము

ఎవరు తమయొక్క హృదయగుహయందున్న ఆత్మను విడచి యితర దేవతలను సేవించుచున్నారో వారలు చేతిలోనున్న వాస్తవమణిని విడిచిపెట్టి యితరమగు కృత్రిమరత్నమునకు ప్రయత్నము చేయునట్టి వారగుచున్నారని:—

శ్లో॥ సంత్యజ్య హృద్గుహేశానాం దేవమన్యం ప్రయాంతియే ।
తే రత్న మ వాంఛతి త్యక్త్వా హస్తస్థకౌస్తుభమ్ ॥

అనగా అల్పబుద్ధిగల ఎవడు పదార్థములకు ఆద్యంతములయందు దుఃఖ, నిస్సారతలను ఎరిగియు అనగా అనుభవించుచునూ మరల వానియందు ఆసక్తిని చెందుచున్నాడో అట్టివాడు మానవుడుగాక గర్ధభ సమానుడే యగును అనియుకూడ :

శ్లో॥ బుద్ధ్వాఽప్యాద ంత వైరస్యం యః పదార్థేషు దుర తిః ।
బధ్నాతి భావనాం భూయో నరోనాసౌ స గర్దభః ॥

వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు. కాన విద్వాంసుడు యీ ఐశ్వర్యంబులును, భోగంబులును, స్నేహితులును, బాంధవులును, సత్పురుషులును, అందరునూ నశించుపోవువారలే యగుదురు, గాన అట్టితరి యీ లోకమునందు అ మా నించుట అవివేకమేగదా ! ఎంతకాలమైనను గడిచిన దివారాత్రులే గడచుచు, చేసినపనియే చేయుచు, సుఖస్యానంతరము దుఃఖమును, దుఃఖస్యానంతరము కించిత్సుసుఖమును పొందువారలగుచు కాల ·పము చేయుటకన్న మరేమియు జీవితమునం దెక్కడు కనబడుటలేదుగదా. అయినను వారివారియొక్క అనాది అవిద్యా కామకర ల ఫలభోక్తృత్వమునకుగాను కల్పితాంతఃకరణ స్థితులై యీ సంసారమును చర్వితచర్వణముగ ననుభవించుచున్నారు. ఇదియే అనాద జ్ఞానముగ యీ సంసారం బను వృక్షమునకు మనస్సు ప్రధాన

మూలముగా నున్నది. దీనిని యెండగట్టినకాని వృక్షము నశించదు. అట్టి మనస్సు సంకల్పరూపమేకావున ఆ సంకల్పములను ఉపశమింపజేయుటచేతనే యీ అపార సంసారమును దాటుట కుపాయమేగాని వేరొండేదియును లేదని ముముక్షువు నిశ్చయించుకొని ప్రయత్నము చేయుచుండవలెను. మూఢుడు నిన్నచేసిన పనినే ఎంతయనుచితమైన దయిననూ మరల మరల జేయుచూ లజ్జపడడు. వివేకియైనవాడు మూఢునివలె అట్టిపని నేలచేయవలయును. విద్వాంసుడు నిత్యానిత్యవివేకమును సంపాదించి యీ సంసారసాగరమును దాటు యత్నము చేయవలయును. ఇట్టి వారిలో పూర్వమున భగీరథుండను యొక మునిపుంగవుండు ఒకానొకప్పుడు సంసారమువలన భయము చెందిన వాడై త్రితలుడను గురువు నొద్దకుబోయి ఏకాంతంబున తన గురువును జర, మరణము, మోహము, అను నీ మొదలగు భయంకరములైన సమస్త దుఃఖ ములకూనూ నాశము యెట్లు కలుగును యని అడుగగా,గురువైన త్రితలుండు యిట్లనియె.

శ్లో॥ చిరసామ్యాత నోత్థేన నిర్విభాగ విలాసినా ।
రాజన్ జ్ఞేయావబోధేన పూర్ణేన భరితాత నా ॥

శ్లో క్షీయంతే సర్వదుఃఖాని త్రుట్యంతి గ్రంథయోఽభితః ।
సంశయా విలయం యాంతి సర్వకరా ణి చానఘ ॥

అనగా సర్వగతంబగు నాకారంబు గలదియు, నిర్విశేషంబుగా ప్రకాశించు చున్నదియు, సర్వవ్యాప్తంబును, అఖండంబును, నగు పరతత్వముయొక్క సాక్షాత్కారముచే సర్వదుఃఖములు నశించుచున్నవి. అహంకారాదులు విడి పోవుచున్నవి. సర్వకర లునూ విలయమొందుచున్నవి. అని అట్టి పరతత్వ మెట్టిది యనగా జ్ఞానస్వరూపుండును, నిత్యుండును, సర్వగతుండును, వృద్ధి క్షయరహితుండునగు ఆత్మ యే తెలుసుకొనవలసినదనుపరతత్వము. ఇంకను:—

శ్లో॥ చిన్మాత్రం సర్వగం శాంతమస్తి నిర్మల మచ్యుతం ।
దేహాది నేతరత్కించిదితి వేద్మి మునీశ్వర ॥

శ్లో॥ కింత్వత్ర ప్రతిపత్తిరే స్ఫుటతామేతి నప్రభో ।
ఏతావన్మాత్ర సంవిత్తిః స్యామహం సర్వదా కథమ్ ॥

చిన్మాత్రంబును, సర్వగతంబును, శాంతంబును, నిరాలంబునగు బ్రహ్మంబే కలదు. ఇతరమగు దేహాదిపదార్థములు కొంచమైననూ లేవని నేనెరుంగుదును. కాని యీ అర్థమునందు నాదుచిత్తము నిలకడపొందుట లేదు. నేనెప్పుడే విధంబున చిన్మాత్రమును అనుసంధానము చేయజాలుదునో అట్టి విధంబు తెలుపమనిన శ్రీతలుండను గురువు యిట్లనియె :- జ్ఞానముచేత చిత్తము హృదయాకాశమునందు స్వరూపనిష్ఠను పొందెనేని అపుడు జీవుడు సర్వాత్మకమగు బ్రహ్మరూపుండై మరల జన్మింపనేరడు. అనగా తిరిగి జీవభావమును పొందడనుట. ఇట్టి జ్ఞానసాధనము యెట్టిది అనిన

శ్లో॥ అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥

శ్లో॥ ఆత్మనోఽనన్యయోగేన తద్భావనమనారతం ।
వివిక్తదేశసేవిత్వ మరతిర్జన సంసది ॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాన నిష్ఠత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనం ।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం స్యాదితోఽన్యథా॥

శ్లో రాగద్వేషక్షయకరం సంసారవ్యాధి భేషజం ।
అహంకారోపశాంతౌ తద్రాజన్ జ్ఞానమవాప్యతే ॥

అనగా—భోగములయందు నాసక్తియు, పుత్రదారాదులయందు మమతారాహిత్యంబును, యిష్టానిష్ట ప్రాప్తులయందు హర్షవిషాదంబులు నొందకుండుటయు, అభేదభావనచేత యెపుడును ఆత్మానుసంధానంబును, విజనప్రదేశవాసంబును, జనసంఘవాసంబునందసంతోషంబును, ఆత్మజ్ఞాన తత్పరత్వంబును, తత్త్వజ్ఞానప్రయోజనానుసంధానంబును, జ్ఞానసాధనంబు లగుటచే

జ్ఞానంబని చెప్పబడుచున్నది. ఇందుకు వ్యతిరిక్తమగు విషయాసక్తతలు సంసారమునకు హేతువగుట వలన అజ్ఞానమని చెప్పబడుచున్నది. దేహాదుల యందు అహంభావము శాంతింపగా, రాగద్వేషముల నశింపజేయునదియు, సంసారరోగంబున కౌషధంబైనదియు నగు జ్ఞానము కలుగుచున్నది. అని చెప్పిన మీదట భగీరథుండు, చిరకాలమునుండి యీ శరీరమందు వృక్షము వలెనున్న యీ అహంకారమెట్లు విడిపోవునో తెలుపమని యడుగగా త్రిత లుండిట్లనియె :—

శ్లో॥ పౌరుషేణ ప్రయత్నేన త్యక్త్వా భోగౌఘ భావనాం ।
గత్వా వికసితాం సత్తా మహంకారలయం వ్రజేత్ ॥

శ్లో॥ యంత్రాణాం పంజరం యాపదృగ్నం లజ్జాదినాఽఖిలం ।
అకించనత్వ శేషేణ స్ఫుటా తావదహంకృతిః ॥

శ్లో॥ సర్వమేతద్ధియాత క్త్వా యది తిష్ఠసి నిశ్చలః ।
తదహంకార విలయే స్వమేవ పరమం పదమ్ ॥

వాసనాక్షయహేతువగు తత్త్వజ్ఞానము, సమాధ్యభ్యాసము, మొదలగు పురుష ప్రయత్నముచే విషయవాసనము విడిచి పరిపూర్ణమగు సద్రూపము నాశ్ర యించి అహంకారలయమును సాధింపవలయును. లజ్జ, దయ, శంక, యిచ్ఛ, జుగుప్స, కులము, లము, జాతి, నను నెనిమిది పాశములచే నిర్మిత మైన యీ శరీరమను యంత్రపంజరము స్వస్వరూపముకంటె వేరేదియును కాదనుభావనచే భేదింపగా అహంకారములయ మొందును. బుద్ధిచేత కులా మానాదుల నన్నిటిని విడిచి నిశ్చలంబుగ నుండిన అహంకారము విలయం బగును. అంత పరబ్రహ్మంబు నీ వగుదువు, అను మొదలగు వచనములను తెలిపియుండెను. ఇటుల తెలుసుకొని ఆ రాజన్యుడు కొద్ది కాలముననే సక లేషణంబులును విడచి అధికంబగు శాంతిచేత నాత్మయందు విశ్రాంతి నొందిన వాడాయెను. తదుపరి యిట్లు చింతించిన వాడాయెను. ఈ దేహము ధరించిన

నేమి, విడిచిన నేమి. ఇది యుండినటుల యుండుగాక, అని నిశ్చయించి సుఖహేతువును గూర్చి సంతోషమును గాని, దుఃఖహేతువును గూర్చి దుఃఖమును గాని పొందక ధన, అశ్వాదివైభవంబులను, తన యష్టైశ్వర్యంబులను తృణములుగా దలంచెను.

## జీవబ్రహ్మైక్యానుసంధానము

జీవబ్రహ్మైక్యానుసంధానము అనగా జీవుడు నేను బ్రహ్మనే యని తెలిసికొని స్వానుభవమును పొందుటకు తత్స్వరూపమును పలుమారు నిరంతరము తానుగనే అనుకొనుచుండుట. ఈ విషయమై లోగడ గ్రంథములో అచటచట సందర్భానుసారముగా నిరూపింపబడిననూ ఈ జీవబ్రహ్మైక్యానుసంధానమనునది సర్వవేదాంతసారము గనుక "పథ్యంశతవిధంకృత్వా" యను న్యాయముచే పునరుక్తిదోషమును పాటించక జీవమననదారుఢ్యసిద్ధికిగాను తిరిగి యిచట విపులముగా నిరూపించుచున్నాడను. ఇచట ఐక్యమనగా వాస్తవమున తాను అయిన శోధిత జీవుడునూ, బ్రహ్మ యునూ నొక్కటియే యని తెలిసికొని యనుభవమును పొందుట. శోధితజీవుడన్ననూ, బ్రహ్మమన్ననూ ఒక్కటియే. కాని ఈ జీవుడే అనాది అవిద్యాభ్రాంతి కలిగినవానివలె మాయాప్రభావముచే కనపడుచూ లోకానుభవములను పొందుచున్నట్లు కనబడుచున్నాడు. ఇట్టి అనాదిభ్రాంతి నివర్తకమునకుగాను జీవునికి తన సత్యస్వరూపమును నిరంతరానుసంధానము చేయుట ఆవశ్యకమగుచున్నది. కాన జీవునికి తాను అనాదిభ్రాంతిచే మరచిన తన సత్యస్వరూపమును మహావాక్యములు బోధించుచున్నవి. కాని జీవుడు మహావాక్యశ్రవణమును గురుముఖతః చేసిననూ, జిజ్ఞాసువునకు అట్టి తన సత్యస్వరూపము వెంటనే తెలియుటలేదు. ఏలనన ఈ అవిద్యాభ్రాంతియను దృశ్యసంసారము జీవుని

అనాదిగా నా(శయించుకొని దీర్ఘవ్యాధి లాగున యున్నది. సంసార మనగా సం సరణం, సంసారః అనగా దృశ్యమందు సక్తతకలిగియుండుట సంసారము. ఈ స్వశరీర సర్వదృశ్యమును వాస్తవమని నమి దానియందు సక్తత పొందుటే సంసారము. "(ప్రయత్నేనాపి సంసార మహారోగో నశామ్యతి" అని (శ్రీ వశిష్ఠ భగవానులుగూడ ఈ సంసారము జీవునికి మహారోగమువంటిది అది తెలుపుచున్నారు. దీర్ఘరోగము బహుకాలము కఠినచికిత్స చేసినగాని తగ్గదను విషయము అందరకును తెలిసినదే. ఇట్లే ఈ సంసారమహాదీర్ఘ రోగమును ఆత్యంతికముగా అనగా మరల కలుగకుండ నివర్తించుటకు ముముక్షువు మహావాక్య (శ్రవణము చేసిననూ, దానిని బహుకాలము మనన, నిదిధ్యసన సాధనములచే నిరంతరము అభ్యసించినగాని (భ్రాంతి నివర్తకమై తన సత్యస్వరూపానుభవము కలుగదు. ఇట్టి జీవ(బహ్మైక్యానుసంధానమునే (శ్రీ వశిష్ఠభగవానులు మహౌషధమని "దీర్ఘ సంసార రోగస్య విచారోహి మహౌషధమ్'' అని తెలుపుచున్నారు. ఇచట విచార మనగా జీవుని సత్యస్వరూపానుసంధాన విచారమే, వునకు తన సత్యస్వరూపానుభవము కలిగినగాని నేను అను తానుయును, సర్వాధిష్ఠానమైన (బహ యునూ, ఒక్కటియే యని తెలియదు. అనగా అట్టి జ్ఞానము కలుగదు. ఇందుకుగాను జీవుడు సాధన చతుష్టయ సంపాదనానంతరము గురుముఖతః మహావాక (శ్రవణము చేసి "సోఽహం" (సః, అహం) అనగా ఆయనయే నేను అని ఉపనిషద్వాక్యము తెలియజేయు అర్థమును బాగుగ (గహించి "అహం(బహ్మా సి" అని నిరంతరానుసంధానముచేయుట జీవ(బహ్మైక్యజ్ఞానమునకు సాధనమై యావశ కమగుచున్నది. పై రెండు వాక్యములకున్నూ దాదాపు అర్థమొక్కటియే, ముముక్షువైనవాడు అట్టి అర్థమును బాగుగ ఈ (క్రింది విమర్శచే (గహించి అనుసంధానాదులను అభ్యసించిన (శ్రేష్ఠఫలదాయకమగును గాన విచారణ మావశ్యకము'' సోఽహం, "(సః, అహమ్) అనిన ఆయనయే నేను అని వాక్యము తెలుపుచున్నది. ఇచట సః అను ఆయన ఎవరు? అహం నేను అనునది ఎవరు? అని బాగుగ తెలిసికొనినగాని "సోఽయం విష్ణుదత్తః"

అనువాక్యమునందు ఆవిష్ణుదత్తుడే ఈ విష్ణుదత్తుడు అని గ్రహింపబడునట్లు తెలియదు. బహుకాలము క్రింద చూచిన విష్ణుదత్తుని స్వరూపలక్షణములను బాగుగ జ్ఞప్తికి తెచ్చుకొని ఇప్పుడు కనుబడుచున్న విష్ణుదత్తుని స్వరూపలక్షణములతో సరిపోల్చుకొనినగదా, ఆ విష్ణుదత్తుడే ఈ విష్ణుదత్తుడు, అనగా ఆ విష్ణుదత్తుడును, ఈ విష్ణుదత్తుడునూ ఒక్కడేయని గ్రహించుటకు సాధ్యమగును. కాని బాగుగ స్వరూపలక్షణములను జ్ఞప్తికితెచ్చుకొనని యెడల లేక జ్ఞప్తికిరాని యెడల ఇద్దరునూ ఒక్కడే యని గ్రహించ సాధ్యముగాదు. అట్లే యిచట జీవుడు మరచిన తన సత్యస్వరూపమును శాస్త్రబోధవలన భాగత్యాగలక్షణములచే గ్రహించినగాని తన సత్యస్వరూపమును, బ్రహ్మ స్వరూపమునూ, యొక్కటియేగాని న్నముకాదని తెలిసికొన వీలుకలుగదు. ఇచట అనగా ఈ వాక్యమునందు విషయుడు విష్ణుదత్తుడు గనుక ఇట్టి స్వరూపజ్ఞానము విష్ణుదత్తుని యందావశ్యకమగుచున్నది. ఇట్లే మహావాక్యబోధయందు విషయుడు వాస్తవమున బ్రహ్మమైన జీవుడే గనుక అట్టి జ్ఞానము తనయందే అహం నేను యను ప్ర తియందు యావశ్యకమగుచున్నది. వాస్తవమున నేను అను అహం, నూ బ్రహ్మ యునూ ఒక్కడే గనుక జీవునికి తన వాస్తవ స్వరూపజ్ఞానము, ఆ బ్రహ్మ యునూ, నేనున్నూ ఒక్కటియే యని జ్ఞప్తి నిచ్చి అభ్యాసపాటవమునుబట్టి అనుభవమును కలుగజేయును. ఇదియే జీవబ్రహ్మైక్యజ్ఞానము. బ్రహ్మజ్ఞాన మనగా ఇప్పుడు జీవుడు మరచియున్న తన సత్యస్వరూపమును జ్ఞప్తికి తెచ్చుకొని తాను అను నేను బ్రహ్మ యే అని గ్రహించుట, కాన వాస్తవమున జీవుడు తాను బ్రహ్మ గనె యుండి తన అనాది అవిద చే భ్రాంతుడైన జీవుడు తన సత్యస్వరూపమును జ్ఞప్తికి తెచ్చి జీవభ్రాంతిని నివర్తింపజేయుటకే శ్రుతిమాత మహావాక్యబోధతో జీవునికి బ్రహ్మైక్యమును తెలుపుచున్నది. ఇట్టి బోధలో తత్త్వమస్యాది మహావాక ములు జీవునికి ఆ బ్రహ్మ నీవే అనిన్నీ, నేను బ్రహ్మనై యున్నానని ౻, మొదలుగాగల అర్థమును బోధించుచున్నది. జీవుడు తాను మరచిన తన సత్యస్వరూపమును జ్ఞప్తికి తెచ్చుకొనుటకు శాస్త్రమే ఆధార

మగుచున్నది. ఈ శాస్త్రము జీవునికి "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తి కించన" అని తెలుపుచున్నది. ఇంకనూ "పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అని గూడ తెలుపుచున్నది. కాన జీవుడు తనకు ఇప్పుడు పరిచ్ఛిన్నత్వముతో అహం ప్రతిగా నేను అని తోచుచున్నట్టియూ, పరిచ్ఛిన్న, జడ, దుఃఖస్వభావములు కలిగినట్టియూ తనస్థూలసూక్ష్మ శరీరోపాధులను జ్ఞాన పూర్వకముగా త్యజించిన యడల శేషించునది తన సత్యస్వరూపమైన ప్రత్యగాత్మయే. ఈయనయే సర్వసాక్షిగా అందరి హృదయముల యందును కూటస్థముగ నుండును. ఈ ప్రత్యగాత్మయే అఖండ, అద్వితీయ, పరిపూర్ణ స్వరూపుడై సర్వజీవులయొక్క హృదయపుండరీకముల యందును, ఉజ్జ్వల ప్రకాశుడై సూర్యునిలాగున భాసించుచుండును. ఈయనయే చిద్భాస్కరుడు. ఈయనయే శుద్ధజీవుడు. ఈయనయే పరమాత్మ, సర్వాత్మ, బ్రహ్మ, చిదాకాశము యను పర్యాయనామములతో తెలియబడుచున్నాడు. కాని ఈయనయే మాయాప్రభావముచే పరిచ్ఛిన్నుని లాగున గోచరించుచూ కల్పితోపాధి స్థితమైన అంతఃకరణధర ములతో తాదాత్మ్యము నొందుచున్నవానివలె కనబడుచున్నాడు. ఇట్టి తాదాత్మ్యము మాయా కల్పిత కేవల అనాదిభ్రాంతియే గాన జీవుడు ఇట్టి తన భ్రాంతిని జ్ఞానపూర్వకముగ త్యజించి తన యీ కల్పితోపాధియైన అంతఃకరణ ధర ములతో వాస్తవమున నిత్య పరిపూర్ణ స్వరూపుడైన తనకెట్టి సంబంధములేదనియూ, యీ కల్పిత సంబంధమంతయూ తన అనాది అవిద్యాకార్యమనియూ దృఢముగా తెలిసికొని, తాను, నిత్యనిరతిశయ స్వరూపమైన ఆ ప్రత్యగాత్మయే నేను అని నిస్సంశయముగా తెలిసికొనవలెను. ఇట్టి తన సత్యస్వరూపమైన ప్రత్యగాత్మయే ఆ సర్వాత్మకుడైన పరమాత్మయని గ్రహించవలెను. ఇట్లు గ్రహించుటలో కేవల శివస్వరూపమైన, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ సర్వోపాధి వినిర్ముక్త, సజాతీయ, విజాతీయ, స్వగతభేదరహిత, సర్వాంతర్బహిర్వ్యాపక, జగదుత్పత్తి, స్థితి, లయ, కారణ, నిత్య, నిర్వికార, అసంగ, అద్వితీయ, అఖండపరిపూర్ణ చైతన్యస్వరూపుడనైన నేను, యీ ప్రత్య

గాత్మ స్వరూపమున తెలియబడుచున్నానని నిశ్చయముగా గ్రహించి తన యుపాధిలో ప్రత్యగాత్మగా భాసించుచున్న పదార్థమే తన వాస్తవ అహం స్వరూపమనియూ ఈ అహం అను నేను పరమాత్మగా సర్వాంతర్బహిర్వ్యాపకుడై పరిపూర్ణుడైన సచ్చిదానంద స్వరూపుడను నేనే, నేను అయిన ఆయనయే ఈ ప్రత్యగాత్మగా నా హృదయపుండరీకమందు తెలియబడుచూ నేనే యీ ప్రత్యగాత్మ స్వరూపమున ప్రకాశించుచున్నానని సర్వదా నిరంతరానుసంధానము ఫలావగతి పర్యంతము "అహంబ్రహ్మాస్మి" యని మననాదులభ్యసించుటవలన జీవబ్రహ్మైక్యజ్ఞానము కలిగి తాను తనకర్మ, ఫల, కాల పరిపాకము, అభ్యాస, దారుఢ్యములనుబట్టి తాను అఖండ, అద్వి యు, పరిపూర్ణ, స్వరూపుడగును. అనగా అట్టి అపరోక్షజ్ఞానమును పొందును. ఇదియే ఉపనిషద్బోధయొక్క పరమతాత్పర్యము. జీవునికి నిత్య, నిరతిశయ, సుఖ, స్వరూప, మోక్షము యగుచున్నది.

జిజ్ఞాసువుని కిచట తెలుసుకొనవలసిన చిన్న రహస్యమొకటి గలదు. అది ఏదియనిన, ఇట్టి జీవబ్రహ్మైక్యానుసంధానాదులను చేయుచుండుటయే తనకు మోక్షసాధనము. కాని బహుకాలాభ్యాసము చేసినను అపరోక్షజ్ఞానము కలుగలేదని నిరుత్సాహపడి అభ్యాసాదులను మానకూడదు. ఏలనన, తన అజ్ఞానకాలములో చేసిన కర్మ ఫలములో-తన ప్రారబ్ధకర్మఫలము క్షయించనిది తనకు అపరోక్షసాక్షాత్కారము కలుగదు. ఇట్టి అనుసంధానాభ్యాసపాటవముచే గాని ప్రారబ్ధకర్మఫల క్షయము కాదు. ఇట్టి తన ప్రారబ్ధకర్మఫల ప్రతిబంధమెంతయున్నది యనువిషయము ఫలానుమేయమేగాని వేరుగ గ్రహింపజాలము. అందుకుగాను జిజ్ఞాసువు అభ్యాసకాలధైర్యమువలన నిరుత్సాహము పొందక తన ప్రారబ్ధ రాహిత్యమైన వెంటనే తనకు అపరోక్షసాక్షాత్కారము శాస్త్రము చెప్పినవిధముగ తప్పక కలుగగలదను యుత్సాహముతో- తన పరోక్షజ్ఞానముతోడ, పట్టువదలక యభ్యసించుచుండిన సాక్షాత్కారము తప్పక ఈ జన్మలోగాని, జన్మాంతరమందుగాని, లేనిచో యొకటి రెండు తదను కూలజన్మల యనంతరమందుగాని, తన పరోక్షజ్ఞానాభ్యాసమే అపరోక్ష

సాక్షాత్కారమునిచ్చి జీవుని కృతార్థతనొందించును. అట్లుగాక నిరుత్సాహముతో మధ్యకాలములో జ్ఞానాభ్యాసమును మానిన యడల లోగడతాను చేసిన సర్వమునిష్ప్రయోజనమై అధోగతిపాలగు స్థితి సంభవించును. కాన ముముక్షువైనవాడు తన వ్రబహ్మైక్యజ్ఞానాభ్యాసమును నిరుత్సాహము చెంది ఎన్నటికిని మానకూడదు. ఘనావగతి పర్యంతము సర్వదా ఐక్యానుసంధాన మభ్యసించుచునే యుండవలయును. ఈ జీవబ్రహ్మైక్యానుసంధానము వలన కలుగు పరమలాభమును ఈ క్రింది శ్లోకములు విస్పష్టముగా తెలుపుచున్నవి.

శ్లో॥ వృత్తి హీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత ని ।
ఏ కృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే ॥

ఇచట వృత్తి హీనమనగా మనసుయొక్క విషయాకారవృత్తియని గాని, బ్రహ్మాకారవృత్తియని కాదు. బ్రహ్మాకారవృత్తి గ్రాహ్యము కాన యిచట వృత్తి హీనమనగా విషయాకారవృత్తి రహితముగా నని గ్రహించి ముముక్షువు తన మనస్సును ఏ విధమగు వాసనయు లేకుండజేసి -వుని పరమాత్మయందు ఏకముగా చేసినయడల విముక్తుడగును. ఈ యోగము ముఖ్యమైనది అనియు, మరియును

శ్లో॥ యదాసర్వాణిభూతాని సమాధిస్థోఽనుపశ్యతి ।
ఏ భూతః పరేణాసౌ తదా భవతి కేవలః ॥

ఎపుడు జీవుడు సమాధి యందుండి పరమాత తో కలసి సమస్తమగు భూతములను చూడకుండునో, అపుడు కేవలుడు, కైవల్యమును పొందినవాడై తాను మాత్రము మిగిలియున్నవాడు అగును అనియు ఈ శ్లోకముల యర్థము తెలుపుచున్నది. కాన జిజ్ఞాసువునకు తన అపరోక్షజ్ఞాన సాక్షాత్కార పర్యంతము సర్వదా జీవబ్రహ్మైక్యానుసంధానాదుల నభ్యసించుట పరమశ్రేయోదాయకమై మోక్షసాధనమగుచున్నది. ఇట్లు నిరంతరానుసంధానాభ్యాసము యవలయును :— అహం, నేను ఆ పరమాత్మనేనని స్వరూపలక్షణములచే

బాగుగ గ్రహించి జీవుడు నేనే పరమాత్మను, ఆ పరమాత్మనైన నేనే చిద్భాస్కరుడనైన నా వాస్తవ, అఖండ, అద్వితీయ, భేదరహిత, స్వప్రకాశ, పరిపూర్ణ, స్వరూపమునే ప్రారబ్ధకర్మఫల వశమున ఇప్పుడు యుపాధి స్థితుడనైన నాలో ప్రత్యగాత్మ స్వరూపమున లోకభాస్కరునివలె నా హృదయ పుండరీకమున చూచుచున్నాను గాని ఈ ప్రత్యగాత్మనైన నేను, అహం, ను ఆ పరమాత్మ స్వరూపమైన బ్రహ్మయు సదా ఒక్కటియేగాని వేరుకాదని తెలుసుకొని ఇట్టి తన సత్యస్వరూపమైన పరమాత్మను సదా, అనగా సర్వ కాల సర్వావస్థలయందును జీవుడు తాను తత్స్వరూపమగు వరకును నిరంతరాను సంధానము చేయుచుండవలెను. ఇదియే జీవబ్రహ్మైక్యానుసంధానము శ్రుతి బోధయొక్క పరమతాత్పర్యము.

## జీవునకధిష్ఠాన గ్రహణావశ్యకత

లోకమునందు జీవుడు సంసారి. ఈ సంసార భ్రాంతివలన ప్రతి వుడును జన పరంపర పొందుచూ, సుఖాభాసమును, దుఃఖమునే యనుభవించు చున్నాడు. కాని కేవల సుఖానుభవమును పొందజాలకున్నాడు. ఇట్టివారిలో ఒకానొక జీవుడు తన పురాకృత పుణ్యవిశేషముచేత ఈ సంసార ఆత్యంతిక దుఃఖనివృత్తిని యిచ్ఛయించును. ఇదియే మోక్షేచ్ఛ. ఇట్లిచ్ఛయించువాడు ముముక్షువు. ఇట్టి ముముక్షుజ్ఞాన జిజ్ఞాసువు: తన వాస్తవస్థితి, స్వరూపములు తెలియకోరుచూ, శాస్త్రీయ సాధనములతో తన అభ్యాసాదులను ప్రారంభించును. ఇట్టి అభ్యాసకునికి అనుసంధానాదులు అమృతప్రాయము. ఇట్టి అను సంధానాదులలో వునికి తాను వాస్తవమున నెవరో తెల్పుటకు శాస్త్రము :-

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః ।
అహంకారా ధ్యాయాసా కల్పతే నతు వాస్తవీ ॥

అని తెల్పుచున్నది. అనగా జీవుడు నేను అని అనుకొను అహం ప్రతీతిని రెండు విభాగములుగ చేసి ఈ వచనము తెలుపుచున్నది. ఈ శ్లోకముయొక్క మొదటిపాదమున కర్థమై, అహం ప్ర తికి లక్ష్యముగా నున్నవాడు పరమా త్ముడు. ఈయనయే అధిష్ఠానము. ఈ శ్లోకముయొక్క రెండవపాదమున కర్థమై, కలుగుచున్న అహం ప్ర తికి సామాన్యార్థమున, అహం, మమేదం అని తెలిసికొనబడుచున్నవాడు యుపాధిస్థితుడు, కల్పితుడు, అవాస్తవుడని తెల్పుచున్నది. ఈయనయే భ్రాంతుడు. అధ్యస్థుడు. ఈ వాస్తవ అవాస్తవు లిద్దరునూ కలిసి లోకమునందు సంసారజీవిగ వ్యవహరించువాడు. ఈయనయే ఉభయాత్మకుడుగా తెలియబడుచున్నాడు. కాని ఆత యొక్కడేకాని, యిద్ద రుగ నుండుటకు వీలులేదు. ఇదియే భ్రాంతి. కాన వుడు యిట్టి సంసార భ్రాంతినుండి తప్పించుకొనుటకు తనయందు అనాది భ్రాంతిచే అధ్యస్తమైన కల్పితోపాధి జ్ఞానమును త్యజించి, తన వాస్తవ స్వరూపమైన అధిష్ఠాన జ్ఞానమును సంపాదించుట ముముక్షువున కావశ్యకము.

ఇందు పరమాత్మ అధిష్ఠానము. ఈ పరమాత యందు జీవత్వము అధ్యస్తము. -వునికి యీ అధిష్ఠానాధ్యస్తములు రెండునూ ఒక్కటియేనని తెలిసికొనుటయే అధిష్ఠానగ్రహణ మనబడును. అనగా యిదియే వుని అధి ష్ఠానజ్ఞానము. ఇందు అధిష్ఠానము, పరమార్థము, మొదటిది—అధ్యస్తము, వ్యవహారము రెండవది. కాని యిట్లు కనబడుచున్ననూ యీ రెండునూ వాస్తవమున నొక్కటియేగాని రెండుగావు. ఏలనన, యెప్పటికినీ, అధిష్ఠా నాధ్యస్తము లనునవి న్నములుగా నుండుటకు వీలులేదు ఈ విషయమును లోగడనే స్పష్టపరచియుంటిమి. దీనినే శంకర భగవత్పాదులు :—

శ్లో॥ ఆభాతస్య త్వధిష్ఠానాదన్యత్వం నైవ సిధ్యతి ।
అధిష్ఠానాత్పృథక్కస్తత్రారజ్జు సర్పే నవీక్ష్యతే ॥

అనగా ఆరోపిత దార్థప మేదియును, నధిష్ఠానమునకంటె న్నముగనుండదు. త్రాటియందు భ్రాంతిచే తోచు సర్పమునకు, అధిష్ఠానమైన త్రాటికంటె న్న

మగు నునికి అనగా సత్తాలేదుగదా—కాన భ్రాంతి కల్పితములైన పదార్థము లధిష్ఠానముకంటె భిన్నములు కానేరవు. కాన వాస్తవమున రెండవపదార్థమను నదిలేదు-అని ధృవముగ తెలుపుచున్నారు. కాన జీవునకు పరమార్థము సత్యము—వ్యవహారము కల్పితముగ నున్నవి. అయినను యెంతటి ముముక్షువులకునూగూడ వ్యవహారము ప్రారంబ్ధాంతమువరకును తప్పదు. గనుక జ్ఞానికిగూడ తన వ్యవహారానుభవములే ద్వైతభ్రాంతికి హేతువగుచుండును. ముముక్షువునకు యీ అధిష్ఠానాధ్యస్తముల ఐక్యత గ్రహించినగాని సంసార భ్రాంతి నివర్తించదు. కాన వీటి ఐక్యతను గురించి బాగుగా తెలిసికొనుట యావశ్యకము. ముముక్షువైన విద్వాంసుడు తన శాస్త్రీయ వివేచనతో యీ అధిష్ఠానాధ్యస్తములు రెండునూ యొక్కటియేనని నిశ్చయమునొంది, కలలోనైననూ వీటిని భిన్నములని తలచగూడదు. ఇట్టి నిశ్చయముతోడ ముముక్షువు తన సత్యస్వరూపమే జగదధిష్ఠానమనియూ, తనయందే యీ అహం, ఇదములు రెండునూ అధ్యస్తములై తోచుచున్నవనియూ, యివి భ్రాంతి మాత్ర కల్పితములనియూ, యిట్టి భ్రాంతి కల్పితవస్తువు లెన్నటికినీ తమ అధిష్ఠానమును విడచియుండుట కలుగుటకాని సంభవము కాదనియు, నిశ్చయముగ గ్రహించవలెను. కాని సంశయము నొందగూడదు. అట్టి సంశయమేదియనిన తన సత్య స్వరూపము అఖండ పరిపూర్ణమైన సత్పదార్థ మొక్కటియే యైనయెడల తనకు యిప్పుడు, మృదుత్వ, గురుత్వ, కాఠిన్యములతో భిన్న భిన్న యాకారములుగ భిన్న భిన్నకాలములందు యీ ప్రపంచానుభవము లెట్లు కలుగుచున్నవనునది—ఇట్లు పొరబడకూడదు. ఏలనన వునికి నిద్రయను తన అజ్ఞానకాలమందు యేకాధిష్ఠానమైన తన బుద్ధియందే స్వప్నమధ్యస్తమై తనయందే ఆకాశజల, భూమండలాదులయందు గురుత్వ కాఠిన్యములతో దేశాంతర కాలాంతరములందుగూడ తనకు సుఖదుఃఖానుభవములను స్వకాల సత్యత్వముతో కలుగుచున్న విషయ మందరి యనుభవములో నున్నదియే. స్వకాల సత్యత్వ మనగా ఆయా అవస్థలయందు కలుగు అనుభవములు. ఆయా కాలములందు మాత్రమే వాస్తవమని తోచి అనుభవము

నొందుచుండుట. ఎట్లన మానవులు స్వప్నములోగాంచిన చోర, వ్యాఘ్రాదులను చూచి భయపడియేగదా నిద్రనుంచి భయకంపాదులతో లేచుచున్నారు. వారి వారి స్వప్నకాలములయందు స్వాప్నికపదార్థముల సుఖదుఃఖములను వాస్తవ మను జ్ఞానముతోడనేగదా యనుభవించుచున్నారు. అట్లు కానిచో కల గాంచునప్పుడు తనకవి అసత్యమను జ్ఞాన మున్నచో, చిత్రరుపులలో చూచిన చో ·, వ్యాఘ్రములలాగుననే చూచి భయము నొందగూడదు. కాని కల గాంచువారు యిట్టి భయమేగాక, వారి శరీర క్లేశానుభవములనుగూడ వారి స్వప్నకాలమందు నొందుచున్న విషయముగూడ అందరకునూ తెలిసినదే కాని జాగ్రదవస్థ (కాలము) రాగానే యా స్వప్నానుభవములు నుండక వాటిని స్వప్న భ్రాంతి మాత్రముగ తెలిసికొనుచున్నారు. ఇట్లే జాగ్రదవస్థలోని యనుభవము లించుకయైననూ స్వప్నకాలమున నుండవు-ఈ స్వప్న, జాగ్రతలలో యున్న రెండు అనుభవములనూ గూడ సుషుప్తియందు యుండవు. కాని సుషుప్తి సుఖానుభవము సుషుప్తినందు మాత్రమే యుండును- ఇట్టివియన్నియూ స్వకాలసత్యములు మాత్రమగుచు అన్యకాలములందు నశించుచున్నవి-స్వకాల సత్యపదార్థములన్నియూ నిట్టివియే-

జ్ఞానికి గూడ నేను, అని తలచునప్పుడు అధిష్ఠానాధ్యస్తములు ద్వైతముగానే స్ఫురించుచుండును. ఇట్టి ద్వైతస్ఫురణయందు ముముక్షువైనవాడు తనకు యిప్పుడుగల యుపాధులు రెండని గ్రహించి అందు అధిష్ఠానమై, నిత్య, సత్య, అమూర్త అఖండ పరిపూర్ణమైన అద్వియ పదార్థమే తన వాస్తవస్వరూపమనిన్నీ యిదియే ప్రధానమైనదనిన్నీ అధ్యస్తమై అప్రధానమై, మాయాప్రభావముచేత కల్పితమై, అయిననూ, తన ప్రారబ్ధానుసారానుభవములకునూ, తన పరమప్రాప్తిసాధనమునకున్నూ యేర్పడిన తన యీ వ్యవహారోపాధి రెండవది యని తెలిసికొనవలయును. వ్యవహారము మాయ బంగారమువంటి దని లోగడనే నిశ్చయించియుంటిమి. కాన మాయపదార్థమెప్పటికైననూ, లేనిదే కావలయును గదా-అప్పుడు సత్యమైన తాను మాత్రమే నిర్విశేషముగ నుండును. ఇందుకుగాను ముముక్షువు తన జ్ఞానబలముచే తనకు

కేవల కల్పితోపాధియైన యీ దేహాదులను, ప్రారబ్ధానుసార వ్యవహారాను భవములకు మాత్రమే యుపయోగించుకొనుచు, తన పరమార్థ ప్రాప్తికి గూడ నిదియే సాధనమని గ్రహించి సశాస్త్రీయముగ, తన శరీరాదులను యుపయోగించుకొనుటయే వివేకము, పండిత లక్షణమని, యెరుగవలయును, ఈ ముముక్షువు వ్యవహారకాలములయందు తన శరీరోపాధిని సశాస్త్రీయముగ నుపయోగించుకొనుచు, తన తరణోపాయమును సాధించుటకుగాను యాచరించు తన మనన, నిదిధ్యసనాద్యభ్యాస కాలమందు తన వ్యవహారదేహము, రజ్జువయందు భ్రాంతి కల్పితమైన, సర్పములాగున లేనిదే యనిన్నీ అయిననూ తనకిదియే సాధనమనిన్నీ, తన వాస్తవ స్వరూపము, అహ, మిదముల కధిష్ఠానమైన తన ప్రత్యగాత్మ స్వరూపమేననియూ యిదియే తన సత్యస్వరూపమని, నిశ్చయమునొంది యిట్టి తన సత్యస్వరూపమును సర్వదాభేద రహిత, అద్వితీయ, అఖండ, పరిపూర్ణ సచ్చిదానందములతో అనుసంధానాదులను అభ్యసించుచుండవలెను. ఇంకనూ, కనుచీకటియందు పారవైచిన పూల దండను చూచి సర్పభ్రాంతి నొందుచున్న విధమున అద్వితీయ ఏకాధిష్ఠానమైన సచ్చిదానంద బ్రహ్మ వస్తువునందే, జీవుడు అనాది మాయావశమున భ్రాంతుడై తనకు యిప్పుడు యీ అహం, ఇదములు రెండునూ, తనయందే తోచుచూ తన ప్రారబ్ధవశమున, వాటితోడ తాదాత్మ్యాధ్యాసములు తన అవిద్య, మాయా ప్రభావముచే కలుగుచు, తనకీ సంసారబంధమేర్పడినదని తెలసికొనవలయును అయిననూ యిది అంతయూ జీవునికి భ్రాంతిమాత్రమే కాని వాస్తవము కాదు. ఈ అహం, ఇదములు రెండునూ రజ్జువయందు భ్రాంతి కల్పితమైన సర్ప, సర్పావయవములవంటివే ననియూ, యివి కేవల అధ్యస్తములేననియూ యిట్టివి, రజ్జువను విడచి యించుకయైననూ సర్పమగుపడనటుల, తన సర్వాధిష్ఠాన స్వరూపమును విడచి వ్యవహారములు అనగా అధ్యస్తము యుండదని తెలిసికొనవలయును-ముముక్షువు తన సత్యాధిష్ఠాన స్వరూపమును బాగుగ గ్రహించి స్వానుభవము నొందునప్పుడు, తనకు రజ్జుజ్ఞానము కలుగగనే, యిది, సర్పమను జ్ఞానము యెటుల పోయినదగుచూ, కేవల సర్ప

వున కధిష్ఠాన గ్రహణావశ్యకత

స్ఫురణజ్ఞానము తన నెటుల బాధించుటకు భయకారణము కాదో అట్లే ముముక్షువైన జ్ఞానికి, ప్రపంచము భాసించుచున్ననూ, తాను జగమను జ్ఞానము నశించి, తన ప్రపంచ సుఖదుఃఖానుభవములు క్షీణములై, సర్పము విడచిన కుబుసము లాగున నిర్బాధకములుగ నుండును-కాన యిట్టి సుఖమును సంపాదించుటకు సమ్యగ్జ్ఞానమే ప్రధానమగుచున్నది. సమ్యగ్జ్ఞానమనగా ముముక్షువు తన నిత్యానిత్య వివేకముతో శ్రవణ, మననాద్యభ్యాసములచే యీ ప్రపంచము మిథ్యయని, నిశ్చయమును సంపాదించి ప్రపంచాధిష్ఠాన జ్ఞానమును గ్రహించుటయే-ఇదియే సమ్యగ్జ్ఞానము, ముముక్షువునకు ప్రపంచ బాధ, జ్ఞానసాధ్యమే కాని క్రియాసాధ్యముకాదు. కనుకనే శ్రుతి "జ్ఞానా దైవతు కైవల్య మితివేదాంత డిండిమః" అని స్పష్టముగ జీవునికి తెలుపు చున్నది. ఇట్టి జ్ఞానముతోడ, ముముక్షువు తన కాలపరిపాక అభ్యాసపాట వములను బట్టి, అధిష్ఠానమైన తన పరమార్థస్వరూపమునూ, అధ్యస్తమైన తన స్వశరీరాది వ్యవహార స్వరూపములునూ, వాస్తవమున, నొక్కటియే కాని, న్నములు కావనియూ గ్రహించి, అట్టి అద్వి య అఖండ పరిపూర్ణా ధిష్ఠాన స్వరూపము తానుగనే "ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి" అను అనుసంధానవాక్యార్థమును బాగుగ గ్రహించగలుగును. తదుపరి పరమాత్మ ప్రత్యగాత్మల ఐక్యస్వరూపమును గ్రహించగలుగును—కాలక్రమ మున తన అభ్యాసాదుల పాటవముచే స్వానుభవము నొందగలుగును. అప్పుడు తాను జీవదశయందే ముక్తుడగుచు తన ప్రారబ్ధాంతమున విదేహ కైవల్యము నొందును. ఇదియే జీవునికి అధిష్ఠానజ్ఞాన గ్రహణమువల్ల కలుగు పరమలాభము-కాన యీ ప్రపంచసంసారభ్రమ అధిష్ఠానమును తెలిసి కొనలేకపోవుటచే వచ్చినదియే గాన సర్వాధిష్ఠానమైన నా బ్రహ స్వరూపము నెరింగినచో తక్షణమే యీ అజ్ఞానము నశించి జగత్తు అంతర్ధానమగును-

దీనినే

శ్లో॥ అధిష్ఠానాఽదర్శనతః ఏవ విశ్వభ్రమస్సతాం ।
తస్మి న్ దృష్టే జగద్భ్రాంతిర్దూరాదేవ పలాయతే ॥

అని శ్రీ శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు-

# విద్యాభ్యాసకుని ప్రశంస

విద్యయనగా బ్రహ్మ విద్య యనియే ముఖ్యార్థము. కాని లౌకిక విద్యలు కావు. లోకమునందు లౌకిక విద్యలనుగూడ విద్యయని వ్యవహరించుట గౌణ ప్రయోగము. కాన విద్యాభ్యాసకుడనగా ఇచట బ్రహ్మ విద్యాభ్యాసకుడనియే అర్థము. అభ్యాసమనగా శ్రవణ, మనన, నిదిధ్యసనాభ్యాసములు. ఇట్టి అభ్యాసకుడే విద్వాంసు డనబడును. ఇచట విద్వాంసు డనగా గురు ఈశ్వరానుగ్రహములతో శ్రుతి యుక్త్యనుభవ పూర్వకముగా సర్వదృశ్యమిథ్యాత్వమును ప్రీతి నిశ్చయములతో గ్రహించి జ్ఞానాభ్యాసము చేయునట్టి ముముక్షువనియే అర్థము. కాని కేవల శాస్త్రబోధ కుశలులని కాదు. అయిననూ వీరు విద్యాధనాగారముల సంరక్షకులు గనుక పూజనీయులు. ఇట్టి రక్షణయు యావశ్యకమే గదా! పైన తెలిపినయట్టి ముముక్షు జిజ్ఞాసువునకు రెండు స్థితులు గలవు. ఒకటి తన ప్రారబ్ధానుసారముగ శరీరధారియై కర్మానుభవములను పొందు వ్యవహారస్థితి. ఇది కల్పితమును భ్రాంతి మాత్రమైనదియే కాని పరమార్థ సత్యము కాదు. విద్వాంసుడు జిజ్ఞాసువై ఉపనిషద్వాక్యబోధవలన తాను ఇప్పుడు పరోక్షముగ గ్రహించిన సత్య స్వరూపమైన పరమార్థ స్థితియనునది రెండవది. ఇది వాస్తవము. పరమార్థ సత్యము, త్రికాలాబాధ్యము. ఇట్లని తెలిసికొన్ననూ ఎట్టివారికి ప్రారబ్ధము బలీయము. కాన ప్రారబ్ధానుసారముగ భోగానుభవములు ఎంతటివారికైననూ తప్పవు. గనుక విద్యాభ్యాసకుడైనవాడు, తన ప్రారబ్ధానుభవములను వివేకముతో పొందుచు తన ప్రారబ్ధమును క్షయింపజేయవలసియున్నది. ఈ అభ్యాసకుని జ్ఞానము పరోక్షమైనదిగనే యుండును. పరోక్షజ్ఞానమునకు ప్రారబ్ధమును నశింపజేయు శక్తిలేదు. కాని ప్రారబ్ధానుభవమందు ఇట్టి పరోక్షజ్ఞానము విద్వాంసునికి కొంతవరకు తన భోగానుభవక్లేశదుఃఖములను తగ్గించుచు సుఖము నిచ్చును. దీనికి కారణము తన వాస్తవిక స్వరూప జ్ఞానబలమే యగు

చున్నది. అట్టి బలమేదియనిన విద్వాంసుడైనవాడు తన సంకల్పములను నిరోధించుటయే. ఈ సంకల్పములన్నియూ తన అంతఃకరణోపాధివియే గాని తనవి కావు. ఈ విద్వాంసుడు ఇప్పుడు తన ఆత్మాంతఃకరణముల వైలక్షణ్యము గ్రహించి, తన అంతఃకరణము వలము కల్పితమైనదనిన్నీ, తనకు వాస్తవసంబంధ మేమియును లేదనిన్నీ, తెలిసికొనినవాడు గనుక యీ సంకల్పములను నిరోధించు సామర్థ్యము కొంతవరకైననూ కలవాడై యుండును. గనుక ప్రారబ్ధవశమున కొన్ని వచ్చిననూ అట్టివానితో తనకెట్టి వాస్తవసంబంధము లేదని నిశ్చయముగా గ్రహించవలయును. కాని బుద్ధి యందు ఆత్మ స్వరూప మధ్యస్తమై యుండుటచే ఆత్మానాత్మ జ్ఞానముగల పండితులుకూడ అంతఃకరణమునే ఆత్మగా భ్రమించుచు, అంతఃకరణాను కూల సుఖ, దుఃఖ కర్తృత్వ, భోక్తృత్వాది వ్యాపారములనే వాస్తవమని భావించి వ్యవహరించుచుందురు. విద్వాంసులకు గూడ అంతఃకరణమందు ఆత్మ భ్రాంతి కలుగుచుండును. దీనికి కారణము ఆత్మాంతఃకరణముల అన్యోన్యాధ్యాసయే. దీనివలననే విద్వాంసులనుగూడ బలీయమైన దేహాధ్యాస, కర్తృత్వాది అధ్యాసలు విడువవు. ఇట్టి అధ్యాసమునుండి తప్పించుకొను ప్రయత్నమే విద్వాంసుని ఆశయ కర్తవ్యములై యుండవలెను. ప్రారబ్ధము బలీయమగుటచే తన జ్ఞానబలముచే తన యనుభవములను సక్తతామాన రహితుడై పొందుచు నిర్వహించుటయే విద్వాంసుని లక్షణము. అయినను యిట్టి మహనీయులనుగూడ విషయవాంఛ లాకర్షించి భ్రమ ప్రమాదముల పాలు జేయును. విషయ వాంఛలు బలీయములు ప్రమాద హేతువులని :-

శ్లో॥ విషయా ముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః,
విక్షేపయతి ధీదోషై ర్యోషా జారమివ ప్రియమ్.

జారిణి యగు స్త్రీ పరపురుషుని జూచి తన కటాక్షవిక్షేపాది గుణలాఘవములచేత, వానిని మోహింపజేయునట్లు పండితుడైననూ, విషయాభిముఖుడయ్యేనేని అనగా విషయవాంఛ అను భ్రాంతి తన సత్యస్వరూపమును మాటు

పరచి నానాప్రకారముల విషయములయందు ప్రవృత్తిని కలిగించి మోహింప జేయును. అని శ్రీ శంకర భగవత్పాదులు స్పష్టముగా తెలుపుచున్నారు. కావున విషయచింతన యెప్పటికిని విద్వాంసునికైననూ గ్రాహ్యము కాదు. తన శరీరయాత్రను ప్రారబ్ధకర ఫలానుసారమున కేవల స్థితి, శరీరధారణో చిత కర్మలతో సక్తతా మానరహితుడై యథాప్రాప్తముగ ఫలముల ననుభ వించుచుండుట విద్వాంసుని లక్షణము. ఇట్టి జ్ఞానసాధకుని ఆశయము ముఖ్య ముగ తన ప్రారబ్ధకర్మ ఫలక్షయమేకాని మరేమియు నుండతగదు. స్వశరీర సర్వదృశ్యము కనపడుచున్ననూ అనుభవింపబడుచున్ననూ ఇవి కల్పిత మాత్రములేకాని వాస్తవములు కావను తన దృఢజ్ఞానమే విద్వాంసుని తన కర్తృత్వభోక్తృత్వములయందు సక్తతాభిమానములను తొలగించుటకు సాధనమగును. ఇట్లు సక్తతా మానరహితముగ, తాను పొందు భోగానుభవ ములు భావిఫలోత్పత్తి కారకములు కాజాలక, బంధుహేతువులు కావు. అను భవమును మాత్ర మిచ్చుచుండును. కనుక ఈ జ్ఞానాభ్యాసకుడైన విద్వాంసుని ఆశయ, వ్యవహార మెట్లుండవలెననిన, రాజవేషము ధరించునటుడు తన కృత్రిమ కిరీట వజ్రసువర్ణాభరణాదులను తన పాత్రపోషణమునకుమాత్రమే సాధనములుగ గ్రహించి ఆవశ్యకమైనప్పుడెల్ల నాటక ప్రదర్శనకాలమందు ఎట్లుపయోగించుకొనుచూ, తన సహజనామరూపములను మఱువక నటన కృత్యములనుజేయుచూ జీవనోపాధి నెట్లు గడుపుచుండునో, అట్లే విద్వాం సుడు తన అంతఃకరణ వృత్తులను సశాస్త్రీయముగ తన ప్రారబ్ధానుసార వ్యవహారానుభవములకు నుపయోగించుకొనుచు స్వయాత్మాదర్శనమును, తన సత్యస్వరూప లక్షణములను అనుభవించుచు తన సత్య స్వరూపజ్ఞానము నకై, వృత్తిరూపమైన మఱువక తన అంతఃకరణోపాధి నుపయోగించు కొను నాశయముతో నుండవలెనుకాని, తన వ్యవహార విషయవృత్తులతో లిప్తుడు కాకూడదు. విషయవృత్తులన్నియూ అంతఃకరణ ధర్మములు. ఈ అంతఃకరణము వృత్తిరూపము. అయిననూ యీ వృత్తియే జీవునకు వ్యవ హారానుభవములకునూ, తన పరమార్థలాభమునకునూ గూడ శరణ్యము గాని

మరియొకటి గాదు. కావున విద్వాంసునకు తన వృత్తిని సశాస్త్రీయముగ, సంస్కరించుకొనుట అత్యావశ్యకము. తన పరమోత్కృష్ట లాభమునకుగాను విద్వాంసుడు ఈ వృత్తినే ఆశ్రయించి తన అభ్యాసపాటవముచే యీ వృత్తిని దృశ్య పరిచ్ఛిన్నాకారానుభవములనుండి శాస్త్రీయ ప్రయత్నోపాయములతో, తన వృత్తిని సత్యస్వరూప అఖండాకారవృత్తినొందించు ఆశయముతోనుండి అనుసంధానాదుల నాచరించుచుండవలయును. కాలక్రమమున తన మననాద్యభ్యాసపాటవమునుబట్టి సమాధ్యభ్యాసమునకు గూడ సమర్థత కలుగుచుండును. అభ్యాసకునకు ఈ సమాధికాలము సుఖస్థితి నిచ్చును. దృశ్యాసక్తతా మాన రహితుడై ఇట్టి స్థితిని అభ్యసించుటకు జగన్మిథ్యాత్వజ్ఞానమే విద్వాంసునకు సహకరించును. కాన ముముక్షువునకు శాస్త్రీయసర్వోపాయములచేతనూ తన జ్ఞానబలము వల్లనూ, స్వశరీర జగని ధ్యాత్వజ్ఞానార్జనమును సర్వదా ప్రీతి నిశ్చయములతో చేయుచుండుట తన తరణోపాయమై, సాక్షాత్సాధనమై ముక్తిదాయకమగును. కనుక ఇట్టి జ్ఞానప్రాప్తికి ముముక్షువు సతతాభ్యాసము అనగా తన వ్యవహారదశలలో గూడ ఇట్టి నిశ్చయముతోనేయుండి కేవల దేహస్థితి ధారణావశ్యకమగు కర్మలను చేయుచుండవలయును.

విద్వాంసునికి తన శరీరాదులను కేవల కల్పితమాత్రములుగనే గుర్తించి తన ప్రారబ్ధకర ఫలము ననుభవించుచూ, వీనిని తన పరమాభీష్టమైన సత్యస్వరూపప్రాప్తికి వ్యవహారసాధనములుగ నుపయోగించుకొనుటయే వివేకము. కాని దేహాదులే తానని స్వప్నమునందైననూ భ్రమించ కూడదు. ముముక్షువు ఎట్టి తన ప్రారబ్ధానుభవ వ్యవహారములను చేయుచున్నను తన సత్యస్వరూపలక్ష్యమందు చ్యుతుడు కాకూడదు. తన సత్య, స్వరూప లక్షణములను, బాగుగ గ్రహించి నిత్యస్వానుభవమును పొందుటయే విద్వాంసునకు పరమావధి. దానికిగాను విద్వాంసుడు తన వాస్తవ స్వరూపము, తనకు 'ఇదం' ఈ ప్రపంచము అని స్ఫురించుచున్న పరిచ్ఛిన్న పదార్థము లేమియును తాను వాస్తవమున కానినియు, 'అహం' నేను అని స్ఫురించు చున్న తన స్థూలసూక్ష్మ శరీరములుగాని పంచభూతములుగాని ఈ త్రిభువన

ములలో మరియేఇతర పదార్థముగాని, విషయముగాని తాను కానని నిశ్చయమునుపొంది, అహం, ఇదం అనురెండు పదార్థములు పరమార్థతః లేవనియు, వాస్తవమున నున్నది, సత్పదార్థయొక్కటియేననియు ఆ సత్పదార్థమే తన వాస్తవస్వరూపమనియు, యీ దృఢజ్ఞానమే తన ఆత్యంతిక దుఃఖనివృత్తికి సాధనమని ప్రీతి నిశ్చయములతో నిరంతరము మననాభ్యాసాదులను చేయుచుండవలయును. ఇట్టి విద్వాంసుడు అభ్యాసపాటవముచే సమాధి సుఖమును ప్రయత్నముతో పొందగలుగుచుండును. ఇట్టి స్థితి యందు సకల వృత్తులును తనయందే లయించుటచే వృత్తి అఖండాకారమై సుఖము నిచ్చును. ఇది కేవల నిరంతరాభ్యాస సాధ్యమేకాని తదితరము కాదు. ఇట్టి అభ్యాసముచే సర్వసంకల్పములును క్షీణించి సాధకునకు సమాధి సుఖమునకు, అనగా నిస్సంకల్పస్థితికి సహకరించును. ఇట్టి స్థితి ప్రయోజనములను విద్యారణ్యులు :—

శ్లో॥ యథా నిరింధనో వహ్ని స్స్వయోనా వుపశామ్యతి ।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనా వుపశామ్యతి ॥

శ్లో॥ స్వయోనా వుపశాంతస్య మనస స్సత్యకామినః ।
ఇంద్రియార్థవిమూఢ స్యానృతాః కర్మవశానుగాః ॥

కట్టెలన్నియు దహింపబడినప్పు డగ్ని తన కారణమగు తేజస్సునందు, లయించునట్లు, సకలవృత్తులును సమాధ్యభ్యాసముచేత లయించుటవలన అంతఃకరణమును నట్లే తన కారణమగు సత్త్వమునందు లయించును. అప్పుడు ఆత యంద లాష గలిగినట్టి, మనస్సు వృత్తి రహితమై తన కారణమగు సత్పదార్థమందు లయించుటం జేసి నిర్విషయమగును. అందుచే కరాధీనములగు సుఖదుఃఖములు మిథ్యాభూతములగుచున్నవి, అని తెలుపుచున్నారు. విషయవృత్తులన్నియు నశించుటవలన వృత్తి నిర్మలమైనదగును. అందువలన కేవల సాత్వికవృత్తి అఖండాకార స్వరూపము నొందును. ఇదియే

నిత్యనిరతిశయ సుఖమైన ఆత్మ స్వరూపము విద్వాంసుడు ఇట్టి తన సత్యస్వరూపమును స్వానుభవము నొందుటకు, తన స్వరూపము నిట్లనుసంధించవలయును—తన సత్యస్వరూపము తనలో అద్వితీయుడై యున్న ప్రత్యగాత్మయే యనియూ, ఈ యనయే తనలోనూ, సర్వజీవులలోనూ, సర్వాధిష్ఠానముగానున్న పరమాత్మ యనియూ, ఈయనయే బాహ్యాంతర పరిపూర్ణుడై తెలియబడుచున్న పరమాత్మ యనియు, ఇదియే తన సత్యస్వరూపము కాని వేరు కాదని గ్రహించవలయును. ఈ అద్వితీయ అఖండాకారమైన తన సత్యస్వరూపమును, సర్వోపాధి వినిర్ముక్త, సర్వాధిష్ఠాన, సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి, స్థితి, లయ, వివర్త, అభిన్న, నిమిత్తోపాదానకారణ, నిత్యనిరతిశయ, నిరవయవ, అద్వితీయ, అసంగ, కర్తృత్వాది రహిత, నిర్వికార, అఖండ పరిపూర్ణ చైతన్య స్వరూపమైనదిగా అనుసంధానాదులను చేయుచూ, ఇంకనూ తన సత్యస్వరూపమును నిర్మల మహాకాశమువంటి పరిపూర్ణ అసంగరూపుడనియూ సంవిత్స్ఫటిక మహాశిల లాగున అచలుడైన నిర్మలుడననియూ నిస్తరంగ సముద్రములాగున శాంత గంభీరములు గలవాడ ననియూ తాను కేవల చిదాకాశ స్వరూపుడనను నిశ్చయము గలిగినవాడై అట్టి పరిపూర్ణుడైన తానే భ్రాంతి ప్రారబ్ధవశమున ఈ ఉపాధి సంస్థితుడనై యున్నాను కాని, నా వాస్తవస్వరూపము ఈ పరిచ్ఛిన్న కర్తృత్వాది, అధ్యాస గలిగిన నేను అను ప్రతీతితో యున్న ఈ దేహాదులు కాను. ఇవి భ్రాంతి మాత్రములనిన్నీ తన వాస్తవస్వరూపము అద్వితీయ అఖండ పరిపూర్ణ చైతన్యమనిన్నీ విద్వాంసుడు-గ్రహించి విశ్వాస నిశ్చయముల నొందవలయును-

అయినను యిట్టి అభ్యాసకుడైన విద్వాంసుని గూడ ఆవరణ, విక్షేప దోషములు బాధించుచుండును, ప్రతి జీవునకున్నూ అజ్ఞానము రెండువిధముల భాసించును. అవియేవనిన ఒకటి అసంభావన, రెండు విపరీత భావనయనునవి. ఇందు అసంభావన యనగా అద్వితీయ సత్పదార్థమైన బ్రహ్మ లేదు, కనబడుటలేదు యని తలచుట. ఇదియే ఆవరణశక్తి, ఈ శక్తి యెంతటి

విద్వాంసునికైనను ఆత్మజ్ఞానము కలుగనివ్వదు. ఇంక రెండవదియైన విప రీత భావనచే కలుగు విక్షేపశక్తి యీ మిథ్యాప్రపంచమునే వాస్తవమైన దానిగ తోపింపజేయుచు సతతము సుఖదుఃఖాది మనోవికారములను, సక్తతాభి మానములతోను, సంకల్పవికల్పములతోడను, రాగద్వేషాదులను, జీవునకు కలిగించుచుండును. ఈ రెంటినీ విద్వాంసుడు జయించిన కాని తన వాస్తవ స్వరూపసాక్షాత్కారము కలుగదు. కావున విద్వాంసుడు తన నిత్యానిత్యవివేక విచారణ, మననాదులచే తన ఆవరణదోషమును; సతత ధ్యానసమాధ్యభ్యాస ములచే తన విక్షేపదోషమును పోగొట్టుకొనుట విద్వాంసుని కావశ్యకమగు చున్నది. ఇందొక చిన్న రహస్యమున్నది. అదియేది యనిన విక్షేపకార్యము ప్రారబ్ధము ననుసరించి యుండును—కావున జ్ఞానాభ్యాసమైన ముముక్షువునకు, తన జ్ఞానబలముచే ఆవరణదోషము క్షీణించిననూ, ప్రారబ్ధము ననుసరించి విక్షేపము విడువదు. అయిననూ దానిని, విద్వాంసుని జ్ఞానపటిమచే, సక్త తాభిమానరహితముగ ననుభవించునెడల, అయ్యది ముముక్షువునకు తన పరమ ప్రాప్తికి ప్రతిబంధము కానేరదు. కాని విద్వాంసుడు తన విక్షేపకార్యమైన అనుభవముల యందెంతమాత్రమును సక్తుడుకాకూడదు—

విద్వాంసునికైననూ మననాద్యభ్యాసములు లేనిది గురువులు చెప్పినంత మాత్రమున బ్రహ్మ సాక్షాత్కారము కలుగదు. కాన శాస్త్రమందు విశ్వాసముతో విచారాదులను చేయుచుండుట యావశ్యకము. ఏలనన :—

శ్లో॥ పరోక్షజ్ఞాన మశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరత్ ।
అవిచారోఽపరోక్షస్యజ్ఞానస్య ప్రతిబంధకః ॥

అనగా అవిశ్వాసము పరోక్షజ్ఞానమును చెరచును. అవిచారము అనగా విచారము చేయకపోవుట అనునది విద్వాంసునకు అపరోక్షజ్ఞానమును కలుగ నియ్యక చెరచును, అనిన్నీ యింకనూ సామాన్యముగ నొకటి రెండుసార్లు విచారించిన యెడల బ్రహ్మ సాక్షాత్కారము కలుగనిచో, విద్వాంసుడు విసుగు

జెందక సాక్షాత్కారము కలుగువరకును, అనగా ఫలప్రాప్తి పర్యంతము బ్రహ్మ విచారము నిరంతరము చేయుచుండవలె నను విషయమును-

శ్లో॥ విచార్యాప్యాపరోక్ష్యేణబ్రహ్మాత్మానంవేత్తిచేత్ ।
ఆపరోక్ష్యావసానత్వాద్భూయోభూయోవిచారయేత్ ॥

అని పంచదశికారులైన విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు. కావున విద్వాంసుడు తాను పరోక్షముగా గ్రహించిన బోధను సతతముగా నిట్లు విచారానుసంధానాదులను చేయుచుండవలెను. అది యెట్లుండవలెననిన :— వ్యవహారకాలమందైనను తనకు నేను అని స్ఫురించునప్పుడు గూడ, తన వాస్తవస్వరూపము అద్వితీయ అఖండపరిపూర్ణ స్వరూపమైనదియనిన్నీ కాని తన ప్రారబ్ధ వశమున యిప్పుడు యీ శరీరోపాధిబద్ధుడనై పరిచ్ఛిన్నముగా నున్నాననియు, అయిననూ యిప్పుడు తన వాస్తవస్వరూపము పరోక్షముగానైనను, నిశ్చయముగా గ్రహించినవాడను గనుక, నా అభ్యాసపాటవముచే అచిరకాలముననే, నా ప్రారబ్ధము క్షయించి నాకు సాక్షాత్కారము కలుగునను ప్రీతి నిశ్చయములతో, ఉత్సాహపరుడై, ఆత్మవిచారానుసంధానాదులను మనోనిష్ఠతో యాచరించుట ముముక్షు కర్తవ్యము-అట్టి యతి కర్తవ్యతానుసంధానములను సంగ్రహముగ నిట్లు తెలిసికొని అభ్యసించుచుండవలయును-

ఇప్పుడు నేను అజ్ఞాన స్వరూపమును తెలిసుకొన్నవాడను గనుక నా జ్ఞానాభ్యాసముచే లింగశరీరమను అంతఃకరణబంధమునుండి విముక్తుడనగుదును. నేను చిత్తుయొక్కయంశమునుగాన చిదానందసముద్రమునందు ప్రవేశించినవాడ. భేదములేదుగావున సర్వోపాధివినిర్ముక్తుడనై పరమాత నే యగుచున్నాను. మరియు నేనుసాక్షి, కూటస్థుడను, ప్రత్యగాత్మను. పరిపూర్ణుడను, చిత్స్వరూపమునేయగుదును గాని మరియొకటిగాను. ఒక్కటి యయిన ఘటముననే ఘటమనియు, కలశమనియు, నామభేదకల్పనంబునందు, దానితోకూడిన యాకాశమునందు ఘటాకాశమనియు, కలశాకాశ

మనియు, వ్యవహారభేద కల్పనంబులు కలిగినటుల నొక్కటియగుజ్ఞానమునకు ప్రపంచభేదకల్పనంబును, అజ్ఞానకల్పిత అంతఃకరణసహితుండనగు జీవుడను మొదలుగాగల వ్యవహారభేద కల్పనంబును కలిగియున్నది. ఇందు ఘటము పగిలిపోవుటచే, ఘటాకాశము, కలశాకాశము, అను రెండునూ నివర్తించి మహాకాశంబొక్కటియే నుండునటుల అజ్ఞానము నశింపగనే, జీవేశ్వ రాదిభేదంబును, నివర్తించి చిత్తు ఒక్కటియే నిలుచును, ఈ చిత్స్వరూప మొక్కటియే నేను, అహం ఈ ప్రపంచము ఇదంరూపమున భాసించు చుంటిమి. వాస్తవమున ఇదియంతయును ఒక్కటియైన పరమాత్మ స్వరూప మే కాని తదితరమేమియును కాదు. శ్రుతులును ఈ విధంబుననే ఐక్యంబును జెప్పుచున్నవి. అగ్నిని అగ్నియందుంచునెడ, నైక్యంబునొంది య న్నం బగు, నామముచేతను. రూపముచేతను, గ్రహింపబడునే కాని, వేరుగా తెలి యబడనటుల నున్నూ, ఉప్పుకొఠారమునందు ఉంచబడిన తృణము మొదలగు నవి కాలక్రమమున లవణమే యగునటులనున్నూ, సముద్రజలము సందుంచ బడిన లవణము కరిగి సముద్రజలరూపము నొందునటులనున్నూ, అచేత నంబగు ఈ జగంబు చేతనంబునందు మిథ్యారూపమునకనపడుచూ, జ్ఞానము వలన విలాపనము చేయబడినదియయి, అద్వితీయమైన చేతనమే యగు చున్నది. మరియునూ, జలమునందుంచబడిన జలంబును, క్షీరమునందుం చబడిన, క్షీరంబునూ, ఘృతమునందుంచబడిన ఘృతంబును, నాశంబు నొందనివై అభిన్నముగ యొక్కటిగనే గ్రహింపబడుచుండునట్లు నిత్యానం దంబును, పరమకారణంబును నగు చేతనంబునందు, ప్రవేశించిన నేనునూ, నైక్యంబునొందువాడను. మరియునూ, నేను నిత్యంబును, సర్వగతంబును, శాంతంబును, పరిపూర్ణంబును, నిష్కలంబును, నిష్క్రియంబును, శుద్ధం బునగు బ్రహ్మంబు నగుదును. మరియునూ, నేను పుణ్యపాపవినిరుక్తంబును, జగత్కారణంబును, అద్వితీయంబునూ నగు బ్రహ్మంబు నగుదును. అని ఇట్లు జిజ్ఞాసువైన విద్వాంసుండు, గురుశుశ్రూషాదిపరుండై సత్త్వాదిగుణ

రహితంబగు బ్రహ్మంబు నెపుడునూ. తానుగనే ధ్యానింపవలయును. ఇదియే విద్వాంసునకు విద్యాభ్యాససారము. దీనిమహిమను గురించి :—

శ్లో॥ అభ్యాసా త్సర్వసిద్ధిఃస్యాదితి వేదానుశాసనం
తసా త్త్వం సర్వముత్సృజ్య కుర్వభ్యాసేస్థి రంమనః ॥

అనగా జిజ్ఞాసువునకు సతతాభ్యాసాదులవల్లనే సర్వసిద్ధి కలుగు ననియూ యిదివేదశాసన మనియూ, ఇటుల అభ్యాసముచేయు విద్వాంసునకు మనస్సు క్షయమొందినదై, మనసుక్షయమొందగ, నాత తనంతట తానుగనే ప్రకాశించుచుండును. ఆత్మ ప్రకాశింపగా సర్వసంసార దుఃఖంబులును ఆత్యంతికముగా క్షయ మొందుచున్నవి, యని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు—కానఇదియే విద్వాంసునికి విద్యాభ్యాస ప్రశంసా సారము.

## అఖండత్వ నిరూపణ

ఇట్టి స్వరూపమును గురించి అనుసంధాన ప్రకార నిరూపణమందు లఘువుగ తెలుపబడియున్నది. అయినను యీ అఖండ స్వరూప వివేచనము జ్ఞానమున కతిసన్నిహితమై స్వరూపానుసంధాన, గోచరములకు సాక్షాత్సాధనముగనుండి జిజ్ఞాసువులకు యిట్టి అఖండత్వమును బాగుగ గుర్తించినచో, బోధ, కరతలామలకముగ యుండును గాన తిరిగి దీనిని విపులముగ విచారింతము.

అఖండత్వమనగా — త్రివిధ పరిచ్ఛేద శూన్యత్వమని గ్రహించవలెను. ఈ త్రివిధము లేవనగా—దేశ, కాల, వస్తువులు. ఇవి యన్నియు నామరూప మాత్రములే యనియును కల్పితములనియు అనగా

అధ్యాసములనిన్నీ వీటికి అధిష్ఠానము అస్తి, భాతి, ప్రియత్వములతో తెలియ బడు పరిపూర్ణాఖండ స్వరూపమైన బ్రహ్మయేననియు లోగడ నిరూపణలచే నిశ్చయించి యుంటిమి. దీనినే

శ్లో॥ నామ రూపాదయో యత్ర కల్పితాశ్చిత్త విభ్రమాత్ ।
వ్యోమ్నీవ నగరం యత్తద్బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥

ఆకాశమందు కనబడు గంధర్వ నగరముతో (చిత్ర వర్ణములు) ఆకాశమునకు సంబంధములేనియట్లు—యీ దేశ, కాల, వస్తువులు భ్రాంతి కల్పితములగుటచే వీటితో నా పరమాత్మ యెట్టి సంబంధమును పొందక ఆయన సదా, అఖండ అద్వితీయ పరిపూర్ణుడై యుండుననిన్నీ మరియు ఆ బ్రహ్మ నేను అని "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యము తెల్పుచున్నది గాన జిజ్ఞాసువునకు తన వాస్తవ స్వరూపము బ్రహ్మయే యని గ్రహించుటకు అఖండ స్వరూపగ్రహణ మావశ్యకము. పయిన తెలిపిన మూడు విధములలో వ్యావహారిక పరిచ్ఛేద గ్రహణములచే దృశ్యవస్తు సముదాయములు కల్పితము లని యెట్లు గ్రహించుచున్నామో యట్లే వ్యవహార రహిత వస్తువులయందు అనగా దేశకాలములు గూడ మనః కల్పితములుగానే నెరుగవలయును. ఈ త్రివిధముగా కలుగుచున్న మూడు కల్పిత జ్ఞానములను వాస్తవ జ్ఞానముచే త్యజించగా అఖండముగా శేషించు సత్పదార్థమే మనలకు వాభిన్న బ్రహ్మ మగుచున్నది. అనగా తానేయగుచున్నాడు. కాని యిచట అన్నియు తీసివేసిన యెడల (త్యజించిన) మిగులునది యేమియులేకపోవుట సంభవించునుగాని యొక్క సత్పదార్థముండుట యెట్లు సంభవమని అన్యమతవాదులిచట మన కొక యాక్షేపణ నిచ్చుచున్నారు. వీరిలో బౌద్ధులు ప్రధానులు. వీరు శూన్య వాదులు. వీరి యాక్షేపణ మేమన కనబడు సర్వమును త్యజించిన మిగుల నది, మాకున్నూ—అద్వైత సిద్ధాంత వాదులైన మీకున్నూ ఒక్కటియే గదా—అది శూన్యము—గాన మీ సిద్ధాంతమునకున్నూ, మా సిద్ధాంతమున కున్నూ బేధములేదని యూహించుచుందురు. మరియు మాధ్వరామానుజుల

మనలను "ప్రచ్ఛన్న బౌద్ధులు" అని పరిహసించుదురు. కాని వాస్తవము విచారించినచో వారి సిద్ధాంతము నిలబడుటకే వీలులేదు—ఎట్లనగా శూన్యము అనగా లేనిది అనియే కదా. ఇట్లు కలుగుటకు మొదట యొకటి యుండిన గదా లేకపోవుట యను శూన్యవాదమునకవకాశము యుండును—గనుక వారైనను మొట్టమొదట యొక పదార్థ సత్తను ఒప్పి—తరువాత లేదన వచ్చునుగాని అట్లుగాక ఏమిలేదు అనుటకు అనగా శూన్య వాదమునకైనను సంభవము కలదు. ఇదిగాకను బౌద్ధమత వాదులు మన అద్వైత సిద్ధాంతమును బట్టి త్యజించబడునదంతయు కల్పిత పదార్థమేగాని వాస్తవ పదార్థము కాదని వారు తెలుసుకొనలేక మందప్రజ్ఞులై యిట్టి యాక్షేపణలిచ్చి శంకించుచున్నారేగాని వారి సిద్ధాంత సామర్థ్యముచేత నెంమాత్రము కాదు. ఇట్టి శూన్యవాదులుకూడ మొదట యేదో యొకటి యున్నదని ఒప్పుకొని యీ సర్వము అట్టివారి శూన్యములోనుంచే వచ్చినదనక వారికి తప్పుటలేదు. అనగా యీశూన్యమని వారనునదియే జగదధిష్ఠానముగా నుకొనుచున్నారు—ఇట్టిది అజ్ఞానముగాక మరేమున్నది. గనుకనే యిట్టి బౌద్ధమత సిద్ధాంతమును అజ్ఞానవాదమని చెప్పక తప్పదు—ఇట్టి వారికి గూడ యేదోయొక పేరున దృశ్యాధిష్ఠానమును యొప్పుకొనక తప్పకుండుట చేతనే "యచ్ఛూన్య వాదినాం శూన్యం" శూన్యవాదులు దేనిని శూన్యమని చెప్పుచున్నారో అదియే మా బ్రహ్మ యని యోగ వాసిష్ఠమందు తెలుపుచున్నారు. ఇదిగాక వ్యవహార దృష్టితో పరిగణించిననూ మన అద్వైత సిద్ధాంతమునకున్నూ బౌద్ధమత సిద్ధాంతమునకున్నూ—జీవించియున్న గజమునకున్నూ, మృత గజమునకున్నూ యున్నంత భేదమున్నదని చెప్పక తప్పదు. మరియున్నూ కార్య సిద్ధికి ధనము సంగ్రహించి నిర్వహింపదలచువానికి— ధన రహితుడు అనగా ధనములేకనే సిద్ధిని బడయగలనను వానికిని యుండునంత తారతమ్యము గలదు.

ఈ కాలము ననుసరించి కొంతమంది బుద్ధిమంతులు యిట్టి బౌద్ధ సిద్ధాంతములను వారి పరమతరణోపాయముగ దలచి వ్యవహారబుద్ధి సౌలభ్య

తలతో గ్రహించుచున్నారు. గాన అట్టివారు ప్రమాద యుక్తులుగా కుండు టకుగాను ఈ రెండు సిద్ధాంతముల వాస్తవికత యిచట సవిస్తరముగా నిరూపింపబడినది.

గనుక జిజ్ఞాసువు అద్వైత సిద్ధాంతమును బాగుగ గ్రహించి, జ్ఞాన మున కతి సన్నిహితమగు యీ అఖండత్వమును—త్రివిధ పరిచ్ఛేద రహిత ముగా సత్యజ్ఞానానంద లక్షణములతో, అద్వి యం—అఖండ పరిపూర్ణాకారమే తన వాస్తవ స్వరూపమని గ్రహించి సర్వదా తన సత్య స్వరూపమును అఖండ సత్పదార్థముగా గ్రహించి అనుసంధానము గావించుచుండవలయును. అహం, నేను అను తనయొక్క అఖండానుభవమును ప్రతివారును స్మృతిరూపమున నేను అని త్రికాలములయందును, అవస్థాత్రయమందునూ, ఉన్నది. ఉన్నాను అను సచ్ఛబ్ద మాత్రముతో సర్వ వస్తువులయందును తనను, సదా గుర్తించుచూ అనుభవించుచునేయున్నారు. ఇది గుర్తించి సదా తాను, సంవిత్స్వరూపమైన తన వాస్తవ స్వరూపముతో, సర్వదేశములయందు—సర్వకాలములయందు—సర్వవస్తువులయందు సర్వావస్థలయందుగూడ నేను నా సత్యస్వరూపముతో యున్నానని తెలుసుకొనిన యడల తన అఖండత్వ—పరిపూర్ణత్వములను గ్రహించినవాడే యగును. ఇట్టి తన అనుభవమునంతయూ సవిస్తరముగా లోగడ నిరూపించి యుంటిమి—దానినంతయూ జ్ఞప్తినుంచుకుని తన వాస్తవ స్వరూపము త్రివిధ పరిచ్ఛేద శూన్యమైనదియని తెలుసుకుని, తన అఖండ స్వరూపానుసంధానము గావించుచుండవలయును. ఇట్టి తన అఖండానుభవ సుఖము ప్రతివారిచే అనగా పండిత పామరులచేగూడ సుషుప్తియందును—విద్వాంసునిచే సమాధి స్థితియందునూగూడ యీ సుఖానుభవము పొందబడు చున్నది. ఇట్టి అఖండానుభవము, సుఖ స్వరూపము గనుకనే ప్రతివారున్నూ సుషుప్తిని కోరుచూ అనుభవించుచున్నారు—అయినను, యిట్టి స్వరూప సుఖ మును సుషుప్తియందు అజ్ఞానావృతులై కర్మ ఫలమునుబట్టి తాత్కాలికముగ సుఖము ననుభవించుచున్నారు. గాని యిది నిత్యము గావించుటకు జ్ఞానమావ శ్యకము. ఇట్టి జ్ఞానముతో అఖండ సుఖానుభవమును పొందుటే సమాధియన

బడును. ఈ సమాధ్యభ్యాస పరిపాక పాటవముచేతనే విద్వాంసుడు తన నిత్య నిరతిశయానంద సుఖమును పొందును. ఇట్లు సుషుప్తి, సమాధి స్థితులందు కలుగు అఖండ స్వరూప సుఖమునే "యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి సభూమాయో వై భూమాతత్సుఖం" అని శ్రుతి తెలుపుచున్నది.

# ఆత్మ విచారము

ముముక్షువైన జిజ్ఞాసువునకు యీ, చేసిన విచారమువల్ల అత (తాను) నితు డనిన్నీ, యీ శరీరత్రయము లాగంతుకములని నిశ్చయమగుచున్నది గదా. శుద్ధ వుడు సత్యస్వరూపుడైన తనయందు అనాది అవిద్యాకామకర లను, కల్పితకారణాంతరములచే యీ శరీరత్రయములు ఆగంతకులుగా తన యింటియందు ప్రవేశించిరి. ఇట్లు వీరు ప్రవేశించి బహుకాలము (అనాది) అగుటచే, శుద్ధ వుడనయిననన్ను, నా సహజమైన సచ్చిదానందలక్షణములను మరపించి వారి స్వభావమైన పరిచ్ఛిన్న జడదుఃఖములను నాయందు ప్రవేశ పెట్టి నా యింటిలోనేయుండుచు చివరకు యీ యిల్లుగూడ వారిదనే భ్రాంతిని వాస్తవ యజమానినైన నాకు కలుగజేసి నా అండనచేరి నా స్వప్రకాశలాభ ములతోనే వారు సమస్తానుభవములు చేయుచు సత్యజ్ఞానానంతస్వరూపుడనైన నన్ను సంసారిగా కల్పనజేసి దుఃఖముల పాలు గావించుచున్నారు. అనాది కాలమునుండి వీరు నా యింటియందే యుండివారే యజమానులు లాగున వ్యవహరించుచున్నందున భ్రాంతియుతుడనై వారే యజమానులేమోయని తలచి వారిలో ప్రధానుడైన అంతఃకరణము నను వర్తించి (సూక్ష దేహము) వాడు చేయు దుస్సంకల్పములు, కర్తృత్వభోక్తృత్వములు మొదలయిన క్రియలను నావియని తలచి యీ సంసారమహార్ణవమందు మునింగినవాడన

యితిని. కాన నా పుణ్యఫలముచే గుర్వీశ్వరానుగ్రహము కలవాడనై యిప్ప టికి, నేనెవడనో యీ శరీరత్రయచోరులు నా యింటి యందేట్లు ప్రవేశించిన వారలో తెలుసుకొన్నవాడనియితిని. కాని వీరిని వెడలగొట్టుట కష్టసాధ్యము. అయినను వీరిని నా హృత్పద మందున్న వివేకమను సాధనముచే నిర్మూలిం చుదునుగాక. అప్పుడుగాని నా స్వరూపస్థితిని పొంది శాంతిసుఖములను బడయజాలను.

అంతఃకరణము, సూక్ష్మ శరీరి, అహంకారము, మనస్సు, యివి యన్నియు సందర్భమునుబట్టి పర్యాయపదములుగ గ్రహించవచ్చును. ఈ శరీరత్రయములో ప్రధానుడు అంతఃకరణమను మనోరూపుడే. వీనిని యిప్పుడు తెలుసుకొంటిమి అను యీ మొదలు గాగల ఆత్మ విచారము జనకుల వారు యిట్లు యోగవాశిష్ఠమందు చేయుచున్నారు.

శ్లో ॥ ప్రబుద్ధోఽసి ప్రబుద్ధోఽసి దృష్టశ్చోరోమయాత్మనః ।
మనోనామేహ హన్మే త్వసం మనసాఽస్మి చిరంహతః ॥

ఇప్పటికి తెలుసుకొంటిని, ఆత్మ నపహరించిన చోరుండుగానంబడియె. ఈ మనస్సు చిరకాలమునుండి నన్నుహింసించుచున్నది. కాని నిపుడు దీని జంపెదననియు, మరిన్నీ

శ్లో ॥ ఏతావంతమిమంకాలం మనోముక్తాఫలంమరు,
అ విద్ధమాసీదధునా విద్ధంతు గుణమర్హతి ॥

నా మనస్సు అను ముత్యము యింతకాలమువరకు విద్ధముకాలేదు. ఇప్పుడు విద్ధముకాబడినది. విద్ధము అనగా, శిక్షింపబడి సంస్కరణముగా నింపబడినది. గుణమనగా శమదమాది గుణసంయుతం ఇట్లే ముత్యపు ఉదాహరణమందువిద్ధంఅనగా తొలిచివేయబడినదనియు—గుణమనగా సూత్ర మనియు గ్రహించవలయును. జనకుండిటుల చింతించినవాడై యీవిధంబున

యోచించెను. వీడు, నేను నాది, యను ఆ మానములు, లోనతోచుచున్న కర్తృత్వ భోక్తృత్వములు మొదలుగాగలవి అసత్యములు గావున వానిని విడచిపెట్టి—అతిబలవంతమైన యీనా ఆసంతృప్తత మనస్సునుగూడ విడచి పెట్టి ప్రశాంతినొందుచూ వివేకమునాశ్రయించెదను. ఈదృశ్యమందు నిత్యమై గ్రాహ్యమగువస్తువేదిని, నాకు కనపడుటలేదు యత్నముచేసి దేనిని సాధింతును పరిపూర్ణమై స్థిరంబగుచిత్తే, నాస్వరూపముగాన నాకు కల్పింపదగిన దేమున్నది. సర్వమునేనై యున్నందున నాకు కావలసినదేమియుండును.

శ్లో ॥ నా వాంఛామ్యసంప్రాప్తం సంప్రాప్తం నత్యజామ్యహం ।
స్వచ్ఛ ఆత ని తిష్ఠామి యన మాస్తుతదస్తుమే ॥

నేను ప్రాప్తించని దానిని కోరను. ప్రాప్తమైనదానిని విడువను. నేను నిరలంబగు నా యాత యందు స్థితిగలవాడనయి యుందును. ప్రారబ్ధానుసారమున నాకు యేదికలుగవలయునో అదియే కలుగుగాక అని నిశ్చయించుకొన్నవాడై యిట్లు చింతింపదొడగెను.

శ్లో ॥ అనుధావతియోభోగాం స్త్యక్త్వాశమరసాయనం ।
సంత్యక్తమందారవనః ప్రయాతి విషజాంగలమ్ ॥.

శ్లో ॥ యదియాసి మహీరంధ్రం బ్రహ్మలోకమథాపి వా ।
తన్న నిర్వృతి మాప్నోషి వినోపశమనామృతమ్ ॥

శ్లో ॥ ఇమావిచిత్రాః కలనా భావాభావమయాతి కాః ।
దుఃఖాయైవ భయోగ్రాయ ససుఖాయ కదాచన ॥

శ్లో ॥ శబ్దాదిగా రేతా ః కింమూర్ఖహతవృత్తి ః ।
యసా త్కించిదవాప్నోషి యస్మిన్స్వహాసినిర్వృతిం,
తసి ంశ్చిత్తశమే మూర్ఖనా ధావసి కింపదమ్ ॥

శ్లో ॥ కురంగాళిపతంగేభ మీనాస్త్వేకైకశోహతాః ।
సర్వైరేతై రనర్థైస్త్వైర్వ్యాప్తస్యాజ్ఞ కుతస్సుఖమ్ ॥

అనగా తాత్పర్యార్థమేమనిన:—ఎవరు శాంతియను రసాయనంబును విడిచి భోగంబుల ప్రేరితుడై వర్తిచుచుండునో వాడు పారిజాతవనంబు విడచి విషవృక్షభూయిష్టంబగు సరణ్యంబును గూర్చి పోవుచున్నాడు. ఓ మనస్సా—నీవు పాతాళంబునకేగిననూ, లేక బ్రహ్మ లోకంబునకేగిననూ ఉపశాంతియను నమృతంబునొందక సుఖమొందనేరవు. విషయంబులు సద సద్వస్తువులగుటవలన నీ భావాభావరూపంబులును, నానావిధంబులునగు కల్పన లును, అధిక దుఃఖంబునే కలిగించుసుగాని యెప్పుడును సుఖంబునీయజాలవు ఓ మూర్ఖచిత్తమా, శబ్దాదివిషయంబులందు వృత్తులతోనేమిలాభము. ఏశమం బువలన బ్రహ్మ పదంబునొందుదువో, ఏ శమంబుకలుగగా ఆత్మానందమనను భవింతువో, అట్టి శమంబునందేల నిలుకడ నొందవో చెప్పుము.

ఒక శబ్దవిషయంబుచేత మృగంబును, గంధ విషయంబుచేత తుమె దయు, రూపవిషయంబుచేత మిడుతయి, స్పర్శవిషయంబుచేత నేనుగుయు, రసవిషయంబుచేత చేపయు, నిట్లు ఒక్కొక్క విషయంబుచేతనే యవి నశించినవి.

ఓ మూఢ చిత్తమా, యీ విషయంబులన్నిటితో గూడిన నీకు సుఖం బెట్లు కలుగునో చెప్పుము. అనిన్నీ—మరియు యీ వాసనా జాలము నాకంత టను బంధమునే కలిగించుచున్నది. కావున దీనిని విడిచి శాంతి నొందితినేని, నాకనంతంబగు జయము కలుగగలదు. ఆత కంటె చిత్తమనునది వేరుగ లేదు. విచారణచేయు పురుషునకు చిత్తమే లేదుకదా. అనగా యీ చిత్తమ నునది అవిచారణవలన నేర్పడినది కావున విచారించిన యిది చిత్తం అని ప్రకాశింపదగినదేదియును లేదు. బిల్వ ఫలమునందు ఏనుగులు వుండుట సంభవింపనియట్లు, సూక్ష్మమగు నా మనసునందు దేశకాలాద్యపరిచ్ఛిన్నంబగు నాత్మ యుండుటెట్లు సంభవము.

## ఆత విచారము

శ్లో॥ పాదాంగుష్ఠాచ్ఛిరో యావత్కణశః ప్రవిచారితం ।
నలబ్ధోఽసావహం నామ కః స్యాదహమితి స్థితః ॥

పాదాంగుష్ఠము మొదలుకొని శిరము వరకును ప్రతియణువును విచారించినను అహం, నేను అను పదార్థము ల ంపదయ్యె. ఇక నేను అని వ్యవహరించుచున్న పదార్థమెయ్యది. నేను వాస్తవమున జ్ఞాన స్వరూపుడను, స్వయం ప్రకాశమానుడను. అయినను ఓ మనసా, నీవు దుఃఖ మూలముననే కలిగితివి గాన నేను ఆతానాత వివేకంబున కలిగిన జ్ఞానముచే నిన్ను వధించుచున్నాను. ఈ జగంబునందంతటను ప్రకాశించువాడను నేను అనునదిగాని, యీ దృశ్యంబున కనబడు నేను కాను. ఈ దృష్టియే వాస్తవమైనది. నేను పరిచ్ఛిన్నుడనను దృష్టి భ్రాంతి కల్పితమై అవాస్తవమైనది. అని చింతించుచు తన యింద్రియములతోనిట్లు సంబోధింపదొడగెను—మీరు వాంఛలేని వారై నను మీమీ విషయంబులను రూపాదులను గ్రహింపగలరు. మీరిట్లు యిచ్ఛాపూరితులై ప్రవర్తించుటకు వాసనయే కారణము. కావున లోనున్న వాసనా సంకల్పములను విడిచి మీ పనులజేయుచుండుడు. ఇటుల జేయుచుంటిరేని యే విధమగు దుఃఖమును పొందనేరరు. మీరు (యింద్రియములు) పట్టుపురుపులు తమవల్ల కలిగిన దారమును చుట్టుకొని నశించినట్లు మీరు ఆశచేత వ్యర్థముగా నశించిపోవుచున్నారు అని యింకనూ తన చిత్తముతో.

శ్లో॥ హే చిత్త సర్వేంద్రియ కోశ తసా ।
త్సర్వేంద్రియైరైక ముపేత్య నూనం ।
ఆలోక్యచాత్మాన మసత్స్వరూపం ।
నిర్వాణమేకామల బోధమాస్వ ॥

సర్వేంద్రియములకు నివాసంబవగు నో చిత్తమా (మనసా) నీవు సర్వేంద్రియములతో నేకత్వమును పొంది, నీ కల్పిత స్వరూపమును లేనిదానినిగా

నెరింగి అనగా అవాస్తవమని గ్రహించి–కేవలంబును, నిర్మలంబునగు జ్ఞాన స్వరూపంబగు మోక్షము గలుగుటకుగాను నిర్వ్యాపారము, నిరిచ్ఛకలదానవై యుండుము అని బోధించి సంకల్పములను వృత్తులను, ఆశలను గెలును గల మనస్సను వశమును చేయించి చిదాకాశంబు బ్రవేశించి సుఖంబుగ విహరింతునుగాక అని

శ్లో॥ పదం తదను యాతోఽసి కేవలోఽస్మి జయామ్యహం ।
నిర్వాణోఽసి నిరంశోఽసి నిరీహోఽసి నిరీప్సితః ॥

నేను నిర నస్కుండనగుటవలన కేవలుండనై బ్రహ్మ భావంబు నొందితి. తాపత్రయంబులడంగుటచే ముక్తరూపుండ నైతిని. పరిపూర్ణుడ నగుటవలన నిరంశుడనైతిని అనగా అపరిచ్ఛిన్నుడనైతిని. సమస్తకోరికలను పొందిన వాడను గావున నిష్కాముండను, అందువలన నిస్సంకల్పుండను నగుచున్నాను. అని తలచెను. అటుల చిత్సామ్యంబుననుసంధించుట వలన లోనను త్తమంబగు నానందానుభవంబునొంది, ఆయానందానుభవంబున తన చిత్తము లయించినదియు, పరిపూర్ణంబును, అపరిచ్ఛిన్నంబును, నిర లంబగు నాత చైతన్యంబు నొంది ఏకాకారంబగు శాంతినిబడసి యుత్కృష్టంబగు చిత్తవిశ్రాంతి నొందెను. గాన ముముక్షువు యీ విధంబునంతయు బాగుగ గ్రహించి తన చిత్తంబును సంస్కరించుకొని, చిత్తవృత్తి నిరోధుండై తన సత్యస్వరూపమైన సత్యజ్ఞానాంత లక్షణములను గ్రహించి తనయొక్క నిత్య, నిరతిశయ, దృశ్యరహిత, స్వప్రకాశ, అసంగ, సర్వాధిష్ఠాన, అఖండ, పరిపూర్ణచైతన్య స్వరూపమును నిరంతరము అనుసంధానము చేయుచుండ వలయును, ఇదియే మోక్షసాధనోపాయము అని గ్రహించవలయును.

# శక్తి, బ్రహ్మ వివేచన

మన యనుభవములో సర్వదా యెచటనైనను శక్తి, శక్తిమత్తుల కభేధమే కనబడుచున్నదిగాని-యీరెండును బేధముగా అనగా ప్రత్యేక ప్రత్యేక ముగా కనబడుటలేదు. ఎందువలననిన యెడల యెచటనైనను యీశక్తి మనలకు ఉపాధిసంయుక్తమైనప్పుడే గోచరించుచు కార్యకారియగుచున్నది కాని అన్యధాగా అగుటలేదు. ఉపాధిసంయుక్తముగాని శక్తినిచూచుట కెవరికిని సాధ్యముకాదు. అట్టిశక్తి కార్యకారియును అగుటలేదు. అయిననూ శక్తి, యున్నదనిమాత్రము శాస్త్రముచేతను మనలో కానుభవమును బట్టి కూడ యొప్పుకొనక తప్పదు. ఏలనన యీకాలమున మనయందరి యను భవములోనున్న విద్యుచ్ఛక్తి (Power of Electricity) యే మనలకు యుదాహరణముగానున్నది. ప్రపంచమున యిట్టి విద్యుచ్ఛక్తి యొకటి యున్నదని తెలుసుకొనియేగదా దానిని వుత్పత్తిచేసి దానిలక్షణములను వుపాధులులేక సాధనములుద్వారానే (Through instruments) తెలుసుకొని అట్టిశక్తిని వివిధయుపాధులద్వారానే యుపయోగించి లాభము పొందుచున్నాముగాని, యీశక్తి యింతగొప్పదైనను వుత్పత్తి (develop)చేసి దాని లాభమును వివిధ, విచిత్ర, భిన్నోపాధులద్వారానే పొందుచున్నాముగాని అన్యధాగా వీని లాభమును నిరుపాధికముగా, మానవునిచే పొందబడుటలేదు. ఇట్టి లాభమును కలిగించుచున్న వుపాధులు లేక సాధనములు (instruments) స్థూల, సూక్ష, సూక్ష తరములుగానుండును. ఎట్లున్నను యివియన్నియు ఉపాధులేగాని, ఉపాధియందుండు శక్తిమాత్రము కాజాలవు. ఈ యుపాధులు యెట్టివియైనను అవికాలక్రమమున చికస్థానాశములు (deterioration and destruction) పొందుచూ అట్టి యుపాధులయందు శక్తికనబడదు. ఉపాధులు పనిచేసినప్పుడు యుపాధులయందు శక్తియున్న

దనియు, పనిచేయనియెడల ఉపాధులయందు శక్తిలేదనియు ఉపాధిస్థితులను బట్టి ఉపాధులయందు చెప్పుచున్నాముగాని అట్టిశక్తిలేదని చెప్పుటకు సాధ్యము కాదు. కనుక యిట్టిశక్తి మనలకుపయోగించినప్పుడును లేనప్పుడును గూడ శక్తియొకటియున్నదని యొప్పుకొనుచున్నాము. కాని కనబడనపుడు శక్తి ఉపాధియందులేదని తెలుసుకొనుచున్నాము గాని యెచటను లేదనిచెప్పుటకు వీలులేదు. ఇట్లే ఒక్కటియైన ఆ పరమాత యందు సర్వశక్తులు యున్నను కార్యకారికాకుండ దారువయందు దహనశక్తియున్నట్లుయున్నది. దారుపయందు దహనశక్తియున్నను అట్టిది దహనముకాని కాలములో దారువ యనియేచెప్పుదుముగాని అగ్నియని చెప్పుటకు వీలులేదుగదా. దారువయందు దహనశక్తియున్నను అగ్నియను యుపాధియొక్క సంస్కరణమువల్లగాని దారువ అగ్నియగుటలేదు. అట్లే యీ పరమాత నుగూడ గుణవిశిష్టుడుగా తోచుచున్న కాలములో మాత్రమే యీయనను శక్తిమంతుడనవలెను. ఈయన గుణవిశిష్టుడుగా కనబడకయున్న నిర్గుణస్థితియందు ఆయనను శక్తిమంతుడనిగాని శక్తితోకూడుకున్న వాడనిగాని శాస్త్రము మనలకు చెప్పుటలేదు. అట్టి నిర్గుణ పరిపూర్ణస్థితియందు అనగా కేవల పరమార్థస్థితియందు ఆయన (యీబ్రహ్మ) జగదుత్పత్తి, స్థితిలయ, వివర్తోపాదానకారణమైన అఖండ పరిపూర్ణచైతన్య స్వరూపమై బ్రహ్మ గానే తెలియబడునుగాని, అన్యవిశిష్టఅవాస్తవ స్వరూపములతో తెలియబడడు. గనుక అగ్ని సంస్కారములేని దారువును దారువుయందు దాహకత్వశక్తియున్నను అగ్ని యనక వలము దారువు అనియే యెట్లు గ్రహించుచున్నామో అట్లే యీ బ్రహ్మ పదార్థమును సర్వశక్తుడైనప్పటికిని ఆయన నిరూపాధికుడగుటచే అనగా యెట్టివుపాధి సంస్కారములు, విశిష్ఠత నివాడు అగుటచే ఆయనను కేవల బ్రహ్మగానే ఆయన సచ్చిదానంద లక్షణములు, సత్యజ్ఞానానంత లక్షణములతో గ్రహించవలెనుగాని అన్యథాగా గ్రహించకూడదని శాస్త్రము వల్ల తెలియుచున్నది. ఈ శక్తియనునది ఉపాధి, విశిష్ట సంస్కారముల చేగాని కలుగదు. ఇట్టియుపాధి విశిష్ట సంస్కారములెట్టివిని యుండక

ఆయన అనగాయీ బ్రహ్మ సర్వదా నిర్గుణ, అఖండ. పరిపూర్ణచైతన్య స్వరూపుడై యుండును. వుడు యిట్టిపరిపూర్ణ అద్వితీయ అఖండ స్వరూపమే తాను అని తెలిసికొని అనుభవమునొందుటే మోక్షమనబడుచున్నది—జిజ్ఞాసువిట్టి స్థిత్యనుభవమునొందుటకు స్వశరీర సర్వదృశ్య మిథ్యాత్వ నిశ్చయజ్ఞానముతో, స్వస్వరూపసతతాను సంధానాదులను ఫలావగతి పర్యంతము అభ్యసించుట యావశ్యకము.

# జనన మరణ స్వరూప వివేచన

జనన మరణములు కల్పితమైన దేహధర ములుగాని ఆత్మధర్మములు గావు. జీవుడు వాస్తవమున తాను ఆత్మ స్వరూపుడుగాని, యీ జనన మరణ వికారములు గలిగిన దేహోపాధులు కాడు. కాన యీ జనన మరణములు వాస్తవమున జీవునికి సంబంధించినవి కావు. అయినను సర్వజీవులకు తప్పని సరిగా యీ దేహానుభవములు కలుగుచుండగా వీటిని నిరసింపజేసి, జీవునకు తాను కాదనుకొనుట సంభవమా ? అని శంకించుట కవకాశమున్నది. కాని ఈలోకానుభవమును బాగుగా వివేచనజేసినయెడల మన అనుభవరూప జ్ఞానములు సరియైనవి గావని దృఢపడగలదు. సిద్ధాంత దార్ఢ్యముకుగాను ఇందు మన అనుభవము సరియైనదా, కాదా యని బాగుగా విచారించవలసియున్నది. అది యెట్లనిన—జనన మరణములు అనగా జీవుడు తన ప్రారబ్ధఫలానుభవ నిమిత్తము ఒక ఉపాధిని గ్రహించుట-మరియొక ఉపాధిని వదులుట, వీటి వల్ల కలుగుచున్నవి. వుడు ఈ స్థూలోపాధిని వదలుట మరణము—తిరిగి మరియొక స్థూలోపాధిని గ్రహించుట జననము. ఈ జనన మరణములు జరుగుటకు అనేక న్నోపాధులు పరిచ్ఛిన్న పరిమితాకారములుండినగాని వీలుకాదు. ఇట్టి పరిచ్ఛిన్న వివిధోపాధులన్నియు కర ఫలానుభవ నిమిత్తము

ఈ మహాకాశమందువచ్చుచు, పోవుచు తిరుగుచుండును. ఇట్లు యుపాధులు తిరుగుచుండుట అనగా జీవునియొక్క గమనాగమనములు అనగా ఉపాధి గ్రహణ త్యాగములు ఒక పెద్ద అవకాశ ప్రదేశమున్నప్పుడే సాధ్యము. లేనిచో సాధ్యము కాదు. ఇట్లు గమనాగమనములు చేయు ప్రదేశమే మహా కాశము. ఇదికూడా నశించునదియే. అయినను మనము ఈ జనన మరణ ప్రవాహములను చూచుచు పొందుచు దుఃఖపరంపరల ననుభవించుచున్నాము. ప్రతి వుడు ప్రత్యక్షముగ ఈ సంసార దుఃఖమును పొందుచున్నాడు కాని ఇది వాస్తవమా, అవాస్తవమా యని ఆలోచించుట లేదు. ఇందు ప్రతిజీవుడు సదా దుఃఖరాహిత్యమును సుఖప్రాప్తిని కోరుచున్నాడు గనుక ఇట్లు మన కగపడు జనన మరణ సంసార దుఃఖము వాస్తవమా అవాస్తవమా యని విచారించవలెను. ఈ సంసార దుఃఖము అనగా జనన మరణ ప్రవాహము వాస్తవమైన యడల దీనినుండి ముక్తికిమార్గములేదనిన్నీ, అవాస్తవమైన యడల ఇట్టిసంసార దుఃఖమును త్యజించుట మూలముగ ఈ దుఃఖమును పోగొట్టుకొని వాస్తవసద్వస్తువును పొందవచ్చును.వాస్తవమనగా ఎప్పటికిన్నీ నాశం లేనిది.నిత్యసుఖమునుపొందవచ్చును. దానికిగాను ఈ విచారణమావశ్యకము ఇట్టి విచారావశ్యకతను "తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ" అని గీతావచనము తెలుపుచున్నది. శాస్త్రమనగా శ్రుతి. ఈ శ్రుతివాక్యమే శరణ్యము. దీనికి సహకారిగా మన యుక్త్యనుభవములను సుకొని నిశ్చయించవలసియున్నది. ఇట్టి శ్రుతివాక్యములన్నియు ఉన్న సత్యపదార్థము బ్రహ్మ ఒక్కటియే. తదితరమేమియులేదు అనిచెప్పుచున్నవి. లోగడ మనము విచారించిన వాక్యములను బట్టిన్నీ నిశ్చయమగుచున్నది. కాని మనయనుభవము విపరీతముగానున్నది. అనగా ద్వైతముతప్ప గోచరించుట లేదు. దీనినే శ్రుతి "భ్రాంతిమాత్రమిదంసర్వం" అని చెప్పుచున్నది. గనుక దీనికికారణము భ్రాంతియేనని తెలుసుకొనవలయును. దీనినే— 'ప్రమాదంవై మృత్యు మహంబ్రవీమి' అని చెప్పుచున్నారు. దీనిని గురించి

లోగడ విమర్శించియుంటిమి. వాక్యబోధనుబట్టి పదార్థములనేకములు లేక పోయినను ఉన్నట్లు మనయనుభవము కలుగుచున్నది. గాని మన అనుభవములన్నియు వాస్తవములే కావలెనను నియమములేదు. ఇందులకు మనకు నిద్రయందుకలుగుచున్న స్వప్నాదులు, జాగ్రతలో అనుభవించుచున్న శబ్ద చలనచిత్ర ప్రదర్శనములే దృష్టాంతములు. దీనిని గురించి లోగడ విస్తరముగా విమర్శింపబడినది గనుక తిరిగి ఇచట నిరూపణచేయుటలేదు.

రెండవ విషయమేమన, లోకవ్యవహారమున మనయనుభవములో కూడా ఈ గమనాగమనమను కార్యములు పరిచ్ఛిన్నమైన భిన్నభిన్నవస్తువులకే సంభవముగాని, అపరిచ్ఛిన్నమై పూర్ణమైన ఏ వస్తువునకుకాదు. ఈ కనబడు ద్వైతప్రపంచము కనబడుచున్నను అది వాస్తవమైనదికాదని శ్రుతి వాక్యములవలన నిశ్చయమగుచున్నది. శ్రుతి "మాయామాత్రమిదంద్వైతమద్వైతం పరమార్థతః" అని తెలుపుచున్నది గాన ఈ కనబడుచున్న ద్వైతప్రపంచము వాస్తవమైనది కాదని నిశ్చయమగుచున్నది. ఇట్లు నిశ్చయమైన పిదప ఉన్న సత్య వస్తువు బ్రహ్మ యొకటియే అని తెలిసినను దానిని అనుభవములోనికి తెచ్చుకొనుటకు మనకు ఈ దేహాదులు అడ్డువచ్చుచున్నవి. ఇవియన్నియు భ్రాంతి జన్యములు. "భ్రాంతి మాత్రమిదం విద్వన్ విశ్వం బ్రహ్మణికల్పితమ్" అని శంకరులవారు చెప్పుచున్నారు. ఈ ప్రపంచ దృశ్య పదార్థములన్నియు జ్ఞానముచే బాధనొంది మిథ్యయగుచున్నవి. ఇట్టి మిథ్యాత్వమును 'ఇదం', మమేదం, అను రెండిటిలోను శ్రుతియుక్త్యనుభవములతో గ్రహించి నిశ్చయించినను స్వశరీరానుభవము మిక్కిలి ప్రబలముగానున్నది. ఐనను శ్రుతియుక్త్యనుభవ ప్రామాణ్యములతో భాగత్యాగ లక్షణవల్లను స్థూలసూక్ష్మ శరీరముల మిథ్యాత్వమును గ్రహించినను శరీర మిథ్యాత్వభావనాదార్ఢ్యమును సంపాదించుటకు తన భోగానుభవములడ్డువచ్చుచున్నవి. ఇందుచేతనే ప్రతి వాడును తన మరణానంతరమందు గూడ తాను గాని తన దానినిగాని మిగుల్చుకొని సుఖాభాసమును గ్రహించి ఏర్పాట్లు

చేయు చున్నాడుగాని, తన మరణానంతరమందు తను ఎట్లు మిగులు చున్నాడు ? దాని యేర్పాట్లు యేమిటిగా నుండవలెనని తన నిత్యసుఖస్వరూప మును యోచించుటలేదు. అందుకుగాను ఈ క్రిందివివేచనవల్ల ఇట్లు తెలుసుకొనవలయును. ఇందులో పైనఉదహరించినట్లు తన మరణము, స్వమరణము నిశ్చయించుకొని గదా తన ఆస్తి యేర్పాటులు చేయుచున్నాడు. అట్లే యీ నిశ్చయముతోనే ఇపుడు తను ఈ స్థూలదేహధారియైయున్నను, నిశ్చయమైన తన మరణానంతర స్వశరీరదహనాంతరమున ఏమి మిగులు చున్నది ? అందులో తన వాస్తవస్వరూపమేది ? అది యెట్లు పొందుట ? అనునది విమర్శించుకొనుట ఆవశ్యకము. ఇట్టి విమర్శ నిశ్చయములు స విగాయుండియున్నప్పుడె సాధ్యముగాని మరణానంతరముగాదు. ఇట్టి విమ ర్శవల్ల తన మరణభయముతగ్గును. తన గమ్యస్థానము తనకు నిశ్చయ ముగా గోచరించి తల్లాభ ప్రయత్నములకు చాల అనుకూలించును. గాన ఇట్టి విమర్శ అమంగళమనిన్నీ, దానిని తలచుకొనుటకు భయమునుపొంది విమర్శచేయరు. ఇట్లు తనశరీర దహనానంతరము మిగులునది దేహత్రయ మునందును ఒక్కటియైన స్థూలశరీరము మాత్రముపోగా అంతఃకరణ విశిష్ట సాక్షి మాత్రమే. ఇందులో ఇంతకాలమునుంచి అవిద్యాకామకర్మలచే భోక్తగా కల్పితుడై పరిచ్ఛిన్నుడై అనృత జడదుఃఖములతో—వాస్తవస్వ రూపుడైన సా .తోచేరి ఆభాసుడుగా తనను బాధించుచున్నది ఈ యంతః కరణమే. ఈ విచారముచేయువారు ముముక్షు జిజ్ఞాసువు గనుక తన శ్రుతి యుక్త్యనుభవములనుబట్టి తాను అనృత జడదుఃఖపదార్థముకానని తెలుసుకొని యున్నవాడు గనుక ఇప్పుడిట్టి ఈ యంతఃకరణమునకున్నూ, తనకున్నూ ఎట్టిసంబంధములేదని గ్రహించవలయును. ఇంతకాలము భ్రాంతిచే దుఃఖి తుడనైతిననిన్నీ గ్రహించవలయును. ఈ యంతఃకరణము ఏకదేశియై కల్పితమై అనృత జడదుఃఖములు కలిగినదేగాన, తనకు వాస్తవముగా దీని పరిణామములతో ఎట్టిసంబంధములేదనిన్నీ, ఇది తనుగాననిన్నీ, తనకెట్టి సంబంధము దీనితోలేదనిన్నీ తెలుసుకొని తన సత స్వరూపము, దృశ

రహిత, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, అఖండ, పరిపూర్ణ చైతన్యమని నిశ్చయించి తెలుసుకొనవలయును. ఇట్లు తనవాస్తవ పరిపూర్ణ స్వరూపమును గ్రహించి అనుభవమును పొందినయడల ఇట్టివాడు పరిపూర్ణుడుగనుక ఈ కల్పిత భౌతికదేహపాతానంతరమందు తను ఎచ్చటకూ వెళ్ళుటయూ, వచ్చుటయూ అసంభవము. ఏలనన—సర్వము తానైన పరిపూర్ణుడుగనుక గమనాగమనములు సంభవింపవు. అట్లు కలుగుటకు తాను లేనిచోటుండినగదా, సంభవమగును ! తను పరిపూర్ణ సర్వాన్తర్బహిర్వ్యాపకుడుగనుక జననమరణములను గమనాగమనములకు సంభవము లేదు. కనుక జనన మరణ రహితుడను. అమృతుడను. ఇందుకనే ఇట్టి మహనీయుల విషయములో శ్రుతి "అత బ్రహ్మ సమశ్నుతే" అని స్పష్టముగా తెలుపుచున్నది. ఇట్లు తెలుపుటకు కారణ మేమనిన, వాస్తవమున జీవుని సత్యస్వరూపజ్ఞానమాత్రమై యున్నది. జీవునకిట్టి తన వాస్తవ జ్ఞానరూపము దేశ, కాల, వస్తు త్రివిధ పరిచ్ఛేదరహితమైన అద్వితీయ అఖండ పరిపూర్ణజ్ఞానము.—ఇట్టి జ్ఞానమే శుద్ధ జీవస్వరూపము. కావున జీవునికి వాస్తవమున తానులేని కాలముగాని, దేశముగాని, వస్తువుగానిలేదు, అంతయూ శుద్ధ జీవుడు. తాను తన సత్య స్వరూపముతో పరిపూర్ణముగా నిండి అద్వితీయ అఖండ జ్ఞాన స్వరూపుడుగానున్నాడు. ఇట్టి పరిపూర్ణ జ్ఞానస్వరూపునికి గమనాగమనములు కలిగినటువంటి జనన మరణముల సంభవము. తన గమనాగమనములకు తాను లేని చోటుయే వాస్తవమున లేదుగదా ! గనుకనే యిట్టి వాస్తవము నెరిగి స్వానుభవము నొందు జీవుడు తాను బ్రహ్మ నిచటనే పొందుననగా తెలిసికొనును యని శ్రుతిమాత జీవునకు తెలుపుచున్నది. ఇది శుద్ధ జీవుని వాస్తవస్థితి. కాని దీనిని మరచి జీవుడు తాను యీ యుపాధి పరిచ్ఛిన్న ధర్మములతో మాయా ప్రభావముచే భ్రాంతుడై తాదాత్మ్యము నొందుటచే యీ జనన మరణములు జీవునకు కల్పితముగా సంభవించుచున్నవి. కావున జీవుడు గురువాశ్ర

రానుగ్రహములతో శాస్త్రబోధ గ్రహించి స్వానుభవమును బొందిన మహనీయునకు మరణ మనునదియుండుట యసంభవము—జ్ఞానికి మరణ మనిననేమో వివరించియుంటిమి. గాన యిచట మరణ శబ్దమున కర్థ మటులనే గ్రహించవలసియున్నది.

## సత్యశబ్దార్థ నిరూపణ

వ్యవహారానుకూల సత్యత్వములు కార్యసాధనములుగానున్నను అవి వ్యవహారమునకు మాత్రమే ఉపయోగించునుగాని పరమార్థమునకు పనికిరావు. ఇవి అబాధితమైన సత్యములు కావు. కాలాంతరమునందు నశించునవి. గనుక జిజ్ఞాసువు నిత్యానిత్య వివేచనజేసి అబాధితమైన పరమార్థ సత్యమునే గ్రహించవలెను. ఇట్టి సత్యమును గ్రహించుటకు శ్రుతి ప్రామాణ్యమును గ్రహించుట తప్ప వేరొక మార్గములేదు. శ్రుతియు "మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "తత్సత్యం" "సర్వంఖల్విదం బ్రహ్మ" "తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" అని తెలుపుచున్నది. ఈ వచనములనుబట్టి జిజ్ఞాసువునకు ఈ బ్రహ్మయే సత్యమను విషయము నిజమా? నిజముకాని యెడల శ్రుతివచనములిట్లు, ఏల చెప్పగలవు? మనకు ఇంత స్థిరముగా కనబడుచు అనుభవింపబడు జగత్తు అసత్యమగునా? అది అసత్యమైన యెడల ఎట్లగును? అను శంకలకు ఇచట అవకాశము కనబడుచున్నది. గాని సత్యాసత్య లక్షణములచే మన యనుభవమును బాగుగా పరిశీలించుకొన్న యెడల యదార్థము తెలియగలదు. కనుక మొదట ఈ సత్య పదార్థ నిర్వచనమును బాగుగా తెలుసుకొనవలసియున్నది. అనిర్వచనమును—

"కాలత్రయే ప్యబాధ్యోయ స్సత్యోఽర్థస్సనిగద్యతే"

అనగా కాల త్రయావస్థాత్రయముల యందు ఎంత విమర్శలు చేసి చూచినను అబాధితముగ నుండు వస్తువే పరమార్థ సత్యమని అజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్టిసత్య వస్తువు ఒక విధముగానే యుండవలెనుగాని అనేక విధములుగానుండుటకు వీలులేదు. ఇంతియేగాక సత్యమనునది సదా ఒక్క-టియేయై యుండవలయునుగాని అనేకములుగానుండుటకు వీలులేదు, యని అందరి యనుభవములోనున్నదియే. కాని ఆ ఒక్క-టియైన సత్యమునే లోక వ్యవహారమునందు వ్యావహారికసత్యమనీ, ప్రాతిభాసిక సత్యమనీ, పారమార్థికసత్యమనీ మూడు విధములుగ వ్యవహరించుచున్నారు. గాని యీ మూడున్ను సత్యములగుటకు వీలులేదు. వీటిలో రెండుకాలాంతరమందుగాని, దేశాంతరమునందుగాని, అవస్థాంతరమునందుగాని బాధింపబడునవి గనుక పైన చెప్పిన సత్యపదార్థ నిర్వచనమునకవి లక్ష్యములుకావు. పారమార్థిక సత్యమైన ఒక్క-టియే వీనికి లక్ష్యమగుచున్నది. ఇచట ప్రాతిభాసికములనగా స్వప్న పదార్థము, శుక్తిరజతము, మృగతృష్ణికాజలము మొదలగునవి. ఇట్టి పదార్థములు కేవల జ్ఞానమాత్రమునకుగాని, జ్ఞానమాత్రముచే గలుగు భయకంపాదులకును గాని ఉపయోగింపబడునుగాని, కటకకుండలాది నిరాభరూపార్థ క్రియలకు పనికిరావు. వ్యావహారికములనగా కాలాంతరమందు నశించునవి యైనను, ఉన్నప్పుడు కటకకుండలాది నిరాభవ్యవహారములను చేయుటకు గూడ ఉపయోగించునవి. అని వ్యావహారిక ప్రాతిభాసిక వస్తువుల స్వరూపమును గ్రహించవలయును. పైన ఉదాహరించిన సత్యవస్తులక్షణమునుబట్టి పరీక్షించిన స్వశరీరాది సర్వజగత్తు వ్యావహారికమని నిర్ణయమగును. ఎందుచేతననగా, నేను అనుకొను తనకు జాగ్రతలో కనబడు ఈ సర్వదృశ్యము స్వప్నములో కనబడుటలేదు. స్వప్నములో కనబడు విషయము లెవ్వియూ సుషుప్తిలో కనబడుటలేదు. సుషుప్తిలో జాగ్రత్స్వప్న పదార్థము లెవ్వియూ కనబడుటలేదు. అనగా ఆయా అవస్థలయందు ఆయా

అవస్థకు చెందిన వస్తువులే స్ఫురించుచున్నవి గాని, మరొక అవస్థ యందలి వస్తువులు స్ఫురించుటలేదు. గాన ఈ ప్రాతి భాసికవ్యా వహారిక సత్యము లన్నింటికిన్నీ అవస్థాంతమందు కనబడకపోవుట యనుధర్మము సమానమగు టచే ఈ రెండింటిని అసత్యము, ఆభాసమని నిశ్చయించవలెను. ఐతే– సర్వకాల సర్వావస్థలయందును మార్పు జెందక అనుభవములోనుండు వస్తు వొక్కటి ఉన్నదాయని పరీక్షించిన ఉన్నది, అది నేను అహం అనుస్ఫురణ గోచరమైనదని చెప్పవలయును. ఎందుచేననగా, తాను (అహం) అను స్ఫురణ నేను కలగాంచితిని, నేను నిద్రపోతిని అని యీ విధముగ సర్వకాల సర్వావస్థలయందు సర్వులకు అనుస్యూతముగ అనుభవముకలుగుచున్నది. ఇదికాదని ఎవరున్నూ అనుటకు వీలులేదు. కాలత్రయములోగూడ నేను అతనిని గుర్తించితిని, నేను గుర్తించగలను, నేను గుర్తించుచున్నాను, క్రిందటి జన లో ఎంత పుణ్యమును చేసితినో ఈ జన లో సుఖముగా గడచు చున్నది. అని వ్యవహారము కలుగుచున్నది. గాన ఈ భూత భవిష్యద్వర్త మాన రూపములగు మూడు కాలములలోను జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలలోను నేను అని తనను గుర్తించుచున్నాడు. ఈ సర్వమును నేను అనుభవించుచున్నాను అని వర్తమాన జన స్థితిని, క్రిందటి జన్మలో ఎంతటి పుణ్యమును చేసితినో రాబోవు జన నాధరా దులచే మంచిది కలుగునని తన స్థితిని గుర్తించుచున్నాడు. గాన ఈ మూడవస్థలయందున్నూ జ్ఞానము సమానము. ఎవరున్నూ నన్ను నే నెరుగను అని చెప్పుటకు సమర్థులు కారుగదా! నిద్రలో సమస్తేంద్రియములు అంతఃకరణముగూడ అజ్ఞానమందు లయ మగుచుండగా ఈ జ్ఞానాజ్ఞానములను గూడ గుర్తించి లేచినవాడు 'నేను సుఖ ముగా నిద్ర పోతిని' 'నాకేమియు తెలియలేదు' అని నేను అను తనను అను భవించుచు చెప్పుచున్నాడు. ఇట్టి యనుభవములనుబట్టి సత్యమైన నేను అని యొక వస్తువు ఉన్నదని నిశ్చయముగా సిద్ధించును. కాని నేను అను స్ఫుర ణలో చిజ్జడములు రెండు కలిసియున్నవి. ఈ విషయమును ఇదివరకే నిరూ పించియున్నాము. ఇందుకనే రాగిలో కలిసిన బంగారమునుండి అగ్నిసంస్కా–

రాదులచే రాగిని ఊది స్వచ్ఛ సువర్ణమును మిగుల్చుకొనునట్లు అహం అను స్ఫురణలోని అనృతాంశమును త్యజించి చిదంశమును మాత్రమే నేనని గ్రహించవలెను. జడాంశమైన అంతఃకరణాహంకారాదులు నేనుకాను అని నిశ్చయమును పొంది తన సత్య స్వరూపమును లక్షణములచే తెలుసుకొని అఖండ సచ్చిదానందానుభవము కలుగువరకు ఆనిర్విశేష సత్యవస్తువు నేను అని బ్రహ్మా నుసంధానమును గావించుచుండవలయును.

నిత్యమేసత్యము, సత్యమేతాను అనగా నేను. నేననునదే ఈ సర్వదృశ్యాధిష్ఠానము గాన నాకన్న వేరేదియులేదు. ఈ కనబడు దృశ్యము రజ్జుసర్పమువలె ఆభాసము. భ్రాంతిచే కనబడుచున్న జడమని తెలుసుకొన వలయును. ఇట్లు తెలుసుకొన్నయడల మిగులునది సర్వాంతర్బహిర్వ్యాపక సర్వాధిష్ఠానశుద్ధ చైతన్యము మాత్రము. ఇట్టిది నిర్విశేషము. అనగా దీనికంటె మరియొక నిత్యవస్తువులేదు. ఇట్టి శుద్ధ వుడే బ్రహ్మ. ఈ జీవబ్రహ్మలొకటిగాని, వేరుకాదు. ఇదియే స్వస్వరూపము. దీనియనుభవ ముచే "ఏకమేవాద్వి యం బ్రహ్మ" అను వాక్యముయొక్క అర్థము స్ఫుట మగును. కానియెంతవివరించినను ఇక్కడ సామాన బుద్ధికి ఒకశంక కలుగును. ఎంత అను సంధానముచేసినను ఒకవస్తువు మరియొకటిగా, అనగా జీవుడు బ్రహ్మ గామారునా ? ఇచట భ్రమరకీట న్యాయము ననుసరించుటకు వీలు లేదు. టము సావయవమూర్తమగుటచే సృష్టి సహజమైన పరిణామమును పొందినను, అ మూర్తనిరవయవ శుద్ధచైతన్య రూపుడైన వుడు బ్రహ్మగా మారుటకవకాశములేదుగదా ! ఇత్యాదిసంశయములు కలుగును. కాని యిట్టిశంకకు ఈ వబ్రహ్మైక్యవిషయమున అవకాశములేదు. ఎట్లన—వివర్త రూపముగ భాసించు దృశ్యములెన్నియున్ననూ అధిష్ఠానమొక్కటియే సత్య ముగానుండుటకు అవకాశమున్నది. కానిఅధిష్ఠానాధ్యస్తములు రెండునూ సత్యముగానుండుటకు వీలుండదు. భ్రమర ట దృష్టాంతము వ్యవహారములో నిదిగనుక ఇట్టి పరిణామముకలుగుటకు అచట అవకాశమున్నది. పార

మార్థిక సత్యమైన బ్రహ్మతానేయగుట వస్తుపరిణామమనుటకు వీలులేదు. భ్రమర టకములు రెండున్నూ వ్యావహారికములుగాన అచ్చట పరిణామ మునకవకాశమున్నది. అనుసంధానవిషయములో బ్రహ్మసత్యము—వ్యవహారమసత్యము—సత వస్తువునందు అసత్యజ్ఞాన రూపమైనభ్రాంతిచే వ్యవహారముకలుగుచున్నది. అట్టివ్యవహారమును అనగా స్వశరీర సర్వదృశ్యమును సమ్యక్జ్ఞానముచే మిథ్యయను నిశ్చయముతో తెలుసుకొనినయడల భ్రాంతిజ్ఞానజన్యమైన సర్వదృశ్యమును మిథ్యయై సత్యజ్ఞానస్వరూపుడైన తానొక్కడేమిగులును. ఇదియేసమ్యక్ జ్ఞానము. భ్రాంతిజ్ఞానమనాదిగా వచ్చుచుండుటచే ఒక్కసారి తాను ఆబ్రహ్మయే అనితెలుసుకొనినను అట్టి జ్ఞానమునిలువదు. ఆవరణవిక్షేపాదులు బాధించుచుండును. వీటివల్ల బాధింపబడకుండుటకు ప్రతిబంధనివృత్తి పర్యంతము తాను శ్రవణముచే గ్రహించిన పరోక్షజ్ఞానమును అపరోక్షముగా పొందుటకొరకు సంతతమనన నిదిధ్యాసనములు విధిగానాచరించవలయును. ప్రతిబంధనివృత్తి పర్యంతము ఇట్లు అభ్యసించుచుండగా ఆ బ్రహ్మనునేను అనుజ్ఞానమునిలిచిపోవును. ఇట్లు సమ్యక్జ్ఞానమును తననుగా తెలిసికొని శాశ్వతముగా నిలుపుకొనుటయే బ్రహ్మయగుట. అనగా తనసత్యస్వరూపమునుపొందుట. *ఇదియే సత్యము.* మార్పెట్లుకలుగునను పైశంకకు, ఇచట మార్పుజ్ఞానరూపముగాని వస్తు రూపముగాదు. గనుకవస్తుపరిణామమునకు అవకాశములేకపోవుటనిజము అని సమాధానము తెలుసుకొనవలయును. ఇదియే పరమార్థ సత్యము. తత్త్వజ్ఞునకు పునర్జన ము కేవల ప్రారబ్ధానుభవముకొరకు మాత్రమే. జన్మ రాహిత్యము అమృతత్వసిద్ధియని యెరుగవలయును. ఇదియే అమృతశబ్దము నకు వాస్తవమైన యర్థమని గ్రహించవలయును. అమృతత్వ సిద్ధి తత్త్వ జ్ఞునికిగాని సామాన్యునకు కాదుగదా !

# 'అహం' (నేను) అనుప్రతీతికి వాస్తవికార్థము

ఈ నేను అహం అను ప్రతీతికి వాస్తవికార్థము పరిపూర్ణ అద్వితీయ, అఖండ, జ్ఞానస్వరూపము-పరిచ్ఛిన్న జ్ఞానము భ్రాంతి. కావున వివేకులందరికినీ యీ నేను, నేను అని, ప్రతివారిచేతను ఒక్కవిధముగనే అనుభవింపబడుచున్న నేను, అనుశబ్దముయొక్క వాస్తవార్థమును తెలిసికొనుట, యావశ్యకము కనబడుచున్నది. ఏలనన లోకానుభవముయొక విధమునను, శాస్త్రబోధ మరియొక విధమునను యున్నది గాన, ఇందు ఏది నిజము? ఎట్టి జ్ఞానము మానవుని నిత్య, నిరతిశయ, సుఖమునకు సాధనమగుచున్నది, అను విషయ విమర్శయూ పర్యవసాన నిశ్చయమునూ పొందుట వివేకులందరికిని సాధారణముగను, ముముక్షువులకు ముఖ్యముగను ఆవశ్యకము కనబడుచున్నది.

లోకజ్ఞానమందు గూడ సాధారణముగా ప్రతి మానవునకున్నూ తెలియని విషయములను ఆయాశాస్త్ర పరిశోధనలు చేసిగదా ఆయాపదార్థ స్వరూప సామర్థ్యములను పూర్తిగ గ్రహించుచున్నారు. ఇది అందరకును తెలిసిన విషయమే. ఇట్లే యీ అహం, నేను అను ప్రతీతి సామాన్యముగా అందరకును అప్రయత్నముగనే ఒక విధమున, అనగా వివిధ, విచిత్ర, న్నభిన్న, పరిచ్ఛిన్న యుపాదులతో కనబడుచూ జీవునికి రాగద్వేషములను, హర్షశోకములను, కలుగజేయుచూ, కాలాంతరమునందు నశించుచున్నది. ఇదియును అందరికిని లోకానుభవముగ కనబడుచున్నదే. కాని ఇట్లు కనబడుచు అనుభవింపబడుచున్న ఈ భిన్న, న్న, పరిచ్ఛిన్నత్వములుకల స్వశరీర సర్వ దృశ్యమంతయూ, వాస్తవముగాదు. సత్యముగనున్న వాస్తవముగ నున్నది. యొక్క-సత్పదార్థమే. రెండవది లేదు ఈ స్వశరీర సర్వ దృశ్యమంతయు భ్రాంతికల్పితము. ఈ భ్రాంతిని ప్రయత్నముచే పోగొట్టు

కొనిన జీవుడు ముక్తిని పొందునని శాస్త్రము తెలుపుచున్నది. బ్రహ్మ యన్నను, ఆత్మ యన్ననూ, ఒక్కటియేనని లోగడనే తెలిపియుంటిమి. స్వశరీరసర్వ ప్రపంచము ఈ యొక్క ఆత్మపదార్థముగానే తెలిసికొనమని "సర్వంఖల్విదం బ్రహ్మ" "విద్ధీదంసర్వంబ్రహ్మ" "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" అను మొదలగు శ్రుతులున్నూ, "బ్రహ్మ మాత్రమిదం సర్వం, బ్రహ్మైవ సకలం జగత్" "అహంసర్వస్యప్రభవోమత్తస్సర్వం ప్రవర్తతే" అనగా అన్నిటికినీ ప్రభువును నేనే, నన్ను బట్టియే అన్నియునూ ప్రవర్తించు చున్నవి యనిన్నీ,

శ్లో॥ సర్వభూతేషు యేనైకం, భావమవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు, తద్జ్ఞానం విద్ధి సాత్వికమ్ ॥

అనగా యే జ్ఞానముచేత సర్వదృశ్యపరస్పరమును విభాగమును పొందిన సమస్తభూతములయందును, విభాగము పొందనిదియు, ఒక్కటియే యయి నదియు, అవ్యయమునూ, అగు పరమాత్మ తత్వము చూడవలెను. అదియే సాత్వికజ్ఞానమని, శ్రేష్ఠమని, తెలిసికొనమనిన్నీ, ఇంకనూ

శ్లో॥ సర్వేంద్రియగుణాభాసం, సర్వేంద్రియవివర్జితం ।
అసక్తం సర్వభృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృచ॥

అనగా అన్ని ఇంద్రియములను ప్రకాశింపజేయునది, ఇంద్రియములన్నింటి తో డను శూన్యమైనది, సంగములేనిది, అయినను సర్వమును భజించునది, గుణర హితమైనదిన్నీ, ఇంకనూ "అవిభక్తంచభూతేషు, విభక్తమివచస్థితం" అనగా సర్వభూతములయందు అభేదముగనున్ననూ, భేదము గలదానివలెనుండును. అను మొదలుగాగల లక్షణములతో ఈ ఆత్మ పదార్థమే మానవునికి తెలిసికొన వలసిన జ్ఞేయపదార్థము అని స్మృతి వాక్యములున్నూ, ఇంకనూ సర్వమూ బ్రహ్మ యేనని,

## అహం (నేను) అనుప్రతీతి వాస్తవికార్థము

శ్లో॥ బ్రహ్మైవపంచభూతాని ? బ్రహ్మైవభువనత్రయం ।
బ్రహ్మైవాహంబ్రహ్మ చత్వంబ్రహ్మ ణోఽన్యన్న కించన ॥

అని శంకర భగవత్పాదులున్నూ

శ్లో॥ చిదిహాస్తిహి చిన్మాత్రమిదం చిన్మయమేవచ ।
చిత్త్వం చిదహమేతే చలోకాశ్చిదితి సంగ్రహః ॥

అనగా ఈ స్వ శరీర సర్వ దృశ్య భోగజాలమునందును చిత్తుయేకలదు. ఈ భోగజాలము చిద్రూపమైనది. ఈ భోగజాలమునకు చిత్తు ప్రకృతియగుచున్నది. నీవును, నేనును, ఈ లోకంబులును చిత్తు మాత్రమే. ఇయ్యది సర్వ వేదాంతములయొక్క సంగ్రహము. అని యోగవాశిష్టమునందు శుక్రాచార్యులు బలిచక్రవర్తికి యుపదేశించినట్లు శ్రీ వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. చిత్తు అన్ననూ, బ్రహ్మయన్ననూ, చిదాకాశమన్ననూ. ఒక్కటియేనని లోగడనే వివరించియుంటిమి. ఇట్టి నిరుపమాన, అఖండ, పరిపూర్ణ, బ్రహ్మ స్వరూపమును తెలుపుటకుగానున్నూ, మనన దారుఢ్యమునకుగానున్నూ, వివిధ నిరూపణలయందు, వివిధ ప్రమాణములను, ఉపపత్తులను, అనుభవములను, శ్రుతి, యుక్త్యనుభవ పూర్వకముగా సికొని నిరూపింపబడుటచే బోధకుగాను చేసిన నిరూపణా విధానములు వేరువేరుగనుండునుగాని బోధింపబడు విషయమంతయూ అద్వియ, నిరతిశయ, సుఖ స్వరూపమే గనుక ఏక విధముగనే యుండునుగాని న్నముగనుండుటకు వీలులేదు. ఇక్షు ఖండము లాగున మాధుర్యమును విడచియుండదు. బ్రహ్మ తత్త్వమొక్కటియేగదా, దానిని తెలుపునపుడు శ్రుతులకు పరస్పర విరోధమునూ, మార్గ బేధములునూ, ఎందుకను శంకకు,

శ్లో॥ యయా యయా భవేత్పుంసాం, వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని ।
సాసైవప్ర క్రియేహస్యా, త్సాధ్వీత్యాచార్య భాషితం ॥

అనగా జగత్తంతయూ కల్పితము గనుక ఎవరికి యే విధంబున చెప్పినచో బోధకలుగునో అదియే యుత్తమమగు మార్గము, కాన ప్రతిపాదించెడి పద్ధతులలో బేధముండునుగాని, ప్రతిపాదింపబడెడి ఆత్మ తత్త్వమొక్కటిగనే యుండునని శ్రీ విద్యారణ్యస్వామి తెలుపుచున్నారు. కాన పాఠకులు ముఖ్యముగ జిజ్ఞాసువులైన ముముక్షువులును, ఈ అంశమును బాగుగ గ్రహించి, నిరుపమాన. నిర్విషయమైన యీ విషయ పఠనమునందు విసుగు జెందక తల్లాభమును పొందవలయును. చెరుకు తినువానికి ఎచట తినినను మాధుర్యమే తగులునట్లు, ఈ బ్రహ్మ విద్యా నిరూపణమందు ఎచట చూచిననూ, బ్రహ్మ స్వరూప బోధవాక్యములే కనబడుచుండును.

మానవునకు తన సత్యస్వరూపము తెలిసికొని స్వానుభవము పొందుటయే పరమావధియగుచున్నది. ఇట్టి జ్ఞానానుభవమును కలుగజేయునది యొక్క అద్వైత శాస్త్రమే. దీనినే తత్త్వ శాస్త్రమందురు. తత్త్వశాస్త్రమన్న జీవునకు తన యదార్థ స్వరూపమును తెలుపు శాస్త్రము. ఇదియే మానవునకు తన యదార్థ స్వరూపమును బోధించుచూ జీవునకు పరమ శ్రేయోదాయకమైన, నిత్య, నిరతిశయ, సుఖము నిచ్చుచూ, జీవను క్తిని కలుగజేయు శాస్త్రమిది యొక్కటియేగాని తదితరములుగావు.

అద్వైత సిద్ధాంతముయొక్క పరమరహస్యమే మన, ప్రతియొక్క మానవుని చేతనూ, నేను, నేను, అని యనుభవింపబడుచున్న అహం, పదార్థముయొక్క వాస్తవికతను గురుశాస్త్ర బోధవలన గ్రహించి అట్టి సత్య స్వరూపమును నేనేయని తెలిసికొని స్వానుభవము పొందుట, మోక్షమన్ననూ, ముక్తియన్ననూ ఇదియే. ఇట్టి స్థితిని సంపాదించుటే జీవునికి శాస్త్రము యొక్క పరమప్రయోజనము. ప్రతిమానవునకున్నూ తాను ఎవరో పరమార్థతః, అనగా వాస్తవమును తెలిసికొనుటకు శాస్త్రమే ప్రమాణముకాని, అన్యానుభవములుకావు. శాస్త్రము వాస్తవమునయున్నది. అద్వి య, అఖండ, సత్పదార్థమొక్కటి తప్ప ద్వైత భావ్యమంతయూ, కల్పితము, భ్రాంతి,

వాస్తవముగాదు అని బోధించుచున్నది. కాని ప్రతియొక్కరునూ, నేను, నేను, అని వ్యవహరించు మనలకు సర్వము ద్వైతముగా భాసించుచున్నది గాని, అద్వితీయముగా తెలియుటగాని, అనుభవముగాని, కలుగుటలేదు. ఇప్పుడు నేను, నేను, యనుకొనుచున్న ప్రతియొక్క జీవియూ ఒక్కటియైన ఆత్మ పదార్థమందే, ఎవరికివారు, నేను, నేను, అని యనుకొనుచూ ఆత్మను నానాత్వముగ చూచుచున్నారు. కాని ఆత్మ యొక్కటేగాని నానా విధములుగా భాసించుట భ్రాంతియనియూ, అందువలననే సమస్త దృశ్య దుఃఖములను, జీవుడు పొందుచున్నాడనియూ శాస్త్రము తెలుపుచున్నది. ఈ ఒక్క ఆత్మ స్వరూపమే వాస్తవమున జీవునికి తన సత్య స్వరూపమగుచున్నది. దీనిని తెలిసికొని స్వానుభవమును బడసినవారు "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" తాను బ్రహ్మయే అగుననియూ, ఆత్మను తెలిసికొనినవాడు దుఃఖమునుంచి ఆత్యంతికముగ దాటినవాడనియూ "తరతిశోక మాత్మవిత్" అను మొదలగు శ్రుతి వాక్యములు తెలుపుచున్నవి. కనుక ఈ విచారము జీవునకు తాను ఎవరో, తన వాస్తవికతను తెలుసుకొనుటకున్నూ, తన నిత్య సుఖ స్వరూపము పొందుటకుగానున్నూ ముముక్షువునకు ఆవశ్యకమగుచున్నది. మనము ఇంతవరకు వివిధ నిరూపణలయందు లోగడ విపులముగా చేసిన, శ్రుతి, యుక్తి, అనుభవ విచారమునుబట్టి ఈ నేను, అను అహం, ప్రతీతిలో రెండు అంశములు కనుబడుచున్నవి. అందు ఒక్కటి దేహధారణానుకూల అహం ప్రతీతి. ఇట్టి ప్రతీతి జీవునకు అంతఃకరణతాదాత్మ్యాధ్యాసమువలన కలుగుచున్నది. ఇదియే భ్రాంతి, కల్పితము, రెండవది. నేను, అను, తన సత్య స్వరూపమైన అహం, ఈయనయే సాక్షి, ప్రత్యగాత్మ, యని శాస్త్రము తెలుపుచున్నది. ఈయనయే పరమాత్మ. మొదటిదియైన అహం, ప్రతీతి సర్వులకున్నూ అప్రయత్నముగనే అనుభవమగుచున్నది. కాని రెండవదియైన తన వాస్తవ స్వరూపమగు అహం, ప్రతీతి జీవునకు సామాన్యముగ తెలియబడక విశేష శాస్త్రీయ ప్రయత్నము చేతనే మానవునికి తెలియబడుచున్నది. అట్టి వారికి "దదామి బుద్ధి యోగంతం, యేనమా ముపయాంతితే" యన్న ఏ

విధముగ పొందుదురో అనగా తన్నుతాను వాస్తవముగ తెలుసుకొనునట్టి బుద్ధిరూపమగు నుపాయమును నేనే, యిచ్చుచున్నానని శ్రీ కృష్ణ భగవానులు తెలుపుచున్నారు. కాన ప్రయత్న మావశ్యకము. ప్రయత్నము చేయువానికే పరమేశ్వర సహాయముండును గాని ప్రయత్నము చేయనివానికి పరమేశ్వర సహాయము మాత్రమెట్లుండును. గనుక అట్లు ప్రయత్నముచేయు మానవునికి ఆ బుద్ధి ప్రసాదమును నే, కలుగజేయుదునని భగవంతుడు తెలుపుచున్నాడు. కాన జిజ్ఞాసువునకు స్వప్రయత్నాదులచే అభ్యాస మావశ్యకము. శాస్త్రము ఎంత చదివినను "శాస్త్రంతు బోదకం నతుకారకం" అను వచనము నను సరించి శాస్త్రము చెప్పునేకాని చేయునట్లు చేయదు. గనుక శాస్త్రముయందు ప్రీతి నిశ్చయములు గల్గించుకొని ప్రయత్నాభ్యాసాదులు చేయుట ముముక్షు వునకు విధియగుచున్నది.

వాస్తవమున జీవుడు విశేష శాస్త్రీయ ప్రయత్నముచేత తెలసికొను తన సత్యస్వరూపమే తాను, అను, నేను, అగుచున్నాడు. ఇట్లు తెలిసికొన్న సత్పదార్థమే అద్వితీయ, అఖండ, పరిపూర్ణ, ఆత్మ పదార్థము కాని వ్యవహారిక మందు నేను అని తనకు కలుగుచున్న ప్రతీతి వాస్తవముగాదు. ఆత్మ పదార్థ మును జీవుడు తనునుగా తెలుసుకొనుచున్ననూ, తన వాస్తవస్వరూపమును గుర్తెరుగక అనాది భ్రాంతుడై నానావిధములుగా చూచుచున్నాడు. ఇదియే జీవునకు సంసారభ్రాంతి, జీవుడు తాను భ్రాంతుడై తన స్వరూపమును పరి చ్ఛిన్నోపాధిగా భావించుచూ స్న, భిన్న, నానాకారములుగా దృశ్యమును చూచుచున్నాడు. ఇట్లు తలచునప్పుడు గాని, లేక జీవుడు తన వాస్తవ స్వరూపమును గ్రహించినపుడుగాని ఆత్మపదార్థము ఎల్లప్పుడును అద్వి యుడై దేశ, కాల, అవస్థ, వస్తుపరిచ్ఛేద రహితుడై అఖండపరిపూర్ణుడుగనే యుండును. కాని వుడు తన అనాది భ్రాంతిచే యీ ఒక్కటే యైన తన ఆత్మనే అవిద్యచే చిత్ర, విచిత్ర, పరిచ్ఛిన్న, భిన్న, భిన్నాకారములుగ చూచి యనుభవించుచూ దృశ్యమందాసక్తుడై సంసారదుఃఖమును పొందు

చున్నాడు. కాన తన ఆత్యంతిక సంసారదుఃఖరాహిత్యము తనను తాను ఎవరో వాస్తవమున గ్రహించినగాని జీవునికి కలుగదు. జీవుడు తన వాస్తవమును గుర్తెరిగిన యడల తనకంటె నితర పదార్థమేదియును లేక తానే సర్వమును యగుచున్నాడు. దీనినే "అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహమచ్యుతః" నేనే సర్వ ప్రపంచమును, పరమాత్మను, నాశములేనివాడను అని శాస్త్రవచనము అహం శబ్దార్థమును నిర్వచనము చేయుచున్నది. ఇంకనూ "అహంకారాభిధా యాసా కల్ప్యతేనతు వాస్తవీ" అనగా ఏ పరిచ్ఛిన్న స్థూల సూక్ష్మోపాధిని నేను అనుప్రతీతితో తెలుసుకొనుచున్నావో అది కల్పితము, వాస్తవము కాదని గూడ శాస్త్రమే తెలుపుచున్నది.

ఇంకనూ గీతాచార్యుడైన శ్రీ కృష్ణ భగవానులు "మయా తత మిదం సర్వం, జగదవ్యక్తమూర్తినా, మత్స్థాని స్సర్వభూతాని నచాహంతేష్వవస్థితిః॥" "నచమత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరం" అనగా నేనే ఈ ప్రపంచమంతయూ వ్యాపించియున్నాను. ఈ జగమునందుకంటె న్నమగు వస్తువు ఒక్కటియైనను లేదు. నేనీ ప్రపంచమునకు నాధారభూతుడనై యున్నాను. అనగా ప్రపంచమంతయునూ నాయందే భ్రాంతిగా కల్పింపబడినది అని తెలుపుతూ యీ ప్రపంచము భ్రాంతిసిద్ధమగుటచే అధ్యస్తమైన యీ ప్రపంచము అధిష్ఠానమునకంటె వేరుకానేరదు. కాన అట్టి అధిష్ఠానభూతుండనగు నేను, (అహం) (బ్రహ్మ) ఎప్పటికిని అద్వి యుండనే అని నిరూపించుటకు "నేనాభూతములయందు లేను." ఆ భూతములు నాయందు లేవు అని తెలుపుచున్నారు. అనగా ప్రపంచమంతయూ భ్రాంతి కల్పితమేగాన అధిష్ఠాన స్వరూపమును వదలి, అధ్యస్తముండుటకు వీలులేదు. ఎట్లన రజ్జువును విడచి భ్రాంతి సర్పముండుటకు వీలులేదు. కాన నాయందును, భూతములయందును భేదమనునది వాస్తవమున లేనేలేదని శ్రీ కృష్ణపరమాత్మ తెలుపుచున్నాడు. కాని భేదము అనుభవించుచున్నాను కదా యనిన, అనుభవమంతయూ ఎల్లప్పుడునూ యధార్థముగను, సత్యముగనే యుండవలెనను నియమము లేదు.

దీనికి దృష్టాంతము, స్వప్నానుభవమునూ, ఇంద్రజాలములునూ, కనబడు చున్నవిగదా. కావున విషయనిర్ణయమందు శాస్త్రప్రమాణ మూలకమగు విచార మావశ్యకము. ఇంకనూ శ్రుతి "సర్వంఖల్విదం బ్రహ్మ" అని చెప్పి "సచ్చత్యచ్చాభవత్ । నిరుక్తంచాఽనిరుక్తంచ। నిలయనంచాఽనిలయనంచ । విజ్ఞానంచాఽవిజ్ఞానంచ । సత్యంచాఽనృతంచసత్యమభవత్ ।" అనగా ఆకారముగల పదార్థములును, ఆకారములేని పదార్థములును, గుణాదులచే నిరూపింపదగిన పదార్థములును, అట్లు చేయుటకు శక్యముగాని, పదార్థములును, అవయవములు కలిగి ఇతర పదార్థములకు నాశ్రయము నివ్వగల వస్తువులును, ఆ విధమున నియ్యలేని వస్తువులునూ, చేతనములునూ, జడములునూ, నన్నియూ పరమార్థ సత్యమగు బ్రహ్మయే, అని తెలుపుచూ "తత్త్వమసి" ఆ బ్రహ్మ నీవేయని తెలుపుచున్నది. సత్యమభవత్" అని శ్రుతి తెలుపు సత్య శబ్దమునకు బ్రహ్మయే అర్థమని "బ్రహ్మైవసత్య శబ్దార్థః, సత్యం జ్ఞానమితి శ్రుతేః" అని సత్యంజ్ఞాన మనంతం యను శ్రుతివల్ల సత్యశబ్దార్థము బ్రహ్మయేనని శ్రీ శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు. నేను అఖండ, పరిపూర్ణ చిదాకాశస్వరూపుడనని తెలిసికొని అనుభవమును పొందినవాడు *బ్రహ్మయగు* చున్నాడు. నేను ఈ పరిచ్ఛిన్నోపాధుడనని తలచి దృశ్యమును వాస్తవమని ఎంచి సక్తతా మానముల నొందువాడు *జీవుడగు* చున్నాడు. దీనినే వశిష్ఠ భగవానులు :— "అహంభ్రాంతిర్హిబంధాయ, మోక్షోజ్ఞానేన తత్క్షయః" అనగా జీవునికి భ్రాంతియే బంధమగుచున్నది. తన వాస్తవ స్వరూపజ్ఞానముచేత భ్రాంతి నశించుటయే మోక్షమగుచున్నది అని తెలుపుచున్నారు.

ఈ విచారణనుబట్టి ఎవరు పరిపూర్ణంబైన చిదాకాశంబె నేను, అహం, అని తెలుసుకొని అనుభవించుదురో వారు ముక్తులనిన్నీ, బ్రహ్మయేననియూ, మరి ఎవరు దృశ్య పరిచ్ఛిన్నత్వ స్న భిన్నములయందు సత్య బుద్ధినిచేసి అదియే నేను, అహం, అని తలచుచున్నారో వారు సంసారమున బద్ధులై

## అహం (నేను) అనుప్ర ంతికి వా_స్తవికార్థము

వులుగ తెలియబడుచున్నారని పర్యవసానమగుచున్నది కాన వుడు ఇప్పుడు తాను భ్రాంతిచే అనుభవమును పొందుచున్న ఈ పరిచ్ఛిన్న స్థూల సూక్ష్మో పాధి తాను కానని నిశ్చయముగ తెలిసికొని వాటిని జ్ఞాన పూర్వకముగ త్యజించి తన, నిత్య, నిరతిశయ, వా_స్తవ సుఖ స్వరూపమును గ్రహించి తాను, అను నేనుగ తెలుసుకొనవలయును. ఇట్లు జీవుడు గురు శా_స్త్రబోధచే యొకసారి తన సత్యస్వరూప మిట్టిదియని తెలిసికొన్ననూ జీవునికి ఈ అవిద్య అనాదిసిద్ధము గనుక దానిని నిర్మూలించుటకు తన సత్యస్వరూపాను సంధానమును ఫలావగతి పర్యంతము చేయుచుండవలయును.

ఈ దేహాదులే నేనని తలచు వుని గురించి

శ్లో॥ అయంసోఽహమయం నాహంకరో మీదమిదంతున ।
ఇతిభావానుసంధానమయీ దృష్టిర్నతుష్టయే ॥

శ్లో॥ సాకాల సూత్రపదవీ సామహా వీచివాగురా ।
సాఽసిపత్ర వనశ్రేణీ యాదేహేఽహ మితి స్థితిః ॥

అనగా జీవుడు నేనిట్టివాడనగుదును, ఇట్టివాడను కాను, ఈ పని నేను చేయు చున్నాను, ఈ పని నేను చేయుటలేదు, అనునట్టి యుద్దేశ్యము వునకు దుఃఖమునె కలిగించును. కాని సుఖము నివ్వజాలదు. ఇంకను దేహమే నేనను బుద్ధి ఏదికలదో అదియె కాలసూత్రమనియూ, మహా వీచియనియూ, అసిపత్రవనంబనియు, చెప్పబడునట్టి నరకజాలంబగుచున్నది,

కాన దేహమే నేనను బుద్ధిని అన్ని విధములచేతను విడువవలయునే కాని గ్రహింపకూడదు. శ్రీరామచంద్రమూ_ర్తితో వశిష్ఠ భగవానులు, నేను అను ప్ర తికి వా_స్తవికార్థమును ఇట్లు తెలుపు చున్నారు.

శ్లో ॥ చిన్మనః కలనాకారప్రకార తిమిరాదికం,
వాసనాంవాసితారంచ ప్రాణస్పందన పూర్వకమ్ ॥

శ్లో ॥ సమూల మఖిలంత్య క్త్వావ్యోమసామ్యః ప్రశాంతధీః.
యస్త్వంభవసి సద్బుద్ధే సభవానస్తుత త్త్వతః ॥

అనగా ఇది స్వరూప చైతన్యము, ఇది అంతఃకరణము, ఇది అవిద్యా, ఇది ప్రపంచము, ఇది తేజస్సు, ఇది చీకటి, అను భేద వాసనలను, వాసనా హేతువును, ప్రాణ సంచారమును, వీని సన్నిటిని విడచిపెట్టి, ఆకాశముతో సమానుండవు, శాంతచిత్తుండవునై, యదార్థముచేత ఎట్టిరూపము కలవాడవో అట్టి రూపముకలవాడవు నీవు,

శ్లో ॥ యుక్త్యా వై చరత స్తస్య సంసారోగోష్పదాకృతిః ।
దూరసంత్యక్త యుక్తేస్తు మహావర్ణార్ణవోపమః ॥

అనగా పరిపూర్ణంబగు బ్రహ్మంబు యొక్క భావనా రూపంబగు మహా యోగమునసుష్ఠించు వానికి సంసారము ఆవు అడుగు మేర మాత్రమే యుండును. ఇట్టి యోగంబులేని వానికి గొప్ప సుడులుగల మహాసము ద్రంబును బోలుచున్నది.

శ్లో ॥ సబాహ్యాభ్యతరేదేహేష్వద ఊర్ధ్వంచదిక్షుచ,
ఇత ఆత్మాత్వతశ్చాత్మా నాస్త్యనాత మయం క్వచిత్ ॥

అనగా సర్వదేహముల యందు, లోపలను, వెలుపలను, క్రిందను, మీదను, దిక్కుల యందును, ఇటునటు సంతట, నాత్మ యే కలదుగాని ఆత్మ లేని పదార్థం ఔచటనూ లేదు. శోధిత జీవుడే ఆత్మ, ఆత్మ యన్ననూ, అహంయన్ననూ, వాస్తవికార్థము ఒక్కటియే,

శ్లో ॥ సతదస్తిన యత్రాహం సతదస్తిన యన్నయి,
కిమన్య ద వాంఛామి సర్వం నంవిన్మయం స్థితమ్ ॥

## అహం (నేను) అను ప్రతీతికి వాస్తవికార్థము

అనగా నేను లేనట్టి వస్తువుగాని, నాయందు లేనట్టి వస్తువుగాని, లేదు. సర్వం బును చిద్రూపంబుననున్నది. కావున నేను చిద్రూపుడను. కాన నేను ఇతర మగునే వస్తువును గోరుదును ?

ఇట్లు జిజ్ఞాసువైన ముముక్షువు తన వాస్తవరూపమును గ్రహించ వలయును. తాను అఖండ, పరిపూర్ణ చైతన్య స్వరూపుడుగాని, పరిచ్ఛిన్న దేహేత్యాదులు కాననీ నిశ్చయముగా గ్రహించవలయును. ఇట్లు గ్రహించలేక ఈస్వశరీరాదులే నేను అను నిశ్చయమే వునకు అధ్యాసమగు చున్నది. దీనిని సర్వ ప్రయత్నముల చేతను, జ్ఞానపూర్వకముగ త్యజించుట యావశ్యక మనియూ, శ్రీ శంకర భగవత్పాదులు,

శ్లో ॥ అహంమమేతి యోభావో దేహాక్షా దావనాత్మని,
అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా ॥

శ్లో ॥ జ్ఞాత్వాస్వం ప్రత్యగాత్మానంబుద్ధి తద్వృత్తి సాక్షిణమ్,
సోఽహమిత్యేవ సద్వృత్యా నాత్మన్యాత్మమతింజహి ॥

అనగా దేహము: ఇంద్రియములు, మొదలగు అనాత్మల విషయము లందు నేను, నాది, యనుభావము అధ్యాసమనబడును. పండితులు స్వస్వరూపస్థితి యందు నిష్ఠగల వారై నీ యధ్యాసమును పూర్తిగా నివర్తింప వలెను. బుద్ధిని, బుద్ధి ప్రవృత్తులను, ప్రకాశింప జేయుచూ వానికి సాక్షియగు ప్రత్య గాత్మయే నేనుఅని తెలిసికొని, "సోఽహం" ఆ యద్వితీయ బ్రహ్మమే నేను యనెడి, అఖండాకారవృత్తియను సద్భావముతో అనాత వస్తువులగు దేహేం ద్రియాదులందు ఆత్మబుద్ధిని విడువుమని తెలుపు చున్నారు. కానము ముక్షువు తన సత్యస్వరూపమును ఈ విధమున తెలిసికొని అనుసంధానము చేయు చుండవలయును.

నేను నిర్మలాకాశము లాగున సర్వవ్యాపకమై, నిస్తరంగ సముద్రము లాగున నిశ్చలమై, అతి గంభీరమై, సంవిత్ మహాస్ఫటికశిల లాగున, నిర్మల

స్వప్రకాశములతో, దేశ, కాల, అవస్థాత్రయాబాధితుడనై ప్రకాశించు చున్నవాడను. నేను కేవల జ్ఞానస్వరూపుడను, జ్ఞేయ జ్ఞాతృ స్వరూపములు నావికావు.

నేను సర్వ దేశములయందును, సర్వకాలముల యందును, సమస్త వస్తువుల యందును, అపరిచ్ఛిన్నుడనై యున్నాను. నేను ఆకాశము లాగున. సర్వవ్యాపకమైన అమూర్తపదార్థమై యున్నాను. నేను జగదుత్పత్తి స్థితి లయములకు వివర్త, అన్న, నిమిత్తోపాదాన కారణమైన, సర్వాంతర్బహిర్వ్యాపక, అసంగ అఖండ, పరిపూర్ణ, చైతన్య స్వరూపుడను.

నేను, ఇక్షు ఖండమందెక్కడ చూచినను మాధుర్యమే యుండునట్లున్నూ, లవణ ఖండమునందెక్కడ చూచిననూ ఉప్పుగనె యుండునట్లున్నూ, నేను, అద్వితీయ, అఖండ, పరిపూర్ణ స్వరూపుడనై ఎచట చూచిననూ జ్ఞానముతోడ నిండియున్న వాడను. నా స్వరూపముగాని జ్ఞానేతరమేదియునూ. ఎచటనూ లేదు. నా పరిపూర్ణజ్ఞానస్వరూపము వాస్తవము. నా పరిచ్ఛిన్న జ్ఞానము భ్రాంతియగు చున్నది, నేను సర్వోపాధి వినిర్ముక్త. అఖండ, పరిపూర్ణ, చైతన్య స్వరూపుడను అని తెలుసుకొన వలయును. ఇదియే నేను యను ప్రతికి వాస్తవికార్థము. అయిననూ ఇట్టి అఖండ, పరిపూర్ణస్వరూపము తానని గ్రహించి నిశ్చయమును పొందుట ముముక్షువులకు గూడ కష్టసాధ్యము కాని, జిజ్ఞాసువు తన నిత్యానిత్య వివేకముతో శ్రుత్యుక్త్యనుభవములను బాగుగ విచారణ చేసి నిశ్చయము నొందవచ్చును. ఈ బ్రహ్మ పదార్థము అఖండ, అద్వితీయము నిరుపమానమైనది గాన, వీని బోధించు యుదాహరణములు వ్యవహారమునందే తీసికొన వలెను గాని మరియొక దారిలేదు. ఇట్టి బోధకు దృష్టాంతము లెంతయో సహకరించుచూ జిజ్ఞాసువునకు, విషయగ్రహణమునకు, చాల సౌలభ్యమునిచ్చును. ఇట్టివానిలో యీ దిగువయుదాహరణములు ముక్షువునకు, తన సత్యస్వరూపగ్రహణ సౌలభ్యము నిచ్చును. ఎట్లన వ్యవహారము నందు ఆకాశము, అమూర్తము,

సర్వవ్యాపకమై నిత్యము. ఘటాదులు ఆగంతుకములై మూర్తపదార్థము లగుచున్నవి. నిత్యమైన మహాకాశమందే ఘటోత్పత్తి యైన తరువాత ఘటాకాశమను వ్యవహారము వచ్చుచున్నది. కాని ఘటోత్పత్తికి పూర్వము మహాకాశము యీ ఒక్కటి యైన మహాకాశముగానేయుండి, ఘటమున్న కాలములో మాత్రము ఘటాకాశమని తెలియబడుచు, యిట్లె యెన్ని ఘటములున్న అన్ని ఘటాకాశములుగ వ్యవహరింపబడుచూ, ఏ ఘటము నశించిన తదుపరి ఆ ఘటాకాశము యీ ఒక్కటి యైన మహాకాశముగా నెట్టుతెలియబడుచున్నదో, అట్లే యీ చిదాకాశమను బ్రహ్మపదార్థమందు సర్వ జీవులును కల్పితులై, అనాది భ్రాంతిచే అంతఃకరణ తాదాత్యము యున్నంత కాలము జీవుడని తెలియబడుచు, అంతఃకరణ తాదాత్యము వినముకాగానే యిప్పుడు నేను అను అహం పదార్థమే చిదాకాశ స్వరూపము, అనగా బ్రహ్మరూపమగుచున్నది. కాన ఏ జీవుడు స్వప్రయత్నముచే, తన అంతఃకరణ తాదాత్యాధ్యాసను విడచునో అట్టివుడే బ్రహ్మస్వరూపు డగును. ఎన్ని ఘటాకాశములకైననూ, మహాకాశము ఒక్కటియే యయినట్లు, సర్వ జీవులును వారి వారి, ముక్తియనంతరము ఈ అద్వయ అఖండ, పరిపూర్ణ, చిదాకాశ స్వరూపమే యగుదురు. కాని మరి యొక విధమగుటకు వీలులేదు. దీనిని ముముక్షువులు బాగుగ గ్రహించి తమ సత్యస్వరూపానుసంధానమును యాచరించుచుండుట శీఘ్రఫలదాయకము. ఇట్లే యితర నిరూపణములయందు శ్రుతి, యుక్త్యనుభవమున పెక్కు దృష్టాంతములు వివిధముగ యుదహరింపబడి యున్నవి. ముముక్షువులు వారి సత్య స్వరూపానుసంధాన—ప్రయోజనముకుగాను, అట్టి దృష్టాంతము లన్నిటిని బాగుగ విమర్శ పూర్వకముగా పఠించి, హృద్గతము నొందించు కొనుట తన వాస్తవ స్వరూప గ్రహణమందు జిజ్ఞాసువులకు కరతలామలకముగ నుండును.

కాని ఇచట ముముక్షువులొకటి ముఖ్యముగ గ్రహించవలెను. ఇట్లు తెలిసికొని యనుసంధానాదులను యాచరించుచున్ననూ ప్రారబ్ధ శేషముండు

నంతవరకు అంతఃకరణోపాధి విడువదు. అనగా జీవునకు అంతఃకరణోపాధి, తాదాత్మ్యభ్యాసము యుండుచునే యుండును. ఈ శరీరోపాధి యున్నంతకాలము శరీర ధర్మములు విడువవు. ప్రారబ్ధము జీవునికి విధింపబడిన శిక్షవంటిదని లోగడనే వివరించియుంటిమి. ఈ ఉపాధి జీవునకు కారాగృహమువంటిది. జీవుడిప్పుడు ఇందు బంధింపబడియున్నాడు. తన వివేకాభ్యాసాదులచే జీవుడిప్పుడు తన సత్య స్వరూపమును తెలిసికొన్ననూ ప్రారబ్ధాంతమువరకు ఉపాధి ధర్మములు విడువవు. కాన జిజ్ఞాసువులు ఈ విషయమును నిశ్చయముగా గ్రహించి తమ ఉపాధి ధర్మములయందు సక్తతా మానరహితులై ప్రారబ్ధమును సాధ్యమగు నిర్లిప్తతతో యనుభవించుచూ తన సత్య స్వరూప జ్ఞానమును మరువక, విడువక, విసుగు జెందక, తదేక చింతనతో ప్రారబ్ధానుసారమున, తన స్థితి, దేహధారణావశ్యకమైన క్రియలను మాత్రమాచరించుచుండిన, ప్రారబ్ధక్షయమును పొందిన క్షణమే తన సత్య స్వరూప జ్ఞానము నిలచి తాను తత్స్వరూపుడగును. కాన ముముక్షువులైన జిజ్ఞాసువులు తమ సాక్షాత్కార పర్యంతము నిరుత్సాహము చెందక సతతాభ్యాసాదులను యాచరించుట విధిగా కనుబడుచున్నది.

ఇంకనూ అహం, నేను అను యీ పదమునకు వాస్తవార్థమును స్వానుభవములనుబట్టి విచారించినయెడల గూడ ఇప్పుడు కలుగుచున్న పరిచ్ఛిన్న గ్రహణము భ్రాంతియని స్పష్టపడును. ఎట్లన ఏ జీవుడైననూ అహం, నేను అని చెప్పునపుడు, తాను అని యనుకొనుచున్న నేనుయను పదమున కర్థమేమగుచున్నది, యని విచారించినయెడల, నేను, నేను, అను ప్రతిఒక్కరును, సర్వదృశ్యేతరమును నిషేధించిగదా, యీ నేను అను పదముచేత తనను మిగుల్చుకొనుచున్నారు. ఇట్లు మిగుల్చుకొనుటయనునది అనేక పదార్థములున్నప్పుడుగదా సంభవము? వాస్తవమునయున్నది అద్వితీయ, అఖండ, పరిపూర్ణ, పదార్థమొక్కటియే యగునప్పుడు మిగుల్చుకొనుట

యనునదిగాని, శేషించుటయనునదిగాని, ఎట్లు సంభవము ? ఈ బ్రహ్మ పదార్థము నిర్విశేషమైయున్నది. శ్రుతిదీనినే "ఏకమేవా ద్వితీయంబ్రహ్మ, నేహనానాస్తికించన" అని చెప్పుచున్నదిగదా ? శ్రుతివాక్యము అప్రమాణ మగుటకువీలులేదుగదా ! వేదము, యున్నది ఒక్కసత్యవస్తువే, తదితర మేదియునులేదు అని తెలుపుసప్పుడు యీ దృశ్య నానాత్వముచూచుట, పొందుట, భ్రాంతియేగదా కావలసివచ్చును. ఇంకనూ మానవుడు పరిచ్ఛిన్ను డై తాను ఒక్క అయివున్ననూ తనస్వల్ప నిద్రాకాలమందు తాను బహు విషయ, జన, వస్తు, పదార్థములతో సంబంధముకలదై గమనాగమనములను యుచూ, సుఖ, దుఃఖానుభవములనుపొందుచూ, సంవత్సరములతరబడి. దీర్ఘకాలానుభవములనుకూడ తనయందే పొందుచున్నాడుగదా ? ఇదియంత యువాస్తవమా ? కాని స్వకాలసత్యత్వమును అనుభవించుచున్నాడు. ఇది యంతయూ వాస్తవముగాదని తన స్వప్నమునుంచి మేల్కాంచినతదుపరిగదా? తన స్వప్న పదార్థానుభవముల అసత్యత్త్వమును తెలిసికొనగలుగుచున్నాడు ? తన స్వప్నములోయున్నంతకాలము, అట్టిదృశ్య సంఘటనలన్నియూ, వాస్తవ మనియేగదా యనుభవించుచున్నాడు అట్లై ఈ అద్వితీయుడైన శుద్ధజీవుడే మాయాప్రభావముచే, అనాది, అవిద్యాభ్రాంతుడైనట్లు కనబడుచూ, ఒక్క డైన తనయందే దృశ్యనానాత్వమును చూచుచూ, దృశ్య దుఃఖములననుభ వించుచున్నట్లు కనబడుచున్నాడు ఇట్లు చేయుటలో వాస్తవతః ఎల్లప్పుడునూ, నేను, అనుశుద్ధజీవుడు ఒక్కడే గనుక స్వభావముననుసరించి జీవ న్న, న్న, పరిచ్ఛిన్న భ్రాంతికాలములోగూడ ప్రతియొక్క భ్రాంతి వుడునూ తననే మిగుల్చుకొనుచున్నాడు. ఏలనన, తాను ఎల్లప్పుడును అద్వి యుడేగనుక. కనుకనే జీవసముదాయమునందు యీ నేనను (అహం) పదమునకు శబ్దార్థము అనుభవము, ప్రతివారికినీ ఒక్కవిధముగానే సంసారభ్రాంతియున్నంత కాలము నానాత్వముగనూ, సంసారభ్రాంతి నివర్తించినతదుపరి. తన, అఖండ, అద్వి య, పరిపూర్ణత్వమును తెలిసికొనుచున్నాడు. ఇట్టిస్థితినే "ఏకత్త్వమను పశ్యతి" అని శ్రుతి అనువదించుచున్నది. అప్పుడుసర్వత్ర

యూ పరిపూర్ణముగనున్నది తానుయొక్క దేగనుక, అప్పుడు అహం, నేను అను పదము నిష్ప్రయోజనమై, లోపించును. అప్పుడే "పూర్ణస్యపూర్ణమాదా యపూర్ణమేవావశిష్యతే" అను శ్రుతిసార్థక్యము జీవునకగుచున్నది.

ఇచట పాఠకులకొక విజ్ఞప్తి ఏమనిన, ఈ గ్రంథమంతయూ చెప్పినదే చెప్పుటగాని ? మరియొకటి కనుబడుటలేదేయని తోచవచ్చును. అట్లనుకొనుటయుచితముగాదు. జీవునకు వాస్తవమున తనసత్యస్వరూప మగు యీఅత మాయా ప్రభావముచే జీవుని అనాది అవిద్యాదోషమువల్ల స్వప్రయత్న, దీక్ష, విచారాభ్యాసాదులవల్లగాని తెలియబడదు. ఈ అద్వి .య, నిరుపమానమైన, బ్రహ్మపదార్థమందు స్వానుభవబోధకలిగించుటయే యీ గ్రంథముఖ్యతాత్పర్యము. అందుకుగాను సదా ఒక్కటియగు బ్రహ పదా ర్థమునుగురించి లాఘవమున బహుతెరంగుల, బోధయావశ్యకమగుచున్నది. గనుక "గ్రంథలాఘవాద్బుద్ధిలాఘవం ప్రయోజకమితి" అనగా గ్రంథము యొక్క లాఘవమువల్ల, బుద్ధికి లాఘవముకలుగుట ప్రయోజనమని, శ్రీసురేశ్వరవచనమునసనుసరించి బ్రహ స్వరూప విషయములు అనుసంధాన వాక్యములు. మాటిమాటికి చెప్పబడుచున్నవి.

పరమ ప్రయోజనముకలుగుటకుగాను ఒకే అర్థమునిచ్చు వాక్యములను మాటిమాటికి చెప్పిననూ పునరుక్తిదోషము రానేరదు. ఎక్కడయొక అర్థ మును నిష్ప్రయోజనముగ మాటిమాటికి చెప్పబడునో అచ్చటనే పునరుక్తి దోషము సంభవించును. ఇచ్చట జీవునకు పరప్రయోజనమునసనుసరించి మాటిమాటికి ప్రతినిరూపణ, ప్రకరణములయందున, వివిధముగ ఒకే అర్థ వాక్యములను చెప్పుట, స్వలాభముకొరకేగాని, వ్యర్థముగాదని పాఠకులు గ్రహింతురుగాక. ఎవరికి వారు, ఆత్మవాస్తవికతను తెలుసుకుని స్వానుభ వము పొందుచే జీవునికి పరమలాభము, మోక్షమనిచెప్పబడుచున్నది— ముముక్షువునకు యిట్టిస్థితికలుగుచే .పరమలాభము—పరమావధి. ముక్తి, మోక్షమని శాస్త్రము తెలుపుచున్నది.

ఇంకనూ ఆత్మయన్నను, బ్రహ్మ యన్నను, శుద్ధజీవుడన్నను, నేను,— అహంఅన్ననూ, పరమార్థమున వీటికన్నిటికినొకేఅర్థము—ఇదియంత యునూ, యల్లప్పుడునూ, అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపము కాని మరియొక టికాదు—వాస్తవమున నేను అహం అను పదార్థము జ్ఞానరూపము కాని మరి యొకటికాదు—ఈ అహం అను పరిపూర్ణ జ్ఞానస్వరూపుడే తనపరిపూర్ణత్వ అఖండత్వములను మరచి పరిచ్ఛిన్నత్వయుపాధితాదాత్మ్యమునొంది తాను పరిచ్ఛిన్నుడే, నను భ్రాంతిజ్ఞానమునొంది సంసారముననుభవించుచున్నాడు. కాని వివేకియైన జీవుని తాను మరచిన తనపరిపూర్ణజ్ఞానస్వరూపమునొంది ఈ నేను అహం అను ప్ర తి తనపరిపూర్ణజ్ఞానస్వరూపమే వాస్తవముగాని పరిచ్ఛిన్నజ్ఞానము వాస్తవముకాదని నిశ్చయము.

# మనస్స్వరూపము, దాని పరమప్రయోజనము

ఈ మనస్స్వభావమునుగురించి కొంతవరకు లోగడవిచారణ చేసి యుంటిమి. కాని:—

శ్లో॥ "మన ఏవమనుష్యాణాం, కారణం బంధమోక్షయోః", మానవులకు కలుగుచున్న బంధమోక్షములకు మనసుయే కారణమని వచనము తెలుపుచున్నది. గనుక ఈ మనస్స్వరూపమెట్టిది? మానవునికిది బంధమోక్షములకు యెట్లు కారణమగుచున్నది యని విచారించి, యీ మనసు మూలకముగా కలుగుచున్న బంధకారణమును తొలగించుకొని, తన నిత్యనిరతిశయసుఖమైన మోక్షమును పొందుటయెట్లు అని విపులముగా విచారణచేసి దాని పరమ ప్రయోజనము పొందుటకు యీ చేయబోవు విచారణ యావశ్యకమైయున్నది.

మనస్సన్నను, చిత్తమన్నను అవస్థా భేదముచే ఈ షద్భేదమున్నను, యీ రెండును అంతఃకరణ పరిణామములే గనుక దాదాపు యొక్కటిగనే గ్రహింపవచ్చును. ఈ మనసు ఇంద్రియములలో రాజువంటిది-జ్ఞానేంద్రి యములైదని ప్రసిద్ధిగా తెలియబడుచున్నను, యీ మనసును షష్ఠేంద్రియ ముగా గీతాచార్యులైన కృష్ణభగవానులు తెలుపుచున్నారు, ఈ మనసే మన కందరకును కలుగుచున్న సుఖదుఃఖములకు కారణమగుచున్నది. ఇది చాల బ యమైనది. సర్వ ప్రపంచము దీనితోడనే అనుభవింపబడుచున్నది. అనగా మనసు యుండనియడల జగత్తుయే యుండదు. దీనినే :—

శ్లో॥ చిత్తం కారణమర్థానాం, తసి స్నతి జగత్త్రియం ।
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః ॥

అన్ని పదార్థములకు మనసే కారణమైయున్నది. మనసు యుండినసే మూడు లోకములుగలవు. మనసు నశించిన యడల జగము నశించును. కనుక ప్రయత్నముచేత ఆ మనసునే నిగ్రహింపవలెను, అని వశిష్ఠవచనము తెలుపు చున్నది. కాని తక్కిన ఇంద్రియముల లాగున యిదియును కల్పితమే ఈ మనస్సుననది బాహ్యమందుగాని, అంతరమందుగాని వాస్తవముగా యున్నదిగాదు. అయినను సర్వులచేతను అనుభవింపబడుచూ వారి, వారి, సుఖదుఃఖములకు కారణమగుచున్నది. అనగా పంచేంద్రియములకు విష యములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు జ్ఞానములు ఈ మనసు వల్లనే కలుగుచున్నవి. కాన ఈ పంచేంద్రియములకు రాజులాగున ఈ మనసుయే ఆరవయింద్రియముగా చెప్పబడినది. ఆకారము లేని చైతన మందు పదార్థరూపమగు నేయధ్యాసగలదో అదియే మనసని తెలియబడు చున్నది. ఇదియే జీవుని సత్యస్వరూపమును మరుగుపరచి దృశ్యసంసార మును జీవునకు కల్పించుచున్నది. అధ్యాసయనగా అది కాని దానియందు అదియని తోచుట, అనగా శుక్తియందు తోచురజతములాగున, ఈ మనస్స్వ రూపము మనలకు కలుగు సంకల్పములే దీనినే ,—

శ్లో॥ సంకల్పంహి మనోవిద్ధి సంకల్పాత్తన్న భిద్యతే।
యత్ర సంకల్పనం తత్ర మనోఽస్తీ త్యవగమ్యతామ్ ॥

సంకల్పముకన్న మనస్సు వేరుగాదనిన్నీ—సంకల్ప మెచటనుండునో మనసు అచటనే యుండుననిన్నీ :—

శ్లో॥ సంకల్పమనసీ భిన్నే నకదాచన కేచన ।
అవిద్యా సంసృతిశ్చిత్తం మనోబంధో మలంతమః ॥

సంకల్పము, మనసు, యివి వేరు వస్తువులు గానేరవు. అవిద్యా, చిత్తము, మనసు, బంధము, మలము, తమస్సు, అని సంకల్ప జాలమునకే నామములు యనిన్నీ "సంకల్ప జాలేగళితే స్వరూప మవశిష్యతే", యిట్టి సంకల్పజాలము జారిపోయిన యడల తన వాస్తవమగు స్వరూపము శేషించి ప్రకాశించును—అనిన్నీ శ్రీరామచంద్రమూర్తికి వశిష్ఠ భగవానులు తెలుపు చున్నారు.

కనుక ముముక్షువు దీనిని బాగుగా తెలుసుకొని తన మనసును తన సంసార బంధకారణమునకు గాక తన సత్య స్వరూపమైన నిత్య, నిరతిశయ, సుఖప్రాప్తికి సాధనముగ చేసుకొని తల్లాభమును పొందవలయును. ఇట్టి పరమలాభమును పొందించుటకు యీ మనస్సుయే సమర్థముగాని అన్య ములుగావు. ఏలనన, గొప్ప లాభమును కోరువాడు గొప్పదానినే ఆశ్రయించి అట్టి లాభము పొందవలయును. గాని సామాన్యులేమి చేయగలరు? ఆలాగు ననే ముముక్షువు పరమ లాభము గోరువాడు గనుక యింద్రియములకు రాజై షష్ఠేంద్రియముగా తెలియబడుచున్న యీ తన మనసునే యాశ్రయించి అనగా చిత్తశుద్ధిని సంపాదించి యట్టి సంస్కృత మనసుచేతనే జిజ్ఞాసువు తనకు పరమ లాభమైన మోక్షమును పొందవలెనుగాని మరియొకదారిలేదు. ఈ మనస్సామర్థ్యమును గురించి :—

శ్లో॥ మనఏవ సమర్థంహి మనసోదృఢ నిగ్రహే ।
అరాజా కిం సమర్థస్స్యా ద్రాజ్ఞో రాఘవనిగ్రహే ॥

శ్లో॥ మనసైవమనశ్ఛిత్త్వాపాశం పరమ బంధనమ్ ।
భవాదుత్తార యాత్మానం । నాసావన్యే సతార్యతే ॥

మనసుయొక్క దృఢనిగ్రహమునందు మనస్సుయే సమర్థము కాగలదు. రాజులను నిగ్రహించుటయందు రాజుగానివాడు సమర్థుడుగాడు కదా ? ఉత్కృష్టమైన మనఃపాశమును మనస్సుతోనే ఛేదించి భవసాగరమునుంచి ఆత్మ ను ఉద్ధరింపుము. ఈ ఆత్మనుమరియొకదానిచేత ఉద్ధరింప శక్యముగాదు గదా ? అనిన్నీ ; ఇంకను

శ్లో॥ అనంతస్యాత తత్వస్య సర్వశక్తేర హాత నః ।
సంకల్పశక్తి రచితం యద్రూపం తన్మనో విదుః ॥

అనన్తమైన సర్వశక్తి సహితమగు పరమాత్మ వస్తువుయొక్క సంకల్ప శక్తిచే యేర్పడిన రూపము మనస్సని చెప్పుదురు అనిన్నీ, వశిష్ఠ వచనము తెలుపుచున్నది. కాని యీ మనస్సు—వారి, వారి, అంతఃకరణ ధర్మములతో అనాదివాసనా సంస్కారములనుబట్టి సదా సంకల్పములు చేయుచూ వాటిఫల కర్తృత్వ భోక్తృత్వాదులతో సుఖదుఃఖము లనుభవించుచూ జీవునకు సంసార బంధము కల్పించుచుండును. ఇట్టి సంసార బంధమునుండి విముక్తి డగుటకు ముముక్షువైనవాడు, నిత్యానిత్య వివేకాదులను సంపాదించి దృశ్య మిథ్యాత్వ నిశ్చయ జ్ఞానమును పొందుట మూలకముగా మనసునకు దృశ్య మునందు సత్యత్వ జ్ఞానము తగ్గుచుండుటచే సక్తతా, సంకల్పములు క్రమ ముగా క్షీణించుచుండును. సర్వదృశ్యము మనఃకల్పితముగాని వేరేమియును వాస్తవముగాఁడు. స్వప్నమునందు గలుగుచున్న దృశ్యానుభవములు మనః కల్పితములేగదా ? ఇది అందరియనుభవములో నున్నదే. అనగా యీ మనసే నిద్రయందు అంగుష్ఠ మాత్రమైన తనయందే సమస్త

దృశ్యమును ఇంద్రియ సంకర్షణములేక కల్పించి స్వప్నద్రష్ట అనుభవింప చేయుచున్నది. ఇట్లే జాగ్రద్దశయందుగూడ ఈ మనస్సే వారి, వారి, అంతఃకరణ ధర్మములను బట్టి ఇంద్రియసంకర్షణముతో సమస్త దృశ్యమును మనలకు గలుగజేసి అనుభవింపజేయుచున్నది. సుషుప్తియందు యీ మనసు లయస్థితిలోనుండును గనుక ఆస్థితియందు మనోవ్యాపారమేమియును లేక దృశ్యము స్ఫురించుటలేదు. కాన దీనినిబట్టి సర్వదృశ్యము-మన-మనః కల్పితమేనని నిశ్చయమగుచున్నది. కనుక మనసుయున్న యడల మనకు దృశ్యమున్నది. మనసులేని యడల దృశ్యములేదు. అని తెలియబడు చున్నది గదా! మనసు సంకల్పించగనే యింద్రియములు రాజునకు సేవ కుల లాగున ఆయావస్తువులను అనగా, విషయములను సమకూర్చును. కావున ముముక్షువైనవాడు ఈ విషయమును జాగ్రతతో తెలుసుకొని సర్వవిధముల చేతను తన మనోనాశప్రయత్నము చేయుచుండుట యావశ్యకము. ఇచట మనోనాశ మనగా మనసు నశించుటయని యర్థముగాదు అద్వైతులమైన మన లకు వస్తునాశమెన్నటికినిలేదు. సర్వదృశ్యకోటి (అనగా ఈ మనసుగూడ యందులోనిదే). బ్రహ్మయందధ్యస్తము. అధ్యస్తమునకు జ్ఞానముచే నాశము గాని స్వరూపము లేక వస్తునాశమెన్నటికిని యుండదు. ఇదిగాకను అధ్య స్తము అధిష్ఠానమును విడిచియుండదు. కాన ఎన్నటికిని పోవునదిగాదు. ఒక వస్తువుయొక్క దాని స్వరూపము గాని, అనగా అవాస్తవరూపమును జ్ఞానముచే త్యజించి ఆ వస్తువుయొక్క యథార్థస్వరూపమును జ్ఞానముచే తెలుసుకొను టయే మన ప్రయత్నము. అందుకుగాను మన సంకల్పములచే పరిచ్ఛిన్న దృశ్యమందు మనలకు గలుగుచున్న సత్తా మానములన్నియు మనసు నశించినగాని యుపశమించవు ఈ దృశ్యసత్యత్వజ్ఞానము యుపశమించిన గాని అధిష్ఠానమైన బ్రహ్మవస్తువు పొందబడదు. కనుక ముముక్షువైనవాడు సర్వదృశ్యమిథ్యాత్వమును బాగుగ గ్రహించి దృశ్యసత్తారహితుడై తన మనస్సుచే వాస్తవముగాదను నిశ్చయజ్ఞానముతో స్వశరీర సర్వదృశ్యమును

త్యజించి సర్వాధిష్ఠానమైన సద్వస్తువునందు తన మనసును నిలిపి, గ్రహించి, నిశ్చయమునుపొంది, స్వానుభవమును పొందుటకు యత్నించవలెను :—

శ్లో॥ సంకల్పిత్వంబంధస్యకారణంతత్పరిత్యజ ।
మోక్షస్తు నిస్సంకల్పత్వం తదభ్యాసం ధియాకురు ॥

సంకల్పసహితమనసు దృశ్యసంసారమునకు హేతువగుచున్నది. సంకల్పరహిత మనసు బ్రహ్మప్రాప్తికి సాధనమగుచున్నది. దాని బుద్ధిచేత అభ్యసింపుము అని వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు. ఈ మనసు కల్పితమైనను సామర్థ్యము గలది గావున దీనినే ఆశ్రయించి, సంస్కరించుకొని దీని సాహాయ్యముచేతనే జీవుడు తన పరమలాభమైన సత్యస్వరూపప్రాప్తిని పొందవలయును గాని అన్యమువల్లగాదు. ఈ మనసువల్లనే బ్రహ్మ పొందబడునని "మనసైవేదమాప్నోతి" యని శ్రుతి వచనము తెలుపుచున్నది.

ఈ మనసును జయించు యుపాయమును గురించి :—

శ్లో ॥ స్వాలోకిత శ్శాస్త్ర దృశా స్వబుధ్యా స్వానుభావితః ।
ప్రయచ్ఛతి పరాంసిద్ధిం త్యక్త్వాత్మా నం మనః పితా॥

శాస్త్రదృష్టి చేత పర్యాలోచన చేయబడినట్టియు స్వానుభవముచే నిశ్చయించుకొనబడినట్టియు మనస్సు తాను లయము నొంది కైవల్యము నిచ్చుచున్నది.

శ్లో ॥ సుదృష్టస్సుదృఢ స్స్వచ్ఛస్సుఖాంత స్సుప్రబోధితః ।
స్వగుణే నోర్జితో భాతి హృది హృద్యో మనోమణిః ॥

ఉత్తమమగు శాస్త్ర దృష్టికలది గాన సంశయ విపర్యాసరహితమైనట్టియు, సంశయ విపర్యయ రహితమైనది గాన నిర్మలమైనట్టియు, నిర్మలమైనదిగాన శుభేచ్ఛ గలిగినట్టియు, శుభేచ్ఛగలది గాన మంచి జ్ఞానమును పొందినట్టియు,

## మనస్స్వరూపము, దాని పరమ ప్రయోజనము

జ్ఞాన యుక్తముగాన, శమదమాది గుణయుక్తంబై రమణీయంబగునట్టి మనస్సు అను మణి హృదయమునందు ప్రకాశించు చున్నది.

శ్లో॥ ఏవంమనోమణిం రామ బహుపంకకళంకితమ్ ।
వివేకవారిణా సిద్ధై ప్రక్షాళ్యా లోకవాన్భవ ॥

శ్లో॥ వివేకం పరమాశ్రిత్య బుధ్యాసత్యమలేక్ష్యచ ।
ఇంద్రియారీనలం ~త్వా ర్ణోభవ భవార్ణవాత్ ॥

అనగా అనేకములగు మలినవాసన లను బురదచే కళంకము గలిగియున్న మనస్సు అను మణి విచార జన్యమగు విజ్ఞానమను జలముచే కడిగి మోక్షము కొరకు తత్త్వమును ఆలోకింపుము. ఉత్కృష్టమగు వివేకము నాశ్రయించి బుద్ధిచే తత్వము నెరింగి ఇంద్రియములను శతృవులను జయించి సంసార సాగరమును దాటుము. అని వశిష్ఠభగవానులు శ్రీ రామచంద్రమూర్తికి తెలుపుచూ,

శ్లో॥ యత్కృతం మనసా రామ తత్కృతం విద్ధిరాఘవ ।
యత్యక్తం మనసా తావత్త, త్యక్తం విద్ధిరాఘవ ॥

మనస్సుతో చేసినపనియేపని అగునుగాని శరీరమాత్రముతో చేసినది పని గాదనియు, మనస్సు విడచిన వస్తువు విడువబడినదిగాని శ రముచే మాత్రము విడచినది విడవబడినది గాదనిన్నీ,

శ్లో॥ యస్యా చపలతాం యాతం మనోమనసవర్జితం ।
అనుత్తమపదే నాసౌ ధ్యానే నానుగతోఽనఘ ॥

ఎవని మనస్సు చలింపక సంకల్ప రహితమై యుండునో వాడే అన్ని యుపాయములలో నుత్తమమైనట్టి చిద్రూపుడగు నాత్మను ప్రకాశింప జేయునట్టి

ధ్యానముతో గూడిన వాడని యెరుంగుము. అనగా పరమలాభము గలిగించు నది గావున మనోనిశ్చలత్వమును సంపాదించుకొన వలెనని తాత్పర్యము అని వశిష్ఠ వచనములు తెలుపుచున్నవి.

లక్క అగ్ని వేడిమిచే ఎట్లు కరిగి వివిధా కారములను పొందునో అట్లే యీ మనసు సంకల్పములయొక్క (అగ్ని) అను బలముచే తత్సంకల్ప వస్త్వాకారకారితములుగ పరిణమించు చుండును. అప్పుడే మనలకు విషయ స్ఫురణము కలుగును. ఇట్లు వారి, వారి, అనాది వాసనానుసారముగ సదా యీ మనసు యొక విషయమునుంచి మరియొక విషయ సంపాదనేచ్ఛను పొందుచూ యట్టి విషయ పరిణామములను పొందుచుండును. అనగా వృత్తి జ్ఞానము తద్విషయాకారా కారితమగుచు ప్రారబ్ధ కర్మఫలానుకూలముగ ఈ వృత్తి, విషయ, విషయాంతర పరిణామముల నొందుచూ నిరంతరము విషయచింతనజేయుచూ తాత్కాలిక సుఖదుఃఖములను జీవుని ననుభవింప జేయుచుండును. ఇట్టిది యే మనసు కల్పించు సంసారము. ఈ సంసార దుఃఖమునుంచి విముక్తి కోరు మానవునికి యీ మనస్వరూప లక్షణములు బాగుగా తెలుసుకొని తన మనసును తగు చికిత్సతో తన స్వాధీనము నందుచుకొనినయడల యీ మనస్సుయే తనకు పరమశ్రేయస్కరమైన సత్య స్వరూప ప్రాప్తిని కలుగజేయుటకు ముఖ్యసాధన మగును. కాన దీని స్వభావము విచారించుట యావశ్యకము. లోకమునందుగూడ ఏవస్తువు అయి నను, ఎవరైనను, వారి సహజ స్వభావమును బట్టిగదా ? వారు ఆయా పను లకు ఉపయోగపడు చున్నారు. ఈ మనసనునది స్వభావముచేత లక్కవంటిది. అనగా లక్కకు అగ్ని సంస్కారము వలన ఏ రూపము కావలయునన్న అట్టి రూపముగా మారుటకు సామర్థ్య మున్నది. ఇట్లే యీ మనసుగూడ లక్కవలె ఆ యా జీవుల అవిద్యావాసనానుకూలముగ కలుగుచున్న సంకల్పాగ్నులచే వివిధ పరిచ్ఛిన్నాకారములను పొందు చుండును. ఇవియే వృత్తిజ్ఞానములు. వీనివలననే మనలకు సంసార దుఃఖము కలుగుచున్నది.

ఇట్లు కలుగుచున్నదియే జీవునకు అనాది, అవిద్యా, కామ, కర్మల ఫలమైన సంసారము. ఇట్లు కలుగుటకు కారణము జీవుడు తన వాస్తవ సచ్చితానంద పరిపూర్ణ స్వభావములను మరచి, మాయాబలముచే భ్రాంతుడై పరిచ్ఛిన్నత్వ, దుఃఖిత్వములను గ్రహించుట. ఇదియే అజ్ఞానము. ఇందువల్లనే యీ మనసు సదా పరిచ్ఛిన్నరూపములను గ్రహించుచు ఆభాస సుఖ దుఃఖములను అనుభవించు చుండును. పైన తెలిపిన యట్లు యీ మనసునకు తను యెట్టి సంకల్పము చేసిన యట్టి యాకారము పొందు సహజస్వభావమున్నది. దీనినే :—

శ్లో ॥ భావితం త్రీవ్ర సంవేగాదాత్మనాయత్తదేవనః ।
భవత్యాశు మహాబాహో విగతేతరసంస్మృతిః ॥

అనగా పురుషుడు యితరవస్తువులను స్మరించకుండ, తీవ్రమైనభావనచే అనగా నిశ్చలమనసుతో యేవస్తువును భావించునో తాను యావస్తువుగానే యేర్పడునని, పై విద్యారణ్యవచనము తెలుపుచున్నది. కాన ముముక్షువు దీనిని బాగుగ గ్రహించి యిట్టిదైన మనోసహజ స్వభావమును యీ విధమున యుపయోగించుకొనవలయును. అనగా తనసత్యస్వరూపము, యిప్పుడు తనకు గలుగుచున్న న్న, న్న, పరిచ్ఛిన్నాకారములుకావనిన్నీ, తాను అద్వితీయ సచ్చిదానంద అఖండస్వరూపుడను, జ్ఞానము సంపాదించి యీ జ్ఞానాగ్నితో తన మనసును ద్రవింపజేసి (కరగి) తన అఖండాకారమను మూసలో నిరంతరము పోయుచుండిన కాలక్రమమున అభ్యాసపాటవముచే తనమనసు పరిచ్ఛిన్నమైన యీ విషయాకారములను పొందక అఖండాకార పరిపూర్ణరూపమునేపొందును. మనసును యీ జ్ఞానాగ్నిచే కరుగజేయు, వారి,వారి సామర్థ్యములనుబట్టి "భావనాదారుఢ్యాసిద్ధిః" అనుసూత్రమునననుసరించి వారిమనసు అఖండ అద్వితీయ సచ్చిదానందరూపమును పొందును. కాని యీ మనసుచేగలుగు పరమ లాభమునొందుటకు ముముక్షువు "ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్" అనగా చిత్తమును పరమాత్మయందు నిశ్చ

లముగాజేర్చి యితర విషయములను కొంచమైనను చింతించగూడదని శ్రీ కృష్ణ భగవానులు తెలుపుచున్నారు. కాన తన మనసునందు సదా గలుగుచుండు విషయాకారవృత్తులను నిరోధించుట యావశ్యకము. ఇవి వైరాగ్య సతతాభ్యాసములవల్లగాని చిత్తవృత్తులు నిరోధింపబడవని "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" అనిపాతంజలి సూత్రము తెలుపుచున్నది. ఇంకను

శ్లో॥ మనసోనిగ్రహాయత్త మభయంసర్వయోగినాం ।
దుఃఖక్షయః ప్రబోధశ్చ్యాక్షయా శాంతిరేవచ ॥

అని సకలమైన యోగులకు విదేహకైవల్యము, సర్వదుఃఖక్షయము, బ్రహ్మ తత్వజ్ఞానము, వన్ముక్తి, యివియన్నియు మనోనిగ్రహముచేతనే కలుగు చున్నవి. కనుక మనసును ముఖ్యముగా జయించి స్వాధీనపరచుకొనవల యును. అని విద్యారణ్యులు జీవన్ముక్తి ప్రకాశికయందు తెలుపుచున్నారు. కాన జీవుని అభ్యాసబలముచే తన వాస్తవ,పరిపూర్ణ, సచ్చిదానంద రూపము స్ఫురించుచుండును. ఇది తన మనోబలముచే గోచరించుచుండును. అయి నను యిదియున్న వృత్తిజ్ఞానమే యగుచున్నది. కాని యిట్లయినను యీ వృత్తిజ్ఞానముతోడనే ఫలపర్యంతము యీ వృత్తిరూపమైన తనమనసుచేత అనుసంధానాదులను జేయుచుండవలయును. కాన ముముక్షువైనవాడు లోగడ మనము ఆత్మానుసంధాన ప్రకారనిరూపణలో చేసిన అంశములను మనో గోచరముచేసుకొని విసుగుజెందక సుస్థిరుడై యభ్యాసాదులను జేయుచుండిన తదుపరి కాలక్రమమున యీ వృత్తియే వునికి పరమసాక్షాత్కార వృత్తిని గలుగజేసి, స్వభావముచే యీ మనసు కల్పితమైనది గనుక తానులేనిదియే యగును. అప్పుడు యీ వృత్తిజ్ఞానమనునది నశించిస్వరూపజ్ఞాన రూపుడే యగును. ఇదియే తన వాస్తవ స్వరూపము. ఇదియే తన అద్వితీయ, అఖండ, పరిపూర్ణ స్వరూపము "పూర్ణశ్చపూర్ణ మాదాయ పూర్ణమే వావ శిష్యతే" యనుశ్రుతి వాక్యము ననుసరించి తాను నిత్య నిర్విశేషపరిపూర్ణుడై

శేషించును. ఇదియే మోక్షము. దీని సంపాదనకు గాను ముముక్షువు యీ మనసుయె ముఖ్యసాధనమని గ్రహించి దాని పరమ ప్రయోజనమును స్వప్రయత్న పూర్వకముగ సాధించి పొందుటయే దీని పరమ ప్రయోజనము.

ఇంకనూ వాశిష్ఠ బోధననుసరించి బ్రహ్మ యన్నను మనస్సన్నను ఒక్కటియే యనియూ, కాని నిస్సంకల్పమనస్సు బ్రహ్మ యనియు, సంకల్ప మనసు సంసారమనియు తెలియుచున్నది. ఇంకనూ ఈచలించు మనస్స్వ రూపమే సంకల్పమనియూ గూడ తెలుపుచున్నారు. అనగా సంకల్పమే మనస్సని విశదమగుచున్నది. దీనినే :—

శ్లో॥ సంకల్పనం మనోవిద్ధి సంకల్పాత్తన్నభిద్యతే ।
యత్రసంకల్పనం తత్రమనోఽస్తీత్యవగహ్యతామ్ ॥

ద్రవత్వముకంటె ఉదకంబును, చలనంబుకంటె వాయువును, వేరుగా నుండని విధమున సంకల్పముకంటె మనస్సు వేరుకానేరదు. కాన సంకల్పమే మనస్సని ఎరుంగుము. అని వశిష్ఠ భగవానులు తెలుపుచున్నారు. దీనినిబట్టి ఈ దృశ్యసంసార దుఃఖమంతయూ సంకల్పముల రూపమున ఈచలించు చున్న మనస్సువల్లనే కలుగుచున్నదని తెలియుచున్నదిగదా. కాన ఈ మనసు యొక్క చలన చాంచల్యములను త్యజించినగాని, మన మనస్సు కల్పించు చున్న సంకల్పములు సంసారదుఃఖము నశించదని నిశ్చయమగుచున్నది. ఇందుచే మనసుయొక్క చలనకారణములను సివేసిన యెడల గాని సంసారదుఃఖము నశింపజేయుటకు సాధ్యముకాదు. గనుక ఈ మనసుకు చలన చంచలములు దేనివల్ల కలుగుచున్నవని మనము విచారించిన యెడల సర్వదా వునికి కలుగుచున్న సంకల్పములే సన్నిహితకారణముగా కనబడు చున్నది. సంకల్పములను త్యజించిన యెడల మనసు చలింపదు. ఇట్టి సంకల్పములు కలుగుటకు ఆయా వులయొక్క వాసనలే కారణము. దీనిని గురించి వాసనా నిరూపణయందు విపులముగా విమర్శించియుంటిమి. వుడు

ఆయాజన ములయందు తన వాసనా సంస్కారములను బట్టి చేయుచుండు కర్మఫలములే తిరిగి జీవుని భావిజన్మకు వాసనారూపమున పరిణమించి బంధించుచుండును. దీనివలన ఈ వాసనలకు కారణము జీవుడు ప్రారబ్ధవశమున అవశ్యముగా చేయు కర్మ ఫలములేయని నిశ్చయమగుచున్నది. కాని జన్మించిన ప్రతి వుడునూ ఏదోయొక కర్మచేయకుండ ఒక్క క్షణమైననూ యుండుటకు సాధ్యముకాదు. దీనినే :—

శ్లో॥ నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మ కృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥

శ్లో॥ నహిదేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥

అనగా ఎట్టి జీవుడైననూ క్షణకాలమైననూ కర్మలను చేయకుండ నుండలేడు. ప్రతి ప్రాణియు ప్రకృతివలన పరాధీనుడై ఏదోయొక్క కర్మను చేయుచునే యుండును. దేహధారికి కర్మముల నన్నింటిని విడుచుటకు సాధ్యము కానేరదు. అందుచేత కర్మములవలన కలుగుఫలమును విడుచువాడే త్యాగి అని చెప్పబడును. అను భగవద్వచనములను బట్టియున్నీ మనము యింతవరకూ చేసిన విచారణా వివేచనలను బట్టియూ కూడ జన్మించిన వునికి కర్మ చేయక యుండుట వీలుకాదని తెలుచున్నది. కనుక ప్రతి జీవుడును ప్రతి క్షణమున్నూ ఏదోయొక కర్మవిధిగా తన వాసనానుకూలముగ జేయుచుండును. అట్లుచేయు సుకృతదుష్కృత కర్మలేవైననూ వాటిని యాచరించు కర్తకు పుణ్యాపాప ఫలముల నివ్వకతప్పవు. వర్తమాన జన్మమందు వుడు తన ప్రారబ్ధకర్మ వశమునననుసరించి, ఆచరించు పుణ్యాపాపకర్మ ఫలములే ఉత్తరజన్మమున జీవునకు కల్గువాసనా సంకల్పములకు హేతువగుచున్నవి. వీటి ప్రాబల్యమువలన వుడు కర్మచేయుచుండును. ఇట్టి కర్మాచరణలు తిరిగి వాటి ఫలముచే పునర్జన్మ హేతువగుచు, పుణ్యపాపకరా చరణలను విధిగా జీవునిచే చేయించుచూ

ఈ కర్మఫలములు, జీవుని సుడిగాలియందు తృణముల లాగున సంసారచక్ర మున భ్రమణము చేయించుచుండును. ఈ విమర్శనంతయూ బట్టి చూడ జీవుని వాసనా సంకల్పములే తన మనశ్చాంచల్యచలనములకు సన్నిహితకారణ మనియూ, యీ వాసనాసంకల్పములు కలుగుటకు ముఖ్యముగాను, పరం పరగా నైననూ వుడాచరించి పొందు కర్మఫలములే కారణముగా కనబడు చున్నవి గాని తానాచరించు కేవల కర్మలు కావని నిశ్చయమగుచున్నది. కాన ముముక్షువు తాను ప్రారబ్ధవశమున విధిగానాచరించు కర్మలకు ఫలము కలుగ కుండునట్లు అనగా ఫలోత్పత్తి కాకుండ కర్మలను చేయవలసియున్నది. ఇట్లు ఫలరహితమైన కర్మల నాచరించు జీవునికి తాను యిప్పుడు చేయుకర్మలు తన ఉత్తరజన్మకు వాసనా సంకల్పములను కలుగజేయజాలవు. ఏలనన ఫలమను సది ఎల్లప్పుడునూ కర్తను ఆశ్రయించుకునియుండును. ఇది నియమము. కర్తకాని వానిని కర్మఫలము బంధింపజాలదు. జీవునకు తన వాసనా సంక ల్పములు తిరిగి యెపుడుత్పత్తికావో అప్పుడే తన మనశ్చంచల చలన కార ణము నశించును. గనుక జీవుడు తానుచేయు కర్మలకు ఫలముత్పత్తి కాకుండ చేయుటకు శాస్త్రము ఒక్కటియే ఉపాయమును తెలుపుచున్నది. అట్టిది యేదియన ప్రారబ్ధవశమున జీవుడు చేయవలసిన సమస్త కర్మలను తన కర్తృత్వాది రహితముగ చేయుటయే ఉపాయము. అనగా ఫలమును కోర కుండ తాను చేయవలసిన కర్మలు చేయుటయే, కాని కర్మలను చేయుట మాన కూడదు. దీనినే :-

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన ।
మా కర్మ ఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి ॥

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

జీవునకు నిత్యనైమిత్తికాది కర్మములు చేయుటయందే అధికారమున్నది గాని ఆ కర్మఫలము కోరుటకెప్పుడును అధికారములేదు. కాన వుడు కర్మ ఫలము

లకు కారణుడు కాకూడదు. కాని కర్మములను చేయుట విడువకూడదు. కాబట్టి ఫలాపేక్షలేనివాడవై ఎల్లప్పుడును నీవు చేయవలసిన కర్మములను చేయుచుండుము. అట్లు ఫలాపేక్షలేకుండ కర్మములను చేయువాడు మోక్షమును పొందును అనుగీతావచనములు సమస్తకర్మలను ఫలాభిసంధిలేకుండ చేయవలయునని తెల్పుచున్నవి. కాని యిట్లు చేయుటకు కర్మలయందు తన కర్తృత్వాద్యభిమానములు యుంచుకొనినంతకాలము పైన తెల్పినయట్లు చేయుకర్మలు, వాటి కర్మఫలములను కలిగింపకమానవు. కావున ముముక్షువు యిట్లు కర్మ చేయుట, దాని ఫలము కోరకుండుట అనగా కర్మఫలము కలుగకుండ చేయుటకు తానుచేయు సమస్తకర్మలకు తన కర్తృత్వాదులు లేవనియు, తాను కర్తకాననియు. తనకెట్టి కర్తృత్వాదులతో సంబంధము లేవనియు, యిట్టి కర్తృత్వాది ధర్మములు కల్పితమైన అంతఃకరణ ధర్మములుగాని వాస్తవముగ సత్యస్వరూపుడైన తనవి కావనియు తెలుసుకొనవలయును.

ముముక్షువు ముఖ్యముగా గ్రహించవలసిన దేమనగా తన మనసును చలింపజేసి తనను బంధింప చేయునది, తాను ప్రారబ్ధవశమున చేయవలసిన కర్మలుగావు. కాని అట్టి కర్మాచరణానుభవములయందు తనకు (జీవునికి) కలుగుచున్న సక్తత, అనురాగాదులు గాని తాను చేయు కేవల కర్మాచరణములు కావు. కర్మలయందు యిట్టి రాగాదులు తనయొక్క కర్తృత్వాభిమానముల వల్లనే కలుగుచున్నవని తెలుసుకొనవలయును. కాన అభ్యాసకుడు సర్వవిధముల చేతను తనకు యిప్పుడు కలుగుచున్న దేహాద్యభిమానములు తాను చేయు కర్మలయందు కలుగుచున్న అహంకార మమకారాదులను కర్తృత్వాద్యభిమానములను జ్ఞానముచే నిర్మూలించుకొని ప్రారబ్ధకర్మను నిర్లిప్తతగా చేయుచుండిన యెడల అట్టివాని మనస్సు చలించకుండ అనగా యెట్టి వికారములను పొందకుండగనే సమస్తకర్మలు చేయుటకు తాను సమర్థుడగును అప్పుడు ప్రారబ్ధవశమున తాను యీజన్మమునందు చేయుకర్మానుభవములు

నిష్ఫలములై (ఫలోత్పత్తి చేయజాలనివై) తనకు వ్యవహారమందు దేహ యాత్రను మాత్రము కలిగించుచుండును.

పర్యవసానమేమనగా ఎంతటి వారికైనను ప్రారబ్ధానుభవము తప్ప దని లోగడనే వివరించియుంటిమి కనుక తాను (జీవుడు) యిప్పుడు చేయు కర్మలయొక్క ఫలము తనకు కలుగకుండునటుల కోరు, యీ జిజ్ఞాసువు జ్ఞాన పూర్వకముగ తన కర్తృత్వాద్య భ్యాసములను సక్తతా మానములనూ కామ క్రోధాదిరాగ ద్వేషాదులను తన వివేకవిచారణాద్యభ్యాసబలముచే సాధ్యమై నంతవరకు తగ్గించుకొని ప్రాజ్ఞుడై సమర్థతతో కాలక్రమమున వాటిని నిర్మూ లించి తన ప్రారబ్ధవశకర్మముల నాచరించుచుండవలయును. ఇంతవరకు మనము చేసిన నిరూపణలను బాగుగ గ్రహించి తాను చేయవలసిన కర్మముల యందు తన కర్తృత్వాదులు, సక్తతాభిమానములు, రాగద్వేషములు, నిర్మూ లించుటకుగాను స్వశరీరదృశ్యమిథ్యాత్వ వివేచనాదులతో స్వస్వరూప నిశ్చయ మునకుగాను, సర్వదా తన సత్యస్వరూపానుసంధానాదులను చేయుచుండిన యెడల కాలక్రమమున మనోవాసనాసంకల్పములు క్షీణించి తన మనశ్చంచలతా రాహిత్యమునకు సాధనమై అప్పుడు మనస్సునిస్సంకల్పముగ నుండును ఇదియే అమనస్కత్వము. ఇదియే మోక్షసాధనమై మోక్షప్రాప్తిని కలి గించును. దీనినే :—

శ్లో॥ సంకల్పమనసీభిన్నే న కదాచన కేచన,
అవిద్యా సంసృతిశ్చిత్తం మనోబంధోమలం తమః
ఇతి సంకల్పజాలస్య నామాన్యేతాని రాఘవ,
సంకల్పజాలే గళితే స్వరూపమవశిష్యతే.

అని శ్రీ రామచంద్రమూర్తికి సంకల్పము మనస్సు యివి వేరువేరువస్తువులు కావనియు అవిద్య, చిత్తము, మనస్సు, బంధము, తమస్సు, మలము, అని సంకల్పజాలమునకే నామములనియు, యిట్టి సంకల్పజాలము జారిపోయిన

యెడల శేషించి సత్యజ్ఞానానంతరూపము తానుగనే ప్రకాశించుననియు వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు. కాన ముముక్షువు తన మనస్స్వరూపము యిట్టిదని పై విధమున తెలుసుకొని తన మనస్సును నిస్సంకల్పమైన దానిగా చేసుకుని పరమ లాభమును పొందుటయే యీ విమర్శయొక్క ప్రయోజనము మని గ్రహించవలెను.

# మాయాస్వరూపము

మాయ అనగా లేనిది అని అర్థము. లేనిది అనగా నేమి యనిన మనకు యనుభవమునకు యున్నట్లుగా కనబడుచు, యీ యున్నది యేమిటి యని నితా నిత వివేకముతో విచారించగా లేనిదే యగుట. దీనినే యా-మా-సా = మాయ. యేది లేనిదో అది మాయ యని చెప్పబడుచున్నది. శ్రీ శంకర భగవత్పాదులు లోకానుగ్రహము గలవారై, జీవులను యీ సంసార దుఃఖ సాగరమునుండి ఉద్ధరించుటకుగాను శ్రుతి, అనుభవ, యుక్తులతో యీ సంసారము మాయాస్వరూపమనియు, మాయాకార్యమనియు, నిర్ధారణచేసి యితర మతవాదములను ఖండించి అద్వైతసిద్ధాంతమును మనలకు నిరూపించి, స్థాపించి ప్రసాదించియున్నారు. ఇట్టి అద్వైతసిద్ధాంతమునే మాయావాదమనిగూడ కొందరందురు. అద్వైతసిద్ధాంతమందు యీ మాయ అనాది. అనగా యెప్పుడు వచ్చినదనినగాని, యెట్లు వచ్చినదనినగాని తెలుప శక్యము గానిది. కాని యీ మాయ సాంతము. అనగా మానవుని వివేక ప్రయత్న సాధనములచే నశించి, మరల యుత్పత్తి కాని స్వభావము కలది ఈ మాయ అనాదిగా పరమేశ్వరుని నాశ్రయించుకొని ఆయనకు లోబడి సమస్త కార్యములను చేయుచుండును. ఈ మాయయే మన వాస్తవస్వరూపమగు సత్య స్వరూపమును కనబడకుండునట్లు చేసి, జీవులకు సమస్త దుఃఖములను

కలుగజేయుచు సంసార చక్రమున త్రిప్పుచున్నది. ఈ మాయయే మన సత్య స్వరూపమైన సత్యజ్ఞానానంత స్వరూపమును తెలియకుండునటుల చేయుచున్న దీనినే శ్రీకృష్ణ భగవానులు "నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః" నేను మాయవలన ఆవృతుడనై నేనందరకూ తెలియబడుట లేదు. అనగా యీ మాయను తొలగించుకొన్నగాని నన్ను యెవరున్నూ చూడలేరు యని దీని యర్థము. మాయ అన్ననూ అజ్ఞానమన్ననూ ఒక్కటియే. జ్ఞాన మన్ననూ, బ్రహ్మ యన్ననూ యొక్కటియే. ఇట్లుండ "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" ఈ జ్ఞానమును యెల్లపుడును అజ్ఞాన మావరించి యుండును. అందుచేత పురుషులు మోహము నొందు చున్నారు. అనియు యింకను "భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" ఈ మాయచేతనే సర్వభూతములను యంత్రముమీద నున్న వాటినివలె త్రిప్పుచున్నాను అనియుగూడ భగవంతుడైన శ్రీకృష్ణ మూర్తియే తెలుపుచున్నారు.

శ్రుతిగూడ "మాయా మాత్ర మిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" అని యీ సమస్త పరిచ్ఛిన్న భిన్న న్న దృశ్యమంతయు మాయయే యనియు పరమార్థములో యున్నది, అఖండ అద్వయ పదార్థమొక్కటే యనియు తెలుపుచున్నది. ఇట్లే యింకను అనేక శ్రుతివాక్యములు యీ సంసార దృశ్యమంతయు మాయాకల్పితమని తెలుపుచున్నవి. ప్రకార, అవస్థా భేద నిరూపణలనే యీషద్భేదమున్ననూ మాయ, ప్రకృతి, అవిద్య అజ్ఞానము అనునవి యన్నియూ కొంచ మించుమించు సమానార్థమునే యిచ్చుచు, పర్యాయపదములుగా నున్నవి. ఇట్టి మాయావిషయమై "విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం, పశ్యన్నాత్మని మాయయా బహిరివో భూతం యథా నిద్రయా" అద్దమందు చూడబడెడు పట్టణమువలె తనయందేయున్న ప్రపంచమును నిద్రచే స్వప్న ప్రపంచమును చూచినట్లు మాయచే తన బయట నున్నట్లు చూచువాడు-

"మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం" మాయచే కల్పింపబడిన దేశకాల వైచిత్ర్యములచేత చిత్రింపబడినవాడు అనగా భ్రమయుతుడు "మాయా శక్తి విలాస కల్పిత మహావ్యామోహ సంహారిణే" మాయాశక్తి కలుగజేయబడిన మహాభ్రాంతిని పొందువాడు—

"స్వప్నేజాగ్రతివా యయేషపురుషోమాయ పరిభ్రామిత" స్వప్నజాగ్రత్తులయందు మాయచే మోహింపబడీ పురుషుడు ప్రపంచమును కార్యకారణాదిరూపములుగా చూచుచున్నాడు అని శ్రీ శంకరభగవత్పాదులు యీ మాయాశక్తినిగురించి తెలుపుచున్నారు. అనగా యిట్టి స్థితులన్నియు మాయా కల్పితములేయని తెలియుచున్నవి. మాయ యీ జగత్తునకు ఉపాదానకారణమగుచు ప్రకృతియనబడుచున్నది. దీనినే "మాయాంతు ప్రకృతింవిద్యాత్, మాయినంతు మహేశ్వరం" అని శ్రుతి తెలుపుచున్నది. ఈ మాయ చీకటివంటిది. "మాయా తమోరూపా" అనియూగూడ శ్రుతి తెలుపుచున్నది. ఇంతనూ యిది జడస్వరూపమైనదనియు, అందరిని మోహింపజేయుచున్నదనియు, అనంత స్వభావముగలదనియు "తదేతజ్జడం మోహాత్మకం అనంతం" అని శ్రుతివాక్యము తెలుపుచున్నది. ఈ మాయ అందరిచేతను అనుభవింపబడుచున్నదనియుగూడ వచనములు తెలుపుచున్నవి. మనలకు కలుగుచున్నసమస్త సంసారదుఃఖములు యీ మాయ అను అజ్ఞానమువల్లనే కలుగుచున్నవి. శాస్త్రము జీవుడైన తనను ఆ పరమాత్మ, సుఖస్వరూపుడు అని చెప్పుచుండగా తను అట్లు తెలుసుకొనలేక భ్రాంతుడై యీ పరిచ్ఛిన్న ఉపాధి తాను అనగా నేను అనుకొనుటయే అజ్ఞానము—మాయ. మానవుడు మోక్షప్రాప్తిపర్యంతము సదా యీ మాయ వల్లనే నేదోయొక రూపమున దుఃఖములు పొందుచునేయున్నాడు. ఇట్టి దుఃఖము ఆగంతుకము—అజ్ఞానము—మాయాకల్పితము. శాస్త్రము నీవు బ్రహ్మవు అని బోధించుచున్నది. కాని యెవరికైననూ నీవు సుఖస్వరూపమైన బ్రహ్మవు, అట్టి నీ సత్యస్వరూపము నీకు తెలియునా—గ్రహించితివా యని అనిగిన నాకు తెలి

యదు అనియేకదా చెప్పుచున్నాడు. గాన యిది అందరి యనుభవములో నున్నదే. ఇదియే ఆ మాయ గనుక యెవరును ఆ మాయను, నేనెరుగనని చెప్పుట వివేకముకాదు. ఎందుచేననగా తను మాయా కార్యమైన యీ కల్పిత దృశ్యమును అనుభవించుచునే యున్నాడు ఇంకనూ బాగుగ విచారించిన యీ మాయను యున్నదనుటకుగాని లేదనుకుటగాని వీలుగాకున్నది. ఎట్లన లేదు, 'అసత్' అనుదనూ శశివిషాణము, వంధ్యాపుత్రునిలాగున తుచ్ఛము కాదు. మానవునిచే అనుభవింపబడుచున్నది. ఉన్నది అనగా 'సత్' అని చెప్పుదమన్నను శ్రుతి, యుక్తి, అనుభవములతో బాగుగ విచారించి చూచిన యీ దృశ్యానుభవములన్నియు లేనివేయగుచున్నవి. దీనినిబట్టి యెట్లుచెప్పుట కున్నూ వీలులేదు దీనినే "నాసదాసీ న్నోసదాసీత్" అని శ్రుతివచనము తెలుపుచున్నది. గాన యిట్టి మాయ "అనిర్వాచ్యము" అనగా చెప్పుటకు వీలుకానిదగుచున్నది. ఇందు చేతనే యీ మాయాస్వభావమును బాగుగ తెలుసుకొనుటకు చాలా పురుషప్రయత్నము కావలసియున్నది. ఒక వస్తువు యొక్క స్వరూపస్వభావములను బాగుగ విచారించి తెలుసుకొనినయెడల కదా దానిని గ్రహించుటకో వదులుటకో లేక దానిని తెలుసుకొని యుపయోగించు కొనుటకో సాధ్యమగును. లేనిచోకాదు. ఏ వస్తువునైననూ దానిస్వరూపస్వ భావములను బాగుగ గుర్తించి జాగ్రతతో యుపయోగించుకొనునెడల "విజ్ఞా యతశ్చేవితశ్చోరోమైగ్ మేతి సశ్రుతామ్" అను న్యాయమునుబట్టి అపకారి కాజాలదు. ఇంకను తెలివిగా నుపయోగించుకొనువానికి కొంతనుపకరించును. ఈ మాయను గ్రహించుటకు ప్రయత్నమక్కరలేదు. ఏలయన అనాదిగా యీ కల్పిత దృశ్యమందు మనలను మోహింపజేయుచు సంసారదుఃఖమును కలిగించుచునేయున్నది. కాని యీ దృశ్యదుఃఖమునుంచి విముక్తుడుకాద లచిన ముముక్షువునకు యీ మాయాబంధమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నమావశకము కాని కష్టసాధ్యము. దీనినే "మమ మాయా దురత్యయా" నా మాయను అతిక్రమింప కష్టసాధ్యము, కాని "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాంతరన్తితే" నన్నెవరాశ్రయింతురో వారు మాత్రము

యిట్టిమాయను సులభముగా దాటగలరు. అనిన్నీ యింకనూ "మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః" మూఢులను వారలు మాయచేత అపహరింపబడిన జ్ఞానముగలవారలై అనగా అజ్ఞానముచే కూడుకొన్నవారై, అనృతము, హింస, మొదలగు రాక్షసభావములను ఆశ్రయించుదురు అనిన్నీ శ్రీకృష్ణభగవానులు యీ మాయను గురించి చెప్పుచున్నారు. గాన ఆ పరమాత్మస్వరూపమును పొందుటకు ముముక్షువైనవాడు సర్వప్రయత్నములచేతనూ యీ మాయకార్యమైన కల్పితదృశ్యమందు మోహితుడు గాకుండ నుండవలయును. ఏలనన యీ మాయ చేయునది జీవులను దృశ్యమందు మోహింపజేయుచే. ఇదియే మాయ చేయుచున్న చమత్కారము. ఈ చమత్కారమే జీవునికి తన అఖండ సత్యస్వరూపమైన సత్యజ్ఞానానంత లక్షణములను కనపడకుండునటుల జేసి యీ మాయచే కల్పితమైన దృశ మందు జీవుని మోహింపజేయుచున్నది. దీనికిగాను యీ ప్రపంచముయొక్క కలిమి ములం జూపుచున్నది. అనగా ఉన్నది లేనట్లుగను, లేనిదియున్నట్లుగను వునికి కనబరచి భ్రాంతియుతునిగా జేయుచున్నది దీనినే "అస్యసత్వమసత్వంచ దర్శయతి" అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది ఇంకనూ యీ మాయాశక్తియే స్వభావముచేత, నిత్యుడు, నిర్వికారుడు, అసంగుడు, నైన ప్రత్యగాత ను జగద్రూపునిగా చేసినది. అనగా యీ సర్వదృశ, మున్నూ లేనిదైననూ ప్రత్యగాత యందు కల్పించి, యున్నదానివలె చూపుచున్నది. ఇంకనూ యీ మాయయే ఒక్కటియైన పరమాత్మను జీవుడు, ఈశ్వరుడు అను విభాగములుగా చేసి చూపుచున్నది. దీనినే శ్రుతివాక్యము "జీవేశావాభాసేనకరోతి" అని తెలుపుచున్నది. నిర్వికారియైన కూటస్థుని యందు—వికారాదులను యెంతమాత్రము కలుగనీయక యీ జగత్తునంతయు అతనియందే కల్పించినది. ఇట్టిది అసాధ్యకార్యముగదా. ఇట్టి అసాధ్యకార్యములను యుటయే మాయయొక్క స్వభావము. "మాయా యాం దుర్ఘటత్వంచ స్వతసిద్ధ తి నాన్యతః" అనిన్నీ యింకనూ యీ మాయయందు అఘటనాఘటనశక్తి సహజముగ—అగ్నియందుష్ణత్వము, ఉదకమునందు

ద్రవత్వము యున్నట్లున్నదనికూడ విద్యారణ్యులు చెప్పుచున్నారు. కాని యీ మాయ యంత అఘటనఘటనా సామర్థ్యము గలిగిన చమత్కారియైననూ-

శ్లో ॥ నవేత్తి లోకోయావత్తం సాక్షాత్తావచ్చమత్కృతిమ్ ।
ధత్తే మనసి పశ్చాత్తు మాయైషేత్యుపశామ్యతి ॥

లోకములో మాయా చమత్కారములు చేయువాడు తానగుపడకయెన్నియో చిత్ర ప్రదర్శనములను గనపరచి చిట్టచివరకు అట్టివి అన్నియు అసత్యములని తోచగసే మిథ్యయైనట్లు యీ మాయ ఆ పరమాత సాక్షాత్కారము కలుగు నంతవరకే తోచును. గాని ఆత సాక్షాత్కారము కలిగిన వెనుక యింత చమత్కృతిజూపిన మాయగూడ మాయమగుచు లేనిదియేయగును. ఇంకనూ యీ మాయాస్వరూపమునుగురించి——

శ్లో ॥ ననిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా ।
సా మాయే ంద్రజాలాదౌ లోకాస్తాం ప్రతిపేదిరే ॥

శ్లో॥ స్పష్టం భాతి జగచ్చేద మశక్యం తన్నిరూపణం ।
మాయామయం జగత్తసా దీక్షస్వా పక్షపాతతః ॥

అనగా యింద్రజాలము మొదలైనవి చూచునప్పుడు యేదియు నిర్ణయింప శక్యముగాకపోయిననూ చూచువారికి యెట్లు స్పష్టముగా ప్రకాశించుచుండునో అది లోక ప్రసిద్ధమైన మాయగా నిశ్చయమగుచున్నది. ఎట్లన యీ జగ ద్దృశ్య పదార్థములలో నేదియును సత్యలక్షణమైన త్రికాలాబాధితమై త్రివిధ పరిచ్ఛేద రహితముగ లేదు. ఇదిగాకనూ దృశ్యమందు యే వస్తువు స్వభా వము చేతనైననూ యిది సుఖము యిది దుఃఖస్వరూపమని నిర్ణయించి చెప్పుటకు వీలుగాకున్నది. జీవులకు (మానవులకు) కలుగుచున్న కర్తృత్వ భోక్తృత్వములకు వాస్తవకర్త యెవరునూ వివేకముతోజూచిన కనపడుట లేదు. ఇట్లే మానవునికి కలుగుచున్న సుఖదుఃఖములుకూడ వస్తు నిష్ఠములు

గాక తనకు అనుకూల ప్రతికూల జ్ఞానముచే కలుగుచున్న తన సంకల్పవిషయము లను బట్టియే కలుగుచుండును. గాన యిట్టివి కల్పితములు. ఈ విషయము లన్నియూ ప్రత్యక్షానుభవము-కర్తృత్వాద్యాభాస నిరూపణములలో సవిస్తర ముగ వివరించియుంటిమి. ఇట్టి యనుభవములన్నియు మాయాకల్పితమేగాన యీ కనపడెడు జగత్తును మాయామయమని తెలుసుకొనవలయును. ఇందు సత్యలక్షణమునకు నిలుచునది యేదియు కనబడుట లేదు. అయిననూ మనస్సు లను యీ మాయాకల్పితదృశ్యము ప్రత్యక్షముగా బాధించుచు సంసార పరంపరగ దుఃఖమున ముంచుచున్నది. ఇట్టి మాయాశక్తిని నిరూలించుట చిత్తజయమువల్లనే సాధ్యముకాని అన్యధాగా కాజాలదని వసిష్ఠ భగవానులు శ్రీరామచంద్రమూర్తికి యీ మాయాశక్తి యిట్టిది యని నిరూపింపదలచి, లవణోపాఖ్యానములాగుననే గాధి యుపాఖ్యానమును శ్రీ యోగవాశిష్ఠము నందు యీ విధముగ తెలుపుచున్నారు.

ఈ భూమండలంబున కోసలంబను దేశంబున గాధి యను పేరున నొక బ్రాహ్మణుడుండెను. ఆ విప్రుండు వేదమార్గానుసారియై జపతపంబు లాచరించుచుండెను. ఇట్లుండి కొంతకాలమున కాతనికి మాయను చూడవలె నను కోరికగలిగి విష్ణుమూర్తినిగురించి ఘోరతపంబు చేసెను. అంతట విష్ణు మూర్తి ప్రత్యక్షమై నీ తపస్సునకు మెచ్చితిని, ఏమి కావలయునని యడుగ గగా ఆ విప్రుండు తన మనోష్టమైన మాయను చూచునట్లు తనకు వరమిమ్మని

శ్లో॥ మాయామిమాం త్వద్రచితాం భగవన్పార మాత్మిం ।
ద్రష్టు మిచ్ఛామి సంసార నామ్నీ మాశ్చర్యకారిణీం ॥

ఓ శ్రీహరి! పరమాత్మ సంబంధినియు, ఆశ్చర్యకారిణియు, నీచే రచింప బడినదియు, సంసారంబను పేరు గలదియునగు నీ మాయను జూడగోరెదనని తెలిపెను.

అప్పుడు నారాయణుండు ఆ విప్రునిగాంచి నీవు మాయను చూడగలవు పిదప సద్దానిని విడవనెంచితివేని విడవుమని చెప్పి, అంతర్ధానమునొందెను. అంత నా మునిపుంగవుండు శ్రీహరి దర్శనంబున నానందించుచు కొంతకాలము గడిపి యొకదినంబున కొలనుకు స్నానంబునకుంజని అచట విష్ణువరంబు జ్ఞప్తికి వచ్చి "మాయను చూచుదునుగాక" యని తలంచి స్నానముచేయనారంభించెను. అప్పుడు

శ్లో॥ జలస్యాంతే విధావంతర్జలమేష చచారహ ।
అంతర్జల విధౌతసి న్వస ఋత ధ్యానమంత్రధీః ॥

శ్లో॥ మృతమాత్మాన మా యే సదనేఽపశ్యదాతురః ।
ప్రాణాపాన ప్రవాహేణ ముక్తమంతర్ధి మాగతమ్ ॥

శ్లో॥ ఆవృతం బంధుభిః స్నై ర్భార్యయా పాదయోః శ్రితం ।
మాత్రాగృహీతం చుబుకే నవవ్యంజనలాంఛితే ॥

ఆ విప్రుండు స్నానము చేయునపుడు జలమధ్యంబున జరింపుచు, ధ్యానంబును మంత్రంబును మరచి తన గృహమునందు తనను మృతినొందిన వానిగను, ప్రాణరహితునిగను, దుఃఖితులగు బంధువులచేత జుట్టుకొనబడినవానిగను. తన పాదములమీద బడియున్న భార్యగలవానిగను, నూతనములగు శ్మశ్రువులచే చిహ్నితమగుగడ్డమునందు తన తల్లిచే గ్రహింపబడినవానిగను జూచిన వాడాయెను. (మాయాప్రభావముచే స్వప్నప్రాయముగ నాతనికట్లు భ్రాంతిచే కనబడెను.)

శ్లో॥ అథతత్కాల కల్లోల ప్రలాపాకుల చేష్టితైః ।
నీతంశ్మ శానమాస్థానం వసాపంక కళంకితమ్ ॥
తత్ర తే జ్వలనే దీప్తే చక్రుస్తం భస సాచ్ఛ్రవం ।

అంతట నాకాలంబున నధికంబులగు రోదనంబులచే వ్యాకులంబగు నృత్యం బులుగల తన బంధువులు తనశవమును దుర్గంధభూయిష్టంబగు శ్మశానంబునకు

గొనిపోయినటులను అచ్చట నా శవమును ప్రజ్వలించుచున్న అగ్నియందు భస్మము చేసినటులను గాంచినవాడాయెను.

శ్లో ॥ అథాపశ్యదసౌగాధిః స్వాధిపీవరయాధియా ।
హూణమండల పర్యంతగ్రామోపాంత నివాసినామ్ ॥

శ్లో ॥ శ్వపచానాం స్త్రీయోగర్భే స్థితమాతా నమాకులం ।
శనైః పుక్కసయా కాలే ప్రసూతం మేచకచ్ఛవిమ్ ॥

శ్లో ॥ సంపన్నం శ్వపచాగారే శిశుం శ్వపచవల్లభం ।
ద్వాదశాబ్దికతాం త్యక్త్వా సంస్థితం షోడశాబ్దికమ్ ॥

ఓ రామచంద్ర! అంతనావిప్రుండు మనోదుఃఖముచేత స్థూలంబగు బుద్ధిచే తనను హూణమండలమునకు ప్రాంతముననున్న గ్రామమున నొక చండాల స్త్రీ యొక్క గర్భమున ప్రవేశించియుండిన యాపెచే కనబడి నల్లని వన్నె కలిగి యాచండాలురకు ప్రేమపాత్రుడై చండాల గృహమునందె వృద్ధినొందుచు పండ్రెండు సంవత్సరముల వయసుదాటి పదునారు సంవత్సరముల ప్రాయము గలిగియున్నవానిగా గాంచెను.

శ్లో॥ పీవరాంగముదారాంసం పయోదమివమేదురం।
తమాలలతయేవాథవృతం శ్వపచకాంతయా ॥
స్తనస్తబకశాలిన్యా నవపల్లవ హస్తయా ।
విశ్రాంతం వనకుంజేషు సుప్తం గిరిదరీషుచ ॥
నివసం పత్రకుంజేషు గుల్మేషు కృతాలయం ।
ప్రసూతమథ శైలేషు పుత్త్రాన్నిజ కులాంకురాన్ ॥

ఆ విప్రుండు తనను అట్లు పదునారు సంవత్సరముల ప్రాయముగలిగి బలసిన యంగంబులును ఉన్నతంబులగు భుజశిరంబులును గలిగి నీలమేఘంబు బోలి యున్న వానిగను, పుష్పగుచ్ఛంబులం (పూలగొత్తుల) బోలు స్తనంబులును

జివురుటాకులంబోలు హ_స్తంబులును గలిగి తమాలలతంబోలియున్న యొక చండాలకాంతతో గూడి బొదరిండ్లయందు నిద్రించుచు పర్ణశాలలయందు వసించుచు, వంశాంకురంబులగు పుత్రులను గనిన వానిగను గాంచిన వాడాయెను.

శ్లో॥ కళత్రవంతం సంపన్నం స్థితం ప్రక్షీణయౌవనం ।
సంస్థితం మతికాంపర్ణైః కృత్వా దూరే మునీంద్రవత్ ।
జరాజరఠతాంయాతం స్వదేహమనుపుత్రకం।
అథాపశ్యదసౌ గాధిర్యావ_త్తస్య కళత్రిణః ॥
తత్కళత్ర మశేషేణ నీతమాహృత్యమృత్యునా ।
తతశ్శోక పరీతాత్మా ప్రలాపవికలాననః॥
తంవిహాయ నిజందేశం విగతః సాశ్రులోచనః ।
విజహార బహూన్దేశా న్దుః తశ్చింతయా ఽన్వితః ॥

ఇట్లు పుత్రవంతుడును భార్యతోడ గతయౌవనుండునై దూరభూమియందు పర్ణశాలను నిర్మించి యందు మునీంద్రుని విధంబున నుండగా నీతని భార్య పుత్రులతోగూడ మృతువుచే గ్రసింపబడియె. అంతనాతండు శోకగ్రస్తుడై విలపించుచు స్వదేశంబు విడిచి చింతచేత ననేక దేశంబులు దిరుగుచుండెను.

శ్లో॥ ఏకదాప్రాప కీరాణాం మండలే్భ్రమ ంపురీం।
సామంతైర్లలనా శ్చ నాగరైశ్చ నిరంతరమ్ ॥
స్వర్గమార్గోపమం రాజమార్గమస్యామవాప సః ।
మణిరత్నకృతంద్వారం తత్రమంగళహ_స్తినమ్ ॥

శ్లో॥ దదర్శామల శై లేంద్ర మివ సంసారచంచలం ।
మృతేరాజని రాజార్థం విహరంతమితస్తతః ॥

ఇటుల తిరుగుచు రదేశంబునందు శ్రీమంతంబను పురంబు క్షేత్ర
యందు సామంతులతోడను, స్త్రీలతోడను, పురజనులతోడను సంకులం బై
మణి శ్రేష్ఠంబులచే నిర్మితంబులగు ద్వారంబులు గలిగి స్వర్గమార్గంబు ప్రో
యున్న రాజమార్గంబు ప్రవేశించి యందు జరించుచున్న పర్వతేంద్రంబుం
బోలినదియు, రాజు మృతినొందగా నొక్కని రాజుగా గ్రహించుటకు నిటు
నటు వెదకుచున్నదియు నగు నొక భద్రగజంబుం గాంచిన వాడాయెను.

శ్లో॥ ఆలోకయంత మాదాయ తం కరేణ సుచారుణా ।
స్వకంఠే యోజయనే రుతకేఽర్కమివ సాదరమ్ ॥

అతండట్లు చూచుచుండగా నగ్గజము తన తుండముతో నా చండాలుని
గ్రహించి మేరుతటంబున సూర్యుని పగిది తన మెడయందు నునిచికొనినది
ఆయెను. ఆ పురుషుండు భద్రగజంబుమీదనుండగా నంతట జయదుందుభులు
మ్రోగెను. ఆ పురుషుని వరాంగనలు వచ్చి యలంకరించిరి. అంతట సమస్త
మగు రాజలాంఛనములను భోగములను పొందినవాడై గవలుడను నామం
బుతో మంత్రి సామంతులచే పరివేష్టితుడగుచు యా చండాలుడు రదేశమునం
నెనిమిది సంవత్సరంబులు రాజ్యంబు చేసెను. అంత నొకప్పుడు దైవవశం
బున నతడు తన రాజాలంకారములను సినవాడై, పూర్వవేషంబున కోట
వెలుపలికిం జని యచట నల్లని ఛాయ గలిగి కిన్నరలు మీటుచున్న చండా
లుర సమూహమును గాంచెను. అతడట్లుచూచుచుండగా నా గుంపులో వృద్ధుం
డగు నొకడు వీనిం గాంచి (యీరాజును) ఓ కటంజకా యింతకాలంబునుండి
నీ వెచట నుంటివి? దైవవశంబున కనబడితివి. నాకు చిరకాలబంధువువవు
గదా! ఎచట నున్నావో చెప్పమని ప్రశ్నంబున నడిగెను. ఇటుల యా చండాలుం
డడుగుచుండ, యా రాజు నిర్లక్ష్యమును జూపుచుండినను యింతలో
యీ దృశ మునంతనూ గవాక్షములనుండి రాజపత్నులు, మంత్రులు పరివార
మును గూడ జూచి యితడు చండాలుడని తలచి మిగుల విచారపడినవారై రి
అంతట నారాజు యంతఃపురంబున బ్రవేశించెను. కాని అచట ఆయన భార్యలు,

మంత్రులు పరివారము మొదలగువారెవరునూగూడ శవమును ముట్టనియట్లు యితనిని స్పృశింపకయుండిరి. ఇట్లారాజు ధనహీనుండగు బాటసారిలాగున నసహాయుండయియున్నవాడాయెను. అంతట నచట యున్న మంత్రులు, పౌరు లందరును తాము చిరకాలము యీ చండాలుని సంసర్గంబున దోషసంతుల మయితిమని తలచి ప్రాయశ్చిత్తాదులను బొందుటకు అగ్నియందు ప్రవేశింప నిశ్చయించి, బంధువులతోసహా అగ్నిప్రవేశమైరి. సహజముగా యీరాజు మహనీయుడు, తపస్సంపన్నుడు, వివేకియుగాన యిట్లు చింతింపనొడగెను. నా నిమిత్తంబున నీ దేశంబున నిట్టి యనర్థంబు సంప్రాప్తమయ్యె. ప్రతికి యీ దుఃఖము నొందుటకంటె నాకు మరణంబు మేలని దలచి గలువకను నారాజుయెదుట ప్రజ్వలించుచున్న యగ్నియందు నిర్విచారముగ తన దేహ మును నాహుతిచేసిన వాడాయెను. ఇంతలో నగ్నియందు కలుగుక్షోభముచేత యాగాధి ముని మోహంబునుండి తెలివినొందిన వాడాయెను. ఆ గాధిముని రెండు ముహూర్తములలో భ్రమ రహితుండై

శ్లో॥ ముహూర్త ద్వితయేనాఽసౌ గాధిరాసీద్గతభ్రమః ।
కోఽహం కిమివపశ్యామి కిమకార్షమహంకిల ॥

శ్లో॥ ఏవం విచారయంశ్చిత్ర ముస్థాదుదకాంతరాత్ ।
నిత్యమేవ మనంతాసుభ్రమదృష్టిషు దేహినామ్ ॥

శ్లో॥ చేతో భ్రమతి శార్దూలో వనరాజి ష్వివోన్మదః ।
అవధార్యేతితం చిత్తమోహం గాధిర్నిరాయాసః ॥

శ్లో॥ దినాని కతి చిత్తసిన్ స్వకయే వాశమేతదా ।

అనగా రెండు ముహూర్తములలో భ్రమ రహితుండై నేనెవ్వడను! ఏమి చూచు చుంటిని ! ఏమి చేసితిని ! అని విచారపడుచు నా జలమధ్యంబునుండి లేచి తన చిత్తము భ్రాంతి దృష్టులందు భ్రమించుచున్నదని నిశ్చయించి-చిత్త

మోహంబు విడచి కొన్ని దినంబులు తన యాశ్రమము నందుండినవాడాయెను.

అట్టి సమయంబున నా గాధిముని వద్దకు నొక యతిథి రాగా అతనిని పూజించి తృప్తిపరచి అనంతర మాయిరువురు వారివారి వృత్తాంతముల జెప్పుకొనుచుండిరి. అట్టితరి గాధిముని ప్రసంగవశంబున తన యతిథితో— మీరు మిక్కిలి కృశించి బడలికగా కనబడుచున్నారు. కారణమేమని అడిగినవాడాయెను. అందులకు ఆ యతిథి యిట్లు బదులుచెప్పసాగెను.— భూమండలమున కీరంబని సుప్రసిద్ధంబగు పురంబుగలదు. అందు నేను పురజనులచే పూజింపబడినవాడనై యొక మాసము నివసించితిని. ఇటులనుండగా నొకనాడొకండు ప్రస్తావన వంశంబున నాతో నిట్లనియె ఓ విప్రా! యీ నగరంబున నొక చండాలుండు రాజై యెనిమిది సంవత్సరంబులు రాజ్యంబేలుచుండి కొనక తెలుసుకొనంబడి అగ్నియందు బడినవాడాయెను. అంతట నచ్చటి బ్రాహ్మణబృందంబును నగ్నియందు ప్రవేశించిరి — అని యిటుల వాని ముఖంబునుండి విని, నేనా దేశమునుంచి వెడలి ప్రయాగకుజని అందు స్నానమును జపమును ప్రాయశ్చిత్తమును జేసుకొని, మూడు చాంద్రాయణములుచేసి—యిప్పుడు వచ్చుచున్నాను — అందుచే శ్రమపడి కృశించితిని. అనగా ఆ గాధిముని బ్రాహ్మణునివలన యీ వృత్తాంతంబు విని యాశ్చర్యపడి, యిది తన వృత్తాంతమువలె నున్నదని యాలోచించినవాడాయెను. అంతట ఆ గాధిముని తాను చండాలుడై యున్న దేశమును జూడగోరి

శ్లో॥ హూణమండల ముత్సృజ్య రమండల మాయయౌ।
అథాత నాఽను భూతాని దృష్టాన్యాసేవితాని చ ॥
స్థానాని నగరేఽపశ్యజ్జనేభ్యః శ్రుతవాం స్తథా ।

అనేక దేశంబులు గడచి — తాను ముందు జూచిన హూణరాజ్యంబు జేరినవాడై అచట చండాల రూపమున తాను వశించియున్న గృహమును

గాంచెను. అచట పూర్వగుర్తులను—తన వృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొనుచు ఆశ్చర్యము నొందుచు తనవిధివిలాసమునకు చింతించిన వాడాయెను. మరియు తన వృత్తాంతమంతయు నచటి జనులవలన వినిన వాడాయెను. అట్లువిని గాధి ముని తనలో నిట్లు చింతించినవాడాయెను. "గొప్పదియగు నీ మాయను విష్ణు మూర్తి కనుపరచెనని తలంచు చున్నాను" అని నిశ్చయించి అచటి నుండి యొక పర్వతగుహాయందు ప్రవేశించి నారాయణుని గురించి తపము చేసిన వాడాయెను — కొంతకాలంబునకు నారాయణుండు ప్రత్యక్షమై గాధిమునితో యిట్లనియె. "ఓ విప్రోత్తమా ! గొప్పదియగు నామాయను నీవు గాంచితివి" యింక నీకేమి కావలయునో తెలుపమనిన,

శ్లో॥ దేవ ఏషా త్వయా మాయా దర్శితాఽతితమోమయీ ।
తస్యా మర్మ న జానామి భ్రమస్సత్యోఽభవత్కథమ్ ॥

అనగా ఓదేవా ! నీవు కనబరచిన తమోరూపిణియగు మాయను గాంచితిని. కాని అందు భ్రమ సత్యంబెటుల నాయెను. దీని రహస్యము తెలుపమని యడి గెను. అంత నారాయణుండిట్లనియె ;—

శ్లో॥ విప్ర పృథ్వ్యాది చిత్తస్థం నబహిస్థం కదాచన ।
స్వప్నభ్రమ పదార్థేషు సర్వైరేవానుభూయతే ॥

ఈ ప్రపంచ దృశ్యమున కంతకును చిత్తమే కారణము. ఏదోయొక కాల మున తన చిత్తమునందున్నదిగాని యెప్పుడును (అనగా కాలపరిపాకమందు) తన చిత్తముకంటె వెలుపల కనబడ నేరదు. ఈ యర్థము స్వప్నాదులయందు అందరి చేతనూ అనుభవింప బడుచున్నది.

శ్లో॥ యత్రానంత జగజ్జాలం సంస్థితం తేన చేతసా ।
శ్వపచత్వం ప్రకటితం యది తద్విస్మయోఽత్ర కిమ్ ॥
అవబుద్ధా శ్వపచతా ప్రతిభాసవశా ద్వృథా ।

తథైవాఽతిథి రాయాతో దృష్టవానసి సంభ్రమే ॥
కాకతాయ యోగేన చేతసి శ్వపచస్థితిః ।
సర్వేషాం హూణ రాజ్ఞాం తథైవ ప్రతిబింబితా ॥

తనయందున్న అనంతంబగు జగజ్జాలము గల చిత్తము చండాలత్వము కనబరచెనేని అందేమి ఆశ్చర్యమున్నది. నీవు ఎట్లు చండాల రూపుడనైతినని తలంచితివో అట్లు భ్రాంతి వశముననే అతిథి వచ్చెననియూ చూచితివనియూ దలంచితివి. అటులనే లేచిపోవు చున్నాననియు, హూణరాజ్యమును పొందితిననియూ దలంచితివి. అటుల, తొల్లింటి కటంజుని గృహము చూచితివి. అటులనే రనగరమునకు బోయితివి. అటులనే అచట శ్వపచుండు రాజ్యం బేలిన వృత్తాంతమును వింటివి. నీ చిత్తము చండాల రూపమెటుల కనబడియెనో అటులనే కాకతాయ న్యాయముచే సమస్తమగు హూణుల యొక్కయూ, రులయొక్కయూ చిత్తమందున కనుబడెనని యెరుంగుము అని:—

శ్లో॥ కదాచిత్ప్రతిభైకైవ బహూనామపి జాయతే ।
కాకతాయస్థితివ ద్విచిత్రా హి మనోగతిః ॥

మనోగతి విచిత్రమైనది. కాకతాయ వృత్తాంతము అనగా ఒకటియే ప్రతిభ పలువుర కేకకాలమందే కలుగుట— నీవెట్టి శ్వపచరూపము గలవాడనైతినని భ్రమించితివో అట్టి స్వరూపముకలిగి కటంజకుడను పేరుగల శ్వపచుడు హూణరాజ్యంబున నుండెను. వాడు కళత్రహీనుండై దేశాంతరమునకేగి ర రాజైయుండి పిదప అగ్నియందు ప్రవేశించిన వాడాయెను. ఆ కటంజుని వృత్తాంతము బోలు వృత్తాంతముగల యీ భ్రాంతి మాత్రము నీదు చిత్తంబున కలిగెను. ఆ వృత్తాంతమువిని నాయది యని తలంచితివి. ఇదియంతయూ మాయచేకలుగుచున్న భ్రమవిలాసము యనితెలిపి:—

శ్లో॥ అయంసోహమిదం తస ఇతి మజ్జత్యనాత్మవాన్ ।
సర్వమేవాహమేవేతి తత్త్వజ్ఞో నావసీదతి ॥

శ్లో॥ విప్ర పర్యవసానేయం మాయా సంసృతినామికా ।
ఆత చింతనయైవేయం క్షయమాయాతి నాన్యథా ॥

శ్లో॥ న గృహ్ణాతి పదార్థేషు విభాగానర్థ భావనాం ।
తేనాసౌ భ్రమమోహేషు తత్త్వజ్ఞో నావసీదతి ॥

శ్లో॥ జ్ఞానస్యాపరిపూర్ణత్వాన్న శక్నోషి మనోభ్రమం ।
వినివారయితుంతేన తేనైవాక్రమ్యసే క్షణాత్ ॥

శ్లో॥ చిత్తనాభిః కిలాస్యేహ మాయా చక్రస్య సర్వతః
స్థీయతే చేత్తదాక్రమ్య తన్నకించి త్ప్రబాధతే ॥

ఆత జ్ఞానరహితుడు సర్వదా భేదభావనగలవాడై వాడు, వీడు, నేను, నీవు, నాది, యని తలచుచూ సంసారసాగరమున మునుగుచున్నాడు. సంసారంబను పేరుగల యీ మాయ అంతములేనిది. ఇది ఆత భావనచేతనే క్షయమొందును గాని యింకొకవిధమున నశింపనేరదు. తత్త్వజ్ఞానముకలవాడు పదార్థములయందు భేదబుద్ధియునూ, ననర్థహేతువగు భావనను చేయడు. కావున భ్రాంతిమూలములగు నీ జ్ఞానములయందుండి దుఃఖింపడు. ఓ విప్రా! నీకు ఆత జ్ఞానము, పరిపూర్ణత నొందకుండుటవలన, నీవు మనోభ్రమమును మరల్పజాలకున్నావు. కావున మనోభ్రమచే దుఃఖము నొందుచున్నవాడవు. ఈ జగద్రూపంబగు మాయాచక్రంబునకు చిత్తమే నాభి యగును. అట్టి చిత్తము నిరోధించి యుండునెడ మనస్సు నిర్వికారముగా జేసికొని యుండునెడ నా మాయాచక్రమగు యీ దృశ్య మేమియునూ బాధింపదు— అను మొదలగు తత్త్వోపదేశమును నారాయణుండా గాధిమునికి జేసి అంతర్ధానుండయెను. అంతట మహానుభావుండునగు నాముని, భవదుఃఖరహితుడును, భోగవాంఛా విముక్తుండును, జీవన్ముక్తరూపుండును, భ్రమరహితుండును, పరిపూర్ణంబగు చిత్తముగలవాడై సంపూర్ణచంద్రునియట్లు తనయం దానందించు

వాడాయెను. గాన విద్వాంసుడు యీ మాయాశక్తిచే కలుగుచున్న సంసార స్వరూపము భ్రాంతి మాత్రమనియూ, యియ్యది మాయా కార్యమనియూ తెలుసుకొని తన స్వస్వరూపమును దృశ్యరహిత-స్వప్రకాశ-సర్వాధిష్ఠాన-సజాతీయ-విజాతీయ- స్వగతభేదరహిత- అసంగ, నిత్య, నిరతిశయ, అఖండ, పరిపూర్ణ చైతన్య స్వరూపమనితెలసికొని స్వానుభవమునకుగాను నిరంతరానుసంధానమును చేయుచుండవలయును.

## జ్ఞాన ప్రతిబంధములు, వాటి నివర్తకోపాయ సంగ్రహము

ఇచట జ్ఞానమనగా బ్రహ్మ జ్ఞానము. జీవునకు జ్ఞానము కలుగజేయ కుండ చేయునట్టి ప్రతిబంధములు నాలుగు గలవు. అందులో మొదటి ప్రతి బంధము, "మహాపాపవతాంనౄణామ్ జ్ఞానయజ్ఞోనరోచతే" జ్ఞాన యజ్ఞమనగా జ్ఞాన స్వరూపుడైన బ్రహ్మను నేనే అని తెలిసికొను ఇట్టి ఇచ్ఛా ప్రయత్నాభ్యాసముల యందు, మహాపాప ప్రతిబంధముచే యిష్టము కలుగదు, అను వచనానుసారముగ యీ జీవునియొక్క అనాది జన్మార్జిత పాప సంచయము. ఈ ప్రతిబంధ దోషము నిత్య నైమిత్తిక కర్మానుష్ఠాన ములను శ్రద్ధతో యాచరించు చుండుటచేత కాలక్రమమున పాపము క్షీణిం చును. రెండవ ప్రతిబంధము ఏదియనిన అజ్ఞానము. ఈ అజ్ఞాన మనునది జీవుని చిత్తము నావరించి యుండును. నేత్రపటలాది దోషములు ఔషధసేవ అంజనాదికములు మొదలగు వానివలన పోయినప్పటికిని, చీకటిలో నున్న ఘటమును చీకటి యావరించి ప్రకాశింప జేయకుండునటుల, సత్కర్మాను ష్ఠానములచేత జీవుని పాపములు నశించినప్పటికిని, అజ్ఞాన మనునది చిత్తము నావరించి తత్త్వజ్ఞానము కలుగకుండ నిరోధించు చుండును. ఇట్టి అజ్ఞానము సాధు సంగమ సచ్ఛాస్త్రశ్రవణము వల్లను సద్గురు సన్నిధాన మందు శ్రద్ధాభక్తులతో గూడి వేదాంత వాక్యములు వినుటచేత కాలక్రమమున నివర్తించును. అజ్ఞానము జ్ఞానముచేతగాని నివర్తించదు. అజ్ఞానము ఆత్మ స్వరూప సమ్యక్ జ్ఞానముచేత నశింప బడక ఆత్మ స్వరూపము ప్రకాశము

నొందును. మూడవ ప్రతిబంధము అసంభావన. అసంభావన యనగా జీవ, బ్రహ్మలయొక్క ఐక్యము ఘట, పటములయొక్క ఐక్యమువలె ప్రత్యక్షమునకు విరుద్ధముగా నున్నదని తలచుట. జీవుడు కర్తృత్వాది విరుద్ధ ధర్మములు కలవాడైనందున జీవబ్రహ్మలకైక్యము సంభవింపదు. గనుక పరమ ప్రమాణమైన వేదాంత వచనములు జీవబ్రహ్మల కైక్యము ఎట్లు చెప్పినదని సంశయము నొందుట. ఇట్టి సంశయము మననముచేత నివర్తించును. వేదాంత వాక్య శ్రవణముచేత కలిగిన జీవబ్రహ్మైక్య జ్ఞానమును, తదనుకూల యుక్తులచేత, ఆలోచించుట మనన మనంబడును. అనగా ఘట, పటములు రెండును, ఇంద్రియ గోచరమైనందున వానియొక్క ఐక్యము అసంభావితమే. అయినను జీవ, బ్రహ్మల ఏకత్వము శాస్త్రము చేతనే, ప్రతిపాదింప బడుచున్నందున వేదప్రతిపాదితమైన వారియొక్క ఐక్యము, విరుద్ధము కానేరదు. ఏలనన కర్తృత్వాకర్తృత్వాది ధర్మములు జీవబ్రహ్మలయొక్క స్వరూపమునందుండునవికావు. కాని అవి జీవ, బ్రహ్మ ఉపాధులైన అవిద్యా, మాయల యందుండునవి. జీవబ్రహ్మలు ఇరువురును శుద్ధచిద్రూపులు గావున వారికి అద్వితీయత్వము, అన్యోన్య – ఐక్యము, సంభావితము యనెడి యుక్తి పూర్వక ప్రమాణ పర్యాలోచనమును మననము యని ఎరుగ వలయును. ఇట్టి మననముచేత కాలక్రమమున సంశయమనెడి అసంభావనాదోషము నివర్తించును. కాని సతతాభ్యాస మావశ్యకము. విపరీత భావన యనునది నాల్గవ ప్రతిబంధము. ఉపనిషద్వాక్య ప్రమాణములచే జీవబ్రహ్మలయొక్క ఐక్యము వాస్తవమని విశ్వసించి యున్నప్పటికిని, భేదమే సర్వ వ్యవహారముల యందు ప్రకాశించు చుండుట విపరీత భావన యనబడును. ఇది బలీయమై ప్రత్యక్షానుభవసిద్ధమై జీవుని మోహింప జేయుచున్నది. ఈ ప్రతిబంధము నిదిధ్యాసనముచేత నివర్తించును. జీవబ్రహ్మైక్యమును నిరంతరము అనుసంధించుట నిదిధ్యసన మనబడును. ఇది అభ్యాసమనంబడును. ఈ ప్రకారము జ్ఞానోత్పత్తి ప్రతిబంధములు నాలుగుసూ, క్రమముగా నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము, వేదాంత వాక్యశ్రవణము, మనన నిదిధ్యాసనములచేత, అభ్యాస

పాటవమునుబట్టి కాలక్రమమున నివర్తింపగా, అప్పుడు "తత్త్వమసి". ఇత్యాది మహావాక్యములచేత బ్రహ్మ స్వరూపయాదార్థ్యజ్ఞానము ఉదయించును. ఇదియే సమ్యక్ జ్ఞానము. ఇట్టి జ్ఞానము తానుబుట్టి, సంసారమునకు కారణమైన కర్తృకరణాది సకల ప్రపంచముగా పరిణమించియున్న అజ్ఞానమును జీవునికి విశేషముగా నశింపజేయును. కాని జ్ఞానసాక్షాత్కార పర్యంతమ్ము, జీవునికి సతతాభ్యాసాదు లావశ్యకమ్ములై యున్నవి. దీనినే "విజ్ఞాయప్రజ్ఞానం కుర్వీతబ్రాహ్మణః" అనెడిశ్రుతివాక్యము, జీవునికి వాక్య శ్రవణముచేత బ్రహ్మ స్వరూపముయొక్క సాక్షాత్కారముకొరకు మనన నిదిధ్యాసనములనెడి ప్రజ్ఞను చేయవలయునని అనగా సంపాదించుటయావశ్యకమని స్పష్టముగా తెలుపుచున్నది.

## అనాది భ్రమయే జీవుని సంసార కారణము

ఈ సంసార భ్రమయేజీవునకనాది, గాని సాంతమని శాస్త్రము చెప్పుచున్నది. ఈ భ్రమనుగురించి వివిధ నిరూపణలలో సందర్భానుసారమున, వివరించియుంటిమి. అయిననూ జీవునికి యీ అనాదిభ్రమయే సంసారకారణమగుచూ యీ భ్రమనివర్తకమే, మోక్షసాధనమగుచున్నది. గాన యీ భ్రమను గురించి బాగుగా తెలిసికొనుట మానవునకు ప్రధానమగుచున్నది. జీవునకీ యనాదిభ్రమ మాయాకల్పితము. మాయ యన్ననూ, అవిద్యయన్ననూ కొంచమంశాంశ భేదమున్ననూ జిజ్ఞాసువు వీనినొక్కటిగనే గ్రహించవచ్చును. శ్రుతి "అవిద్యాస్తమయో మోక్షః" అనగా జీవునకు యీ అవిద్యానాశమే మోక్షమని తెలుపుచున్నందున, జీవుని, సంసారబంధమునకు యీ అవిద్యయే ముఖ్యకారణముగనున్నదని తెలిసికొనవలయును. కాన జీవభ్రాంతికిట్టి కారణమును, నిరూపించుకొనుట జీవునికి పరమయావశ్యకముగ కనబడుచున్నది, గనుక దాని స్వరూపమును గురించి సంక్షేపముగనైననూ యొక్కచోట నిరూపింప యావశ్యకమగుచున్నది. జీవునికి భ్రాంతి కలిగించుట మాయాకార్యము. మాయ యనగాలేనిది యని లోగడనే స్పష్టపరచి

యుంటిమి. కావున మాయాకార్యములన్నియూ అనగా ప్రపంచరూపమున నున్న యీ స్వశరీర సర్వదృశ్యమంతయూకూడ లేనిదియే కావలయును. ఎట్లన మాయబంగారుతో చేసిన యాభరణములు, సత్యసువర్ణ భూషణము లెట్లు కాజాలవో అట్లే మాయాకార్యమైన జగత్తంతయూ, శ్వేతాంబరపటము మీద,మనమనుభవించుచున్న శబ్దచలన చిత్రములలాగున లేనిదేయగుచున్నది. కాని యున్నదియొక్క శ్వేతాంబరపటము మాత్రమే. ఈ శ్వేతాంబరపటమే, అందు కలుగుచుండు చిత్రములకధిష్ఠానమై యుండును. ఈ అధిష్ఠానమైన శ్వేతాంబరపటము సదా నిర్వికారమై, నిశ్చలముగానుండును.లేనిచో యీ చిత్ర దృశ్యమంతయూ దానియందు కలుగుటకు వీలుకాదు. ఇంకనూ యీ చిత్ర దృశ్యములలో నొక్కటియైననూ యించుకయైననూ, యీ అధిష్ఠానమైన శ్వేతాంబరపటమును విడచి కలుగవు, కలుగుటకునూ వీలులేదు ఇట్లే జగదధిష్ఠానమైన బ్రహ్మ పరిపూర్ణుడై, అచలుడై, నిత్యుడై, నిర్వికారుడుగనుండును. ఇట్టి అద్వయ, భేదరహిత, అఖండపరిపూర్ణ పదార్థమునందే మనలకు యీ దృశ్యమై చిత్ర్యములన్నియూ అనుభవమగుచున్నవి. కాని యీ స్వశరీరసర్వ దృశ్యమంతయూ కేవలమాయా కల్పితముగాని వాస్తవము కాదని "మాయామాత్రమిదంద్వైతం, అద్వైతం పరమార్థతః" "ఏకమేవా ద్వయంబ్రహ్మ, నేహనానాస్తికించన" అనుశ్రుతి వచనములున్నూ "మాయామాత్రమిదం విద్వాన్, విశ్వంబ్రహ్మణికల్పితం" అనుమొదలుగాగల పూర్వాచార్యులవచనములున్నూ స్పష్టముగా తెలుపుచున్నవి. కాని వాస్తవమునన్నది బ్రహ్మ పదార్థమొక్కటియేయైనయడల, జీవునకు యీ దృశ్యనానాత్వమెట్లు కలుగుచున్నదను శంకకు, శాస్త్రమేయిటుల తెలుపుచున్నది. ఎట్లన అనాదిగా జీవుడు మాయా వివశుడైనట్లు గోచరించుచూ, కల్పితపరిచ్ఛన్న వివిధాంతఃకరణోపాధులతో తాదాత్మ్యమునొంది తన సుఖ దుఃఖములకుగాను కర్మలను అనాదిగా నాచరించుచున్నాడు. ఇట్లు చేయుచున్న కర్మ ఫలములనుబట్టి, ఆయా జీవులు వారియొక్క బుద్ధిచే ప్రేరేపింపబడుదురు. దీనినే "బుద్ధిఃకర్మానుసారిణీ" యను వచనమున్నూ, యింకనూ జీవులు కర్మలను వారి, వారి ప్రారబ్ధ కర్మ

ఫలవశమున, నియోజితులై చేయుచుందురని "బలాదివనియోజితః" అని శ్రీ కృష్ణభగవానులు అర్జునునకు తెలిపియున్నారు. ఇట్టికర్మలు, జీవులబుద్ధులనను సరించి, చిత్రవిచిత్రములుగానున్నూ భిన్నభిన్నములుగానున్నూ యుండును ఇదియే సంసారబంధమునకు కారణము. కావున అట్టి వివిధకర్మ ఫలముల ననుభవించుటకుగాను, జీవులకు, వారి, వారి, కర్మ లననుసరించి, భిన్న, భిన్న, చిత్ర, విచిత్ర సృష్టియంతయూ కల్పితమైనది. దీనినే "కర్మ వైచిత్ర్యాత్ సృష్టివైచిత్ర్యం" అనగా కర్మలయొక్క వైలక్షణ్యములచేత సృష్టివై లక్షణ్యవచనము తెలుపుచున్నది. దీనికంతకునూ కారణమే మనిన "భ్రమహేతూనాంవిచిత్రత్వాత్" అనగా భ్రాంతికి కారణములనేకవిధ ములనుండునుగాన భ్రాంతులనేకవిధముల నుండును అని వచనము తెలుపు చున్నది. దీనికంతకూ కారణము జీవునియొక్క భ్రమయే, కాని వేరుకాదు. దీనినే

శ్లో॥ అసత్కల్పం మృషాప్రాయం స్వప్నతుల్యం భ్రమోదితం ।
జగత్సర్వమితి జ్ఞేయం పండితైస్తత్త్వదర్శిః ॥

అనగా యీ జగత్తంతయూ స్వప్నములాగునలేనిదేయగుచు, జీవునియొక్క భ్రాంతి కల్పితమైనదని తత్త్వమునెరిగిన పండితులచే తెలియబడుచున్నదనిన్నీ ఇంకనూ

శ్లో॥ నామరూపాదయో యత్ర కల్పితాశ్చిత్తవిభ్రమాత్ ।
వ్యోమ్నీవ నగరం యత్తద్బ్రహ్మ తత్త్వమసి ధృవమ్ ॥

అనగా నామరూపాత్మకమైన ప్రపంచమంతయూ చిత్తవిభ్రమము అనగా భ్రాంతివలన, నేయధిష్ఠానమునందు కల్పితమైనదో అదియే బ్రహ్మ యనియూ, అయిననూ ఆకాశమునందగపడు గంధర్వనగరమునకున్నూ, ఆకాశమున కున్నూ, నెట్లు సంబంధములేవో అట్లే వాస్తవమైన బ్రహ్మకునూ భ్రాంతికల్పిత మైన ఈజగత్తునకున్నూ సంబంధములేదు. భ్రాంతిని తజించిన నీసత స్వరూప

మైన ప్రత్యగాత కునూ, సర్వాధిష్ఠానమైన బ్రహ్మ కునూ యెట్టి భేదములేద నిన్నీ శ్రీ శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు.

కావున యీ వచన తాత్పర్యమునుబట్టీన్నీ, మొదలు యుదహరించిన్ని 'అవిద్యాస్తమయో మోక్షః'' మొదలుగాగల శ్రుతివాక్యముల ననుసరించిన్నీ, వునకు, తనయొక్క అనాదిసంసార నిరూలనమునకున్నూ, మోక్షసిద్ధికిన్నీ, భ్రాంతి నిరూలన మావశ్యకము. జిజ్ఞాసువులకిట్టి భ్రాంతి నిరూలనముకు సాక్షాత్సాధనములుగ, శ్రవణ, మనన, నిదిధ్యసనానుసంధానములను శాస్త్రము తెలుపుచున్నది. అట్టి సాధనప్రక్రియలు వివిధోపాయములు, ముముక్షు జిజ్ఞాసువుల గ్రంధమందు తెలుపబడియున్నవి. కావున వాటిని, ప్రీతి, నిశ్చయములతో జిజ్ఞాసువులభ సించి కాలక్రమమున ఇహ,పరములయొక్క పరమ లాభమును బడయుదురు గాక.

## శ్రవణ, మనన, నిదిధ్యసనముల అత్యావశ్యకత

బ్రహ్మ విద్యాలాభమునుకోరు పలువురు పండితులుగూడ, మేము భాష్య శ్రవణమును చేసితిమని తృప్తినొంది, విదా లాభము కలిగినటుల మోదము నొందుదురు. కాని యిట్టికేవల శ్రవణమువలన కలుగులాభము బహుస్వల్ప మనిన్నీ, తదుపరి జిజ్ఞాసువునకు మనన, నిదిధ్యసనముల యావశ్యకత యీ క్రింది వివరణవల్ల తెలియగలదు.

ముముక్షువైన జిజ్ఞాసువునకు "అథాతోబ్రహ్మజిజ్ఞాసా'' అను సూత్ర నిర్ణయమునుబట్టి సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించిన యనంతరము గురుముఖతః మహావాక్య శ్రవణము చేయవలయుననని శాస్త్రము తెలుపుచున్నది. ఇట్లు ముముక్షువు మహావాక్యశ్రవణముచేసి భాగత్యాగ లక్షణముచే అహం

ఇదం అను పదార్థములోని జడాంశములను త జించి రెంటియందున, సదంశ మైనే అద్వి య, అఖండ, పరిపూర్ణ, సత్పదార్థమే తాననియు అనగా తనలో శుద్ధ వుడయిన ప్రత్యగాత యు ఇదం అను సర్వమునకు అధిష్ఠానమైన పర మాత యు యొక్కటియే యనిన్నీ అట్టి సత్పదార్థమే తాను అనియు బుద్ధి చే గ్రహించిననూ అట్టి జీవబ్రహ్మైక్యజ్ఞానము సంశయవిపర్యయరహితము గాక పరోక్షముగానే యుండును. ఏలనన అజ్ఞానకార్యముగా విక్షేప, ఆవరణ దోషములు ఆత రూపమైన మనలను అనాదిగా ఆశ్రయించుకొనియున్నవి. వీటియొక్క నిర్మూలనముకుగాను, శ్రవణ, మనన, నిదిధ్యసనములు యావ శ్యకమని

శ్లో॥ అస్తు బోధోఽపరోక్షోఽత్ర మహావాక్యాపథాఽప్యసౌ।
న దృఢ శ్రవణాదీనా మాచార్యైః పునరీక్షణాత్॥

యింకనూ కేవల మహావాక్యార్థజ్ఞానము శ్రవణముచే కలిగిననూ అయ్యది దృఢముగ నిలువజాలదు అనిన్నీ శ్రీ శంకరభగవత్పాదులు తెల్పుచున్నారు. ఇంకను శ్రుతిగూడ "ఆత్మా వారే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యా సితవ్యః" అని మైత్రేయికి బోధించుచు, ఆత యే తెలిసికొనదగినది, వినదగినది, యుక్తులతో చింతనచేయదగినది, ధ్యానింపదగినదనిన్నీ తెల్పుచూ యీ మూడింటిని జిజ్ఞాసువునకు విధించుచున్నది. అనాదిగా అవిద్యాప్రభా వముచే శుద్ధ వుడు తన పరిపూర్ణ సత జ్ఞానాన న్త స్వరూపమును మరచి "అన్యోన్యస్మి న్నన్యోన్యాత కతా మన్యోన్యధరా ంశ్చాధ్యస్య సర్వవ్యవహార భాగ్భవతి" అని భాష్యమునందు శ్రీ శంకరభగవత్పాదులు తెల్పుచున్నారు. అనగా మనలోయున్న చిద్రూపుడైనట్టియు యాయసంగుడైనట్టియు శుద్ధ జీవుడే తాదాత్మ్యాధ్యాసమువలన తనతో యథార్థ సంబంధములేని బుద్ధియందు ప్రతిబింబించిన వాడగుచు ఆయా ధర్మములను తనయందారోపించుకుని జీవు డని తెలియబడుచు సర్వ వ్యవహారములను పొందుచున్నాడు అని వాక్యము తెలుపుచున్నది. గనుకనే యీ అధ్యస్తజీవుడు అనాదిగా తనకు యిట్లు యీ

స్థూలసూక్ష్మ దేహములందు అధ్యాసము నివర్తించినగాని తన సత్యస్వరూపమును గుర్తింప జాలడు. అది అవిద్యా మహిమ. ఇందుకుగాను యీ అధ్యస్తవుడు నిత్యానిత్య వివేకమును సంపాదించి తనస్వప్రయత్నముచే సాధన చతుష్టయ సంపత్తిన్నీ ఈశ్వరానుగ్రహముచే చిత్తశుద్ధిన్నీ సంపాదించి గురుముఖతః మహావాక్య శ్రవణము చేయుటవల్ల పరోక్షజ్ఞానము కల్గును. అనగా తనకు యిట్టి అధ్యాసము తను కానిదానియందు కలిగినదనిన్నీ తన జీవత్వము భ్రాంతియనియు, జ్ఞానము కలుగును. కాని యీ జ్ఞానమువల్ల తను యింతకాలమునుంచి అవిద్యాభ్రాంతుడై మరచిన తనసత్యస్వరూపానుభవము కలుగదు. కనుక తన సత్యస్వరూపానుభవమును పొందుటకు నిరంతర మననాదులు యావశ్యకము. ఇట్టి మననము ఎట్లుండవలెననగా— తను యిప్పుడు ప్రారబ్ధకర్మనుబట్టి యుపాధిస్థితుడైయున్ననూ యథార్థముగ తను నిష్క్రియుడనిన్నీ అసంగుడనిన్నీ తనకు యీ యుపాధి పుణ్యాపాప కర్తృత్వాది ధర్మములతో వాస్తవముగ నెట్టి సంబంధములేదనిన్నీ, అయినను అవి కల్పితములై అధ్యస్తముగ తనయందే తోచుచున్నవనిన్నీ, తన సత్యస్వరూపము యీ సర్వదృశ్య ఉత్పత్తిస్థితి లయములకు వివర్త కారణమై తనయందే భ్రాంతికార్యముగా తోచుచున్నది గాన యీ సర్వదృశ్యాధిష్ఠాన సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత— స్వప్రకాశ అఖండ పరిపూర్ణ చైతన్యమే తాను అనియు సతతానుసంధానము చేయుచుండవలయును. ఇట్లు చేయుచుండగా యెప్పుడు వుడు దేహద్వయముతో గూడిన చిదాభాసస్వరూపము తనదికాదు అనిన్నీ తను కేవల అధిష్ఠాన కూటస్థచైతన్య రూపుడు మాత్రమే అనిన్నీ తెలుసుకొనునో అప్పుడు నేను అను తను అసంగ చిద్రూపుడను పరిపూర్ణుడను అని గ్రహించును. తన సత్యస్వరూపము సత్యజ్ఞానానంతస్వరూపముగా తెలుసుకొనును. గాని యిట్టి మహనీయుడైననూ "ప్రారబ్ధమనుభోక్తవ్యం" "నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అను

వచనములను బట్టి ప్రారబ్ధాంతమువరకు యీ స్థూలసూక్ష్మోపాధి ధర్మములను పొందుచునేయుండును.

కాని యిట్టివాడాత జ్ఞాని గనుక నిత్యానిత్య వివేకముతో విషయ సుఖంబులందు సక్తుడుగాక ప్రారబ్ధానుసారమున కర ఫలము ననుభవించుచుండును. ఇట్టి యనుభవము విద్వాంసునకు దుఃఖకరము కాజాలదు. విషయ భోగములు నశ్యములను దృఢజ్ఞానముచే యిట్టివారికి విషయభోగముల యందిష్టానిష్టతలు అంత వ్రమముగా నుండక సంప్రాప్తములను యథా ప్రాప్తముగ ననుభవించుచుందురు. తత్త్వజ్ఞుల మనసు సర్వదా నిర్విషయ చింతనమందు బంధింపబడి యుండును. గాన విషయసుఖము యెంత అల్పమైనదైనను వారు సంతుష్టులగుదురు. దీనినే

శ్లో॥ బంధముక్తో మహీపాలో గ్రామమాత్రేణ తుష్యతి ।
పరైరబద్ధోఽనాక్రాంతో నరాష్ట్రం బహుమన్యతే ॥

అనగా శత్రువులచే బంధింపబడిన రాజునకు ఒక్క గ్రామమిచ్చి విడుదల చేసిననూ బహుసంతోషమును పొందును. కాని నిరంకుశముగా స్వేచ్ఛగా నున్నరాజునకు యొకరాజ్యమిచ్చిననూ తృప్తియుండదు. ఇట్లే జ్ఞానిమనసునకు అల్పలాభమందు అధికతృప్తి కలుగుచుండునని శ్రీ విద్యారణ్యులు తెల్పుచున్నారు.

ఇట్టి మహనీయులు పరాపరవిద్యలను రెంటిని ద్విభాషాపరిచితులు లాగున నెరిగినవారు గావున లోకవ్యవహారములు చేయునప్పుడు తనకు సాధనములైన స్థూలసూక్ష్మ దేహధర్మములను కల్పితములుగ గుర్తెరిగి యనుభవించుచుందురు. పారమార్థికస్థితియందు అనగా ధ్యానసమాధులందు వారి సత్యస్వరూపమైన అఖండ సచ్చిదానందస్వరూపమునే అనుభవించుచుందురు. ఇట్లయిననూ బ్రహ్మాభ్యాసకుడు తన సత్యస్వరూపమును మరువక ఫలావగతి

పర్యంతముగాని ఆమరణాంతము గాని "ఆసుప్తేరామృతేఃకాలంనయే ద్వేదాంత చింతయ" అను విద్యారణ్యవచనము ననుసరించి ఆమరణాంతము యిట్లు కాలము గడుపుచుండుటయే పండితలక్షణము.

# మోక్ష వివేకము

మోక్షమనగా సుఖస్వరూపము. ఇది అందరిచేతను కోరబడుచున్నదే. అద్వైతసిద్ధాంతమందు ఆత్మజ్ఞానియే మోక్షమునుపొందువాడు. అనగా తాను జ్ఞానస్వరూపుడగును. ఆత శబ్దమునకు తాను అనగా నేను అనికూడా అర్థము యున్నది. కనుక తనను తాను జ్ఞానస్వరూపుడని తెలుసుకొని అనుభవమును పొందుటే మోక్షము. అయిననూ లోకమునందు తనను తానుతెలియ కుండు వారెవరునూ లేరు. కాని పరమార్థదృష్ట్యా తనను తాను జ్ఞాన స్వరూపునిగా తెలుసుకొనుటలేదు. తనను తాను తన వాస్తవస్వరూపము కాని అజ్ఞానస్వరూపునిగా తెలుసుకొనుచున్నాడు. ఇందువల్లనే దృశ సంసారదుఃఖములను జన పరంపరగా జీవుడు పొందుచున్నాడు. అయిననూ జనసామాన ముగ ప్రతియొక్క మానవుడునూ నేను, నన్ను బాగుగనే తెలుసు కొనుచున్నానను తలంపులోయుండి సర్వవ్యవహారములు చేయుచు వాటి సుఖ దుఃఖ పరంపరను పొందుచుండును. ఇట్టి దానిలో అనగా సంసారమందు యేదోయొక రూపమున పండితులకును పామరులకును, కలవారికిని లేనివారి కిని, స్త్రీలకు పురుషులకును, యువకులకును వృద్ధులకును, వారు వీరు యననేల సర్వులకును సుఖానుభవములకన్న దుఃఖానుభవములే అధికముగ కలుగుచున్న వని వివేకదృష్టితో చూచిన చెప్పకతప్పదు. కాని అనాది అవిద్యాబలముచే యిట్టి దుఃఖములను సహించి వాటినే కొన్ని సమయములందు సుఖముగను తదితర సమయములందు దుఃఖముగనూ యనుభవించుచు వితములను గడపు

చున్నారు. వునకు యిట్టి అజ్ఞానదుఃఖనివృత్తిని గావించి తన యథార్థ స్వరూపమైన నిత్యసుఖస్వరూపమును బోధించుటకుగాను శ్రుతి "పూర్ణ స్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" ఈ జగత్తంతయు ఒక్కటియైన పరిపూర్ణ పదార్థములోనుంచి కలిగినది. తిరిగి శేషించునది పూర్ణపదార్థమే అని తెలుపుచున్నది. జీవుడు జగత్తులోనివాడేగద, అనగా జగదంశము, ఈ జీవుడేగదా తన స్వశరీరసర్వదృశ్యమునూ నేను, నాది, అని వ్యవహరించుచు సంసారానుభవములను పొందుచున్నాడు. ఈ వునికి తా ననుకొను నేను అనునది లేనిదే—నాది అని తనదనుకొను పదార్థమేమియు యుండుటకు సంభవము కాదుగదా. వునకు యీ శ్రుతినిబట్టి నీవు నేను నాది అనుకొనుచున్నదంతయు ఒక్క పూర్ణపదార్థమేగాని తదితర మేమియు కాదనియేగదా అర్థమగుచున్నది. ఇట్టి పరిపూర్ణజ్ఞానము ప్రస్తుతము వుడైన తనకులేదు. తనకు తెలియుటనూ లేదుగదా. వసామాన్యముగ యిట్లు తెలియని విషయమును వుని నిత్యనిరతిశయ సుఖమును తెలుపుటకుగాను శాస్త్రము ప్రవర్తించుచున్నది. శాస్త్రముయన్నముఖ్యార్థము వేదమనియే. వేదేతరములను శాస్త్రమని మనము వ్యవహరించుచున్నను అట్టిది గౌణప్రయోగము గాని ముఖ్యార్థము కాదు ఇట్టి వేదమే శ్రుతి యనికూడ చెప్పబడుచున్నది. మానవులకు వారి వాస్తవసుఖస్వరూపములను, సుఖసాధనములకు బోధించుటకుగాను యీ శ్రుతిమాత కారుణ్యముతో నూరు తల్లుల ప్రేమతో వులకు బోధించుచున్నది. ఇందువల్లనే "శతమాతృసమా శ్రుతిః" అని శ్రుతిబోధ నూరుతల్లుల సమానమైనదని వచనము తెలుపుచున్నది. ఇట్టి శ్రుతి జీవునకు తాను పరిపూర్ణ స్వరూపుడనియూ అనగా ఇది అంతయూ నీ పూర్ణ స్వరూపమే కాని నీవు భ్రాంతిచే పరిచ్ఛిన్న దృశ్య రూపమున న్నా న్నాకారములుగ చూచుచున్నావు. ఇట్టివి వాస్తవములుకావు. నీవు వాస్తవముగ పరిచ్ఛిన్నుడవు కావు. పరిపూర్ణ స్వరూపుడవు కాన సర్వమూ నీదియే యగుచు నీవు పరిపూర్ణ స్వరూపుడవు అని తెలుసుకొనినప్పుడు నీవు కోరవలసినదేమియుండును. కోరికలేనియెడల దుఃఖమేలేదుగదా,

యను భావార్థముతో పునకు తెలుపుచూ యింకనూ సందేహించునేమోయని తలచి సాక్షాత్తుగా "తత్త్వమసి" అపరిపూర్ణ బ్రహ్మ వునీవే ననిగూడ తెలుపు చున్నది. ఇట్లుచెప్పి "ఆత్మానం చే ద్విజానీయా దయమస్మీతి పూరుషః, కిమి చ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్". ఏ పురుషుడు తన ఆత ను నేను బ్రహ్మనైతిని అని తెలుసుకొనునో అట్టివాడు దేనిని కోరుచూ తన శరీరమును తపింపజేయును. అనగా తాను కోరవలసిన దేమియూ నుండదని కూడ తెలుపుచున్నది. ఇట్లు చెప్పు శ్రుతివాక్యార్థముల ననుసరించి మన యనుభవమును గూడ బాగుగ వివేచన చేసి చూచిన యెడల యీ వచనముల యథార్థము మనకే స్పష్టపడును. అట్టి వివేచన యేదియనిన — అహం అను నన్ను శ్రుతి వచనము లన్నియు వాస్తవముగ నా స్వరూపమనియు, దృశ్యరహితమనియు చెప్పుచున్నవి. నా అనుభవము కూడ యీ వాక్యార్థము లకు సరిపోవునా యని పరి లించిన తనకు యిట్టి అఖండ సుఖానుభవము, దృశ్యముతో తనకు యెట్టి సంబంధమునూ లేని సుషుప్తికాలములో కలుగు చున్నది. అట్టి స్థితియందు తాను నిశ్చింతగాయుండి సుఖానుభవమును పొందు చున్న విషయము తనకున్నూ సర్వులకున్నూ అనుభవములో నున్నదే. అయి నను యిట్టి సుఖమును తాను అజ్ఞానపూర్వకముగా సర్వదృశ్యమునూ మరచి అనుభవించుచున్నాడేగాని సుషుప్తియందు తన పరిపూర్ణ సుఖస్వరూపజ్ఞానము వల్ల యిట్లు తనకు సుఖము కలుగుటలేదు. పరిపూర్ణఅత్మజ్ఞానమువల్ల అనగా సర్వాత్మానుభవమువల్ల సుఖము కలుగుచున్నదాయని కూడ విమర్శించిన యెడల లోకవ్యవహారములోగూడ యిట్టి పరిపూర్ణత్వము సర్వస్వత్వము, తనకు ల ంచకపోవుటవల్లగాని, ఎవరికైనను ల ంచిన అనగా సర్వము నాదే యను జ్ఞానము వలన సుఖసంతోషములు కలుగుచున్నవికాని సర్వము నాదే యని యెవరును దుఃఖమును పొందువారుండరు. ప్రతివారును (సర్వ వులును) ఉదయము మొదలు పరుండువరకునూ చేయు ప్రయత్నము తన స్వలాభ పరి పూర్ణానుభవసుఖము కొరకేగాని వేరుకాదు. అయిననూ జీవుని ప్రారబ్ధము ననుసరించి యెంతవరకు కరానుభవఫలము యుండిన అంతవరకే ఫలము

ననుభవించి మరణించుచున్నాడు. కాని జీవుడు తన పరిపూర్ణ సుఖానుభవ మును పొందుటలేదు. పూర్ణ సుఖానుభవము జీవుని వాస్తవస్వరూపము. కాని యిట్టి -వుడు తన అనాది అవిద్యా కామకర్మలయొక్క ప్రారబ్ధఫలమున యిప్పుడు భ్రాంతియుతుడై తన పరిపూర్ణ సుఖస్వరూపస్వభావమును మరచి యున్నాడు. భ్రాంతిచేకల్గు అనుభవములన్నియు అజ్ఞానానుభవములనకతప్పదు. ఇట్టి అజ్ఞానమును జీవుడు యిప్పుడు తన వివేకాదులచే పోగొట్టుకొని తన వాస్తవపరిపూర్ణ స్వరూపమును గ్రహించవలయును. ఇట్టి గ్రహణము ఒక్క జ్ఞానముచే సాధ్యముకాని తదితరమువల్లకాదు. లోకానుభవములలోగూడ మనము పొందుచున్న సమస్త సుఖదుఃఖానుభవములనూ జ్ఞానమువల్లనే కలు గును గాని జ్ఞానములేనియెడల యెట్టి అనుభవములునూ కలుగుటకు వీలులేదు, కలుగదు. మనకు కలుగుచున్న బంధుత్వములు, విరోధములు, ద్రవ్యలాభనష్ట ములు, సుఖదుఃఖములు సర్వమును కలుగుచున్న జ్ఞానముతోడనే ( వులకు) అనుభవములు కలుగుచున్నవి.

ఎట్లన మానవుడు ( వుడు) నిన్నటివరకు తనవి యనుకొను పదార్థము లను కొన్నిపరిస్థితుల మార్పుచే తన జ్ఞానములో మార్పు కలిగి వాటియందు స్వత్వమును, అభిమానమును వదలుకొనుచున్నాడు. ఇట్లే నిన్నటివరకును తన కెట్టిసంబంధమూలేని పదార్థములందు స్వత్వఅభిమానములను కలుగజేసుకొను చున్నాడు. ఇది అంతయూ మానవునియొక్క జ్ఞానములో మార్పుచేత కలుగు చున్నది. కాని పదార్థములు యెప్పుడును ఒక్కటిగానే యుండును. ఇంకనూ మానవుడు నిన్నటివరకునూ తనకెట్టి సంబంధములేని సుమారొక యిరువది సంవత్సరముల కన ను వివాహమను పేరుతో యొక గంట సంస్కారముచే తన భార యని యభిమానించి దానిని తనదిగాను దానిని తనుగానేగూడ సుఖదుఃఖములకు పరిగణించి సంసారానుభవములను పొందుచున్నాడుగదా! నిజమాలోచించిన వివాహమగు రోజువరకు యీ యిరువది సంవత్సరముల కాలము ఆ కన సుఖ దుఃఖములతో తనకెట్టి సంబంధములేక ఆ కన్యయెవరో

గూడ తనకు తెలియకనే యున్నాడుగదా. ఇరువదిసంవత్సరముల తదుపరి యీ యువతి నాభార్య, నేను ఆమె ఒకటియే అను అ మానము కేవల భ్రాంతి మూ త్‌జ్ఞానమేగదా. లోకమునందు యిట్టిసమస్తానుభవములకును జ్ఞానమే సాధనమగుచున్నది. కాని వేరేమియుకాదు. ఇట్టి లోకానుభవములనుబట్టి చూచిననూ భ్రాంతియుతుడై, జీవుడు తాను మరచిన తన సత్యస్వరూపమును తిరిగి యిప్పుడు తెలుసుకొని స్వానుభవమును పొందుటకుగూడ సాధనము యీ జ్ఞానమొకటియేగాని తదితరములు కాజాలవని స్పష్టమగుచున్నది. కాన తనకు (మానవునికి) ఒక కాలమున యెట్టి సంబంధములేని స్త్రీ, క్షేత్రాది సంపత్తులను తనవియని యెట్లు జ్ఞానముచే యిప్పుడు గ్రహించుచున్నాడో అట్లే వుడు భ్రాంతిచే మరచిన తన పరిపూర్ణ సుఖస్వరూపమును జ్ఞానముచేతనే స్వప్రయత్న శాస్త్రీయ సాధనములతో పొందవచ్చునని తెలియుచున్నది. జీవునికి యిట్టి తన నిత్య నిరతిశయసుఖము తన వాస్తవ స్వరూపమే యను జ్ఞానము కలుగజేయుటకుగాను వలోకానుభవముల ననుసరించి అనేక విధముల శాస్త్రము బోధించుచున్నది.

మోక్షాధికారియైనవాడు యిచట ఒక విషయము గ్రహించవలసియున్నది. ఇట్టి బ్రహ్మ విద్యాసిద్ధి అనగా బ్రహ్మ జ్ఞానమును జీవుడు గుర్వీశ్వరానుగ్రహములవల్ల సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించి శాస్త్రీయ విధమున శ్రవణ మనన నిధి ధ్యసనములను యొక జన్మయందుగాని అనేక జన్మములందుగాని తన ప్రారబ్ధాంతమువరకుచేయు స్వప్రయత్నమువల్లనేపొందబడునుగాని అన్యథాగా పొందబడదు. దీనినే "నాన్యః పంథావిద్యతేఽయనాయ" అని శ్రుతివచనము తెలుపుచున్నది. యోగవాశిష్ఠమునందు జ్ఞానవరిష్ఠులైన జనకులు మొదలగువారుగూడ యిట్టి బ్రహ్మ జ్ఞానమును వారి స్వప్రయత్నముచేతనే పొందిరి గాని వేరు మార్గమున పొందలేదని వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు. కాన మోక్షార్థులైన జిజ్ఞాసువులు లఘుమార్గములపేక్షించి భ్రమచెందకూడదు. మంత్ర, తంత్రాది శాస్త్రములవలె అద్వైత సిద్ధాంతమందు

రహస్యమైనది యేమియులేదు. ఇయ్యది రాజమార్గముగాయుండు రాజవిద్య యని ముముక్షువు గ్రహించవలయును. కాని యిట్టిజ్ఞానము గుర్వీశ్వరాను గ్రహములతో సశాస్త్రీయముగ నభ్యసించు జిజ్ఞాసువునకే పొంద సాధ్యము గాని అన్యులకు అన్యవిధముల కలుగదని నిశ్చయముగ ముముక్షువులు నమ్మ వలయును. పురాణాది గ్రంథములలో పరకాయప్రవేశము, శక్తిపాతము, హస్తమస్తక సంయోగములనునవి అచటచట తెలుపబడిననూ అట్టివి సిద్ధ పురుషుల అపూర్వవిషయములు. అట్టివారు సంకల్పసిద్ధులు. అధికారపురుష లుగా నుందురు. కాని అవి సామాన్యుల విషయముకాదు. ఈ కాలమునందు అచటచట బ్రహ్మ విద్యాశ్రమముల స్థాపించి కొందరు, తమ సిద్ధుల మహత్వ ములచే శిష్యులకు శక్తిపాతాదులను గావించి అభ్యాస శిక్షణయిచ్చి అయిదు ఆరు మాసములలోకాని లేక ఒకటి రెండు మాసములలోకాని జిజ్ఞాసువులను (శిష్యుల) యుత్తీర్ణతగావింతురను అ లాషలు కలుగజేయబడుచున్నవి. కాని అట్టిమార్గములు సకృతుగా కొందరికి కొంతవరకు ఉపయోగించిననూ పర్యవ సానములుగాక తాత్కాలికములై, పలువురకు నిష్ప్రయోజనమున్ను ప్రమా దమునకుగూడ హేతువగుచున్నట్లు తెలియుచున్నది. జీవులకు (మానవునకు) బ్రహ్మ జ్ఞానము చిటకావైద్యములాగున పొందతగినదికాదు. -వునకు యీ సంసారము వభ్రాంతిచే అనాది జన పరంపరగా వచ్చుచున్నందున, ఘట జ్ఞానములాగున యొక్కసారి తెలుసుకొనిన తెలియబడునదికాదు. మరియే మనిన వుడు తన నిరంతర సత్యజ్ఞానాభ్యాసాదులచే అనాది కాలమునుంచి తన నాశ్రయించుకొనియున్న యీ అజ్ఞానమును, చాలాకాలమునుంచి తనను బాధించుచున్న పురాణజ్వరములాగున యెంచి దీర్ఘ ఘనచికిత్సచేతనే పోగొ ట్టుకొనవలయును. దీర్ఘ రోగమునకు దీర్ఘఘన ప్రయత్నము కావలయును గదా. ఇట్టి తన అనాది అజ్ఞానమును ముముక్షువు తన వాస్తవ స్వరూపమైన సత జ్ఞానానంత పరిపూర్ణ లక్షణముల దీర్ఘకాలసతతానుసంధానము అనగా ఫలావగతి పర్యంతము అభ్యసించి తాను మరచిన తన పరిపూర్ణత్వమును యిపుడు తిరిగి పొందవలయును. ఇట్టినిరుపమానకార ముని అన్యుల అల్ప

సహాయమువల్లగాని లేక తన అల్పకాల ప్రయత్నమువల్లగాని సిద్ధించుననిఆశిం చుట యుచితముకాదు. విద్యయనునది యెవ్వరిచేతనైననూ హ్రస్వసుఖరాజ మార్గములపొందబడునదికాదు. దీనినే:— "There is no royal road for Learning". అని ఆంగ్లవచనముకూడ తెలుపుచున్నది. కాని మోక్షార్థియైన వుడు ఫలపర్యంతము విసువుజెందక శ్రవణమనననిదిధ్యాసనములను స్వప్ర యత్నముచే అభ్యసించుచుండవలయును. అప్పుడు కాల పరిపాకమునుబట్టి తనవాస్తవ స్వరూపమైన పరిపూర్ణలక్షణములు తెలియును.

మనస్సన్నను, వృత్తియన్నను, వివేచనకు స్వల్పభేదమున్నను దాదాపు యొక్కటిగనే గ్రహించవచ్చును. ఈ మోక్షవివేకమునకు వృత్తియే ప్రధాన సాధనమగుచున్నది. ఈ వృత్తియే బంధమోక్షములకు కారణమని అపరోక్షాను భూతియందు శంకరభగవత్పాదులిట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ భావవృత్త్యాహి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా।
బ్రహ్మవృత్త్యాహి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్ ॥

భావవృత్తిచేత భావత్వమును, అభావ (శూన్య) వృత్తిచేత అభావత్వ (జడత్వ) మును కల్గుట లోక ప్రసిద్ధము. అట్లే బ్రహ్మ వృత్తిచేత పూర్ణ త్వము కలుగుట జ్ఞానులయందు ప్రసిద్ధము. కావున పూర్ణత్వమును అభ్య సింపవలయును. భావవృత్తి యనగా ఘటాద్యాకారవృత్తి యనియును, భావ త్వమనగా తన్మయత్వమనియును భావము.

శ్లో॥ యేహివృత్తిం విహాయైనాం బ్రహ్మాఖ్యాం పావనీం పరాం।
వృథైవ తేతు జీవన్తి పశుశ్చ సమా నరాః॥

ఎవరు ఈ శ్రేష్ఠమును పరిశుద్ధమునైన బ్రహ్మవృత్తిని త్యజించెదరో, ఆ పశువులకు సమానులైన మనుష్యులు వ్యర్థముగా జీవించుచున్నారు. బ్రహ్మ

వృత్తియే సకల వృత్తులకంటెను ఉత్తమమనియు, దానిని దెలియనివాడు నర పశువనియు భావము.

శ్లో॥ యేషాం వృత్తిః సమావృద్ధ్యా పరిపక్వా చ సా పునః ।
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మ వాదినః ॥

ఎవరివృత్తి సమముగను, వృద్ధిపొందునదిగను, పరిపక్వమైనదిగనున్నదో, వారే సత్తత్త్వమైన బ్రహ్మమును బొందినవారు. శబ్దవాదులైన యితరులు పొందినవారు కారు. ఇట్లని తెలుపుచూ కేవలము శాస్త్రశబ్ద పాండిత్యము చేత వృత్తిహీనముగచేయు బ్రహ్మశబ్దార్థవాదులను గురించి:—

శ్లో॥ కుశలా బ్రహ్మ వార్తాయాం వృత్తిహీనాః సురాగిణః ।
తేప్యజ్ఞానతయా నూనం పునరాయాన్తి యాన్తిచ॥

బ్రహ్మమును గూర్చి మాటలాడుటయందు సమర్థులుగను పట్టుదల గల వారుగను నుండి సత్పదార్థస్వరూప వృత్తి రహితముగ నెవరుందురో అట్టి వారు అజ్ఞానులుగా పుట్టుచు చచ్చుచు నుందురేగాని మోక్షము నొందరని తెలుపు చున్నారు.

శ్లో॥ కార్యేహి కారణం పశ్యేత్ పశ్చాత్కార్యం విసర్జయేత్ ।
కారణత్వం తతో గచ్ఛే దవశిష్టం భవే న్మునిః ॥

శ్లో॥ అదృశ్యం భావరూపంచ సర్వమేవ చిదాత్మకం ।
సావధానతయా నిత్యం స్వాత్మానం భావయే ద్బుధః ॥

శ్లో॥ దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్ ।
విద్వాన్ నిత్యసుఖే తిష్ఠేత్ ధియా చిద్రస పూర్ణయా॥

జిజ్ఞాసువు తన ఆత్మ విచారమందు మొదట కార్యమగు యీ ప్రపంచమందు కారణమును జూడవలయును. పిమ్మట కార్యమైన యీ దృశ్యమును త్యజింప

వలయును. కార్యమైన యీ దృశ్యమును త్యజించుటవలన కారణత్వము తనంతట తానే పోగా శేషించు అధిష్ఠానము మునిలుడు తానగుచున్నాడు. అదృశ్యమును అనగా పరోక్షమును భావరూపమైన ప్రత్యక్షమును సమస్తమును చిత్స్వరూపమే కాన విద్వాంసుడు సావధానముగా నిరంతరము తనయొక్క స్వస్వరూపమైన ఆతనే భావింప తగినది. ఇంకను దృశ్యత్వమును అదృశ్యముచేసి బ్రహ్మాకారముగ అనగా త్రివిధపరిచ్ఛేద రహితమైన అఖండపరిపూర్ణచైతన్యాకారముగా చింతింప వలయును. అనగా అనుసంధానము చేయుచుండ వలయును. ఇందువలన ముముక్షువు కాలక్రమమున తన అభ్యాస పాటవమును బట్టి జ్ఞానరసపూర్ణమైన బుద్ధితో నిత్యసుఖము బడయగలడు.

ఇట్టి బ్రహ్మ చింతనము బ్రహ్మ భావన యనునవి మనస్సువల్లనే సాధ్యమగును గాని అన్యధాగాకావు. వాస్తవముగ యీ మనస్సన్నది కల్పితమైననూ వుని మోక్ష ప్రాప్తికి యిదియే పరమసాధనము. ఎట్లన మలిన పాత్రలను మలినమైన మట్టినే యుపయోగించి తరువాత మట్టిని కడిగివేసి పాత్రల నెట్లు శుభ్రపరచుకొని యుపయోగించు కొనుచున్నామో అట్లే సంస్కరింప బడిన యీ కల్పితమయిన మనస్సుయే జీవునకు మోక్షప్రాప్తిని కలుగజేసి తాను అ స్థానమందు లయమైపోవును. కావున ముముక్షువు సర్వదా తన మనస్సును గురుశాస్త్ర బోధచే సంస్కరించుకొని సర్వదా బ్రహ్మాభ్యాసము చేయుచుండ వలయును. ఇదియే మోక్షమునకు సాక్షాన్మార్గము. మోక్షార్థియైన వానికి యెన్ని నోములు, వ్రతములు, యాత్రలు, జపములు చేసినను యీ ఆత్మవిచారము, అనుసంధానాదులతో సరికావు. ఇట్టి నిత్యాభ్యాసాదులే ముముక్షువునకు కాలక్రమమున వుడు మరచిన తన సచ్చిదానంద లక్షణ ప్రాప్తిని కలుగజేయును అనగా జీవుడు తన సత్య స్వరూపమును తెలుసుకొనును.

ఇట్టి సచ్చిదానంద స్వరూపమగు తన పరిపూర్ణత్వమును తన మెడలోని హారమును, మరచినట్లు వుడు మరచి అనాది కాలమునుంచి పరిచ్ఛిన్న

రూపోపాధులతో తిరుగుచూ సంసార దుఃఖమును పొందుచున్నాడు. మోక్ష మనగా జీవుడు అనాదిగా మరచిన తన సత్య పరిపూర్ణ స్వరూపమును తాను అని తెలుసుకొని స్వానుభవము పొందుటే. ఇట్లు తెలుసుకొనుటకు కర్మ, జ్ఞాన, భక్తి, మార్గములు మూడు గలవు. ఈ మార్గసాధనములను గురించి శ్రుతి, స్మృతి, పురాణముల వల్లనూ, పూర్వాచార్యుల బోధల వల్లనూ గురు ముఖతః తెలుసుకొని జీవుడు తన మోక్ష ప్రాప్తిని అనగా స్వస్వరూపాను భవమును అభ్యాసపాటవముచే పొందవచ్చును. ఇట్టి స్వస్వరూప పరిపూర్ణ జ్ఞానమునే "ఆనందం బ్రహ్మణో విద్వాన్, న భేతి కుతశ్చన" బ్రహ్మా నందమును తెలుసుకొనినవాడు దేనినుంచిని భయపడడు. అనగా భయకారణ మైన తన అనాది అవిద్య నశించినది గనుక భయమును పొందడని శ్రుతి వచనము తెల్పుచున్నది. ఇంకను శ్రుతి యిట్టి మహనీయుని గురించి "అభ యం ప్రతిష్ఠాం విందతే" అని కూడ తెల్పుచున్నది. ఇదియే జీవునకు మోక్ష వివేకము. ఇదియే ముముక్షువునకు తన సతతాభ్యాస భావనాదార్ఢ్యములను బట్టి "భావనాదార్ఢ్యాత్సిద్ధిః" అను సూత్రవచనము ననుసరించి మోక్ష సిద్ధి కలుగును అనగా తత్స్వరూపుడగును.

# అద్వైతగ్రహణ మహిమ

ఎంతటి మహనీయులకైనను "నా భుక్తం క్షీయతేకర్మ" "ప్రారబ్ధ మనుభోక్తవ్యం" ఇత్యాది వచనములచే ప్రారబ్ధము ననుభవించుటయు, కర్మను చేయుటయు తప్పదు. 'నహికశ్చిత్ క్షణమపిజాతు తిష్ఠ త్యకర్మకృత్' అని గీతావచనము చెప్పుచున్నది. ఐనను దీనినంతటిని పోగొట్టుకొనుటకు ఒక్కటే యుపాయ మున్నది. అది యేదన అద్వైత తత్త్వజ్ఞానము. ఇదితప్ప వేరేశరణ్యములేదు. అద్వైత

తత్త్వజ్ఞాన మనగా లోగడ ఉదాహరించిన శ్రుతి స్మృతి ప్రామాణ్యములను గ్రహించి ఈ స్వశరీర సర్వదృశ్యము కల్పితము గాని, వాస్తవము కాద నిన్నీ, అనిత్య మనిన్నీ, నిశ్చయ ప్రీతిపూర్వకముగ తెలుసుకొన్న యెడల ఉన్న సత్యవస్తువు ఆబ్రహ్మ ఒక్కటియే, అదియే నేను, వాస్తవ పదార్థ మొక్కటియేగాని రెండవది లేదు, అని తెలుసుకొని తత్స్వరూపమే అప్పుడు ఉండునది తను ఒక్కడే గనుక తానే యీ సర్వదృశ్యాధిష్ఠానము. ఈ దృశ్య మంతయు కల్పితమను నిశ్చయమును పొందును. ఇట్టి మహానుభావునకు భయదుఃఖాదులు తొలగిపోవును. ఎందుచేతననగా—రెండవ వస్తువు యున్నది యని మనము అనుకొను నప్పుడే గదా భయము కలుగుచున్నది. అట్టి రెండవ సత్య వస్తువు లేదను నిశ్చయ జ్ఞానముచేత భయము నశించును. రెండవ వస్తువు ఉన్నప్పుడే భయకారణ మగుచున్నది. దీనినే "ద్వితీ యాద్వై భయంభవతి" అని శ్రుతి చెప్పుచున్నది. ద్వితీయ పదార్థస్ఫురణము అనగా నేను వేరు, ఈ సర్వదృశ్యము వేరు అనునదియే. ఇదియే అజ్ఞానము. ఇట్టి యజ్ఞానమును నిరూలించుకొని వాసనారహిత జగన్మిథ్యాత్వ నిశ్చయ జ్ఞానము చేత ప్రారబ్ధానుగత సర్వకర్మలను చేయుచుండిననూ అవి దగ్ధ బీజ న్యాయమున పునర్జన్మ హేతువులు కావు. దీనినే "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురు తేర్జున" అని శ్రీ కృష్ణభగవానులు చెప్పుచున్నారు. ఇట్టి ముముక్షువునకు జ్ఞానముచే సర్వ కర్మఫలములు నశించగా స్వస్వరూపమును పొంది తాను నిష్కాముడై శేషించును. ఇదియే ఆనందము. ఈ యానందమే బ్రహ్మ స్వరూపము. ఇట్టియానందము తారతమ్యములతో నైనను పొందుటకు కామరహితుడైన శ్రోత్రియుడై యుండవలయునని శ్రుతి చెప్పుచున్నది. అనగా శ్రోత్రియుడై సర్వకామములను విడచిపెట్టిన జిజ్ఞాసువు ఈ యానందమును తప్పక పొందును. ఇట్టియానందము బ్రహ్మ స్వరూపము గనుక ఆయనను తెలుసుకొని ఎంతయెంత సమీపమునకు వెళ్ళుచున్న అంతంత ఆనందమును పొందుచూ చివరకు ఆయానంద స్వరూపుడే యగును. ఇచట సమీపమునకు వెళ్ళుట యనగా తెలుసుకొనుట యని గ్రహించవలెను.

ఎందుచేతననగా ఆపరమాత్మ సదామనలోనే యున్నాడు. గాని మనము మాయావివశులమై ఆయన సత్యస్వరూపమును గ్రహింప లేకున్నాము. అట్లు పరిపూర్ణ గ్రహణము గలిగిన "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అని శ్రుతి తెలుపుచున్నది. ఐనను ఈ పరిపూర్ణ జ్ఞానానందములు అకామ హతుడైన శ్రోత్రియ ముముక్షువునకే కలుగునని "శ్రోత్రియస్య చాకామహతస్య" అను శ్రుతివాక్యము చెప్పుచున్నది. శ్రోత్రియుడనగా శ్రుతి ప్రామాణ్యమును గ్రహించిన సదాచారపరుడు—సుకృతకర పరిపాకముచే కొంత వరకు శ్రోత్రియుడగుచున్నను అకామహతుడగుటకు విచారము విశేష ప్రయత్నము అవసరముగా నున్నది. ఇట్టి విచారమనగా స్వశరీర, సర్వ జగని థ్యాత్వ నిరూఢి, నిశ్చయము. ఇందులో స్వశరీరము తాను అనగా "అహం" జగత్తు అనగా "ఇదం" మనకు కలుగుచున్న అధ్యాస యంతయు అహం అనగా నేను మమేదం అనగా నాది అనియే కలుగు చున్నది. దీనినే శంకర భగవత్పాదులు :—

"సత్యానృతే మిథునీకృత్య అహమిదం మమేదమితి నైసర్గికోఽయం లోకవ్యవహారః" అని భాష్యములో తెలుపుచున్నారు. ఇందు పండిత పామరులు ప్రతి వారున్నూ "జాతస్య మరణం ధ్రువం" అని తెలుసుకొని తనకు ముందు రాబోవు మరణమును నిశ్చయించుకొని మమేదం "నాది" అని అనుకొని తను సంపాదించిన దంతయు తన మరణానంతరము తను ఎట్లు చేసిన తనకు సుఖమో దానిని ఊహించి "వీలునామా" పత్రములను వ్రాసిపెట్టి మరణించు చున్నాడు. గనుక నాది అనున దంతయు తన ముందుసుఖము నూహించికోరుచు తగిన ఏర్పాటులను చేసుకొని మరణించు చున్నాడు. ఐనను బాగుగా విచారించిన నేను అనునది యున్నగాని నాది అనుట సంభవింపదు. సంభవించుటకు వీలులేదు. ఇట్టి ముఖ్యమైన "అహం" నేను అనగా తను అనుదాని స్వసుఖమును అజ్ఞుడై విచారింపక తను గాక తనది అను కొను దాని విషయమై సమస్త ఏర్పాటులను ప్రయత్నములను చేసి మరణించు చున్నాడు. గాని వాస్తవముగ తనది అనుకొను దానికన్న తాను ఎక్కువ

ప్రధానుడు అని గ్రహింపక తన మరణానంతరము తన సుఖమెట్టిది ? ఎట్లుండవలెను ? అను యోచనయున్న ప్రయత్నమును లేక మరణించు చున్నాడు. గాని శ్రుతి యీ మరణము భ్రాంతియను ప్రమాదముచే సంభవించు చున్నది గాని వాస్తవముగా లేదు అని చెప్పుచున్నది. "ప్రమాదం వై మృత్యుమహంబ్రవీమి" అను వాక్య మసత్యమగుటకు వీలులేదు. ఎందు కనగా,

శ్లో॥ పాషాణ ప్లవనంవాపి సిద్ధ్యేత్కాల విపర్యయే ।
నక్వచి చ్ఛ్రుతివాక్యానా మప్రామాణ్యంతు విద్యతే ॥

అని శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు. గాన శ్రుతి వాక్యతుల్యమైన యీ వాక్యమునకు గూడ అప్రామాణ్యశంకయుండదు. గాన విద్వాంసుడు విచారణ సి తెలిసికొని అనుభవమును పొంది ఈయమృతత్వ లాభమును సంపాదించవలసి యున్నది గనుక, ఈ మరణ మనగానెట్టిది ? అని విచారించి తదుపరి దాని నివృత్తి నాలోచింతము. ఇట్టి మరణమును తప్పించుకొన నిశ్చయించువారి కుపాయము తిరిగి జన ముసు పొందకుండు టేగాని వేరుకాదు. ఎంతటి ప్రజ్ఞావంతుడయిన మహానుభావునకయినను జన్మిం చినవానికి మరణము తప్పుట లేదని "జాతస్యమరణంధ్రువమ్" అను విద్వ దనుభవము చెప్పుచున్నది. కనుక విద్వాంసుడు ఈ మరణప్రవాహమును తప్పించుకొనుటకు అమృతత్వమును సంపాదించవలెను, అది బ్రహ్మజ్ఞానము నిదే కలుగదని "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి" అని శ్రుతివాక్యము చెప్పు చున్నది. ఆ బ్రహ్మ యెట్టివాడు— ఆ బ్రహ్మకు మనకు గల సంబంధమెట్టిది? అని తెలిసికొనినగదా యీ జ్ఞానమును పొందుట సంభవించును! ఇట్టిబ్రహ్మను "సత్యంజ్ఞానమనన్తం" (అసద్వాఇదమగ్రఆసీత్) "తత్సత్యంసఆత్మాతత్త్వ మసి" అని చెప్పుచూ "పూర్ణమదఃపూర్ణమిదంపూర్ణాత్పూర్ణముదచ్యతే।

పూర్ణస్యపూర్ణమాదాయపూర్ణమేవావశిష్యతే" అనగా సత్యజ్ఞానానంత స్వరూపమైన యీ బ్రహ పూర్ణము. ఈ ప్రపంచారంభమున అనగా సృష్టికిపూర్వమున అది ఒక్కటియే యుండెను– అదియే సత్యము- అదియే ఆత్మ– అదియేనీవు– ఈ ప్రపంచదృశ్యము పూర్ణము. ఇది పూర్ణమగు బ్రహలో నుండియే వచ్చినది. ఈ పూర్ణములోనుంచే పూర్ణత్వమును గ్రహించవలయును. చివరకు పూర్ణపదార్థమే మిగులును అని చెప్పుచున్నది. గాన మనమందరము ఈ ప్రపంచాంతఃపాతులము గనుక మనలో ప్రతియొక్క జీవుడున్ను, ఈ పూర్ణవస్తువునుండివచ్చి తిరిగి పూర్ణత్వమును పొందుటే పర్యవసానము– మోక్షమని ఈపై శ్రుతివాక్యములవల్ల స్పష్టమగుచున్నది. ఐనను ఈ అనాది అవిద్యా మాయా ప్రభావములచే వుడు తన సత్యపరిపూర్ణస్వరూపమునుమరచి పరిచ్ఛిన్నత్వదుఃఖిత్వములను గ్రహించి యీ జననమరణ ప్రవాహమును అనుభవించుచున్నాడు. దీనినే జీవుడు ప్రమాదమును పొందినవాడై మరణమును పొందుచున్నాడనని పైనుదహరించిన 'ప్రమాదంవై' అను వాక్యము నిరూపించుచున్నది. గాన ఈ జనన మరణరాహిత్యమును పొందుటకు తాను పరిపూర్ణుడు అను తన సత స్వరూపమును పొందుట యావశ్యకము. ఐననుపైన తెల్పినటుల అజ్ఞానావృతుడై పతివ్రూానవుడు తను గాని పదార్థమును తనది అని గ్రహించి ఏర్పాటులు చేసికొని మరణించుచున్నాడు. తిరిగి తిరిగి యీ జననమరణ ప్రవాహమున మునుగుచు సంసార దుఃఖముల పాలగుచున్నాడు. ఇట్టి అవాస్తవమైన తను గాని తనది అనుదానిని విడచి అనగా దానియందు నిరమానుడై సక్తతారాహిత్యముగ వదలి వాస్తవమగు తన సుఖస్వరూప విషయమై శ్రుతియుక్త్యనుభవములతో ఈ శరీర త్రయము తానుగానని జ్ఞానముచే తెలుసుకొని తజించి తనవాస్తవస్వరూపమైన పరిపూర్ణత్వమును గ్రహించి యనుభవమును పొందినయెడల పునర్జనరహితుడై అమృతత్వసిద్ధిని పొందును. ఇందు సంశయములేదు.

# బ్రహ్మానుసంధాన ప్రకార నిరూపణ

"శ్రోతవ్యోమ న్తవ్యో నిదిధ్యాసితవ్యః" అని శ్రుతిజిజ్ఞాసువుకు శ్రవణమైన తరువాత మననాదులను విధించుచున్నది మనన మన్నను అనుసంధాన మన్నను ఈషద్భేదమున్నను దాదాపు ఒక్కటిగనే గ్రహింపవచ్చును. ఇవి కలుగజేయు గుణలాభములు సమానముగా నుండును. 'మననములేని విద్య మరణము' అనిలోకోక్తియున్నది. ఏ విద్యకైనను దీని యావశ్యకత కనబడు చున్నది. జిజ్ఞాసువైనముముక్షువునకు ఈ యనుసంధానము విధియై ప్రాణపు పట్టుగా నున్నది. ఈ యనుసంధానమనునది బ్రహ్మ విద్యాభ్యాసకునకు రసాయనము వంటిది శ్రద్ధతో నాచరించిన నిది సాధకునకు సం విలాగున నుపకరించును. మోక్షసిద్ధికి ఇదియొక ముఖ్యసాధనము. విద్వాంసులు శ్రవణముజేసి యీ విద్యను గ్రహించినను మననానుసంధానములు లేక పైకిపోవుటకు సాధ్యము కాదు ఈ బ్రహ్మ విద్యానుసంధానమునకు పునరుక్తి దోషములేదు. చేయవల సినదియేమన, శ్రవణాదులచే గ్రహించి అనుకున్న విషయమే సహస్రశః ఫల పర్యంతము వృత్తివ్యాప్తితో పునః పునః అనుకొనుటే. ముముక్షువునకు ప్రయత్నసారాంశమేమనగా— స్వశరీరసర్వదృశ్యపరిత్యాగము, జ్ఞానసాధ్యమే గాని తదితరమువల్ల గాదని యిదివరకే విపులముగా నిరూపించియున్నాము. ఇట్టిత్యాగము దృశ్యసక్తతా మాన రాహిత్యమును సంపాదించుకొనుట మూల ముగ చిత్తవిక్షేపావరణాదులను తగ్గించుచున్నది. అనగా చిత్తమునకు దృశ్యా మానరాహిత్యముకాగానే చిత్తవిక్షేపాదులుగూడ నుపశమించును. ఇటుల చిత్తస్థైర్యమును చిత్తైకాగ్రతను సంపాదించుకొని తనయొక్క సత్య స్వరూపమును బాగుగా తెలిసికొని దాని దార్ఢ్యముకుగాను నిత్యానుసంధా సముజేయుచుండవలయును. ఇట్టిఅనుసంధాన ప్రక్రియను శబ్దానుసరణిగ ఇందు లోగడ వివరణ జేసియుంటిమి. ఇదిగాక ఇట్టి అనుసంధానములు శ్లోక రూపముగాను గద్యరూపముగాను పెక్కు ప్రసిద్ధ వేదాన్త ప్రకరణ గ్రంథము లందు పూర్వాచార్యులచే గం ర వాక్కులతో తెలుపబడి యున్నవి. అట్టివి

సిద్ధాన్త దార్ఢ్యము కలిగిన పండితవర్యులకే సుసాధ్యముగా నుండును గాని సామాన్యులకు గావను తలంపుతోను సామాన్యముగ శాస్త్రపాండిత ములేని వారలకు సామాన్య శబ్దార్థములు సద్వస్తువృత్తి కలుగుటకు సులభ సాధ్యముగా నుండునని అలషించుచు ఈ యనుసన్ధాన నిరూపణమును తిరిగి విపులముగ సర్వసామాన్య భాషలో వృత్తిగోచరమగునట్లు వ్రాయుచున్నాడను.

"అహం" నేను ఈ స్థూల దేహముగాని, ఇంద్రియములుగాని, సూక్ష్మ శరీరమైన అన్తఃకరణముగాని, అన్తఃకరణ పరిణామములైన మనోబుద్ధి చిత్తాహంకారములుగాని కాను. ఈ యన్తఃకరణ ప్రతిబింబ చైతన్యము అనగా—ఆభాసుడు నేను కాను. ఈ పంచభూతములుగాని. పంచ భూత వికారమైన యీ ప్రపంచముగాని, ద్రష్టా అనగా గ్రహించు వాడను గాని కాను. ఇవి యన్నియు కల్పితములు, ఆభాసములు, అవాస్తవములు. అనగా ఇవి యన్నియు కొన్ని యవస్థలయందు కొంతకాలము మాత్రముండి నశించును. చూడబడు ప్రతిపదార్థము నశించునదేగద ! అనగా మిథ్యాత్వమును పొందుచున్నది. నేను మాత్రము సర్వకాల సర్వావస్థల యందును అనుస్యూతముగ ప్రకాశించుచున్న వాడను. ఇట్టినాస్వరూపము సత్యమైనది. నేను అను ఈ అహం స్ఫురణకు నాశము కనబడుట లేదు.

శ్లో॥ అహంసర్వమిదం విశ్వం పరమాత్మాహమచ్యుతః ।
అహంకారా ధాయాసా కల్ప్యతే (కల్పితా) నతు వాస్తవీ ॥

అనగా—ఈ సర్వ ప్రపంచము, నాశరహితమైన పరమాత యును నేనేయై యున్నాను. అహం అను వ్యవహారము కల్పితముగాని, వాస్తవముగాదు అని శాస్త్రము చెప్పుచున్నది. ఇట్టితరి పాణిపాదాదిమాత్రుడనైన నేను ఈ సర్వప్రపంచ మెట్లుకాగలను ? "అహం" అనగా నాకు నాశము లేదని చెప్పుచున్నది. కాని మనము మరణమును స్వయముగా చూచుచు అనుభవించు చున్నాము. ఈ నేను "అహం" పరమాత్మయగు టెట్లు ? ఈ విచారణ వలన స్థూల సూక్ష్మ కారణ శరీరములు నేను అను

అహం, నేను కాదని నిశ్చయమగు చున్నది. ఈ యనుసంధాన కాలమున నేను అహంకారాదులు కాదు. అని ఊరక వాచా అనుకొనుటకంటే పూర్వము సయుక్తికముగ ఈ దేహాద్యహంకారములు మిథ్యయని మనము చేసిన నిరూపణలను జ్ఞప్తికి తెచ్చుకొని జడపదార్థములు నేను కాదను నిశ్చయమును సయుక్తికముగ పొందవలయును. కాన ఈ నేను అను అహం ఎట్టిదై యుండవలయును ? అని తన వాస్తవ స్వరూపమును వృత్తిచే అనగా మనస్సుచేత గుర్తించుటయున్నూ, అట్లు గుర్తించిన సద్వస్త్వనుభవ దార్ఢ్యము కొరకు ఈ క్రింది విధమున అనుసంధానము జేయుటయును ఆవశ్యకము. ఇట్లుకాక కేవల శబ్దోచ్చారణ మాత్రముగ జేసిన యడల ఫల మల్పము. కనుక ఈ యనుసంధానశబ్దముల నుచ్చరించునపుడు ఆ శబ్దముల యొక్క అర్థమును పూర్తిగా వృత్తి గోచరము జేసికొని అనుసంధానము జేయుట శ్రేష్ఠము.

ఈ తత్త్వజ్ఞానానుసంధాన ప్రాశస్త్యమును గురించి వసిష్ఠభగవాను లిట్లు చెప్పుచున్నారు. మోక్ష సంపాదనకు సాంఖ్యయోగ మార్గములు రెండును ప్రధానముగా చెప్పబడినవి. ఇందు తత్త్వజ్ఞానమును సంపాదించి అనుసంధానాదులచే సిద్ధిని బడయువారు సాంఖ్యులు.

అష్టాంగ యోగముచేత చిత్తశాంతిని పొంది మోక్షమును సంపాదించు వారు యోగులు ఇట్టి యోగులు మోక్షసిద్ధిని జ్ఞానము ? తనే పొందుచున్నారు. కాని తదితరము చేతకాదు. ఇట్టి మోక్షసాధనములలో వసిష్ఠులవారు తత్త్వాను సంధానమునకు ప్రాధాన్యమిచ్చియున్నారని యీ క్రింది శ్లోకములవల్ల బోధపడగలదు—

శ్లో॥ ఏకతత్త్వఘనాభ్యాసః ప్రాణానాంవిలయస్తథా ।
మనోవినిగ్రహశ్చేతి మోక్షశబ్దార్థసంగ్రహః ॥

ఒక్క ఆత్మ తత్త్వమునే నిరంతరముగ అనుసంధానము జేయుట, ప్రాణాది

వాయు నిరోధము, మనోనిగ్రహము, ఈ మూడే మోక్షశబ్దార్థములు. అనగా మోక్షసాధనములే మోక్షముగ — ప్రాధాన్యముకొరకు — చెప్పబడుచున్నవి.

శ్లో॥ ఏకార్థాభ్యసన ప్రాణరోధ చిత్తపరిక్షయాః ।
ఏకస్మి న్నేవ సంసిద్ధే సంసిద్ధ్యన్తి పరస్పరమ్ ॥

అనగా— తత్త్వానుసంధాన— ప్రాణనిగ్రహ— మనోనిగ్రహములలో నొకటి సిద్ధించిన అన్నియు సిద్ధించినట్లే. కాన ఈ తత్త్వానుసంధానము మోక్షప్రాప్తికి ముఖ్యసాధనమని గ్రహించవలయును.

— అనుసన్ధాన క్రమము —

అహం: అహం అను నేనులో తనుకాని జడపదార్థ సముదాయమును నిశ్చయించుకొని జ్ఞానపూర్వకముగా త్యజించి ఇప్పుడు తన స్వస్వరూపమును ఈ విధముగ అనుసంధించవలసియున్నది.

అహంసా : అహం నేను అనగా నా స్వరూపము సాక్షిమాత్రము— ఈ సుఖదుఃఖకర్తృత్వములు నాకులేవు — సాక్షియైనవాడు వ్యవహారములతో సంబంధపడియుండుటకు వీలులేదు — కేవలము ప్రేక్షకుడుగానే ఉండవలయును — నేను అట్టివాడను — సాక్షి—నాకు భ్రాంతిగా కలుగుచున్న ఈ సుఖదుఃఖానుభవములు కర్తృత్వభోక్తృత్వములు ఫలానుభవములు ఈ యంతఃకరణ ధర్మములుగాని, సత్యస్వరూపుడనైన నావికావు— నాకు కర్తృత్వాదులులేవు — నేను నిష్క్రియుడను—నిరవయవుడను—

అహంకూటస్థః — నేను కూటము (అనగా దాగలి) వంటివాడను. ఎన్ని వికారములు వచ్చినను దాగలి సమానరూపమైన నామీద ఆరోపింపబడు వస్తువులకేగాని, నాకేవికారము కలుగదు, కలుగుటకు వీలులేదు— నేను పరిణామ రహితుడను—ఎన్ని పరిణామములు కలిగినను దాగ

లిమీద చేయబడువస్తు సముదాయమునకేగాని దాగలి యెంతమాత్ర మును మారదు గదా! ఇది అందరకున్ను తెలసినవిషయమే. కనుక నేను కూటమువంటి నిర్వికారుడను.

అహం ప్రత్యగాత్మా:— నేను సర్వశరీరములందును అంతరుడనై — ఉపాధి సంబంధము ఎంతమాత్రము లేనివాడనై—సర్వోపాధులను ప్రకాశింప జేయుచు సర్వాన్తర్బహిర్వ్యాపకుడైన పరమాత్మనే — ఆపరమాత యున్ను ఈ ప్రత గాత యున్ను అయిన నేను అఖండ అద్వితీయు డను—ఆ పరమాత్మయే నేను. నేనే ఆ పరమాత్మగాని అన్యమనునది ఎంతమాత్రములేదు. ఈ విషయమునే "యదాహ్యేవైష ఏతస్మి న్ను దరమన్తరం కురుతే, అథ తస్య భయం భవతి" అను శ్రుతి భేదదృష్టి యెంతమాత్రము కూడదని చెప్పుచున్నది. కాన భేద మనునది ఇంచుకయైనను లేదు—ప్రత్యగాత్మ— నేను—ఆ పరమాత ఒక్కటియే. దీనినే జీవబ్రహ్మైక్యానుసంధానమని గూడ శాస్త్రము తెలుపుచున్నది. నేనైన ఈ ప్రత్యగాత్మయున్ను, సర్వాత్మకుడైన ఆ పరమాత యున్ను ఒక్కటియేయని వృత్తిచే గ్రహించి అనుసంధానము జేయవలెను.

శివోఽహం ఇట్టి ప్రత్యగాత స్వరూపుడనైన నేను "మంగళానాంచ మంగళమ్" అని మంగళములలో మంగళమైనవాడను—సర్వోత్కృష్టుడను- నాకంటె మంగళకరమైన ఇతరవస్తు వేదియున్ను లేదు—అనునిశ్చయ ముతో అనుసంధానమును చేయవలెను

శాన్తోఽహం : ఇట్టిప్రత్యగాత స్వరూపుడనైన నేను ద్వైతరహితుడను. అనగా శాంతుడను-శాంత మనగా ద్వైత ప తిరాహిత్యము-ఈ కల్పిత మైన నామరూపములలో ద్వైతప్రతీతికలుగుచున్నది—ఇదియే ప్రపం చము—అధ్యస్తము—కల్పితము—ఇట్టి కల్పితనామరూప స్వరూపమును త్యజించగా శేషించునది అఖండ శుద్ధ పరిపూర్ణచైతన్యము. ఇదియే

నా స్వస్వరూపము—అద్వితీయ అఖండ సంవిత్స్వరూపము—ఇదియే నేను —అని అనుసంధానము చేసిన శాంత ప్రవృత్తుడగును.

అనన్తోఽహం : నేను అనంతస్వరూపుడను— అనగా దేశ, కాల, వస్తు, పరిచ్ఛేదరహితుడను—ఇట్టిదేశకాల వస్తుపరిచ్ఛేదరహితత్వమే అఖండత్వమని తెలిసికొనవలయును—అఖండమనిననూ, అనంతమనిననూ ఒకటియే— తను ఇట్టి పరిచ్ఛేదరహితమైన అద్వితీయ అఖండవస్తువని వృత్తిచే గ్రహించవలయును—ఇదియే అఖండాకారవృత్తియనబడును— ఇదియే అపరిచ్ఛిన్నవస్తువు.

సంవిత్స్వరూపోఽహం : సంవిత్ అన్నను జ్ఞానమన్నను ఒక్కటియే — నేను ఈ సర్వదృశ్యమునకు అధిష్ఠానముగా నుండి సర్వదృశ్యరహితముగ బ్రహ్మాండంబును నిండియున్న మహాచిత్తునై యున్నాను—ఇదియే నా స్వరూపము—ఈ నా మహాచిత్స్వరూపము మహాసంవిత్ స్ఫటిక మహా శిలవలె స్వప్రకాశమైయున్నది—ఇదియే నేను. నాయందే యీ సర్వ దృశ్యము రజ్జుసర్పవత్ భ్రాంతికల్పితముగా నున్నది—కాని నాకున్నూ ఈ సర్వదృశ్యమునకున్నూ ఎట్టి సంబంధమున్నూలేదు — ఈ భూత పంచక, ఆధ్యాత్మిక, ఆధిభౌతికము లన్నియు చిదాకాశస్వరూపుడనైన నాయందే భ్రాంతి కల్పితములై చూడబడుచున్నవి - జ్ఞానమే నా స్వరూపముగాన నేను తెలియబడువాడను గాను ఐనను,

శ్లో॥ అదృశ్యోదృశ్యతేరాహు ర్గృహతే సయథేన్దునా ।
తథానుభవమాత్రాత్మా దృశ్యేనాత్మావలోక్యతే ॥

అనగా చూడశక్యము గాని వాడైన రాహువు తాను గ్రహించిన చంద్రునితో గూడి యెట్లు కనబడు చున్నాడో, అట్లు అనుభవ మాత్రుండగు నాత్మ, దేహాద్యుపాధులతో గూడి కనబడు చున్నాడు గాని, నిరుపాధికముగ కనబడడు. ఐనను అందరిచే వీడు అనుభవింప

బడుచున్నాడు. అటువంటి కేవల జ్ఞానస్వరూపుడను నేను — జ్ఞానమే నాస్వరూపము — నాలో యున్నది జ్ఞానము నేను సంచరించునది జ్ఞానములోనే - దృశ్యరహిత జ్ఞానము నా స్వరూపమై యున్నది - నా స్వరూపము సంవిత్స్వరూప అఖండ స్ఫటిక మహాశిలవంటిదని చెప్పియే యున్నాము. కనుక నే నేను అనన్త — అద్వి యు - అఖండ- శాంత శివస్వరూపముతో సదా ప్రకాశించుచున్నాను.

అవ్యయోఽహం : నేను నాశరహితుడను - వ్యయరహితుడను-అనగా అనన్త జీవులును (ఎంతమంది యైనను) నన్ను వాడుకున్న యడల (అనగా అనుభవము పొందినను) నేను తరుగు వాడను కాను.

చిత్స్వరూపోఽహం : నేను చిత్స్వరూపుడను - అనగా దృశ్య సంబంధ రహితమైన చిత్స్వరూపుడను—ఎందుచేతననగా-దృశ్య సంబంధసహితమైన చిత్తే ప్రపంచ రూపమున భాసించు చున్నది—అనగా జగదధిష్ఠానము చిత్తు దీనియందు అధ్యస్తము జగత్తు — దృశ్యరహితమైన చిత్తు నేనే — ఆ బ్రహ్మము నేనే అని తెలిసికొని — ఇంకను,

శ్లో॥ చిదాత్మాఽసి నిరంశోఽస్మి పారావార వివర్జితః ।
రూపంస ర నిజంస్ఫారం మాస్మభ్రాత్యా సంమితోభవ ॥

నేను ఆద్యన్తరహితుడను — నిరవయవుండను — చిదాత్మ నేయగుదునని నీవు నిజరూపమును తలంపుము. నీ నిజరూపమును మరచి పరిచ్ఛిన్నుడవు కాకుము. అని పై శ్లోకము చెప్పుచున్నది. కాన నేనట్టి చిద్రూపుడనని వృత్తిచే గ్రహించి అనుసంధానమును చేయవలయును.

అహం సర్వాధిష్ఠానః : నేనే ఈ సర్వ దృశ్యమునకు అధిష్ఠానము - అనగా, ఈ సర్వదృశ్యము కేవల జ్ఞాన స్వరూపుడనైన నాయందు అధ్య

స్తమై రజ్జు సర్పవత్ భాసించు చున్నది — కాని వాస్తవముగా లేదు— అనుజ్ఞానముతో స్వశరీరసహిత జగని ధ్యాత్వమును గ్రహించి తన వాస్తవిక సంవిద్రూప — స్వప్రకాశ — అద్వి య — అఖండ లక్షణ ములతో అనుసంధానమును చేయవలయును.

అహం స్వప్రకాశః : నేను స్వప్రకాశుడను—ఎట్లనగా జగత్తంతయును పర ప్రకాశముచే భాసించు చున్నది. కాని స్వసత్తచేత భాసించుట లేదు— ఎందుచేతననగా బ్రహ్మేతరము లన్నియు, అనగా ఈ ప్రపంచ దేహాదు లన్నియు, జగత్తు—కల్పితముగా నున్నది—అజ్ఞాన స్వరూపు డైన బ్రహ్మయే సర్వమునకు అధిష్ఠానముగా నుండి యీ సర్వమును భాసింపజేయుచున్నాడు — దీనినే శ్రుతి "తస్య భాసాసర్వమిదం విభాతి" అని తెలుపుచున్నది — అందుచే పరాపేక్షలేక స్వచైతన సత్తామాత్రముచే ప్రకాశించు వాడను నేనొక్కడనే — అహం అను నేనే ఇట్టి జ్ఞాన స్వరూపుడనై స్వప్రకాశుడనై యున్నాను. నాకన్న నితర మంతయు జడము — పరప్రకాశ్యము — అని అనుసంధాన మును చేయుచూ తన ప్రకాశము పరాపేక్ష లేనిదిగను, స్వప్రకాశమని గ్రహించ వలయును.

అహం సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితః : నేను ఎట్టి భేదములును లేనివాడను అనగా నేను అగు బ్రహ్మతో సమానమైన మరియొక భేదవస్తువు గాని లేక నాకన్న స్వల్పాధిక్యములు గల మరియొక భేదవస్తువు గాని, లేక నాయందుననే భిన్న న్నములుగా యెట్టి భేద ములు గాని లేక భేదరహితుడనై యున్నాను. ఈ భేదములు మాయా కల్పితములని శ్రీ శంకరభగవత్పాదులు,

శ్లో॥ విశ్వం పశ్యతి కార్య కారణ తయా స్వస్వామి సంబంధతః ।
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః ॥
స్వప్నే జాగ్రతివా య ఏషపురుషో మాయా పరిభ్రామితః

అని ఇట్లుభేద దృష్టికి భ్రాంతియే కారణమని విస్పష్టముగా తెలుపు

చున్నారు. గాన ఈ భేదములన్నియూ మాయా కల్పితమని గ్రహించ వలయును. *సజాతీయ భేదము* అనగా ఒకేజాతికి సంబంధించిన వివిధ ప్రకారములు — అనగా పశుజాతిలోను, వృక్షజాతిలోను, లోహజాతి లోను అనేక భేదములున్నట్లున్ను పశువులన్నియు ఒక్కటియైనను గోవుకు అశ్వమునకు లాగున వృక్షములన్నియు ఒక జాతియైనను మామిడి, మర్రి, మారేడు చెట్లలాగునను — లోహము లన్నియు ఒక జాతియైనను బంగారు, రాగి, ఇనుములకు గల భేదములాగున —ఈ మొదలైన వన్నియు సజా య భేదములని చెప్పబడును — ఇట్టి భేదములున్ను, *విజా య భేదము* — జాతులు న్న భిన్నమై భేదిం చుట — అనగా మనుష్య జాతి, పశుజాతి, వృక్ష జాతులకున్న భేదము వంటిది — ఇట్టి భేదము లున్ను, *స్వగత భేదము* ఒకే వస్తువునందు గల భేదములు — అనగా ఒక్కడైన మనుష్యునకే శిరస్సు, కంఠము, హస్తములు, పాదములు మొదలగు భేదముల వలెను, ఒక్కటైన వృక్ష మందు కొమ లు, ఆకులు, పూలు, ఫలములు లాగున నుండు భేదము స్వగత భేద మని యెరుగవలయును—ఇట్టి భేదములున్నా సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, చైతన్య స్వరూపుడనైన నాయందు ఈపైనతెలుపబడిన త్రివిధ భేదములు గాని, మరియెట్టి భేదమను వార్తగాని నా యందు లేదు — సంభవించదు — అనగా నేను అఖండ, నిర్వికార స్వరూపు డను—నాస్వరూపములో ఎప్పుడును ఎచటను ఎట్టిభేదము కలుగుటకు వీలులేదు — నేను అఖండ, నిరవయవ, నిర్వికార స్వరూపుడను—

*అహంనిరవయవః* : నేను అవయవరహితుడను — అనగా భేదమున్నగాని అవ యవములుండుటకు వీలులేదు కదా — అట్టిభేదము ఇంచుకయైనను లేదు గనుక నేను అవయవరహితుడను, అఖండ పరిపూర్ణ స్వరూపుడను.

*అహంనిత్యః* : నేను వికార నాశములు లేనివాడను — అనగా దాదాపు నిత్య మన్నను సత్యమన్నను ఒక్కటియే—నిత్యమైనదే సత్యమగును—సత్య

మైనదే నిత్యమగును—కాని మరియొకటి కాజాలదు—సత్యమనగా కాల త్రయ, అవస్థాత్రయ, అబాధిత, వికారరహితమైనది—ఇట్టి సద్వస్తువే నేను—నా కన్న సత్యవస్తువు లేదు—నాకు నాశములేదు. అని అను సంధానమును చేయవలెను.

అహం నిరతిశయః : నాకంటె అతిశయముగల వస్తువుగాని, నాతో సరిసమాన మైన వస్తువుగాని, నాకంటె తక్కువదిగాని యింకొకటిలేదు — అనగా నిత్యమై అద్వితీయుడుగాయున్న వస్తువు నేనొక్కడనేగాని మరి యొకటి లేదు— వాస్తవములో తనకన్న రెండవవస్తువే లేనప్పుడు తన కన్న నతిశయితమైన వస్తువుండుట అసంభవముగదా ! కనుకనే నేను నిరతిశయుడను, నిరుపమానుడను—అని సదా అనుసంధానమును చేయవలయును. అతిశయ మనగా తనకన్న మించినది తనతో సమా సమగు నింకొక వస్తువేలేనప్పుడు తనకుమించిన మరియొక వస్తువుం డుట అసంభవమేగదా !

అహం అద్వితీయః : నేను రెండవవస్తువు లేనివాడను. అనగా ద్వితీయ సద్వస్తువు ఉన్నయెడల అద్వైతసిద్ధాంతమే యుండుటకు వీలు దు గదా ! ఎంత శ్రుతియుక్త్యనుభవములతో సుతర్కపూర్వకముగ విచారణచేసినను—సయుక్తికముగానున్న శ్రుతివచన, షడ్విధతాత్పర్య నిర్ణాయకలింగములతో చూచినను ముముక్షువునకు అద్వైతముతప్ప వేరు శరణ్యము కనబడుటలేదు. దీనినంతటిని మనస్సుచే గ్రహణ మునుజేసి నేను అను తనకన్న ద్వితీయ వస్తువు లేదని నిశ్చయించు కొని అనుసంధానమును చేయుటే అద్వితీయత్వమును సంపాదించుట. అనగా ఇదియే అద్వైతసిద్ధాంతము అనితెలిసికొనుట. "ద్వితీయాద్వై భయంభవతి" అనుశ్రుతి రెండవ వస్తువున్నప్పుడే భయము కలుగునని ఘంటాపథముగ తెలుపుచున్నది. ఎవరునూ భయమును కోరరుగద— భయరాహిత్యమును కోరుదురు — కాన నేను అను తను ఎల్లప్పుడును

అద్వితీయుడుగా ఉండవలయును. వేరుదారిలేదు—అట్లు ఒకానొకడు ద్వైతమును గ్రహించినను అది మిథ్యయే — ఐనను అవాస్తరసాధన మగునుగాని, సాక్షాత్సాధనముగాని, సిద్ధాంతముగాని, కానేరదు. అని ముముక్షువు గ్రహించవలెను.

అహంఅసంగః . నేను అసంగుడను — సంగమనునది భేదముగాని, రెండవ వస్తువుగాని ఉన్నప్పుడే సంభవముగాని, లేనియడల సంభవముకాదు. ఈ రెండున్ను ఆ పరమాత్మ డనైన నాయందు అనగా నేను అహం అను వానియందు వాస్తవతః రెండవ పదార్థములేదని నిరూపించి, నిశ్చయించితిమిగదా—ఇదిగాక ఒకవేళ కల్పిత ద్వితీయ వస్తువున్నను ఈ సద్వస్తువైన బ్రహ్మ ఆకాశమువలె అసంగుడు. దీనినే "అసంగో హ్యయంపురుషః" ఈ పురుషుడు అసంగుడు అని శ్రుతి తెలుపు చున్నది. ఆకాశము సర్వత్రవ్యాపించియున్నను ఉపాధిస్థితమైన గుణ దోష లక్షణములను ఎట్లు స్పృశించుటలేదో అట్లే యీ బ్రహ్మ సర్వాంతర్బహిర్వ్యాపకుడై, సర్వదృశ్యాధిష్ఠానముగాయున్నను — ఈ దృశ్యముతో ఎట్టిసంబంధమును పొందదు — ఎట్టివికారమునుపొందక సర్వదా అది స్వరూపముతో యుండును. ఎట్లనగా — శుక్తిరజిత భ్రాంతియందుగాని, రజ్జుసర్పభ్రాంతిస్థలములోగాని అధ్యస్తమును మాయము భ్రాంతి చూచినప్పుడుగాని లేక భ్రాంతినివర్తకమైన అధి ష్ఠానగ్రహణము కలిగినప్పుడుగాని అధిష్ఠానమున కెట్టిమార్పును కలు గుటలేదుగదా! అట్లే యీ జగదధిష్ఠానమైన బ్రహ్మ అధ్యస్తముతో నెట్టిసంబంధమునుపొందక సర్వదా ఏకరూపుడై అసంగుడై యుండును. ఇదియే నా సత్యస్వస్వరూపము. కనుక నేను సర్వదా అసంగుడను అని నిశ్చయించి తెలిసికొని అనుసంధానమును చేయవలయును.

అహంఅవ్యక్తః: నేను తెలియబడువాడనుకాను — ఎందుచేతననగా నేను జ్ఞాన స్వరూపుడను. జ్ఞానమే నా స్వరూపము. జ్ఞానము తెలియబడునదికాదు.

చూడబడునదికాదు—జ్ఞానము తన స్వస్వరూపమై యున్నందున తనను తానెవ్వరును చూచుకొనలేరుగద ! అనగా ఇచట ఒక శంక కలుగును. లోకములో ప్రతివాడును నేను అని చెప్పుట, గ్రహించుట, కనబడు చున్నదిగదా ! తెలియకపోవుటెట్లు? అని సందేహము కలుగును — ఇచట నేను అనుకొనువాడు భ్రాంతుడు — ఉపాధిస్థితుడు — ఇట్టివాడు అధ్యస్తమైన ఉపాధినే నేను అనితెలిసికొని స రించుచున్నాడు. కాని వాస్తవమైన తన స్వస్వరూపముకాదు. వాస్తవమైన తన స్వరూపము ఏకము, అద్వితీయము అగుటచే చూచువాడొకడు, చూడబడువాడు ఒకడున్నూ వాస్తవముగాలేరు—ఇట్లే తెలిసికొనువాడొకడు, తెలియ బడువాడొకడున్నూ వాస్తవముగాలేరు — మరియేమన ఇదియంతయు కల్పితము—భ్రాంతిజ్ఞానము—ఇదియంతయు అవిద లోనిదే — అవిద నశించి భ్రాంతిజ్ఞానము విలయముకాగానే తను అవ క్తుడగును. అనగా జ్ఞానస్వరూపుడగును—కాని ఇది తెలుసుకొనబడునదిగాని, తెలిసికొన బడలేనిదిగానికాదు-దీనినే "నాహమన్యే సువేదేతి నోనవేదేతి వేదచ। యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనమ్" అని శ్రుతిగురుశిష్యుల సంవాదమున జెప్పుచున్నది, నీవు 'బ్రహ్మను నేనుబాగుగా తెలసి కొన్నాను' అని భావించినయడల అది అల్పమేయగును. అనగా నీకు బ్రహ్మ గోచరించలేదని స్పష్టము - అని గురువుగా రనగా శిష్యుడు తనకు కలిగిన వేదాన్తానుభవమును చెప్పుచున్నాడు—నేను బాగుగా తెలి సినదనిగాని, తెలియలేదనిగాని అనుకొనుటలేదు. కాని తెలిసికొనియు న్నాను, అని పై శ్రుతివాక్యతాత్పర ము. కాన తన స్వరూపమైన జ్ఞానము తెలియబడునదికాదు. గాని అనుభవరూపము మాత్రమే యగుచున్నది. కాన నే నవ్యక్తుడను.

నాఽహంకర్తా, నాఽహంభోక్తా : నాకుకర్తృత్వభోక్తృత్వములులేవు—ఎందు వల్లననగా—అద్వితీయుడనుగనుక. తన సత్యస్వరూపమొక్కటియేకాని న్న న్నముగాలేదు — తనస్వరూపమైన సద్వస్తువు అద్వితీయమై,

నిరవయవమై, భేదరహితమైనదిగాన ఇట్టియొక్క వస్తువునందు కర్తృత్వ భోక్తృత్వములు సంభవించుటకు వీలులేదు—ఈ కర్తృత్వభోక్తృత్వములు అంతఃకరణకల్పితభ్రాంతిజ్ఞానములుగాని, వాస్తవములుగావు—కాన నాకుసంబధించినవికావు—నేను వాస్తవ అద్వితీయ స్వరూపుడనై యున్నాను—నాకు కర్తృత్వభోక్తృత్వములులేవు— అవి అన్తఃకరణమైన ధర ములని నిశ్చయించుకొని వానితో తనకెట్టి సంబంధములేదని సర్వదా అనుసంధానమును చేయుచుండవలయును.

అహంఅఖణ్డః : నేను ఎట్టి విభాగములుగాని, పరిచ్ఛేదములుగాని లేనివాడను అనగా దేశకాలవస్తు పరిచ్ఛిన్నత్వరహితుడను — దేశముచేతగాని కాలముచేతగాని, వస్తువుచేతగాని పరిచ్ఛిన్నత్వము — అనగా విభజింపబడుట, అదిలేకపోవుట అఖండత్వము — ఇట్టి అఖండత్వానుభవము మనలకు సుషుప్తిలో కలుగుచున్నది — సుషుప్తియందు (గాఢనిద్రయందు) దేశముగాని, కాలముగాని, ఈ వస్తువనిగాని ఏమియును స్ఫురించుటలేదుగదా — అనగా ఈ దేశకాలవస్తువులు కల్పితములు గనుక సుషుప్తియందు ఇవియును గనబడక అజ్ఞానావృతమై తన స్వస్వరూపమందు పుణ్యఫలములచేత తాత్కాలికముగానుండి అఖండ సుఖమును పొందుచున్నాడు. ఇది అప్రయత్నముగా సిద్ధించుచున్నది. ఇట్టిస్థితియందు అహంకారము అజ్ఞానములో లయమగుచున్నది—కాని నశించుటలేదు. కాన సాధకుడు ఇట్టి అఖండానుభవస్థితినే ప్రయత్న పూర్వకముగ సమాధిదశయందు అనుభవించుచున్నాడు — ఇట్టి ప్రయత్నముచేతనే కాలాంతరమందు వారి యీ యజ్ఞానము నశించుచున్నది. కాని సుషుప్తియందు ఇట్టి యజ్ఞానము సుప్తముగానుండి జీవుల ప్రారబ్ధానుసరణకుగాను తిరిగి విజృంభించి సంసారదుఃఖమును చర్విత చర్వణముగా కలుగజేయుచుండును. జ్ఞానాభ్యాసకు లిట్టి సంసారదుఃఖ అత్యన్తికరాహిత్యమునకుగాను సమాధ్యభ్యాసముల ప్రయత్నముచే

అఖండానుభవసుఖమును పొందుచు భావనాదార్ఢ్యముచే ఇట్టి యజ్ఞానమును నశింపజేయు అఖండత్వమును పొందుదురు. కాన ముముక్షువైనవాడు ఇట్టిదే యఖండానుభవమని తెలిసికొని దానిని నిత్యానుభవము నొందుటకు అనుసంధానమును చేయవలెను.

*నిష్కలంకో౽హం :* నేను కళంకరహితుడను. అనగా నాకు దుఃఖముగాని పాపముగాని లేదు—ఎందుచేతనగా కర్తృత్వ భోక్తృత్వములు నాకెంత మాత్రము లేవు గనుక ఈ దుఃఖపాపములు నన్ను అంటజాలవు—నేను దోషరహితుడను—నేను నిత్యసుఖస్వరూపుడను. కనుక నన్ను పుణ్య పాపము లంటుటకు వీలులేదు. ఇవి యన్తఃకరణ ధర్మములు గాని నావి కావు.

*అహం అవస్థాత్రయాబాధితః :* నేను అవస్థాత్రయములోను అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి లను మూడవస్థలయందున్ను నేను ప్రకాశించుచు నా అనుభవమును పొందుచున్నాను—జాగ్రత్స్వప్నములలో అనుభవములు సర్వులకున్ను తెలియుచునేయున్నవి. కాని సుషుప్త్యనుభవమును కొంచము వివేచనజేసి చూచినగాని తెలియుటలేదు. ఎట్లనగా, సుషుప్తి నుండి మేల్కాంచినవాడు 'ఇంతకాలము సుఖముగా నిదురపోతిని, నాకేమియు తెలియలేదు' అని తనకు గలిగిన సుఖానుభవమును — 'ఏమియు తెలియలేద'ను అజ్ఞానానుభవమును స్మరించుచున్నాడు—ఇట్లుచేయు స్మరణము నేను అను తన యనుభవమేయై యుండవలయునుగాని, మరియొకని యనుభవము తనకు స్మరణకు వచ్చుటకు వీలులేదు— సుషుప్తియందు అంతఃకరణముగూడ అజ్ఞానములో లయమగుచున్నది గాన అదియు నుండుటలేదు గదా—దీనినిబట్టి ఈ నేను అను ప్రత్యగాత్మయే జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూడవస్థలయందును ప్రకాశించుచు అనుభవమును పొందుచున్నాడని గ్రహించవలయును కాన ఆయన ప్రత్యగాత్మయైన నేను అవస్థాత్రయాబాధితుడను అను జ్ఞానముతో అనుసంధానమును చేయుచుండవలయును.

అహంకాలత్రయాబాధితః: నేను కాలత్రయములోను అనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలములు మూడింటిలోను నిత్యుడనై యున్నాను. ఎట్లనగా — వర్తమాన కాలములో ఎట్టివాడును నన్ను నేనెరుగననిగాని నేను లేననిగాని చెప్పుటలేదు — ఎప్పుడును ఒకవేళ అంధకారములో నున్ననుగూడ 'నేనున్నాను' అని తనను తాను వర్తమాన కాలములో గుర్తించుచున్న విషయ మందరికిని అనుభవములో నున్నదే—— ఇట్లే యీ జన్మలో తాననుభవించుచున్న సుఖదుఃఖములు తనపూర్వజన్మ ఫలము లనియు, సుఖవంతుడు క్రిందటి జన్మలో ఎంతటి పుణ్యమును చేసితినో యనిన్ని, దుఃఖవంతుడు క్రిందటి జన్మలో ఏదో ఘోర పాపమును జేయుటచే నిప్పు జన్మలో కష్టము ననుభవించుచున్నాననిన్ని తనను పూర్వజన్మ అనగా —— భూతకాలములో గూడ తానున్నట్లు గుర్తించుచున్నాడు — ఇట్లే తానీజన్మలో యజ్ఞయాగాది పుణ్యకర్మలను చేసినయడల వచ్చేజన్మలో పుణ్యఫలమనుభవించెదననిన్ని, పాపకార్యములు చేసిన కష్టము సంభవించు ననిన్ని భయపడుచు నేను ఐన తనను భవిష్యత్కాలములో అనగా ముందు జన్మలో గూడ గుర్తించు చున్నాడు. కాన ఈ విధముగ నేను అను తాను త్రికాలములలోను బాధింపబడక ప్రకాశించుచు అనుభవమును పొందుచున్నాడు. ఈ యనుభవమునకు కర్మ శాస్త్రి సంవాదముండుటచే ఇది భ్రమ యనుటకు వీలులేదు. కనుక తను ఐన నేను త్రికాలాబాధ్యుడను అని నిశ్చయముగా తెలిసికొని అనుసంధానమును చేయవలయును.

అహం సర్వాత్మకః: నేను — సర్వులకును ఆత్మయై యున్నాను—ఒకేదారములో న్న భిన్న మణులు గ్రుచ్చబడినట్లు అందరు వులును నాయందే యున్నారు. అనగా సర్వదా ఆత్మ యొక్కడే న్న వులయందు వారి వారి యంతఃకరణ ధర్మములను ప్రకాశింపజేయుచు ప్రత్యగాత్మ యను నామమున నున్నాడు. కాన ఈయనకు భ్రాంతిగూడ మనయనుభవమును

బట్టి ప్రక్రియానుకూలముగ కల్పించినదే గాని వాస్తవముకాదు. ఐనను అవిద్యానుభవమును బట్టి నానా వభ్రాంతి కలిగినదని సిద్ధాన్త కల్పనగా తెలిసికొని యిట్టి భ్రాంతి కల్పితములేనని తెలిసికొన్న జీవుడు ఒక్కటియైన యా పరమాత్మ రూపమును పొంది ముక్తుడగు చున్నాడు. కాని ఆత్మ సదా ఒక్కడే—ఇట్టివాడే తాను అను నేను అని గ్రహించి సదా అనుసంధానమును చేయుచుండవలెను.

నిష్క్రియోఽహం : నేనెట్టి పనులున్ను చేయువాడను కాను — నేనవయవ రహితుడనుగాన క్రియారహితుడను. నేను జ్ఞానమాత్రస్వరూపుడను.

అచలోఽహం : నేను కదలిక లేని వాడను. అనగా—గమనాగమనములు లేని వాడను. పరిపూర్ణుడను గనుక రాకపోకలుకలుగవు-నేనచలుడను—దీనినే "వృక్ష ఇవ స్తబ్ధో దివితిష్ఠత్యేక స్తేనేదం పూర్ణంపురుషేణ సర్వమ్" అనగా నేను అను నీపురుషుడు వృక్షములాగున కదలికలేక అంతటను (సర్వమును) వ్యాపించి యున్నాడని శ్రుతి చెప్పుచున్నది. ఇదియే నా సత్యస్వరూపము గనుక నేను చలనము లేనివాడను — గీతలలో గూడ "అచలోఽయంసనాతనః" ఈ పురాణ పురుష డచలుడు — అని తెలుపబడినది. కాన నేనట్టివాడనని అనుసంధానమును జేయ వలయును.

నిర్గుణోఽహం :— నేను గుణా తీతను — నాయందెట్టి గుణములును లేవు — నిర్గుణమే స్వరూపము కలవాడును — నేను గుణరహితుడను, గుణా తీతుడను గాని, గుణసంయుక్తుడను గాను - కాన నిర్గుణమే నాస్వరూ పము—నేను త్రిగుణా తీతను—

అహంనామరూపరహితః :— నేను నామరూప రహితుడను — ఎందుచేత ననగా నామరూపములు కల్పితములు — అవాస్తవములు — నేను వాస్తవ సత్య స్వరూపుడ నగుటవల్ల కల్పిత నామరూపాదులు

నన్నంటవు — నామరూపములు నాయందు కల్పితములు — అధ్యస్త ములుగా నున్నవి — ఇవి దృశ్య సంబంధ కల్పితములే గాని నావి కావు — నేను నిర్వికారమైన అధిష్ఠాన మాత్రమై యున్నాను — సర్వ వ్యాపకమైన శుద్ధ చైతన్య స్వరూపమే నాది, కాని వేరేదియును గాదు — నేనే సర్వాధిష్ఠానము — నామరూపములు నాయందు రజ్జు సర్పము లాగున భ్రాంతి కల్పితములుగా నున్నవే గాని వాస్తవముగ లేవు గాన నేను నామరూప రహితుడను, నిర్వికారుడను, నిరంజనుడను.

అహం పరమాత్మాఽభిన్నః :- ప్రత్యగాత్మ స్వరూపుడనైన నేనే పరమాత్మను- ప్రత్యగాత్మ పరమాత్మ లొక్కటియే గాని భిన్నములుగావు. ఈ విష యమై స్థూల దృష్టాన్తముతో చాలా విపులముగ లోగడ నిరూపణ జేసియున్నాము. దానిని జ్ఞప్తికి తెచ్చుకొని వృత్తి వ్యాప్తిచే "నేను ఆపరమాత్మ ఒక్కటియే" అను నిశ్చయముతో అనుసంధానమును చేయవలయును — ఇదియే వబ్రహ్మైక్యానుసంధానము — మహా వాక్య ముఖ్యతాత్పర్యమై యున్నది — దీనిని గురించి విమర్శ చాలా చేసియున్నాము. తిరిగి యిచట చేయుట గ్రంథ విస్తరణ మగుసను తలంపుతో సవిస్తర నిరూపణము నిచట చేయుట లేదు — కాన అను సంధానపరులు సావధానచిత్తులై యీ ముఖ్యాంశమును వృత్తి గోచరమును చేసికొని అనుసంధానమును జరుపుచుండ వలయును.

నిరాశ్రయోఽహం :— నేను నిరాశ్రయుడను—అనగా నేను సత్య స్వరూపుడను గనుక నాకు నేనే ఆశ్రయమై యున్నవాడను — నాకు నేను మించి వేరు సత్యవస్తువు ఆశ్రయమునకు లేదు గనుక నేను స్వాధిష్ఠితుడనై యున్నాను— సర్వజగత్తునకు నే నధిష్ఠానమై నాయందు కల్పితముగ జగత్తు ప్రకాశించుచున్నది గాని, వాస్తవముగాలేదు — జగత్తుభ్రాంతి కల్పితము - భ్రాంతి నిరధిష్ఠానముగా కలుగుటకు వీలులేదు-కాన సత్య

స్వరూపుడనైన నన్నాశ్రయించి అనగా నాయందు భ్రాంతిత్వేన అధ్యస్తమై సర్వము ప్రకాశించు చున్నది. కాన మిథ్యయే—నేను సత్య, నిత ,శుద్ధ, బుద్ధస్వరూపుడను-అద్వి యుడను గనుక నాకు ఆ శ్రయము నేనే గాని వేరేదియును లేదు అని యనుసంధానమును చేయవలయును.

*నిర్విశేషోఽహం:*— నేను నిర్విశేషుడను — అనగా నాకు మించినదిగాని, నన్ను మించినదీ, ఏమిన్నిలేదు — "సర్వంఖల్విదం బ్రహ్మ" అని శ్రుతి సర్వశబ్దముచే అంతయు నేను ఐన బ్రహ్మ గానే తెలుపుచున్నది. సర్వదృశ్యము అనగా జగత్తు సవిశేషము — అది బాధనొందగా సద్వస్తువగునేను బ్రహ్మను మిగులుచున్నాను — కాని నాకు మించి నది, శేషించునది ఏదిన్నిలేదు — దీనినే "పూర్ణమేవావశిష్యతే" అను శ్రుతి చివరకు మిగులునది నా పూర్ణస్వరూపమేయని చెప్పుచున్నది. కాన నేను నిర్విశేషుడను — నిత్యుడను - పరిపూర్ణుడను — అని అను సంధానమును చేయవలయును.

*పరిపూర్ణోఽహం* :— నేను పరిపూర్ణుడను — ఇదియే జిజ్ఞాసువగు ముముక్షువు నకు పరమావధి — కాని యిట్లు తెలిసికొని అనుభవమును పొందుట యెట్లు? అను శంకకు పైన సిన నిరూపణలన్నియు సహకరించు చున్నవి. ఇంకను "సదేవసోమ్యేదమగ్రఆసీత్" అనుశ్రుతి యీ సృష్టి కిపూర్వము మొట్టమొదట సత్పదార్థమొక్కటియే యున్నదని తెలు పుచు "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే పూర్ణస్యపూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే" అనుశ్రుతి పూర్ణమే బ్రహ్మ యనియు పూర్ణము నశించునది కాదనియు, పూర్ణమగు బ్రహ్మను గ్రహించిన పూర్ణమే మిగులుననియు తెలుపుచున్నది. కాన సృష్టికిపూర్వము, సృష్టికాలములోనున్ను, సృష్టియనంతరమున్ను ఉండునది పూర్ణవస్తు వగు బ్రహ్మయే — అని తెలుచున్నది. అట్టి బ్రహ్మ తానే, అనగా నేను అని "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యము తెలుపుచున్నది. శ్రుతి

వాక్య మసత్యమగుటకు వీలుకాదు. దానిని పరమప్రమాణముగ గ్రహించుట విధియైయున్నది. ఈ శ్రుతిప్రామాణ్యమెంత యుత్కృష్టమైనదిన్నీ వసిష్టభగవానులు రాజాధిరాజై, అవతారపురుషుడైన శ్రీరామచంద్రునకు తత్త్వబోధజేయునపు డాతనితో—

శ్లో॥ కారుణ్యం భవతామేవ అహం వచి సమాయయా ।
శ్రుతివాక మనుస్మృత్య న స్వతః ప్రకటీకృతమ్ ॥

అనగా మీయందుండు కారుణ్యముచే, నేను కల్పించి చెప్పుటలేదు. ఈ చెప్పినదంతయు శ్రుతివాక్యము ననుసరించియే చెప్పినాను అని తన మాటకన్నగూడ శ్రుతికి అధికప్రామాణ్యమునిచ్చి రామచంద్రునకు విశ్వాసమును కల్పించియున్నారు. ఇదిగాకను ఈ శ్రుతిప్రామాణ్యమును గురించి,

శ్లో॥ పాషాణ ప్లవనం చాపి సిధ్యే త్కాలవిపర్యయే ।
నక్వచి చ్ఛ్రుతివాక్యానా మప్రామాణ్యంతు విద్యతే ॥

అని, కాల విపర్యయముచేత నొకవేళ రాళ్లు జలమునందు తేలినను తేలవచ్చునుగాని, శ్రుతివాక్యమెప్పటికిని అప్రమాణమగుటకు వీలు కాదని శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు — కాన మహావాక్య బోధ అసత్యమగుటకు వీలులేదు. కనుక మనము శ్రుతియుక్త్యనుభవములతో బాగుగా వివేచనజేసి మనకు గలుగుచున్న లౌకికానుభవము భ్రాంతియుక్తమని నిశ్చయించుకొని విచారణజేసిన మనల శ్రుత్యర్థము గోచరించును. ఇదియునుగాక, "మాయామాత్రమిదంద్వైత మద్వైతంపరమార్థతః" ఈకనబడు ద్వైతమంతయు భ్రాంతిమాత్రము, అనగా వ్యావహారికము. పరమార్థతః అనగా సత్యమైనది అద్వైత మెక్కటియే అని పై వచనము చెప్పుచున్నది — దీని -యనుసంధాన విధానము పూర్వాచారు లచే నిట్లు నిరూపింపబడుచున్నది—

శ్లో॥ దృశ్యంహ్యాదృశ్యతాంనీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్ ।
విద్వాన్నిత్యసుఖేతిష్ఠేద్ధియా చిద్రసపూర్ణయా ॥

శ్లో॥ అధిష్ఠానేపరిజ్ఞాతే సచ్చిదానందలక్షణే ।
బ్రహ్మైవసకలంవిశ్వం భోక్తృభోగ్యాదిలక్షణమ్ ॥

శ్లో॥ జగచ్చిత్రంస్వచైతన్యే పటేచిత్రమివార్పితమ్ ।
మాయయా తదుపేక్ష్యైవ చైతన్యం పరిశేషతామ్ ॥

అనగా ఈ దృశ్యమునంతటికిని అదృశ్యభావము నొందించి బ్రహ్మా కారముగ భావించుచు విద్వాంసుడు చిత్స్వరూపముతోనిండిన బుద్ధి వృత్తిచే నిత్యసుఖమందుండవలయును. సచ్చిదానందలక్షణమైన బ్రహ్మ గ్రహింపబడగా భోక్తృభోగ్యాదిరూపమైన యీవిశ్వమంతయు బ్రహ్మయేయగును ఈ జగత్తు అను చిత్రము చైతన్యమను పటము మీదమాయచే వ్రాయబడియున్నదని గ్రహించి చైతన్యమే మిగుల్చ బడుగాక. (అని పూర్వాచార్యవచనములు తెలుపుచున్నవి.) కాన ముము క్షువు వీని యర్థమును బాగుగా గ్రహించి అనుసంధానమును చేయ వలయును ఈ పరిపూర్ణత్వమును గ్రహించుటకు పరిచ్ఛిన్నత్వ, స్న త్వములను త్యజించవలయును. పరిచ్ఛిన్న, న్నదృశ్యనాశము, భ్రాంతిజ్ఞాననాశముచేగాని సాధ్యముకాదు. అనగా సత్యజ్ఞానము అధి ష్ఠానము, భ్రాంతిజ్ఞానము అధ్యస్తము — తనకు అనాది అవిద్యా భ్రాంతిజ్ఞానములచే కలుగుచున్న యీ పరిచ్ఛిన్నద్వైతానుభవము భ్రాంతిమాత్రముగాని వాస్తవముగాదని గ్రహించి తన సత స్వరూప మును బాగుగా గ్రహించిన పరిపూర్ణత్వము తనకు సిద్ధించును. ఎట్ల నగా రజ్జు సర్పభ్రాంతియందు భిన్న భిన్న సర్పావయవములు, వాటి చలనములు కనబడినను, ఇవియన్నియు అధిష్ఠానమైన ఒకే రజ్జువు యందు కలుగుచున్నట్లు, ఒకేపరిపూర్ణసద్వస్తువుయందు భేదభ్రాంతులు

కలుగుచున్నవి. ఈ వివేచనమంతయు సవిస్తరముగ లోగడ అధ్యాస నిరూపణలో నిరూపింపబడినదిగాన దాని నిచట గ్రహించవలయును. ఇట్లే ఒక్కటియైన బ్రహ్మయందు భ్రాంతిచే అధ్యస్తమైన యీ ప్రపంచము భాసించుకాలములోనున్ను, అధిష్ఠాన సత్యజ్ఞానానంతరమున్నూ ఈ బ్రహ్మ యొక్కడే పరిపూర్ణుడై ప్రకాశించుచున్నాడు, తదితరమేమియులేదు. ఇట్టిబ్రహ్మ ను నేనే అని, యిట్టి పరిపూర్ణత్వమును గుర్తెరిగి నిత్యానుసంధానమును చేయుచు అనుభవమును పొందిన మహనీయులు జగత్తుభాసించుకాలములోనున్ను, జగత్తు మిథ్యయను నిశ్చయజ్ఞానానుభవ కాలములోనున్ను, సదా వారిపరిపూర్ణతను అనుభవించుచుందురు. అప్పుడు "పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అను శ్రుత్యర్థమునకు సార్థకతను సంపాదించినవారగుదురు — ఇట్లు పూర్ణగ్రహణముజేసిన మహనీయులను భ్రాంతికల్పితదృశ్య, పరిచ్ఛిన్న, న్నత్వములేమి చేయగలవు ! ఇట్టి మహనీయులను ప్రారబ్ధము బంధింపజాలదు. కాని ఇట్టివారికిగూడ ప్రారబ్ధకర్మానుభవము తప్పుటలేదు. కాని అనుభవములో మాత్రము జ్ఞాన్యజ్ఞానుల అనుభవములలో మిక్కిలి తారతమ్యముండును. యెట్లనిన జ్ఞానియొక్క అనుభవము మనలకు శబ్ధచలనచిత్ర దృశ్యమందు కలుగుచున్న సుఖదుఃఖానుభవముల విధముననుండును. ఇట్టి పరిపూర్ణత్వానుభవముగలవారికే "మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే కించిత్ప్రదహ్యాతి" అనువచనము వర్తించును గాని అన్యులకెట్లు వర్తించును? ఇట్టితన పూర్ణత్వమును తెలిసికొని అనుభవించుచున్న తత్త్వజ్ఞులకు అనిత్యమై పరిచ్ఛిన్నమైన యీ జగత్తుయొక్క చిత్రానుభవములు శబ్ద చలనచిత్రపట దృశ్యములాగుననే గోచరించుచు తాత్కాలిక సుఖదుఃఖానుభవములతో ప్రారబ్ధమును అనుభవింపజేయగలవు. వారు - ఈ దేహపాతానంతరముగాని, లేక ప్రారబ్ధకర ప్రతిబంధనివృత్త్యనంతరముగాని కైవల్యసుఖమును పొందుదురు. ఇట్టిజ్ఞానముచేతనే

కైవల్యము సాధ్యముగాని, అన్యథాగా కానేరదు, అని "జ్ఞానాదేవతు కైవల్యం" అని శ్రుతి తెలుపుచున్నది.

అహంఆదిమధ్యాంతరహితః :- అనగా నేను మొదలు చివర మధ్య అను విభాగములులేనివాడను-అనగా జరామరణరహితుడను - అవినాశినిగను ఉత్పత్తినాశములు నాకు లేవు. ఈ పంచభూతాత్మకమైన ప్రపంచాదులు ప్రళయమందు నివర్తించుచున్నవి. గనుక తిరిగివాటికి ఉత్పత్తి కలుగుచున్నది. కాని నేను మాత్రము నాశము లేనివాడను గనుక నాకు ఉత్పత్తియసంభవము ఇట్టి ఆదిమధ్యాంతములు నాకులేవు. అనియిట్లు అనుసంధానమును చేయవలయును

జ్ఞానరూపోఽహం :- నేనుజ్ఞానస్వరూపుడను అనగా వాస్తవములో తను అను నేను ఎల్లప్పుడును జ్ఞానస్వరూపుడేయైనను ఇట్టి తన జ్ఞానరూపత్వ సత్యత్వ, పరిపూర్ణత్వములను, అద్వియత్వ, అనంతత్వములను భ్రాంతిచే మరచి తను అను నేనును అనృతపరిచ్ఛిన్న అజ్ఞానములతో గ్రహించుచున్నాడు .కాన నిట్టిసాంసారిక దుఃఖముల పాలగుచున్నాడు. తన పూర్ణత్వమునకు తన పరిచ్ఛిన్నమునకు రెంటికిని జ్ఞానమే సాధనముగాని, అన్యముకాదు. ఒకటి తత్త్వజ్ఞానము మరియొకటి భ్రాంతి జ్ఞానము. స్వశరీర సర్వదృశ్యానుభవమున్నా ఈయనాద్యవిద్యాభ్రాంతి చేతనే కలుగుచున్నది. అనగా దృశ్యసహితజ్ఞానము భ్రాంతి . దృశ్య రహితజ్ఞానము సత్యము. ఇట్టిభ్రాంతిజ్ఞానమును బాగుగ వివేచనముచేసి యిది మిథ్యయని తెలిసికొనిన శేషించునది జ్ఞానమేగదా ! ఇట్టి జ్ఞానమెప్పుడును ఒక్కటియేగాని అనేకముండుటకువీలులేదు. ఇట్టి ఒకటియైనజ్ఞానమే పరమోత్కృష్టమైనది. దీనినే కృష్ణభగవానుడు "నహి జ్ఞానేనసదృశం" అని ప్రశంసించియున్నారు. ఇంకను "శ్రద్ధావాన్ లభతేజ్ఞానం" అని శ్రద్ధకలవారికేయిట్టి జ్ఞానము లభించుననిన్ని "జ్ఞానంలబ్ధ్వా పరాంశాంతిం" ఇట్టి జ్ఞానముచేతనే ఉత్కృష్టమైన శాంతి

కలుగుననిన్నీ, "తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మని విందతి" ఇట్టిజ్ఞానమును యోగియైనవాడు కాలపరిపాకమువలన పొందగలడు అనిన్నీ తెలుపుచున్నారు. కాన ఇట్టి పరిపూర్ణజ్ఞానమును సంపాదించి దృశ్యమంతయు భ్రాంతిజ్ఞానకల్పితమని తెలిసికొనవలయును. ఇట్టి జ్ఞానులకు ఈజ్ఞానము సాంసారిక సుఖదుఃఖములను నిరోధించు చుండును. అనగా ఇట్టి యనుభవములు జ్ఞానికి క్లేశకరములు గావు. ఎట్లనగా –

"విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి నశత్రుతామ్"

అనగా దొంగను 'దొంగ' యని తెలిసికొని సేవించినయడల వాడు శత్రువు గానేరడు. ఇంకను ఒకానొక సమయమున వాని చౌర్య కార్య నైపుణ్యముచే స్నేహితునకు సంపాదనకు కూడ ఉపయోగ కరముగ నుండును. లోకమందు ఎట్టి వస్తువైనను దాని స్వరూప స్వభావములు బాగుగా తెలిసికొని వ్యవహరించి, ఉపయోగించుకొన్న యడల అట్టి వస్తువు అపకారిగాక ఆచరణ కౌశలముచేత నిర్బాధకము గను, కొన్ని సమయములందు అధికోపయోగకరముగాను కాగలదు. జాగ్రతతో వాడిన సర్పగరళమే అమృత మగుచున్నది గదా ! ఇది గాక, వ్యాఘ్ర సర్పాది జంతువుల క్రూరత్వమును తెలిసికొని కనిపెట్టి వాటిని వాడుకొనుటచే, నవి సంపాదించిన వానికి జీవనాధారహేతు వగుచున్న విషయము అందరి యనుభవములో నన్నదియే గద ! ఇట్లే ఈ సర్వదృశ్యముయొక్క దుఃఖ జనన స్వభావమును బాగుగ గ్రహించి ఇందు అంతఃపాతియైన తన శరీరమును తన యు___ర్ణతకు అనగా తన శాశ్వత స్వరూపమును పొందుటకు కౌశలముతో నుపయో గించుకొనవచ్చునని తెలిసికొనవలయును.

ఇందుకుగాను ప్రపంచము సత్యమైనదికాదు అని దృఢ నిశ్చయ జ్ఞానమును సంపాదించ వలయును. ఇట్టి జ్ఞానములో పరోక్ష

జ్ఞానమనీ, అపరోక్షజ్ఞానమనీ, రెండు విధములు. పరోక్షజ్ఞాన మనగా శాస్త్ర శ్రవణాదులచే సంపాదించుకొనిన జ్ఞానము. ఈ జ్ఞానము దాని యందు ప్రీతి నిశ్చయ పూర్వకమై యుండవలయును. ఇదియే పరోక్ష జ్ఞానము. ఇట్టి జ్ఞానమును సంపాదించి బహుకాలము వృత్తి వ్యాప్తితో అనుసంధానాదులను అభ్యసించవలయును. ఇట్టి పరోక్షజ్ఞానమే కాలపరిపాకము వలన స్వానుభవమునకు వచ్చును. ఈ జ్ఞానమే అపరోక్షజ్ఞానమని శాస్త్రములు తెలుపుచున్నవి. కాన మొదట సాధు సంగమ సచ్ఛాస్త్ర శ్రవణాదులచే సంపాదించిన పరిపూర్ణ జ్ఞానమే తన స్వరూపమని గ్రహించి, ఇట్లు గ్రహించిన పరోక్షజ్ఞానమును అపరోక్షముగ పొంది తన పరిపూర్ణ నిత్య నిరతిశయ అఖండ అద్వియ సచ్చిదానంద జ్ఞానమును పొందిన నేను ఐన తను నిర్గుణ నిర్విశేష బ్రహ్మమే యగును. ఇదియే జ్ఞానమని తెలిసికొన వలయును. కాన సర్వము జ్ఞానమనియే నిరూపణ మగుచున్నది. ఎట్లన—

శ్లో॥ చిదేవ పంచభూతాని చిదేవభువనత్రయమ్ ।
చిదేవాహం చిదేవత్వం సర్వం చిదిహానాన్యథా ॥

అని శ్రీ శంకరభగవత్పాదులు సర్వము చిత్స్వరూపమే ననియు తదితరమేమియునూ వాస్తవమున లేదనియు తెలుపుచున్నారు. కావున జిజ్ఞాసువులిట్లు తెలిసికొని స్వానుభవము నొందుటకు, సశాస్త్రీయముగ, నిరంతరాభ్యాసాదులను, సదాచారపరులై, యుత్సాహముతో ఆమరణాంతము గాని. ఫలావగతి పర్యంతము, విసుగు చెందక అనుసంధానాదుల నాచరించుట ముముక్షుజిజ్ఞాసువుల కమృతసాధనమగుచున్నది

ఇట్లుగాక యీ జ్ఞాన, పరమశాంత పదములు అమృతత్వము కళ్లు మూసుకొని యూరక తూష్ణీభావముతో నుండిన సిద్ధించునని కొంతమంది యాధునికుల యభిప్రాయము కనబడుచున్నది. కళ్ళు మూసుకొని యూరక

కూర్చుండిన చీకటి తప్ప గోచరించునది మరేమియు నుండదు. అయినను యిందుచే తాత్కాలిక వ్యవహార కలవరములు కొంతవరకు శాంతించునేమో గాని తన వాస్తవ స్వస్వరూప సుఖజ్ఞాన మెట్లు కలుగును? అసంభవము. సత్య స్వరూప జ్ఞానము న లషించు ముముక్షువునకు, మనన - నిదిధ్యాసనములు — సమాధ్యభ్యాసము తన స్వరూప సుఖమునకు హేతువగును. ఈ సమాధి యన్న యూరక తూష్ణీభావముతో కూర్చునియుండుట కాదనియూ అట్టిది, సమాధి యనబడదనియూ, సమాధియన్న - వుడు తన పరిపూర్ణ, అఖండ జ్ఞాన స్వరూపమును ధ్యానించుటయేనని—

శ్లో॥ బద్ధ పద్మాసన స్యాపి కృత బ్రహ్మాంజలే రపి ।
అవిశ్రాంత స్వభావస్య కస్సమాధిః కథంచ వా ॥

శ్లో॥ తత్త్వావ బోధో భగవన్ సర్వాశా తృణపావకః ।
ప్రోక్తస్సమాధి శబ్దేన, నచ తూష్ణీ మవస్థితిః ॥

బ్రహ్మాంజలివేసి బద్ధపద్మాసనుడై కూర్చున్నను చిత్తము విశ్రాంతి పొందని వానికి — సమాధిసుఖ మెట్లు కలుగును. సమస్త ఆశలను తృణంబులకు, నగ్నియగు తత్త్వజ్ఞానము సమాధి శబ్దముచే చెప్పబడును గాని యూరక కూర్చుండుట మాత్రము సమాధి శబ్దముచే చెప్పబడదు. అని యింకను "ప్రోక్తా సమాధి శబ్దేన పరిపూర్ణా మనోగతిః" పరిపూర్ణంబగు మనోగతి సమాధి శబ్దముచే చెప్పబడుచున్నది. యని వసిష్టభగవానులు తెలుపు చున్నారు. గాన చిత్త విశ్రాంతిగోరు ముముక్షువు తత్త్వజ్ఞానమును సంపాదించి తన మనసును పరిపూర్ణగతిని పొందించవలయును. గాన ముముక్షువు,

శ్లో॥ చిదాకాశ మయంసర్వం జగదిత్యేవ భావయన్ ।
యస్తిష్ఠత్యుపశాంతోఽంతః, సబ్రహ్మ కవచీ సు ॥

ఎవడు సమస్తమైన జగంబును చిదాకాశరూపంబేయని భావించుచు నుపశాంతిని బొందునో వాడు పరిపూర్ణమగు బ్రహ్మమే రక్షకముగా గలవాడగుచు సు యగుచున్నాడు. గాన,

శ్లో॥ శాస్త్రి సజ్జన సంపర్క సంతతాభ్యాస యోగతః।
కాలే నాఽమలతాం యాతే, చేతసీందా వివోదితే ॥

శ్లో॥ ఏతత్కేవల మాభాసం స్వానుభూతి మయం తతం।
ఉదేత్యంతర్మహాబుద్ధే స్స్వయమేవ మహాత్మనామ్ ॥

వేదాన్త శాస్త్రిము, సజ్జన సాంగత్యము. వీని నిరంతరాభ్యాసము వలన చిత్తము నైర ల్యము నొందగా కైవల్యము దానంతతాను లోన కలుగు చున్నది.

లోకములో కొంతమంది బ్రహ్మవిదా భ్యాసకులకు లేక విద్యానిష్ఠ లకు, తాము జ్ఞానులమనియూ, ఆశ్రమాతుల మనియూ, మాకు కర్మా చరణ ప్రధానము కాదను అ నివేశము కలుగును. కాని యిట్టి వర్ణాశ్రమో చితమైన కర్మాచరణయందు నిరాదరణ చేయుట అభ్యాసకులకు శ్రేయోదాయ కము కాదు. శాస్త్రము జ్ఞానాభ్యాసికి కర్మలను తగ్గించుకొనవలసినదిగా జిజ్ఞాసువునకు జ్ఞానాభ్యాస ఫలముగా కలుగు సహజస్థితిని చెప్పినదిగాని—భోగ లాలసత్వము కొరకు సదాచార నిత్యకర లను మానమని చెప్పలేదు. వారి వారి జ్ఞానావృద్ధి దార్ఢ్యతలను బట్టి యట్టి కర త్యాగస్థితి కాలక్రమమున నదియే సహజముగా రావలయునుగాని అభ్యాసకుడు సుఖాసక్తుడైగాని, వ్యవహారఫలాసక్తుడైగాని, వర్ణాశ్రమోచిత కర ధర్మములను ఉపేక్ష, నిరస నలు చేయతగదు. అట్లుచేయుట సాధనముగాక చిత్తనైర ల సంపాదనకు నిరోధమగును. దీనినే "ఆచారహీనం నపునంతివేదాః" సదాచార రహితుని వేదము లుద్ధరించవని శాస్త్రవచనము స్పష్టముగా తెలుపుచున్నది. కాన ముము క్షువులకు సదాచార, సద్ధర్మానుష్ఠానములను విడువక తన అభ్యాసాదులను సదా

సుస్థిరుడై యాచరించుచున్న యెడల కర త్యాగస్థితి సహజముగా కలుగవల యును. కాని తాను అ లక్షించిగాని, అ నివేశపరుడై కాని సదాచారోల్లంఘన గావించుట శ్రేయోదాయకముగాని — అభ్యాసమునకు సాధనముగాగాని కాజాలదు. అయినను, దేశకాలపరిస్థితులవల్లను, వయోధర ముచేతను, ప్రజ్ఞా మాంద ముచేతను, చేయని యెడల దానిని తమశక్తి లోపమనియే తలచవల యును గాని తమ జ్ఞానఫలమని తలచకూడదు. అట్టిది అవివేకము, భ్రాంతి మాత్రమే యగును. జ్ఞానాభ్యాసకునకిట్టి నిత్యకరా నుష్ఠాన త్యాగము, క్షుత్పిపాసాదులత్యాగమువంటిది జ్ఞానాభివృద్ధి స్థితులనుబట్టి దేహాభిమాన ధర్మము లెట్లు క్షీణించునో, ఎప్పుడు క్షుత్పిపాసాదులు కూడ క్షీణించునో అప్పుడు యీ జ్ఞానాభ్యాసమునకు తన నిత్యకరా నుష్ఠానావశ్యకతగూడ దానంతటదియే క్షీణించును. కాని, నిత్యకర లను, సదాచారమును ఆశ్రమవిరుద్ధముగ, బుద్ధి పూర్వకమున వ్యవహారాసక్తులై, విడుచుట ఎవరికిని శ్రేయోదాయకము, మోక్షసాధనము కాజాలదని శాస్త్రము తెలుపుచున్నది.

# బ్రహ్మానుసంధాన ప్రకారాంతము

అద్వైతసిద్ధాంతమును యెంతపఠించినను, యెన్నివిధముల తెలుసుకున్నను స్వానుభవమువల్లగాని యీ విద్యాలాభము పూర్తిగా పొందబడదు. కాన ముముక్షువు బ్రహ్మ స్వరూప, స్వానుభవప్రాప్తికిగాను త , జ్ఞాననిరూఢిని సంపాదించవలసియున్నది. దీనికిగాను ముముక్షువు బ్రహ్మానుసంధానమును ప్రకారాంతరములుగా గుర్తెరిగి సతతానుసంధానము చేయుచుండుటచే చిత్తమునకు తత్స్వరూపాలంబనాచారుధ్యము కలుగుటకు యుపకరించును. అందుకుగాను శ్రుతివాక్య వివేచనలతో యీ క్రిందివిధమును యొక అనుసంధానసాధనముగ గ్రహించవచ్చును:— శ్రుతిమాత "మాయామాత్రమిదంద్వైతం

అద్వైతం పరమార్థతః" అనితెలుపుచూ "ఏకమేవా ద్వి యం బ్రహ్మ, నేహనానా_స్తికించన" అనికూడా చెప్పుచున్నది. ఇట్లుచెప్పు, ఈఅహం, నేనుఅను కొనుజీవున "అహంబ్రహ్మాస్మి" అని మహావాక్యము-నీవు అహం అనుకునే నేను బ్రహ్మ అనిగూడ తెలుపుచున్నది. కాని నేను అనుకొనుచున్న యీ జీవు నికి స్వోపాధిసహిత సర్వోపాధులున్నూ స్ఫురణానుభవములోనున్నవి. అయి నను పై శ్రుతివాక్యముల ప్రామాణ్యముననుసరించి యిట్లు కనబడుచున్న సర్వోపాధులు భ్రాంతియుతములేగదా కావలెను. ఏలనన శ్రుతి నూరుతల్లుల సమానము గనుక జీవునికి యెప్పుడునూ అసత్యమును బోధించదు. ఇదిగాకనూ లోకమునందు చంద్రుడొక్కడు అనితెలిసిననూ రెండుచంద్రబింబములుగా కనబడుట నేత్రదోషమువలననే కదా కావలయును. ఇట్లే శ్రుతిమాత జీవునకు వా_స్తవమున నున్నది బ్రహ్మయొక్కడే-ఆబ్రహ్మ నీవు-తదితరమేమియూ లేదని జిజ్ఞాసువునకు బోధించుచున్నతన, నానాత్వము, సర్వోపాధులున్నూ భ్రాంతికల్పితములని నిశ్చయమగుచున్నది. వా_స్తవమున బ్రహ్మ నిరూపాధికుడు. అట్టిబ్రహ్మ నువ్వేఅని మహావాక్యము బోధించుచున్నది. కాన ముముక్షువు తన సత్యస్వరూపము గ్రహించుటకు స్వశరీర సర్వోపాధులను జ్ఞానపూర్వకముగ త్యజించిన, శేషించునది తన పరిపూర్ణ స్వరూపమొక్కటియె. ఇందుకుగాను తాను యిప్పుడు అనుభవించుచున్న యీ పరిచ్ఛిన్న స్థూలశరీర సహితముగా సర్వోపాధులు నేనుకాను అని తన వా_స్తవస్వరూపమైన సాక్షి, ప్రత్యగాత్మ స్వరూపమును తన హృదయాకాశమందు తెలుసుకొనినయెడల యిదియే తన వా_స్తవస్వరూపమైన అహం అప్పుడు యిట్టి అహం స్వరూపుడయిన నేను, ఆపర మాత యూ, నొక్కటియే యని బ్రహ్మానుసంధాన వివరణశబ్దార్థములను బాగుగ గు_ర్తెరిగి అనగా మనోగోచరము చేసుకొని అహం సర్వోపాధివిని ర్ము_క్తః, సర్వాధిష్ఠాన, దృశ్యరహిత, సజా య, విజా య, స్వగతభేద రహిత, స్వప్రకాశ, నిత్య, నిరతిశయ, నిర్వికార, అసంగ, అద్వి య, అఖండ పరిపూర్ణచై_తన్యః - అని ధ్యానాదుల కాలమందున సర్వవ్యవహార కాలమందునగూడ సర్వదా బ్రహ్మ ధ్యానముచేయుట ముముక్షు క_ర్తవ్యము.

ఇదియే పరిపూర్ణబ్రహ్మ స్వరూపము. ఇట్టి పరమాత్మయే జీవునికి శ్రుతి "సయ యేషోన్తరహృదయఆకాశః తసి న్నియం మనోమయః అమృతోహిరణ్మయః" అనితెలుపుచూ ఆ పరమాత్మనే "అంగుష్టమాత్రః పురుషః" జీవునిహృదయాకాశమందు అంగుష్ఠమాత్రమున ప్రకాశించుచుండుననియూ, యీయననే వుడు ఆపరమాత్మగా తెలిసికొనుటకు అనగా వుని హృదయాకాశమునందు యున్నదియు, బాహ్యమందున్న పరమాత్మయూ ఒక్కడేనని ఉపదేశించుచూ దీనినే వునకు ఉపాసనామార్గమున "సయఏషోన్తర" అను శ్రుతి తెలుపుచున్నది. ఇదియే వబ్రహ్మైక్యానుసంధానము, శ్రుతిబోధ పరమ తాత్పర్యము. ఇట్టి నిర్గుణపరిపూర్ణసర్వాధిష్ఠాన పరిపూర్ణచైతన్యమును ఒక్కమారుగా ప్రథమముననే గ్రహించుటకు కష్టసాధ్యమని తలచి శ్రుతి, ఆనిర్గుణపరబ్రహ్మను, సత్యజ్ఞానానంతములను ఉపలక్షణ స్వరూపముతో తెలుపుచున్నట్లే యీ పరబ్రహ్మ స్వరూపము ప్రణవస్వరూపమనియేగూడ "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ" అనుశ్రుతి వాక్యముచే వునికి ఆ బ్రహ్మ స్వరూపమును తెల్పుచున్నవి. కాన ముముక్షువు అనుసంధానాదులను యిట్టి జ్ఞానముతో యాచరించుట శ్రేయోదాయకము. శ్రుఫలప్రదమును అగును.

ఇంకను తన పరమార్థస్వరూపమునిట్లు అనుసంధించుచుండవలెను:- నేను సత్యజ్ఞానానంత స్వరూపుడను. అనగా సర్వదా నా జ్ఞానము నిత్యమైనది, అబాధితము, నాలోయున్నది జ్ఞానము-నా స్వరూపము జ్ఞానము, నేను యుండునది జ్ఞానములోననే. కాన జ్ఞానేతరమేదియునూ లేదు. ఇట్లుసత్యమై అనంతమైన జ్ఞానమే నా పరిపూర్ణ స్వరూపము. విషయజ్ఞానము లెవ్వియునూ నా స్వరూపముకావు. నేను నిర్విషయజ్ఞాన పరిపూర్ణ స్వరూపుడను. ఈభిన్న పరిచ్ఛిన్న విషయములన్నియూ నా యందు భ్రాంతికల్పితముగానున్నవి. అవాస్తవికములు - ఈ నా స్వశరీరదృశ విషయ సంఘాతమంతయూ సర్వపరిపూర్ణుడైన నాయందు, నా అనాది అవిద్యచే కల్పింపబడి నా అంతఃకరణమను కల్పితోపాధి-నా అజ్ఞానమను చీకటిలో నాయందు యీ దృశ చిత్రానుభవముల నన్నిటినీ సుఖదుఃఖానుభవములతో — చీకటిలోనున్న శబ్దచలన, చిత్రి

పటమునందు కనబడుచిత్రముల లాగునచూపుచు భ్రాంత్యనుభవమునన్ను నాకు కలుగ జేయుచున్నది, కాని ఆ ప్రదర్శన పటమందు వెల్తురు ప్రకాశము పడగనే యొక్క చిత్ర దర్శనము కూడ యచట నిలువదు. ఇట్లే నా సర్వాధిష్ఠాన స్వరూపమను అఖండపటముమీద నా జ్ఞానమను ప్రకాశము కలుగగనే యిప్పుడు నాకు కలుగుచున్న భ్రాంత్యనుభవ చిత్రములన్నియూ నశించి లేక అంతర్ధానమై నా పరిపూర్ణ అఖండ సచ్చిదానంద స్వరూపము సదా ప్రకాశించు చుండునను జ్ఞానానుసంధానాదుల నాచరించుచుండవలయును. ముముక్షువు యిట్లు సతతమననాది స్వస్వరూపానుసంధానాదులను చిరకాలమభ్యసించగా అభ్యాస పాటవముచే కాలపరిపాకమున ధ్యానసమాధులందు క్రమక్రమమున, ప్రజ్ఞా వంతుడై సమాధికాలమున తన స్వస్వరూపసుఖము ననుభవించుచుండును అట్టిసుఖమేదియనిన అదియే అఖండాకారవృత్తి – జ్ఞానులకు యిట్టి అఖండా కారానుభవము సమాధికాలమందు వారి జ్ఞానబలముచే జాగ్రద్దశయందు సామాన్యులు అజ్ఞానముతో సుషుప్తిదశయందనుభవించు సుఖములాగునపొందు చుండును. ఈ రెండునూ అఖండాకారవృత్తులే. అయినను, జీవునకు అజ్ఞానముచే సుషుప్తి యందు కలుగు అఖండాకారవృత్తి బంధహేతువున్నూ ముముక్షువునకు జ్ఞానబలముచే సమాధిస్థితియందు కలుగు అఖండాకారవృత్తి (~వునికి)ముక్తిహేతువు మోక్షసాధనమున్నూ అగుచున్నది ఎట్లనయిట్టి జీవుడు తన అభ్యాసమహిమచే యిప్పుడు తనచే భ్రాంతితో అనుభవింపబడుచున్న యీ స్వశరీర, సర్వదృశ్యపరిచ్ఛిన్న విచిత్రాదులను మిథ్యయనిగ్రహించి "పూర్ణ స్యపూర్ణమాదాయ. పూర్ణమేవావశిష్యతే" అను శ్రుతివచనము చొప్పున అహమిదముల ఏకత్వపరిపూర్ణతను గ్రహించి అనుభవించును. అప్పుడు అద్వితీయ పరిపూర్ణపదార్థముతప్ప మరేమియు గోచరించదు దీనినే శ్రుతి "ఏకత్వమను పశ్యతి" అని తెలుపుచున్నది. కాని యీ ఏకత్వదర్శనము నిత్యమగుటలేదు. కాన యింకనూ అభ్యాసమావశ్యకము.

నేను బ్రహ్మ స్వరూపుడను. బ్రహ్మ యన్నను జ్ఞానమన్నను యొకటియే. అద్వితీయ, అఖండపరిపూర్ణజ్ఞానమే నావాస్తవస్వరూపము. కాని నా

యొక్క అద్వితీయ అఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూపమును మాయా ప్రభావము వల్ల, నా ఒక్కటియైన పరిపూర్ణ సత్యస్వరూపమునే జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయ స్వరూపముల క్రింద అవిద్యచే భ్రాంతికల్పితములై నాకు తోచుచున్నవి. కాని యిందులో నా వాస్తవస్వరూపము అద్వితీయనిత్య పరిపూర్ణ జ్ఞానస్వరూపమేగాని తదితరములేవియుకావు. ఎన్ని వికారములువచ్చినను కేవల జ్ఞానస్వరూపుడనైన నాయందు భ్రాంతికల్పితములైన జ్ఞాతృ, జ్ఞేయములయందే కలుగుచున్నవి, కాని నా వాస్తవస్వరూపమైన స్వరూపజ్ఞానమునందు ఎన్నటికిని యెట్టివికారములున్నూ కలుగుటకు వీలులేదు. ఈ వికారములన్నియు నాయందు భ్రాంతి కల్పితములై యున్నవి. కాని వాస్తవముగా లేవు ఈ దృశ్య వికారములన్నియు కేవలజ్ఞానస్వరూపుడనైన నాయందు నిస్తరంగమహాసముద్రము వాయు సంపర్కముచే తరంగములు, బుద్బుదములు, నురుగు రూపముల పరిణమించుచున్నయటుల, ఈ జ్ఞాతృజ్ఞేయములు సర్వదృశ్యవికారములును అవిద్యాసంపర్కముచే కల్పింపబడి దృశ్యానుభవము నిచ్చుచున్నవి కాని వాస్తవమున యీ వికారములతో నాకెట్టిసంబంధమును లేదు నేను కేవల జ్ఞానస్వరూపుడనై సాక్షీ మాత్రుడుగ నుండి అందరి హృదయపుండరీకములయందును నేనే ప్రత్యగాత్మస్వరూపమున తెలియబడుచున్నాను. కాన వాస్తవమున ఈ సాక్షీ, ప్రత్యగాత , పరమాత లని తెలియబడుచున్నది నా ఒక్కటియైన అఖండ పరిపూర్ణ చైతన్యమే ముముక్షువునకు జ్ఞానపూర్వకముగ యిట్లాచరించు అనుసంధానాద్యభ్యాసాదులే స్వస్వరూపసుఖమును తాత్కాలికముగ అనగా జీవదశయందు నిచ్చుచు కాలపరిపాకముచే వుని ప్రారబ్ధాంతమందు చరమ సాక్షాత్కార వృత్తి నిచ్చి, యీ వృత్తి లయమైపోవును. ఇట్టి అనిర్వాచ్యమైన మోక్ష స్వరూపానుభవమును వునికి తెలుపుటకే శ్రుతులు "యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి, సభూమా, యో వైభూమా తత్సుఖం" — "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని తెలుపుచూ "తత్త్వమసి" అనియూ కూడ నిర్దిష్టముగా తెలుపుచున్నవి. కాన ముముక్షువు తన అభ్యాసపటిమచే కాలపరిపాకమున, తన నిత్యనిరతిశయ సుఖము నిట్లు పొందునని గ్రహించవలయును.

# అనుసంధాన స్వరూపము

బ్రహ్మ విద్యానుసంధాన మనగా అధికారి మహావాక్య శ్రవణముచే శ్రుతియుక్త్యనుభవములతో గ్రహించిన విషయమును అర్థముతో నిశ్చయించుకొని తదాకారవృత్తి దృఢత్వమును సంపాదించుకొనుటకున్ను, స్వానుభవమును పొందుటకుగాను పలువిధములుగా అనగా శ్రుతివాక్యానుసంధానముతోను, లోకానుభవ, స్వానుభవ సచ్ఛాస్త్రీయ దృష్టాన్తములతోను ప్రమాణసిద్ధ యుక్తులతోను మనస్సును నిరంతరము తచ్చింతనలో యుంచుటే, అనగా – సదాబ్రహ్మాభ్యాసమును సలుపుట. బ్రహ్మాభ్యాస మనగా—

శ్లో॥ తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

అని విద్యారణ్య స్వామి తెలపియున్నారు. దీనికిగాను ఒక్కటియై, ఏకరూపమైన ఈ విషయమునే వృత్తి వ్యాప్తిని సంపాదించి వివిధోపాయములతో మనసుకు బ్రహ్మ విషయకత్వమును సత్పదార్థానుభవమును పొందవలసియున్నది. దీనికిగాను మనోనిరోధమావశ్యకము. దీనిని వైరాగ్యాభ్యాసాదుల వల్లనే సంపాదించవలయునుగాని, వేరుదారి లేదు. ఇట్టిప్రయత్నమే తపస్సు. అనుసంధానమన్నను, తపస్సన్నను దాదాపు ఒక్కటియే యగును. ఇట్టి తప శబ్ద వివరణ మేమనగా —

శ్లో॥ మనసశ్చేన్ద్రియాణాంచ ఐకాగ్ర్యం పరమంతపః ।

అని గీతావచనము—

శ్లో॥ అన్వయవ్యతిరేకాది చింతనం వా తపోభవేత్ ।
అహంబ్రహ్మేతివాక్యార్థబోధాయాలమిదంయతః ॥

శ్లో॥ కోఽహం, ముక్తిఃకథం, నసంసారం ప్రతిపన్నవాన్ ।
ఇత్యాలోచనమర్థస్య తపశ్శంసంతి పండితాః ॥

అని వార్తికకారులు తెలుపుచున్నారు. నిర్దిష్ట శ్రుతివాక్యములను బట్టి యిచట విచారింతము. శ్రు॥ "బ్రహ్మ విదాప్నోతిపరమ్" అనగా బ్రహ్మవేత్త మోక్ష

మును పొందుచున్నాడని చెప్పుచున్నందున మోక్షార్థియైన వాడు బ్రహ్మ రూపమును గ్రహించవలసి యున్నదిగదా ! "సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ" అని స్వరూప లక్షణములతో చెప్పి ఇట్టి వానిని "యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్" బుద్ధియందు గల హృదయాకాశమునందు ఈ బ్రహ్మను ఎవడైతే తెలుసుకొనునో అట్టివాడు అన్నికోరికలను (సర్వకామములను) పొంది బ్రహ్మస్వరూపుడగును. అనుటవల్ల ఈ బుద్ధిగుహయందు ఈయన నెట్లు తెలిసికొనవలెనను శంకకు "సయఏషో న్తరహృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషోమనోమయః, అమృతోహిరణ్మయః" అని యీ హృదయాకాశమందు మనోమయుడును, మరణధర్మరహితుడును, జ్యోతిర్మయుడును అగు పురుషుడున్నాడని తెలుపుచున్నది. ఇంకను ఈ 'సయఏషోఽన్తరహృదయ ఆకాశః' అను ఉపాసనను బట్టి ఇట్టియుపాసకుడే ఆపరమాత్మరూపుడు తానే యగునని తెలుపుచున్నది. అట్టిపరమాత్మ స్వరూపమెట్లుండుననగా "యస్మాత్పరంనాపరమస్తికించి ద్యస్మాన్నాణీయోనజ్యాయోఽస్తికశ్చిత్ వృక్ష ఇవస్తబ్ధోదివితిష్ఠత్యేక స్తేనేదంపూర్ణం పురుషేణసర్వమ్" అని దేనికన్న అధికమైనది లేదో, దేనికన్న సూక్ష్మమైనదిలేదో, అట్టి ఒక్కడగు పురుషుడు, అనగా బ్రహ్మ నిర్వికారుడై, స్వప్రకాశుడై, వృక్షములాగున అచలుడై జగమంతయు వ్యాపించియున్నవాడు అని చెప్పుచున్నది. 'స ఆత్మా' ఈయనయే ఆత్మ అనగా సర్వులహృదయమందు ప్రకాశించువాడు అని చెప్పి ఇంకను — ఈయనను తెలుసుకొనవలసినచోటు, శ్రుతి॥ "అధోనిష్ట్యావితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి। జ్వాలమాలాకులంభా విశ్వస్యాయతనం మహత్ ॥ అని కంఠస్థానముకంటె 2 అంగుళముల క్రిందను, నాభిస్థానముకంటె 2 అంగుళములకు పైగను ఉన్న స్థానమందు ఉజ్జ్వలప్రకాశమానుడై జగదాధారుడై యీ పరబ్రహ్మము ప్రకాశించుచున్నాడు అని చెప్పుచున్నది. ఇంకను "అయమాత్మా బ్రహ్మ" ఈ ప్రత్యగాత్మయే ఆ బ్రహ్మయనియు, "తత్సత్యం" అదియే నిజమని, 'తత్త్వమసి' అనగా ఇట్టి బ్రహ్మ నీవేయని మహావాక్యము చెప్పుచున్నది. ఇట్లు చెప్పి యింకను,

శ్లో॥ ఆత్మానం చేద్విజానీయాదయ మస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్ ॥

ఇట్టి యాత్మను తానుగా తెలుసుకొన్న పురుషుడు దేనినికోరి శరీరమును తపింపజేయును? అని చెప్పుచున్నందున ఇట్టి పురుషుడు నిష్కాముడై సర్వమును తానై యగుచున్నాడని తెలియుచున్నది. ఇంత స్పష్టముగా మన స్వరూపమును తెలియజేయుచున్న వేదమును, వేదమనగా ఆప్తవాక్యం, నూరు తల్లుల సమానమగు శ్రుతివాక్యములయందు విశ్వాసము కలుగకుండుట అవిద్యాబలము వల్లనేగాని, మరేదియు కాజాలదు. సర్వ ప్రయత్నములచేతను జిజ్ఞాసువు ఈ అవిద్యానిర్మూలనమును గావించవలయును. ఇట్టి ప్రయత్నములలో ఈ బ్రహ్మవిద్యానుసంధానము సాక్షాత్సాధనమని లోగడనే చెప్పియుంటిమి. ఈ బ్రహ్మవిద్యానుసంధానము సాంసారిక దుఃఖ ఆత్యంతిక నాశమునకు కుఠారము వంటిది. ఈ ముముక్షువు తన స్వస్వరూపమును ముఖ్యముగా నేను జ్ఞానస్వరూపుడను, చిదాకాశస్వరూపుడను అని అనుసంధానము చేయునపుడు ఈ చిదాకాశరూపమును ఇట్లు తెలుసుకొనవలయును. ఆకాశమన్న చిదాకాశ — మహాకాశములు సాధారణముగా ఒకటిగా స్ఫురించు చుండును. గాని వీటి స్వరూపములు అత్యంతభిన్నముగా నున్నవి. గనుక ఇచట జిజ్ఞాసువు ఈ విమర్శను గ్రహించవలయును. చిదాకాశమునందే ఆ మహాకాశాదులుకూడ కల్పితములు. ఈమహాకాశము జడము—వినాశి— అవకాశమే స్వభావముగా గలది. ఇట్టివి మహాకాశ లక్షణములు. చిదాకాశము — నిత్యమైనది — అవినాశి — జ్ఞాన స్వరూపము. ఇట్టి భేదములను అభ్యాసకుడు అనుసంధానకాలములో గ్రహించవలసి యున్నది.

చిదాకాశము నిరుపమానమైనది. గాన ముముక్షువునకు గ్రహణసౌలభ్యమునకుగాను యీ చిదాకాశము నిర్మల మహాకాశము వంటిది అని చెప్పబడినదేగాని రెంటికిని లక్షణములన్నియు సమానముగా సరిపోవునని కాదు. ఉపమానములు సామాన్యముగా కొన్ని అంశములలోనే ఉపమేయమును పోలియుండును గాని, సర్వలక్షణములు ఉభయత్ర సమానముగా నుండవు.

# వృత్తి వివేచనము

ఈ వృత్తి వివేచనమనునది పలుశాస్త్రజ్ఞులచే వ్రాయబడిన పెద్ద విషయము కాని యిచట మన ప్రకరణము ననుసరించి ఆవశ్యకమగు వివేచననే సుకొనడమైనది. జీవుడు తాను వినినదిగాని, చూచినదిగాని, అనుభవించుచున్నది గాని, అనుభవింప దలచినదిగాని, లేక తన పూర్వానుభవస్మృతిని గాని, మనసుచే గ్రహించు అంతఃకరణ పరిణామము వృత్తిఅనబడును. చిత్తము విషయాకారవ్యాప్తి నొందుట ప్రవృత్తియనియు, చిత్తము నిర్విషయమై బ్రహ్మాకారవ్యాప్తి నొందుట నివృత్తి యనియు చెప్పబడుచున్నది. ప్రతి వుడును నేను నేను అని తనను గ్రహించుటకు ఈవృత్తియే సాధనమగుచున్నది. ఈ వృత్తియను సాధనము లేనిచో తనను తాను తెలుసుకొనుటగాని, పరవిషయాదుల తాను గ్రహించుటగాని జరుగుటకు వీలులేదు. నివృత్తియనగా జీవునికి తన వాస్తవస్వరూపమును గ్రహింపజేయు సత్యస్వస్వరూప వృత్తి. ప్రవృత్తి అనగా సర్వదృశ్య విషయములను గ్రహించు వృత్తి. ఇదియే విషయాకారవృత్తి. వృత్తియనునది చిత్తపరిణామము. ఇది అంతఃకరణ ధరము. కల్పితము. కాని ఈ వృత్తి ఎటువంటిదైనను వునికి వృత్తియే తన వ్యవహార—పరమార్థములను సాధించుటకు సాధనముగాని మరేమియు గాదు. కాని ఇవి జీవునికి సాధనమే కాని స్వరూపము కాదు. అయినను మానవునకు సాధనములేనిది దేనిని సాధించుటకును వీలు కాదుగదా ? కావున వుడు తన అర్థపరమార్థలాభముల రెంటికిని ఈ వృత్తినే ఆశ్రయించవలసి యున్నది. దీనిని గురించి యిచట "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అని పాతంజల సూత్రకారులున్నూ "బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రపేక్షతే" అని పంచదశీకారులును ఉభయులును ఈ వృత్తినే, సాధనముగ చెప్పుచున్నారు. కాని ఒకరిచే వృత్తి నిరోధముగను, మరియొకరిచే వృత్తి వ్యాప్తి పరమప్రాప్తి సాధనముగను తెలుపబడినది. అద్వైత సిద్ధాన్త సిద్ధికి రెండువచనములును సమన్వయము చేసుకొనవలసి యున్నది.

ఎట్లన పాతంజల సూత్రము ననుసరించి విషయవృత్తి నిరోధము వలన చిత్త స్థైర్యము కలుగును. ముముక్షువున కిదియావశ్యకము గాన దీని ఆవశ్యకత స్పష్టము. కాని ముముక్షువునకు విషయాకార నిర్విషయత్వతకున్నూ, వృత్తి బ్రహ్మాకారమగుటకునూ, తత్స్వరూపమునొంది నిలచుటకునూ గూడ యీ వృత్తియొక్క యావశ్యకత కనబడుచున్నది. కాని జిజ్ఞాసువైనముముక్షువు నకు విషయాకార చిత్తవృత్తులను నిరోధించి, చిత్తస్థైర్యము నొందించి తన సత స్వరూపమైన సత జ్ఞానానన్త లక్షణములను వృత్తిచే వ్యాప్తి నొందింపజేసి, నిదిధ్యసనాద్యభ్యాసాదుల ఫలపర్యంతము చేయుట కర్త వ్యము గాన ఈ వృత్తిస్వరూప స్వభావముల విచారించుట యావశ్యకము. శుద్ధ వుడు బ్రహ్మ స్వరూపుడే గనుక ఇప్పుడు తన వభ్రాంతి నివారణమునకు తన సత్యస్వరూపాజ్ఞానమును నశింపజేయుటకు ఈ వృత్తియే అపే క్షితమని () విద్యారణ్యులు తెలుపుచున్నారు. కాని ఈ వృత్తి కల్పితమైన అంతఃకరణ పరిణామరూపము. అయినను ఈ వృత్తియే వునకు తన ప్రయోజన, పరమ ప్రయోజనములకు, సాధన మగుచున్నది. ఈ వృత్తి రూపమైన కల్పితాంతఃకరణోపాధియే సమస్త వులకును వారివారి సుఖదుః ఖానుభవములకు, విషయభోగములద్వారా సాధనమగుచున్నది. ఈ దృశా నుభవము లన్నియు, ఎట్టివి, ఎంతవియైనను, వకల్పితములే గాని పర మార్థ వాస్తవములు కావు. అధ్యస్తమైన ఈ విషయాకార వృత్తుల వలన వునికి కలుగుచున్న సుఖదుఃఖానుభవములు గూడ వృతా శితములై తాత్కా లిక పరంపర నొందుచుండును ఈ వృత్తి వునికి సంకల్ప వికల్ప సహితమై విషయాకారములను క్షణక్షణముగా, గావించుచుండును. ఈ వృత్తిరూప మైన చిత్తము స్వభావముగ ఆత్మాకారముగాను, అనాత్మాకారముగాను కూడ నున్నది. ఇందులో అనాత్మాకారమును నిరోధించిన పక్షమున, ఆత్మాకారము స్వభావముగ స్ఫురించును కాని జీవుని యొక్క అనాది అవిద్యామాయా ప్రభావముచే ఆత్మాకారమైన తన స్వస్వరూపము స్పష్టముగా స్ఫురించదు. ఇందుకుగాను ముముక్షువునకు తనసత, స్వస్వరూపానుసంధానాదులను

## వృత్తి వివేచనము

వృత్తి వ్యాప్తిచే అభ్యసించుట యావశ్యకము. వుడు స్వభావముచేత ఆత స్వరూపుడుగా నున్ననూ జన నొందునపుడే అనాది అవిద్యావృతుడై తన వాస్తవ స్వరూపమును భ్రాంతియుతుడై మరచుచున్నాడు. అయిననూ తన పరమార్థ స్వభావమాచ్ఛాదితమై తనయందే, మెడలోని హారమును మరచిన వాని లాగున నుండును. వునకు తన సత్యస్వరూపము పరిపూర్ణమైనది గాన ఎచటికిని పోవునదిగాదు. ఎల్లప్పుడునూ తనతోడనే యుండును.

ఎట్లన ఘటము పుట్టినపుడు ఆకాశముచేత సంపూర్ణమై పుట్టును. జలము, తండులాదిద్రవ్యములు ఘటముపుట్టిన తరువాత పురుషప్రయత్నముచే ఘటములో నింపింపబడును. అనంతరమందు నింపింపబడిన జలతండులాదులను ఘటములోనుండి సివేసిననూ దానినుండి అకాశమును నివర్తింపజేయుటకు ఏప్రకారముననూ శక్యముగా నుండదు. ఇంకనూ ఘటముఖమును మూసివేసిననూ ఘటములోపల నాకాశము నిండియేయుండును, అట్లే చిత్తముపుట్టినపుడు ఆత చైతన్యముతోడనే పూర్ణమై పుట్టును. జీవునికి ఈ చిత్తము పుట్టినతరువాత సుఖదుఃఖాద్యనుభవములకు కారణములైన ధరా ధర్మములనుబట్టి ఘట పట, రూప, రస, గంధ, సుఖాదివృత్తిరూపములు మూసలోకరిగిపోసిన తామ్రమువలె చిత్తమునందు సం మించును. ఇవియే విషయాకారవృత్తులు. ఈ విషయచిత్తవృత్తులను నిరోధింపగనే స్వతస్సిద్ధమైన పరమాత్మాకారము ప్రకాశించును. చిత్తమునకు సుఖదుఃఖాది విషయాకారము ధర్మాధర ములచేత కలుగుచుండును. అనాదిసిద్ధమైన చిదాత్మాకారము జీవుడు స్వభావముచేతనే కలిగియుండును. గాని అది జీవునిప్రయత్నముచేగాని, స్పష్టముగా తెలియ బడదు. సర్వవృత్తి శూన్యమైనచిత్తము అఖండాకారమై పరమాత న ప్రకాశింపజేయును. వునకిట్టిస్థితి నివృత్త్యభ్యాసమువల్లగాని కలుగదు.

ఈ వృత్తులు వునికి ఘటోపాధిలో జలమువంటివి. అనగా ఆగన్తుకములు. ఆకాశము ఘటముపుట్టుటకుముందునూ, పుట్టినతరువాతనూ, ఘటములో జలమున్నపుడునూ, ఘటములోని జలము సివేసినతరువాతనూ, ఎల్లప్పుడునూ

ఘటమున కాకాశము నిత్యముగాయుండి ఘటనాశానన్తరము ఆ ఘటాకాశమే మహాకాశమగుచున్నది. కాని ఘటములో జలాదులున్నకాలమున ఈ ఆకాశము స్పష్టముగా కనబడక జలాదులను సివేసినయెడల ఘటాకాశముగ స్పష్టముగా గోచరించును. కాని ఘటములో జలమున్నంతకాలము ఈ ఆకాశమే అస్పష్టముగా ఘటమందుండును. ఘటములోని జలము యగనే ఆకాశము తన స్వభావరూపమున ఘటమందు గోచరించుచూ, ఘటభంగము కాగానే అదియే మహాకాశమగుచున్నది. ఇట్లే చిదాకాశము వునికి నిత్యమై వోపాధియందు ప్రవృత్తులున్నంతకాలము స్పష్టముగా తెలియబడదు, కాని అభ్యాసాదులచే విషయప్రవృత్తులను నిరోధించినయడల ఈ చిదాకాశస్వరూపమే జలముపరిహరించిన ఘటమందు ఆకాశములాగున వునియందు స్పష్టముగా స్ఫురించుచుండును. ఏలనన మహాకాశము ఘటమునకు ఎట్లు నిత్యమై సహజముగానున్నదో వుండునట్లే చిదాకాశము నిత మై సహజముగ నున్నది గాన చిత్తవృత్తుల నిరోధించగనే తన సహజలక్షణమైన చిదాకాశము వునికి స్ఫురించుచుండును. కాని పైన తెలిపినయటుల విషయవృత్తులున్నంతకాలము స్పష్టముగ తెలియబడదు కాన వుడెంతెంత దృశ్యాసక్తతా విషయవాసనాత్యాగముల నభ్యసించుచుండునో, అంతంత తనచిత్తవృత్తి స్థైరములనొంది తన వాస్తవస్వరూపబింబమును గోచరింపజేయుచుండును ఇదియే బ్రహ్మాకారవృత్తి. సాధకుని చిరకాలాభ్యాసమువలన తన స్వస్వరూపమైన బ్రహ్మాకారవృత్తివ్యాప్తిచే కాలపరిపాకమున తదాకారాకారితమగును. అనగా సత్పదార్థము గోచరించును. ఇదియే చరమవృత్తి సాక్షాత్కారమని చెప్పబడును. అప్పుడు బ్రహ్మాకారమొక్కటియేయుండునుగాని వృత్తపేక్షలేనందున వృత్తి తానుగనే నశించును. చిద్రూపజడరూపముల యొక్క వివేకజ్ఞానముచేతగూడ బ్రహ్మసాక్షాత్కారముకలుగునని పూర్వాచార్యవచనములు తెలుపుచున్నవి. ఇంకనూ,

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకారే భయాభయే।
బంధంమోక్షంచ యావేత్తిబుద్ధిస్సాపార్థసాత్వీ ।

ఇది ప్రవృత్తి, ఇది నివృత్తి, ఇదిచేయతగినది. ఇది చేయతగనిదనిన్నీ, ఇది

బంధము, ఇది మోక్షమనిన్నీ సత్త్వబుద్ధివల్లనే మానవునికి తెలియుననిన్నీ.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదు రాసురాః ।
నశౌచం నాపి చాచారో నసత్యం తేషువిద్యతే ॥

కేవల లౌకిక బుద్ధికలవారు అనగా పరమార్థమునెరుగనివారు అసురులని భగవద్వచనము తెలుపుచున్నది. ఇట్టివారు ప్రవృత్తి నివృత్తి భేదములనెరుగజాలక కేవల ప్రవృత్తిపరులై శౌచ, సదాచారములను వదలి పరమార్థసతమును గ్రహింపలేకున్నారని శ్రీ భగవద్వచనము తెలుపుచున్నది. నివృత్తి అనగా వృత్తిహీనమనిగాదు. ముముక్షువు తన పరమార్థస్వరూపమైన సత్యజ్ఞానానంత లక్షణములందు తన వృత్తిని వ్యాప్తి నొందించుటే నివృత్తి అనబడును గాని పూరకయుండుటగాదు. ఈ సాధనమే జీవునకు కాలక్రమమున సంసారబంధనివృత్తియైన ముక్తిసాధనమగును. కావున ముముక్షువైన జిజ్ఞాసువు సర్వకాలసర్వావస్థలయందును సర్వవిధములైన శాస్త్రీయ స్వప్రయత్నముతో తన వృత్తిచే ఓంకారవాచ్యుండును, ప్రజ్ఞానఘనుడును, ప్రత్యగాత యూ యగు బ్రహ్మయే తానని, అనగా అహం నేను అని ఫలపర్యంతము తన సత్యస్వరూపమైన సత్యజ్ఞానానంతలక్షణములయందు ప్రీతి నిశ్చయపూర్వకముగ వృత్తి వ్యాప్తినిగావించి దహరాకాశమందు సతతానుసంధానాదులనాచరించుచుండుటచే సంసారబంధనివర్తకమై జీవునికి ముక్తిని కరతలామలకము గావించును. ఇదియే జీవునకు బ్రహ్మాఽజ్ఞానమును నశింపజేయు పరమసాధనము. దీనికి వృత్తి సహాయమపేక్షితము. ఇదియే "బ్రహ్మణ్యజ్ఞాననాశాయవృత్తివ్యాప్తిరపేక్షతే" అని విద్యారణ్యులు తెలిపిన వచనముక తర్థమని గ్రహించవలయును.

# అనుసన్ధాన రహస్యము

ఈ బ్రహ్మవిద్యనుగురించి ఋషిప్రోక్తముగాను పూర్వాచార్యులవల్లను శాస్త్రానుభవయుక్తముగ, అతివిపులముగ, రచననిబంధనానుకూలముగను

పెక్కుగ్రంథరాజములు విరాజిల్లుచున్నవి. ఐనను గహనమైన శాస్త్రార్థసమన్వయము నెరుంగని జిజ్ఞాసువులకు ఇట్టిగ్రంథము చాలాయుపకరించుననను ఉద్దేశ్యముతో శ్రుతియుక్త్యనుభవములననుసరించి వ్రాయుచుంటిని. ఇది బ్రహ్మవిద్య. ఇందు ముముక్షువు మహావాక్యమునాశ్రయించి అనుసంధానమును జరుపవలయును. అట్టి మహావాక్యముచే తెలుపబడుసద్వస్తువు నిర్గుణ బ్రహ్మమే గాని సగుణముకాదు. కర్తృత్వభోక్తృత్వరహితమైన ఇట్టిస్వరూపము సర్వాంతర్బహిర్వ్యాపకమై స్వప్రకాశాఖండ పరిపూర్ణచైతన్యమాత్రమేయున్నది. అనుసంధానమన్న - నేను ఎట్టిస్వరూపుడను? అని తన పరమార్థస్వరూపమును బాగుగా తెలిసికొని దానిని పునఃపునః మనస్సుతో అనుకొనుట, లేక అనుసంధించుటయేకదా. ఇట్లుచేయుటకు నేను అని యుద్దేశించగనే మొట్టమొదట తనహస్తపాదాదులు, తన దేహస్వరూపము, అనగా పొట్టి, పొడుగు, స్థౌల్యము, కార్శ్యత, దేహకాంతివిలాసములు నేను చేయుచున్నానను కర్తృత్వాభిమాన వాసనలు మొదలుగాగలవన్నియు సాధారణముగా స్ఫురణకు వచ్చుచుండును. ఇట్టి పరిచ్ఛిన్నస్వరూపవృత్తులతో సత్యజ్ఞానానంతరూపమైన వస్తుగ్రహణము చేయుటకుగాని, తానుయని అనుటకుగాని సుసాధ్యముగానుండదు. ఎందుచేతననగా లోకములో బృహద్వస్తువులనేకములు కారణాంతరములచే సహజముగనే చిన్నవిగా గ్రహింపబడుచున్నవి. గాని సహజావస్థలో చిన్నవస్తువును పెద్దదిగాచూచుట సంభవించుటలేదు. ఐనను అట్టిపెద్ద పరిమాణగ్రహణములు యంత్రసహాయముల వల్లనే కలుగుచున్నవి గాని అన్యథాగా సహజముగా కలుగుటలేదు. దీనినిబట్టి మనము గ్రహించవలసినదేమన, పెద్దవస్తువుకారణాంతరములచేనైనను మన ప్రయత్నము లేక సహజముగా చిన్నదిగా కనబడుచున్నదిగాని చిన్నవస్తువును పెద్దదిగా తెలిసికొనుట ఎట్టిపరిస్థితులలోను సహజముగా సంభవించుటలేదు. గాని మన ప్రయత్నముచేతనే చిన్నదిగా కనబడువస్తువును పెద్ద పరిమాణముతో తెలుసుకొనుటకు సాధ్యమగుచున్నది. అట్లే ఇప్పుడు కారణాంతరములచే మనలకు పరిచ్ఛిన్నాకారములతో కనబడుచున్న "అహం" అనగా నేను అనుదానిని శ్రుతి

# అనుసన్ధాన రహస్యము

బోధననుసరించి అపరిచ్ఛిన్నపరిపూర్ణవస్తువుగా గ్రహించుటకు మన ప్రయత్నము లేక సాధ్యముకాదు — గాన దీనికి విశేష ప్రయత్నము కావలసియున్నది. సర్వదా పెద్దవస్తువు చిన్నగా కనుపించుటకు కారణము దోషమే. ఇట్లే బృహద్వస్తువైన బ్రహ్మనుకూడా చిన్నగా గ్రహించుటకు దోషమే కారణముగా యుండవలయును — ఇట్టి దోషమేదని విచారించిన స్వతస్సిద్ధమైన అజ్ఞానమేనని నిర్ణయమగుచున్నది. ఈయనాద్యవిద్యా సంపర్కముచే నేను అని తలచినవెంటనే తన పరిదృశ్యమానమైన విగ్రహము స్ఫురించును. ఇందుకుగాను బ్రహ్మవిద్యాభ్యాసకుడు శాస్త్ర శ్రవణ జ్ఞానవివేకముచే నేను అను తన స్వరూపము అపరిచిన్నమైనదనిన్నీ తెలుసుకొని తన్నిశ్చయమునకు సర్వదా ఎన్నివ్యవహారములు ప్రారబ్ధవశమున చేయుచున్నను ఈ కరచరణాది విశిష్టమైన దేహము నేను అను తన స్వరూపము కల్పితమనిన్నీ, ఇది కేవల వ్యవహార ప్రయోజనముకలదియేగాని సత్యము కాదని న్నీ, ఐనను తన అనాద్యవిద్యా కామకర్మఫల సుఖదుఃఖభోక్తృత్వమునకుగాను ఈ స్థూల, సూక్ష్మ (అంతఃకరణము) శరీరములు పొందితిననిన్నీ ప్రత్యక్షముగా చూచుచున్న ఈ స్థూలదేహదహనసంస్కారమైన తదుపరిగూడా శేషించునది నేను అనగా తాను అని వ్యవహరించు అంతఃకరణమేననిన్నీ ఈ యంతఃకరణోపాధిగూడా కల్పితము, నశ్యము అని వివేచన మననాదులచే తెలుసుకొని తదుపరి శేషించు ఏకపదార్థమే సత్యమైన నేను అనునది తన వాస్తవస్వరూపమని సర్వదా ప్రారబ్ధానుసారవ్యవహారము లెన్నిచేయుచున్ననూ, ఈ నిశ్చయము నభ్యసించవలయును. కొంతకాలమున కట్టి దార్ఢ్యమును అభ్యాసపాటవములచే పొందినవాడగుచూ, అప్పుడు అనుసంధానకాలములో నేను అను స్ఫురణపొందగనే తన స్వరూపము పూర్తిగా గోచరించకపోయినను నేను అని తలచినవెంటనే తను అపరిచ్ఛిన్నుడని, స్వప్రకాశరూపుడని, యీ దృశ్యమంతయు అధ్యస్తమైనదనిన్నీ వాస్తవముకాదనిన్నీ, గ్రహించి తన సత్యస్వరూపమును అనుసంధానమొనరించుటకు చాలా సుసాధ్యమగును. సులభ్యముగానుయుండును. ఇదియే రహస్యము. నేను అయిన తనయందే సర్వదృశ్యము రజ్జుసర్పదృ

ష్టాంత నా యమున భ్రాంతికల్పితమైనట్లు గ్రహించినిశ్చయించుకొనవచ్చును. కాని యచట ఒక శంకకు అవకాశము కనబడుచున్నది. ప్రథమముననే అధిష్ఠానజ్ఞానముకలిగిన అధ్యస్తదృశ్యము ఉండనేయుండదుగదా? అని. కాని ఇచ్చట ఇట్టి సందేహమున కవసరములేదు. ఎందుచేతననగా శాస్త్ర శ్రవణజ్ఞానముచేఅధిష్ఠాన స్వరూపమును తెలుసుకొన్నను అట్టి నిశ్చయము వెంటనే కలుగదు. సతతాభ్యాసమువల్లనే అట్టినిశ్చయము పొందనగును. ఇట్టి నిశ్చయమును పొందినను స్వానుభవమును పొందుటకు ఈ నిశ్చయజ్ఞాన సతతాభ్యాసము అనగా—

శ్లో॥ దృశిస్వరూపం గగనోపమంపరం సకృద్విభాతంత్వజమేకమక్షరమ్।
అలేపకం సర్వగతం యదద్వయం తదేవచాహం సతతంవిముక్త
ఓమ్॥

అనగా నేను జ్ఞానమాత్ర స్వరూపమై, ఆకాశమువలె నిత్యమై, స్వప్రకాశమై జన్మాదివికారరహితమై, పుణ్యపాపసంబంధ వివర్జితమై, సర్వవ్యాపకమై, జీవాభిన్నమై ఏ పరమాత్మ స్వరూపము కలదో, అట్టి పరమాత్మ స్వరూపము నేనే — నేనే అవిద్యావిముక్తుండను.

శ్లో॥ అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృత స్స్వయంప్రభస్సర్వ
గతోఽహ మద్వయః।
అకారణం కార్యమ వ నిర్మలః సదైవతృప్తశ్చతతో విముక్త
ఓమ్॥

నేను శుద్ధమైన జ్ఞాన స్వరూపుడను. స్వభావముచేత వికారరహితుడను. అట్టి వికారములు నాకు లేవు. నానాదిక్కులందు సర్వవ్యాపకుడనై యున్నాడను. జన్మాదులు నాకులేవు. నేను స్వస్వరూపమందున్న వాడను. పైవిధమున ధ్యాన సమాధుల వల్ల ప్రతిబంధ నివృత్త్యనంతరము "పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే" అని శ్రుతిచెప్పు అనుభవము కలుగును. ఇదియే సాక్షాన్ముక్తి మార్గము. ఇతరములు కావని—

## అనుసన్ధాన రహస్యము

శ్లో॥ ద్రవ్య మన్త్రక్రియాకాల శక్తయస్సాధు సిద్ధిదాః ।
పరమాత పదం ప్రాప్తుం నోపకుర్వన్తి కాశ్చన ॥

అనగా ద్రవ్యశక్తి, మన్త్రశక్తి, క్రియాశక్తి, కాలశక్తి ఇవియన్నియు ఫలమునిచ్చునవేగాని, పరమాత పదప్రాప్తిలో మాత్ర మివియేవియు ఉపకరించవు అని వసిష్ఠవచనము తెలుపుచున్నది. గనుక ముముక్షువైనవాడు గుర్వీశ్వరానుగ్రహములతో సిద్ధాంతదార్ఢ్యమును బాగుగా సంపాదించి సతతానుసంధానమును చేయవలెను. ఇట్లు చేయుటకు మనోనిగ్రహము కావలెను. ఇట్టి మనోనిగ్రహము చాలా ప్రయత్నముతో గాని లభించదు. అర్జునుడంతవాడు ఈ మనోనిరోధమును గురించి—

శ్లో॥ చంచలంహిమనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహంనిగ్రహం మన్యేవాయోరివ సుదుష్కరమ్ ॥

అనగా ఓ కృష్ణపరమాత్మా ! ఈ మనస్సుమిక్కిలి చంచలమైనది. ప్రమాదములు గలది. వాయువును మూటకట్టినట్లు ఈ మనస్సును నిగ్రహించుట అసాధ్యమని నేను అనుకొనెదను, అనియనిన శ్రీ కృష్ణభగవానుడు—

శ్లో॥ అసంశయం మహాబాహోమనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే ॥

అనగా మనసు నిలుపుట చాలా కష్టమైనదనుటకు సంశయము లేదుగాని, అభ్యాసముచేతను, వైరాగ్యాదుల చేతను మనసును నిరోధించ వచ్చునని చెప్పుచున్నాడు. గాన ఈ యనుసంధానము అంత తేలికగా కలుగునది కాదు. విశేషప్రయత్నాభ్యాసాదులచే సాధ్యమగును. ఎంతకష్టసాధ్యమైనను సాధించవలసినదేగాని, ఆత్యంతిక దుఃఖనాశమును కోరు మానవునకు వేరొక మార్గము లేదు. ఇట్టి అభ్యాసమే నిరంతరము విసుగుచెందక చేసిన యడల ఫలము తప్పక కలుగునని శాస్త్రమున్నూ, పూర్వాచార్యులందరు గూడా చెప్పుచున్నారు. ఎంత ప్రాజ్ఞతచే ఈ బ్రహ్మ విద్యానుసంధానమును ఎన్ని

విధముల నిరూపించినను నిరూపణపద్ధతి వివిధముగా నుండునుగాని నిరూప్యాంశము ఎల్లప్పుడును ఒక్కటిగానే యుండును. వివిధ ప్రదేశములనుంచి వివిధనామములతో ప్రవహించు నదులన్నియు చివరకు ఒక్కటియైన సముద్రములోనే కదా కలియుచున్నవి. ఇట్లే ఈ బ్రహ్మ విద్య శ్రుతిప్రామాణ్య యుక్త్యనుభవములనుబట్టి సాధకునకు సులభముగా వృత్తి గోచరమగుటకు ఇన్నివిధముల, ఇన్నిసార్లుగా నిరూపింప బడినదే గాని, గ్రహించు మహనీయునకు సిద్ధాంతము స్వల్పము "జగన్మిథ్యా బ్రహ్మ సత్యము" అనియే కద. ఐనను ఇట్టి స్వానుభవము కలుగుట సుసాధ్యముగాలేదు. గాన ఎన్ని శ్రుతివాక్యములు, అనుభవములు, యుక్తులచే నిరూపించినను ముముక్షువునకు ఎంత కాలము వరకు ఈ కరచరణాదివిశిష్టమైన దేహమే నేనను ప్రతీతి యుండునో అంతవరకు సంసారబంధము నివర్తించదు. కాని ఎప్పటినుంచి ఈ సర్వదృశ్యము స్వశరీరాదులు నేనుకాను అని దృఢనిశ్చయము కలిగి దానిని ప్రీతితో సత్యసించుచు తనదైన సత్యస్వరూపమును అనగా నాది స్వప్రకాశ, పరిపూర్ణ, అఖండ, శుద్ధ చైతన్య స్వరూపము అని తెలుసుకొని దానిని సదా అనుసంధానము చేయుచుండునో అట్టివానికి భావనాదార్ఢ్యతను బట్టి అంతంత సుఖము కలుగుచునే యుండును. ఫలము యేట్టిదైననూ ఎల్లప్పుడును మనము చేయు ప్రయత్నమును బట్టి కలుగును. దీనినే "భావనాదార్ఢ్యాత్సిద్ధిః" అని సూత్రము తెలుపుచున్నది. భావనయనగా వృత్తి గ్రహణము - వృత్తితాదాత్మ్యముగాని, వేరుకాదు. తాదాత్మ్యమనగా వృత్తితో గ్రహించిన సత్పదార్థము తానుగా భావించుట. ఇట్లు చేయుటయందు బ్రహ్మ పదార్థ నిర్గుణ లక్షణములను ముముక్షువైన వాడు గ్రహించుటకు తన అనుభవములోనున్న దృశ్యములో దాదాపు సరిపడగల పదార్థమును వృత్తి విషయము చేసుకొని ఇట్టి లక్షణములుగల (అనగా ఇచట లక్షణశబ్దము ఔపచారికము. ఎందుచేతనన, అద్వియ బ్రహ్మ వస్తువు నిరుపమానమైనది గనుక) ఐనను తన ధారణ కనుకూలమైన ఉదాహరణోపమానములను కొంతవరకైనను సుకొని శేషించిన లక్షణములను తనజ్ఞానబలముచే గ్రహించి అనుసంధానాదులను

గావించుకొనవలెను. ఇట్లు నిర్గుణ బ్రహ్మానుసంధానమునకు సహకారముగా ఇందు ఉదాహరణములు పూర్వాచార్యులచే శిష్యోద్ధరణము కొరకు చెప్పబడి యున్నవి. అట్టి యుదాహరణములలో కొన్ని — నిస్తరంగ పరిపూర్ణ శాంత మహాసముద్రము వలెనని — పరిపూర్ణ నిర్మల మహాకాశములాగుననిన్నీ — పరిపూర్ణ సంవిద్ద్రూపస్ఫటిక మహాశిలలాగున అనిన్నీ — ఇంకనూ అనేక విధములుగా చెప్పియున్నారు జిజ్ఞాసువైన ముముక్షువు తన వాసనాగ్రహణాను కూల్యములనుబట్టి యట్టి ఉపమానములను నిర్గుణబ్రహ్మ వృత్తి, వృత్తివ్యాప్తికి ఉపకరింపజేసుకొని, తదుపరి జ్ఞానసామర్థ్యము ప్రజ్ఞాబలముచే అఖండ, అద్విత ీయ, పరిపూర్ణ, సత్యతార్థగ్రహణమును మెల్లమెల్లగా సంపాదించుచూ అనగా పొందుతూ అట్టి పరిపూర్ణ చైతన్యస్వరూపుడు తానుగనే అనుసంధానాదులను విసుగుచెందక "సనిశ్చయేన యోక్తవ్యోయోగో నిర్విణ్ణచేతసా" అనిచెప్పు గీతావచనము ననుసరించి అభ్యసించుచుండిన మహనీయులకు సమాధి సుఖము-మోక్షఫలము "కాలేన పరిపచ్యన్తే కృషిగర్భాదయో యథా" అను న్యాయమున కర ప్రతిబంధరాహిత్యమైన వెంటనే నిత్యనిరతిశయానంద ప్రాప్తి కలుగును. ఇది నిశ్చయము.

ఈ బ్రహ్మవిద్యయందు చెప్పబడు సద్వస్తువు ఎల్లప్పుడునూ ఏకరూపమై ఒక్కటిగానేయుండును. బోధసౌలభ్యమునకుగాను శ్రుతియుక్త్యను భవములనుకల్పుకొని ఈయొక్క నిత్య, నిర్వకార, పరిపూర్ణవస్తువునుగురించి యెట్టివారికైనను గ్రహణము చాలాక్లేశకరము, కష్టసాధ్యము. గనుకనే అనేకవిధములుగా పలుమారులు సిద్ధాంతదార్ఢ్య సిద్ధికొరకుతెలుపుటగాని వేరు కాదు. ఎన్నిసారులు ఎన్నివిధములుతెలిపినను తన వాస్తవస్వరూపమైన సత్య జ్ఞానానందవస్తువును గురించియే గనుక జిజ్ఞాసువు విసుగుచెందక పఠించిన యెల్లప్పుడును ఇట్టి సద్వస్తువే తను అని ప్రీతి నిశ్చయములను కలుగజేసుకొని వృద్ధిపొందించుచు సదాతన స్వస్వరూపానుసంధానలాభమును సంపాదించి స్వానుభవమును పొందుటే యీ గ్రంథముఖ్యోద్దేశము గాన పాఠకులు ఇట్టి పునరుక్తులు చర్వితచర్వణమని తలచక, అందుగల గుణలాభములను శ్రేయ

స్కామ్ములై గ్రహింతురుగాక. చిత్తశుద్ధి సిద్ధాంతదార్ఢ్య ములకుగాను ఇట్టి యనుసంధానము అమృతమువంటిది. అనుసంధానమనగా ఒకవస్తువునుగురించియే అనుకొనునది తిరిగి తిరిగి అనుకొనుటయేగదా! ఇట్టిప్రయత్నము మనలకు తాత్కాలిక లోకవ్యవహారమునకే అవశ్యకమగుచుండ జిజ్ఞాసువు తన అనాద్యవిద్యా నివృత్తినికోరుతూ తన నిత్య, నిరతిశయ, సుఖమునుపొందుటకు ఎట్టిప్రయత్నము ఎంతయావశ్యకమో గ్రహించవలెను.

లోకములో సాధారణముగా ఈ బ్రహ్మవిద్య గృహస్థులకు ప్రధానము కాదనిన్నీ, ఒకవేళకావలసినను ఇట్టివిద్య వార్ధక్యమందు అభ్యసించదగినదిగాని బాల్యయౌవనదశలయందు అభ్యసించకూడదనిన్నీ తలంతురు. కాని యిట్టి అభిప్రాయము సరియైనదిగా కనబడుటలేదు — బ్రహ్మవిద్యయన్నను, సుఖస్వరూపశాస్త్రమన్నను ఒక్కటియే. ఇట్టివిద్యను పురాణపురుషులందరును బాల్యయౌవనములలో, అభ్యసించి లాభమునుపొంది తదుపరి రాజ్యవ్యవహారములను చేసినట్లు తెలియుచున్నది. ఆధునికముగాకూడ (అర్వాచీనులలోకూడ) బ్రహ్మజ్ఞులని సుప్రసిద్ధిగాంచిన పెక్కుమహనీయులు ఇట్టివిద్యను వారి వారి అల్పవయస్సునందే సంపాదించి కొందరుమహనీయులు లోకమునకెట్లు ఉపకారముగావించిరో అది బహుజనవిశదమే. ఇదిమానవునకు సుఖసాధన శాస్త్రము. -వితకాలములలోగాని వితానంతరముగాని సుఖమునుపొందుటకు ఈ శాస్త్రము అమృతమువంటిది. అనగా ఇంతకన్న చెప్పుటకు వేరుమాట లేదుగాన ఇట్లు తెలుసుకొనవలయును. లోకాభిప్రాయము ననుసరించి ఈ విద్యను వార్ధక్యములోనే పొందుటకు సుసాధ్యముకాదు. ఏలనన, ఈ విద్య స్థైర్యదార్ఢ్యములవల్లగాని సాధించుటకు వీలులేదు. ఇట్టిస్థితి సాధారణముగ వార్ధక్యమునందు దుర్లభమగును. దేహపాటవముతగ్గి మనశ్చాంచల్యము అదుర్దా ఆందోళనలు హెచ్చును. సాధారణముగా మనశ్శాంతి యుండదు. "వార్ధకేవర్ధతేచింతా" అని శాస్త్రము చెప్పుచున్నది. అనుభవముకూడా ఇట్లేయున్నది. గనుక ఇట్టివాస్తవ సుఖస్వరూపశాస్త్రమైన బ్రహ్మవిద్యను వయోబలమున్నప్పుడే సాధించవలెను. వార్ధక్యమున కష్టసాధ్యము. దీనినే "వృద్ధస్సన్ కింకంష్యతి" అని వసిష్ఠమహామునిగూడా తెలిపియున్నారు.

# జ్ఞాని యభ్యసించ వలసిన లోకదృష్టి

ఇచట జ్ఞానియనగా జ్ఞానాభ్యాసకుడు. జ్ఞానమనగా బ్రహ్మ జ్ఞానమనియే గ్రహించవలెను. ఇట్టి అభ్యాసకుడు సదాచార జపతపాదులనెంత యాచరించు చున్ననూ తన నిత్యానిత్యవివేకవిచారములచేత, తాను విధిగా ననుభవింపవల సిన తన ప్రారబ్ధఫలభోగమునకుగాను, తనలోకానుసరణను, సవరించుకొనుచూ లోకమునందు మిథ్యాత్వదృష్టిని వృద్ధిచేయుచూ దానిని క్రమక్రమముగా నభ్యసించుచుండుట యావశ్యకమై తన అభ్యాసమునకు ప్రఫలకారియగును. ఇట్లుగాక కేవలముగాచేయు జపతపాదులు అంత ప్రఫలకారులు కాజాలవు. జ్ఞానాభ్యాసకుడు తన లోకదృష్టిని శాస్త్రబోధవలన తత్త్వదృష్టికి తన వివేక ముచే మార్చుకొనవలయును.

ఈ జగత్తంతయూ గొప్పదైన యొక మహానది వంటిది. ఈ ప్రపంచ ప్రవాహముగూడ నదీ ప్రవాహములాగున సర్వదా మారుచూ కొంతకాలము బురదనీటితో అతివేగముగాను, కొంతకాలము నిర లోదకముతో శాంతము గాను ప్రవహించుచుండును. ఇంకనూ ఈ నదులయొక్క వరదలకాలములో ఆ నీటియందే పెద్దవృక్షములు, కల్ప, వెదురు, జంతువులు, ఇంకనూ ప్రవాహమధ్యముననున్న కుటీరములు గృహోపకరణములు, గడ్డివాము లుతోసహా ప్రవాహముతోడ వచ్చుచుండును. ఇట్టి సమయమున భయంకరముగా నుండును. అయిననూ సామర్థ్యముగల నిపుణులును, ఈతకాండ్రును, అట్టి ప్రవాహమందొచ్చు, వివిధవస్తువులను నిరోధించి వాటినిపొంది అధికలాభము నొందుదురు. ఇంకనూ పరిపాలనా శాఖాధికారులు యిట్టి నదులకు వారధులు కట్టించి యట్టి నీటిని వ్యవసాయా వృద్ధి మొదలగువానికి వాడుచుందురు. ఇంకనూ యిట్టినదులయందే జలపాతములున్నచోట యట్టివాటినిబంధించి విద్యుచ్ఛక్తినిఉత్పత్తి గావించుచుందురు. ఇదియిట్లుండ వరదలకాలమందుప్రవా హమును నిరోధింపకున్న యీ ప్రవాహజలమే అనేకగ్రామాదులను, వరాసు

లను, ధ్వంసము గావించుచుండును. కావున వివేకులు యిట్టి వరదప్రవాహమును నిరోధించి వారి వారి జీవితోపయోగములకు అనగా వ్యవసాయనావిక పరిశ్రమలకు నుపయోగించుచున్నారు. ఇట్లే జ్ఞానియగువాడు యీ జగత్ప్రవాహమునందు సర్వదాగలుగుచుండు శాంత, ఘోర, వివిధమార్పులను నదీ ప్రవాహదృశ్యములాగుననే అనిత్యమని తలచి అట్టి దృశ్యమునంతయునూ తన జ్ఞానానుభవలాభములకు నుపయోగించుకొనుట, వివేకమును, శ్రేయోదాయకమునగును. ఈ జగద్వ్యాపారమంతయూ నదీ ప్రవాహమువంటిదే. దీనికి కేవల వ్యవహారోపయోగమే గాని పారమార్థికవాస్తవికత ఎంతమాత్రమును లేదు. జ్ఞానియగువాడు తన శరీరముగూడ యిట్టిదేనని నిశ్చయముగా గ్రహించి తన లోకవ్యవహార సత్యత్వములయందు అత్యంతా మాన, సక్తతలను చెందక వ్యవహారలాభనష్టములచే, కామ క్రోధ దుఃతుడుగాక, సక్తతా మానములను క్షయింపజేసినవాడై తన ప్రారబ్ధకర్మఫలానుభవములను యథాప్రాప్తముగ, తన నిత్యానిత్య వివేకములతోడ చిత్తవృత్తులను నిరోధించి యనుభవమును చేయుచుండుటయే తనకు యోగసాధనమని యెరుగవలయును. జ్ఞానియగువాడు సుఖదుఃఖములగు తన లోకానుభవములన్నియూ తన కర్మఫలములేనని నిశ్చయమునొంది యిట్టివి తనకు అన్యప్రేరితములెన్నటికిని కాజాలవని గ్రహించవలయును. అట్టితరి యన్యములందు తన కామక్రోధాదులు తగ్గుచుండును. దీనినే "స్వకర్మసూత్రగ్రధితోహిలోకః" అను వచనము తెలుపుచున్నది. ఇంకనూ జ్ఞానియగువాడు యిప్పుడు తనకుయున్న పుత్ర, మిత్ర, కళత్రాది, విత్త, క్షేత్రాదుల సంబంధబాంధవ్యములనూ, స్వత్వాధికారములున్నూ, అన్నియూ నదియొక్క వరదప్రవాహమునందు కలసికొట్టుకువచ్చు బహుకాష్ఠసంబంధములవంటిది యని తెలుసుకొనవలయును. ఎట్లన యీ కాష్ఠములన్నియూ ప్రవాహమునందుకలసి కొంతదూరము యేకముగా కొట్టుకువచ్చి, ప్రవాహముమారగనే దేనికది విడిపోవునట్లు యిట్టి సంబంధ, బాంధవ్య, స్వత్వములన్నియూ ఆయా వులయొక్క కర, ఫల, ప్రవాహ మార్పులచే మారుచుండును. కాని యివియన్నియూ తనకు శాశ్వతములు

## జ్ఞాని యభ్యసించవలసిన లోకదృష్టి

గావని జ్ఞానియగువాడు సర్వదా నిశ్చయమునొంది తన సంబంధ, స్వస్వామిత్త్వ భోగములనొందుచుండవలయును. ఈ పులకు కర ఫలములు న్నన్నములుగనుండును. కావున ఏ పునకెట్టి కర ఫల మనుభవింపవలసియున్నదో ఆయా వులట్టి కుటుంబపరిస్థితులలో జని ంచి వారి కర ఫలానుభవములుకాగానే, యొక్క-క్షణమైననూ నుండరు. కనుక ఈ అధికార, యైశ్వర్యములును, కుటుంబసంబంధములునూ అన్నియూ కల్పితములు గాని వాస్తవములుగావని జ్ఞానియగువాడు నిశ్చయము నొందవలయును. జ్ఞాని తనకు యీ జన తన ప్రారబ్ధకర ఫల క్షయమునకు మాత్రమే వచ్చినదిగాని, అన్యమునకుగాదని నిశ్చయముగా తెలుసుకొనవలయును. కావున తనకుతప్పని తన ప్రారబ్ధకర ఫలానుభవములను నిపుణతతో అనగా కౌశలముతో యనుభవించుచుండవలయును. అట్లుకానిచో యిట్టితన ప్రారబ్ధకర ఫలానుభవములే ఫలోత్పత్తికి హేతువై తనకు భావిప్రతిబంధకములను కలిగించుచుండును. కర ల యందు యిట్టి భావికర ఫలోత్పత్తినివ్వాజాలని కౌశలము యేదియనిన:-

"అసక్తో హ్యాచరన్ కర్మ, పరమాప్నోతి పూరుషః" యనిన్నీ "తసాదసక్త స్సతతం, కార్యంకర్మసమాచర" యనిన్నీ, "యోగః కర సుకౌశలమ్" యనిన్నీ యిట్లు కర ల నిర మానుడై సక్తతారహితముగ ఫలాభిసంధిలేక, నాచరించుటయే కౌశలమనిన్నీ, యోగమనిన్నీ, శ్రీ కృష్ణభగవానులు గీతలలో స్పష్టముగా తెలుపుచున్నారు. కావున జ్ఞానియగువాడు స్వశ ర సర్వదృశ్యమగు, "అహమిదం మమేద" ములన్నియూ, యనిత్యములు, కల్పనామాత్రములు, తనకు వల వ్యవహారానుభవసాధనములు మాత్రమే నని తెలుసుకొని తన స్థితి, దేహధారణానుకూల వ్యాపారములను నిర్లిప్తుడై యనుభవించుచుండవలయును. ఏలనన జ్ఞానికిని తన ప్రారబ్ధకర ఫల భోగానుభవములు సామాన్యముగా తప్పవని, లోగడనే విపులముగా నిరూపించి యుంటిమి. జ్ఞానియగు వానికి తనకు దృశ్యమందు గలుగునట్టి యీ సక్తతా మానములే రాగద్వేషములుగ పరిణమించి తన మోక్షప్రాప్తి

ప్రబల విరోధులగును. కాని యీ తన కర ఫలమును, నిర్లిప్తతతో, ప్రారబ్ధానుసారమున నిరభిమానముగా ననుభవించు భోగములు మాత్రము బంధహేతువులు గాజాలవు. అయిననూ జ్ఞాని యగువాడు వివేకముతో విషయ భోగేచ్ఛలను నిరోధించు ప్రయత్నము చేయుచుండుట తన జ్ఞానాభ్యాసమునకు సహకరించును. కావున జ్ఞానియగువాడు తన ప్రారబ్ధానుసారమున లోకవ్యవహారములనేమిచేయుచున్ననూ తన వృత్తినిమాత్రము నిట్లుంచుకొనవలయును.

ఈ దృశ్య సంబంధములన్నియూ నా శరీరమునుబట్టియేగదా గలుగుచున్నవి. ఇట్టి నా శరీరమే కల్పితమై యనిత్యమగుచున్నందున యీనా సర్వ లోకానుభవములు గూడ యనిత్యమై కల్పితములై కేవల నావ్యవహారానుభవమునకు మాత్రమే నుపయోగించుచున్నవి గాని, తదుపరి నాకును, వీటికిని యెట్టి సంబంధము వాస్తవముగా గనుబడుటలేదు. ఇట్టి సంబంధములన్నియూ గూడ గల్పితములే. దీనినే—

శ్లో॥ విశ్వంపశ్యతి కార్యకారణతయా, స్వస్వామి సంబంధతః ।
శిష్యాచార్యతయా తథైవపితృ పుత్రాద్యాత్మనా భేదతః ॥

అని శ్రీ శంకరభగవత్పాదులు ఇట్టి భేదములన్నియూ కల్పితములని తెలుపుచున్నారు. కావున యిట్టిసంబంధభేదములన్నియూ కేవలకల్పితములని జ్ఞాని యగువాడు నిశ్చయమునొంది తన ప్రారబ్ధానుభవములను చేయుచుండుటయే వివేకము, పరమార్థసాధనము యగును.

కనబడుచున్న ఈ జగత్తంతయూ జ్ఞాన, (తెలివి) జ్ఞాతృ, (తెలుసుకొనువాడు) జ్ఞేయము, (తెలియబడునది) యనువానికన్న మరేమియుగాదు. వేరేమియులేదు. వుడు వాస్తవమున నిత్యమైన జ్ఞానస్వరూపుడు. పరమార్థతః యిట్లేతన జ్ఞానస్వరూపమునందే అనాది మాయా ప్రభావమున జ్ఞాతృ, జ్ఞేయములు అధ్యస్తములై యున్నవి. ఎట్లన వ్యవహారవాస్తవమైన రజ్జువయందే అజ్ఞానకల్పితమైన సర్పాకారము ఎట్లు కలుగుచున్నదో

## జ్ఞాని యభ్యసించవలసిన లోకదృష్టి

ఇట్లే జీవునకు జ్ఞానస్వరూపుడైన తనయందే మాయచే దృశ్యమంతయూ అద్దమునందు గనుబడు నగరములాగున ప్రకాశించుచూ తనకు బయట యున్నట్లు, నిద్రచే స్వప్నములాగున నిద్రయను తన యజ్ఞానమువల్ల యీ దృశ్యమంతయూ, గనబడుచున్నదేగాని మరేమియుగాదని:—

శ్లో॥ విశ్వందర్పణ, దృశ్యమాననగ , తుల్యంనిజాంతర్గతం।
పశ్యన్నాత్మని, మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా ॥

యని శ్రీ శంకరభగవత్పాదులు తెలుపుచున్నారు.

జ్ఞానము అపరిచ్ఛిన్నము, సత్యము. జ్ఞాతృజ్ఞేయములు పరిచ్ఛిన్నములు, కల్పితములు. ఈ పరిచ్ఛిన్నకల్పితములైన జ్ఞాతృ, జ్ఞేయములను పరిత్యజించినయెడల శేషించునది నిత్యమైన జ్ఞానమొక్కటియే. ఇదియే శుద్ధ జీవుని సత్యస్వరూపము. ఈ జగత్తునకు సత్యజ్ఞానస్వరూపుడగు శుద్ధజీవుడే అధిష్ఠానము. శుద్ధజీవుడు జ్ఞానస్వరూపుడు. కావున అహమిదములు రెండును యీ జ్ఞానమునందే గల్పితములు. జ్ఞానమన్ననూ, చిత్ అన్ననూ ఒక్కటియే. తత్త్వమువిచారించిన వాస్తవముగనున్నది దేశ, కాల,వస్త్వబాధితమై పరిపూర్ణముగనున్న యీ అఖండ జ్ఞానపదార్థ మొక్కటియే. ఇదియే తెలుసుకొనవలసిన పరమార్థతత్త్వము. దీనినే ఎప్పుడు, సతతము తానుగా భావించుచూ యనుభవము నొందదగినది. ఈ విషయమునే యోగవాశిష్ఠమందు "బల్యుపాఖ్యానము" తెలుపుచున్నది. ఇది ఏదియనిన, పూర్వకాలమున, బలిచక్రవర్తి తత్త్వ సారము నెరుంగగోరి తన గురువైన శుక్రాచార్యుని ప్రార్థింపగా ఆయన ప్రసన్నుడై తాను దేవకార్యముమీద అతి త్వరముగ వెళ్ళవలసియున్నదనియూ, అయినను సర్వతత్త్వ సారమును సంక్షేపముగా చెప్పి వెళ్ళుదు ననిః—

శ్లో॥ చిదిహాస్తీతి చిన్మాత్రం మనశ్చిన యమేవచ ।
చిత్త్వం చిదహమేవేతి లోకాశ్చిదితి భావయ॥

అనగా యీ ప్రపంచమంతయూ చిత్ స్వరూపము గలదనియూ చిన్మాత్రమే ననియూ మనసుగూడ చిన్మాత్రమనిన్నీ, నీవు చిత్స్వరూపుడవు, నేను చిత్ స్వరూపుడను, లోకములు చిత్ స్వరూపములని, భావింపుమని చెప్పెను. ఇదియే సర్వతత్త్వసారము ఇది నీకు తెలియని యడల యింకనైన నేను చెప్పిననూ నీకు తెలియదని బలిచక్రవర్తికి చెప్పి తాను దేవలోకమునకు జనినట్లునూ, అనంతరము బలిచక్రవర్తి ఈ యుపదేశము నభ్యసించి ముక్తినొందినట్లున్నూ తెలియుచున్నది. కావున అహమిదములుగల యీ జగత్తంతయునూ జ్ఞాన మాత్రమేనని ముముక్షువు నిశ్చయముగా గ్రహించవలెను — వునికి యీ జ్ఞానమనునది లేనిదే తానును, యీ ప్రపంచమును గూడ యుండుటకు వీలులేదు అయినను యిప్పుడు వుడు "అహం" నేను, ఇదం యీ ప్రపంచము యని వ్యవహరించు జ్ఞానమంతయు వాస్తవము గాక, పరిచ్ఛిన్నమైన దిగా నున్నది. ఇట్టి పరిచ్ఛిన్న జ్ఞానము వునకు సహజస్వరూపముగాక ఆగంతుకమై యున్నది ఈ ఆగంతుకమునకు వభ్రాంతియే కారణము. ఇది మాయాకల్పితము. వుడు యిట్టి పరిచ్ఛిన్న భ్రాంతి నొందుటవలననే జనన మరణములు, సంప్రాప్తమగుచున్నవి. వుని సంసార దుఃఖపంకమగ్నుని చేయుచున్నది. వునికి జననమరణము లను గమనాగమనములు పరిచ్ఛిన్న భ్రాంతి యున్నప్పుడే సంభవముగాని లేనిచో వునకు వాస్తవమున యీ జననమరణప్రవాహ సంసారము లేదు. వుడు యిట్లు తనకు కలుగుచున్న సంసారదుఃఖమంతయూ ఆగంతుకమనియూ, భ్రాంతి మాత్రమే ననియూ, గురుశాస్త్రబోధవలన తెలిసికొని తాను పరిపూర్ణ జ్ఞానస్వరూపుడని నిశ్చయానుభవముల నొందిన యడల యీ జననమరణరూప గమనాగమనములు గలుగుట అసంభవమగును. అప్పుడు తాను అద్వితీయ, పరిపూర్ణ, జ్ఞానస్వరూపుడుగ శేషించును. ఇదియే మోక్షము. ఇట్టి స్థితినే వునకు — "అత్ర బ్రహ్మ సమశ్నుతే" యిచటనే బ్రహ్మ స్వరూపుడగునని స్పష్టము చేయుచున్నది. కావున జ్ఞానాభ్యాసకుడు తనలోకదృష్టిని యిట్లు మార్చుకొనుటకు నభ్యసించుచుండవలెను. జ్ఞాతృజ్ఞేయములు

కల్పితములు, అధ్యస్తములు అయివున్నవి. ఎన్నిదృశ్య, పరిణామ, వికార ములు కలుగుచున్ననూ నివియన్నియూ తెలుసుకొనునట్టి (జ్ఞాతృ) తెలియ బడు నట్టి (జ్ఞేయ) పదార్థములందే గలుగుచున్నవి గాని, వునకు తన వాస్తవ స్వరూపమైన జ్ఞానమందు ఎచటనూ, ఎన్నడునూ, ఎద్విధముగనూ, మార్పు కలుగుట లేదు. కావున ముముక్షువైన జ్ఞాని తనవాస్తవ స్వరూపము సర్వాధి ష్ఠానమైన జ్ఞానమేయనియూ, తదితరములన్నియూ గల్పితమనియూ, అట్టి సర్వాధిష్ఠాన పరిపూర్ణ జ్ఞానస్వరూపుడు తాను అనగా నేనే అహం అని బాగుగ తెలుసుకొని లోకమునందు తన ప్రారబ్ధానుభవములను నిర్లిప్తతతో పొందు చుండుటయే వివేకము. జ్ఞాని ఇట్టి నిశ్చయ దృష్టితోడనే లోకములో వ్యవహ రించు చుండవలెను. ఇట్టి నిశ్చయముతోడనే "అహం సర్వ మిదం విశ్వం పరమాతా హమచ్యుతః!" అను శాస్త్ర వచనమును, సమన్వయము గావించు కొనవలసి యున్నది. ఇదియే వుని పరమార్థము. కావున జ్ఞానాభా సకుడు దృశ్య సక్తతా మానరహితుడై తన వయా తను, స్థితి, శరీర ధారణాను కూలమాత్రముగ గడుపుచూ స్వశరీర జగని ధ్యాత్వజ్ఞాన నిరూఢిని, తన మోక్షప్రాప్తి పర్యంతము యభ్యసించుచుండుటయే తనకు తత్త్వజ్ఞాన సాధనమై, యిదియే తన స్వస్వరూపసిద్ధినిచ్చు దివా మృతమని గ్రహించి లోక దృష్టిని మార్చుకొని తన ప్రారబ్ధకరా నుభవములందు సక్తుడు గాక స్వశరీర సర్వదృశ్యానుభవములను స్వప్నతుల్యముగా నెంచి యీ విశ్వ మంతయూ దీర్ఘస్వప్నము లాగున, ననుభవించుటయే జ్ఞాని యొక్క లోక దృష్టిగా నుండవలయును, ఇదియే సతతము నభ్యసించుచున్న, నిదియే జ్ఞాన సాధనమై, సిద్ధినిచ్చును.

ఇంకనూ యీ జ్ఞానాభ్యాసకుడు, జ్ఞానము నిత్యమై పరిపూర్ణ పదార్థమై సర్వత్రా నిండియున్నదని శాస్త్రము తెలుపుచున్ననూ గనబడుటలేదేయని శంకించ గూడదు. ఏలనన లోకమునందున్న పదార్థము లన్నియూ సర్వదా అందరకును ఇంద్రియ ప్రత్యక్షములై యుండవలెనను నియమములేదు. దీనికి కారణములనేకము లున్నవి. కావున జ్ఞానియగువాడు సర్వము జ్ఞానస్వరూపమని

తన ప్రయత్నముచే తెలిసికొనవచ్చును. కొన్ని పదార్థములు ఫలానుభవము వల్ల తెలిసికొన సాధ్యముగాని కేవల యింద్రియగోచరములుగా నుండవు. ఎట్లన, ఆకాశమునందు శబ్దగుణమున్ననూ సాధారణ మానవుల కది తెలియ బడుట లేదు. ఈ శబ్దము ఆకాశమందు తరంగరూపమున కలసియుండి గనుబడక యున్నది. దానిని శాస్త్రజ్ఞులు విమర్శించి యంత్రసాహాయ్యమున వాటిని యాకర్షించి యీ శబ్దతరంగములు ఆకాశమునందంతటను యున్నవని తెలిసికొని కనుబడక సర్వత్రా ఆకాశమునందున్న యీ శబ్ద తరంగములను ఆకర్షించుటవలన రేడియోయంత్రముల సాహాయ్యమున అందరూ యీ శబ్దప్రసారముల నెట్లు వాడుకొనుచున్న విషయము, ప్రస్తుత మందరకును తెలిసినదియే. ఇట్లే జ్ఞానము వ్యవహారమందాకాశములాగుననే సర్వత్రాపరిపూర్ణమై జీవులకు స్పష్టముగా తెలియబడక చిదాకాశరూపమున నున్నది, అట్టి దానిని వివేకులైన వులు గురు శాస్త్ర బోధవలన బాగుగ గ్రహించి తన మనస్సను యంత్రమును శుద్ధపరచి, అనగా, శాస్త్రీయ ముగ సంస్కరించుకొనిన యడల సర్వత్రా పరిపూర్ణమైనట్టి జ్ఞానము తెలియ బడును. ఇది ప్రయత్నసాధ్యము. ఇట్లు తెలియబడిన జ్ఞానము, జ్ఞాని యొక్క యభ్యాసపాటవములచే కాలక్రమమున, యిట్టి అద్వియ, అఖండ, జ్ఞానస్వరూపుడు "తాను" అనగా నేను అని అనుభవమునొంద సాధ్యమగును.

కావున జ్ఞానాభ్యాసకుడు తన మనస్సును శాస్త్రీయముగ సంస్కరించు కొని తనలోకదృష్టిని తత్త్వదృష్టికి మార్చుకొనుట యావశ్యకము. ఇట్టి జ్ఞానదృష్టిని సంపాదించి స్వస్వరూపానుసంధానాదుల నభ్యసించుచుండుట వునకు తన ఆత్యంతిక దుఃఖనివృత్తికి పరమసాధనమని నిశ్చయముగా తెలిసికొనవలయును.

జ్ఞానాభ్యాసకుడు సర్వదా దృశ్యమందు తన పరిపూర్ణసర్వాత్మకత్వ మును గ్రహించుచుండవలయును. ఎట్లన శ్రీ విద్యారణ్యస్వామిచే తెలుపబడి

నట్లు వునకు యిపుడు తన వాస్తవస్వరూపమైన పరిపూర్ణచైతన్యము గోదేహమందుండు ఘృతములాగున యున్నదని తెలిసికొనవలయును. గోదేహమందున్నట్టిఘృతము మానవునకు నేతిరూపమున నుపయోగపడుట..దు. కాని గోవునుంచి పాలు పితికి, కాచి, తోడువైచి, చిలికినయడల ఆగోదేహమందున్న ఘృతమే నేతిరూపమున మానవులకెట్లుపయోగపడుచున్నదో, అట్లే ..వుడు తన వాస్తవస్వరూపమై, సర్వత్రావ్యాపించియున్న తన పరిపూర్ణచైతన్య స్వరూపమును శాస్త్రీయ, శ్రవణ, మనన, నిదిధ్యసనాదిప్రక్రియాభ్యాసములచే ముముక్షువునకు తన వాస్తవస్వరూపమైన అద్వి.య, అఖండ, పరిపూర్ణ చైతన్యము గోచరించి కాలక్రమమున నిత్య నిరతిశయానంద రూపునిగా చేయును. కాన జ్ఞానాభ్యాసకుడు తన సత్యస్వరూపమిట్లు జగత్పూరితమై యున్నదను దృష్టితో తన అభ్యాసము నాచరించుచుండుట శ్రీఘ్రఫలదాయకమని గ్రహించవలెను.

ఇంకనూ లోగడనే తెలిపినటుల విద్యుచ్ఛక్తి స్వరూపస్వభావమున ప్రపంచమునకంతయూ క్షనొటియై సర్వత్రాయున్ననూ అట్టిదానిని వివేకవంతులగు ప్రజ్ఞావంతులు స్వాధీనపరచుకొనగలిగిన ఆ విదుచ్ఛక్తియే అతిసూక్ష్మ మహాయంత్రములైన వివిధోపాధులన్నిటియందు పనిచేయుచున్నది. ఇట్లుపని చేయుశక్తిఅంతయూ విదుచ్ఛక్తిదిగాని ఉపాధిరూపమైన యంత్రములది గాదను జ్ఞానము వివేకులందరికిని ఎట్లుకలుగుచున్నదో అట్లే ప్రపంచమున సర్వోపాధులందు జ్ఞానస్వరూపము తనదేననియూ ఉపాధులన్నియూ జడము లేననియూ నిశ్చయముగ గ్రహించి తన పరిపూర్ణసర్వాత స్వరూపమును అపరిచ్ఛిన్నముగా తెలిసికొనినయడల అట్టిపరిపూర్ణజ్ఞానస్వరూపుడగు తాను సర్వోపాధివినిర్ముక్తుడై సర్వత్రాయున్నానని గోచరించును. దానినే జ్ఞాని యగువాడు:—

కం॥ ఇందుగలనందులేనని
సందేహమువలదు, నేనుసర్వోపగతిన్
యందెందువెదకిచూచిన
నందందేకలను, నాదుమోహము రన్ ॥

అను నిశ్చయముతో తన యుపాధితాదాత్మ్యమోహమును శ్రవణ, మనన, నిదిధ్యసనాదుల యభ్యాసముచే తొలగించుకొనవలయును. జ్ఞానాభ్యాసకునకు సర్వదా తత్త్వశాస్త్రవిచార, అనుసంధానాదులనుచేయుచూ యీ దృశ్య ప్రపంచమందు తన సర్వాత్మ భావనను అభ్యసించుచుండుటయే వివేకము.

జ్ఞానాభ్యాసకునకుకూడ యీ ప్రపంచమందు సక్తతా మానములు గలుగుచుండును. దీనికి కారణము తన మిథ్యాజ్ఞానమే. అనగా వాస్తవముగాని దానిని వాస్తవమని యనుకొనుటచే గలుగుచున్నది. ఇట్లనుకొనుటకు కారణములు నాలుగు విధములు. అందు మొదటిది అనిత్యములైన పర్వతనదీసముద్రాదులయందు నిత్యములనుబుద్ధి. రెండవది, పుత్రభార్యాది శరీరములయందు శుచిత్వబుద్ధి. మూడవది, దుఃఖకరములైన కృషివాణిజ్యాది వ్యాపారములయందు సుఖత్వబుద్ధి. నాలుగవది, గౌణాత్మలైన పుత్రభార్యాదులయందునూ మిథ్యాత్మలగు స్థూలసూక్ష్మ శరీరములయందునూ సుఖాత్మ బుద్ధి. ఈ గౌణాత్మ మిథ్యాత్మలను గురించి లోగడనే వివరించియుంటిమి. జ్ఞానాభ్యాసకుడు ప్రయత్నముతో యీ నాలుగువిధములయిన దృశ్యసక్తతా మానకారణములను తొలగించుకొనవలయును.

మరియును జ్ఞాని యీ ప్రపంచమునంతనూ రజ్జువయందుభాసించు సర్పమువంటిదని శాస్త్రానుసరణముగ నిత్యానిత్య వివేక విచారములచే తెలిసికొని నిశ్చయమునొంది తన లోకదృష్టిని మార్చుకొనవలయును. ఎట్లనమందాంధకారమున వ్యవహారసత్యమైన రజ్జువయందు ప్రాతిభాసిక సర్పమెట్లు గనబడుచూ భయకంపాదులను గలిగించుచున్నదో యట్లే జీవునకు పరమార్థసత్యమైన బ్రహ్మయందు వ్యవహారసత్యమైన యీ ప్రపంచమంతయూ గనబడుచూ యీ యనాది సంసారదుఃఖమును జీవునకు గలిగించుచున్నది. వ్యవహారసత్యమైన రజ్జుజ్ఞానముచే ప్రాతిభాసికసత్యమయిన సర్పమెట్లు నశించుచున్నదో యట్లే జీవునకు పారమార్థికసత్యమైన బ్రహ్మజ్ఞానము గలుగగనే యీ వ్యవహారసత్యమయిన ప్రపంచము నశించునని యెఱుగవలయును. పై

## జ్ఞాని యథ సించవలసిన లోకదృష్టి

రెండు నిరూపణలయందునుగూడ అధిష్ఠానజ్ఞానము కలుగగనే అధ్యస్తములు నశించుచున్నవిగదా. యివి రెంటికి సమానము. గనుక జ్ఞాని యీ ప్రపంచ మిట్టిదియేయని తన జ్ఞానదృష్టిచే సర్వదా యభ్యసించుచుండవలయును. ముముక్షువులు యిట్టితత్త్వ దృష్టిని సంపాదించుటయే వేదాంత శాస్త్రప్రాదింత్య పరమ ప్రయోజనమని గ్రహించవలయును.

ఇంకను పంచదశికారు లిట్లు తెలుపుచున్నారు —

శ్లో॥ స్వస్వప్న మాపరోక్ష్యేణ దృష్ట్వాపశ్యన్ స్వజాగరమ్ ।
చింతయే దప్రమత్తస్స న్నుభావనుదినం ముహుః ॥

అనగా స్వప్నమును ప్రత్యక్షముగా జూచుచున్నందున, జ్ఞాని తన జాగ్రదవస్థను జూచి పొరపాటుపడక స్వప్నజాగ్రదవస్థలు రెండును సమానము లేననినీన్ని, స్వప్నమువలె జాగ్రదవస్థయు సత్యముకాదనినీన్ని ప్రతిదినంబును మాటిమాటికి విచారించుకొనుచుండవలయుననినీన్ని,

మఱియును జ్ఞానాభ్యాసకుడు తన దృఢమైన జగన్మిథ్యాత్వ జ్ఞానము వలన తన ప్రారబ్ధఫలమగు సుఖదుఃఖాది ప్రాపంచిక విషయములను అనుభవించుట యందు తనకు సౌలభ్యమేర్పడునని తెలసికొనవలయును. ఏలనన- ఈ మిథ్యాత్వ జ్ఞానము జగదసత్త్వమును తెలుపును గాని జగత్స్వరూపమును నశింపజేయజాలదు. ఏలనన — భ్రమకల్పిత స్థలముయందంతటను దృశ్యములు కల్పితములు గనుగ నాశమెట్లు కలుగును? కలుగదు. వాస్తవముగనున్న రూపముకు నాశముగాని, కల్పితరూపముకు నాశములేదు. కాని జ్ఞాని, తన యథార్థ జ్ఞానముచే వస్తువులయొక్క అయథార్థతను గ్రహించును. ఈ సంగతి నెఱిగినవానికి అట్టి విషయానుభవములు తనకు అధిక సుఖదుఃఖ ప్రదములు గాక నిర్బాధకముగ ననుభవముల నిచ్చుచుండును. కాన ముముక్షువునకు తన జగన్మిథ్యాత్వ జ్ఞానము, తన సతతానుసంధానాభ్యాసాదులు, తన ప్రారబ్ధఫలానుభవములు చేయుట హానికరములు కావని

యెరుగవలయును. దీనినే విద్యారణ్య స్వామి విశదముగ నిట్లు తెలుపు చున్నారు—

శ్లో॥ ఇంద్రజాలమిదంద్వైత మచింత్య రచనాత్వతః ।
ఇత్యవిస్మరతో హానిః కావా ప్రారబ్ధ భోగతః ॥

అనగా — ఇంద్రజాలమువంటి ఈ ద్వైతమంతయు కల్పితము, మిథ్యా మాత్రమను సంగతి గ్రహించిన జ్ఞానికి తన ప్రారబ్ధఫలసుఖ దుఃఖానుభవ ములకు అనుసంధానాదులు హానికరములుగావని స్పష్టముగ తెలుపుచున్నారు. కావున జ్ఞానాభ్యాసకుడు దీనిని నిశ్చయముగ తెలిసికొని తన జగని థ్యాత్వ భావనను, అనుసంధానాభ్యాసాదులను విడువక నాచరించుచుండుటయే తనకు ముక్తిసాధన మగుచు, తన ప్రారబ్ధకర ఫలానుభవములందు సుఖము నిచ్చునని నిశ్చయముగ గ్రహింపవలెను. ఇట్టి జ్ఞానదార్ఢ్య స్థితియే జీవన్ముక్తి యగుచు, ప్రారబ్ధాంతమందు పరమముక్తి నొసంగునని జ్ఞానాభ్యాసకుడు తెలిసి కొనవలయును.

# ఆత్మబోధ

ముముక్షువు నేను అహం అను తన వాస్తవస్వరూపమును తెలుసుకుని అనుభవముపొంద నిశ్చయించువాడు. నేను అన్ననూ అహం అన్ననూ ఒక్కటియే. ఈ వాస్తవిక అహంపదార్థమే ఆత్మ. ఇట్టిది తెలుసుకుని అట్టి ఆత్మ లాభమును పొందుటే మోక్షము. ఇట్టి మోక్షప్రాప్తి నిశ్చయించువాడు ముముక్షువు. కాన యీ నేను, అహం, అను దానిని తన శరీరాదులని తలచు వాడు ముముక్షువు కాజాలడు. సర్వముముక్షువులకు మననసారంబైన అను సంధాన ప్రక్రియను శ్రీ శంకరభగవత్పాదులు ఆత్మ పంచకమును శ్లోక రూప

ముల వలన తెలుపుచున్నారు. దానిని ముముక్షు అనుసంధాన ప్రయోజనముకు గాను యిచట తాత్పర్యసహితముగ యుదహరించుచున్నాడ—

. శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం।
నా హంకారః ప్రాణవర్గో నచాహమ్ ॥
దారాపత్యక్షేత్ర విత్తాదిదూర।
స్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥

అహంకారముగాని, చక్షురాదీంద్రియములుగాని, ప్రాణాది పంచకముగాని, యీ స్థూలదేహముగాని నేనుకాను. వీనియన్నిటికంటెను న్యమైన భార్యా పుత్రులు, క్షేత్రము విత్తము యివియేవియూ గూడ నేనుకాను. సర్వప్రకాశకుడును, శివస్వరూపుడునూ యైన ప్రత్యగాత యే నేను.

2. శ్లో॥ రజ్వజ్ఞానాద్భాతి రజ్జుర థాహి।
స్స్వాత్మాజ్ఞానా దాత నోజీవభావః ॥
ఆప్తోక్త్యా హిభ్రాంతినాశే సరజ్జు।
ర్జీవోనాహం దేశికోక్త్యాశివోహమ్ ॥

రజ్జుస్వరూపము తెలియని కాలమందు ఆరజ్జువే సర్పముగా భాసించు చున్నట్లు ఆత స్వరూపము తెలియని కాలమందు ఆత కు జీవభావము యేర్పడును. ఆ ప్తుని మాటచే భ్రాంతి నశించగా రజ్జువు రజ్జువే యయినట్లు సద్గురూపదేశముచే నా వత్వముపోగా శివస్వరూపుడైన ప్రత్యగాత యే నేను.

3. శ్లో॥ ఆభా -దం విశ్వమాత న్య సత ం।
సత్యజ్ఞానానందరూపే విమోహాత్ ॥
నిద్రామోహాత్స్వప్న వత్తన్న సత్త్వం।
శుద్ధః పూర్ణో నిత్య ఏకశ్శివోహమ్॥

సత్యజ్ఞానానంత రూపమైన ఆత యందు అజ్ఞానముచే అసత్యమైన యీ ప్రపం

చము భాసించుచున్నది, నిద్రచే భాసించు స్వప్నపదార్థములాగున అది సత్యముగాదు. పుణ్యపాపాదిరహితుడు, సర్వవ్యాపకుడు, నిత్యుడు. అద్వితీయుడు, అయిన శివస్వరూప ప్రత్యగాత యే నేను.

. శ్లో॥ మత్తోనాన్యత్కించిదత్రాస్తి విశ్వం ।
సత్యంబాహ్యం వస్తుమాయోపక్లప్తమ్ ॥
ఆదర్శాంత ర్భాసమానస్యతుల్యం ।
మయ్యద్వైతే భాతి తస్మా చ్ఛివోహమ్ ॥

నాకంటె న్యమైన యే ప్రపంచము సత్యమైనది లేదు. అద్దమందు కనుబడు వస్తువులతో సమానముగా బాహ్యావస్తువు లన్నియూ మాయాకల్పితములు. ఇవి యన్నియూ అద్వితీయ స్వరూపుడైన నాయందే భాసించుచున్నవి గాన నేను శివస్వరూపుడైన ప్రత్యగాత నై యున్నాను.

, శ్లో॥ నాహంజాతో నప్రవృద్ధోన నష్టో ।
దేహస్యోక్తాః ప్రాకృతా స్సర్వధరాః ॥
కర్తృత్వాదిశ్చిన యస్యాస్తినాహం ।
కారస్యైవ హ్యేత నో మే శివోహమ్ ॥

నేను పుట్టిన వాడనుగాని, పెరిగినవాడనుగాని, మరణించినవాడనుగాని కాను. మాయచే కల్పితములైన ఈ ధర ములన్నియూ దేహధర ములే గాని నావి కావు. కర్తృత్వాదులు గూడ అహంకారమునకే కాని చిన యుడైన నాకు కావు. గనుక శివస్వరూపుడైన ప్రత్యగాత ను నేను.

. శ్లో॥ నాహంజాతో జన మృత్యూ కుతోమే ।
నాహం ప్రాణః క్షుత్ పిపాసే కుతోమే ॥
నాహం చిత్తం శోకమోహౌకుతోమే ।
నాహంకర్తా బంధమోక్షౌ కుతోమే ॥

నేను జనించిన వాడనుకాను. గనుక నాకు జన మృత్యువు లెట్లుండును. అనగా లేవు. నేను ప్రాణుడు కాను గనుక క్షుత్పిపాసలు నాకు కలుగుటకు వీలులేదు. నేను చిత్తముకాను గనుక శోకమోహాదిధర ములు నావి కావు. నేను కర్తను కాను గనుక బంధమోక్షములు నాకు యుండుటకు వీలులేదు,

దీనియొక్క సారాంశమేమనగా సర్వదా ముముక్షువు అధ్యస్తమైన ఈస్వశ ర సర్వదృశ మును జ్ఞానపూర్వకముగ త్యజించి సర్వాధిష్ఠానమైన సర్వోపాధివినిర్ముక్త, దృశ్యరహిత, స్వప్రకాశ, సజా య విజాతీయ స్వగత భేదరహిత, అసంగ,నిత్య, నిరతిశయ, నిర్వికార, సర్వాంతర్బహిర్వ్యాపక, జగదుత్పత్తి స్థితిలయ వివర్తోపాదానకారణ, అఖండ, అద్వి య, పరిపూర్ణ, ప్రత్యగాత స్వరూప చైతన్యమే తాను అనగా నేను అని అనుసంధానము చేయుచుండవలయును. అహం నేను సర్వకాలముల యందును, సర్వ దేశముల యందును, సర్వవస్తువుల యందును, అపరిచ్ఛిన్నుడనై పరిపూర్ణ స్వరూపముతోనున్నవాడను. నాకన్న దృశ్యేతరమేదియున్న వాస్తవముగా లేదు. అహం, నేనే సత్యజ్ఞానానంత స్వరూపుడను. బ్రహ స్వరూపుడను. ఇతర మంతయు మిథ్యారూపముగాని వాస్తవముగాదని తానుతెలుసుకొని తనసత్య స్వరూపమును సర్వదా, అనుసంధానము చేసుకొనుచుండవలయును. ముముక్షు వైనవాడు తన ప్రారబ్ధానుసరణమున, నేపనిచేయుచున్ననూ, తన సత్యస్వ రూపమును జ్ఞప్తియందుంచుకొని తన విత ప్రారబ్ధ కరా నుభవము లెట్టివి యయినను యీ తనస్థూలసూక్ష శ రధర ములతో తనకు యెంతమాత్రము. వాస్తవిక సంబంధము దనిన్నీ అయినను యెంతటివారికినీ ప్రారబ్ధక ఫలాను భవములు తప్పవు గనుక నిమిత్తమాత్రముగ యట్టి యనుభవములను సక్తతా రహితముగ అనుభవించుచూ సమచిత్తుడై యుండవలయును. ఇట్లుండుటకు జగని థ్యాత్వనిరూఢిజ్ఞానముతోడ సర్వాధిష్ఠానజ్ఞాన సతతాభ్యాసము సహకరిం చును. ముముక్షువు శ్రవణ, మనన, నిదిధ్యసనముల సభ సించుచున్నను, తన వ్యవహారానుభవకాలములందుగూడ తన వాస్తవస్థితి స్వరూపములను మరువక కేవల విధిప్రేరితుడై యథాప్రాప్తముగ నిత్యానిత్యవివేకముతో

తన విషయభోగములందు అత్యంతసక్తతా మానబుద్ధిని విడచి తనప్రారబ్ధ ఫలభోగములననుభవించుచు వయాత్రను గడుపుచుండవలయును. తన కరా నుభవములయందు తన సత్యస్వరూపమును యెల్లప్పుడును యిట్లు తెలుసుకొనుచుండవలయును.

ఈ కర్తృత్వాదులు యెవరివి ? వీనితో నాకెట్టి సంబంధము ఈ నేను యను ఆస్థూలదేహము కాష్ఠతుల్యము. దీనికి గ్రహణశక్తి యేమిన్నీ లేదని స్పష్టముగా తెలియుచున్నది. ఈ నేను అనుకొను నా అంతఃకరణమునకు గూడ కొంత తెలివియున్నట్లు కనబడుచున్ననూ యిట్టి తెలివి దీనికి సహజ మైనదిగా కనుబడుట లేదు. ఇది పరప్రకాశముతో భాసించుచు నాకు భ్రాంతిని కలుగజేయుచూ కల్పితముగా నున్నది. విచారించిన ఈ నా అంతఃకరణము నాకు కలిగించుచున్న కర్తృత్వాదులన్నియు కల్పితములై, ఆభాసములై, అనిత్యములగుచున్నవి. ఈ కర్తృత్వ భోక్తృత్వ ధర ములు కల్పితములై సదామారుచునే యున్నవి. ఇందు వాస్తవికత ఏదియును కనుబడుటలేదు. కాన ఈ కర్తృత్వ భోక్తృత్వములు వాస్తవములు కావు. ఈ నా అంతఃకరణ ధర ములు సదా మారుచునే యున్నవి. సత్యమైన పదార్థ మెప్పుడును మారు టకు వీలులేదు. శ్రుతిమాత, నా సత్యస్వరూపము, సత్యజ్ఞానానంతస్వరూప మైన బ్రహ్మ యే అని తెలుపుచున్నది. కాన ఈ సత్యమైన నేను అనగా అహం పదార్థవాస్తవస్వరూప మెట్టిదనిన శాస్త్రము "అహంసర్వ మిదం విశ్వమ్ పరమాతా హమచ్యుతః" అని తెలుపుచున్నది. ఇంకనూ "అహం సర్వస ప్రభవోమత్తస్సర్వం ప్రవర్తతే" అనిన్నీ, "నిత్యస్సర్వగతస్థాణు రచలోయం సనాతనః" అని గీతావచనములునూ "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తికించన" అని శ్రుతిమాతయు గూడ తెలుపుచున్నవి. ఇంకనూ సమస్త సుఖచిత్ర, విచిత్ర క్లేశ, దృశ్యానుభవములన్నియూ నాస్వప్నములో నాయందే దేశాంతర, కాలాంతర, వస్త్వంతరములలో, యున్నట్లు బహిర్భూతముగా కనబడుచూ అనుభవముల నిచ్చుచున్నట్లు, నాజాగ్రద్దశలో గూడ ఎట్టి ఎన్ని అనుభవములు కలుగుచున్ననూ నాయందే

కలుగుచున్నవి గాని నన్ను విడచి ఎట్టి అనుభవములు కలుగుట లేదు. కాన నాస్వప్నములో లాగుననే నా జాగ్రద్దశయందు గూడ నాయందే నా అనాది అవిద్యచే సమస్తభోగములు కల్పితములుగ కల్పింపబడి నాభ్రాంతిఅనుభవముకు కారణమగుచున్నవి. కాన వాస్తవమున ఈ అనుభవములన్నియు కల్పితములుగా కనబడుచున్నవి ఇట్టి కల్పితానుభవము లన్నిటికిని అధిష్ఠానముగ ఒక్కటియైన నేనే కనుబడుచున్నాను గాని, వేరేదియు కనుబడుట లేదు. కాన దృశ్యాధిష్ఠానము నాకన్న వేరుగ మరొక్కటి యేదిన్నీ కనుబడుట లేదు. అయిననూ ఒక్కటియైన నాసత స్వరూప అహంపదార్థమందే ఈ దృశ్య కల్పితానుభవములున్నూ సుఖ, దుఃఖ, చిత్ర, విచిత్ర, క్లేశాద్యనుభవములన్నియూ కలుగుచున్నవి. కాన ఇట్టి కల్పితములు, వాస్తవములు కాజాలవు. కనుక ఇట్టి కల్పితానుభవములను గురించి నేను సక్తతపొంది, దుఃఖక్లేశములను హర్షశోకములను పొందుట వివేకహీనముగా నున్నది. అయిననూ నాప్రారబ్ధకర్మఫలముచే భ్రాంతి నొందుచున్నాను. ఇప్పుడు నాస్వరూప వాస్తవికతను గ్రహించినవాడను గనుక ఈ దృశ్యానుభవములతో నాకు వాస్తవసంబంధము లేదు కాని ప్రారబ్ధము ననుభవింపక తప్పదు, గాన, నా భోగానుభవములను కల్పితములనియే అనుభవింతును—

నావాస్తవ స్వరూపము నిర లాకాశము లాగున సర్వాంతర్బహిర్వ్యాపకమై అసంగమై, నిస్తరంగసముద్రములాగున గంభీరమై జగదుత్పత్తి స్థితిలయ వివర్తోపాదానకారణమై, సర్వోపాధివినిర్ముక్తమై, స్వప్రకాశమైన అఖండ, అద్వితీయ, పరిపూర్ణ చైతన్యమే. నేనుసర్వదానిశ్చలుడనై, నితుడనై, పరిపూర్ణుడనై, సంవిత్స్ఫటిక మహాశిలలాగున నిరలుడనై స్వప్రకాశ భేదరహితముగ అచలుడనై సర్వదా ప్రకాశించుచుండువాడను.

ముముక్షువునకు అద్వితీయ ఆత్మయందు నేను అనగా అహమ్ అను అనుసంధానము నాచరించుట శాస్త్రీయము. కాని రెండవ పదార్థము లేని

అనగా అద్వి యఆత్మ స్వరూపమందు నేను అను ప్ర తి బహువచనమైన మనము, మేము, అని గాని నాది, మాది, అని గాని అను ప్రత్యయములుగాని అనుసంధానములో గ్రహించుట అశాస్త్రీయము. ముముక్షువు సర్వదా తన సత్య స్వరూపమును మననము చేయుచుండుటయే ఆత్మ బోధ. ఆత్మ బోధ యన్నను, అహంవివేచనయన్నను దాదాపు ఒక్కటియే. ముముక్షువైనవాడు అహంవివేచన వల్ల అహంప్ర తివిషయుడైన నేను అను తనవాస్తవస్వరూపమును శాస్త్రీయ వివేచనచే తెలుసుకొని, స్వానుభవముకుగాను తనసత్యస్వరూపమును అనగా తత్స్వరూపమును సర్వదా మననముచేయుచుండవలయును. ఇట్లు చేయుటకు ఆవశ్యకతను గురించి శంకరులు ఇట్లు తెలుపుచున్నారు.

శ్లో॥ అజ్ఞానకలుషం వం జ్ఞానాభ్యాసా ద్వినిర లమ్ ।
కృత్వాజ్ఞానం స్వయంనశ్యే జ్జలంకతకరేణువత్ ॥

అనగా అజ్ఞాన కారభూతములైన అహంకారాదులచేత కర్తృత్వ భోక్తృత్వాద మానవంతుడైన వుని, జ్ఞానముయొక్క చిరకాలాభ్యాసముచేత అజ్ఞానమును నశింపచేయుట వలన భ్రాంతి వుని పరిశుద్ధుడైనవానినిగా చేయుచున్నది. ఎట్లన చిల్లగింజనరుగదీసిన గంధము బురదనీటిని పరిశుద్ధముగాచేసి తాను కనుపడకుండ ఆ నీటియందెట్లు కలసిపోవుచున్నదో అట్లే జ్ఞానము ఆత్మ యందు లీనమైపోవును. కాన మనన మావశ్యకము. అట్టి బోధస్వరూపమును గురించి జిజ్ఞాసువు ఎట్లు మననాదులు చేయవలసినదియూ ఆత్మ బోధయందు శ్రీ శంకరభగవత్పాదులు ఇట్లు తెలుపుచున్నారు,

శ్లో॥ అమనస్త్వాన్న మే దుఃఖరాగద్వేషభయాదయః ।
అప్రాణోహ్యమనాశ్శుభ్ర ఇత్యాది శ్రుతిశాసనాత్ ॥

అనగా "అప్రాణోహ మనాః" అను శ్రుతి నేను మనసులేని వాడను అని తెలుపుచున్నది. గనుక మనోధర ములైన సుఖ,దుఃఖ, రాగ ద్వేషాదులు నాకు లేవు.

శ్లో॥ నిర్గుణోనిష్క్రియోనిత్యో నిర్వికల్పో నిరంజనః ।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽసి నిర లః ॥

శ్లో॥ అహమాకాశవత్సర్వంబహిరంతర్గతోఽచ్యుతః ।
సదా సర్వసమస్సిద్ధోనిస్సంగో నిర లోఽచలః ॥

శ్లో॥ నిత్యశుద్ధవిముక్తైక మఖండానంద మద్వయమ్ ।
సత్యంజ్ఞాన మనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్॥

అనగా కామక్రోధాదిరహితమై, సర్వ సంబంధశూన్యమై, అఖండమై, భేద రహితమై, అద్వితీయమై, నిష్ప్రపంచస్వరూపమై, సత్యమై, చరాచరాదుల యందు వ్యాపించియుండు స్వరూపమై, సర్వసమమై, శుద్ధమై, పుణ్యపాప రహితమై, నిష్క్రియస్వరూపమై, గుణశూన్యమై, సంకల్ప వికల్ప వర్జితమై, నిర్వికారమై, నిరాకారమై, నిరవయవమై, స్వరూపమై, శరీరత్రయ విలక్షణమై, జాగ్రత్స్వప్న సుషుప్తులయందు నశించని సాక్షియైన సచ్చిదానందాత నేనే యని శ్రుత్యుక్త్యనుభవములచేత తెలుసుకొని మననము చేయవలయును.

ఈపైన చెప్పిన మననము బహుకాల మభ్యసించుటవల్ల కలుగుపరమ లాభమును గురించి—

శ్లో॥ ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాసీతి భావనా,
హరత్యవిద్యా విక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥

అనగా రసాయన ఔషధమును సేవించుటవల్ల రోగములు నశించినట్లు, ఎల్లప్పుడును నేను బ్రహ్మయే కాని బ్రహ్మ వ్యతిరిక్తుడను కాను, అని అభ్యాసముచేయుటవల్ల కలుగు సంస్కార రూపమైన సద్వాసన, ఆవరణ విక్షేప శక్త్యాత కమైన అవిద్యను నిరూ లించునని దృఢముగా నమ వలయును.

శ్లో॥ ఆత న్యేవా లందృశం ప్రవిలాప్య ధియాసుధీః,
భావయేదేకమాతానం నిర లాకాశవత్సదా ॥

అనగా సుషుప్తియందు ప్రపంచమగుపడక లయించినట్లు ఈయగపడు నామరూపాత్మకమగు నిఖిల ప్రపంచమును నిరమలమైన బుద్ధిచేత ఆత్మయందు లయింపజేసి ఎల్లప్పుడును, వెన్నెలచేత నిర్మలమైన ఆకాశము వలెనే 'అనగా ప్రకాశరూపమున' ఆత్మను తననుగా సర్వదా అనుసంధానము చేయుచుండవలయును. ఇచట నిరమలమై వెన్నెలలాగుననున్న ఆకాశముగాని, ప్రకాశరూపమును గాని, ఉపలక్షణములుగా గ్రహించి ఆత్మానుసంధానమును అభ్యసించుచుండవలయును. ఏలనన, ప్రకాశాది తేజోరూపములుగూడ జడపదార్థములే గనుక, వాటినికేవల వృత్త్యాలంబనకుమాత్రమే ఉపలక్షణములుగా సికొనవలయును,

ఇంకనూ శ్రీ శంకరభగవత్పాదులు సర్వాతిశయమైన బ్రహ్మను తటస్థ లక్షణముచేత ఇట్లు తెలుపుచున్నారు-

శ్లో॥ యద్దృష్ట్వా నాపరందృశ్యం యద్భూత్వా న పునర్భవః,
యద్ జ్ఞాత్వా నాపరంజ్ఞేయం తద్బ్రహ్మే త్యవధారయేత్ ॥

అనగా దేనినిచూచిన వెనుక మరియొకటి తెలుసుకొన దగినది, చూడదగినది, లేదో ఏదితానుగానైన తరువాత మరలపుట్టుక లేదో, దేనిని తెలుసుకొన్నపిదప వేరుగా తెలుసుకొనదగిన వస్తువు లేదో అది బ్రహ్మయని నిశ్చయించి తెలుసుకొనవలెను,

శ్లో॥ తిర్యగూర్ధ్వ మధఃపూర్ణం సచ్చిదానందమద్వయమ్ ।
అనంతం నిత్యమేకం యత్తద్బ్రహ్మే త్యవధారయేత్ ॥

శ్లో॥ అతద్వ్యావృత్తి రూపేణ వేదాంతైర్లక్ష్యతేఽవ్యయమ్ ॥
అఖండానందమేకం యత్తద్బ్రహ్మే త వధారయేత్ ॥

సర్వదిక్కులయందును సర్వత్ర వ్యాపించి నిండియున్నదియు సచ్చిదానంద రూపమైనదియు తనకంటె వేరువస్తువు లేనిదియు, పరిమితి లేనిదియు, శాశ్వతమైనదియు, ఒక్కటియైనదియు, ఏదికలదో అది బ్రహ్మయని

గ్రహించవలయును. దేహేంద్రియాదులను అసత్తని నిషేధించుట వల్ల, పైన తెలిపిన ప్రకారము శేషించిన స్వరూపమే బ్రహ్మ.

ఇట్లు సర్వదాచేయు చిరకాలాభ్యాసము వలన వుడు :—

శ్లో॥ హృదాకాశోదితో హ్యాత్మా బోధభాను స్తమోఽపహృత్ ।
సర్వవ్యాపీ సర్వధారీ భాతి భాసయతేఽ లమ్ ॥

శోధింపబడి తనను ఆశ్రయించియుండు అజ్ఞానమును నశింపజేసుకొని సూర్యుని వలెనే సమస్తమును ప్రకాశింపజేయుచూ అఖండాకారవృత్తి స్వరూపుడై తాను ప్రకాశించుచూ, అన్నిటిని తనయందే ప్రకాశింపజేయుచూ నిత్య నిరతిశయానందుడై యుండును. ఇదియే ఆత బోధ—జ్ఞానము, వుని యొక్క పరమార్థస్వరూపము.

## బ్రహ్మస్వరూపోపలబ్ధి స్థానము

బ్రహ విదా సంప్రదాయములో స్వస్వరూపప్రాప్తికి చెప్పబడు బ్రహ నిత్యనిరతిశయనిర్గుణ బ్రహ్మ యేగాని వేరుకాదు. ఈయననే "సత్యం జ్ఞానమనన్తంబ్రహ" అని చెప్పి శ్రుతి — "బ్రహ విద్బ్రహ్మైవ భవతి" "బ్రహ విదాప్నోతిపరమ్" "యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్ సోఽశ్నుతేసర్వాన్కామాన్సహ" అని చెప్పుచున్నది. అనగా తనహృదయ గుహలో నుపలబ్ధమగు సత్యజ్ఞానానంత లక్షణములుగల యీ బ్రహను తెలుసుకొనినవాడు బ్రహ యేయై సమస్త భోగములను ఏకకాలములోనే పొందుచున్నాడు అని యీ వాక్యములు తెలుపుచున్నవి. ఇచ్చట గుణరహితమైన బ్రహ లక్షణమును తెలుపు సత జ్ఞానానంతమను విశేషణ పదములతో ఎట్లు

తెలుపబడును ? అను శంకకువీలులేదు. ఎందుకనగా ఈ శబ్దముల నుపలక్ష ముగ సికొని యిచట బ్రహ్మను గుర్తించుటయేగాని యివి విశేషణ ప్రయోగములు కావు. ఆ బ్రహ్మ సజాతీయ విజాతీయ స్వగత భేదరహితుడగుటచే దానియందు విశేషణము లుండుటకు వీలులేదు. పసిపిల్లవానికి క్షీరమును గూర్చి తెలుపవలసినప్పుడు దానియందుండు ద్రవత్వశ్వేతత్వమాధుర్యములను విడివిడిగాచెప్పినను ఈ శబ్దములన్నియు ఆయాగుణములద్వారా ఒక్కక్షీరమునే బోధించునట్లు ఇచట సత్యజ్ఞానానంతశబ్దములున్నూ బ్రహ్మ స్వరూపమునే బోధించునవిగాని, ప్రత్యేకమైన జ్ఞానాది విశేషణపదార్థములను బోధించునవి కావని తెలుసుకొనవలెను

ఈ బ్రహ్మ సర్వాన్తర్బహిర్వ్యాపకుడుగదా! అప్పుడు పరిచ్ఛిన్నమైన హృదయగుహయందు అదియుండుట ఎట్లు సంభవము? అనికూడ ఒక శంక కలుగును. దీనికి సమాధానము సూక్ష్మ దృష్టాన్తముచే లోగడ చెప్పబడినది. ఐనను ఈ పరమాత్మ అక్కడ ఒక్కచోటనే యుండునని యర్థము కాదు. ఈయన సర్వవ్యాపకుడు గనుక మనము ఈ యుపాధితో ఇచట చూడవలసినది. అనగా జిజ్ఞాసువునకు ఆయన ఈ యుపాధియొక్క యీ ప్రదేశములో అ వ్యక్తమగునని శ్రుతిచెప్పినది. కాని ఆ పరమాత్మ ఆ బుద్ధిగుహలోనే యిమిడియున్నాడని యర్థము కాదు ఇట్లు తెలుసుకొనబడునదియే అందరియాత్మ.

"అయమాత్మాబ్రహ్మ" అనగా ఈయాత్మ యేబ్రహ్మ, "తత్త్వమసి" ఆ బ్రహ్మ నీవే, అని శ్రుతినిర్దేసించి తెలుపుచున్నందున ఈబ్రహ్మ మనలోనే యున్నదని శ్రవణమనననిదిధ్యాసనములచే తెలుసుకొని ఆబ్రహ్మ నేనే, అది వేరుకాదు అను అనుభవమును పొందవలయును. ఇట్లు బ్రహ్మాపరోక్షానుభవమును పొందినవారికి "ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్" అనిన్నీ "సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ" అనిన్నీ శ్రుతివచనములు తెలుపుచున్నవి ఈవిధముగ బ్రహ్మను తెలుసుకొన్న మహనీయులు చేయవలసినదేమియు నుండదు. వారు కృతకృత్యులు. "తస్యకార్యం నవిద్యతే"

# అభ్యాస నిరూపణ

అభ్యాసకులకు అంతఃకరణాహంకార నిరూపణలను చేసి గ్రహణ విధానము నెంత తెలిపినను ఈ యంతఃకరణ ధర విలయములు కష్ట సాధ్యములు. గాన ఈ సిద్ధాంతానుభవదార్ఢ్యమునకుగాను తిరిగి దీనినే ఇచట సంగ్రహవివేచన జేయుదము. ఈ యంతఃకరణము విద్వాంసులను గూడ మోహింపజేయుచూ వాస్తవమైన దానివలె తోపింప జేయుచున్నది. దీని వాస్తవికతను బాగుగా వివేచన జేసి గ్రహించినయడల ఈ యన్తః కరణ ఆయా వులు అనాద్యవిదా భ్రాంతియుతులై సంపాదించిన సంస్కార వాసనా జముల కాటపట్టై, ప్రారబ్ధ కర ఫలభోక్తృత్వాదులకు గాను కల్పితమైన సూక్ష్మోపాధి. జాగ్రత్స్వప్నములయందు సర్వదృశ్యమునున్నూ ఇదియే కల్పించి ఆయా వుల ప్రారబ్ధకరానుసారము సుఖదుఃఖముల ననుభవింపజేయుచు కరలనాచరింపజేయుచుండును. ఇట్టి కర ఫలములు వాసనారూపముననుండి పూర్వ పూర్వ వాసనలు ఉత్తరోత్తర సంస్కారములకు హేతువగుచుండును. ఇది ఒక నీటి సుడిగుండము వంటిది. వులకు కలుగుచున్న సుఖదుఃఖములుగూడా ఈయంతఃకరణ వాసనా సంస్కారములవల్ల కలుగుచున్నవి గాని వస్తుస్వభావమునుబట్టి కలుగుట లేదు. ఒకే వస్తువు ఒక వునకు సుఖమునున్నూ, మరియొకనికి దుఃఖక్లేశము లనూ కలిగించుచున్నది. ఏ యొక్క వస్తువైనను సంశ్లేష, విశ్లేషముల వల్ల భిన్న న్న వులకు న్న న్న సుఖదుఃఖానుభవములను కలుగజేయు చున్నది. ఈ విషయమంతయున్నూ లోగడనే యుదాహరణపూర్వకముగా సవిస్తరముగా వివర చేసియుంటిమి. ఇందుకుగాను ఈ యంతఃకరణమును వాసనారహితముగా చేయవలయును. ఇట్లు చేయుటకు వుడు చేయు ప్రతి కర యందును తన కర్తృత్వాదులను అ మానమును త్యజించవలసి

యున్నది. ఇట్లు త్యజించుటకు అంతఃకరణతాదాత్మ్యము అడ్డు వచ్చుచున్నది. కాని - ఈ తాదాత్మ్యమున్నూ కల్పితమే ఈ కర్తృత్వా మానములు కల్పితములే. ఈ ధర ములు కల్పితమైన ఈ యంతఃకరణ సూక్ష్మోపాధివే గాని వాస్తవముగా వునకు, తనకు సంబంధించినవి గావు. గాన ముము- వున కివి కల్పితసంబంధములు - ఈ కర్తృత్వాదులు కల్పితమైన అంతఃకరణోపాధివే గాని వాస్తవముగా తనకు ఎంతమాత్రము సంబంధించినవి కావు అని తెలుసుకొని, తాను ఈ కర్తృత్వా మానములను త్యజించుటకు సర్వదా ప్రయత్నముచేయుచు వాస్తవమైన తన స్వరూపమునందే - నిష్ఠగలవాడై యుండవలయును. కర్తృత్వా మానరహితముగచేసిన కర్మలయొక్క ఫలములు వుని అంటవు. ఎందుచేతననగా లోకవ వహారములోగూడ మనకు కర్తృత్వా మానములచే చేసిన పనులే అధికసుఖదుఃఖములకు కారణములగుచున్నవి గాని, నిర మానముగాచేయబడు కర లట్లగుట లేదు. ఈ విషయము సవిస్తరముగా లోగడ కర్తృత్వాది నిరూపణయందు వివేచన చేయబడినది. కాన సర్వప్రయత్నములచేతను ముముక్షువైనవాడు పైన నిరూపించిన విధమున తనకు ఈ యంతఃకరణాహంకారములతో ఎట్టి వాస్తవ సంబంధమూ లేదని గ్రహించి నిశ్చయించుకొని తన ప్రారబ్ధానుభవమునందు కలుగు కర్తృత్వా మానములను త్యజించుట యత్యావశ్యకము - సుఖదాయకము. ఇదియే మోక్షమార్గమగుచున్నది.

ఇంకనూ ముముక్షువైనవాడు ముఖ్యముగా తెలిసికొని, అభ్యసించవలసిన విషయమేమనిన తన సత స్వరూపానుసంధానము — ప్రతిమానవుడున్నూ తన స్వరూపమును నేను అని తెలిసికొనుచునేయున్నాడు. కాని యిట్లు ప్రతి వియూ అహం నేను అను ప్రతీతితో తెలిసికొనుచున్న తన స్వరూపమును యథార్థస్వరూపమున యున్నదియున్నట్లుగా, తన అనాది

అవిద్యా భ్రాంతిచే వాస్తవమును తెలిసికొనలేక, వాస్తవమున తానుకాని దానిని తానను భ్రమతో నేను అని వ్యవహరించి, సంసారదుఃఖము ననుభవించుచున్నాడు - ఇట్టి సంసార ఆత్యంతిక దుఃఖనివృత్తికిగాను, ముముక్షువు తన సత్యస్వరూపము నిట్లు గ్రహించి, యనుసంధానాదులను చేయుచుండవలయును - ఈ నేను అను ప్రతీతికి వాస్తవార్థము, నిత్య, నిరతిశయ, భేదరహిత, అద్వితీయ అఖండ పరిపూర్ణ జ్ఞానము - ఎంతమంది జీవులు నేను, నేను, అని వ్యవహరించుచున్ననూ యీ జ్ఞానమంతయూ అఖండపరిపూర్ణముగ నొక్కటిగానే యున్నది గాని తదితరమేమియు లేదు - ఇది జీవుని యొక్క వాస్తవ స్వరూపజ్ఞానము, ఇది అఖండము - అద్వితీయము. ఇదియే ఆత్మ స్వరూపము, శుద్ధ జీవుడు - అద్వితీయుడు - కాని యీ వనానాత్వము మాయా కల్పితమై వివిధ అంతఃకరణోపాధుల తాదాత్మ్యమువల్ల కలుగుచున్నది. ఈ యుపాధులన్నియూ పరిచ్ఛిన్నములు, కావున ఈ ఒక్కటైనపరిపూర్ణ జ్ఞానస్వరూపుడే అనేక పరిచ్ఛిన్న జ్ఞానస్వరూపులుగ మాయావశమున కనబడుచున్నాడు. ఇది భ్రాంతియేకాని వాస్తవమున నున్నది అందరి జీవులయందును యీ జ్ఞాన మొక్కటియే - ఈ జ్ఞానమే లేనిచో వప్రపంచమంతయూ నొక్క క్షణమాత్రముండుటకు వీలులేదు- ఏ జీవుడెట్లు వ్యవహరించిననూ అందరికినీ ఆధారమైయున్నది యీ జ్ఞానమొక్కటియే. అనేక జ్ఞానములని తలచుటయే భ్రాంతి. కావున ముముక్షువైనవాడు యిట్టి తన పరిచ్ఛిన్న జ్ఞాన భ్రాంతి, వాస్తవమైనది కాదని గురుశాస్త్రబోధవలన తెలిసికొని, పరమార్థమున వాస్తవమైన తన అఖండ, అద్వితీయ పరిపూర్ణ స్వరూపమును గుర్తించి స్వానుభవము నొందుటకు, ప్రీతినిశ్చయములతో తన సత్య స్వరూపమైన సత్యజ్ఞానానంతలక్షణములగు భేదరహిత, అద్వితీయ, అఖండ, పరిపూర్ణజ్ఞాన స్వరూపమే తానని, ఫలావగతి పర్యంతము నిరంతరానుసంధానాభ్యాసాదులను యాచరించుచుండిన యెడల కాలక్రమమున తన ప్రారబ్ధాంతమందు ముక్తి బడయుటకు, సంశయములేదు.

# శ్రుత్యనుసారి బ్రహ్మనిరూపణ

మానవునకు అభ్యుదయ నిశ్శేయసములు రెంటికిని "వచనాత్ప్రవృత్తిః, వచనాన్నివృత్తిః" అను న్యాయముననుసరించి వేదవచనములే ఆధారము, వచనమనగా వేద వచనమనియే అర్థము. వేదవచన మనగా వేదము చెప్పునదని యర్థము. మానవుని కిదియే ప్రమాణమని చెప్పుటకుగాను భగవంతుడు "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార వ్యవస్థితౌ" అని గీతలలో తెలుపు చున్నారు. కాన ముముక్షువు తన మోక్ష ప్రాప్తిని వేదాంత జ్ఞానము వల్లనే పొందవలసి యున్నది. వేదాంతశాస్త్రము మానవుని మోక్షప్రాప్తికిగాను సగుణ, నిర్గుణో పాసనలను రెంటిని తెలుపుచున్నది. కాని వేదాంతబోధ యొక్క పరమతాత్పర్యము అద్వైతసిద్ధాంతమే. ఈ అద్వైతసిద్ధాంత మందు తెలుపబడినది కేవల నిర్గుణ బ్రహ్మమే కాని సగుణరూపము కాదు. అయినను జిజ్ఞాసువు బోధకుగాను శ్రుతి "కోయమాత్మా కథ ముపాస హే — కతరస్స ఆత్మే తి" అనగా ఆత్మ ఎవరు? ఆయననెట్లు ఉపాసించవలెను? ఈ యిద్దరిలో ఆత్మ ఎవరు? అని ప్రశ్నించుచు శ్రుతియే తెలుపుచున్నది. ఇట్లు తెలుపుచు "బ్రహ్మ విత్ బ్రహ్మై వ భవతి" అని అట్టి బ్రహ్మను తెలుసుకున్న విద్వాంసుడు బ్రహ్మయే యగునని గూడ తెలుపుచున్నది. కాన జిజ్ఞాసువునకు యిట్టి నిర్గుణ బ్రహ్మ ప్రాప్తి అనగా మోక్షసిద్ధిని పొందుటకు యీజ్ఞానమావశ్యకమై యున్నది. కాన శ్రుతి వాక్యములననుసరించి జ్ఞానప్రాప్తి ప్రకారమును నిరూపించుటకుగాను ఆవశ్యకమైన శ్రుతి వాక్యములను అనగా యిట్టివి న్నన్న ఉపనిషత్తులయందు వివిధసందర్భములలో తెలుపబడిన వైనను వాటిని ప్రామాణికతకుగాను ఇచట నుకొనబడినవని గ్రహించవలయును. ప్రథమమున శ్రుతి "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" అనగా ఈసృష్టికి పూర్వము అద్వితీయుడైన బ్రహ్మ యొక్కడే కేవల సద్రూపమున యున్నాడు అని ఛాందోగ్య శ్రుతి తెలుపుచున్నది.

ఇంకను“ ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన మిషత్” అనగా ఈ జగత్తంతయు సృష్టికి పూర్వము బ్రహ్మమై యున్నది. బ్రహ్మేతర మించుకంతయును లేదు అని బ్రహ్మలక్షణంబును ఐతరేయ శ్రుతి తెలుపుచున్నది. తదుపరి “యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని వంతి, యత్ప్రయం త్య సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి,” — అనగా దేనివలన సమస్త భూతములయొక్క సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవో, యేది యీ జగదుత్పత్తి, స్థితి, లయములకు వివర్తోపాదానకారణమగుచున్నదో అదియే బ్రహ్మ. ఆకాశమునందు గంధర్వనగరములాగున బ్రహ్మయందే వివర్తముగ సృష్టియగుచు, ఆ బ్రహ్మయందే స్థితి, లయములను పొందుచున్నది. ఈ విధమున బ్రహ్మయే యీ సృష్టికి అనగా స్వశరీర సర్వ దృశ్యమునకు, అ న్ననిమిత్తోపాదానకారణము. అనగా రజ్జువుయందు సర్ప భ్రాంతి యున్నట్లు యీ జగత్స్వరూపమంతయు బ్రహ్మయందున్నది.

శ్లో॥ “యస్మిన్ ద్యౌః పృథివీచాన్తరిక్షమోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైః ।
తమేవైకం జానథ ఆత్మాన మన్యావాచో విముంచథఅమృత స్యైషసేతుః”॥

అనగా యే పదార్థమందు లోకత్రయరూపమగు విరాట్తత్వము, మనః ప్రాణాదులు (చకారముచే) మూలప్రకృతియు కల్పితమై యున్నవో, అట్టి కల్పిత రూపమును విడచి, తదధిష్ఠానభూతమగు ప్రత్యగభిన్నమైన ఆత్మ స్వరూపమును శ్రవణాదిసాధనములచే తెలిసికొనుడు. ఇతర కల్పితవస్తువిషయకములగు వాక్కులను త్యజింపుడు.

ఇట్టి అన వాఙ్నివృత్తిపూర్వకమగు ఆత్మ సాక్షాత్కారమే అమృత స్వరూపమగు మోక్షమునకు అనగా - సంసారసముద్రమును తరించుటకు నావవంటిది, అని ముండకోపనిషత్తు తెలుపుచున్నది. ఇంకను కఠోపనిషత్తునందు ఈ బ్రహ్మ స్వరూపమునే “అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం,

తథాఽరసం నిత్యమగన్ధ వచ్చయత్। అనాద నన్తం మహతః పరం ధ్రువం, నిచాయ్యత న్మృత్యుముఖా త్ప్రముచ్యతే"॥ అనగా లోకమున ప్రతిపదార్థము శబ్ద స్పర్శరూప రసగన్ధములలో నేదోయొకగుణముతో గూడియున్నది. అట్టి గుణసహితములన్నియు నశించునట్టివే. బ్రహ్మ అట్టి గుణసంబంధము లేక నిర్గుణమై భాసించుచున్నది. కావుననే అది అవ్యయము అనగా నశించునది గాదు. నిత మైనదని పర్యవసానము. మరియు ఉత్పత్త్యాది వికార రహితమైనందువల్ల గూడ నిత్యమైనది. మరియు బుద్ధ్యాదుల కవభాసకమై వానితో సంబంధములేక సాక్షిరూపముగా నున్నది. అట్టి ఆత రూపమగు బ్రహ్మ తత్త్వమును గుర్తించినవాడు, అవిద్యాకామకర మూలకమై జనన మరణ ప్రవాహ రూపకముగా నున్న సంసారమునుండి విముక్తుడగు చున్నాడు, అని తెలుపుచు యింకనూ ఈ బ్రహ్మ లక్షణములను గురించి భగవంతుడు "న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితావా నభూయః, అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే" అనగా ఈఆత ఒకప్పుడును పుట్టుక గలదికాదు. మరణముగలదియు కాదు. కొన్నాళ్ళు ఉండిపోవునదిగాని, కొన్నాళ్ళకు కలుగునదియుగాని కాదు. ఏమన —ఆత పుట్టుక లేనిది. ఎప్పుడును ఒక్క రీతిని ఉండునది, స్థిరమైనది, అనాది యైనది. శరీరము పోయినను పోవునది గాదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః ॥

అనగా ఆత భేదింప దగినదిగాని, దహింపదగినదిగాని, తడుప దగినదిగాని కాదు, ఎప్పుడును ఏకరూపముగా అంతటను నిండియుండునది, అచలమైనది, సనాతనమైనది, అనియూ గీతాచార్యులు తెలుపుచున్నారు.

ఇంకను ఛాందోగ్యోపనిషత్తునందు "యత్రనాన త్పశ్యతి నాన్యచ్ఛృ ణోతి నాన్యద్విజానాతి సభూమా, యోవై భూమా, తత్సుఖం" ఏవస్తు

స్వరూపమునందు తాను వేరుగానుండి తనకంటె అన్యమును చూచుట, వినుట, తెలుసుకొనుట మున్నగు త్రిపుటీవ్యవహారమునకు అవకాశముండదో అట్టి సర్వపరిపూర్ణమైన సద్వస్తువే "భూమ" యని చెప్పబడును. ఈ భూమయే సుఖ స్వరూపము. ఇదియే బ్రహ్మ. ఇదియే తెలుసుకొనతగినది, అని తెలుపుచు "పురుషఏవేదంసర్వం" ఈ సకల జగత్తును పురుషుడే. "సర్వంఖల్విదం బ్రహ్మ" ఈ సర్వదృశ్య ప్రపంచమును బ్రహ్మయే గదా. అనగా బ్రహ్మ స్వరూపమని తెలుసుకొనవలయునని ఈ శ్రుతి తెలుపుచున్నది. ఎట్లన "వాచా రంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" వాక్కుచేభేదము న్ననూ ఒక్క మృత్తుచేతనేకలిగిన ఘటశరావాదికార్యసమూహమంతయు మృత్తు స్వరూపమేయని యెట్లు తెలియబడుచున్నదో (అనగా వీటికన్నిటికిని ఆశ్రయ భూతమగునది మృత్తుయేగాన) యట్లే ఈ వివిధసర్వదృశ్యమునకు పారమార్థిక సత్యమైనది బ్రహ్మయేనని ఛాందోగ్య శ్రుతి తెలుపుచున్నది.

ఇంకను శ్రుతి ఈ బ్రహ్మను "అసంగోహ్యయం పురుషః" ఈ పురుషుడు అసంగుడు. "ఆకాశవత్ సర్వగతశ్చనిత్యః" — ఆకాశమువలె సర్వాంతర్బహిర్వ్యాపకుడైన నిత్యుడు అనిన్నీ చెప్పుచున్నది. కాని ఈ బ్రహ్మను యెట్లు తెలుసుకొనవలెను అను ప్రశ్నకు "సత్యంజ్ఞానం అనంతం" ఈ బ్రహ్మ సత్యజ్ఞానానంతలక్షణములు కలవాడని శ్రుతి తెలుపుచున్నది. గనుక యీలక్షణములచే ఆ బ్రహ్మ పదార్థమును గుర్తించవలసియున్నది. కాని యీలక్షణములు బ్రహ్మకు వాస్తవములుకావు. ఇవి ఆ సత్పదార్థమును గుర్తించుటకు ఉపలక్షణములు. ఇంకను ఈయనను "యస్సర్వజ్ఞ స్సర్వ విత్"-ఎవరు సామాన్యరూపముగను విశేషరూపముగను సర్వదాస్వప్రకాశుడై యుండునో అట్టివాడు బ్రహ్మయని కూడ తెలుపుచున్నది.

ఇంకనూ ఈ బ్రహ్మ స్వరూపమును గురించి-"యస్మాత్పరం నాపర మస్తికిఞ్చిద్యస్మాన్నాణీయో నజ్యాయోఽస్తి కశ్చిత్, వృక్షఇవస్తబ్ధో దివి తిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం".

దేనికంటె అధికమైనదియును, తక్కువదైనదియును, చిన్నదియును, పెద్దదియును లేదో, ఎయ్యది వృక్షమువలె కదలనిదై ఏకమై స్వ ప్రకాశమై యున్నదో, ఆ పురుషునిచేత ఈ సకల ప్రపంచమును నిండియున్నది, అనితైత్తిరీయోపనిషత్తు తెలుపుచున్నది.

ఇంకను "పురుష ఏవేదంసర్వం" ఈ సర్వజగత్తు పురుషుడేయని పురుషసూక్తము తెలుపుచున్నది.

"నతత్ర సూర్యోభాతి నచన్ద్రతారకం, నేమా విద్యుతోభాన్తి కుతోఽయమగ్నిః. తమేవభాన్త మనుభాతిసర్వం, తస భాసా సర్వమిదం విభాతి" స్వాత రూపమగు బ్రహ్మను సూర్యుడు ప్రకాశింపజేయజాలడు. అట్లే చన్ద్ర నక్షత్రాదులు, విద్యుత్తులు కూడ ప్రకాశింపజేయజాలవు. అట్టిచో యిక అగ్ని విషయమును చెప్పనేల? వస్తుతత్త్వమును విచారించితిమేని సర్వావభాసకమగు నా బ్రహ్మ చైతన్యప్రకాశము నాలంబనముగా జేసుకొనియే సూర్య చన్ద్రాదులు ప్రకాశించుచున్నారు. అనగా సూర చన్ద్రాదుల ప్రకాశము బ్రహ్మ ప్రకాశమూలకమేగాని, స్వతస్సిద్ధముగాదని భావము. అట్టి నిరతిశయ స్వప్రకాశరూపమాత తత్వమని గుర్తింపవలెనని ముండకోపనిషత్తు తెలుపుచున్నది. ఇదియే స్వప్రకాశ, పరిపూర్ణ, చైతన్యస్వరూపము - బ్రహ్మ అని తెలుపుచు ఈ బ్రహ్మను ఎచట తెలుసుకొనవలయునను ప్రశ్నకు వచనములు ఈ విధమున తెలుపుచున్నవి.

"యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్" ఎవడు యీ బ్రహ్మ వస్తువును తన హృదయాకాశమునందు సాక్షాత్కరింప జేసుకొనుచున్నాడో వాడు సర్వకామవ్యాప్తిరూపమగు మోక్షమును పొందును — అని హృదయాకాశము బ్రహ్మ తెలియబడు స్థానముగా తెలుపుచున్నది. ఇట్లే "అధోనిష్ఠ్యావితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి" అనగా నాభి నుండి ద్వాదశాంగుళముల యుపరిభాగమున హృదయస్థానమందు యుపాసించవలయును.

"దహరోస్మిన్నంతరాకాశః" ఈ హృదయాంతరమున అత్యల్పపరిమాణ మగు చిదాకాశము గలదని తెలుపుచున్నది, "సయ ఏషో స్తర హృదయ ఆకాశః"— హృదయములోన అతిసూక్ష మగు ఏ ఆకాశముకలదో అదియే బ్రహ్మ — చిదాకాశము అని తెలుపుచూ "తత్సత ం"— "సఆతా "— "తద్బ్రహ్మ " అని అదియే సత్యమైనదనిన్నీ, ఆత పదార్థమనిన్నీ, అదియే బ్రహ్మ యనిన్నీ శ్రుతివాక్యములు తెలుపుచూ "తత్త్వమసి" ఆ బ్రహ్మ వు నీవే అని జీవునకు మహావాక్యము బోధించుచున్నది. జీవుడు యిట్టి తన సత్యస్వరూపమును, అనగా మరచినదానిని తిరిగి పొందుటకు తాను జ్ఞాన రూపుడైన బ్రహ్మ యే, అని స్వానుభవముతో తెలుసుకొనవలయును. ఇట్లు మరచిన సంగతినే జీవునకు శ్రుతి "బ్రహ్మైవ వసన్ బ్రహ్మా ప్యేతి" అని ఈ జీవుడు బ్రహ్మ అయియుండి బ్రహ్మ ను పొందుచున్నాడని తెలుపుచున్నది. జీవుడు యిట్లు తాను బ్రహ్మ యేనని తెలుసుకొని స్వానుభవమును సంపాదించు కొనిన యిదియే మోక్షప్రాప్తి, ఇందుకు గాను మానవుడు శమదమాద్య భ్యాసములవల్ల గుర్వీశ్వరానుగ్రహములను సంపాదించి అద్వైతసిద్ధాంతమును బాగుగ శ్రవణ, మనన నిదిధ్యాసనములతో శాస్త్రవిధిగ నాచరించుచు ఫలా వగతిపర్యంతము విసుగుజెందక బ్రహ్మా నుసంధానాదుల చేయుచుండుట ముముక్షువున కావశ్యకము.

ఇందుకుగాను శ్రుతి వాక్యముల ననుసరించి ఆత్మానుసంధాన ప్రక్రియలువిపులముగా, వివిధప్రకారముల నీ గ్రంథమందు తెలుపబడియున్నవి. కాన ముముక్షువులు వాటిశాస్త్రీయ సాంప్రదాయాచరణాభ్యాసములచే పరమలాభ మును పొందవచ్చును.

## సారాంశము

వేదాంతమన, మనము భయపడవలసినదిగాని లేక మన కెందులకని గాని తలచవలసిన శాస్త్రముకాదు. ఇట్లుకాక జీవుని యిప్పుడు కలుగుచున్న

దృశ్య సంసార దుఃఖానుభవములను తొలగించి, వుని వాస్తవస్వరూపమైన నిత్యనిరతిశయ సుఖానుభవమును యిచ్చుశాస్త్రమిది యొక్కటియే. సర్వ వులును సర్వదాకోరునది సుఖమే. కనుక అట్టి సుఖమును వులకు తాత్కాలికముగ గాక యెన్నటికిని నశించని నిత్యనిరతిశయ సుఖమును కలుగజేయు శాస్త్రమిదియే గనుక దీనిని మోక్షశాస్త్రమనియూ, యిట్టి నిత సుఖస్వరూపమే మోక్షమనియు తెలియబడుచున్నది. ఇట్టి మోక్షసుఖము ద్వైతవేదాంత మతములన్నియూ జీవునకు యీ దేహపాతానంతరమందుగాని కలుగదని చెప్పుచున్నవి. ఇట్టిది అదృష్టఫలము. కాని ద్వైతమతములన్నియూ యిట్లు చెప్పుచున్ననూ అద్వైతవేదాంతబోధమాత్రము యీ మోక్షసుఖము ప్రత్యక్షమని తెలుపుచున్నది, అనగా యిట్టి మోక్షసుఖమును జీవుడు దేహధారణ కాలమందే అనగా వించియున్న దశయందే అనుభవింపవచ్చునని తెలుపుచున్నది. ఇదియే వనుక్తి. ఇట్టి వనుక్త్యనుభవమే వుని స్వస్వరూపమైన నిత్యనిరతిశయసుఖమై ఎప్పటికినీ మార్పుగాని నాశముగాని కలుగకుండ నిత సుఖ స్వరూపమైన ముక్తియగుచున్నది. నిత సుఖ స్వరూపమన్ననూ, జ్ఞానమన్ననూ, బ్రహ్మ యన్ననూ యొక్కటియే. ఇట్టి సత్యజ్ఞానము వునకు ఒక్కసారి కలిగిన యెడల యెన్నటికిని మారుటకుగాని, నశించుటకుగాని వీలులేదు. ఇట్లు యెన్నటికిని మారని సత్యపరిపూర్ణ జ్ఞానమే మానవుని నిత నిరతిశయ సుఖము, మోక్షము.

ఈ అద్వైత సిద్ధాంతమును గురించి యింతవరకునూ వివిధ ప్రకారములుగా మనము జేసిన శ్రుతి, యుక్తి, అనుభవ విచారమును బట్టి జీవుడు యిప్పుడు పొందుచున్న యీ కర్తృత్వాది దేహానుభవములన్నియూ అనాది భ్రాంతిచే శుద్ధవుడైన తనయందే అధ్యస్తముగాను (కల్పితముగాను) మాత్రము యున్నవనియు, యీ దృశ్యమంతయూ తన భ్రాంతి కల్పితమే ననియూ స్పష్టమగుచున్నది. అనగా శుద్ధ వుడైన తన సత్యస్వరూపము నందే తను యిప్పుడు అనుభవించుచున్న స్పశ రాదిదృశ్యానుభవము లన్నియూ రజ్జు సర్ప భ్రాంతి లాగున అధ్యస్తమైన వనిన్నీ, యిట్టి అధ స్తాను

భవమే తనకు (–వునకు) సంసారదుఃఖములను అనాదిగా కలుగజేయుచూ భ్రాంతుని గావించుచున్నదనియూ గూడ స్పష్టమగుచున్నది. వునికి సుఖస్వరూపము స్వతస్సిద్ధము, నిత్యము. కాని యిప్పుడు మనకు కలుగుచున్న స్వశరీరదృశ్యసంసారదుఃఖము తనకు ఆగంతుకమై యున్నది. ఇది అనాది అవిద్యా భ్రాంతి కల్పితము. ఈ భ్రాంతి చిత్తప్రమాద సంస్కార జ్ఞానము ఇట్టి ప్రమాదము నుంచి తప్పించుకొనుటకే వుడు తన చిత్తమును సంస్కరించుకొని సత్యసంస్కారజ్ఞానమును పొందవలయును ఇట్లు సత్యజ్ఞానమును బడసినయెడల వుడైన మానవుడు యింతకాలము నుంచి భ్రాంతిచే మరచిన తన నిత్యనిరతిశయ సుఖ స్వరూపమును పొందగలడని, యీ దృశ దుఃఖసంసారసాగరముననున్న మనలకు శాస్త్రము బోధించుచున్నది. అయిననూ శాస్త్రము చెప్పుచున్నది గాని, యీ అనాది వభ్రాంతిని పోగొట్టుకొనుట మనలకు సాధ్యమాయని తలంచకూడదు. సాధ్యము కాని దానిని శాస్త్రము యెప్పుడునూ చెప్పదు. చెప్పిననూ ప్రయోజనము లేదు. శాస్త్రము అనగా వేదము. ఇది నూరు తల్లుల సమానమైనది కాన మానవునకు నిష్ప్రయోజనమైనదిగాని అసాధ్యమైనదిగాని చెప్పదు. శ్రుతి వాక్యము ఆప్తవాక్యము వంటిది. వాస్తవమైన ఆప్తుడు ఎల్లప్పుడునూ క్షేమమునే కోరునుగాని అక్షేమమును కోరడు. అట్లు కోరువాడు ఆప్తుడుకాడు. ఇంకనూ మనము చేసిన యీ పైవివేచన వలననే మనకు కలుగుచున్న దృశ్యదుఃఖానుభవములు ఆగంతుకములు, కల్పితములు, భ్రాంతియుతములని నిశ్చయమగుచున్నది కదా. లోకానుభవములో గూడ మనలకు, వాస్తవ యజమానిని యింటినుండి వెడలగొట్టుట దుస్సాధ్యము, కష్టము గాని, అవాస్తవిక (అనగా దొంగ) యజమానిని యింటినుండి వెళ్ళగొట్టుటకు బహు యుపాయములున్నూ సులభసాధ ముగనూ యుండును గదా. అట్లే తనకు ( వునికి) యింతకాలము నుంచి దుఃఖపరంపరలను కలిగించుచున్న భ్రాంతి జ్ఞానమును తజించుట వివేకులకు కష్టసాధ ము కాదు. ఏలనన, ఇవి కల్పిత

మగు ఆ భా స వు ని ధర ములే. కాని యీ వభ్రాంతి యనునది దీర్ఘ రోగముగనుండి మానవుని బాధించుచున్నది. గనుక దీనిని నిరూలించుటకు దీర్ఘ ప్రయత్న సాధనములు కావలయును. ఇట్లు జీవుడు చేయవలసిన సాధనోపాయములనే శ్రుతి "ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని తెలుపుచున్నది. అనగా ..వుడు తన సత్య స్వరూపమైన ఆత ను బాగుగ గురుశాస్త్ర బోధవలన వినుటయు, మననము చేయుటయు, ధ్యానించుటయు, అభ్యసించుచుండవలయునని సాధనోపాయములను తెలుపుచున్నది. ఇట్టిసాధనోపాయములలోనిదే యీ బ్రహ్మవిద్యానుసంధాన మనునది. కాన ముముక్షువున కిట్టి సాధనాభ్యాసము పరమకర్తవ్యము.

ఇట్లుచేయుటకు ముముక్షువునకు సులభమార్గమేమన, అహం, నేను అను తనవాస్తవస్వరూపము స్వతస్సిద్ధమైన నిత్యనిరతిశయ అఖండపరిపూర్ణ చైతన్యమేననియు, యింకను ఆత్మానుసంధాననిరూపణలలో తెలిపిన శబ్దార్థములను బాగుగ మనోగోచరము చేసుకొని, అట్టితనయొక్క దృశ్యరహిత పరిపూర్ణచైతన్యస్వరూపమే సర్వదృశ్యాధిష్ఠానమనియు, యిట్టిదియే తనసత స్వరూపమనియు యిప్పుడు తనచే పొందబడుచున్న యీ సంసార స్వశరీరదృశ్యదుఃఖాదులన్నియూ తనవాస్తవ పరిపూర్ణ స్వరూపమునందే అధ్యస్తములై కల్పితములుగా నున్నవనియు, గాన యీ స్వశరీర సర్వ దృశ్యము తాను కాననియు, తన కెట్టి సంబంధము లేదనియు, తానే యీ సర్వ దృశ్యాధిష్ఠానమనియు అనుసంధానము చేయుచుండవలయును. ఇట్లు చేయుచు తనకు కలుగుచున్న స్వశరీరదృశ్యానుభవములు అవాస్తవములు, కల్పితములని నిశ్చయమును పొందవలయును. కాని యిట్లు నిశ్చయమును పొందిననూ తనకు ( వునికి) యిప్పుడు కలుగుచున్న దేహానుభవములు తనప్రారబ్ధఫలములుగాన, యిట్టి ప్రారబ్ధము తనను (జీవుని) విడువదు. కావున ముముక్షువు యిప్పుడు తన యీదేహానుభవములు అవాస్తవములు కల్పితమాత్రములను దృఢజ్ఞానముతో

## సారాంశము

ప్రారబ్ధానుసారము యథాప్రాప్తముగ ననుభవించుచు, అనుసంధానాదులను చేయుచూ తన దేహయాత్రాభారమును నిర్వహించుచుండవలయును, ఇట్లు చేయు దేహయాత్రాపరుసైననూ యీ దేహాద నుభవములు వ్యవహారము, ద్రవ్యము అప్పుయిచ్చిన వడ్డీవ్యాపారి, ఋణగ్రస్తుని పీడించునట్లున్నూ— నదిలో పడ్డవానిని భల్లూకము పట్టుకొనినయట్లు అనగా యీ వుడు ఆవలిగట్టు చేరువరకు యీ జీవునివదలక గట్టిగా పట్టుకొనియుండును. నదిలో పడిన వానికి యీ భల్లూకము తనను విడచిన బాగుండుననియే యుండును. కాని అది విడిచిపెట్టదు — ఇట్టిదియే ముముక్షుసంసార మానసికస్థితిగా యుండును. ఈ ప్రారబ్ధభల్లూకము వుని తన దేహపాతానంతరమువరకూ (గాని, లేనిచో కర ప్రతిబంధరాహిత్యము వరకుగాని) విడువక ముముక్షువును బాధించు చునేయుండును — ముముక్షువు విడవనిశ్చయించిననూ ప్రారబ్ధకర నుబట్టి మనోవ్యాపారదేహధర ములు వీనిని విడువవు. ఇది ఋణదాత, భల్లూ ములవంటివి. కాన జిజ్ఞాసువు యిట్లుతెలుసుకొని యీ దేహాదులను, తన యింటికి వచ్చిన తప్పనిసరియైన దుష్టబంధుకోటిలో చేర్చుకొని వాటికి కావలసిన యత్యావశ క ధర పరిచర్యలను అనగా ఆహార, విహార, కుటుంబభారము లను ఉదాసీన, నిర్లిప్తభావములతోనైనను నిర్వర్తించుచుండవలయునే కాని మానుటకు వీలులేదు. ఈ స్థూలదేహమునకు దాని ధర ములనుబట్టి క్షుత్పిపాసాదులకు కొంత యుపశాంతిచేయుచు ముముక్షువు తన వాస్తవ స్వరూపాను సంధానాదులను ప్రీతినిశ్చయములతో చేయుచుండవలయును అట్లుకాక దేహధర ములను ఉల్లంఘించి త్యజించనెంచినయెడల దేహధర ములు దుష్టబంధు వులలాగున వీనిని బాధించుచూ చిత్తఆలంబన విశ్రాంతులకునూ, సాధనాభాసములకునూ భంగముకలిగించుచుండును. కావున ముముక్షువు యీ దేహాదులను దుష్టబంధువులలాగున చూచుకొనుచుండుట యావశ్యకమని గ్రహించవలయును.

## సిద్ధాంతసారాంశము

గ్రం పరిసమాప్తికివచ్చుచుంటిమి గనుక యింతవరకు మనముచేసిన సిద్ధాంత విచారణల సారాంశమును జ్ఞప్తికితెచ్చుకొనుదము. ప్రతి వి

యున్నా అహం, ఇదం, మమేదం, అనుమూడు ప్రతులు సంసారమునకు కారణమగుచున్నవి. కాన వీటినిగురించి సంగ్రహముగ విచారింతము. ప్రతి మానవుడును అహం నేను అనుకొను ప్రతిలో పరమార్థముగ వాస్తవికత కనబడుటలేదు. ఎట్లన అహం, నేను అనునప్పుడుయుండు అంశములెవ్వియనిన, తనస్థూలదేహము, సూక్ష్మ దేహము లేక అంతఃకరణము, ఆభాసుడు, సాక్షి లేక ప్రత్యగాత్మ యనునవి. ఇందు స్థూల, సూక్ష్మ దేహములు రెండునూ జడములు. వీటికి నేను అనుకొను సామర్థ్యములేదు. ఇక హృదయపుండరీకమున తెలియబడు ప్రత్యగాత్మ యన్ననూ, పరమాత్మ యన్ననూ యొక్కటియే. ఈయన సర్వవ్యాపకుడైన పరిపూర్ణుడు గనుకనూ, తాను సర్వదా త్రివిధభేద రహితముగయుండుచూ, తానులేని దేశ, కాల, వస్తు, అవస్థలెవ్వియునూలేవు గనుకనూ, దేనినిన్నీ, నిషేధించి తాను నేను, అహం, అనుకొనుట సంభవించదు. ఏలనన సర్వము తానుయే గనుక — శేషించినవాడు ఆభాసుడు. ఈ ఆభాసశబ్దమువల్లనే యీయన వాస్తవుడుకాడని తెలియుచున్నది, ఈయన కేవల ప్రతిబింబరూపుడయి తనయందు వాస్తవముగలేని బింబప్రకాశమునూ దర్పణతుల్యమైన అంతఃకరణోపాధిధర్మములనూ తనయందుచేర్చుకొని అహం, నేను అని వ్యవహరించుచుండును. వాస్తవముగ యీయనగూడ లేనివాడే. కాని యీ సంపుటిలో వాస్తవమైనవాడు, నిత్యుడు, ప్రత్యగాత్మ యొక్కడే. ఈ ప్రత్యగాత్మ యే అహం నేను అను శబ్దమునకు లాక్షణికార్థరూపుడు. ఈయనయే వాస్తవుడు, నిత్యుడు, స్వప్రకాశుడు. అఖండ పరిపూర్ణుడు. ఈయనకు కర్తృత్వాదిధర్మములులేవు. ఈయన నిరవయవి, నిష్క్రియుడు — కర్తృత్వాది ధర్మ ప్రతులన్నియూ కల్పితములు అవాస్తవములు అని గ్రహించవలెను.

ఇదం, అనగా యీ స్వశరీరసర్వదృశ్యముఅయిన ప్రపంచము. ఇది మానవునకు దీర్ఘస్వప్నమువంటిది. ఈ ప్రపంచమంతయూ బ్రహ్మ యందు కల్పితమాత్రముగనున్నది. ఆ కల్పితముగూడ సువర్ణమునందు కటకకుండలాదుల వలెను, మృత్తుయందు ఘటశరావాదులునూ యున్నట్లుగాక మందాంధకారమున

## సారాంశము

రజ్జువుయందు భాసించు సర్పములాగునయున్నూ భ్రాంతిచే శుక్తియందు చూడబడు రజతములాగునయున్నూ మాయా ప్రభావముచే బ్రహ్మయందు ప్రపంచము స్వప్నతుల్యముగా భాసించుచున్నది. కాని వాస్తవమువిచారించిన లేనిదేయగుచున్నది. దీనినే శ్రీశంకరులు "విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం, పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా" అని స్పష్టముగా తెలుపుచున్నారు.

ఇట్లు అహం, ఇదం, లు రెండునూ వాస్తవముకానప్పుడు మమేదం, యనునదియుండుట యసంభవముగదా-అనగా నేను యీ ప్రపంచము యనునదియే వాస్తవముగలేనప్పుడు మమేదం నాదియనునది యుండుటకు యెట్లు సంభవము. సంభవములేదు. కాని యిదియంతయూ మాయ, తన ప్రభావముచే ఆ శుద్ధ-వునే యీ సంసారాదులుయున్నవానివలె కనపరుచుచూ, వునికి అవిద్యాకామకర్మలను అనాదిగ కల్పించినది. ఇట్టిమాయాకల్పనలను వుడు తన స్వప్రయత్నముచే (గుర్వీశ్వరానుగ్రహములతో) యిది అంతయూ కల్పన భ్రాంతిమాత్రముకాని, వాస్తవమున శుద్ధస్ఫటికమందు జపాకుసుమసాన్నిధ్యమువలన కనబడులౌహిత్యముతో స్ఫటికమునకెంతమాత్రము సంబంధము లేనియట్లు. (అనగా చూచువారికేయట్లు యెరుపుగయున్నట్లు స్ఫటికము కనబడును. గాని వాస్తవమున దానియందు యీ యెరుపుతనము యుండుటగాని, సం-మించుటగాని, యెట్టిసంబంధముగానిలేదుగదా) శుద్ధ వుడైన తనకు యీ అహం, ఇదం, మమేదములతో నెంత మాత్రము వాస్తవ సంబంధములేదని స్వానుభవము పొందిన -వుడు తిరిగి తన శుద్ధ -వత్వమును పొందినవాడగును. ఇదియే వునికి బ్రహ్మత్వము, మోక్షము, ముక్తి యగుచున్నది.

ఇంకనూ అనుభవసారాంశమును గురించి విచారింతము — ఏ వుడు స్వశ రజగని ధ్యాత్వమును గుర్వీశ్వరానుగ్రహములతో శ్రుతియుక్త్యనుభవానుసారమున బాగుగతెలుసుకొని స్వానుభవమునుపొందునో అట్టి మహ

నీయుడు, కలగాంచినవానికి తన స్వప్నములోని సర్వపదార్థములును, లేనివే యగుచు నిద్ర మేల్కాంచిన తదుపరి తాను మాత్రమెట్లు తన శయ్యయందే శేషించియుండునో అట్లే తానుమాత్రము స్వస్వరూపమున నిర్విశేషుడుగా నుండును. పునకిట్టిస్థితియే వను క్తిసుఖమునిచ్చి ముక్తినొసంగును. ఇందు సందేహములేదు. ఏలనన తాను కోరకపోయిననూ సుఖదుఃఖకరములయిన స్వప్నములు వాటియంతటవి వచ్చుచునేయుండును. అట్టిస్వాప్నిక పదార్థముల యందు ఎట్టివారునూగూడ సత్తతామానములు జాగ్రద్దశయం దుంచుటలేదుగదా — ఏలనన అట్టిస్వాప్నిక పదార్థములు సత్యముకావను దృఢవిశ్వాసము జాగ్రద్దశయందు కలుగుచున్నది. గనుక — అట్లే జగని థాత్వ దృఢనిశ్చయము కలిగినవాడు, తన జ్ఞానబలముతో దృశ్యపదార్థముల యందు వాటియొక్క అవాస్తవికతను గ్రహించి స్వప్నద్రష్టలాగున వాటి యందు సత్తతామానములను పొందడు. కాని ప్రారబ్ధబలముచే నది ఆభాస ముగనుండును. కాని దృశ్యమందు తన ప్రారబ్ధానుసారమున కలుగునట్టి ఆభాససంబంధములు కర్తృత్వ రహితముగనుండును. గనుక అట్టి కర ఫలము నివ్వజాలనందున తనను బద్ధునిగా జేయజాలవు. కాన తన ప్రారబ్ధఫలానుభవ మైన వెంటనే ముక్తి నిశ్చయము—అయినను యీపై అనుభవదృష్టాంతము లందు కొందరు స్వప్నపదార్థములు మము బాధించుటలేదే — జాగ్రద్దశలోని పదార్థానుభవములట్లు కనబడుటలేదే యను సంశయము నొందెదరు. కాని అది సరికాదు. ఏలనన జాగ్రత్స్వప్నానుభవములకు స్వకాలసత త్వము సమానమని లోగడనే తెలిపియుంటిమి. స్వప్నపదార్థములవల్ల తన స్వప్నావస్థానంతర మందుగద వాటి సుఖదుఃఖములనొందుటలేదు. అట్లే దృశ్యపదార్థములు తన అజ్ఞానావస్థలోనే సుఖదుఃఖములను కలిగించును కాని ఆయవస్థానంతరమందు జ్ఞానావస్థలోనికిరాగానే స్వప్నపదార్థములలాగుననే దృశ పదార్థములుగూడ బాధించవు సమస్తభయములున్నూ అజ్ఞానమువల్ల కలుగుచున్నవి. నిద్రయను అజ్ఞానమున్నప్పుడే స్వప్నము బాధను కలుగజేయును. జాగ్రద్దశలో స్వప్నము వచ్చుటలేదుగదా — అజ్ఞాన జాగ్రద్దశలో దృశము జీవుని బాధించును.

జ్ఞానజాగ్రద్దశకాలములోని దృశ్యము బాధించదు. ఎట్లన రజ్జువే అజ్ఞానకాలములో సర్పముగా భాసించుచు భయకంపాదులను కలిగించుచున్నదిగదా — కాని జ్ఞానమను దీపసహాయముచే జూడబడు ఆ రజ్జువు రజ్జువుగానేయుండి వుని భయకంపాదులనుండి విముక్తుని గావించుచున్నదిగదా — ఇది అందరికిని తెలిసినవిషయమే. అట్లే వుడు పదార్థాజ్ఞానమువల్ల భయనష్టములను వస్తు యథార్థజ్ఞానమువల్ల వస్తులాభశాశ్వతసుఖములను పొందునని గ్రహించవలెను-

మరియును శుద్ధ వుని స్వరూపమిట్లు గ్రహించుట సులభోపాయము. శుద్ధ వుడు చిదాకాశస్వరూపుడు. మహాకాశము చిదాకాశమునకు పెక్కు అంశములలో చాలసన్నిహితమైనది. కాని మహాకాశముజన్యము, చిదాకాశము నిత్యము, స్వతస్సిద్ధము. మహాకాశముయొక్క వికారిత్వ, నాశిత్వలక్షణములు రెంటిని ꠰సివై చినయెడల చిదాకాశ మహాకాశములొక్కటియే యగును. కించిజ్ఞులుగూడ ఈ దేహము గేహమువంటిదని యనుచుందురు. ఈ దేహగేహములు రెండునూ అసంఖ్యాకములుగ ఆకాశమందున్నవియేగదా — దేహగేహములు రెండును పరిచ్ఛిన్న సమూహములు. ఇందు అచటచట అగ్నిప్రమాదముల వలన గృహములదహనమగుచున్ననూ అందుండు గృహాకాశమెంతమూ తము నశించక అదికూడ మహాకాశమని యెట్లువ్యవహరింపబడుచున్నదో లేక తెలియబడుచున్నదో అట్లే యీ శరీరములు దహనములగుచున్ననూ అందుండు చిదాకాశరూపుడగు ఆత నశించడని తెలిసికొనవలయును. ఇట్లు నశించని తన ఆత్మయే ప్రత్యగాత —నిత్యుడు, పరిపూర్ణుడు, సర్వాత , పరమాత , యని గృహాకాశము మహాకాశమగునట్లుగ నున్నదని తెలిసికొని అట్టిచిదాకాశ స్వరూపమే తన వాస్తవస్వరూపమగు సచ్చిదానందస్వరూపమని, నిశ్చయముగ గ్రహించవలెను.

ఇట్లు బాగుగ గహించిన తన సత్యస్వరూపమునే, తన మోక్షసిద్ధికి గాను ఫలావగతి పర్యంతము అనగా తన ప్రారబ్ధాంతమువరకు అనుసంధాన నిరూపణలలో తెలిపినయటుల నిరంతరము విసువుజెందక అనుసంధానాదుల నభ్యసించు మహనీయునికి ముక్తి కరతలామలకమగును —

# ఆత్మానుసంధానము

ముముక్షువు గురుముఖతః మహావాక్యార్థ శ్రవణము చేసిన తదుపరి వాక్యార్థ సాక్షాత్కారమునకు గాను అనగా స్వానుభవము పొందుటకు మనన, నిదిధ్యాసనములు ఇట్లు చేయవలయునని శ్రీ శంకరభగవత్పాదులు ఈ క్రింది విధమున ఉపదేశసాహస్రి యను గ్రంథమునందు తెలుపుచున్నారు:-

శ్లో॥ దృశిస్వరూపం గగనోపమం పరం
సకృద్విభాతం త్వజమేకమక్షరం,
అలేపకం సర్వగతం యదద్వయం
తదేవచాహం సతతం విముక్తఓమ్॥

అనగా, జ్ఞానమాత్రస్వరూపమే ఆకాశమువలె నిత్యమై సర్వ పదార్థములకు కారణమై స్వప్రకాశమై జన్మాది వికారములు లేనిదై సర్వభేదశూన్యమై నాశాదివికారరహితమై పుణ్యపాపాది కర సంబంధవివర్జితమై సర్వవ్యాపకమై అ న్నమైన యేపరమాత స్వరూపము కలదో, అట్టి పరమాత స్వరూపమును నేను. ేను సర్వకాలములయందు అవిద్యాది దోషములచేత విడువబడివున్నాను.

శ్లో॥ దృశిస్తు శుద్ధోఽహమవిక్రియాత కో
నమేఽస్తికశ్చి ద్విషయః స్వభావతః।
పురస్తిరశ్చోర్ధ్వ మథశ్చసర్వతః
సంపూర్ణ భూమాత్వజ ఆత నిస్థితః॥

అనగా, నేను శుద్ధమైన జ్ఞాన స్వరూపుడను. సర్వ వికారరహితుడను. నాకు స్వభావము చేతనే విషయము లేవియును లేవు. నానాదిక్కులయందు సంపూర్ణమై వా పకమై జనా దులు లేక స్వస్వరూపము నందున్నవాడను.

## ఆత్మానుసంధానము

శ్లో॥ అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృతః,
స్వయంప్రభః స్సర్వగతోఽహామద్వయః ।
నకారణం కార్య మ వనిర లః,
సదైవ తృప్తశ్చ తతో విముక్త ఓమ్॥

అనగా నేను జన్మ లేనివాడను, అపక్షయము లేనివాడను, ముదిమి లేనివాడను, మరణము లేనివాడను, స్వయంప్రకాశస్వరూపుడను, సర్వ వస్తువులయందు వ్యాపించి యున్నవాడను, సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేనివాడను, కారణములగు పృథివ్యాది భూతములకంటె, కార్యములగు దేహేంద్రియాదుల కంటె విలక్షణమైన వాడను. అత్యంత నిర లుడను. సర్వకాలములయందు తృప్తికలవాడను గనుకనే నేను ముక్తుడను.

కాన జిజ్ఞాసువైన అభ్యాసకుడు పై శబ్దముల నన్నింటిని అర్థవంతముగా గ్రహించి మనోగోచరము చేసుకొని నిరంతరము తన సత్యస్వరూపము యిట్టిదియని ఫలపర్యంతము అనుసంధానము చేయుచుండుట ముముక్షువునకావశ్యకము.

ఇంకను ముముక్షువైనవాడు తన సత్యస్వరూపమును సర్వదా యిట్టిదియని :—

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం
అచలోఽహం సనాతనః ।
అఖండోఽహ మనన్తోఽహం
పరమాత్మాఽహమచ్యుతః ॥

అనిన్నీ యింకను తన స్వరూపము, అనగా నేను అను అహం, దృశ్య రహిత — సర్వాధిష్ఠాన,—సర్వాంతర్బహిర్వ్యాపక — స్వప్రకాశ — అసఙ్గ - అద్వితీయ—నిత్య—నిర్వికార—నిరవయవ—నిరతిశయ — శాంత — అఖండ—

పరిపూర్ణ చైతన్యము-నేను పరిపూర్ణుడను గనుక అచలుడను. నేను నిష్క్రియుడను, అచలుడనగుటచే నాకు కర్తృత్వ భోక్తృత్వములు సంభవించుటకు వీలులేదు. గనుక నాహంకర్తా – నాహంభోక్తా—ఈ కర్తృత్వ భోక్తృత్వములు నావికావు కనుక యిప్పుడు కలుగుచున్న సుఖదుఃఖములు ఆభాసములు కల్పితములు గాని వాస్తవముగాదు. నేను కేవల సుఖస్వరూపుడను. కాని సుఖాభాసస్వరూపుడనుగాను. ఈ ఆభాస సుఖదుఃఖములు అవిద్య వల్ల నాకు గలుగుచున్నవి. ఇప్పుడు నా సత్యస్వరూపమును బాగుగ గ్రహించినవాడను గాన యీ విషయాభాససుఖదుఃఖములతో నాకెంతమాత్రము సంబంధము లేదు. ఇవి నా కల్పిత అంతఃకరణ ధర్మములు. నేను సత్య జ్ఞానానంత స్వరూపుడను. కాని నా అవిద్యా కల్పితమైన కరానుభవమునకు అనగా క్షయమునకుగాను యీ యుపాధిస్థితుడనై యున్నందున నాయీ యుపాధి విలయము వరకు కర్తృత్వాది సక్తతా మానరహితుడనై ప్రారబ్ధ కర్మఫలమును యథాప్రాప్తముగా గడపుటయే నాపనిగాని వేరొందేమియును లేదు, అను దృఢనిశ్చయమును సంపాదించుకొని ప్రీతిపూర్వకముగ అను సంధానాదులను అభ్యసించుచుండవలెను. ఇట్లభ్యసించిన తన సత్యస్వరూపము బ్రహ్మ స్వరూపమే యగును. అట్టి బ్రహ్మ స్వరూపమును యీ విధముగా :—

శ్లో॥ నక్వచిద్భేదకలనా నభావాభావరంజనా,
సర్వంశాంతం నిరాలంబం శోభనం శాశ్వతమ్ శివమ్,
అనామయ మనాభాస మనాత కమకారణం,
నసన్నాస న్నమధా ంతం నసర్వం సర్వమేవచ.
మనోవచో రగ్రాహ్యం శూన్యాచ్ఛూన్యం సుఖాత్సుఖం,
అసంవేదన మాశాంత మాత్మవేదన మాతతమ్.

ఏ వస్తువునందు నీవు నేను తాను పరుడు అనునట్టి భేదము ఎప్పుడును లేదో, మరియు ఉన్నది లేదు అనునట్టి భావాభావంబులును దేనియందులేవో అట్టి

సర్వాత్మకంబును, నిర్వికారంబును, నిర్విషయంబును, చిదాకాశస్థితంబును, శాశ్వతంబును. శివశబ్దితంబును, నిర్దోషంబును, అనారోపితంబును, నామ జాత్యాదిరహితంబును, కారణత్వరహితంబును, ఆదిమధ్యాంతరహితంబును, సర్వజగద్విలక్షణంబును, జగద్రూపంబును, మనోవాగగోచరంబును, శూనంబగునాకసంబు కంటె శూన్యతరంబును, విషయసుఖంబుకంటె సుఖతరంబును, అప్రమేయంబును, అశాంతంబును, నిఖిలప్రమాణ మూలంబును నగునది బ్రహ్మమని యెరుంగుము అని శ్రీ వసిష్ఠభగవానులు శ్రీ రామ చంద్రమూర్తికి తెలుపుచున్నారు. గాన ముముక్షువు యిట్టి స్వరూపము బాగుగ గ్రహించి అట్టిదితనస్వరూపమేనని తెలుసుకొని స్వానుభవమును పొందవలెను. ఇదియే మోక్షము. వివేకి అయిన వాడు యీలోకమునందెంత విచారించి వెదకి చూచినను, యున్నపదార్థములు రెండు తప్ప మరి మూడవదియయిన పదార్థము కనుబడదు. ఈ పదార్థములు ఏవి, యెట్టివి, యనిన, ఆత్మ, అనాత్మ, ఇందు ఆత్మ తన సత్యస్వరూపము — అనాత్మ ఈ స్వశరీరదృశ్య సంఘాతము. ఇట్లుండ ముముక్షువునకు తన సత్య స్వరూపమైన ఆత్మ, లేక బ్రహ్మను తెలుసుకొనుటకు శాస్త్రము రెండు విధానములను తెలుపుచున్నది. అవి ఏవియనిన, మొదటి విధానము. సర్వమును ఆత్మ భావముచే గ్రహించుట. అనగా అహమ్ అను తానుయే యీ సర్వ దృశ్యమునకు అధిష్ఠాన మనియు, తాను పరిపూర్ణమనియు, తనయందే యీ పరిచ్ఛిన్న, న్న, న్న, సర్వ దృశ్యము రజ్జుసర్పవత్ అధ్యస్తమై యున్నదనిన్నీ, అనగా భ్రాంతిచే కల్పిత ముగా నున్నదని తెలుసుకొనుట. అనగా యీ సర్వదృశ్యమునకు తానే అధి ష్ఠానము గనుక సర్వము తానేయని గ్రహించి అందు జడాంశమునుత్యజించి తన సత్ స్వరూపమైన సత్యజ్ఞానానంత వస్తువును తాను అని తెలుసుకొని స్వానుభవము పొందుట.

రెండవ విధాన మేదియనిన, యీస్వశరీర సర్వదృశ్యసంఘాతము జడము, కల్పితము. ఇది యంతయు అనాత్మ పదార్థము. వాస్తవముగ తాను కేవల ఆత్మ

స్వరూపుడు గావున యీ స్వశ రీర సర్వదృశ్య పదార్థము కల్పితము, జడము గాన అనాత్మ కోటిలోనిదే యగును. ఇట్టి సర్వ అనాత్మ పదార్థమును నేతి, నేతి, ఇదికాదు, ఇదికాదు, అను జ్ఞానముతో సర్వమును నిషేధించిన శేషించునది తన సత్యస్వరూపమైన ఆత్మ పదార్థమే కావలయును గదా ? ఏలనన, పైన తెలిపిన యటుల ఆత్మ, — అనాత్మ —పదార్థములు తప్పమూడవది లేదు. గనుక అనాత్మ కోటియయిన సర్వదృశ్యమున్ను, యిందు యేదిన్ని, ఆత్మ పదార్థము కాదని తెలుసుకొని శేషించి, నిర్విశేషముగా నుండు సత్పదార్థమే తాను అనగా అహమ్ నేను అని తెలుసుకొనుట రెండవ విధానము.

ఇట్టి రెండవ విధానము ననుసరించి అద్వైత సిద్ధాన్తమును కరతలామలకముగ నిరూపించుటకే శ్రీ జగద్గురువులైన శ్రీ శంకరభగవత్పాదులు "నిర్వాణ దశకస్తోత్రము"ను రచించి అద్వైత సిద్ధాన్తమును ఘంటాపథముగ తెలుపుచున్నారు. శ్రీ శంకరులవారి స్తోత్రములన్నియు రత్నములవంటివే యయినను యందు యీ నిర్వాణ దశకస్తోత్రమనునది అద్వైతసిద్ధాన్తమునకు మకుటము వంటిది. ఇయ్యది పది శ్లోకములు మాత్రమే అయినను గంభీర, అద్వైత సిద్ధాన్త పూర్ణతతో విరాజిల్లుచున్నది. గనుకనే వీటిని యిట్టిదిగా గ్రహించి శ్రీ మధుసూదనసరస్వతీ స్వామి "సిద్ధాన్తబిందు" యను శాస్త్ర సిద్ధాన్తవివరణ గ్రంథమును వ్రాసియుండిరి. ఈ గ్రంథము స్తోత్రమునందు గల సిద్ధాన్తమును, అందు ప్రతి యొక్క-యంశమును అతి గంభీర, సమగ్రశాస్త్ర, జటిల, చర్చలతో పరిష్కరించి తెలుపుచున్నారు. ఈ గ్రంథము అద్వైతసిద్ధాన్తమునకు ప్రధాన గ్రంథములలో నొకటిగా భాసించుచున్నది. అయినను దీని నవలోకించుటకు గూడ సామాన్యశాస్త్రజ్ఞులకు సుసాధ్యముగ నుండదని తెలియుచున్నది.

కనుక ప్రస్తుతమేమన, ముముక్షువు అద్వైత సిద్ధాన్తమును గ్రహించుటకు యీ స్తోత్ర శ్లోకములను సమగ్ర శాస్త్రజ్ఞానముతో గాక పోయినను, సిద్ధాన్తానుభవములతో యీ స్తోత్ర శబ్దార్థములను బాగుగ గ్రహించిన, అను

సంధానమున కెంతయో యుపకరించును. కాన యిట్టి స్తోత్రమును సంగ్రహించి యీ క్రింది తాత్పర్యార్థముతో యుదహరించుచున్నాడను:-

. నభూమిర్నతోయం నతేజో నవాయు। ర్నఖంనేంద్రియం వా నతేషాం సమూహః ॥ అనైకాంతికత్వా త్సుషుప్త్యైకసిద్ధ। స్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥

తా ॥ పృథివి మొదలగు పంచభూతముల స్ఫురణము లేని సమయమందు కూడ స్ఫురించుటచే నేను పృథివిగాని, జలముగాని, తేజస్సుగాని వాయువుగాని, ఆకాశముగాని, చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాదీంద్రియ రూపుడుగాని, వాటి యొక్క సమూహరూపుడుగాని కాను. అయినను సుషుప్తి కాలమందు అనుభవింపబడు శుద్ధచైతన్యస్వరూపుడగు శివుడను నేను.

2. నవర్ణా నవర్ణాశ్రమాచారధరా । నమేధారణా ధ్యానయోగాదయోపి ॥ అనాత్మాశ్రయోహంమమాధ్యాసనాశా త్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్॥

తా ॥ వర్ణములు, వర్ణధర్మములు, ఆశ్రమములు, ఆశ్రమములయందు ఆచరింపబడు ధర్మములుకాని, నేను కాను. నాకు ధారణగాని, ధ్యానముగాని, యోగాదులుగాని, యేమియులేవు. నాది, నేను అను వ్యవహారమునకు విషయుడు నేను కాను. అధ్యాసము పోగా శుద్ధ స్వరూపుడుగా మిగిలిన కేవల మంగళ స్వరూపుడను నేను.

3. నమాతాపితావా నదేవానలోకా। నవేదా నయజ్ఞా న తీర్థంబ్రువంతి ॥ సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వా। త్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥

తా ॥ నేను తల్లిగాని, తండ్రిగాని, దేవతా రూపుడనుగాని, లోకస్వరూపుడను గాని, వేదస్వరూపుడనుగాని, యజ్ఞస్వరూపుడనుగాని, తీర్థస్వరూపుడనుగాని కాను. ఇవి యేమియు సుషుప్తిలో కనబడవు గాన యివి

స్వరూపరహితములు. సుషుప్తిలో కూడ మిగిలియున్న మంగళ స్వరూపుడు మాత్రమే నేను.

. నసాంఖ్యం నశైవం నతత్పాంచరాత్రం । నజైనం నమీమాంసకాదేర తంవా ॥ విశిష్టానుభూత్యా విశుద్ధాత కత్వాత్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్॥

తా॥ సాంఖ్యముగాని, శైవముగాని, పాంచరాత్రముగాని, జైనముగాని, మీమాంసకముగాని, యెట్టి మతము నాకు లేదు. విశిష్టానుభవముచే శుద్ధ స్వరూపుడుగా సిద్ధమగుట వలన ఆ మిగిలిన కేవలమంగళ రూపమైన స్వరూపమే నాది.

. నశుక్లం నకృష్ణం నరక్తం నపీతం । నపీనం నకుబ్జం నహ్రస్వం నదీర్ఘమ్ । అరూపంతథాజ్యోతిరాకారకత్వాత్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్॥

తా॥ నేను శుక్ల (తెలుపు) వర్ణముగాని, కృష్ణ (నలుపు) వర్ణముగాని, రక్త (ఎరుపు) వర్ణముగాని, పీత (పసుపు) వర్ణముగాని, యేదియు కాను. స్థూలముగాని, పొట్టిదిగాని, చిన్నదిగాని, పొడుగైనది గాని, యేదియు నేను కాను. ఎట్టి ఆకారము లేక కేవల జ్యోతి స్వరూపుడగుటచే ఆ మిగిలిన ఒక్క శివస్వరూపుడనే నేను.

. నజాగ్రన్నమే స్వప్నకోవా సుషుప్తి । ర్నవిశ్వో నవాతైజసః ప్రాజ్ఞకోవా ॥ అవిద్యాత కత్వాత్త్రయాణాంతురీయః । తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥

తా॥ జాగ్రద మానియైన విశ్వుడున్ను, స్వప్నా మానియైన తైజసుడును, సుషుప్త మానుడయిన ప్రాజ్ఞుడును అవిద్యాస్వరూపులగుటచే అవి నేను గాక యీ మూడింటిని తజించగా మిగిలిన తుర్యస్వరూపమయిన ఆమంగళస్వరూపుడనే నేను.

7. నశాస్త్రా నశాస్త్రం నశిష్యో నశిక్షా నచత్వం నచాహం నచాయం ప్రపంచః ॥
స్వరూపావ బోధాద్వికల్పా సహిష్ణు । స్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥

తా॥ శాస్త్రమనిగాని, శాసించువాడుగాని, శిక్షించువాడుగాని, శిక్షింపబడువాడుగాని, నీవు అను వాడుగాని, నేను అనువాడుగాని యీ బాహ్యమగు ప్రపంచముగాని, యేదియు నేను కాను. నాస్వరూపము బోధరూపమై యెట్టి వికల్పమునకు విషయము కాకపోవుటచే వీటికన్నిటికిని అ తమైమిగిలే కేవల మంగళస్వరూపుడను నేను.

. నచోర్థ్వం నచాధో నచాన్తర్న బాహ్యం । నమధ ం నతిర్యఙ్న పూర్వాపరాదిక్ ॥ వియద్వ్యాపకత్వా దఖండైకరూప । స్తదేకోవశిష్టశివః కేవలోహమ్ ॥

తా॥ నాకు పయిన అనిగాని, క్రింద అనిగాని, లోపల అనిగాని, బయట అనిగాని, మధ్యమనిగాని, అడ్డమనిగాని' పూర్వమనిగాని, చివరఅనిగాని, యేదిగ్విభాగము లేదు. ఆకాశమువలె వ్యాపకమగుటచే విభాగ రహితమై శుద్ధముగా మిగిలే మంగళ స్వరూపుడనే నేను.

. అపివ్యాపకత్వా ద్ధితత్వప్రయోగా । త్స్వతస్సిద్ధభావా దనన్యాశ్రయత్వాత్ ॥ జగత్తుచ్ఛమేత త్సమస్తం తదన్య । స్తదేకోవశిష్ట శ్శివః కేవలోహమ్ ॥

తా॥ వ్యాపకమగుటచేతను, పరమానంద రూ ప ము గ ఉపదేశింపబడుటచేతను, యే కారణములేకనే సిద్ధమగుటచేతను, మరియొక దానిని ఆశ్రయించకుండ వుండుటచేతను, తుచ్ఛమైన యీ సమస్త జగత్స్వరూపుడను నేనుకాను గాన దానికన్న వేరుగా మిగులునటువంటి శుద్ధమంగళస్వరూపుడను నేను.

. నచైకం తదన్యద్ద్వితీయం కుతఃస్యాత్। న్నచాకేవలత్వం నవా వ లత్వమ్ ॥ నశూన్యం నచాశూన్యమద్వైతకత్వాత్। కథం సర్వవేదాంత సిద్ధం బ్రవీమి ॥

తా॥ ఏకత్వము గలది కాదు గాన దానికన్న వేరు అయిన రెండవది యేల వచ్చును ? అ వలత్వముగాని, కేవలత్వముగాని, శూన్యరూపత్వము గాని, అశూన్యరూపమనిగాని అద్వైత స్వరూపమగుటచే చెప్పుటకు వీలులేదు గాన వేదాంతసిద్ధాంతము నెట్లు తెలుపగలను అని శ్రీ శంకర భగవత్పాదులు వారి గురువులైన గోవింద యోగేంద్రులవారికి తమ సిద్ధాంతసారమును సర్వోత్కృష్టమైన యీ దశశ్లోక రూపమున తెలిపినట్లు — విశదమగుచున్నది.

"అహంసాక్షీ, కూటస్థః, ప్రత్యగాత్మా , సచ్చిదానందస్వరూపః, అహం సర్వాధిష్ఠాన స్వప్రకాశ సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత నిత్యనిర్వికార నిర్గుణాఖండపరిపూర్ణశుద్ధచైతన్య స్వరూపః , శివోఽహం, శాన్తోఽహం, సర్వాన్తర్బహిర్వ్యాపకోఽహం, దేశకాలవస్తు పరిచ్ఛేదరహితోఽహం, అద్వితీయోఽహం, అవికారోఽహం, అసంగోఽహం, అకర్తాఽహం, అభోక్తాఽహం, సర్వాధిష్ఠానభూతోఽహం, స్వాధిష్ఠితోఽహం, సంవిద్రూపోఽహం నిరాశ్రయోఽహం, నిరవయవోఽహం, నామరూపరహితోఽహం, జనన మరణరహితోఽహం, అచలోఽహం, నిష్కలంకోఽహం, సర్వాత్మకోఽహం, అణోరణీయోఽహం, మహతోమహీయోఽహం, నాహంద్రష్టా, నాఽహందృశ్యః, అహంసంవిద్రూపః, ఏకోఽహం, సర్వోఽహం, అద్వితీయోఽహం, అత్యాజ్యోఽహం, అసంగోఽహం, నిత్యోఽహం, పరిపూర్ణోఽహం, బ్రహ్మైవాఽహం బ్రహ్మైవాఽహమసి సోఽహమ్"

అని సర్వదా ముముక్షువు తన స్వరూపానుసంధానమును చేయుచుండవలెను. ఇదియే పరమభక్తి. దీనినే —

"స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే"

అని శంకరభగవత్పాదులు చెప్పిరి కాన వాస్తవమైన పరమభక్తి ఈ యను సంధానమేయని గ్రహించవలెను. ఇట్టి గ్రహణమునకు చాల నిర్మలమైన సూక్ష బుద్ధి కావలయును. దీనినే —

"దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష యాసూక్ష దర్శిభిః"

అనగా ఇట్టి బ్రహ్మ పదార్థ గ్రహణము నిర్మలమయిన సూక్ష బుద్ధిచేతనే కలుగును, ఇట్టి బుద్ధిచేతనే ఆ ప్రత్యగాత్మను గ్రహించవలెనుగాని, వేరుసాధనము లేదని "మనసైవేదమాప్తవ్యంనేహనానాస్తికించన" అను శ్రుతితెలుపుచున్నది. కనుక శబ్దజన్యజ్ఞానమెంతసంపాదించినను ఈ బ్రహ్మానుభవము కలుగుటకు సంతతశ్రవణ మనననిదిధ్యాసనములను స్వప్రయత్నముతో ప్రీతి నిశ్చయపూర్వకముగ ప్రారబ్ధప్రతిబంధనివృత్తివరకు, అనగా ఫలావగతిపర్యంతము చేయుటావశ్యకము. కాని వేరు సాధనములేదు. కాన ఇట్టి బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు వృత్తియే శరణ్యము.

దీనినే — "బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్ష్యతే ।
స్వప్రకాశోఽపిసాక్ష్యేష ధీవృత్త్యా వ్యాప్యతేఽన్యవత్ ॥

అనగా — బ్రహ్మాజ్ఞానము నశించవలెనన్న వృత్తి అపేక్షితమైనదనియు, సాక్షి స్వయంప్రకాశుడైనను ఇతరపదార్థములవలె వృత్తివ్యాప్తినపేక్షించుననియు విద్యారణ్యులు తెలుపుచున్నారు. ముముక్షువైనవాడు సర్వవిధముల ధీవృత్తి నాశ్రయించి సంస్కరించుకొని సత్యపదార్థమును గ్రహించి అనగా అపరోక్షానుభవమునుపొంది బ్రహ్మాత్మనాసంస్థితుడై యుండుటకు సర్వదా ప్రయత్నించుచుండవలయును. వేరుమార్గములేదు. దీనినే "నాఽన్యః పంథావిద్యతేఽయనాయ" అని శ్రుతి తెలుపుచున్నదని గ్రహించి అహం అనగా నేను స్వశరీర కర్తృత్వభోక్తృత్వాది దృశ్య సంఘాతముకాను. నేను యీ సర్వజగదుత్పత్తి స్థితిలయములకు వివర్తకారణుడనై, దృశ్య రహిత, సర్వాంతర్బహిర్వ్యాపకు

డనై చిదాకాశరూపమున అన్నిదేశములలోను — కాలములలోను, వస్తువుల లోను అవస్థలలోను పరిచ్ఛేదరహితుడనై అచల, అసంగ, నిర్వికార, అఖండ పరిపూర్ణుడనై "వృక్షఇవ స్తబ్ధోదివితిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణసర్వం" అని శ్రుతివచనము తెలుపుచున్న పురుషుడు నేను అని తెలుసుకొనవలయును. ఇట్టి తన స్వస్వరూపానుభవమును పొందుటకు, ప్రారబ్ధమును కర ఫలాను సారమనుభవించుచూ తన సత్యస్వరూపమందు నిరంతరము ప్రీతితో ఆత్మా ను సంధానమును చేయుచుండవలయును. ఇదియే ఆత్మా నుసంధానము. మోక్షార్థికిది పరమసాక్షాత్సాధనమని తెలుసుకుని విసువుజెందక ఫలావగతిపర్యంతమూ అనగా స్వస్వరూపానుభవము పొందువరకూ ఈ అనుసంధానాదులను అభ్య సించుట ముముక్షువునకు విధియైయున్నది,

ముముక్షువు యెంతవిచారించిననూ గోచరించునది అహం నేను, ఇదం ఈ సర్వదృశ్యము అనుదానికన్న మరేమియు నుండుటలేదు. ఈ రెండధ్యాస ములు అధిష్ఠానమైన ఏకవస్తువునందే కలుగుచున్నవి. సర్వాధిష్ఠానముగా నున్నది ఈ ఒక్క సద్వస్తువైన బ్రహ్మ పదార్థముతప్ప యితరమేమియునూ లేదు. దీనినే శ్రుతి "ఏకమేవాఽద్వి యంబ్రహ్మ" — "నేహనానా స్తికించన" అనిఅన్వయ వ్య తిరేకములచే మనలకు తెలుపుచున్నది. కాన యెట్లు చూచిననూ అహం అను తనుకూడ యీ దృశ్యా ంతఃపాతియే గనుక రెండును భ్రాంతిచే కలిగినవని నిశ్చయమగుచున్నది. ఇందుచే విద్వాంసుడు అహం అను తనయందు కలుగుచున్న అంతఃకరణధర్మములైన సుఖదుఃఖములను, కర్తృత్వ భోక్తృత్వాదులను — అట్లే ఇదం అను సర్వదృశ్యమందు కనబడు చున్న నామరూపములను జ్ఞానపూర్వకముగా త్యజించిన, శేషించునది తన పరి పూర్ణ, అఖండ, శుద్ధచైతన్యమొక్కటితప్ప వేరేమియు నుండదు. ఈ ఒక్కటియైన అఖండపరిపూర్ణచైతన్యమునే అనుభవమునుబట్టి శాస్త్రము ప్రత్యగాత్మ పరమాత్మ లని చెప్పుచున్నది. కాని యీ ఆత్మ ఒక్కటియే. అదియే తాను అని తెలుసుకొనవలయును, ఇదియే శ్రుతి పరమతాత్పర్య - మద్బ్రహ్మై క మని గ్రహించవలెను. ముముక్షువు నేను అని తాననుకొనునప్పుడు తన

హృదయపుండరీకమందు తెలియబడు ప్రత గాత్మయే తాను అనగా అహం, నేను అని నిశ్చయముతో తెలిసికొనవలయును. అహం, నేను అని తానను కొనునప్పుడు తన ప్రత గాత్మ స్వరూపమే స్ఫురించుచుండవలెనుగాని, తాను జడములగు యీ శ రాదులని యెంతమాత్రము తలచగూడదు, ఈ శరీరా దులు తనకు కవచములవంటివేకాని తానుకాదు. ఎంతవిలువయైనదైనను తన కవచము తానెట్లగును. కాని తన రక్షణకు అవి యావశ్యకముగ నుండును. రత్నకవచమైనను అది తాననుకొనుట యవివేకము, భ్రాంతియేకదా కావల యును. కనుక తన రత్నకవచకి టాదుల లాగున తన శ రాదులు వున కెంత ప్రేమాస్పదముగానున్ననూ అవి తాను అను నేనుకానని నిశ్చయించు కొనవలయును. ఇట్లు తానని తెలిసికొన్న ప్రత్యగాత యే పరమాత స్వరూప మనిన్నీ, ప్రత్యగాత పరమాత లొక్కటియేయనిన్నీ అదియే తన వాస్తవ స్వరూపమని తెలిసికొనవలయును. ఇట్లు తెలుసుకొనిన తన అఖండ పరిపూర్ణ స్వరూపమును నిరంతరము తానేయని అనుసంధానాదులను విసువుజెందక ఫలా వగతిపర్యంతము తాను నిత్య, నిర్వికార, నిర ల, మహాకాశములాగున యున్నా, తాను సంవి ద్రూపస్ఫటిక మహాశిలవంటివాడనినిన్నీ, స్వశరీరాది దృశ వికారములతో తనకెట్టి వాస్తవసంబంధములేదనిన్నీ, నిత్య, నిర్వికార, అసంగ, పరిపూర్ణ, అఖండచైతన్యమే తన ఆత స్వరూపమనిన్నీ, ఆతా ను సంధానాభా సాదులను యాచరించుచుండవలయును—

## మహావాక్యానుసంధానము

అన్ని మహావాక్యములయొక్క తాత్పర్యము వబ్రహ్మైక్యమును బోధించుటయే. అయినను ఈ వాక్యసరణులు వివిధములుగా నున్నవి. ఇట్టి మహావాక్యములలో "తత్త్వమసి" యనునది ఒకటి. గురువుచే భాగత్యాగ లక్షణముచేసి శబ్దలాక్షణికార్థముచే శిష్యునకు "నీవుబ్రహ వు" అని బోధించిన మహావాక ము. ఈ వాక ముచే శిష డు తాను అనగా నేను బ్రహ ను అనితెలిసికొనిననూ తద్దార్ఢ ముకొరకు "నేను బ్రహ ను" అని అనుసంధానము

చేయుటను "అహంబ్రహ్మాస్మి" అను మరియొకమహావాక్యము తెలుపుచున్నది. అయిననూ "అహంబ్రహ్మాస్మి" అని అనుసంధానము చేయునప్పుడు ఈ "అహం" అనునదెట్టిది అని తెలిసికొనుటకు ఈ శాస్త్రవాక్యము వివరణ చేయుచున్నది. అదియేదియనిన "సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి" అనగా ఎవరు సర్వ ప్రపంచాత్మక దుఃఖరహితుడును, సర్వాధిష్ఠాన సర్వోపాధివినిర్ముక్త అఖండపరిపూర్ణ చైతన్య స్వరూపుడునూ సర్వాంతరుడై సర్వ వులయందును ప్రత్యగాత స్వరూపుడుగానున్నాడో అట్టి పరమాత యే అహం అను నేను. అనగా ఆ పరమాత్మయూ ప్రత్యగాత స్వరూపుడైన నేనున్నూ ఒక్కటియే యను అర్థము తెలుపుచున్నది. కాన ముముక్షు జిజ్ఞాసువులు దీనిని బాగుగ గ్రహించి సర్వదా "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యానుసంధానమును శాస్త్రీయముగ నాచరించుట సాక్షాన్ముక్తి దాయకము.

## ఆత్మానుసంధానమే దేవపూజనము

అఖండ పరిపూర్ణ ఆత స్వరూపుడైన జీవుడే తన వాస్తవస్వరూపమును మరచి అనాత సంఘాతమునంతయు తానని నమ్మి వ్యవహరించుచు సంసారదుఃఖమును పొందుచున్నాడు. ఆత్మవిచారము వలన వునకు ఆత వివేకము కలుగును. ఆత యన్నను వుని వాస్తవస్వరూపమన్ననుయొక్కటియే. ఈ ఒక్కటియైన పరమాత్మయే మాయా ప్రభావముచే జీవనానాత్వ భ్రాంతిని పొంది కర ఫలానుభవములను సుఖదుఃఖములతో ననుభవించుచున్నాడు. ఇట్టి వులలో తాము ఈ దృశ్యానుభవములతో యిప్పుడు పరిపూర్ణ సుఖముగా నున్నామనితలచుచుండు వులకు యీ ఆత విచారముతో నావశ్యకత లేదు. కాని ఎవరు వారి దృశ్యానుభవములన్ని దుఃఖకరములు, అనిత్యము

లనితోచి యీ సంసార దుఃఖమునుంచి దాటగలమా యను విచారమును పొందుదురో వారలకు యీ ఆత్మ విచారము పరమౌషధము. ఆత్మ విచార మనగా జీవుడు అవిద్యచే మరచిన తన వాస్తవస్వరూపమును గుర్తించుట. నేను అనుకొను తన యీ అహం, వాస్తవమున యొక్కటియైన పరిపూర్ణ ఆత్మ స్వరూపమే, అయిననూ పరిచ్ఛేద స్వనానాత్వములను, జీవుడు అనాది భ్రమజెంది యీ సంసార దుఃఖమును జన్మ పరంపర ప్రవాహముతో ననుభవించుచున్నాడు. జీవునకు తన సత్యస్వరూపము తెలుసుకొనుటకు ప్రథమమున తానెవరో తెలుసుకొనవలయును గదా. దానికి గాను యీ జీవుడు "కోహం" "కథమిదం జాతం, కోవాకర్తాస్యవిద్యతే" అనగా నేను ఎవరు, ఈ ప్రపంచ మెట్లు పుట్టినది — ఈ అజ్ఞాన మెవరికి కలుగుచున్నది, అని విచారించగా శాస్త్రము "అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహ మచ్యుతః" అనగా నేను పరమాత్మస్వరూపుడను, నిత్యుడను, సర్వప్రపంచము నాయం యున్నది అని తెలుపుచున్నది. దీనినే భగవంతుడు "అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే" అనగా యీ జీవుడు వాస్తవమున పరమాత్మ యే గనుక దానిని తెలుపుటకు గాను నేను అను యీ వాస్తవిక అహం, సర్వమునకు ప్రభువు అనగా అధిష్ఠానము. ఈ దృశ్యమంతయు నాయందే ప్రవర్తించు చున్నది. అనగా అధ్యస్తమై యున్నదని తెలుపుచున్నారు. జీవుడు యిట్లు తానే, సర్వాధిష్ఠానము, పరమాత్మ యని తెలుసుకున్నను, స్వానుభవముపొందుట కుపాయము, శ్రవణ, మనన, నిధి, ధ్యాసనముల అభ్యాసపాటవ ముచే పొందు తత్వజ్ఞానమే. తత్త్వజ్ఞాన మనగా జీవుని యథార్థ స్వరూప జ్ఞానము. ఈ జీవుని యథార్థ స్వరూపమే బ్రహ్మ స్వరూపము. ఇట్టి బ్రహ్మ స్వరూపమును జీవుడు యెట్లు పొందవలయునో ఆవిధమును భగవంతుడైన శ్రీకృష్ణ పరమాత్మ యే యిట్లు తెల్పుచున్నారు :—

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధమే,
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్యయా పరా॥

తా॥ అర్జునా పుడు నైష్కర్మ్య సిద్ధిని బొందిన వాడగుచు నెట్లు బ్రహ్మను పొందునో సంక్షేపముగ జెప్పెదను వినుము. ఇదియే జ్ఞానమునకు పరమావధి.

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయాయుక్తో ధృత్యాత్మానం నియమ్యచ ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వారాగద్వేషౌ వ్యుదస్య చ॥

తా॥ సాత్త్వికబుద్ధితో గూడినవాడై సాత్త్వికధృతిచేత కార్యకారణ సమూహరూపమగు బుద్ధిని నియమించి శబ్దాది విషయములను విడిచి రాగద్వేషములు వదలి,

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ।
ధ్యానయోగ పరోనిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

తా॥ శుద్ధమగు ప్రదేశమందుండువాడై, మితాహారుడై వాక్కును, శరీరమును, మనస్సును నియమించుకొని నిత్యమును ధ్యానయోగము నందాసక్తుడై వైరాగ్యము నవలంబించి,

శ్లో॥ అహఙ్కారం బలందర్పం కామంక్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మ భూయాయ కల్పతే ॥

తా॥ అహంకారమును, బలమును, దర్పమును, కోపమును, పరిగ్రహమును, భార్యా, పుత్ర, విత్త, క్షేత్రములందు సక్తతను విడిచి మమత్వము లేకుండ శాంతముగ నుండువాడు నేనే బ్రహ్మ, అను నిశ్చయముతో. నిశ్చలముగా నుండుటకు దగినవాడు.

శ్లో॥ బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి నకాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషుమద్భక్తిం లభతే పరామ్ ॥

తా॥ అట్లు బ్రహ్మమునందున్న వాడు ప్రసన్నచిత్తుడై శోకింపడు, కోరడు

## ఆత్మానుసంధానమే దేవపూజనము

సర్వభూతముల యందును సముడై గొప్పదియగు నా భక్తిని పొందును. అనగా స్వస్వరూపము నొందును.

శ్లో॥ భక్త్యామామ జానాతి యావాన్ యశ్చాసి తత్త్వతః ।
తతోమాం తత్త్వతో జ్ఞాత్వావిశతే తదనన్తరమ్ ॥

తా॥ భక్తిచేతను నేనెవరో తానెవరో యెట్టివాడో, యథార్థముగా తెలిసికొనును. అట్లు నన్ను అనగా తనను యథార్థముగా దెలిసికొని తరువాత నాయందు ప్రవేశించును. 'పరమానంద స్వరూపుడగుననుట' ఇట్లు తెలుపుచు శ్రీకృష్ణ పరమాత్మ తన వాస్తవస్వరూపమును క్లుప్తముగా "నిత్యస్సర్వగతః స్థాణు రచలోయం సనాతనః" యీ ప్రత్యగాత్మయైన నేను, ఎల్లప్పుడును ఏకరూపముగా నుండునదియు, అంతటనునిండియున్నదియును, స్థిరమైనదియును, అచలమైనదియును, సనాతనమైనదియును అయిన పరిపూర్ణచైతన్యపదార్థమై యున్నాను, ఈనాస్వరూపమును "అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే" అనగా ఎవరు నేను బ్రహ్మనైతినను జ్ఞానముచేత నాతోనైక్యమునుజెంది నిరంతరము నాధా నస్వరూపులై నన్ను ధ్యానించుచుందురో- అట్టివారు నాస్వరూపమునే పొందుదురని తెల్పుచున్నారు. ఇట్టి స్వానుభవము పొందుటకు, తాను బ్రహ్మ యగుటకు కోరికగల ముముక్షువును గూర్చి శ్రుతి "తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అనగా అట్టిధీరుడు ఆ ప్రత్యగన్న బ్రహ్మమునే సంశయరహితముగ తెలుసుకొని, బ్రహ్మైకత్వ జ్ఞానమును అనగా నేను బ్రహ్మను అను భావనను సంతతరూపమగు నేకాగ్రతతో సంపాదించవలయునని పైవాకము తెలుపుచున్నది.

ఇంకను యీ పరమాత్మ పూజను గురించి వసిష్ఠభగవానులు యిట్లు తెలుపుచున్నారు:—

శ్లో॥ ఏషదేవస్స పరమః పూజ్య ఏష సదా సతాం,
పూజనం ధ్యానమే వాంతర్నాన్యద_స్త్యస్య పూజనమ్ ॥

సర్వప్రపంచమునకు సాక్షీమాత్రుండగు ఇతండే ప్రత్యగాత్మ, ఉత్కృష్టుండగు వుండు. ఇద్దేవుని పూజలోన తానుగనే ధ్యానించుటయే పూజగాని వేరొండు పూజలేదు, అని తెల్పుచు యీ ఆత్మపూజను గురించి యింకనూ యిట్లు తెలుపుచున్నారు:—

శ్లో॥ పూజాక్రమేషు సర్వేషు దేహగేహం పవిత్రకం ।
త్యాజ్యం దేహావబోధాత గ్రాహ్యం యత్నాత్పవిత్రకమ్ ॥

శాస్త్రోక్త సంస్కారాదులచేతను స్నానాచమనాదులచేతను యీ దేహము పవిత్రమైనదయినను గేహములాగున, పూజావిధులయందు అనగా స్వస్వరూపానుసంధానాదులయందు యత్నముచే దీనిని విడువవలయును, అనగా జ్ఞాన పూర్వకముగ దేహా సంధిని త్యజించి పవిత్రమగు, దేహము యొక్క సాక్షీచిత్ప్రకాశరూపమును మాత్రము యత్నముచే గ్రహించ వలయును.

శ్లో॥ తస్మాత్త్రిభువనాధారం నిత్యంధ్యానేన పూజయేత్ ।
చిద్రూపం సూర్యలక్షాభం సమస్తాభాసభాసనమ్ ॥

శ్లో॥ అంతస్థచిత్ప్రకాశం స్వమహంతా సారమాశ్రయేత్ ।
అపార పరమాకాశ విపులా భోగకంధరమ్ ॥

ముల్లోకంబులకు నాధారభూతుండును, చిద్రూపుండును, లక్షసంఖ్య గల సూర్యులతో సమానమగు కాంతిగలవాడును, సమస్త సూర్యచంద్రాదులను ప్రకాశింపజేయువాడును, లోపల ప్రకాశించుచున్న జ్ఞానమే స్వరూపముగా గలవాడును, అహంకారమునకు సారభూతుండును, ప్రత్యగాత్మయునగు నా పరమాత్మయే తానని ధ్యానంబుచే పూజింపవలయును.

శ్లో॥ చిద్వ్యోమైవ కిలాఽ స్తీహ పారావార వివర్జితం,
సర్వత్రాసంభవచ్చైత్రం కల్పాంతేషు చ శిష్యతే ॥

శ్లో॥ బోధస్సామ్యం శమశ్చేతి పుష్పాణ్యగ్ర్యాణి తస్యతైః
శివంచిన్మాత్ర మమలం పూజ్యం పూజావిదో విదుః ॥

అనగా ఆద్యంతవర్జితంబును, దృశ్య సంస్పర్శరహితంబును, కల్పాంతములయందు శేషించునదియు నగు చిదాకాశంబె కలదు. ఇదియే బ్రహ్మస్వరూపము. ఈ చిన్మాత్రుండగు దేవుని పూజించుటకు తత్త్వజ్ఞానము సమభావము, నిర్వికారచిత్తత యనునవి, పూజార్హములగు పుష్పములగు చున్నవి. ఇట్టి పరమాత్మనే ముముక్షువు సతతము ధ్యానించుచుండవలయును. ఇదియే ఉత్కృష్టమగు పూజ. ఇంకనూ వసిష్ఠభగవానులు సాకారార్చనమును గురించి యివ్విధమున తెల్పుచున్నారు:—

శ్లో॥ అజ్ఞాత శివతత్త్వానా మాకారాద్యర్చనం కృతం ।
యోజనాధ్వన శక్తస్య క్రోశాధ్వా పరికథ్యతే ॥

యోజనము దూరమనిన భయపడు వానికి క్రోశము దూరమని చెప్పబడు నటుల నిట్టి నిరాకారంబగు శివతత్వము నెరుంగని వారలకు సాకారము నంద ర్చనము విధింపబడియెను అని తెలుపుచు, యింకనూ, శివస్వరూపంబైన ఆత్మార్చనంబును గూర్చి యిట్లు తెల్పుచున్నారు :—

శ్లో॥ శృణు బ్రహ్మ విదాంశ్రేష్ఠ దేవార్చన మనుత్తమం ।
న దేవః పుండరీకాక్షో నచదేవస్త్రిలోచనః ॥

శ్లో॥ న దేవో దేహరూపోవా న దేవశ్చిత్తరూపకః ।
అకృత్రిమ మనాద్యంతం దేవనం దేవ ఉచ్యతే ॥

శ్లో॥ ఆకారాది పరిచ్ఛిన్నే మితే వస్తుని తత్కృతః ।
అకృత్రిమ మనాద్యంతం దేవనం చిచ్ఛివం విదుః ॥

శ్లో॥ దేవఃకః స్యాదితి త్వేతత్ప్రథమం తావదుచ్యతే ।
తదేవ దేవశబ్దేన కథ్యతే తత్ప్రపూజయేత్ ॥

దేవార్చన అనగా ఆత్మార్చన మను విధిని చెప్పుచున్నాడను, వినుము; అని తెలుపుచున్నారు. దేవుండనగా కమలపత్రాక్షుండుగాని, త్రినేత్రుండుగాని, దేహరూపుండుగాని, చిత్తరూపుండుగాని కానేరదు. ఇకనేమన నుపాధిరహితంబును ఆదిమధ్యాంతవర్జితంబునునగు దేవనము (జ్ఞానము) దేవుడని చెప్పబడును. ఆకారాదులచే పరిచ్ఛిన్నంబై పరిమితంబగు వస్తువునందు దేవత్వమెటుల నుండును. కావుననే నిరుపాధికంబును, ఆద్యంతవర్జితంబునగు జ్ఞానమే శివుడని వచింతురు. దేవుండన నెవ్వండను ప్రశ్నంబునకు మొదలు నిరూపణంబు చెప్పంబ యెను. అట్టి జ్ఞానరూపుండగు దేవునినే పూజింపవలయును.

ఇంకను పరమేశ్వరుండగు ఆత్మను గురించి యివ్విధమున వసిష్ఠభగవానులు తెల్పుచున్నారు.

శ్లో॥ చైత్తా నుపాతరహితం సామాన్యేన చ సర్వగం ।
యచ్చిత్తత్త్వ మనాఖ్యేయం స ఆత్మా పరమేశ్వరః॥

దృశ్య సంబంధము లేనట్టియు, హెచ్చు తగ్గులు లేక సర్వమును వ్యాపించియుండినట్టియు, ఇట్టిదని చెప్పుటకు శక్యము కానట్టి యేచిత్పదార్థము కలదో, అదియే ఆత్మయు, పరమేశ్వరుడు అగును.

శ్లో॥ సర్వం చ ఖల్విదం బ్రహ్మ నిత్యం చిద్ఘన మవ్యయం ।
కల్పనాఽన్యా మనోనామ్నీ విద్యతే నహి కాచన ॥

కనబడునట్టి యీ ప్రపంచంబంతయు త్రైకాలికాబాధ్యంబును చిద్రూపంబును నగు బ్రహ్మము యొక్క వివర్తమే యగును. మనస్సు అను కల్పనయు ఆ బ్రహ్మముకంటె వేరుగా, నింకొకటిలేదు.

## ఆత్మానుసంధానమే దేవపూజనము

శ్లో॥ ఏతదేవ పరంధ్యానం పూజైషైవ పరా స్మృతా ।
యదనారత మంతఃస్థ శుద్ధ చిన్మాత్ర వేదనమ్ ॥

శ్లో॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపన్ శ్వసన్ ।
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ శుద్ధసంవిన్మయో భవేత్ ॥

అనగా ఎల్లప్పుడును లోపలనున్న శుద్ధంబగు చిన్మాత్రంబున గాంచుచుండుట యేదికలదో అదియే యుత్కృష్టమగు ధ్యానంబును అదియే యుత్కృష్టమగు పూజయు నగుచున్నవి. విద్వాంసుడు చూచుచును, వినుచును, నిద్రించుచును, స్పృశించుచును, ఆఘ్రాణించుచును, భుజించుచును, నడుచుచును, నిట్టూర్పు విడుచుచును, మాటలాడుచును, విడుచుచును, గ్రహించుచును ఎల్లప్పుడును సర్వమునకు సాక్షియగు విశుద్ధజ్ఞాన స్వరూపుండు తాననియే భావించుచుండ వలయును.

శ్లో॥ నష్టం నష్టముపేక్షేత ప్రాప్తం ప్రాప్తముపాహరేత్ ।
నిర్వికారతయైతద్ధి పరమార్చన మాత్మనః ॥

అనగా నష్టమైనదాని నుపేక్షించుచు ప్రాప్తమైనదాని ననుభవించుచుండ వలయును — నిది హర్షవిషాదాది వికారనివృత్తి హేతువగుటచేత, నీవిధ మాత కు, పరమార్చనం బగుచున్నది.

శ్లో॥ సర్వదా సర్వరూపేణ యత్సర్వత్ర స్థితం హితం ।
సర్వంబ్రహ్మేతి నిశ్చిత్య నిత్యాత్మార్చావ్రతం చరేత్ ॥

సర్వకాలములయందును నానారూపంబులతోడ అంతటనునున్న వస్తుజాతం బంతయును బ్రహ్మమేయని నిశ్చయించుకొనునట్టి బ్రహ్మభావనానిశ్చయమే ఆత్మార్చనవ్రతమని తెలుసుకొని చేయుచుండవలయును. ఇట్టి బ్రహ్మైత భావ నము పొందుటకు పునకెంతమాత్రము కష్టసాధ్యమైనదికాదనియు, యీ దృశ్య సంసారదుఃఖమంతయును వాసనామాత్రమునసే పునకు

సంప్రాప్తమగుచున్నది. ఈ సంకల్పజాలమంతయు జీవునకు భ్రాంతిమాత్రమే గాన వీటిని త్యజించుటయందు కష్టమేమున్నది యని:

శ్లో॥ సృష్టం సంకల్పమాత్రేణ యదిదం దుఃఖమాగతం ।
తదసంకల్పమాత్రేణ క్షయి కొఽత్ర కదర్థితా ॥

శ్లో॥ యత్కించిదపి సంకల్ప్యనరోదుఃఖే నిమజ్జతి।
నకించిదపి సంకల్ప సుఖమవ యమశ్నుతే ॥

వునకు యీ సంసారదుఃఖము సంకల్ప మాత్రమునవచ్చి సంకల్పమాత్ర మునవే వృద్ధిపొందుచున్నదిగదా. అందువలన నా దుఃఖము సంకల్పాభావ మాత్రముచే అనగా నిస్సంకల్పమువలన క్షీణింపగలదు. కాన యీసంసారమును దాటు విషయమై యేమి కష్టముకలదు. మానవుడు యేదికొంచము సంకల్పించి ననూ దుఃఖమునందు మునుగుచున్నాడు. దేనినీ కొంచమైననూ సంకల్పింపక యుండేని అనగా సంకల్పరహితుడైనయెడల నాశరహితమగు సుఖమును పొందుచున్నాడు. ఇట్టివాడు జ్ఞానియనబడును. కాన అట్టివాడు

శ్లో॥ నవాంఛతా నత్యజతా జ్ఞేనప్రాప్తాః స్వభావతః ।
సరితస్సాగరేణేవ భోక్తవ్యా భోగభూతయః ॥

జ్ఞానియగువాడు ప్రాప్తించని యర్థంబుల గోరకయు, ప్రాప్తించిన యర్థంబుల విడువకయు స్వభావంబున బ్రాప్తములగు భోగైశ్వర్యంబులను సముద్రుండు ప్రాప్తంబులగు నదుల ననుభవించుచుండునటుల భోగించుచుండవలయును.

ఈ బ్రహ్మజ్ఞానమువలన సర్వాభీష్టములు సిద్ధించునని "బ్రహ్మ విదాప్నోతిపరం" "తరతి శోకమాత్మ విత్" "రసోవై సః.రసగ్ హ్యేవాయంలబ్ధ్వాఽనందీభవతి" అని ఉపనిషద్వచనములు బ్రహ్మ విదుడు కైవల్యము పొందును, ఆత్మ విదుడు సర్వశోకమునుండి విముక్తుడగునని చెప్పుచూ బ్రహ్మ మానంద స్వరూపమనియు, అట్టి బ్రహ్మ స్వరూపజ్ఞానముచేతనే ఆనందములంచు

ననియు పై శ్రుతి వచనములన్నియూ తెలుపుచున్నవి. కావున నిర్గుణ బ్రహ్మమును తెలిసికొనిన ఆత్మవిదుడు సంసారదుఃఖమునుండి తరించి నిరతిశయానందమును పొందును. ఇతరోపాయములవలన యిట్టి యుత్కృష్టపదవి లభింపదు. ఇదియే మానవుని నిర్విషయసుఖము, స్వరూపసుఖము, నిత్యనిరతిశయసుఖముగాని మరేమియునూ, నింతకుమించినదిలేదు. ఇదియే జీవుని పరమావధి —

మానవునకు బంధమోక్షముల రెంటికిని యీ మనసే కారణమగుచున్నది. సంకల్పవికల్పాదులతోకూడిన మనసు సంసారదుఃఖహేతువు. సంకల్పరహితమైన నిష్కామ నిరలచిత్తము (మనసు) మోక్షసాధనమగునని విద్యారణ్యులు యిట్లుతెలుపుచున్నారు:—

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥
బంధాయ విషయాసక్తం ముక్తై నిర్విషయం స్మృతమ్ ॥

అనగా సంకల్పసహితమగు మనస్సు బంధమునకున్నూ నిస్సంకల్పమగు మనస్సుమోక్షమునకును కారణమగును. కావున ఆత్మార్చనముచేయు ముముక్షువు యీ విషయమును గుర్తెరిగి, తన మనస్సునుండి సర్వసంకల్పకామములను సక్తతాద్య మానములను విడువవలయును, అప్పుడు ఆత్మార్చనమునకు తన మనస్సు సహకరించును. పునకు ఈ ఆత్మార్చనమను స్వస్వరూపానుసంధానమును అనగా నిర్గుణ, నిరాకార, స్వప్రకాశ, అసంగ, అద్వితీయ అఖండ పరిపూర్ణచైతన్యమే తాను అని ధ్యానించి తెలుసుకుని స్వానుభవము పొందుటకు తనయొక్క మనస్సు తప్ప వేరుసాధనములేదు. దీనినే శ్రుతి వచనములు "మనసైవేదమాప్తవ్యం" అనితెలుపుచూ "అప్రాప్యమనసా సహ" అనికూడా చెప్పుచున్నవి. కావున వీనియొక్క పరమతాత్పర్యమును గ్రహించి వీని యేకవాక్యతను యిట్లు తెలుసుకొనవలయును. ఈ ఆత్మ మనస్సుచేతకూడా పొందబడదనితెలుపుచూ ఆత్మను మనస్సుచేతనే పొందవలె

నని వచనములు తెలుపుచున్నవి, కావున ఈ ఆత్మ అసంస్కృత మనసుకు తెలియబడక సంస్కృత మనస్సువల్లనే పొందబడునని ముముక్షువులు గ్రహించవలెను—

# హితోపదేశము

ముముక్షువు యెన్ని విధముల విచారముచేసి అనుసంధానాదులను గావించు చున్నను అభాసకాలములో యీ దేహాధ్యాస అనగా దేహమే నేనను తాదాత్మ్యము, దేహాభిమానములు సమస్తమగు మోక్షోపాయములకును ప్రతిబంధకముగా నుండును. ఇట్టి దేహతాదాత్మ్య మానములు పోవుటకు బహుప్రయత్న ములతో చిరకాలాభ్యాసము కావలెను. ఇందుకుగాను-వసిష్ఠభగవానులు శ్రీరామ చంద్రమూర్తికిచేసిన తత్త్వోపదేశసందర్భమున — తెలిపిన హితోపదేశవచన ములు,ముముక్షువున కత్యంతోపయోగముగ నుండునని తలంచి, సంగ్రహించి యిచట నుదహరించుచున్నాడను.

శ్లో॥ ఆభాసమాత్రమేవేదమిత్థం సంప్రతిభాసతే।
అయం నామాహమిత్యంత రసదేవ శరీరకమ్ ॥

తా॥ ఓ రామచంద్రా ! ఈ శరీరము నిజముచేత ఆభాసమాత్రము (ప్రతీతి మాత్రసిద్ధము). అయినను అవిచారదశయందు వీడు, అనుభేదము చేతను, నేను అను అభేదముచేతను న మాన విషయముగా నంతః కరణము నందు ప్రకాశించుచున్నది. విచారించునెడ కల్పితము గావున మిథ్యామాత్రమే యగుచున్నది.

శ్లో॥ మాంసాస్థిమయనిరాణ దేహోఽహమితి విభ్రమం।
త్యజసంకల్పనిరాణ దేహాస్సంతి సహస్రశః ॥

తా॥ ఓ రామచంద్రా ! మాంసము, అస్థులు వీనిచే నిర్మింపబడినదేహమే నేనను విభ్రాంతిని విడువుము. ఈ విధంబులగు సంకల్పకల్పితంబులైన దేహంబులు వేలకొలది కలవుగదా.

శ్లో॥ సుఖతల్పగతోయేన స్వప్నదేహేన దిక్తటాన్ ।
పరిభ్రమసి హేరామ సందేహస్తే క్వ సంస్థితః ॥

తా॥ ఓ రామభద్రా ! నీవు సుఖశయ యందుండి స్వప్నసంబంధమగు నేశరీరముచే ననేకములగు దేశములను పరిభ్రమించుచుందువో అట్టి నీదేహమెక్కడనున్నదో చెప్పుము (స్వాప్నికదేహములకు అసత్యత్వమును నీవంగీకరించియే యున్నావుగదా యనుట.)

శ్లో॥ జాగరాయాం మనోరాజ్యే యేన స్వర్గపురాంతరం ।
పరిభ్రమసి మేరుం వా సదేహస్తే క్వ సంస్థితః ॥

తా॥ అటులనే జాగ్రద్దశయందును మనోరాజ్యమున శరీరముచే స్వర్గమునుగాని, పురాంతరమునుగాని, మేరువునుగాని పరిభ్రమించుచున్నాడవో అట్టి నీదేహమెక్కడనున్నదో చెప్పుము.

శ్లో॥ దీర్ఘస్వప్నమిదం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమం ।
దీర్ఘంవాపి మనోరాజ్యం సంసారం రఘునందన ॥

తా॥ ఓ రామచంద్రా ! ఈ సంసారమును దీర్ఘమగు స్వప్నముగాగాని లేక ఆకాశనైర్మల్యమువలె చిరకాలానువృత్తమగు చిత్తవిభ్రాంతినిగాగాని, లేక దీర్ఘమగు మనోరాజ్యమునుగాగాని యెరుంగుము. (మిథ్యామాత్రముగా నెరుంగుమనుట)

శ్లో॥ ఆభాసమాత్రమేవేదం నసన్నాసజ్జగత్త్రయం ।
ఇతి న కలనాత్యాగం సమ్యగాలోకనం విదుః ॥

తా॥ ఈ జగము బాధ్యము గావున సద్రూపముగాదు. ప్ర యమానము గావున నసద్రూపంబునుగాదు. మరియేమన, నీజగము ప్రతిభాస మాత్రమైనదే యని భేదకల్పనను విడుచుట యేదికలదో అదియే శ్రేయమగు జ్ఞానమని వచించిరి.

శ్లో॥ అవశ మేవ హి మయా మర్తవ్యమితి నిశ్చయం ।
ఇత్యాత మరణప్రాప్తౌ కిం ముథాపరితప తే ॥

తా॥ "జాతస్యహిధ్రువోమృత్యుః" అను న్యాయముచే పుట్టుకచేతనే మరణము సిద్ధమని నిశ్చయమేర్పడుచుండగా నట్టి తన మరణమును గూర్చి వ ర్థముగా నేల పరితాపమొందవలయును.

శ్లో॥ అవశ్యమేవ జాతేన కించిత్సువిభవాదికం ।
ప్రాప్తవ్యం పురుషేణేతి లాభేష్వర్థేషుకోమదః ॥

తా॥ పురుషుడు వించుచుండగా కొంచెము సంపదమొదలగువాని నవశముగా పొందుచుండును. గావున నట్టి యర్థలాభములయందేల గర్వపడవలయును.

శ్లో॥ ప్రవిభాగం పరిత్యజ పదార్థపటలవ్రజే ।
ఆభాసమాత్రసామాన్య మిదమాలోకయానఘ ॥

తా॥ ఓ రామచంద్రా ! పదార్థవర్గసముదాయరూపమగు నీ ప్రపంచమునందు భేదబుద్ధినివిడిచి యీ జగము ప్రతిభాసమాత్రమే కావున నంతట ననువర్తించియున్న సచ్చినాత్రమునే చూడుము.

శ్లో॥ ఆభాసమాత్ర మ లం చిత్తామర కళంకితం ।
అత స్తదపి సంత్యజ నిరాభాసో భవో త్తమ ॥

తా॥ ఏకారణము వలన జగము ఆభాసమాత్రమై చిత్తసంబంధముచే

దూషితమైయున్నదో ఆకారణము వలన ఆభాసమాత్రమును విడిచి నిరాభాసుండవు (నిర్వికల్పుడవు) అగుము.

శ్లో॥ యేప్రజ్ఞా గర్వమాపన్నా విదగ్ధాశాస్త్ర శాలినః ।
రాగద్వేషమయా మాన్యగర్దభాస్తే ధిగస్తు తాన్ ॥

తా॥ ఎవరలు శాస్త్రజ్ఞులును లౌకికవైదికవ్యవహార కుశలులునునై మేమే ప్రజ్ఞావంతులమను నహంకారము గలవారలగుచు రాగద్వేష భూయిష్ఠులగుచున్నారో వారలు బహుమూల్యములగు గర్దభములతో సమానులు. వారలను స్పృశింపదగదు.

శ్లో॥ ఇదం సంసార చక్రం హి నాభౌ సంకల్ప మాత్రకం ।
సంరోధితాయాం వహనాద్రఘునందన రుధ్యతే ॥

తా॥ జననమరణప్రవాహరూపమగు నీ సంసారమే (భ్రమణ లము గావున) చక్రమగుచున్నది. ఆ సంసార చక్రమునకు సంకల్పాత్మక మగు చిత్తమే (ప్రవర్తకము గావున) నా యగుచున్నది. అట్లుగావున చిత్తమును నిరోధింపగా సంసారము నిరోధింపబడుచున్నది.

శ్లో॥ క్షో తాయాం మనోనాభా మిదం సంసార చక్రకం ।
ప్రయత్నాద్రోధితమపి పవహతే వ వేగతః ॥

తా॥ మనస్సను నా చలించుచుండగా సంసారమను చక్రము తిరుగుచునే యుండును. మనోనిరోధముకంటె సంసారనిరోధమునకు వేరొండు మార్గము లేదు.

శ్లో॥ పరం పౌరుషమాశ్రిత్య బలం ప్రజ్ఞాం చ యుక్తితః ।
నా ం సంసార చక్రస్య చిత్తమేవ నిరోధయేత్ ॥

తా॥ ఓ రామచంద్రా! ఉత్కృష్టమగు పురుషకారమును, బలమును,

ప్రజ్ఞను నాశ్రయించి యోగముచేత సంసార చక్రమునకు నా యగు చిత్తమునే నిరోధింపవలయును.

శ్లో॥ భోగాభోగా బహిష్కార్యా ఆర్యస్యానుసరేత్పదం ।
ప్రవిచార మహార్థం స్వమేకమాత్మా న మాశ్రయేత్ ॥

తా॥ భోగాతిశయంబులం బరిత జించి సన్ముక్తుని మార్గం బనుసరింప వలయును. అది యెటులనిన మహావాక్యార్థంబు విచారించి యేకంబగు నాత్మ నా శ్రయింపవలయును. మరియు :

శ్లో॥ ఇచ్ఛామాత్ర మవిద్యేయం తన్నాశో మోక్షఉచ్యతే ॥
స చాసంకల్పనాశ స్త్రేణ సిద్ధోభవతి రాఘవ ॥

తా॥ శ్రీరామచంద్రా ! కోరిక మాత్రమే అవిద్యయగును. ఆ కోరిక నశించుటయే మోక్షము అగును. అట్టిమోక్షము సంకల్పరాహిత్యమను సాధనముచే సిద్ధించుచున్నది. ఇట్లు యిచ్ఛారాహిత్యంబును పరమ సాధనముగా యుపదేశించి, ఆత్మ స్వరూపనిరూపణమును యీ క్రింది విధమున తెలుపుచున్నారు.

శ్లో॥ చైత్యానుపాతరహితం సామాన్యేనచ సర్వగం ।
యచ్చిత్తత్త్వ మనాఖ్యేయం స ఆత్మా పరమేశ్వరః ॥

తా॥ దృశ్యసంబంధము లేనట్టియు, ఎచ్చుతగ్గులులేక సర్వమును వ్యాపించి యుండినట్టియు, ఇట్టిదని చెప్పుటకు శక్యము కానట్టి యేచిత్పదార్థము కలదో, అదియే ఆత్మ యు పరమేశ్వరుడు అగును.

శ్లో॥ సర్వంచఖల్విదం బ్రహ్మ నిత్యం చిద్ఘన మవ్యయం ।
కల్పనాఽన్యా మనోనామ్నీ విద్యతేనహి కాచన ॥

తా॥ కనబడునట్టి యీ ప్రపంచంబంతయు త్రైకాలికాబాధ్యంబును, చిద్రూపంబుననగు బ్రహ్మము యొక్క వివర్తమేయగును. మనస్సు అను కల్పనయు ఆ బ్రహ్మముకంటె వేరుగా నింకొకటిలేదు.

శ్లో॥ నజాయతే నమ్రియతే కించిదత్ర జగత్త్రయే ।
నచ భావవికారాణాం సత్తా క్వచన విద్యతే ॥

తా॥ ఈ జగమునందు యేవస్తువును పుట్టుటకాని మృతినొందుటగాని లేదు. కావున జననము మరణము మొదలగు భావములకు ఉనికి యెచ్చటనులేదు.

శ్లో॥ కేవలం కేవలాభాసం సర్వసామాన్యమక్షయం ।
చైత్యానుపాతరహితం చిన్మాత్రమిహ విద్యతే ॥

తా॥ రెండవ వస్తువులేనట్టియు స్వయంప్రకాశమానమైనట్టియు అంతటను సమానముగా ప్రకాశించుచుండునట్టియు దృశ్య సంబంధములేనట్టియు చిత్తు మాత్రమే రూపముగా గలిగిన బ్రహ్మమే కలదు.

శ్లో॥ అతస్సంకల్ప సిద్ధేయం సంకల్పేనైవ నశ్యతి ।
యేనైవ జాతా తేనైవ వహ్నిర్జ్వాలేవ వాయునా॥

తా॥ ఇట్లు ఈమనశ్శక్తి సంకల్పము వలననే కలిగినది. కావున గాలిచే గల్గిన యగ్నిజ్వాల గాలిచేతనే యారిపోవునట్లు. సంకల్పముచే గలిగినమనశ్శక్తి సంకల్పముచేతనే అణగగలదు.

శ్లో॥ నాఽహంబ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః ।
సర్వంబ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః ॥

తా॥ మనస్సు నేను బ్రహ్మమునుగాను అను దృఢమగు సంకల్పమువలన

బంధము నొందుచున్నది. ఇక అంతయు బ్రహ్మమే అను దృఢమగు సంకల్పమువలన ముక్తినొందుచున్నది.

శ్లో॥ కృశోఽతి దుః బద్ధోఽహం హస్త పాదాదిమానహం।
ఇతిభావానురూపేణ వ్యవహారేణ బధ్యతే ॥

తా॥ కృశించినవాడను, మిగుల దుఃఖము నొందుచున్నవాడను, బంధము కలవాడను, కాలు సేతులు కలవాడను, అని యిట్లు భావించుచుండుటచే పురుషుడు బంధము నొందుచున్నాడు.

శ్లో॥ నాహం దుః నమే దేహో బంధః కస్యాత్మనః స్థితః।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ తే ॥

తా॥ నేను దుఃఖవంతుడనుగాను, నాకు దేహములేదు. ఆత్మ వస్తువునకు బంధమెటులనుండును ! అని యిట్లు భావించుటచే ముక్తి నొందుచున్నాడు.

శ్లో॥ నాహం మాంసం నవాఽస్థీని దేహాదన్యః పరోఽస హం।
ఇతి నిశ్చయవానంతః క్షీణావిద్యో విముచ్యతే ॥

తా॥ మరియు నేను మాంసమునుగాని అస్థులుగాని కాను. నేను దేహము కంటె నితరుడగు పరమాత రూపుడను అని నిశ్చయముగలవాడు అవిద్యను నశింపజేసి ముక్తినిపొందును.

శ్లో॥ కల్పితైవ మవిదే యమనాత న్యాత భావనా।
పురుషేణా ప్రబుద్ధేన న ప్రబుద్ధేన రాఘవ ॥

తా॥ శ్రీ రామచంద్రా ! తానుకాని దేహేంద్రియాదుల యందు తాను అను భావనారూపమగు అవిద (అజ్ఞానము) అజ్ఞానియగు పురుషునిచే కల్పింపబడినదేకాని జ్ఞానవంతునిచే కల్పింపబడినది గాదు,

శ్లో॥ మనో యదనుసంధత్తే తత్సర్వేంద్రియ వృత్తయః
క్షణాత్సంపాదయంత్యేతా రాజాజ్ఞామివ మంత్రిణః ॥

తా॥ రాజుయొక్క యాజ్ఞను మంత్రులు అనుసరించి చేయునట్లు మనస్సు సంకల్పించిన వస్తువును ఇంద్రియ వృత్తులు క్షణమాత్రములో సంపాదించుచున్నవి.

శ్లో॥ పరం పౌరుష మాశ్రిత్య యత్నాత్పరమయా ధియా ।
భోగాశాభావనాం చిత్తాత్సమూలామేవ ముద్ధరేత్ ॥

తా॥ అధిక ప్రయత్నమువలన మనస్సునుండి భోగవాసనను సమూలముగా తొలగింపవలయును.

శ్లో॥ మమ పుత్రా మమ ధనమయం సోఽహమిదం మమ ।
ఇయ మింద్రజాలేన వాసనైవాధి వల్గతి ॥

తా॥ వీరు నాపుత్రులు ఇది నా ధనము నేను యిట్టివాడను ఇది నా వస్తువు అనునట్టి వాసన ఇంద్రజాలమాత్రముగా ప్రకాశించుచున్నది.

శ్లో॥ మా భవాఽజ్ఞో భవజ్ఞస్త్వం జహి సంసారవాసనాం ।
అనాత్మ న్యాత్మభావేన కిమజ్ఞ ఇవ రోదిషి ॥

తా॥ శ్రీ రామచంద్రా ! ఆత్మ వస్తువుగాని దేహేంద్రియాదులయందు నేను అను భావముచే అజ్ఞానివలె నెందుకు దుఃఖపడియెదవు. నీవు అజ్ఞానివిగాక జ్ఞానివై సంసారవాసనను విడువుము.

శ్లో॥ కస్తవాయం జడోమూకో దేహోభవతి రాఘవ ।
యదర్థం సుఖదుఃఖాభ్యా మవశః పరిభూయసే ॥

తా॥ శ్రీ రామచంద్రా ! అచేతనంబును, మూగదియునగు దేహమునకు నీకును ఏమి సంబంధముకలదు. అట్టి దేహసంబంధములగు సుఖ దుఃఖములకు నీవు లోబడుచున్నాడవేమి.

శ్లో॥ అహోనుచిత్రం యత్సత్యంబ్రహ్మతద్విస్మృతం నృణాం।
యదసత్య మవిద్యాఖ్యం తత్పరః పరివర్తతే॥

తా॥ ఓ రామచంద్రా ! సత్యమగు బ్రహ్మము మనుజులచే మరువబడినది. అసత్యమగు అవిద్య ఎదుట ప్రకాశించుచున్నది. ఇది ఎంతచిత్రమో చూడుము.

శ్లో॥ తిష్ఠతస్తవ కార్యేషు మాస్తు రాగానురంజనా।
స్ఫటికస్యే వ చిత్రాణి ప్రతిబింబాని గృహ్ణతః॥

తా॥ ఓ రామచంద్రా ! స్ఫటికమణి సమీపముననున్న రక్తపీతాది వస్తువులు తన యందు ప్రతిఫలించినందున నా వస్తుసంబంధములగు ఎరుపు పసుపు మొదలగు వన్నెలను తాను పొందునట్లు నీవు ప్రపంచ కృత్యములందు దిరుగునప్పుడు ఆకార సంబంధములగు రాగాదులచే అనురక్తిని పొందకుము.

వసిష్ఠభగవానులు యిట్లుపదేశించి-అహంకారము ఎట్టిది. అది శరీర సహితమైనను, శరీర రహితమైనను దానిని ఎట్లు విడువవలసినదియు, అట్లు విడచినందున కలుగు ఫలమున్ను యీ క్రింది విధమున తెలుపు చున్నారు. ఈ అహంకారము వునియందు రెండువిధములనున్నదనియు, అవి ఏవన మొదటిది సదహంకారమనియు, రెండవది దురహంకారమనియు తెలుపుచు వాటి స్వరూపలక్షణములను యీ విధమున తెలుపుచున్నారు. అందు మొదటిది "అహంసర్వమిదంవిశ్వం పరమాత్మా ఉహమచ్యుతః" సమస్తమగు ప్రపంచంబును నేను.పరమాత్మను నేనేయగుదునుగాని నాకంటెవేరెద్దియులేదను కొనుట శ్రేష్ఠమగు అహంకారమగును. ఇది యుండినందున బంధము కలిగింపదు. ఇది వనుక్తునికి యుండును. రెండవది యేదన "పాణిపాదాదిమాత్రోఉయ మహమిత్యేషనిశ్చయః"—ఈ కనబడు పాణిపాదాదులుగలవాడను,

పరిచ్ఛిన్నుడను నేను అనుకొనుట (రెండవ యహంకారము.) ఇది ప్రాపంచి కంబును తుచ్ఛంబుననగును. గాన నీ రెండవ యహంకారమును ప్రయత్న ముచే మనుజుడు విడువవలయును. అట్లువిడిచిన:-

శ్లో॥ అనయా దురహంకృత్యాభావాత్సంత్యక్తయాచిరం ।
శిష్టాహంకారవాన్ జంతుర్భవత్యాశు విముక్తయే ॥

తా॥ మనుజుడు దుష్టమగు నీ యహంకారమును క్రమముగా విడచిపెట్టగా మిగిలిన శ్రేష్ఠములగు నహంకారములు గలవాడై శ్రీఘ్రముగ విముక్తిని పొందుచున్నాడు. ఇట్లు రెండవదియైన దురహంకారమును త జించగా:

శ్లో॥ అహంకృతిదృశావేతే పూర్వోక్తే భావయన్యది ।
తిష్ఠత్యభేఽతి పరమం తత్పదం పురుషోఽనఘ ॥

తా॥ పురుషుడు మొదటి యహంకారమును విడువక భావించుచుండెనేని పర తత్త్వమును పొందుచున్నాడు — అని అహంకారమును గూర్చి తెలిపి యింకను శ్రీరామచంద్రమూర్తికి బ్రహ్మ స్వరూపమును యిటుల తెలుపుచున్నారు.

శ్లో॥ చైత్యానుపాతరహితం సామాన్యేన చ సర్వగం ।
యచ్చిత్తత్త్వ మనాఖ్యేయం సఆతా పరమేశ్వరః ॥

తా॥ దృశ్యసంబంధము లేనట్టియు ఎచ్చుతగ్గులు లేక సర్వమును వ్యాపించి యుండినట్టియు, యిట్టిదని చెప్పుటకు శక్యముకానట్టి యే చిత్పదార్థము కలదో అదియే ఆత యు పరమేశ్వరుడు అగును.

శ్లో॥ సర్వంచ ఖల్విదం బ్రహ్మ నిత్యం చిద్ఘనమవ్యయం ।
కల్పనాఽన్యా మనోనామ్ని విద్యతే నహి కాచన ॥

తా॥ కనబడునట్టి యీ ప్రపంచంబంతయు త్రైకాలికాబాధ్యంబును చిద్రూపంబును నగు బ్రహ్మముయొక్క వివర్తమే యగును. మనస్సుఅను కల్పనయు ఆ బ్రహ్మముకంటె వేరుగా నింకొకటిలేదు.

శ్లో॥ కేవలం కేవలాభాసం సర్వసామాన మక్షయం।
చైత్యానుపాతరహితం చిన్మాత్రమిహ విద్యతే ॥

తా॥ రెండవవస్తువులేనట్టియు, స్వయంప్రకాశమానమైనట్టియు, అంతటను సమానముగా ప్రకాశించుచుండునట్టియు, దృశ్యసంబంధములేనట్టియు సత్తుమాత్రమే రూపముగా గలిగిన బ్రహ్మమేకలదు.

శ్లో॥ అస్తేఽనస్తమితో భాస్వానజోదేవోనిరామయః ।
సర్వదా సర్వకృత్సర్వః పరమాత్మామహేశ్వరః ॥

తా॥ ఆద్యంతరహితుండును, ప్రకాశరూపుండును, చిద్రూపుండును. శాశ్వతుండును, సర్వకర్తయు, సర్వవ్యాపకుండును, సర్వనియామకుండును మహేశ్వర శబ్దవాచ్యుండునునగు పరమాత్మ కలడు.

శ్లో॥ యతోవాచో నివర్తంతే యో ముక్తైరవగమ్యతే ।
యస్యచాత్మాదికాస్సంజ్ఞాః కల్పితా న స్వభావజాః ॥

తా॥ వాక్కులు ఏ పరమాత్మను నిరూపింపజాలక మరలుచున్నవో ఏ పరమాత్మ ముక్తినొందిన వారలచేత నెరుగబడుచున్నాడో, ఇక నేపరమాత్మకు ఆత్మ అను నీ మొదలగు పేరులు కల్పింపబడినవే కనుక స్వతస్సిద్ధములుగానేరవో, అట్టి పరమాత్మ కలడు.

శ్లో॥ యః పుమాన్ సాంఖ్యదృష్టీనాం బ్రహ్మ వేదాంతవేదినాం ।
విజ్ఞానమాత్రం విజ్ఞానవిదా మేకాంత నిర్మలమ్ ॥

తా॥ మరియు నేపరమాత్మను సాంఖ్యశాస్త్రజ్ఞులు పురుషుడనియు, వేదాంతవిదులు బ్రహ్మమనియు, యోగమతస్థులు నిరమలమగు విజ్ఞానమనియు చెప్పుదురో, అట్టి పరమాత్మ కలదు.

శ్లో॥ యచ్ఛూన్య వాదినాం శూన్యం భాసకోయోఽర్క తేజసాం ।
వక్తామంతా బుతం భోక్తా ద్రష్టా సర్వా సదైవ యః ॥

తా॥ ఏ పరమాత్మను శూన్యవాదులు శూన్యమని చెప్పుదురో, ఏ పరమాత్మ సూర్యుని తేజముల ప్రకాశింపజేయునో, మరియును చెప్పువాడును, మననము చేయువాడును, కర ఫలము ననుభవించువాడును, చూచువాడును ఎప్పటికి నే పరమాత్మ యేయగునో, అట్టి పరమాత్మ కలదు.

శ్లో॥ ప్రకృతి ప్రతతిర్వ్యోమ్ని జాతా బ్రహ్మాండ సత్ఫలా ।
చిత్తమూలేంద్రియదళా యేన నృత్యతి వాయునా ॥

తా॥ బ్రహ్మాండము లను ఫలములు గలిగినట్టియు, మనస్సే మూలముగా గలిగి నట్టియు, ఇంద్రియము లను ఆకులు గలిగినట్టి మాయయను గశుద్ధచైతన్యమునందుబుట్టియే ఈశ్వరుడను వాయువుచే నటించుచున్నదో, అట్టిపరమాత్మ కలదు.

శ్లో॥ శుద్ధసంవిన యత్వాద్యః ఖం భవేద్వ్యోమ చింతయా ।
పదార్థచింతయార్థత్వమివ గచ్ఛత్యధిష్ఠితః ॥

తా॥ అవిద్యయు దానికారణంబును లేకుండుటచేత నే పరమాత్మ ఆకాశ విషయమగు చింతచేత నాకాశరూపుడై పదార్థవిషయకమగు చింతచేత పదార్థరూపమును పొందుచున్నటులనుండునో, అట్టిపరమాత్మ కలదు.

శ్లో॥ ఆవిర్భావ తిరోభావ మయా స్త్రిభువనోరయః ।
స్ఫురంత్యతితతే యస్మిన్ మరావివ మరీచయః ॥

తా॥ అతివిస్తారమగు నేచిదానంద సముద్రమునందు ఉత్పత్తి వినాశములు గల ముల్లోకము లను తరంగములు, మరుభూమియందు నెండమావులు పోలె కలుగుచున్నవో, అట్టిపరమాత్మ కలదు.

శ్లో॥ కుర్వన్నపీహ జగతాం మహతా మసంతం,
బృందం నకించన కరోతి కదాచనాపి ।
స్వాత్మన్యన స్తమయ సంవిది నిర్వికల్పే
త్యక్తోదయ స్థితిమతిః స్థిత ఏకఏవ ॥

తా॥ ఆ పరమాత్మ అపరిమితములగు జగములను మాయచే చేయుచున్న వాడే కాని వా స్తవముచేత చేయుటలేదు. నాశరహితమగు శుద్ధ చైతన్యమునందు ఉత్పత్త్యాదులులేక ఒక్కడేయున్నవాడు.

శ్లో॥ భిద్యతే హృదయ గ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కరాణి తసి న్ దృష్టే పరావరే ॥

తా॥ ఉత్కృష్టరూపుండును, అపకృష్టరూపుండునునగు నాపరమాత్మ ను చూచిన యెడల అహంకార మడగును. సర్వసందేహములు తెగిపోవును. ఇట్లు పరమాత్మ స్వరూపమును దెలిపి అట్టి పరమాత్మానుభవమును పొందిన వారికి సర్వసంశయములు నివర్తించునని తెలిపి ఆపరమాత్మ ను పూజించు విధానము నీ క్రింది విధమున తెలుపుచున్నారు. దీనినే దేవపూజా విధానమని గూడ చెప్పుచున్నారు,

శ్లో॥ శృణు బ్రహ్మ విదాంశ్రేష్ఠ దేవార్చనమను త్తమం ।
నదేవః పుండరీకాక్షో న చదేవస్త్రిలోచనః ॥

శ్లో॥ నదేవో దేహరూపోవా నదేవశ్చి త్తరూపకః ।
అకృత్రిమ మనాద్యంతం దేవనం దేవ ఉచ్యతే ॥

శ్లో॥ ఆకారాది పరిచ్ఛిన్నే మితే వస్తుని తత్కుతః ।
అకృత్రిమ మనాద్యంతం దేవనం చిచ్ఛివం విదుః ॥

శ్లో దేవః కఃస్యాదితిత్వేత్రత్ప్రథమం తావదుచ్య ।
తదేవ దేవశబ్దేన కథ్యతే త త్ప్రపూజయేత్ ॥

తా॥ బ్రహ్మ విదులలోన శ్రేష్ఠుండవగు సోమునీంద్రా! దేవార్చన విధిని చెప్పుచున్నాడ వినుము. దేవుండనగా కమలపత్రాక్షుండుగాని, త్రినేత్రుండుగాని, దేహరూపుండుగాని, చిత్తరూపుండుగాని కానేరడు. ఇకనేమన నుపాధిరహితంబును, ఆదిమధ్యాంత వర్జితంబుననగు దేవనము(జ్ఞానము) దేవుడనిచెప్పబడును. ఆకారాదులచే పరిచ్ఛిన్నంబై పరిమితంబగు వస్తువునందు దేవత్వమెటుల నుండును. కావుననే నిరుపాధికంబును, ఆద్యంతవర్జితంబునగు జ్ఞానమే శివుడని వచింతురు. దేవుడననెవ్వండను ప్రశ్నంబునకు మొదలు నిరూపణంబు చెప్పంబడియెను, అట్టి జ్ఞానరూపుండగు దేవునే పూజింపవలయును.

శ్లో॥ అజ్ఞాత శివతత్త్వానా మాకారాద్యర్చనంకృతం ।
యోజనాధ్వన్య శక్తస క్రోశాధ్వా పరికథ్యతే ॥

తా॥ యోజనము దూరమనిన భయపడువానికి క్రోశము దూరమని చెప్పబడునటుల నిట్టి నిరాకారంబగు శివతత్త్వము నెరుంగని వారలకు సాకారమునందర్చనము విధింపబడియెను.

శ్లో॥ చిద్వ్యోమైవ కిలాఽస్తీహ పారావార వివర్జితం ।
సర్వత్రా సంభవచ్చైత్యం కల్పాంతేషుచ శిష్యతే ॥

తా॥ ఆద్యంత వర్జితంబును, దృశ్యసంస్పర్శ రహితంబును, కల్పాంతములయందు శేషించునదియునగు చిదాకాశంబే కలదు.

శ్లో॥ బోధస్సామ్యం శమశ్చేతి పుష్పాణ్యగ్ర్యాణి తస తైః ।
శివం చిన్మాత్రమమలం పూజ్యం పూజావిదో విదుః ॥

తా॥ తత్త్వజ్ఞానము, సమభావము, నిర్వికారచిత్తత, అనునివి చిద్రూపుండగునా శివునకు పూజార్హములగు పుష్పములగుచున్నవి. వీనిచే చినాత్రుండగు నద్దేవుని పూజింప దగినవానినిగా వచింతురు.

శ్లో॥ శమ బోధాది ః పుష్పైర్దేవ ఆత్మా యదర్చ్యతే ।
తత్తుదేవార్చనం విద్ధి నాకారార్చనమర్చనమ్ ॥

తా॥ నిర్వికార చిత్తత, తత్త్వజ్ఞానము మొదలగు పుష్పములచేత నాత్మ రూపుండగు దేవుని నర్చించుటయే దేవార్చనమగు గాని ఆకారార్చనము అర్చనముకానేరదు.

శ్లో॥ అకృతిమమనాద ంత మద్వి ్యమఖండితం ।
అబహిస్సాధనైః సాధ్యం సుఖం తసా దవాప తే ॥

తా॥ నిరుపాధికంబును, ఆద్యంతరహితంబును, బాహ్యసాధనముల కసాధ్యంబుననగు కైవల్యసుఖ మాదేవతార్చనమువల్లనే ల ంచుచున్నది. శ్రీ రామచంద్రమూర్తికి పయి విధంబున దేవపూజా విధానంబును (ఆత్మ పూజనమును) యుపదేశించి యీ క్రింది విధమున నిరంతరానుసంధానమును తెలుపుచున్నారు.

శ్లో॥ సర్వతేక్షణ శక్త్యాఢ్యం సర్వతో ఘ్రాణ శక్తికం ।
సర్వతః స్పర్శనమయం సర్వతో రసనాన్వితమ్ ॥

శ్లో॥ సర్వత్ర శ్రవణా ర్ణం సర్వత మననాన్వితం ।
సర్వతో మననా తం సర్వత్ర పరమంశివమ్ ॥
ఇతిసంచింత్య దేవేశ మర్చయే ద్విధి వత్తతః ।

తా॥ అంతటను , శ్రోత్ర శక్తితో గూడిన వాడును, అంతటను ఘ్రాణేంద్రియ శక్తితో గూడిన వాడును, అంతటను త్వగింద్రియ శక్తితో గూడిన వాడును, అంతటను జిహ్వేంద్రియ శక్తితో గూడినవాడును, అంతటను మనశ్శక్తికి న తమైన వాడును, అంతటను నుత్కృష్టుడైన వాడును, నని శివుని భావించి విధు క్త క్రమమున నద్దేవుని భావింపవలయును.

శ్లో॥ స్వసంవిదాత్మా దేవోఽయం నోపహారేణ పూజ్యతే,
నిత్యమక్లేశలభ్యేన శీతలేనాఽవినాశినా,
ఏకేనైవా మృతేనైష బోధేన స్వేన పూజ్యతే ॥

తా॥ స్వాత్మ రూపుడగు నిద్దేవుండు బాహ్యోపహారముచే పూజింపబడడు. మరి యనాయాసలభ్యంబును, శీతలంబును, అనశ్వరంబును, నేకంబును నగు జ్ఞానామృతంబుచేతనే పూజింపబడుచున్నాడు.

శ్లో॥ ఏతదేవ పరంధ్యానం పూజైషైవ పరాస్మృతా ।
యదనారత మంతఃస్థ శుద్ధ చిన్మాత్ర వేదనమ్ ॥

తా॥ ఎపుడును లోపలనున్న శుద్ధంబగు చిన్మాత్రమును గాంచుచుండుట యేదికలదో అదియే యుత్కృష్టమగు ధ్యానంబును, అదియే యుత్కృష్టమగు పూజయు నగుచున్నది.

శ్లో॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపన్ శ్వసన్
పలపన్ విసృజన్ గృహ్ణన్ శుద్ధసంవిన్మయో భవేత్ ॥

తా॥ ఓరామచంద్రా ! చూచుచును, వినుచును, స్పృశించుచును, ఆఘ్రాణించుచును, భుజించుచును, నడుచుచును, నిద్రించుచును, నిట్టూర్పు విడుచుచును, మాటలాడుచును, విడుచుచును, గ్రహించుచును ఎపుడును సర్వమునకు సాక్షియగు విశుద్ధ జ్ఞానరూపుండ నని భావించుచుండవలయును.

శ్లో॥ ధా నోపహార ఏవాత్మా ధ్యానమస్య మహార్చనం ।
వినా తేనేతరేణాఽయమాతా లభ్యత ఏవనో ॥

తా॥ ఆత ధ్యానము చేతనే, పూజనీయుడు. ఈ యాత కు ధ్యానమే పూజ యగును. ఇట్టి ధ్యానము లేక ఈ యాత్మ ల ంపనేరడు.

ఇంకను యిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ న వాంఛతా నత్యజతాజ్ఞేన ప్రాప్తాః స్వభావతః ।
సరితస్సాగరేణేవ భోక్తవ్యా భోగభూతయః ॥

తా॥ జ్ఞాని యగువాడు ప్రాప్తించని యర్థంబుల గోరకయు, ప్రాప్తించిన యర్థంబుల విడువకయు స్వభావంబున బ్రాప్తములగు భోగైశ్వర్యంబులను సముద్రుండు ప్రాప్తములగు నదుల ననుభవించుచుండు నటుల భోగించుచుండవలయును.

గురుయావశ్యకతను గూర్చి యిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ అవిద్యాం శ్రేష్ఠయా శ్రేష్ఠః క్షాళయన్నేవతిష్ఠతి ।
మలం మలేనాపహర న్యుక్తిజ్ఞోరజకో యథా ॥

తా॥ ఉపాయజ్ఞుడగు రజకుడు వస్త్రగతమగు మలమును చౌడు మొదలగు మలముచేతనే పోనణచునటుల శ్రేష్ఠుండు శుద్ధసత్వజన ంబుగాన నుత్కృష్ఠంబును, విమలవాసనారూపంబునగు నవిద్యచే మలవాసనా రూపంబగు నవిద ను క్షాళనము చేయుచునే యున్నాడు.

శ్లో॥ అహేతవోఽప్యవిద్యాంశాః శ్రేష్ఠాః కారణతాంగతాః ।
క్రమాద్గురూపదేశాద్యా ఆత జ్ఞానస్యసిద్ధయే ॥

తా॥ నిజముచేత కారణంబులు గాకున్నను గురూపదేశంబు మొదలగు శ్రేష్ఠంబులైన యవిద్యాంశములు క్రమముగా ఆత జ్ఞాన సంసిద్ధికి కారణములగుచున్నవి.

శ్లో॥ క్రమేగురూపదేశానాం ప్రవృత్తే శిష్యబోధనే ।
అనిర్దేశ్యోఽప్యదృశో ఽపి స్వయమాత్మా ప్రసీదతి ॥

తా॥ గురూపదేశముల యొక్క క్రమమున శిష్యులకు బోధ ప్రవర్తించుచుండగా గురువాక్యములచే ప్రతిపాదింప నశక్యుండైనను, చిత్తవృత్తికి గోచరింపని వాడైనను ఆత తా నంతట ప్రకాశించుచున్నాడు.

శ్లో॥ శాస్త్రార్థైర్బుధ్యతే నాత్మా గురోర్వచనతో నచ ।
బుధ్యతే స్వయమేవైష స్వబోధ వశతః స్వయమ్ ॥

తా॥ ఆత్మ శాస్త్రార్థములచే గాని, గురువచనములచే గాని తెలియబడడు. మరి స్వరూపానుసంధానము వలన తనంతట తెలిసికొనబడుచున్నాడు.

శ్లో॥ గురూపదేశ శాస్త్రార్థైర్వినా చాత్మా న బుధ్యతే।
ఏతత్సంయోగ సత్తైవ స్వాత్మ జ్ఞాన ప్రకాశినీ ॥

తా॥ గురూపదేశము, శాస్త్రార్థములు వీనితో వినాగాను ఆత్మ తెలియబడడు. మరి వీటి యన్నిటియొక్క చేరికయే యాత్మ జ్ఞానమును ప్రకాశింప జేయుచున్నది.

శ్లో॥ గురుశాస్త్రార్థ శిష్యాణాం చిరసంయోగసత్తయా ।
అహనీవ జనాచార ఆత్మ జ్ఞానం ప్రవర్తతే ॥

తా॥ గురువు, శాస్త్రార్థము, శిష్యులు వీరియొక్క చిరకాల సంయోగముచే పగలునందు జనసంచారము ప్రవర్తించునటుల నాత్మజ్ఞానము ప్రవర్తించుచున్నది.

శ్లో॥ ఏవం దేవార్చనం నిత్యం జ్ఞః కుర్వ న్మునినాయక ।
యత్రాస్య దాదయో భృత్యా స్తత్ప్రయాతి పరం పదమ్ ॥

తా॥ ఇట్లు జ్ఞాని దేవార్చనమును నిత్యమును జేయుచున్న వాడగునేని ఏబ్రహ్మ పదమునందు మాబోంట్లు భృతులమై యుందుమో అట్టి బ్రహ్మ పదమును పొందుచున్నాడు.

ఇట్లు తెలిపి యింకను యిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ అనేనాఽర్చా విధానేన మయేమా రామ వాసనాః ।
అన్నైనైవ వాహ్యంతే వ్యవహారపరా అపి॥

తా॥ ౹ శ్రీరామచంద్రా ! నేనునూ యీ పూజా విధిచేతనే సంసార వాసనలను విడిచి దుఃఖరహితుండనై వెళ్ళించుచున్నాడను, అని వసిష్ఠమహా ముని చెప్పుచున్నారు.

శ్లో॥ యథా యత్రతయదాకారం తథా తత్రతదేవహి ।
బ్రహ్మ సర్వాత్మకం సర్వం సుషుప్తస్థ మివస్థితమ్ ॥

తా॥ సర్వాత కంబగు బ్రహ్మము ఎచ్చట నే రూపంబున బవర్తించు చుండునో అచట నారూపంబే గన్పట్టు చుండును. అట్లుగావున సర్వం బును బ్రహ్మమే సుషుప్తావస్థ నొంది నదివలె నిర్వికారంబై యున్నది,

అని చెప్పి, యోగవాసిష్ఠంబున అర్జునోపాఖ్యానమునందు భగ వంతుడైన శ్రీ కృష్ణమూర్తి అర్జునునితో తన భగవత్స్వరూపమును యీ విధమున తెలిపెనని చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వసంకల్ప సంశాంతౌ ప్రశాంతఘన వాసనం ।
నకించి ద్భావనాకారం తద్బ్రహ్మ పరమం విదుః॥

తా॥ సమస్తమగు సంకల్పములును శాంతింపగా అణగిపోయిన వాసనలుం గలదియు నేవిధమగు భావనలు లేనిదియునగు నారూపమును పర బ్రహ్మమునుగా నెరుంగుదురు. అట్టి బ్రహ్మము నెరుంగుటయే జ్ఞాన మనియు, యోగమనియు నెరుంగవలెను.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యా మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

తా॥ ఓ అర్జునా ! నాయందుంచిన చిత్తము కలవాడవును, నాయందు భక్తి గల వాడవును, నన్ను బూజించు వాడవును, నన్ను నమస్కరించు

చున్న వాడవును నగుము. ఇట్లు చిత్తమును నాయందు నిలిపి నన్ను భావించు వాడవై నన్నే పొందగలవు..

శ్లో॥ సామాన్యం పరమం చేతి ద్వేరూపే విద్ధి మేఽనఘ ।
పాణ్యాదియుక్తం సామాన్యం శంఖచక్రగదా ధరమ్ ॥

శ్లో॥ పరంరూపమనాద్యంతం యస మైక మనామయం ।
బ్రహ్మేత పరమాత్మాది శబ్దై సై తదుదీర్యతే ॥

తా॥ ఓపార్థా ! నాకు సామాన్యమనియు, పరమ మనియు రెండు రూపములు గలవు. అందు కరచరణాది యుక్తంబై శంఖచక్రగదాదుల ధరించిన రూపము సామాన్యంబును, నాద్యంతరహితంబై యఖండం బగురూపంబు పరమంబు నగుచున్నది. ఆ పరమరూపమే బ్రహ్మము, ఆత్మ, పరమాత్మ మొదలగు శబ్దములచే చెప్పబడుచున్నది.

శ్లో॥ యావదప్రతిబుద్ధస్త్వమనాత్మజ్ఞతయాస్థితః ।
తావచ్చతుర్భుజాకార దేవపూజాపరో భవ ॥

శ్లో॥ తత్క్రమా త్సంప్రబుద్ధస్త్వం తతో జ్ఞాస్యసి తత్పరం ।
మమ రూపమనాద్యంతం యేనభూయో న జాయసే ॥

తా॥ నీ వెంతవరకు నప్రబుద్ధుండవై యాత్మస్వరూపము నెరుంగకుందువో అంతవరకు నాలుగుచేతులుగల దేవతాస్వరూపమునుపూజించుచుండుము. ఆ పూజ క్రమంబున ప్రబోధమునొంది యాద్యంతరహితమగు నాదు పరమరూపమును నెరుంగగలవు. అందుచే మరల జననమొందవు.

శ్లో॥ నిరామానమోహా జితసంగదోషా ।
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయంతత్ ॥

తా॥ అహంకారము, తనూ లమగు నజ్ఞానంబును నివారలును, సంగదోష మును జయించినవారలును, ఆత్మానుసంధానమునం దాసక్తి గలవార లును, కామనారహితులును, సుఖదుఃఖాది ద్వంద్వదోషవిముక్తులునగు విద్వాంసులు శాశ్వతంబగు నా బ్రహ్మ పదమును పొందుచున్నారు.

శ్రీవసిష్ఠమహాముని యింతబోధించియును తృప్తిజెందక పర్యవ సానముగ వారి తత్త్వోపదేశసారమును శ్రీరామచంద్రమూర్తికి యిట్లు తెలుపు చున్నారు. సంసారవిభ్రమము ఉత్పత్తి వినాశంబులచే భంగయుక్తంబైనను, విచిత్రంబైనను, గొప్పదియైననూ, జ్ఞానులు (తత్వజ్ఞులు) వీనివలన ఆనం దముగాని, దుఃఖముగాని పొందరు.

శ్లో॥ బుద్ధ్యాలోకనసాధ్యేఽసి స్వస్తునస్తమితాపది ।
ప్రవర్తతే న యో మోహాత్తం ధిగస్తు నరాధమమ్ ॥

తా॥ తనబుద్ధిచే విచారించినమాత్రమున సాధ్యంబును, నస్తమించిన సకలా పత్తులు గలదియు నగు నీ మోక్షవస్తువునం దెవ్వడు మోహవశం బున బ్రవర్తింపడో ఆ నరాధముడు నిందార్హుడగును.

శ్లో॥ విశ్రాంతిమాప్తుముచితాం చిరసంగదుఃఖ
రత్నాకరం జననసాగరముత్తితీర్షోః,
కోఽహం కథం జగదిదం చ పరశ్చకఃస్యా
త్కింభోగకైరితి మతిః పరమోఽభ్యుపాయః॥

తా॥ ఉచితమగు తత్త్వనిష్ఠనొందుటకు చిరంతనమగు సంసక్తిచే గలుగు చున్న దుఃఖములను రత్నములకాటపట్టగు సంసారసముద్రమును దాట దలంచిన పురుషునకు నే నెవడను? ఈ జగమెట్లు కలిగినది? పరమాత్మ యెవరు? భోగముల తోనేమిలాభ మను నిట్టివిచారము మోక్షోపాయ మగుచున్నది.

శ్లో॥ యదిదం దృశ్యతే కించి త్తన్నా స్తి నృప కించన,
యథాగంధర్వనగరం యథావారి మరుస్థలే.

శ్లో॥ మనః షష్ఠేంద్రియా తం యత్తునోదృశ్యతే క్వచిత్,
అవినాశం త ద స్తీహ తత్సదాతే తి కథ్యతే.

తా॥ ఓ రామచంద్రా ! ఎయ్యది గంధర్వనగరమువలెను, మరుస్థలమునందు జలమువలెను గనబడుచున్నదో అట్టిజగము కొంచమైనను లేదు. మఱి యెయ్యది మనస్సుతో నాఱగు నింద్రియముల కతీతమైనదో, ఎయ్యది యెచటను గనపడదో, ఎయ్యది వినాశరహితమైనదో, ఎయ్యది సత్తు, ఆత అను నామములచే చెప్పబడుచున్నదో అదియే కలదు.

శ్లో॥ ఇయంతు సర్వదృశ్యాద్యా రాజన్ సర్గపరంపరా,
తసి న్నేవ మహాదర్శే ప్రతిబింబ ముపాగతా.

తా॥ సర్వదృశ్యంబులకును నాద్యంబగు నీ సృష్టి యదృశ్యంబగు నా గొప్ప యద్దమునందు (దర్పణము) ప్రతిబింబించుచున్నది.

శ్లో॥ భాః స్వభావసముత్పన్నా బ్రాహ్మ్యః స్ఫురణశ క్తయః,
కాశ్చిద్బ్రహ్మండతాం యాంతి కాశ్చిద్గచ్ఛంతి భూతతామ్.

తా॥ తేజస్స్వభావంబున గలిగిన బ్రహ్మ సంబంధములగు కొన్నిశక్తులు బ్రహ్మండరూపమును, మరికొన్నిశక్తులు ప్రాణిరూపమును పొందు చున్నవి.

శ్లో॥ నబంధోఽ స్తినమోక్షోఽ స్తి బ్రహ్మై వాఽ స్తి నిరామయం,
నైక్యమ స్తి న చద్విత్వం సంవిత్సారం విజృంభతే.

తా॥ బంధముగాని, మోక్షముగాని, భేదముగాని, యభేదముగాని, యెద్దియు లేదు. జ్ఞానసారంబగు బ్రహ్మంబేకలదు,

శ్లో॥ ఏకం యథా స్ఫురతి వారితరంగభంగై
రేవం పరిస్ఫురతి చిన్న చ కించిదేతత్ ।
త్వం బంధమోక్షకలనే ప్రవిముచ్యదూరే
స్వస్థో భవాఽభవభయోఽభయసారఏవ ॥

తా॥ జలమొక్కటియే యనేకములగు తరంగముల రూపముతో ప్రకాశించునట్లు చిత్తొక్కటియే నానారూపంబుల బ్రకాశించుచున్నది. ఇంతియే కాని దృశ్యము కొంచమైననులేదు. గావున నీవు బంధమోక్ష కల్పనలను దూరముగవిడిచి సంసారభయరహితుండవును, బ్రహ్మమే సారాంశముగా గలవాడవునై స్వస్థుండవగుము.

శ్లో॥ సంకల్పేను ఖతాం యాతాస్సత్యశ్చినా త్రసంవిదః,
ఆప స్తరంగత్వమితి యాంతి భూమిప జీవతామ్॥

తా॥ ఓ రామచంద్రా ! ఆ చిత్తుయొక్క చినా త్రరూపంబులగు సంవిత్తులు సంకల్పమున కభిముఖంబులై జలము తరంగత్వము నొందునట్లు వత్వము నొందుచున్నవి.

శ్లో॥ తే జీవాస్సంసరం హ సంసారే పూర్వముత్థితే,
సుఖదుఃఖదశామోహో మనస్యేవాఽస్తినాత ని.

తా॥ ఆ జీవులు మున్ను బుట్టిన సంసారమునందు తిరుగుచున్నారు. సుఖదుఃఖ దశలకు మూలంబగు మోహంబును మనస్సునందే కలదుగాని యాత యందు లేదు.

శ్లో॥ అదృశ్యో దృశ్యతే రాహుర్గృహీతేన యథేందునా,
తథాఽనుభవమాత్రాత్మా దృశే నాత్మాఽవలోక తే.

తా॥ చూడనశక మైనవాడగు రాహువు తానుగ్రహించిన చంద్రునితో గూడి యెట్లు కనబడుచున్నాడో, అటుల ననుభవమాత్రరూపుండగు నాత యు దేహాద్యుపాధితోగూడి కనబడుచున్నాడు.

శ్లో॥ న శాస్త్రైణాపి గురుణా దృశ తే పరమేశ్వరః,
దృశ్యతే స్వాత్మ నైవాత్మా స్వయా సత్త్వస్థయా ధియా.

తా॥ ఆత్మ శాస్త్రముచేతగాని, గురువుచేతగాని చూడశక్యము గానేరడు. మరి తన ప్రయత్నముచే సత్త్వగుణనిష్ఠమగు బుద్ధిచేతనే చూడబడు చున్నాడు.

శ్లో॥ పథికాఃపథిదృశ్యంతే రాగద్వేషవిముక్తయా,
యథాధియా తథైవైతే ద్రష్టవ్యాశ్చేంద్రియాదయః.

తా॥ మార్గమునందు బాటసారులు రాగద్వేషరహితంబగు చిత్తవృత్తితో నెట్లు సంచరించుచున్నారో అట్లు దేహేంద్రియాదులను రాగద్వేషరహితంబగు చిత్తవృత్తితో జూచుచుండవలయును.

శ్లో॥ ఏతేషు నాదరః కార్యస్తా నైవాఽవధీరణం,
పదార్థమాత్రతా విష్టా స్తిష్ఠం త్వేతే యథాస్థితమ్.

తా॥ పండితుడగువాడీదేహేంద్రియాదుల యందాదరబుద్ధినిగాని, యవజ్ఞా బుద్ధినిగాని చేయదగదు, ఈ దేహాదిపదార్థము లితరపదార్థములవలె యథాస్థితిగా నుండుగాక.

శ్లో॥ దేహోఽహమితి యా బుద్ధి స్సా సంసారనిబంధినీ,
న కదాచిదియం బుద్ధిరాదేయా హి ముముక్షుః.

తా॥ దేహము నేనను బుద్ధియే సంసారమును కలిగించుచున్నది. కావున మోక్షము గోరువారీభావము నొందదగదు.

శ్లో॥ నకించినాత్ర చినాత్ర రూపోఽసి గగనాదణుః,
ఇతి యా శాశ్వ బుద్ధి స్సా స సంసారబంధినీ.

తా॥ నేను విశ్వవిలక్షణంబగు చిన్మాత్రమే రూపముగా గలవాడను. ఆకాశముకంటె నణుమాత్ర రూపుడను. అను నీ స్థిరమగుబుద్ధి సంసారమున బంధింపనేరదు.

శ్లో॥ యథా విమలతోయానాం బహి రంతశ్చ భాసవం,
తేజస్తిష్ఠతి సర్వత్ర తథాత్మా సర్వవస్తుషు.

తా॥ సూర్యుని తేజస్సు స్వచ్ఛంబులగు జలంబులకు వెలుపలను లోపలను నెటులనుండుచున్నదో, అటుల నాత్మ సర్వవస్తువులయందును వసించుచున్నది.

శ్లో॥ సన్నివేశాంశపై చిత్ర్యం యథా హేమ్నోఽంగదాదినా,
ఆత్మనస్తదతద్రూపా తథైవ జగదాదినా.

తా॥ సువర్ణముయొక్క నానారూపత్వమే యంగదాది భూషణభావము నొందునటుల నాత్మ యొక్క నానారూపత్వమే జగదాదిరూపముతో ప్రకాశించుచున్నది.

శ్లో॥ వినాశబాడబా కాంతకల్పకాల మహార్ణవం,
జగజ్జాల తరంగిణ్యోయాంతి భూతతరంగికాః.

తా॥ ప్రాణు లను తరంగములుగల జగజ్జాలంబు లను నదులు వినాశంబను బడబాగ్నితోగూడిన కల్పకాలం బను మహాసముద్రమును పొందుచున్నవి.

శ్లో॥ తస్యాప్యదాప్య పూర్ణస్య యః పాతా కాలవారిధేః,
తమాత్మానం మహాగస్త్యం రాజన్ భావయ సర్వదా.

తా॥ ఓ రామచంద్రా! నీవు యిప్పటికిని, నష్టూర్ణంబగు నా కల్పకాల మహాసముద్రమును పానముచేయునట్టి యాత్మ యను నగస్త్యుని యెప్పుడును భావింపుము.

శ్లో॥ అనాత స్యాత తా మసి స్దేహాదౌ వృశ్యజాలకే,
త్య క్త్వాసత్వముపారూఢో గూఢ స్తిష్ఠ యథాసుఖమ్.

తా॥ అనాత యగు నీ దేహాది దృశ్యపదార్థంబులయం దాత్మభావము విడిచి సత్త్వగుణము నవలంబించినవాడవై యేకాంతమున సుఖంబుగ నుండుము.

శ్లో॥ కుచకోటరసంసుప్తం విస్మృత్య జననీసుతం,
యథారోదితి పుత్రార్థం తథాతా ర్థ మయంజనః.

తా॥ తనతల్లికుచాగ్రములయందు నిద్రించియున్న పుత్రుని మరచి యా పుత్రునికై రోదనము జేయునటుల నీజను లాత్మకై రోదనము చేయు చున్నారు.

శ్లో॥ అజరామరమాత్మాన మబుద్ధ్వా పరిరోదితి,
హాహతోఽహమనాథోఽహం నష్టోఽసీ తి వపుర్వ్యయే.

తా॥ జనుడు జరామరణవర్జితుడగు నాత ను దెలిసికొనజాలక శరీరనాశమున నేను నశించితిని. దిక్కులేని వాడనయితినని రోదనము జేయు చున్నాడు.

శ్లో॥ యథావారిపరిస్పందాన్నానాకారం విలోక్యతే,
తథా సంకల్పవశతశ్చిద్బ్రహ్మ పరిబృంహితమ్.

తా॥ జలము చలనమువలన నానారూపంబుగ గనబడునట్లు చినా త్రంబగు బ్రహ్మంబును సంకల్పవశంబున నాకాశాది నానారూపంబుగ గన బడుచున్నది.

శ్లో॥ సంస్థాప్య సంకల్పకలంకముక్తం
చిత్తంత్వమాత స్న్యపశాంతశంకః,

స్పందేఽప్యవిస్పంద ఇవేశ్వరాత్మా
స్వస్థస్సు రాజ్యమిదం ప్రశాధి.

తా॥ నీవు సంకల్పరహితమగు చిత్తము నాత్మయందు నిలిపి సంశయరహితుండవై విక్షేపమున్నను విక్షేపరహితునివలెనున్న వాడవును, ఆత్మనిష్ఠుడవును, నీశ్వరస్వరూపుండవు నగుము.

ఇట్లు సర్వముముక్షు ఉద్ధరణమునకై కారుణ్యముతో హితోపదేశం బను పేరున ఈ బ్రహ్మవిద్యాసారంబును ఆధికారికపురుషులైన శ్రీవసిష్ఠ భగవానులు గురురూపమున, అవతారపురుషుడైన శ్రీరామచంద్రమూర్తిని జిజ్ఞాసువుగ గ్రహించి చేసిన తత్త్వబోధామృతము ఈ జ్ఞానామృతమును వసిష్ఠ మునీంద్రులు వారి విద్యాసాంప్రదాయ కౌశలంబున పసిపాపలకు తల్లులాహార మును హితవు జేయునట్లు బహుతెరంగుల సుసాధ్యంబుగజేసి బోధించు చున్నారు. ఇది సామాన్యుల కలభ్యము, కావున దీనిని జిజ్ఞాసువులు తమకు గురుబోధయని తలచి సావధానచిత్తులై శ్రద్ధోత్సాహములతో పునఃపునః పఠించి నిత్యనిరతిశయ సుఖస్వరూపంబైన ఆత్మజ్ఞానంబును గ్రహించి స్వానుభవంబుల నొందుదురుగాక.

## శక్తిసిద్ధులు, జ్ఞానవిరోధులు

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు యెన్నడునూ తాను సిద్ధులను అనగా అద్భుత శక్తులను సంపాదించుట యందుగాని, అద్భుతకార్యములు చేయుటయందు గాని యిచ్ఛను పొందకూడదు — ఇట్టివి యన్నియూ ముముక్షువునకు తన పరమ ప్రాప్తి సాధనముకు ఆటంకము కలిగించు అల్పప్రజ్ఞలు — లోకమునందు గూడ యిట్టి సిద్ధి, శక్తులున్నవాడు గొప్ప జ్ఞానియనియూ, లేనిచో వాడు జ్ఞాని కాడనియూ గూడ సామాన్యాభిప్రాయమొకటి యున్నది. సిద్ధులు, మహిమలు యున్నవారు అపార శిష్యబృందము కలిగి, లోకము నాకర్షించుచుందురు. ఇదియే వీరికి కలుగు లాభము కాని; పరమాత్మ జ్ఞానము

లాభము కాజాలదు. సామాన్య జనులు యీ సిద్ధి సామర్థ్యములను అల్ప మైనవని గ్రహించజాలక కేవల కుతూహల మాత్రముతో వీనిని కోరుచుందురు. ఏలనన యీ సిద్ధి శక్తులన్నియునూ మానవునికన్న అల్పోపాధులయందు ఒక్కొక్క దానికి యొక్కొక్క శక్తి సహజముగనే కనబడుచున్నవి గదా- అవి యేవియనిన ఆకాశ గమనశక్తి ఖేచరములకున్నూ, జలమందు సహన, చలనశక్తులు, జలచరములయందున్నూ, ఆకర్షణ శక్తి అయస్కాంత శిలల యందున్నూ, భూమిలోపల వ ၊ కములందు నివసించు శక్తి సర్పముల యందున యున్నూ, అగ్నిని తినుశక్తి నిప్పుకోడులను పక్షులయందునూ, ప్రకాశశక్తి కొన్ని మణుల యందునయున్నూ, మిణుగురు పురుగుల యందు గూడ సహజముగ నున్నట్లు అందరకునూ తెలిసిన విషయమే. ఇంకనూ చాలా దూరము చూడగల శక్తియునూ, చాలా కాలము వించు శక్తి యునూ గూడ కాకులకున్నూ సహజముగ యున్నట్లు తెలియుచున్నది. ఇవి యన్నియూ మానవ, యుపాధికన్న తక్కువ జీవోపాధులేకాని యెక్కువ కావుగదా. ఇదిగాకనూ చేతను డైనమానవుని వలననే అ· తనములైన యంత్ర ములను యుత్పత్తిచేసి వాటివలన అద్భుత కార్యములు · యించు శక్తి ఒక్క మానవుని యందే యున్నది గాని అచేతనములగు యంత్రములకు లేదుగదా. అయినను మానవుని శక్తివల్లనే వివిధ యంత్రముల వలన యీ కాలమున అనేక అద్భుత కార్యములు చేయించబడుచున్నవి. లక్షల మైళ్ళ దూరమున నున్న దృశ్య, శబ్ద. శ్రవణములు చేయుటయున్నూ, వేల మైళ్ళ యెత్తున లక్షల మైళ్ళ యందు ఆకాశ గమనాదులున్నూ, లక్షల సంఖ్యకు మించిన గణితములు క్షణకాలమున చేయుటయున్నూ, జలమునందు మైళ్ళ లోతున సముద్ర ప్రయాణ నివాసములున్నూ, అది యిది యననేల అత్యల్పకాలములో సగము ప్రపంచమును నశింప యగలుగు ఆ యు ధ యం త్ర ము లు న్నూ మానవుడు కనిపెట్టి వ్యవహరించుచున్న విషయము గూడ జనసామాన్య మున కాలమున తెలిసిన విషయమే. అయిననూ యిట్టి గొప్ప విశేష శక్తులు కలిగిన వన్నియూ మానవుని కన్న తక్కువయైన వోపాధులయందు గాని

లేక మానవ ప్రజ్ఞచే, అచేతనములైన యంత్రములుగా, గాని తెలియబడు చున్నవి. పైన యుదహరించిన విశేష శక్తులన్నియూ, మానవునిచే చేయ బడిన జడములైన యంత్రములయందు గాని లేనిచో మానవోపాధికి, తక్కువయైన జీవోపాధులందే కనబడుచుండుటచే యిట్టివి యన్నియూ అల్ప ములు, అనిత్యములు, వికారములు మాత్రమేయని గ్రహించవలెను. ఇవి యన్నియూ కొంతకాలము మాత్రముండి పర్యవసానమున మానవునకు దుఃఖ మునే కలిగించుచున్నవి, ఇట్టి అనిత్యములను వదలి తన పరమార్థ సత్య స్వరూపమైననిత్యనిరతిశయ సుఖపదార్థమును తెలిసికొని, తాను శాశ్వత సుఖము నొందుటయే జ్ఞానాభ్యాసకుని యొక్క కర్తవ్యము పరమ ఆశయ ముగా నుండవలెను — ఇట్టి సిద్ధి, శక్తులన్నియూ అల్పములు. అనగా పర్యవ సానమందు దుఃఖము నిచ్చునవి. ఇవి యన్నియూ అనాత్మకు సంబంధించినవే కాని, ఆత జ్ఞానము నిచ్చునవి కావు. కావున వీనియందు జ్ఞానాభ్యాసకుడు భ్రమజెందకూడదు, ఆద్యంతము లేక సదామానవునకు నిత్యనిరతిశయ సుఖ స్వరూపము నిచ్చు నటువంటి బ్రహ్మ జ్ఞానాభ్యాసోపాయమును వదలి యిట్టి అనిత్యములై అల్ప ప్రయోజనకరములైన సిద్ధి మహత్తుల నెన్నడు బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు యిచ్ఛయించ కూడదు. ఈ సందర్భమును, స్పష్టపరచు నట్టిదైనాజ్ఞప్తియందున్న యొక విషయమును తెలిపెదను-అది యేదియన జ్ఞాని యైన యొక మహనీయు డొకనదియొడ్డున కూర్చుండగా వారి కడకు, శిష్యు డొకడచటకు జని మీరింత విఖ్యాతిగాంచిన మహానుభావులు - నాకు జలము మీద నడచు విద్యను బోధింపవలయునని యడిగెను - అందులకు ఆమహ నీయుడు అట్లే బోధించెదననియూ దానికి గాను ముందుగ హృదయము లోతు జలమందు నిలచి నలుబది రోజులు నిరాహార దీక్షతో నుండి యొక మంత్రమును జపించి రావలసియుండునని చెప్పెను. అది వినిన వెంటనే యిట్లు కోరిన శిష్యుడు సంకోచముతో నిలబడి యుండెను - అది చూచి వారి యుభయులకు, నెదర నదియందునన్న నావ నొకదానిని పిచి, గురువు శిష్యుని చూచి, ఆవవానితో వీనిని అవలి యొడ్డుకు దాటించి నీ మామూలు రుసుము నుకొనమని చెప్పి, శిష్యునితో నీవావలి యొడ్డుకు వెళ్ళి నాదగ్గరకు రమ్మని చెప్పిరి. ఆ శిష్యుడట్లే వెళ్ళగా ఆ నావ వాడు కొద్ది పైసలు మాత్రము పుచ్చుకుని, ఆ శిష్యుని తన నావమీద అవలి

యొద్దు చేర్చెను. శిష్యుడు తిరిగి గురువు గారి యొద్దకు రాగా నిది దాటుటకు నీవేమి యిచ్చితివని యడిగిన మీద, కొద్ది పైసలు మాత్ర మిచ్చితినని జవాబు చెప్పెను, ఇంకనూ నది దాటుటకు ఎంతకాలము పట్టినదనిన కొద్ది కాలమే పట్టినదని చెప్పెను — అప్పుడు శిష్యుని చూచి జలమందు నడుచు నీవిద్యతో నీవు చేయదలచినది నదీ జలమును దాటుటయే గదా — అట్టి కార్యమును, నీవు నలుబది రోజులు, నిరాహార దీక్షతో గొంతులోతుజలమందుండి మంత్ర జపముచేసి సాధించుట మంచిదియా, లేక సులభమా, లేనిచో కొద్ది పైసలిచ్చి, కొద్దికాలములో అచేతనమైన నావ సహాయము వలన ఆవలి యొడ్డుకు చేరుట మంచిదియా, అని యడిగెను. అందులకు శిష్యుడు మారు బలుకక, సిగ్గుపడి వెళ్ళిపోయెను-కావున అల్పకార్య సాధనకు గాను యెప్పుడునూ అధిక ప్రజ్ఞను, వినియోగించుట వివేకము, లాభకరమున్నూ కాదు. కావున జ్ఞానాభ్యాసకుడు, లోక వాసనచే తనకు అనిత్యములు అల్పములునైన సిద్ధులు కావలెనని కోరక తన ప్రజ్ఞను తన నిత్య నిరతిశయ సుఖలాభ సాధనముకుగాను ఉపయోగించుకొనుటయే శ్రేయస్సు, వివేకము-తన పరమ ప్రాప్తి సాధనమని గ్రహించి శక్తి, సిద్ధులయందు వ్యామోహితుడు కాదగదు బ్రహ్మ జ్ఞానులకు సిద్ధిశక్తు లుండవలెనను నియమములేదు. అట్టివి యున్నను జ్ఞాని వాటిని ప్రజారంజనకు గాని, శిష్యసంగ్రహమునకుగాని నుపయోగ మెన్నటికిని చేయడు. కావున మానవులు యిట్టి సిద్ధి శక్తులనే చూపువారిని గుఱించి వారు బ్రహ్మ జ్ఞానులని భ్రమజెందుట యవివేకము.

# మోక్షసాధనవివేచనానుసంధానామృతము

ఈ ప్రపంచమునుగురించి ముముక్షువు యెంతవిచారించిననూ వ జడములే అధిష్ఠానాధ్యస్తములై వివర్తముగా, మిశ్రితమై యీ దృశ రూపమున భాసించున్నవి గాని మరియేయితరమునూలేదు. ఈరెండింటిలోనను అధిష్ఠానము సత్యముగాను అధ్యస్తము కల్పితముగాను నున్నవి. ఇందు అధ్యస్తమంతయూ అనాది మాయా ప్రభావముచే కల్పితమైన జడము. ఇది పరమార్థసత్యముకాదు.

కాని యిది అంతయూ వ్యవహారసత్యరూపముననున్నది. ఈ వ్యవహార సత్యములన్నియూ అనిత్యములు, కల్పితములు, అవాస్తవములు. పరమార్థ సత్యమనునది, నిత్యమైన సత్యపదార్థముగానున్న సర్వాధిష్ఠాన పరిపూర్ణ చైతన్యమొక్కటియే. ఇట్టి అఖండాద్వితీయ సర్వాధిష్ఠానమందే అనాది మాయా ప్రభావముచే అధ్యస్తమంతయునూ కల్పితమై ప్రకాశించుచున్నది. ఈ అధ్యస్తజ్ఞానమే భ్రాంతికల్పితమైన అహం, నేను అను ప్రతీతికి విషయమైన వత్వమునున్నూ ఇదం, అను ప్రపంచప్రతీతితో గోచరించు సర్వదృశ్యమునున్నూ కలుగజేయుచున్నది. ఇదియంతయునూచేరి సత్యానృతములు మిధునీకృతములై జగదంతఃపాతియైన జీవునకు అనాది మాయా ప్రభావముచే, పరిచ్ఛిన్నాకార వివిధోపాధులతో నేను, నాది యను స్ఫురణ ప్రతులను కలుగజేయుచూ యీ ప్రపంచ ప్రవాహరూపమున జనన మరణాదులతో జీవునకు సుఖాభాసమును దుఃఖ భోగానుభవములను కలుగజేయుచున్నది. ఇదియే జీవునియొక్క సంసారస్థితి-ఇట్టి సంసారస్థితి దుఃఖములనుండి,ఆత్యంతిక దుఃఖనివృత్తికోరు వుడు తన నిత్యానిత్య వివేక, శ్రవణమననములచేత భ్రమకల్పితమైన యీ అధ్యస్తస్వశరీర సర్వదృశ్యమునంతయునూ, శాస్త్రీయ జ్ఞానపూర్వకముగ త్యజించి తన వాస్తవస్వరూపమైన అధిష్ఠాన స్వరూపానుభవమును పొందుటయే ముముక్షువునకు పరమ కర్తవ్యము. అనుసంధానాభ్యాసములు జిజ్ఞాసువునకు తన మోక్షప్రాప్తికి ప్రధానములగుచున్నవి. దీనిని గురించి వివిధనిరూపణలలో సందర్భానుసారముననూ ప్రత్యేకముగనూగూడ విశదీకరించియున్ననూ అనుసంధానాభ్యాస ప్రక్రియ ముముక్షుతరణోపాయమున కమృతతుల్యమగుచున్నది. జిజ్ఞాసువునకిదియే ముఖ్యసాధనము—కావున "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను వచనము ననుసరించి ముముక్షువున కమృతతుల్యమగు వివేచన సారాంశములను అనుసంధానదార్ఢ్యమునకుగాను సంగ్రహించి యీ దిగువ నిరూపించుచుంటిని — కాన యిందు అధిష్ఠానాంశమును స్వరూపలక్షణములచే ముముక్షువు తన వాస్తవ స్వరూపముగ గ్రహించి నిశ్చయమునొంది అధ్యస్తములయిన స్వశరీర సర్వదృశ్యమునూ అనిత్యము

లునూ, అవాస్తవములుగనూ తెలిసికొని వానిని తన సత్య జ్ఞానబలముచే జ్ఞాన పూర్వకముగ త్యజించిన శేషించునది తన వాస్తవస్వరూపమైన పరిపూర్ణ చైతన్యాధిష్ఠానమేయగును. ఇట్టి అధిష్ఠానస్వరూపజ్ఞానమును సంపాదించి తన చిరకాలాభ్యాసపటిమచే స్వానుభవమునొందుటయే జీవునికి కృతకృత్యత – -వుని వాస్తవ స్వరూపమైన సర్వాధిష్ఠాన స్వరూపమును బాగుగ గుర్తించు టకు గాను అధిష్ఠానాధ్యస్తములు రెండింటియొక్క స్వరూప లక్షణములను బాగుగ వివేచనచేసి తెలిసికొనవలయును. వాటి రెంటియొక్క స్వరూప వై లక్షణ్యములను యిచట పరి లించుదము:-

| అధిష్ఠాన లక్షణములు- శుద్ధ- వుడు (బ్రహ్మ అధిష్ఠానము | అధ్యాస్తలక్షణములు - జీవునకు జీవత్వ, జగత్తులు అధ్యాస్తము |
|---|---|
| . ఆత , శుద్ధ వుడు—అధిష్ఠానము | జీ వ త్వ ము వుని స్థూలదేహము సూక్ష్మోపాధియైన అంతఃకరణము సర్వదృశ్య ము, కర్తృత్వాదులు |
| 2. పరిపూర్ణము, సచ్చిదానంద ములు | పరిచ్ఛిన్నత – అనృతజడదుఃఖములు |
| . నిత్యుడు, అవికారి, అసం గుడు | సంబంధిత్వ, వి కా రి త్వ, ఆగంతు కత్వములు |
| 4. పరిపూర్ణము, అఖండము | న్న, న్న, చిత్రవిచిత్ర పరిచ్ఛిన్న స్వరూపములు |
| . సుఖస్వరూపము, ఏకము—— అద్వి యము | దుఃఖము, సద్వి ‌యత్వములు, పరి చ్ఛిన్నత్వములు |
| . సచ్చిదానంద లక్షణములు— | అనృత, జడ, దుఃఖములు— |

| | |
|---|---|
| 7. వినాశరహిత, నిర్వికారత్వములు | సవికారిత్వ — వినాశములు |
| . స్వప్రకాశము - నిత్యము | పరప్రకాశము—అనిత్యము |
| . స్వరూప సుఖము— | దుఃఖము—విషయసుఖాభాసము |
| . ప్రజ్ఞాన ఘనుడు, సుఖస్వరూపుడు | -వోపాధికుడు — సంసారి, దుఃఖి |
| . చిదాకాశము— | మహాకాశాది — -వ, జడోపాధులు |
| 2. నిర్విశేషము— | సవిశేషము |
| . . వాస్తవము— | అవాస్తవము భ్రాంతి—కల్పితము— |
| . పరిపూర్ణము | పరిచ్ఛిన్నము |
| . ఏకము, జననమరణరహితము | అనేకములు—జననమరణ సంసారచక్రము కలది |
| . సూర్యోదయాదస్తమయములు లేనిది- | సూర్యాస్తమయాది వ్యవహారకాలస్వరూపము |
| 7. కల్పాంతమందు నిర్విశేషముగనుండు సత్పదార్థము- | కల్పాంతమందు లయమొందు సృష్టి అసత్పదార్థములు |
| 8. ఆత్మయే శుద్ధ - వుడు బ్రహ్మసర్వాధిష్ఠానము— | ఆత్మ స్వరూపమైన యీ జీవునికే, జీవత్వము భ్రాంతి కల్పితము—అధ్యస్తము. |
| 19. అధిష్ఠానము ఏకము — అద్వి యము- | భిన్నభిన్నపరిచ్ఛిన్న సర్వోపాధులు అధ్యస్తములు— |

| | |
|---|---|
| 20. నిరుపాధిక పరిపూర్ణ చైతన్యము | సోపాధిక భిన్న, న్న, పరిచ్ఛిన్నో పాధి చైతన్యములు— |
| 2 . త్రివిధ పరిచ్ఛేద రహితము, అఖండము అపరిచ్ఛిన్నము— | చిత్ర, విచిత్ర, న్న, భిన్న,— పరిచ్ఛిన్నములు |
| 22. నిరవయవ, నిష్క్రియ, నిర్గుణ స్వరూపము | సావయవ, గుణ, క్రియా విశేషములు గల వస్తు సముదాయము— |
| 2 . ఆత —సహజవస్తువు— | స్థూల దేహ అంతఃకరణములు కల్పిత సూక్ష్మో పాధులు |
| 2 . ఆత అపరిచ్ఛిన్న సుఖ స్వరూపుడు—నిత్యుడు | అనిత్యములు, పరిచ్ఛిన్నములు, కల్పితములు—దుఃఖస్వరూపములు |
| 2 . కర్తృత్వ భోక్తృత్వములు లేని సుఖస్వరూపుడు— | కల్పిత కర్తృత్వ, భోక్తృత్వములు కలిగిన దుఃఖ స్వరూపము వత్వము |
| 2 . చిదాకాశము అధిష్ఠానము | మహాకాశాదులు అధ్యస్తములు— |

అని యిట్లు, ముముక్షువు అధిష్ఠానాధ్యస్తముల వైలక్షణ్యములను బాగుగ గ్రహించి అధిష్ఠానమైన తన వాస్తవ స్వరూపమును చిదాకాశముగ భావించుచుండవలెను — వుడు తన సత్యస్వరూపమును, వ్యవహార సాదృశ్యములతోడనే గ్రహించవలసి యున్నది. ఇట్టి వానిలో వునికి తన సత్య స్వరూపమైన చిదాకాశమునకు సన్నిహిత సదృశమైనది మహాకాశమే. కాని యిది వ్యవహారములోనిదే కావున ముముక్షు అనుసంధానమునకు యీ చిదాకాశ, మహాకాశములకు గల వైలక్షణ ములను గూడ గ్రహించ వలసి యున్నది. అట్టి భేదము లెవ్వి యనిన :—

| చిదాకాశము | మహాకాశము |
| --- | --- |
| . అధిష్ఠానము— | అధ్యస్తము |
| 2. నిత్యము అవినాశి—కల్పాంత ములందున, నిర్విశేషముగ శేషించు సత్పదార్థము—. | అనిత్యమై, కల్పాంతములందు నశించునది—అసత్పదార్థము— |
| 3. సహజపదార్థము-చైతన్యము | జన్యపదార్థము — జడము |
| . చిదాకాశము నిరవకాశమైనది, నిర్వికారి— | మహాకాశము — అవకాశము నిచ్చు స్వభావము కలది — వికారి |
| 5. స్వప్రకాశము— | పరప్రకాశము— |

ఇవిగాక మిగతా అంశములలో మహాకాశమే — చిదాకాశరూప బ్రహ్మకు అతిసన్నిహితమైనది. కాన ముముక్షువు తన అనుసంధాన సమాధ్య భ్యాసకాలములలో తన సత్యస్వరూపము నిరమల మహాకాశమువంటిదని భావన చేయుచు — దీనికి విలక్షణమైన తన, నిత ·త్వ, నిర్వికారిత్వ, పరిపూర్ణత్వ ములను గ్రహించుట యావశ్యకము — ఏలనన మహాకాశము ద్వైతకోటి లోని జన్యము - వ్యవహారములోని భూతకోటిలోనిది. కాన కల్పాంతమున, నశించునది — తాను నిర్విశేషముగ శేషించువాడు పరిపూర్ణుడు. ఇంకనూ వికా రిత్వములు తనకులేవు. కాని ఆకాశము అవకాశమిచ్చు వికార స్వభావముకలది. కాన యిట్టి లక్షణములు తనయందులేక తాను మహాకాశము వంటివాడయిన నిత ·, నిర్వికార, పరిపూర్ణస్వరూపుడనని అనుసంధానాదులను ముముక్షు వభ్య సించుచుండవలెను — అప్పుడు తన పరిపూర్ణలక్షణములను ముముక్షు విట్లు అనుసంధానముచేయుచు తన వృత్తిని బ్రహ్మాకారాకారితముగ నొనరించు టకు తన సత్యస్వరూపమునిట్లుధ్యానించుట పరమప్రాప్తిసాధనము:—

శ్లో॥ చిదాకాశ స్వరూపోహం । సచ్చిదానందలక్షణః ।
నిత స్సర్వగతస్థాణు ఒరచలో ఒయంసనాతనః ॥

అని నిరంతరము భావన చేయుచుండవలయును — ఇదియే బ్రహ్మ భావన — చిదాకాశమన్ననూ, బ్రహ్మయన్ననూ, జీవుని సత్యస్వరూపమన్ననూ యొక్కటియేయని గ్రహించవలయును —

చిదాకాశస్వరూపము —— సర్వోపాధివినిర్ముక్త, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, జగదుత్పత్తి స్థితిలయ వివర్తకారణ, త్రికాలాపరిచ్ఛిన్న, త్రివిధభేద రహితమై, కల్పాంతమందు నిర్విశేషముగనుండునట్టిన్నీ — సూర్యోదయ సూర్యాస్తమయ రహితమైనట్టిన్నీ. మహాకాశమున కాధారమైనట్టిన్నీ, నిత్య, నిరతిశయ, అద్వి య, అసంగ, అఖండ, పరిపూర్ణమై తన్యాధిష్ఠానము- చిదాకాశమన్ననూ బ్రహ్మ యన్ననూ యొక్కటియే. ఇట్టిచిదాకాశ స్వరూపమే జీవునియొక్క వాస్తవస్వరూపము. దీనిని తెలిసికొని స్వానుభవమునొందుటయే జీవిత పరమావధి, మోక్షప్రాప్తియగుచున్నది — ఇదియే జీవుని అద్వైత సిద్ధికి సారాంశము. ఇంకనూ జీవుడు వాస్తవమున ప్రజ్ఞానఘనుడు - ఇట్టి తన సత్యస్వరూపమును బడయుటకు "ఓం, ప్రజ్ఞానఘనః, ప్రత్యగర్థో బ్రహ్మైవాహమసి" అని అర్థసహితానుసంధానమును చేయుచుండవలయును. పైవాక్యమున కర్థమేమనిన :— — అహం, నేను ఓంకారవ్యాచ్యుడై, ప్రజ్ఞానఘనుడై, సర్వులఅంతరమున ప్రత్యగాత గా తెలియబడుచున్న బ్రహ్మను - అని తెలిసికొని అనుసంధానాదుల నాచరించుచుండుట శ్రేష్ఠఫలదాయకము — ప్రజ్ఞానఘనుడనగా సర్వోపాధివినిర్ముక్త, సర్వాధిష్ఠాన, స్వప్రకాశ అఖండ పరిపూర్ణమై తన్యస్వరూపము అనిగ్రహించవలెను - జిజ్ఞాసువు తన మనోవృత్తిని యిట్టి నిర్వికార అఖండ, పరిపూర్ణాకారమును పొందించుటయే, బ్రహ్మాఖండాకార వృత్తియనబడును. ఇదియే ముముక్షువునకభ్యాసామృతము - శ్రేష్ఠమోక్షదాయకమగును. జీవుడు వాస్తవమున తాను అఖండ, పరిపూర్ణజ్ఞానస్వరూపుడు — కాని తాను అవిద్యావివశుడయి తన పరిపూర్ణత్వమునుమరచి, పరిచ్ఛిన్నత్వము నంగీకరించుటచే యీ సంసారమంతయూ జీవునకు కలుగుచున్నది. కావున జీవున కీసంసారదుఃఖము ఆత్యంతికనివృత్తియగుటకు జీవుడు తాను మరచిన తన సత్యజ్ఞానానంతలక్షణములను గుర్తించి స్వానుభవమునొందవలయును. ఇట్టి అనుసంధానాభ్యాసాదులే ముముక్షువునకు సాక్షాన్మోక్షసాధనమై ముక్తి నొసంగును.

# అద్వైతానుసంధాన వివేచన

అద్వైత మనగా ద్వి య పదార్థములేనిది. అనుసంధానమనగా యొక వస్తువును తిరిగి, తిరిగి, యనుకొనుచుండుట. ఇట్టి అనుసంధానము ద్వైత స్ఫురణ యున్నగాని సంభవింపదు. ఈ ద్వైత స్ఫురణ మనునది పర మార్థతః కల్పితము. ఈ అనుసంధానమనునదిగూడ ముముక్షువునకు తన పరమార్థ సిద్ధికిగాను శాస్త్రము బోధించుచున్న యొక కల్పితోపాయము. ఈ సాధనోపాయముచేత ముముక్షువు తన వాస్తవ స్వరూప సాక్షాత్కారమును అనగా, అద్వైత సిద్ధి నొందవలయును. ఎట్లన, లోక వ్యవహారమునందు గూడ, విగ్రహములు పోతపోయువాడు తనకు కావలసిన విగ్రహమునకు గాను మొదలు ఆ విగ్రహాకారమును తన మనసున కల్పించుకొని, ఆ స్వరూ పమునే, మృత్తుతో మూసను తయారుచేసి అనగా కల్పించి, ఆ మూసను తనకు కావలసిన విగ్రహమును పోతపోయుటకు వాడి, తనకు కావలసిన లోహ విగ్రహమును సంపాదించి కల్పిత మూసను వదలివేయునుగదా! ఇంకనూ పెద్ద నదీప్రవాహములకు ఆనకట్ట ( am) కట్టుటకు, ముందు మట్టికట్ట (Co er am)ను కట్టి దానితో నీటి ప్రవాహమును బంధించి రాతి కట్టడములతో ఆనకట్టను నిరా ణముచేసి, కట్టుట పూర్తి అయిన తరువాత (Co r - am) కల్పించిన మట్టి కట్టను ◦సివేసి అసలైన రాతి కట్టడపు ఆనకట్టను స్థిరముగ నుపయోగించుచు వారి కార్యసిద్ధిని బడయుచున్నారు. తదుపరి తమ కార్యసిద్ధికి కల్పించిన మట్టికట్ట (Co er am)తో నవసరము లేదు. పై యుదాహరణములు రెంటిలోను ప్రధానముగ వారు సంపాదించ దలచినది లోహ విగ్రహము, రాతి కట్టడపు ఆనకట్టయూ నైననూ, వారి కార్యసిద్ధికిగాను లోహ విగ్రహము కావలసినవాడు మట్టి మూసనూ, స్థిర మైన ఆనకట్ట కట్టుటకుగాను మట్టికట్టను కల్పనాసాధనములుగ మొదలు నిరి ంచుకొని, వారి కార సిద్ధిని పొందుచు, తదుపరి వాటిని వదలివేయు చున్నారో అట్లే యీ అద్వైతానుసంధానపరుకుగూడ కల్పితమై, ద్వైతముతో

స్ఫురించుచున్న తన వృత్తి సహాయముతో అనుసంధానాదులను చిరకాలము చేయుటవల్ల, తన పరమ ఫలమునకు లక్షముగాని తన వృత్తిగూడ మూసలో లోహము కరగిపోయగనే, ఆ స్వరూపమునిచ్చి మూస యెట్లు నిష్ప్రయోజనమగుచున్నదో అట్లే యీ బ్రహ్మాభ్యాసికి కాలక్రమమున స్వస్వరూప సాక్షాత్కారము నొసగి వృత్తి, తాను నిష్ప్రయోజనమగును. ముముక్షువు తన ఫలసిద్ధి పర్యంతమూ, కల్పితమైననూ యీ తన వృత్తినే, తన అనుసంధానాదులకు సాధనముగ గ్రహించవలెనుగాని వేరు దారిలేదు. సమస్త శాస్త్రబోధయునూ, వ్యవహారదశయందు సాధకునకు తెలుపబడినదేగాని, సిద్ధావస్థయైన అద్వైత పరమార్థ స్థితిలో నేమియునూలేదు. కావున ముముక్షువులు, తమ అద్వైత సిద్ధిని పొందుటకు అనగా సంపాదించుటకు యీ అనుసంధానమను శాస్త్రప్రక్రియను ముఖ్యసాధనముగ గ్రహించి, తమ అద్వితీయ స్వస్వరూప సిద్ధికి సతతాభ్యాసము చేయుచుండుట వివేకము, పరమశ్రేయోదాయకము. ఇట్టి అభ్యాసకుడు కాలక్రమమున భ్రమరకీటక న్యాయమునను సరించి అద్వితీయ సాక్షాత్కారము నొందునని శాస్త్రము తెలుపుచున్నది. బ్రహ్మజ్ఞానాభ్యాసకునకు శాస్త్రము ప్రమాణముగాని వేరొండు కాజాలదు. కావున యీ అనుసంధాన మనునది ముముక్షు యిష్టసిద్ధికిగాను శాస్త్రము చెప్పుచున్న యొక వ్యవహారప్రక్రియ, యని గ్రహించి నిస్సంశయముగ దీనిని ప్రీతి నిశ్చయములతో నభ్యసించుచుండుటయే ముముక్షువునకు తన పరమార్థ సాధనము. సిద్ధునికి అనగా పరమార్థ స్థితియందు అనుసంధానాభ్యాసాదులతో పనిలేదు. అట్టి స్థితియందు సాధకుడుగాని, సాధించవలసినదిగాని నేమియూ నుండదు. ఏలనన అప్పుడు సమస్తమును ఒక్కటియైన అఖండాద్వయ పదార్థమే యగును. ఇదియే పరమార్థస్థితి. ఇట్టి స్థితియందు,

శ్లో॥ ననిరోధోనచోత్పత్తి ర్నబద్ధోనచసాధకః ।
సముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా ॥

అనగా సృష్టి ప్రళయములుగాని, బద్ధుడనిగాని, ముక్తుడనిగాని, ముక్తి ప్రయత్నించు సాధకుడనిగాని, ముముక్షువనిగాని, నేమియునూ యుండవు. ఈ వ్యవహారము లన్నియూ కేవల కల్పితములు తప్ప పరమార్థమున లేవని భావము. ఇంకనూ పునకు,

"వాస్తవౌ బంధమోక్షౌతు శ్రుతిర్న సహతేతరామ్" అనగా వాస్తవమైన బంధ మోక్షములను శ్రుతి యెంతమాత్రము సహించదు, అని పంచదశి కారులైన విద్యారణ్యస్వామి శ్రుతుల నాధారముచేసుకొని తెలుపుచున్నారు.

# సంక్షిప్త అనుభవవాక్యములు

మానవుని పరమార్థస్వరూపము ఆత్మ — ఈ ఆత్మ స్వరూపము పరమ సుఖము. పరమసుఖ మనగా యెప్పటికినీ నశించని నిత్య సుఖస్వరూపము —

కనుకనే "ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతిపూరుషః, కిమిచ్ఛన్ కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్", "తరతిశోకమాత్మవిత్" అనురెండు శ్రుతివాక్యములునూ పరోక్షముగా తెలిసికొన్న జ్ఞానమును అపరోక్షముగా గ్రహించి యీ ఆత్మ ను తాను అనగా నేనే, అని యే పురుషుడు తెలిసికొనునో అట్టివాడు నిష్కాముడై సంసారదుఃఖమును దాటును, అను తాత్పర్యార్థమును తెలుపుచున్నవి. శ్రీపంచదశికారులు పరోక్షముగనున్న జ్ఞానమునుఅపరోక్షముగ చేయునట్టి యీ "ఆత్మానంచేత్" అనుశ్రుతివాక్యబోధనే ముఖ్యముగ తృప్తిదీపప్రకరణమందు అనుభవదృష్టాంతములతో తెలిపియున్నారు — ఈ ఆత్మ పరమసుఖస్వరూపము, స్వానుభవైక వేద్యముకాని మరొకటికాదు- ఇట్టిస్వానుభవముగలుగుటకు గురుశాస్త్రబోధయెంతయున్ననూ ముముక్షువునకు తాను శ్రుత్యుక్త్యనుసారముననచేయు స్వానుభవవివేచన, విచారణలు, తనకు బాగుగ నిశ్చయాపరోక్షజ్ఞానముకలుగుటకు సహకరించును. ఇట్టి జ్ఞానము మానవునికి తన పరమార్థ స్థితిని తెలుపుచూ జ్ఞానదార్ఢ్యమునిచ్చును. మానవుడు తన పరమార్థస్థితిని వ్యవహారసాధనములవల్లనే పొందవలయునుగాని అన్య మార్గములేదు — ఇచట వ్యవహారమనగా తన అంతఃకరణోపాధియని

గ్రహింపవలయును. వ్యవహారమునకు అనుభవము బలము. శాస్త్రమెంత బోధించిననూ జీవుడు తన వ్యవహారానుభవమువల్లనే అనగా జ్ఞానమువల్లనే తన నిత్యానిత్యవివేకమును బాగుగపరిశీలించి గ్రహించగలుగును. ఇట్టి నిత్యానిత్యవివేకజ్ఞానము జీవునికికలిగినగాని తనకు తరణోపాయము కలుగదు. కాన శ్రుతియుక్తముగ తన అనుభవవిచారణలు ముముక్షువున కధికోపయోగముగ నుండును.

ఈ వేదాంతశాస్త్రమనునది జీవునకు అనుభవశాస్త్రమగుచు, తన నిత్య నిరతిశయసుఖమును తెలుపుచున్నది. ఇది స్వానుభవైక వేద్యము కాని, పర ప్రత్యక్షాదులవల్ల తెలియబడునదిగాదు. కాన ముముక్షువునకు శ్రవణానంతరము స్వానుభవవివేచన, మననాదులు, అత్యావశ్యకమగుచున్నవి. గనుక యింతవరకుచేసిన మన గ్రంథవిచారణ, మననాదులనుబట్టి అధికారియైన ముముక్షువు, తన అనుభవవిచారములవల్ల యిట్లు తెలుసుకొనుటచే, తన జ్ఞానానుభవమునకు మిక్కిలి సహకరించును. ఎట్లన వివేకియైన ప్రతిమానవుడును తనదేహము, మనస్సు, లేక అంతఃకరణము, ఆత్మ, యనునవి యున్నట్లు తలచుచున్నాడు. ఇందు తన దేహము తన లోకానుభవమును బట్టియే, ఏదోయొకరోజున దహనసంస్కారమునొందుననియూ అందువలన గూడా తనకు యీ దేహము కాష్ఠతుల్యమేననిగదా మానవుడు తలచవలయును. ఇట్లుండ తనదేహము, దహనసంస్కారమైనప్పుడు మిగులునది తన అంతఃకరణమను సూక్ష్మ దేహము, ఆత్మయూఏ సదా, కావలయును. ఇందు యీ అంతఃకరణమనునదిగూడ, మన యుక్త్యనుభవవిచారములచేతనే యిది కల్పితము, మిథ్యాపదార్థమనిగూడ తెలిసికొనియుంటిమిగదా — మిథ్యా, కల్పితవస్తువేదియైననూ తాత్కాలికముగనున్నట్లుతోచునేకాని యెప్పటికైననూ లేనిదేకదా కావలయును. ఇట్టిదానిని వాస్తవముకాదని తెలిసికొనుటయే ముముక్షు కర్తవ్యము. కాని స్థూలదేహమువలెగాక యీ అంతఃకరణోపాధి, వివేకులను సహితము, తానుగూడ సత్యమైన ఆత వలెనే, తాను సత్యమైనదాని

వలె, జీవులకు తోపింపజేసి వారిని సంసారనిమగ్నులను చేయుచున్నది. ఇదియే జీవభ్రాంతి. కాన లోగడ మనము ఆత్మాంతఃకరణధరములవైలక్షణ్యములను పరిశీలించి యీ అంతఃకరణోపాధి, వల ప్రారబ్ధకర్మఫలానుభవముకుగాను కల్పితమైనయుపాధి యనిన్నీ, మిథ్యయనిన్నీ గూడ తెలిసికొనియుంటిమి. ఇట్టి కల్పితాంతఃకరణమునుగూడ స్థూలదేహముతోబాటు, మనము జ్ఞానపూర్వకముగ త్యజించిన యెడల మిగులునది తననిత్యమైన ఆత్మ యొక్కటియేగదా. అట్టి సత్యాత్మయే తన వాస్తవస్వరూపమని, ముముక్షువు తెలిసికొని, స్వానుభవమునకుగాను తత్స్వరూపమును తానుగనే అనుసంధానాభ్యాసాదులను చేయుచుండుట స్వానుభవమునకు సులభముగనుండును. ఇట్టి జ్ఞానముగలవానికి తన అంతఃకరణము నాశ్రయించుకొనియున్న అహంకార, మమకారములు నశించి, ప్రకాశించుదీపముచేతిలోగలవానికి చీకటియెదుట నుండ నేరనట్టుల యుండజాలవు. అనగా జీవునికి తన సత్యజ్ఞానానుభవమువల్ల యవి నశించును. అనగా జీవునికి తన యథార్థస్వరూపజ్ఞానమువల్ల యవి నశించును.

ఇంకనూ మహావాక్యము ముముక్షువుచే "అహంబ్రహ్మాస్మి" యని తెలిసికొనిన అహం (నేను) అనుప్రతీతి తన వాస్తవస్వరూపమైన ప్రత్యగాత్మయే, బ్రహ్మ అని తెలుపుచూ ఆ బ్రహ్మను "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" అని స్వరూపలక్షణములచే తెలుపుచున్నది. గనుక అవియే తన సత్యస్వరూపలక్షణములని ముముక్షువు గ్రహించి యనుభవమును పొందవలసియున్నది. కాన జ్ఞానంసత్యం, జ్ఞానమనంతం, అనగా సత్య శబ్దముచేత, నిత్యమైన జ్ఞానమనిన్నీ అనంతశబ్దముచేత పరిపూర్ణజ్ఞానమనిన్నీ గ్రహించి నిత మనగా యెన్నటికిన్నీ నశించనటువంటిదనిన్నీ, వికారరహితమైనటువంటిదనిన్నీ, పరిపూర్ణమనగా బాహ్యాభ్యంతరములయందంతటను నిండియుండునటువంటిదనిన్నీ తెలుసుకొని యిట్టి పరిపూర్ణనిత్యజ్ఞానమే నేను అనగా తన సత్యస్వరూపమనిన్నీ ముముక్షువు గ్రహించిన తన సత్యస్వరూపానుభవమునకు సులభసాధనముగనుండును.

ఇదిగాకనూ శ్రుతి ఆ బ్రహ్మ సచ్చిదానందరూపుడు అనియూగూడ తెలుపుచున్నది. ముముక్షువు ఆ స్వరూపమే తనది అనగా నాదియని అను సంధించి తెలుసుకుని అనుభవమును పొందవలయును. అందులకుగాను అధి కారియైన ముముక్షువు యిట్లు గ్రహించిన, సులభసాధ్యముగనుండును. ఎట్లన ఆ బ్రహ్మ సత్, చిత్, ఆనంద రూపుడనియేగదా తెలియుచున్నది. అట్టి బ్రహ్మ తాను అనగా నేను, అని తెలిసికొనుట యెట్లనిన లోకవ్యవహారము నందు కేవల "సత్" శబ్దము చేతనేగదా సమస్తము తెలియబడుచున్నవి. అట్టి సత్ శబ్దముచేతనే సర్వులును వారు, వారు, నేను ఉన్నానని తెలిసికొను చున్నారుకాని, నేను లేను అనిగాని, నన్ను నే నెరగననిగాని యెవ్వరునూ చెప్పుటలేదు. ఇందుచేతనే తాను సదంశమైన నిత్యుడనియూ, చిదంశమైన స్వప్రకాశుడనియూగూడ గ్రహించవచ్చును. తనను తాను తెలిసికొనుటకు యెవడునూ పరబోధనుగాని, ప్రకాశమునుగాని అపేక్షించుటలేదు. ప్రతి మానవుడును తనను తాను సర్వకాల సర్వావస్థలయందును తనను తానే గుర్తిం చుచు తెలిసికొనుచున్నాడు. నిత్య అనగా "సత్" శబ్దముచే వునికి తాను లేని కాలముగాని, దేశముగాని, వస్తువుగాని యుండుటకు వీలులేదనియూ, "చిత్" శబ్దముచే తాను స్వప్రకాశుడు గనుక సర్వము తన ప్రకాశము అనగా జ్ఞానముచేతనే తెలియబడుచూ ప్రకాశించుచున్నది. తాన, తాను అంతటనూ పరిపూర్ణముగ, తన సత్యస్వరూపమున యున్నట్లు తెలిసికొనవలయును. ఏలనన తన సత్యస్వరూపమైన జ్ఞానములేని కాలముగాని, దేశముగాని, వస్తువుగాని, కనబడుటలేదనిన్నీ, తాను, సర్వదా పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడనే నని తెలిసికొనవచ్చును. అయిననూ ఆనందాంశమును గురించి, యీ ఆనం దానుభవము సర్వులకున్నూ నాకున్నూగూడ సర్వదా కలుగుట లేదుగదా. ఇట్లుండుటచే, ఆయనయైన నేను ఆనందస్వరూపుడనని తెలిసికొనుట యెట్లను సంశయమును, ముముక్షువు చెందకూడదు. ఏలనన యే వస్తువు యందైననూ యున్న అంశములన్నియూ, ఒక్కసారిగనే తెలియబడవలెనను నియమము లేదు. దీనిని గురించి లోగడ విచారించి నిశ్చయించియుంటిమి. అయిననూ

ఆనందాంశమునుగూడ యిట్లు అనుభవరూపముననే తెలిసికొనవచ్చును. ఎట్లన, ప్రీతియే ఆనందాంశము. ప్రీతి యానందములు రెండునూ కలసియే యుండును. ఈ ప్రీతి సర్వులకునూ, వారి, వారికి అన్నిటికన్ననూ తమ యందే యెక్కువగ కలుగుచున్న విషయ మందరకున్నూ తెలిసినదియే. కాని ప్రీతి అధికమైనప్పుడు యీ ఆనందాంశము బాహ్యమునకు స్ఫురించు చుండును. లేనియెడల స్వస్వరూపమున ప్రీతిరూపమున తనయందే యుండును. ప్రతిప్రాణికియున్నూ యిట్టి ప్రీతి యానందములు తనయందే యుండుటచే సర్వ జీవులు అన్నిటికంటెను తమనే ఎక్కువగ అనగా సర్వాధిక్యముగగూడ ప్రేమను పొందుచున్నారు. ఇట్లు సర్వ ప్రాణుల హృదయమందున యుండి, సర్వదా తనను తాను తెలిసికొనుచు, అన్నిటి కన్ననూ అధిక ప్రేమను తనయందే పొందుచున్న పదార్థమే ఆత్మ. ఇదియే ప్రతి జీవుడునూ నేను, నేను అని తలంచుచూ ప్రేమించుచున్న సత్యపదార్థము. నేను అనుకొను తన వాస్తవ స్వరూపమేగదా యాత్మ. ఈ ఆత్మ యిట్టి సత్, చిత్, ఆనంద స్వరూపుడై ప్రతి జీవియందు యుండుటచేతనే ప్రతివారికినీ అన్నిటికన్ననూ తమ, తమ యందు మాత్రమే పరమ ప్రీతి కలుగుచున్నది. ఇట్లు కలుగని జీవి యేదియునూ లేదు. గనుక ప్రతి జీవికి యున్నూ యిట్లు పరమప్రీతిగా తోచుచున్న ప్రీతియే ఆనందస్వరూపము. తనయందు తన కన్నిటికన్ననూ పరమ ప్రీతిలేని జీవియే లేదు. అందుచే యీ ఆనందము సర్వత్రయూ నున్నదని యొప్పుకొనక తప్పదు. కనుక యిట్టి ఆనందము అనంతము. కాని యిచట యొక సంశయమునకు అవకాశ మున్నది. అది ఏదియన ఆత్మ ఒక్కటియై, ఆయనయే సర్వజీవులయందును యున్నప్పుడు ఆయన స్వరూపమే అయియున్న, యీ ప్రీతి ఆనందములు ఒక్క తనయందే ప్రతి జీవికియున్నూ కలుగుచున్నదిగాని, సర్వ జీవులును ఆత్మ స్వరూపమైనయెడల అన్నిటియందున, అందరియందున, తనయందు కలుగుచున్న ప్రీతి సమానముగా కలుగవలసినదేగదా? ఎందులకు కలుగుట లేదు? తనయందు మాత్రమే యెందుకు కలుగుచున్నదని తోచుట

న్యాయమే — వాస్తవము విచారించిన అట్లు కలుగవలసినదే—ఇట్లు సర్వాత్మ భావము కలుగకుండుటయే, జీవుని అనాది భ్రాంతి - అనాదిమాయాప్రభావముచే జీవుడు తన పరిపూర్ణత్వమునుమరచి తాను పరిచ్ఛిన్నభ్రాంతిని పొందినవానివలె కనబడుచు నానాజీవానుభవములను పొందుచున్నాడు. ఇదియే అధ్యాస. ఈ అధ్యాసచే ప్రతిజీవియు తన శరీరోపాధిమాత్రము తానని భ్రాంతియుతుడై యితరోపాధులను అన్యముగా చూచుచున్నాడు. ఇట్టి జీవుని పరిచ్ఛిన్నభ్రాంతిని తొలగించి తన పరిపూర్ణస్వరూపమును పొందుటే యీ విద్యావిచారణల ప్రయోజనము — అట్టి ప్రయోజనమునుపొందిన వునకు తనయందుకలుగు ప్రీతియే సర్వజీవులయందునూ కలుగును. అప్పుడు తన సర్వాత్మకత్వముతెలసి తాను యీ సచ్చిదానందస్వరూపుడేయగును - కాన ముముక్షువు యిట్టి సచ్చిదానందములు, సత్యజ్ఞానానంతలక్షణములు తన స్వరూపమేననిగ్రహించి, సర్వదా అనుసంధానాదులను స్వానుభవసిద్ధికిగాను యుచుంతవలయును —

మరియునూ శ్రుతి "ఏకమేవాద్వి యంబ్రహ్మ" "నేహనానాస్తికించన" అనిన్నీ యింకనూ "సఆత్మా" "తత్త్వమసి" అని జీవునికి తెలుపుచున్నది. అనగా వాస్తవమునయున్నది ఆబ్రహ్మయొక్కడే - తదితరమేమియున్నూ లేదు. ఆయనయే ఆత్మ — ఆయనయే నువ్వు అని చెప్పునప్పుడు, యెవరిఆత్మ వారిలోనేయుండగా యీ ఆత్మ ఒక్కడెట్లగును. ఆఒక్కడైన ఆత్మ నేనెట్లగుదునను సంశయము నిట్లు నివర్తింప యవలయును. లోకానుభవమున ప్రతి మానవుడునూ తానున్నచోటనే, యొకొక్క పరిమితాకారమైన సూర్య బింబమును చూచుచున్ననూ, లోకమునంతకునూనున్నది యొక్కసూరుడే గాని అనేకసూర్యులులేరని యెట్లు తెలుసుకొనుచున్నామో అట్లే యీ పరమాత్మ యొక్కడే అయియున్ననూ సర్వజీవులయందు ప్రకాశించుచున్న సమష్టిరూపముగ సర్వాత్మగనూ, ప్రత్యేకదేహోపాధులయందు అనగా ప్రతి జీవియొక్క హృదయకమలమందు ఉజ్వలప్రకాశుడై సూర్యునిలాగున తెలసికొనబడునది ప్రత్యగాత్మగను తెలియబడుచున్నాడేగాని ఆయనయే

సర్వదా సర్వులయందును, సర్వపదార్థముల బాహ్యాంతరముల పరిపూర్ణుడై
యున్నాడు, యీ పరమాత్మయొక్కడేనని తెలిసికొనవలయును — కాని జిజ్ఞా
సువు లిచట యిట్టిసంశయమును పొందకూడదు — ఆయన యొక్కడే యైనను
యెడల, సుఖదుఃఖములుగూడ అందరకునూ యేకకాలమం దొ విధముగ
తోచుచుండవలయునుగదా యను అల్పయుక్తి ననుసరించకూడదు ఏలనన
యీ సుఖదుఃఖధర్మములు అంతఃకరణధర్మములుగాని ఆత్మధరములుకావని
లోగడనే సయుక్తికముగ తెలుపబడెను అయినను అట్టి ధర్మములు, విడి
విడిగా కనబడుటలేదేయనిన దానికి జీవుని అనాదిభ్రాంతియే కారణము. ఎట్లన
వివిధప్రదేశములయందున్న మానవులు, ఆయా స్థానికపరిస్థితులనుబట్టి
సూర్యుడు యీ రోజున రాలేదనియూ, సూర్యునికి మేఘము పట్టినదనియూ,
మొదలగునవి యనుకొనుట అందరకున్నూ తెలిసిన విషయమే. కాని వాస్త
వము విచారించిన సూర్యుడు వచ్చుటగాని, పోవుటగాని, యీ మేఘము ఆ
యనను పట్టుటగాని యేమియునూ జరుగుటలేదు. ఈ మేఘములకునూ ఆ
సూర్యునికినీ సహస్రయోజనముల దూరముండును. అయినను మన కంటికి
కట్లగుపడుచుండుటచే యిట్లు వ్యవహరించుచున్నాము. ఇంకనూ సూర్య
గ్రహణమందు రాహువు సూర్యునిపట్టుకున్నాడను యొకభ్రాంతి వ్యవహారము
న్నదిగదా — నిజమాలోచించిన యీ రాహువు సూర్యునికన్న చాలా అల్పుడు.
ఆయనదగ్గరకు కూడ పోగల సమర్థుడుకాడు. కాని సూర్యునికి, కోటియోజన
ములదూరముననున్న మానవులకు-గ్రహసంచారములవల్ల, మనముండు దేశ
మందలి సూర్యబింబమునకు అడ్డమురాగానే ఆ సూర్యుడు రాహువుచే పట్టుబడి
నవానివలె మనము గాంచుచున్నాము. కాని వాస్తవమున రాహువు సూర్యుని
పట్టుకొనుటయేలేదు ఒక్కడుఅయిన సూర్యునకు యీవికారములు (మార్పులు)
అన్నియూ ఆయా ప్రదేశములయందు కలుగుచున్న వాతావరణస్థితులనుబట్టి
ఆయనయందు మనమారోపించుచున్నాము. ఇట్లే జీవులయొక్క వివిధోపాధి
ధరములు, ఆత యందు కలుగుచున్నట్లు జీవుని అనాది భ్రాంతిచే తోచు
చున్నదేకాని, వాస్తవమున ఆ పరమాత్మ ఒక్కడై సర్వప్రకాశకుడుగానుండి
తానెట్టి వికారములను పొందకుండగనే సర్వమునూ, సర్వజీవులను వారి, వారి
ప్రారబ్ధానుసారమున ప్రకాశింపజేయుచున్నాడని, నిశ్చయముగ గ్రహించ
వలెను—

మరియును ముముక్షువగువాడు తాను యిప్పుడు అనుభవించుచున్న శరీరము, అనుభవాదులు, అన్నియూ తన ప్రారబ్ధకర్మ ఫలానుభవముకు గాను కల్పితమై తనకు ప్రాప్తించినవేకాని, యీ శరీరముతోగాని, యీ శరీరానుభవములతోగాని తనకెట్టి వాస్తవ సంబంధములేదని గ్రహించవలయును. తన పురాకృతపుణ్య అభ్యాసపాటవములచే ఇట్టి గ్రహణనిశ్చయములు కలిగినను, జీవుడు యిప్పుడు ప్రారబ్ధవశుడు గనుక తన స్థూలదేహ, అంతఃకరణ తాదాత్మ్యములు వదలిపెట్టవు. అందుచే మోక్షార్థియైనవాడు—బాగుగ తనకు యీ దేహ, ప్రపంచములతో యెంతమాత్రము వాస్తవసంబంధములేదని తనను తాను అనగా యీ నేను అనునది యెవరు, ఎట్టిదియని తెలిసికొనిన, తనకు యిప్పుడు తన దేహానుభవములయందుండు సక్తత క్షీణించి తన స్వస్వరూపాభ్యాసాదులకును, ముక్తికిని సాధనమగును కాన ముముక్షువు మనము లోగడ విపులముగాచేసిన అహం పదార్థవిచారణనుబట్టియైనన్ని, తన యనుభవమునుబట్టి గూడ యీ నేను అనునది వాస్తవమున యేదియని తెలిసికొనవలయును. ఇట్లు విమర్శించి చూచిన ప్రతివారికినీ యీ నేను, నేను, అను ప్రతీతి తనలోనే కలుగుచున్నదిగాని బాహ్యమందెవరికినీ కలుగుటగాని గోచరించుటగానిలేదు గదా — అట్టిచో తన దేహములో యీ నేననుకొను పదార్థమేదియని విచారించి చూచిన వాస్తవముగ నేను, అనుకొనదగిన పదార్థమేదియూ కనబడుటలేదు. కాని సూక్ష బుద్ధితోడ, విచారించిన, నేను అనునది యేదోయొక పదార్థము ఆకాశములాగున అమూర్తముగ తోచుచున్నదని గ్రహించవచ్చును. అయినను ఆకాశము జడమైనందున తనకు ప్రకాశము అనగా నేను అని తననూ తదితర సమస్తమునూ గ్రహించుసామర్థ్యమును నాకిచ్చుశక్తి, జడమైన యీ మహాకాశమునకెట్లుండును? అనగా యుండదు — కాని నాలో ఆకాశమువంటి పదార్థమే మరియొకటి తోచుచున్నది. అదియే పరిపూర్ణాకాశమై యుండవలెను. అట్టి పరిపూర్ణాకాశపదార్థమునే మహాకాశమువంటిదని, నేను యిప్పుడు యుపాధిస్థితుడనై యుండుటచే భ్రాంతినొందుచున్నాను — ఏలనన శ్రుతులు నేను నిత్య పరిపూర్ణ అఖండస్వరూపుడనని తెలుపుచున్నవి - నేను పరిపూర్ణ

డనుకదా : కాన యిదియే నాలోనున్న చిదాకాశముగ నుండవలెను. అయినను యిట్టి నా చిదాకాశపరిపూర్ణస్వరూపమునే, నేను అను యీ పరిచ్ఛిన్న శరీరాధ్యాసముతో భ్రాంతుడనై వ్యవహరించుచున్నాను - కాని వాస్తవమున నేను నాలోని పరిపూర్ణస్వరూపుడనే కావలయును - ఇదియే నా వాస్తవ స్వరూపము -- ఇందువలననే నేను జ్ఞానవంతుడనై యున్నాను — జ్ఞానమే నా వాస్తవస్వరూపము కావలయును — నాలో జ్ఞానస్వరూపుడై స్వప్రకాశముననున్న చిదాకాశస్వరూపుడనే, నేను కావలయును గాని. అన్యమగుటకువీలులేదు—చిదాకాశమేకానిచో నాకు నేను అను ప్రకాశమును మరియొక పదార్థమివ్వజాలదు. కాన నేను అనునది పరిపూర్ణమై నాలోయున్న చిదాకాశమేయని స్పష్టపడుచున్నందున నా స్వరూపము పరిచ్ఛిన్నముగా నున్నదనుకొనుట భ్రాంతియే కావలయును గాని వాస్తవమెట్లగును? ఇదిభ్రాంతి. అందుచే నాయందునూ, సర్వోపాధులయందును, అభిన్నముగానుండి ప్రకాశించుచున్న యీ జ్ఞానస్వరూపమైన పరిపూర్ణచిదాకాశమే నేను అనిగ్రహించవచ్చును. చిదాకాశమన్ననూ బ్రహ్మయన్ననూ యొక్కటియే.

ప్రతిమానవునకున్నూ సర్వానుభవములు యీ నేను అను ప్రతీతితోనే కలుగుచున్ననూ, వివేకి తన అనుభవమునుబట్టియే, యీ నేను అను ప్రతీతి, కల్పితమాత్రమనియూ. వాస్తవముకాదనియూ, యిట్లు తెలిసికొనవచ్చును. వివేకులందరికినీ నేను అనునప్పుడు స్ఫురించుచున్నవి యేవనిన:-తనదేహము, అంతఃకరణము, ఆత్మయేకదా—ఈ మూడింటియందున దేహము కేవల జడమగుటవల్లనూ, ఆత్మ అపరిచ్ఛిన్నదృక్స్వ సర్వోపాధ్యధిష్ఠాన పరిపూర్ణుడగుటవల్లనూ వీని రెండింటికినీ యీ పరిచ్ఛిన్నోపాధియైన దేహమును నేను అని వాస్తవమున యనుకొనుట అసంభవమునూ, అనుచితమేకదా కావలయును — అట్టికరి మిగిలియున్నది తనయొక్క అంతఃకరణమను సూక్ష్మోపాధి యొక్కటియేకదా, ఇదియునూ జడమేకాని సాభాసముగానున్నది. ఈ భాసము అనగా ప్రకాశము ఆత్మ ధర్మముకాని తన్నదికాదు. అందుచేతనే ఆభాసుడనుపేరు కలి

గినది. ఈ ఆభాసుడను నామముచేతనే వాస్తవముకాదని తెలియుచున్నది. లోకములోగూడ నెవరినైనను వీడు యుత్తఆభాసుడనునప్పుడు వీడు దొంగ లేక మోసగాడను అర్థములోనేగదా వాడుచున్నారు. ఇట్లే యీ సాభాసాంతఃకరణము, లేక ఆభాసుడనువాడును యిట్టివాడేకాని వాస్తవుడుకాడు. అనగా తను వాస్తవమునకానిదినీ లేనిదినీ, యున్నట్లుగా కల్పించుకొని, తనకు వాస్తవముగా యున్నట్లుచూపువాడు. ఇంతకన్న మోసమేమియున్నది. ఇట్లు చూపుచూ తానే ఆత్మయనునట్లు జీవులందరినీ మోసపరుచుచు జన్మపరంపర అనుభవములు చేయించుచుండును. కాని వీడు వాస్తవుడుకాడు. దీనినంతయూ కర్తృత్వాభాసనిరూపణలయందు విపులముగా తెలిపితిమి. వాస్తవమైన మన ఆత్మకు ఆయనయొక్క సత్యలక్షణములనుబట్టి, జనన, మరణాదులుగాని, కర్తృత్వభోక్తృత్వాదులుగాని లేవు. ఈ ఆత్మ చిదాకాశస్వరూపుడు. కేవలజ్ఞానసుఖస్వరూపములు గలవాడు, పరిపూర్ణుడు. జీవుడు యిదియే తన వాస్తవస్వరూపమని తెలిసికొని యిదియే తను నేను అని వ్యవహరించు ప్రతీకి వాస్తవస్వరూపమనిన్నీ, తన సత్యస్వరూపమనిన్నీ, గ్రహించి స్వానుభవము శ్రవణ, మనన, నిదిధ్యాసనాద్యభ్యాసములతో పొందుటకు సులభసాధ్యముగనుండును.

ముముక్షువు యీ సర్వదృశ్య శరీరసంసారానుభవములను, నిర్మలాకాశమునందు కనబడుచున్న గంధర్వనగరము, మేఘాదులువంటివని నిశ్చయించుకొని తన అనుభవములను యుచుండవలెను. ఏలనన, వృద్ధైన తాను నిత్యుడు, సంసారానుభవములు తనకు ప్రారబ్ధకల్పితములు. ఇవి అంతఃకరణధర్మములు — ఇది కేవల కల్పితోపాధియని, లోగడనే తెలిసికొని యుంటిమి. ఇట్లే వ్యవహారనిత్యమైన నిర్మలాకాశమునందు యీ గంధర్వనగర, మేఘములు చూచుటకు కనబడుచున్ననూ, యేవిధముగను ఆకాశముతో సంబంధించక, వాటియంతట యవి పుట్టి నశించుచుండును. కాని మరియొక మేఘమావరించుచునేయుండును. కాని యివి నిత్యముగా నుండవను

విషయమందరకునూ తెలిసినదియే గదా. నేను అను శుద్ధపదార్థము నిత్యము-తక్కినవన్నియూ అనిత్యములు. కాన అట్టి అనుభవములనుసరించి వివేకియైన వాడు పామరత్వాదులుయుంచుకొనక ప్రారబ్ధానుభవములను యథాసంప్రాప్తము, యథోచితముగా ననుభవించుచుండుట వివేకము.

ఇంకనూ యీ ప్రపంచమున సమస్తవ్యవహారములు, అనుభవములు, నామరూపములతోడనే జరుగుచున్న విషయమందరకున్నూ తెలిసినదియే. ఈ నామరూపములు సివేసిన ప్రపంచమను వ్యవహారమేయుండదు. ఇట్టి నామ రూపములు కేవల వ్యవహారకల్పితములు. కల్పితమనునపుడెల్ల యీ కల్పిత మునకు వాస్తవపదార్థమొకటి యుండితీరవలయును. కల్పితమన్ననూ, భ్రాంతి యన్ననూ దాదాపు యొక్కటియే. ఇట్టి భ్రాంతికల్పితములు నిరధిష్ఠానముగ కలుగుటకు వీలులేదు. కనుక సర్వప్రపంచ వ్యవహారములకు అనుభవముల కునూ సాంకేతికముగాను, కల్పితముగానున్న యీ నామరూపములకు అధి ష్ఠానమేదియని విచారించిన, యీ నామరూపములను సివేసిన మిగులునది యేదియో అదియేకదా కావలయును. నామరూపములను సర్వమునూ జ్ఞాన పూర్వకముగ త్యజించిచూచినయెడల మిగులునది యేదియని విచారించి సూక్ష్మ బుద్ధితోచూచినయెడల అట్టితరి మానవునకు మిగులునది, నేను ఉన్నానని త్రికా లములయందు తలచుట, నేను అను తన జ్ఞానము, నేను అను తనయందే పరమప్రీతిని పొందుచుండుట అను మూడు స్థితులున్నూ నామరూపములులేక పోయిననూ తనకు కలుగుచున్నవి. ఇట్లు కలుగుటలేదని యెవరునూ చెప్ప జాలరు. కనుక యీ కల్పితనామరూపములను జ్ఞానపూర్వకముగ త్యజించినను, యిట్లు మానవునికి తన అనుభవము, మిగులుచూ తనకుగోచరించుచున్న, ఉన్నాను అను అస్తిత్వము, నేను అను తెలివి (ప్రకాశము) యిదియే భాసరూపత్వము, అన్నిటికన్ననూ తనయందు పరమప్రీతియైన ప్రియత్వము, మిగులు చున్నవి. కాని యిట్లు తనకు స్ఫురించుచున్ననూ, మూడు అనుభవములు అన్నియూ ఒక్కపదార్థమే. మానవుడు తన సూక్ష్మ దృష్టిని, యీ కల్పిత

## సంక్షిప్త అనుభవవాక్యములు

నామరూపములను త్యజించిననూ, తానుమాత్రము అస్తి, భాతి, ప్రియత్వము లతో నిరల మహాకాశమువంటి ఊహకుమించిన చైతన్యమొక్కటియే అఖండస్వరూపమున తానుగా స్ఫురించును, కాని తదితర మేమియునూ యుండదు — యుండుటకువీలులేదు. ఇదియే చిదాకాశము - జీవునికి తన వాస్తవస్వరూపమైన అద్వితీయ బ్రహ్మపదార్థమై యున్నది. ఇట్లు ఒక్కటి యైన చిదాకాశమే జీవునియందు సత్యపదార్థమై అస్తి, భాతి, ప్రియత్వములతో సర్వదా ప్రకాశించుచున్నది. ఈ అఖండస్వరూపమే జగదధిష్ఠానమనిన్నీ, యిదియే తన వాస్తవస్వరూపమనిన్నీ, నామరూపమాత్ర ప్రపంచము, తన ప్రపంచానుభవములు, అధ్యస్తములనిన్నీ అనగా కల్పితములని ముముక్షువు తన అనుభవమువల్లనే గ్రహించవచ్చును. ఇట్లుగ్రహించిన తన సత్యస్వరూపమును స్వానుభవసిద్ధికిగాను సర్వదా తత్స్వరూపానుసంధానాదులను విసువు జెందక ఫలపర్యంతముచేయుట ముముక్షు కర్తవ్యము. జిజ్ఞాసువు యిట్లు చేసిన నేమిలాభమని శంకించకూడదు. ఏలనన ఈ సంసారము దీర్ఘరోగము వంటిది — ఔషధసేవ వలన వ్యాధి ఆ రోజుననే తగ్గుటలేదుకదా. అందు యిది అనాది, దీర్ఘరోగము. కాలక్రమమున గుణమిచ్చును. అయిననూ మానవునకిది, వ్యవహారనిదర్శనము కాన, వ్యాధియుపశమమును గురించి శంకించవచ్చును. కాని జీవునియొక్క సంసార దీర్ఘరోగనిరూలనకుగాను యిది శ్రుతిమాతచే చెప్పబడిన మహౌషధము గనుక, విశ్వాసముతో దీనిని సేవించిన జీవునికి తప్పక సంసారదుఃఖోపశమమును, దేహవిముక్త్యనంతరము సంసారనిరూలనముగావించి ముక్తిని చేకూర్చు పరమ ఔషధ మిదియేనని గట్టిగ నమ్మవలయును. "సంశయాత్మా వినశ్యతి" అని స్మృతి వాక్యము తెలుపుచున్నది. శ్రుతి జీవునకు నూరు తల్లుల సమానము గాన ఫలము కలుగునాయని సంశయించి అవిశ్వాసము పొందుట అనర్థ హేతువగును. ఈ బ్రహ్మవిద్య సంసారదుఃఖమును దాటుటకు నావవంటి సాధనమై సంజీవి యగును.

ఇంకనూ లోకమునందు మానవులందరును సమస్తపదార్థములకన్నను వారి ప్రాణముతో సమానముగ ప్రేమించునది అర్థము. ఇది అందరికిని తెలిసి

అనుభవములోనున్న విషయమే. లోకోక్తి గూడ "అర్థంప్రాణం" అని అర్థమునే ముందు చెప్పుచున్నది. ఇట్లు యేలనన ప్రతిమానవునకున్నూ దానివలన తనకు కావలసిన సుఖము చేకూరునను నిశ్చయమే దీనికి కారణము. ప్రతివారును అర్థమును ప్రేమించుట, తనకు కావలసిన సుఖమునిచ్చునను తలంపుతోడ గాని మరివేరుకాదు. కనుక అర్థమువల్ల మానవుడు కోరునది తన సుఖము కాని మరియొకటికాదని స్పష్టపడుచున్నది. అనగా యీ అర్థమును మానవుడు తనకొరకు సుఖసాధనముగ గ్రహించుచున్నాడు కాని అర్థముకొరకేకాదు. ఎప్పుడు యింత తను ప్రేమించిన అర్థమునుగూడ తన సుఖమునకు భంగము కలుగచేయునను నిశ్చయమునకు వచ్చినయెడల. తన సుఖమును మిగుల్చుకొనుచూ ధనమును ఆఖరుకి తప్పనివిధిగా వదులుచున్నాడు. కాన దీనినిబట్టి చూచిన మానవాశయమేమనిన, తన సుఖము ముఖ్యముగాను అర్థమును పరంపరగ తన సుఖసాధనమగునని యేగదా కోరుచున్నాడని తేలుచున్నది. గనుక మానవునకు, సుఖము ముఖ్యము, సుఖసాధనమైనఅర్థము గౌణము అనియేగదా నిశ్చయించవలయును. మానవుడు తన సుఖసాధనముగా నిట్లు గ్రహింపబడుచున్న అర్థము తనకు తాత్కాలిక సుఖాభాసమునిచ్చుచున్నదేకాని దుఃఖమిశ్రితముగాని సుఖమును శాశ్వతముగా నిచ్చుటలేదు. మానవునకు యీ అర్థము వ్యవహారసుఖసాధనమగుచున్ననూ, వ్యవహారదశయందుగూడ అట్టి సుఖమును సర్వదా నివ్వజాలక అప్పుడప్పుడు తాత్కాలిక సుఖమునుమాత్రమే యిచ్చుసామర్థ్యముగలదై యున్నది. ఇట్టి తాత్కాలిక సుఖానంతరము వునకు దుఃఖము తప్పుటలేదు. ఎంత ధనవంతునికైననూ దుఃఖము యొకపక్క కాచుకునే యుండును, ఎందుల కిట్లుకలుగుచున్నది యనినయెడల దానియాథార్థ్యము, యీ అర్థ, పరమార్థముల వాస్తవికతను బాగుగవిచారించి గ్రహించిన కాని తెలియదు.

శ్రీమాగురువర్యులు తరుచుగ "పరమార్థములో అర్థమున్నది గాని అర్థములో పరమార్థములేదు" అని బోధించుచుండెడివారు. మొట్టమొదలున

శబ్దసరణినిబట్టి యిట్లర్థము చెప్పుచున్నారేకాని మరివేరేమియూ లేదనితలచి యూరకుంటిని—కాని కొంతకాలమునకు, యీ మాటలకు దైవపూజాదికముల వల్ల అర్థలాభమైన భోగైశ్వర్యములు, మానవునికి కలుగుటకాని కేవల ధనాదులవల్ల దైవభక్తి పరమార్థచింత కలుగటను విధమున యొక యుగ అర్థము స్ఫురించెను. కాని మరికొంతకాలమునకు అనగా సుమారు యిరువది సంవత్సరముల తదుపరి యీ మాటలయర్థము యింతమాత్రమే అయియుండవ దేమోనని తోచుటచే కాలక్రమమున యీ మాటలయొక్క ముఖ్యార్థమేమై యుండుననితలచి, దీర్ఘకాల విచారాదులవల్ల నిట్లు గ్రహించగలిగితిని. అద్దానిని ముముక్షుజనోపయోగంబుగ నుండునను తలంపున, యిచట యుదహరించుచున్నాడను.

పరమార్థమనగా, శాశ్వతసుఖము — స్వస్వరూపజ్ఞానము. యిదియే స్వరూపసుఖము. దీని స్వరూపము సుఖముకాని మరియొకటికాదు. అర్థమనగా ప్రపంచము, వ్యవహారోపయోగిపదార్థములు. వీని స్వరూపము సుఖాభాసము, దుఃఖమిశ్రితము. ఇందు అర్థము అనగా ప్రపంచము, అధ్యస్తమైనదిగాను అనగా కల్పితము ప ర మా ర్థ ము వాస్తవమైనదిగానుండి అధిష్ఠానముగాను యున్నవి. ఎల్లప్పుడును అధిష్ఠానము సత్యమైనదిగానున్నూ అధ స్తము కల్పితముగానుయుండును. ఇది నియమము. అధ్యస్తమన్ననూ,కల్పితమన్ననూ భ్రాంతియన్ననూ యొక్కటియే. భ్రాంతిపదార్థములన్నియూ విపరీతజ్ఞాన కల్పితములుమాత్రమై వస్తుయాథార్థ్యము నివిగనుక—భ్రాంతిపదార్థములకు నాశముండుటకు వీలులేదు. కాని అట్టివి – వస్తుయథార్థస్వరూపజ్ఞానముచేత మిథ్యయగును. అనగా లేనివేయగును. — అర్థసంబంధమైన యీ వ్యవహారపదార్థములన్నిటినీ, యున్నవనియూ లేవనియూ, గ్రహించుటకు రెంటికినీ వృత్తి జ్ఞానమే సాధనమగుచున్నదిగాని, వస్తుస్వరూప వాస్తవికతాఽవాస్తవికతలు సాధనమగుటలేదు, స్వభావస్వరూపములచే క్లేశకార్యములుగూడ సుఖముగనే సుఖజ్ఞానముతో నిర్వర్తింపబడుచున్నవిగదా! ఎట్లనగా మానవునికి శస్త్రచికిత్స

దుఃఖకరమైనదైననూ తదుపరి తనకు సుఖమునిచ్చునను జ్ఞానముతో భరించు చున్నాడు. తల్లి ప్రసవవేదనను తనకు శిశువు కలుగునను సుఖజ్ఞానముతో సంతోషముగా భరించుచున్నది. స్వరూపస్వభావములచే మిక్కిలి తోష్ణాది వర్షములకోర్చి రెండు మూడుగంటలు యొకేవిధమున జనసమ్మర్దమున నిల బడుట యెంత క్లేశకరమైననూ, చిత్రపటములనుచూచు సుఖజ్ఞానముతో దానిని సంతోషముగా కొంచరుచేయుచున్న విషయమందరకున్నూ ప్రత్యక్షమే. ఇట్లే అతితిక్తతగల కషాయాది, ఔషధములను తనకు ఆరోగ్యముకలుగునను సుఖ జ్ఞానముతో సేవించుచున్నారు. అయిననూ సర్వమానవులకున్నూ సుఖానుభవము నందు ప్రీతియును దుఃఖానుభవమునందు క్లేశాదులేగదా కలుగుచున్నవి. అందుచే ప్రతివారును సుఖమునే కోరుదురుకాని దుఃఖము నెవ్వరును కోరరు. కాన సుఖానుభవమెట్టిది ? దుఃఖానుభవమెట్టిది? అని సూక్ష బుద్ధితో నాలోచిం చినయెడల సుఖజ్ఞానముతో పొందు అనుభవములు సుఖకరములుగను, దుఃఖ జ్ఞానముతోపొందు అనుభవములు దుఃఖకరములుగను తోచుచున్నవి యనుటకు సందియములేదు. ఈ సుఖదుఃఖాద్యనుభవములయందు జీవునకు తనజ్ఞానమే ప్రధానమగుచున్నది. అయినను యీ జ్ఞానములన్నియూ విషయవృత్తిరూప మగుటచే తాత్కాలికములయి విషయాంతరములనుకోరుచూ తిరిగి ఆవిషయ ప్రాప్తివరకు జీవునికి దుఃఖము కలిగించుచుండును. ఇట్లు అర్థముచే కలుగు సుఖములు మానవులలో కేవల అర్థరూపమైన వ్యవహారధనమున్న యెంత యైశ్వర్యవంతునైననూ విషయభోగానంతరమున దుఃఖముపాలు చేయు చున్నవి. ఇట్టి కేవల అర్థముతోపొందు విషయసుఖములు మానవునకు దుఃఖ మిశ్రితముగాని నిత్యసుఖము నివ్వజాలవు. ఏలనన యీ అర్థలాభసుఖములు అనిత్యములైన అల్పములు గనుక కేవల నిత్యసుఖమునిచ్చు సామర్థ్యము వీనికిలేదు. కాని పరమార్థసుఖమో నిత్య, నిరతిశయ, పరిపూర్ణసుఖముగాన మారుటకు వీలులేదు. దీనివలన మానవునకు కలుగుసుఖము నిత్యమై పర మార్థమగును. అనగా అర్థములలోనికెల్ల సర్వోత్కృష్టమైనది యని యర్థము. ఇంతకుమించిన శాశ్వతము మరొకటిలేదు. కనుక యిట్టి పర

మార్గమందున కేవల అర్థము ఆభాససుఖమాత్రమై లేశాంశముగనుండును, లేశాంశమైన అర్థమందు సర్వోత్కృష్టత, పరిపూర్ణతలుండుట యసంభవము గదాయని వాస్తవమును గ్రహించగలిగితిని. ఇదియే వాస్తవార్థము.

కావున పరమార్థము నాశ్రయించిన మానవునకు సుఖము నిత్యమై తనంతతానుగనే ల ంచును. దీనికి వేరు ప్రయత్నమక్కరలేదు. ఇది నిత్య, నిరతిశయమైన అఖండ పరిపూర్ణ సుఖస్వరూపము. మానవునకిట్టి నిత్య, నిరతిశయసుఖము కలుగునప్పుడు అర్థసంబంధమైన తాత్కాలిక విషయసుఖములు తాను కోరకపోయిననూ, ఆనుషంగికముగనే యుండును. ఇదిగాకనూ మానవుడు తన పరమార్థలాభముతో అర్థసంబంధమైన విషయానుభవములనన్నింటినీ తన పరమార్థ జ్ఞానబలముచే, అర్థలాభముచే కలుగు విషయసుఖము కన్న ఎక్కువ పరమ సుఖానుభవముతో అనుభవించ సమర్థుడగును. అసగా అనుభవము అట్లే కలుగుచుండును—ఏలనన తన పరమార్థ సుఖము నిత్య పరిపూర్ణము గనుక యిది సుఖలేశాంశము లైన అర్థసుఖములందు అప్రయత్నముగనే భాసించుచుండును —— ఇదియే పరమ లాభము. ఇంకనూ విషయ సుఖములు అల్పములు గనుక, అల్పము అధికవస్తువునందు యుండవచ్చును కాని అల్పవస్తువునందు సర్వోత్కృష్టత. పరిపూర్ణతలు యుండుట అశక్యము గదా. అందుచే పరమార్థములో అర్థమున్నదిగాని అర్థములో పరమార్థము లేదనిన్నీ, యుండదనిన్నీ నిశ్చయమగుచున్నది.

కనుక ముముక్షువు సర్వదాపరమార్థము నా శయించుటయే, వివేక మనిన్నీ, పరమశ్రేయోదాయకమనిన్నీ గ్రహించవలెను. అట్టి పరమార్థ స్వరూపము యెట్టిది యనిన, ప్రతిమానవుడునూ అహం . ను అని, అనుకొనుచున్న అహంశబ్దమునకు లక్ష్యార్థమైన తన ప్రత్యగాత స్వరూపమే తాను అను . ను అనిన్నీ అదియే సర్వదృశ్యాధిష్ఠానమై, సర్వజీవులయందున ఆత్మగా ప్రకాశించుచున్నదనిన్నీ అదియే తన స్వరూపమనిన్నీ గ్రహించవలెను. ఇంకనూ యిదియే తన అద్వి యి అఖండ పరమాత్మ స్వరూపమనిన్నీ, యీ

ప్రత్యగాత్మ స్వరూపుడైన తానే యీ పరమాత్మయనిన్నీ, అదియే సర్వ దృశ్యాధిష్ఠానమనిన్నీ, యింతకు వేరువాస్తవముగ ప్రపంచము సందేహమునూ లేదనిన్నీ, తన సత్య స్వరూపమే ప్రపంచాధిష్ఠానమనిన్నీ తనయందు అధ్యస్త మైన యీ సర్వప్రపంచము మిథ్యామాత్రమేననిన్నీ, తన వాస్తవ స్వరూపమే నిత్య, నిరతిశయ సుఖమనిన్నీ యిదియే తనకు ముక్తి, మోక్షము అనునది, నిశ్చయమున గ్రహించి స్వానుభవము నొందుటయే, యీ విచారణకు పరమ ప్రయోజనము.

ఇంకనూ ముముక్షువు స్వశరీర సర్వ మిథ్యాత్వమును బాగుగ గ్రహించి అభ్యాసకాలమందు, సర్వోపాధి వినిర్ముక్తమైన తన అఖండ పరిపూర్ణ చైతన్యము నందెంతంత ప్రీతి, నిశ్చయ, దార్ఢ్యముల నొందుచుండునో అంతంత యీ జిజ్ఞాసువునకు, దృశ్యసక్తతాభిమానములు విలీనమగుచుండును. ఇదియే జీవన్ముక్త స్థితికి సాధనము, సర్వ జీవులకునూ సుషుప్తియందు సక్తతా మానములు విలీనమగుచు సుషుప్తి సుఖము కలుగుచున్నది. ఎట్లనగా జీవునకు సుషుప్తియందు, అంతఃకరణవృత్తి అజ్ఞానమునందు విలీనమగును. కావున వృత్తి కపుడు, విషయ సంసర్గ సుఖానుభూతియుండదు. అప్పుడు వృత్తిఘనీభవించిన ఘృతాకారమును నుండును — అనగా వృత్తి, యేవిషయాకారమును పొందదు — కావున అట్టి సుషుప్తి కాలములో వృత్తి నిర్విషయముగనే యుండును —— ఇట్టి నిర్విషయస్థితియే జీవునకు పరమ సుఖము. కాని యీ సుఖము అజ్ఞాన పూర్వకమైనందుననూ, జీవునియొక్క ప్రారబ్ధశేషానుభవము మిగిలియుండుట చేతనూ, తనకు నిత్య నిరతిశయ సుఖము నివ్వజాలక జీవుని ప్రారబ్ధవశునిగా గావించుచు సంసారము విడువదు. ఈ నిద్రాసుఖ మనునది తమోగుణ ప్రధానమగుటచే, జీవునికి కేవల సుఖము నిత్యముగా నివ్వజాలదు. ఈ సుఖము, వృత్తి అజ్ఞానమందు లయించుటచే కలుగుచున్నది కాని జీవునకు, తన జ్ఞానపూర్వకముగ, కలుగుటలేదు. కావున జ్ఞానాభ్యాసకుడు తన శాస్త్రజ్ఞాన బలముచే, ధ్యానసమాధ్యభ్యాస కాలములందు అద్వితీయ, అఖండ, నిర్విషయ సుఖమును తన వృత్తి సహాయముతో

నభ్యసించుచుండవలెను. ఇట్టి అభ్యాస పటిమయే, కాలక్రమమున యీ తన నిర్విషయక వృత్తి జ్ఞానమే తన అజ్ఞానమును నశింపజేసి, స్వరూప జ్ఞాన సుఖము నిచ్చుచూ ప్రారబ్ధాంతమున చరమ వృత్తి సాక్షాత్కారము నొసగును- అనగా జీవునకు వృత్తి నశించి, కేవల స్వస్వరూపజ్ఞానము శేషించును.

కావున ఏ జ్ఞానాభ్యాసకుడు తన నిర్విషయక వృత్తి జ్ఞానాభ్యాస బలముచే, స్వశరీర సర్వదృశ్యమిథ్యాత్వ నిశ్చయము నొంది, తన ప్రారబ్ధానుగత వ్యవహారముల నాచరించుచుండునో అట్టి వానికి దృశ్య స్వరూప మంతయునూ, తన ప్రారబ్ధానుభవమునకు గాను కల్పితమైన పరిస్థితియనియూ, ఇది అంతయూ తాత్కాలికము అనిత్యము అను నిశ్చయముతోచి, తన దేహానుభవములను చేయుచుండును. కావున యీ అనుభవములు జ్ఞానికి సత్తతాభిమానములను క్షీణింపజేసి వాస్తవముగా గాని భ్రమముగా గాని సుఖదుఃఖాదులను ముముక్షువునకు కలుగజేయజాలవు. అయిననూ యిట్టి అనుభవము లన్నియూ, సాధారణ మానవులకు వాస్తవ సువర్ణాభరణములు, కృత్రిమ సువర్ణాభరణముల యందుండు సత్తాభిమానములువలె నుండును— అనగా మాయబంగారు వస్తువు. లాభనష్టముల వల్ల కలుగు సుఖదుఃఖముల వలె నుండును, అనగా దానివల్ల కలుగు సంతోష దుఃఖములు గూడ తక్కువ గానే యుండునుగదా — ఇట్లే యీ జ్ఞానాభ్యాసకుని స్థితియూ నుండును, విద్వాంసునికి యీ ఆభాససుఖ—దుఃఖములను, నివర్తింప జేసుకుని, నిత్య సుఖమును పొందుటయే వివేకముగదా ! సామాన్యులకైననూ సంసార దుఃఖమును తగ్గించుకొనుటకు యిది పరమ సాధనము — కావున యిది సర్వులకునూ శ్రేయోదాయకమని వేరుగ జెప్ప పనిలేదు.

ఇట్టి జ్ఞానాభ్యాసమే కాలక్రమమున ఆత్మజ్ఞానము నిచ్చును. ఈ ఆత్మ జ్ఞానము కన్న మరియొక యుత్కృష్ట వస్తువు లేదని "ఆత్మజ్ఞానాత్పరం నాస్తి" యను వసిష్ఠ వచనము తెలుపుచున్నది — మానవులకు దుఃఖము రెండు విధముల కలుగుచున్నది. అవి యేవియనిన మొదటిది ఆధి, రెండవది

వ్యాధులు — ఆధి, యనగా జీవునకు జన్మపరంపరగా అజ్ఞానముచే కలుగు చున్న సాంసారిక మానసిక దుఃఖము. వ్యాధులనగా దేహోపాధి వైకల్యములచే కలుగు దుఃఖము. ఈ వ్యాధులు కర్మజములని, దోషజములని రెండు విధములు—ఇట్టివన్నియూ వాటి బలాబలములను బట్టి ఔషధసేవ, శాంతిజప, హోమదానాది క్రియలచే తగ్గును. కాని ఆధియైన మనోవ్యాధికి మందు లేదని లోకసామెత, అయిననూ దీని చికిత్సకు యొక్కటియే యుపాయము శాస్త్రము తెలుపుచున్నది. అది యేదియనిన సమస్తమైన మనోవ్యాధులకు మందు ఆత్మజ్ఞాన మొక్కటియే. ఈ పరమౌషధమును సేవించిన, జీవునకు దుఃఖ మెన్నటికిని తిరిగి జనింపక శాశ్వత సుఖము నిచ్చును. జీవునకు యీ ఆత్మ జ్ఞానమను ఔషధముచే దుఃఖము శాశ్వతముగ నశించును. అప్పుడు "ఆత్యంతిక దుఃఖనివృత్తి రేవమోక్షః" అను వాక్యము ననుసరించి అట్టిస్థితియే జీవునకు మోక్షస్వరూపమగును. కాన జీవునకిది పరమలాభము — దీనినే:—

శ్లో॥ ఆత్మజ్ఞానం వినా సాధో నాధిర్నశ్యతి రాఘవ।
యథారజ్జ్వవబోధేన వినాసర్పో న నశ్యతి॥

అనగా త్రాడునందు దోచిన సర్పము త్రాడు నెరుంగకున్న నెట్లు నశింపదో అట్లే జనాది మూలంబైన సాంసారిక మనోదుఃఖములు అనగా ఆధులు, ఆత్మజ్ఞానము చేతగాని నశింప నేరవని, అవతారరూపంబున రారాజైన శ్రీరామ చంద్రునికి వసిష్ఠభగవానులు తెలుపుచున్నారు. కావున అనుభవరూపమైన యీ ఆత్మజ్ఞానాభ్యాసము సర్వులకునూ పరమ శ్రేయోదాయకమున్నూ, ముక్తి మార్గము నగునని, గ్రహించవలెను.

ఆత్మజ్ఞాన మనగా జీవుడు శ్రుత్యుక్త్యనుభవములతో తన సత్య స్వరూపము అద్వితీయమనిన్నీ, తానే సర్వాధిష్ఠానమనిన్నీ యీ స్వశరీర సర్వ దృశ్యము కల్పితమైన వ్యవహార మాత్రమేననిన్నీ తెలిసికొనుట —— అది యెట్లనిన — ఛాన్దోగ్యోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది —

"యథాసోమ్యైకేనమృత్పిండేన సర్వంమృన్మయం విజ్ఞాతంస్యా త్
వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత మ్ ॥

అనగా — మృత్పిండము తెలియబడినపుడు తద్వికారములగు ఘటశరావాదు లన్నియు మృత్స్వరూపముకన్న అతిరిక్తములుగావని తెలియబడును. ఏల యనగా — ఘటశరావాది వికారము లన్నియు వాఙ్మాత్రములేగాని, వస్తుతః వేరుగా లేవు. కావున వికారజాతమంతయు నామమాత్రము అనృతరూపమునై యున్నది. ఒక్క మృత్తుమాత్రమే సత్యము, అనిన్నీ ఇంకనూ "ఐతదాత్మ్య మిదగ్ంసర్వం తత్సత్యం సఆతా తత్త్వమసి" అనగా పరిదృశ్యమానమగు నీ ప్రపంచమంతయు పూర్వోక్తమగు సద్రూపబ్రహ్మయే ఆత్మగా కలది. అనగా బ్రహ్మ స్వరూపముకన్న అతిరిక్తమగు (వాస్తవ) స్వరూపము జగత్తుకు లేదని భావము. ఆబ్రహ్మయే సత్యస్వరూపము. అదియే ఆత్మ. అట్టి ఆత్మ స్వరూపము నీవై యున్నావు.

అని పై శ్రుతి వచనములు విశదముగా తెలుపుచున్నవి —— కావున ఈ శ్రుత్యర్థమును జిజ్ఞాసువు తన అనుభవమునకు తెచ్చుకొనుటయే జ్ఞానా భ్యాసము — దీనివలన సిద్ధించు స్వానుభవమే ఆత్మజ్ఞానము —

## బ్రహ్మాభ్యాసకునకు నిర్వేదము శుభలక్షణము

ఈ నిర్వేద మనునది ప్రముముక్షువునకు తన జ్ఞానాభ్యాస పరిపాక మున వివేకముచే కలుగుస్థితి, నిర్వేద మనగా వైరాగ్యము. వైరాగ్యములేని వేదాంత జ్ఞానము నిష్ప్రయోజనము. ఈ వైరాగ్య మెటుల నుండవలెననిన, జ్ఞానపూర్వక నిశ్చయమైనదిగా నుండవలయును గాని, కేవల తమః ప్రధా నులై విషయప్రవృత్తి లేకుండుట వైరాగ్యము కాదు. ఏలనన అట్లుండుట జడోపాధులైన కుడ్య, శిలాదులకు గూడ సమానమేగదా ! కావున వల విషయభోగ ప్రవృత్తి రహితముగ నుండుటయే వైరాగ్యము కాజాలదు. ఈ బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు, యెట్టివాడనగా శాస్త్ర శ్రవణ, మననాదులచే నేను,

అహం అను తన వాస్తవ స్వరూపమే సత్యమైనదనిన్ని, ఇదం అను యీ ప్రపంచమంతయూ మిథ్యామాత్రమని తెలిసికొని, పరమార్థ వాస్తవమున నున్నది తన సత్య స్వరూపమైన బ్రహ్మ పదార్థ మొక్కటియే తప్ప, తదితరములన్నియూ అవాస్తవములని శ్రుతి, యుక్త్యనుభవములతో నిశ్చయించుకొని తాను బ్రహ్మభావము నొందుట కభ్యసించువాడు. ఇట్టి అభ్యాసకాలములో బ్రమముముక్షువున కిట్టి నిర్వేదము కలుగుచుండును. ఇది అభ్యాసకునకు వైరాగ్య శుభసూచకము, సంపత్తి యగుచున్నది. ఈ నిర్వేద స్వరూపమెట్లుండుననిన, యీ అభ్యాసకునకు తనలో నిట్లు తోచుచుండును. అదియేమనిన, అభ్యాసకుడు తనలో తానిట్లనుకొనును. "ఎంతవిచారించిననూ నాకు యీ ప్రపంచమున పరమార్థసత్యపదార్థ మేదియునూ కనబడుటలేదు. ఇందు దేనినిన్ని నమ్మి నేను నిత్యముగా నుండుటకు వీలు కనబడుటలేదు. ఈ దృశ్యమందు సమస్త భూతములునూ, దేశకాల వస్తువులున్నూ యీనా దేహము అనగా స్థూలసూక్ష్మదేహములు రెండునూ గూడ, త్రివిధాబాధితములుగాక, యీ దేహాదులు కేవలము నాయొక్క ప్రారబ్ధ కర్మఫలానుభవములకు మాత్రమే కల్పితమైన యుపాధులుగా కనబడుచున్నవి గాని, వీనియందు వాస్తవికత యెంతమాత్రము కనబడుటలేదు—నాకు యీ సమస్త దృశ్యానుభవములునూ యీ కల్పితదేహమును బట్టియేగదా కలుగుచున్నవి. ఈనా దేహాదులు కల్పితములై అనిత్యములై నమ్ముకొనుటకు వీలులేనివై యుండగ, యీ నా దేహమును బట్టియే నాకు వచ్చిన యీ పుత్ర, మిత్ర. కళత్ర, విత్త క్షేత్రాదులునూ, ధనకనక వస్తువాహనాదులునూ, వ్యవహార సత్త్వాధికారములున్నూ, మాత్ర మెట్లు వాస్తవములు కాగలవు - ఈ దృశ్యానుభవములన్నియూ నాకనుల ముందరనే సదా మారుచు నశించుచున్నవి గదా - ఈనా కర్తృత్వాదులునూ, సత్త్వాధికారములునూ, అధికార సంపదలున్నూ, అది యిది యననేల సమస్త దృశ్యమునూ, నాకు యీ కల్పిత దేహముతోడనే అంతమగుచున్నవే. వీనినే, నమ్మి ఆధారపడుట యెట్లు? కావున నేను వాస్తవముగా నాశాశ్వత అనగా నిత సుఖమున కాధారపడదగిన పదార్థమేదియునూ,

నా దృశ్యమందు కనబడుటలేదు. కాని ప్రారబ్ధానుభవమెవ్వరికైననూ తప్పదు గనుక, వీనియందు సక్తతా మానములు విడచి నా ప్రారబ్ధానుసరణమున లోకవ్యవహారము నాచరించెదను. ఇది విధిగదా. అయిననూ గురు, శాస్త్ర బోధచే నా శ్రవణ మననాదుల వలన, బాగుగ పరిశోధించి చూడగ, యీ ఒక్క-నేను, అను, అహంపదార్థము మాత్రము సర్వకాల సర్వావస్థల యందునూ అనుస్యూతముగ అబాధితమై నిత్యముగ ప్రకాశించుచున్న విషయము స్పష్టముగా కనబడుచున్నది — కావున యీ అహంపదార్థమే నా కాధారముగ, కనబడుచున్నది. కాని నేను అనుకొనుచున్న యీ దేహాదులు నశించుచున్నవి. గనుక యీ దేహాదులు నేను; అహం అనుకొను పదార్థము నకు వాస్తవికార్థమగుటకు వీలుకనబడుటలేదు. కావున యీ నేను అను అహం ప తికి వాస్తవికార్థము మరియొకటిగా నుండవలయును విచారించగా శాస్త్రము యీ అహం అను నేనే, పరమాత్మనని బోధించుచున్నది. శాస్త్ర మెన్నటికినీ అబద్ధము చెప్పదు-చెప్పుటకు వీలులేదు. నా శాస్త్రీయ వివేచనానుభవములను బట్టి గూడ నిట్లే కనబడుచున్నది. కావున యీ అహంపదార్థ మెట్టిదియైన యెడల, నేనాపరమాత నే యగుదునని విచారించెదనుగాక—ఇట్లు దీనిని గురించి, శ్రుతి, యుక్త్యనుభవములతో విచారించగ, నాకు ఈఅహం పదార్థమే నా పరమార్థ సత్యస్వరూపమనియూ యిదియే నా నిత్య నిరతిశయ సుఖస్వరూపమనియూ నిశ్చయమగుచున్నది. ఇదితప్ప మరి వేరేమియునూ పరమార్థ వాస్తవము కనబడుట లేదు గాన యిదియే నాపరమార్థ స్వరూపమై యుండవలయును. ఇదియే నా అఖండ, సచ్చిదానంద పరిపూర్ణ స్వరూపము. కాని యిప్పుడు నాకు నావాస్తవ స్వరూపము స్పష్టముగా తెలియుటలేదు — ఇట్లు తెలిసికొని స్వానుభవము నొందుటకు (అనగా సంపాదించుటకు) యీ వృత్తి రూపమున నున్న నా యుపాధియే సాధనముకాని, మరియొకటి కనబడుటలేదు. కావున నాయొక్క వృత్తిరూప ఉపాధినే శరణ్యముగ సు కొని నా సత్యస్వరూపమును ఫలావగతి పర్యంతము అనుసంధానము చేయు చుందును" అను నిశ్చయము నొందును, ముముక్షువునకు శాస్త్రాభా

సాదుల పటిమచే, బహుజన ప్రయత్న సుకృతఫలముగ నిట్టి నిర్వేదస్థితి కలుగును. కాని యిది సామాన్యముకాదు. ముముక్షువునకు తన వాస్తవ స్వరూప సుఖమును గురించి యిట్టి మనోవ్యసనము కలుగుటయే జ్ఞానోదయ శుభసంపత్తియని గ్రహించవలయును — "మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతిసిద్ధయే" అను గీతావచనము తెలుపుచున్నటుల వేలకొలది మనుష్యులలో నొకానొక శ్రవ ముముక్షువు మోక్ష సిద్ధికై ప్రయత్నించును. అట్టి వారిలో బహుజన సుకృత ఫలముగ అభ్యాసకునకిట్టి నిర్వేదస్థితి అనగా జ్ఞాన పూర్వక వైరాగ్యము కలిగి స్వస్వరూప సాక్షాత్కార సుఖము నిచ్ఛయించి అనుసంధానాదుల చేయుచుండును, అట్టి అనుసంధాన మెట్లుండుననిన :—

"నేను యీ దేహాదులుగాని, పంచభూతములుకాని, దృశ్య పదార్థములలో నేదియునూ గాని కాను, నేను "అహం" అను నావాస్తవ స్వరూపుడనైన సాక్షి, ప్రత్యగాత్మనైన పరమాత్మ . అహం అను నేను — సర్వాధిష్ఠాన స్వశరీర సర్వోపాధివినిర్ముక్త, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి, స్థితి, లయ, వివర్త, అభిన్న నిమిత్తోపాదాన కారణ, నిత్య, నిరతిశయ, అద్వితీయ, సచ్చిదానందస్వరూప, అఖండ, పరిపూర్ణ చైతన్యుడనని సర్వదా స్వస్వరూపానుసంధానాదులు ఫలావగతి పర్యంతము జేయుచుండును—

## జ్ఞాని నిత్యానుసంధానము

జ్ఞానాభ్యాసకుడు తన వ్యవహారకాలమందు గూడ తన పరమార్థ స్వరూపము నిట్లు విమర్శించి గుర్తించుచుండవలయును. అది యెట్లనిన తన యుపాధి; భూమండలము (గోళము) వంటిదనియూ, తానుమాత్రము లోక భాస్కరుడు అనగా సూర్యునివంటి వాడననియూ, తెలిసికొనుచుండవలయును. ఎందువలననిన జ్ఞానికి తన వాస్తవ స్వరూపము యెట్టిదనిన భూమండలముతో నెట్టి సంబంధము లేని సూర్యుని వంటిదని గ్రహించవలెను. ఎట్లన సూర్యుడు తన సహజమైన తైజసస్థితి మాత్రుడుగనే యుండి, అచలుడై యున్ననూ

కేవల తన స్థితిమాత్రముచేతనే భూమండలమందు సర్వులకునూ, వారి, వారి సర్వవ్యవహార ప్రయోజనములకెట్లు హేతువగుచున్నాడో అట్లే సర్వ వులకునూ వారి వారి వాస్తవస్వరూపమైన అఖండ పరమాత్మయే వారి, వారి, యుపాధులతో నెంతమాత్రము సంబంధము లేనివాడగుచు, వారి, వారి యుపాధుల యందే సాక్షిమాత్రుడుగ నున్న ప్రత్యగాత్మ ప్రకాశము వలననే, తమ తమ యీ కల్పితోపాధుల యొక్క సర్వ వ్యవహారములు నడుచుటకు హేతువగుచున్నాడని, నిశ్చయముగ గ్రహించవలెను. ఇంకనూ భూమండల సదృశమగు తనయుపాధితో జ్ఞాని, యెన్ని వ్యవహారములు జేయుచున్ననూ, అట్టివి అన్నియూ తన పరమవాస్తవ స్వరూపమైన, అఖండ పరిపూర్ణ సర్వాధిష్ఠాన చైతన్య ప్రకాశము వలననే నడచుచున్నవనియూ యీ తన వ్యవహారమంతయూ కల్పితమనియూ, ఇట్టి అంతఃకరణ ధర కల్పిత వ్యవహారములతో తనకెట్టి కర్తృత్వాది వాస్తవసంబంధము లేదనియూ సర్వదా అనుసంధానము చేయుచు, తానిప్పుడు ప్రారబ్ధవశమున తాత్కాలికముగ అంతఃకరణోపాధిబద్ధుడై యున్నాననియు తెలిసికొనుట యావశ్యకము. ఎందుచేతనగా జ్ఞానికి తనయందున్న సత్యానృతపదార్థములను విభాగించి తెలిసికొనిన గాని తనకు కావలసిన తన పరమార్థ వాస్తవస్వరూపమును గ్రహించి పొందజాలడు—

మరియునూ లోగడ తెలిపిన యటుల సర్వదేశములలోనూ, సర్వులవల్లనూ, ఒక్కడేయైన సూర్యుడెట్లు, వారువారున్న ప్రదేశముల యందే తానొక్కొక్క పరిమిత బింబాకారముగ గ్రహింపబడుచున్నాడో అట్లే పునః తన పరమవాస్తవ స్వరూపమైన అద్వయ పరమాత్మ ఒక్కడే సర్వజీవుల వల్లనూ వారి, వారి, హృదయమందు ప్రత్యగాత్మ స్వరూపుడుగ తెలియబడుచూ,భాసించుచున్నాడని తెలిసికొని అట్టి తన పరమ వాస్తవ స్వరూపమే సర్వాధిష్ఠానమని గ్రహించవలెను. ఇట్టి సర్వాధిష్ఠానము ప్రపంచమునకెటుల నున్నదనిన సర్పభ్రాంతికి అధిష్ఠానమైన రజ్జువు, వలె సర్వ దృశ్యమునూ తన వాస్తవ స్వరూపమునందే భ్రాంతిమాత్రముగ గనబడుచు, యున్నదని యెరుగ

వలయును — కాని తనయందు యీ ప్రపంచము అనగా స్వశరీర సర్వ దృశ్యమూ భ్రాంతి మాత్రముగనే కాని వాస్తవముగ లేదని గ్రహించవలెను. ఇది గాకను జ్ఞానాభ్యాసకుడు తన స్వప్నజాగ్రదవస్థానుభవముల యొక్క స్వకాల సత్యత్వమును సదా గ్రహించుచు తన జాగ్రదనుభవములు గూడ స్వప్నతుల్యములనియు అయిననూ దీర్ఘస్వప్నముల వంటివని తెలిసికొన వలయును. ఎందుచేననగా స్వకాల సత్యత్వము, అవస్థాభేదమందు స్వప్న, వ్యవహారానుభవముల నాశము రెంటికిని సమానము ప్రాతిభాసికములైన స్వప్నానుభవములు స్వప్నావస్థ మారగనే, ఆక్షణముననే అసత్య ములగుచు నశించుచున్నవి. అట్లే జాగ్రదనుభవములైన వ్యవహారములు జీవునకు తన ప్రారబ్ధమును బట్టి, క్రమక్రమముగ అసత్యములై నశించుచున్నవి. రెంటి కినీ యింత మాత్రమే భేదముకాని అసత్యత్వము, నశించుట యనునవి స్వప్నజాగ్రదవస్థానుభవములు రెంటికినీ సమానముగ కనబడుచున్నవి. ఇదియునూ గాక జీవునకు స్వప్నజాగ్రదనుభవములు రెండునూ తనయందే అజ్ఞానకాలమందు గలుగుచు, అవస్థాంతరములయందు అనగా జ్ఞానకాలమున తనయందే అస్తమించుచున్నవి. అనగా ఆజీవుని అజ్ఞానము నశించగనే తనయందే అస్తమించుచున్నవి. ఇదియునూ రెండింటికినీ సమానము. కావున జ్ఞాని తన జాగ్రద్దశయందు కలుగుచున్న వ్యవహారములయొక్క అసత్యత్వమును గూడ యిట్టిదే నని తన పరమార్థజ్ఞానముతో గ్రహించి నిశ్చయము నొంది, యీ స్వశరీర సర్వదృశ్యముతో తనకెట్టి వాస్తవ సంబంధము లేదని జ్ఞానపూర్వకముగ త్యజించి తన వాస్తవ స్వరూపమునే పరమ సత్యముగ గ్రహించి అనుసంధానాదులను చేయుచుండవలయును. జ్ఞానాభ్యాసకునికి యీ స్వశరీర దృశ్యమిథ్యాత్వ, స్వస్వరూప, అనుసంధాన మను ప్రక్రియ యెట్టిదనిన, బురద నీటియందు పడి నాచుపట్టిన చందన ఖండ మును, మాలిన్యము కడిగి సానపెట్టుట వంటిది. అట్టి ప్రక్రియచే బురద యందు దీర్ఘకాలమందుండుటచే, చందన ఖండముకు కలిగిన దుర్గంధమాలిన ములు పోయి చందన ఖండమునకు సహజమైన సుగంధము బైటికి వచ్చి

పరిమళించులాగున యీ అనుసంధానాదుల వల్ల జీవునికి దృశ్యమందు కలుగుచున్న రాగద్వేషాది సక్తతా మానములు కర్తృత్వాధ్యమానములు ణించి తన సహజస్వరూపమైన పరమార్థ స్వరూపము, సత్యజ్ఞానానంత లక్షణములతో గోచరించుచుండును. ఇదియే పరమ లాభము-

## నేను అను "అహం" పదార్థము, మనోభిన్నము

జ్ఞానాభ్యాసకులు ముఖ్యముగ నీ విషయమున జాగరూకులై యుండి భ్రమనొంద కూడదు, అదియేది యనిన తమ మనసే తామని భ్రమించుట. ఈ మనస్సు ఇంద్రియములకు రాజువంటిది, పండితులగు వారు గూడ సామాన్యముగ, తమ సమస్త వ్యవహారములునూ, తమ మనస్సు వల్లనే నడుచుచున్నవని భ్రమనొందుచుందురు. కాని యిది భ్రమయే గాని వాస్తవ మెట్లగును? కాదు. ఏలనన మనసు గూడ నేత్రేంద్రియాదుల లాగున జడ పదార్థమేనని సయుక్తికముగ విచారించి లోగడనే నిశ్చయించి యుంటిమి గదా — వల జడపదార్థములకు గ్రహణ శక్తులుండుట యసంభవము. ఈ మనసుగూడ తక్కిన ఇంద్రియ సమూహామువంటిదే గనుక యిది పర ప్రకాశ్యమేగాని స్వప్రకాశముకాదు. ఎట్లన నేత్రములున్ననూ, సూర్య ప్రకాశముగాని, దీప ప్రకాశ సహాయముగాని లేనియెడల కేవల నేత్రములు పదార్థములను చూచుటకు అసమర్థములగుచున్నవిగదా — కావున అట్లే జడమైన యీ తన మనస్సును, గూడ ప్రకాశింప జేయుటకు మరియొక ప్రకాశముండి తీరవలయునని, నిశ్చయమగుచున్నది. ఇట్లు తన మనసును ప్రకాశింప యునట్టి స్వప్రకాశ రూపుడే "అహం" నేను తన వాస్తవ స్వరూపమే ప్రత్యగాత్మ స్వరూపుడుగ తనలో తెలిసికొనబడుచున్నాడు. ఈయనయే పరమాతుడు. కాని యీయనయే జీవోపాధిగా నున్న అంతఃకరణ మను యీ మనస్సును నాది, నేను యని భ్రమించి, మాయా ప్రభావముచే సంసార దుఃఖము పొందుచున్న వానివలె నున్నాడు గాని వాస్తవమాలోచించి యీ

అంతఃకరణోపాధి ధర్మములైన సుఖదుఃఖము లేవియునూ ఆయన నంటక సర్వదాసాక్షి చైతన్య ప్రకాశుడై యుండును. ఇట్లు సంగుడుగా నుండునట్టి ప్రత్యగాత్మ ప్రకాశమే మనస్సును సర్వదా ప్రకాశింపజేయునది. కాని మనోధర్మములైన వి కా ర ము ల తో నెంతమాత్రము ఆయన సంబంధ పడడు, ఎట్లన సూర్యుడునదీ, తటాక, కూప, మూత్ర పురీషజలములందు సమానముగ ప్రకాశించుచు వాటి సంబంధ మెంతమాత్రమునూ పొందుట లేదో అట్లే యీ ప్రత్యగాత్మ ప్రకాశము, మనసును, మనోవికారముల నన్నిటిని సర్వదా ప్రకాశింప జేయుచు వాటి ధర్మములతో తానెంత మాత్రము సంబంధపడక యున్నాడని, తెలిసికొని అట్టిసాక్షి, ప్రత్యగాత్మయైన స్వప్రకాశ చైతన్యమే, తన వాస్తవిక "అహం" నేను అను ప్ర తికర్థమని గ్రహించవలెను. కాని తాను కేవల మనోరూపుడని స్వప్నములో గూడ జ్ఞానాభ్యాసకుడు భ్రమ జెందకూడదు. ఏలనన ఈ మనసు మహాబ లయమైనది. ఈ మనసనునది జడమైననూ, తానే సత్యమైన దానివలె తోపింప జేయుచు, విద్వాంసులను గూడ మోహింపజేయునది గనుక అభ్యాసకులిచట పొరబడకుండుటకు గాను యీ విషయ సిద్ధాంత నిరూఢిని, తిరిగి యిచట చేయడమైన దని యీ విషయ ప్రాధాన్యమును పాఠకులు గ్రహింతురు గాక——

## సర్వాధిష్ఠాన సర్వాత్మ, అఖండ గ్రహణము

శాస్త్రము జ్ఞానాభ్యాసకునకు, తన సర్వాధిష్ఠాన, సర్వాత్మ, అఖండ గ్రహణానుభవము వలననే ముక్తియని తెలుపుచున్నది. కాని స్వశరీర సర్వ దృశ్యమంతయూ ఖండ, ఖండ, రూపమున, పరిచ్ఛిన్న వి భా గ ము లు గ నున్నట్లు గోచరించుచున్నది. ఇది వుని అనాది భ్రాంతిచే కలుగుచున్నది గాని పరమార్థ వాస్తవముకాదు. ఈ అవిద్యానివృత్తికి గాను, మానవుడు, గుర్వీశ్వరానుగ్రహ శాస్త్రబోధ వలన తన వాస్తవస్వరూపమైన అఖండ పరిపూర్ణతను గ్రహించి సంసార విముక్తుడగుటకుగాను ఫలపర్యంతము తన అధిష్ఠాన, అఖండ పరిపూర్ణత్వమును, నిరంతరానుసంధానాదుల నాచరించు

చుండుట యావశ్యకము. ఇట్టి అనుసంధానాభ్యాసాదుల గ్రహణ సౌలభ్యము నకు గాను శాస్త్రము, ముముక్షువునకు, వ్యవహార ప్రసిద్ధమైన, నిర ల మహా కాశ, నిస్తరంగ సముద్రముల నుదాహరణములుగ తెలుపుచున్నది. కాని యివి అతిగం ర దృష్టాంతములగుటచే, వీటి గ్రహణము కలుగుట, అంత సులభ సాధ్యముగ నుండదు — శ్రమసాధ్యము, కావున ముముక్షువునకు యీ న్న, న్న, పరిచ్ఛిన్న దృశ్యోపాధు లన్నిటికినీ అనగా సర్వదృశ్యము నకున్నూ అధిష్ఠానము, ఏకము, అఖండము అని అతి సులభముగ తెలిసి కొనుటకు గాను, నీ క్రింది యుదాహరణ ముపకరించును. అది పండిత పామరు లందరికినీ సామాన్యానుభవములో నున్నదే, ఏదియనిన, దృశ్య సర్వాధిష్ఠాన స్థానీయముగ, శ్వేత పత్రముగాని, లేక శ్వేతాంబర పటమును గాని సికొనవచ్చును. ఇట్టి ఒక్కటైన శ్వేతపత్రము, లేక శ్వేతాంబర పటముల మీదనే గదా అనేక రేఖారూపములతో సాంకేతికముగ అనేకాక్షర సముదాయమును, ఉల్లేఖనము చేసి, మన వ్యవహార ప్రయోజనములను పొందుచున్నాము, మనలకు యిట్లు వ్యవహార ప్రయోజనములగు అంశము లన్నియూ కల్పనామాత్ర సాంకేతికములై ఆ ఒక్కటైన శ్వేత పత్రమునందు గాని లేక శ్వేతాంబర పటమునందుగాని మాత్రమేగదా కనబడుచున్నవి. ఈ రేఖాసాంకేతికము లన్నియూ న్నవి న్నములై అనేక సంఖ్యాకము లైనను యివి యన్నియూ వాటికి ఆధారభూతమైన, అఖండైక అధిష్ఠాన పదార్థము నందే యుండవలెనుగాని, తమ అఖండాధిష్ఠానమును విడచి యీ కల్పిత ఖామాత్ర అక్షర సాంకేతికము లు ం డ వు. ఉండుటకు వీలులేదు. ఈ సాంకేతి కాక్షర సమూహమంతయూ వ్యవహారమాత్ర ప్రయోజనమైన, న్న, వి న్న పరిచ్ఛిన్నోపాధి ప్రపంచ దృశ్యము వంటిది, ఈ వివిధ నామరూపాత్మకమైన ద్వైతదృశ్యమంతయూ రేఖాక్షర సాంకేతికముల లాగున కల్పితమై సాదృశ్యమునందు శ్వేతపత్ర స్థానీయమగుచున్న అఖండ పదార్థము నందే మాయా ప్రభావము వలన వుని అనాది అవిద్యని కల్పితమైన యీ ప్రపంచము కేవల వ్యవహార ప్రయోజకమగుచున్నదచే

గ్రహించ వలెను. ఇంకనూ సాదృశ్యమందు అధిష్ఠాన స్థానీయములైన శ్వేత పత్రము లేక శ్వేతాంబర పటములు, కల్పితమై రేఖామాత్రములైన, వివిధాక్షరములను లిఖించుటకు పూర్వము, వికారరహితమై అధిష్ఠాన మాత్రముగ తమకుతామే యున్నవి. కాని కల్పితాక్షర సాంకేతికములున్న కాలమున మాత్రమే, అధిష్ఠాన, వ్యవహార ప్రయోజనము కలుగుచూ ఆ అధిష్ఠాన పదార్థమునందు కల్పిత సాంకేతిక రేఖాక్షరములను (అనగా సర్వ దృశ్యమును) అధిష్ఠాన పదార్థమునుంచి కడిగివేసిన (త్యజించిన) తదుపరిగాని, అంతకు పూర్వము అనగా అక్షరములు లేని కాలమునగాని, అక్షరములున్న కాలమునగాని యెల్లప్పుడునూ అధిష్ఠానమునకు మార్పు కలుగుటలేదు — ఏకరూపమున నున్నది. అయినను యిట్టి యేకమై స్వచ్ఛమైన అధిష్ఠాన రూపమును, అక్షరములు (దృశ్యము) ఉన్న కాలములో బాగుగ గ్రహించలేకున్నాడు —– కావున శుద్ధ జలముతో కల్పిత రేఖాసముదాయమును కడిగివైచిన, తిరిగి యవి, అఖండాధిష్ఠాన శుద్ధ స్వరూపముతో నగుపడును. ఇట్లే జ్ఞానాభ్యాసకుడు సాదృశ్యమందు శుద్ధ జలస్థానీయమైన తన జ్ఞానామృత వర్షముచే, వివిధాక్షర స్థానీయములుగానున్న యీ స్వశరీర సర్వ దృశ్యము నంతనూ కడిగివేసిన యెడల, అనగా యిచట తన వాస్తవ స్వరూప జ్ఞానముచే జగద్దృశ్యమిథ్యాత్వమును బాగుగ గ్రహించి, సర్వదృశ్యమునూ జ్ఞానపూర్వకముగ త్యజించిన యెడల అప్పుడు సర్వాధిష్ఠానమగు తన పరమార్థ సత్య స్వరూపమును నిర్వికార పరిపూర్ణాధిష్ఠానమున, సులభముగ గ్రహించ వచ్చును కావున ముముక్షు అనుసంధానాదులకు సులభోపాయముగ నుండుటకుగాను, నీ సామాన్య వ్యవహార దృష్టాంతమును గూడ నిరూపించడమైనదని గ్రహించవలెను.

## అ భ్యా స ప్ర శం స

ఇచట అభ్యాసమనగా బ్రహ్మజ్ఞానాభ్యాసము. ఈ బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు గురుశాస్త్రబోధ వలననూ, వివేచన మననాదుల వల్లనూ తన వాస్తవ స్వరూపమైన సర్వాధిష్ఠాన అద్వైయ పరిపూర్ణ అఖండత్వమును, యెంత

బాగుగ గ్రహించిననూ యిప్పు యభ్యాసకుని ప్రారబ్ధ శేషముచే అజ్ఞానము, తన పరమార్థ సత్య స్వరూపమైన బ్రహ్మ పదార్థమును కప్పుచునే యుండును. అనగా సత్యస్వరూపము నగుపడకుండ చేయుచుండును. ఎట్లన మంచి నీటి తటాకమందు జలమును నాచుకప్పియుండునట్లు చేయుచుండును. (ఇచట మంచినీటి తటాక మనగా శ్రీతి నిశ్చయములతో గ్రహించిన పరోక్షజ్ఞానము. దాహము వేయుట యనగా వమోక్షేచ్ఛ కలిగియుండుట) అయిననూ యీ కొలను దగ్గర యుండి దాహము వేసినవాడు నీటికి వేరుప్రయత్నము చేయ నక్కరలేదు. కాని చేయవలసినదేమియనిన తన హస్తములతో నాచును బాగుగ తొలగించిన మాత్రమున మధురోదకపానముచేయ సమర్థుడగును గదా. (ఇచట హస్తములు తన మనఃస్థానీయము) ఇట్లే జ్ఞానాభ్యాసకుడు తన సత్యస్వరూపమైన అఖండ పరిపూర్ణత్వమును పొందవలసియున్నది. అందుకు గాను యిప్పుడు తన సత్యస్వరూపము; స్వశరీర సర్వదృశ్యము వాస్తవమను అనాద జ్ఞాన మనునట్టి నాచుచేత కప్పబడియుండుట వలన, తన స్వస్వరూపాను సంధాన కాలములందెల్ల, మంచినీటి మీదనున్న నాచును తొలగించి నటుల యీ స్వశరీర దృశ్య సత్యత్వ బుద్ధిని తన జ్ఞానబలముచే బాగుగ తొలగించు చుండవలయును. అప్పుడు యీ జ్ఞానాభ్యాసకునకు తన అధిష్ఠాన రూపమై, మధుర జలస్థానీయమైయున్న పరిపూర్ణ చైతన్యము గోచరించుచుండును, ఇదియే తన అఖండ సత్యస్వరూపము-కాని తిరిగి, తిరిగి దృశ్యము, వాస్తవ మను అహం, మమేదములతో రాగద్వేష యుక్తమై అజ్ఞాన మావరించు చునే యుండును. జీవునకే అజ్ఞానమనునది నీటికి నాచువంటిది. ఈ నాచువంటి అజ్ఞానమును, తిరిగి, తిరిగి కలుగకుండ చేయుటకు, పునః స్వశరీర జగన్మి థ్యాత్వ జ్ఞానదార్ఢ్యమును సంపాదించుట కంటె వేరు దారిలేదు. ఈ జ్ఞాన నిశ్చయమే, మంచినీటిమీద నున్న నాచును సివేయులాగున మానవునికి స్వశరీర జగత్సత్యత్వ బుద్ధిని క్షీణింప జేయును కావున జగన్మిథ్యాత్వ జ్ఞానాభ్యా సము ముముక్షువునకు అమృతము వంటిదిగాన, దీనియొక్క నిరంతరాభ్యాస

మావశ్యకము. ఏలనన ప్రతిరోజున బాగుచేయుచూ నాచును సివేయు తటాక జలమందు తిరిగి నాచుచేరుటకు కాలక్రమమున నసమర్థమగును — తదుపరి జలమెప్పుడునూ స్వచ్ఛముగా కనబడుచుండును — అట్లే యీ ముముక్షువు యొక్క నిత్యజ్ఞానాభ్యాసపటిమ అను ప్రజ్ఞ, కాలక్రమమున తన అజ్ఞానమను నాచునుక్షీణింపజేసి, ప్రారబ్ధాంతమందు అజ్ఞానమును నశింప జేయును. అప్పుడు తిరిగి అజ్ఞానమనునది కలుగుటకు వీలులేదు.

పరమ సారాంశ మేమనిన యెంతటి జ్ఞానాభ్యాసకునికైననూ, ప్రారబ్ధ శేషము భోగము వలన గాని నశించదు గనుకనూ, ప్రారబ్ధానుభవము సామాన్యముగ తప్పదు గనుకనూ, జ్ఞానాభ్యాసకుడు యిప్పుడు తన ప్రారబ్ధమునసనుభవించుటయందు తిరిగి తనకు ప్రారబ్ధోత్పత్తి కాకుండునటుల భోగములను, పొందుచుండవలయును. అది యెట్లనిన స్వశరీర ప్రపంచదృశ్యమునందున తనకు, కలుగుచున్న రాగద్వేష, కర్తృత్వాద్యభిమానములను జ్ఞానపూర్వకముగ త్యజించి ప్రారబ్ధానుసార భోగముల ననుభవించుచుండుటయే, ఇట్లనుభవించుట స్వశరీర జగన్మిధ్యాత్వ జ్ఞాన నిశ్చయము వలన గాని సాధ్యము కాదు — ఇట్టి జ్ఞానము ముముక్షువునకు, ఈశ్వరానుగ్రహయుక్త గురు, శాస్త్ర బోధవలన గాని కలుగదని నిశ్చయముగ తెలిసికొనవలయును-యథార్థమగు ముముక్షువునకు యీ ప్రపంచమున తన ప్రారబ్ధానుభవమును క్షయింప జేసికొనుచు, తిరిగి తనకు ప్రారబ్ధోత్పత్తి కాకుండునటుల తనలోకానుభవములను పొందుచుండుటయే పరమకర్తవ్యము గాని, అన్యసంబంధానుభవములు తనకు గౌణములగుచు, వ్యవహార వ్యవస్థితి మాత్రములని నిశ్చయముగ గ్రహించుటయే, ముముక్షు పరమార్థము గాని అన్యముకాదు—

కావున జ్ఞానాభ్యాసకులు యీపై అనుభవ నిరూపణ వాక్యముల సారాంశమును బాగుగ గ్రహించి ఫలావగతి పర్యంతము, విసుగు జెందక, ప్రీతి నిశ్చయములతో స్వశరీర జగన్మిథ్యాత్వ జ్ఞాన నిశ్చయమును సంపాదించి,

స్వస్వరూపానుసంధానాభ్యాసాదులను నిరంతరము నాచరించుచుండుట యావశ్యకము. ఇదియే సాక్షాన్మోక్ష సాధనము. ఈ విషయమునే పునః, పునః, తెలుపుట యనునది పునరుక్తి దోషము గాక జ్ఞానాభ్యాసకుని యొక్క యితి కర్తవ్యత, సిద్ధాంత, దార్ఢ్యములకు గానే దురవగాహమైన యీ బ్రహ్మ స్వరూప, విద్యాభ్యాసములు వివిధముగ, తిరిగి, తిరిగి తెలుపబడుచున్నవని గ్రహించవలెను — "అభ్యాసాత్సర్వ సిద్ధిస్స్యాదితి వేదానుశాసనమ్" అని వసిష్ఠ వచనము గూడ తెలుపుచున్నది—

## మ నో జ య ము

బ్రహ్మ జ్ఞానాభ్యాసకునికి యీ మనోజయ మనునది అత్యావశ్యకము. ఏలనన యీ మనస్స్వరూపమును బట్టియే సంకల్పములు సముద్రతరంగముల లాగున కలుగుచుండును. ఇట్లు కలుగు స్వభావము కలదియే మనస్సని చెప్పబడుచున్నది. లోగడ తెలిపిన యటుల, నిస్సంకల్పమనసు బ్రహ్మయనియు, యీ బ్రహ్మయే అనాదిమాయా వివశుడై సంకల్పయుతుడై తోచునప్పుడు మనస్సు అనియూ, నిస్సంకల్పమనసు బ్రహ్మ యనియూ చెప్పబడు చున్నది - ఇందువలననే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" అని శాస్త్రవచనము; మానవుని బంధమోక్షములకు రెంటికినీ యీ మనస్సేకారణమని చెప్పుచున్నది. కావున జిజ్ఞాసువు యీ మనస్స్వరూపము బాగుగ గుర్తించి, సముద్ర తరంగముల లాగున తనకు కలుగు చున్న సంకల్పములను నిరోధించ ప్రయత్నించుచుండవలెను. ఈ సంకల్పము లన్నియూ తన అంతఃకరణోపాధి వాసనా బలముచే కల్పితములై వునకు ప్రారబ్ధానుభవముల నిచ్చుచుండును - ఈ ప్రారబ్ధ భోగములు తస కర ఫలములు గనుక తాను కోరుకున్ననూ కోరకపోయిననూ వచ్చుచుండును-

కావున మానవుడు తనకు యిప్పుడు కలుగవలసిన అనుభవములను కోరవలసిన యవసరము లేదు — కాని తన వాసనా బలముచే యీ కోరికల ద్వారా సంకల్పములు కలుగుచుండును. ఇట్టి సంకల్పములు మానవున కిప్పుడు ఫలప్రదములుగాక, భావి ప్రతిబంధమును కలిగించుచుండును. అందువలన జరామరణ ప్రవాహమున జీవునికి సంసారము కలుగుచుండును. జ్ఞానాభ్యాసకునికి, తనకిట్లు పరంపరగా కలుగు సంకల్పములను, వివేకముతో నిరోధించుటయే మనోజయము — ఈ మనస్సనుస్థితియే మాయా కల్పితము గనుక — యీ మనస్సే విలాసముగ వాసనానుకూల సంకల్పములను జేయుచు, మానవులకు బంధమోక్షములకు హేతువగుచుండును — జీవునకు సంసార బంధహేతువగు నిట్టి సంకల్పములను చిత్తమును, ముముక్షువు బ్రహ్మాకారాకారితముగ అనుసంధానము చేయుచుండవలయును. లేనిచో యీ మనస్సు సదా జీవుని, సంసార బంధమునుంచి దాటుటకు అశక్తునిగా చేయును — దీనినే:—

శ్లో॥ సంకల్పవాసనా జాలైః స్వైరేవాయాతి బంధనం ।
మనో లామయైశ్చింధైః కోశకారక్రిమిర్యథా ॥

అనగా పట్టుపురుగు తన నోటి చొంగచేతనే గలుగు దారములనే తనచుట్టునూ కోశముగా చుట్టుకొని తాను దానినుండి వచ్చు మార్గములేక బంధింపబడి యుండునట్లు యీ మనసు విలాసముగా తాను కల్పించుకొనిన, వాసనలయొక్క సంకల్పములచే బంధింపబడుచున్నదని శ్రీ వసిష్ఠ వచనము తెలుపుచున్నది- కావున జ్ఞానాభ్యాసకులు యీ వాసనా సంకల్పజాలములను బహుజాగరూకులై నిరోధించుటయే మనోజయ మనబడును.

# ఆత్మానుసన్ధాన శ్లోకములు, తద్వివరణము

జిజ్ఞాసువుల నిత్యానుసంధానమునకు సులభసాధ్యమగునట్లు వేదాన్త తత్త్వసారమును సంగ్రహముగ శ్లోకరూపంబున నీక్రింద నిరూపించుచున్నాడను——

— తత్త్వస్తోత్రమ్ —

శ్లో॥ ఆతా సర్వగత శ్శాంతో నిరవద్యోనిరాకృతిః ।
పుణ్యపాపాదిరహితో మహాకాశమివ స్థితః॥ ౧ ॥

శ్లో॥ భ్రాంతిమాత్రమిదం విద్వన్ సర్వమాత్మనికల్పితమ్ ।
అధిష్ఠానే పరిజ్ఞాతే స్వప్నవత్పరి యతే ॥ ౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సంవిన్మాత్రైకరూపవాన్ ।
నిత్య స్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥ ౩ ॥

శ్లో॥ పరంజ్యోతిరహంరూపం తిష్ఠామ్యచలవత్సదా ।
నకర్తాహం నభోక్తాహం చిదాకాశ స్వరూపవాన్ ॥ ౪ ॥

శ్లో॥ చిదాత నిపరిజ్ఞాతే సర్వంశూన్యం భవేదిదమ్ ।
దీర్ఘస్వప్న మిదంవిశ్వం రజ్జ్వాం సర్ప ఇవోదితమ్ ॥ ౫ ॥

శ్లో॥ చిదేవాహం చిదేవత్వం చిదేవ భువనత్రయమ్ ।
చిదేవ పంచభూతాని చితోఽన్యన్నహి కించన ॥ ౬ ॥

శ్లో॥ కర్తా భోక్తేతి విజ్ఞానం విద్ధిసర్వం భ్రమోదితమ్ ।
విషయ వ్యసనం త్యక్త్వాతిష్ఠేదాత్మనికేవలే ॥ ౭ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం సచ్చిదానంద లక్షణః ।
నిర్గుణశ్చ నిరాకారో నిష్క్రియస్సంగ వర్జితః ॥ ౮ ॥

శ్లో॥ విద్ధిత్వాం ప్రత్యగాత్మానం పరమాత్మ స్వరూపిణమ్ ।
సర్వాత్మా హ్యహమేవాసి మదన్యన్నాస్తికించన॥ ౯ ॥

శ్లో॥ త్యక్త్వా బాహ్య మిదం దేహం తత్త్వ మస్యాదిచింతనాత్ ।
విద్ధిత్వాం ప్రత్యగాత్మానం పరమాత్మాన మవ్యయమ్ ॥ ౧౦ ॥

శ్లో॥ తత్త్వసార మిదం పుణ్యం సర్వకల్యాణ భాజనమ్ ।
వేదవ త్సర్వదాధ్యేయం ముముక్షు జ్ఞానసాధనమ్ ॥ ౧౧ ॥

శ్లో॥ తత్త్వస్తోత్ర మిదం పుణ్యం మోహధ్వాన్తప్రబోధితమ్ ।
యఃపఠేత్సతతం భక్త్యా సను తత్త్వ విద్భవేత్ ॥ ౧౨ ॥

## తత్త్వామృతమ్

శ్లో॥ అతత్త్వే తత్త్వభావేన, యోదేహోవృతస్థ్సితః ।
నాస్త్యేవపౌరుషాదనా , సంసారోత్తరణేగతిః ॥ ౧ ॥

2 శ్లో॥ దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్ ।
ఏకతత్త్వఘనా భ్యాసాత్ చిత్తంగచ్ఛత్య చిత్తతామ్ ॥ ౨॥

3 శ్లో॥ నిరస్త విషయాసంగం సంనిరుద్ధం మనోహృది ।
యదాయాత్యున నీభావం తదాతత్పరమం పదమ్ ॥ ౩ ॥

శ్లో॥ తావదేవ నిరోద్ధవ్యం యావద్వృత్తి గతంక్షయమ్ ।
ఏతద్ జ్ఞానంచ మోక్షంచ శేషోహిగ్రంథ విస్తరః ॥ ౪ ॥

## ఆత్మాను సంధానమ్

శ్లో॥ సంవిత్సార మనన్తోఽహ మఖండైక రసశ్శివః ।
అదృశ్యః పరిపూర్ణోఽహ మచరశ్చర ఏవచ ॥ ౧ ॥

2 శ్లో॥ అసంగశ్చా పరిచ్ఛిన్నః పరిచ్ఛిన్న ఇవస్థితః ।
నిరాకారస్వరూపోఽపి సాకారోఽహ మవిద్యయా ॥ ౨ ॥

శ్లో॥ ద్రష్టృ దర్శన దృశ్యానా మభావో యత్రదృశ్యతే ।
సత్యజ్ఞానానంత రూపం తమాత్మానముపాస హే ॥ ౩ ॥

శ్లో॥ అసంస్తుతాధ్వగాలోకే మనస్యన్యత్ర సంస్థితే ।
యాప్రతీరనాగ స్యాతచ్చిద్బ్రహ్మోఽస్మిసర్వగః ॥ ౪ ॥

అనగా యిచటనున్న పురుషునియొక్క మనసు దూరదేశమున నున్న దగుచుండగా, పురుషునకు విషయమునకు మధ్యప్రదేశమందు—విషయ సంస్పర్శ లేని చిన్మాత్రమగు, నేప్రతీతి కలదో అట్టి చిన్మాత్ర స్వరూపుడైన బ్రహ్మము నే నగుచున్నాడను.

5 శ్లో॥ సర్వసంకల్ప ఫలదం సర్వతేజః ప్రకాశకం ।
సర్వోపాదేయ సీమాంతం చిదాత్మాన ముపాస్మహే ॥ ౫ ॥

అనగా సమస్త సంకల్పములు నొసగువాడును, సమస్తమగు తేజంబుల ప్రకాశింప జేయువాడును - ఉపాదేయంబులకు (అనగా ఉపాధులు—విషయములకు) వేరైనవాడును నగు చిదాత్మను ఉపాసించుచున్నాము. అనగా అనుసంధాన పరుడు తన వాస్తవ స్వస్వరూపము, దృశ్య, పరిచ్ఛిన్న, విషయాకారము గలది కాదనియూ ఈ తన మనస్సు మొదలగు దృశ్య విషయము లన్నియూ కల్పిత పరిచ్ఛిన్నములు గావున, తన మనసుయొక్క సంకల్ప, బలాబలము లను బట్టి అచలుడై, అసంగుడై, ఒక్కటియై అఖండమైన ఈ సత్య జ్ఞానానంత పదార్థమునందే (అనగా బ్రహ్మయందు) వివర్తముగా తోచుచుండును. ఈ ముముక్షువుడు యెప్పుడు తన సత్య స్వరూపము, కల్పిత విషయాకార, పరిచ్ఛిన్నమైనదిగాక తను అఖండ పరిపూర్ణుడనని తెలుసుకొని అనుభవమును పొందునో అప్పుడు తాను అహం అను నేను (ఈ వుడు) అఖండ జ్ఞాన స్వరూపుడే యగును. ఇది నిశ్చయము.

## ఆత్మాష్టకమ్

శ్లో॥ ఏకతత్త్వఘనాభ్యాసాత్, దృశ్యోఽదృశ్యపదంగతే ।
చిత్తం హ్యచిత్తతాం ప్రాప్య, బ్రహ్మాకారేణ భాసతే ॥ ౧ ॥

2 శ్లో॥ అహం సర్వమిదం విశ్వం, స్వప్రకాశేన భాసతే ।
ఏకలింగ మహారూపో, పరమాత్మాహ మచ్యుతః ॥ ౨ ॥

శ్లో॥ అఖండానంద బోధోఽహ. మసంగో హ్యవికారవాన్ ।
సత్యజ్ఞానానంతరూపః, పరమాత్మా హ మచ్యుతః ॥ ౩ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం, నిర్మలస్ఫటికాకృతిః ।
నిత్యః సర్వగత శ్శాంతః, పరమాత్మా హ మచ్యుతః ॥ ౪ ॥

శ్లో॥ పూర్ణస్యపూర్ణ మాదాయ, అఖండ పరిపూర్ణవాన్ ।
చిద్ఘనానందరూపోఽహం. పరమాత్మాహ మచ్యుతః ॥ ౫ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం, దృశ్యదర్శన వర్జితః ।
అహం సర్వమిదం విశ్వం, పరమాత్మా హ మచ్యుతః ॥ ౬ ॥

శ్లో॥ కార్యకారణ రూపస్సన్, సర్వాధిష్ఠాన మద్భుతః ।
శాంతదేహ చమత్కారః, పరమాత్మాహ మచ్యుతః ॥ ౭ ॥

శ్లో॥ నాహంభోక్తా నకర్తాచ, నబాధ్యో నచబాధకః ।
అద్వితీయం పరంజ్యోతిః, పరమాత్మాహ మచ్యుతః ॥ ౮ ॥

శ్లో॥ ఆత్మాష్టక మిదం పుణ్యం, మోహబ్రామ కృతం శుభం ।
యః పఠేత్సతతం భక్త్యా, విజ్ఞాన ఘనవాన్ భవేత్ ॥ ౯ ॥

# చిదాకాశానుసంధాన స్తోత్రమ్

శ్లో॥ జ్ఞానానందఘనం నిత్యం నిర్మలం స్ఫటిక ప్రభమ్ ।
ఆధారం సర్వభూతానాం చిదాకాశ ముపాస్మహే ॥ ౧ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం నామరూపవివర్జితః ।
శాన్తోఽఖండశ్శివశ్చాహం సంవిన్మాత్రే సదాస్థితః ॥ ౨ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం నామరూప వివర్జితః ।
నామరూప మిదం సర్వం కల్పితం చిత్త విభ్రమాత్ ॥ ౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరిపూర్ణ మివాంబరమ్ ।
అన్తః పూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే ॥ ౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సంవిన్మాత్ర స్వరూపతః ।
అకర్తాహ మభోక్తాహం నిర్గుణస్సంగ వర్జితః ॥ ౫ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం మహాకాశ ఇవామలః ।
నిత్య స్సర్వగతః స్థాణుః సంవిత్ స్ఫటిక నిర్మలః ॥ ౬ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నామరూపాదికల్పితః ।
అన్తశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ మివాంబరమ్ ॥ ౭ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వాధిష్ఠాన మవ్యయః ।
ప్రత్యగాత్మా స్వయంజ్యోతిః పరమాత్మాఽహ మచ్యుతః ॥ ౮ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం దృశ్యదర్శన వర్జితః ।
అఖండ జ్ఞాన రూపోఽహం పరమాత్మాహమచ్యుతః ॥ ౯ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం సంవినా త్రైశిక ధర వాన్ ।
సర్వభూతేషు చాతా హం సర్వభూతాని చాత్మని ॥ ౧౦ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం సర్వ సంకల్ప వర్జితః ।
పరిపూర్ణ శ్శివశ్శాన్తః అఖండ జ్యో తి రాకృతిః ॥ ౧౧ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోఽహం సర్వంచాప్యహమేవచ ।
సర్వం చఖల్విదం బ్రహ్మ నాన్యద స్తి చ కించన ॥ ౧౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం అహమేభ్యః పరోఽవ్యయః ।
బీజంచ సర్వభూతానాం నామరూప వివర్జితః ॥ ౧౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరమాత్మా హ మచ్యుతః ।
సర్వేన్ద్రియ గుణాభాసః సర్వేన్ద్రియ వివర్జితః ॥ ౧౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం అఖండ పరిపూర్ణ వాన్ ।
బహిర న్తశ్చభూతానాం అచరం చరమేవచ ౧౫ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరిపూర్ణ మివాంబరమ్ ।
అవిభ క్తశ్చ భూతేషు విభ క్త ఇవచస్థితః ॥ ౧౬ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరమాత్మా హమచు తః ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం జ్యో తిషాంజ్యోతిరేవచ ॥ ౧౭ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నామరూపమివ స్థితః ।
భ్రాన్తిమాత్ర మిదం విశ్వం రజ్జ్వాం సర్పఇవోదితమ్ ॥ ౧౮ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వోపాధి వివర్జితః ।
సర్వసాక్షీ ప్రకాశోఽహం ప్రత్యగాత్మ స్వరూపవాన్ ॥ ౧౯ ॥

# చిదాకాశానుసంధానస్తోత్రమ్

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం అఖండ పరిపూర్ణవాన్ ।
అంతఃకరణ సంత్యాగా దవశిష్టేచిదాత ని ॥ ౨౦ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం 'పూర్ణస్య' శ్రుతిచోదితః ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥ ౨౧ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం అద్వితీయం పరంసుఖమ్ ।
బ్రహ్మ రూపమిదం సర్వం నేహనానాస్తి కించన । ౨౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కార్యకారణరూపవాన్ ।
ఏక ఏవాంబుధిర్యద్వత్ భంగబుద్బుద ఫేనకైః ॥ ౨౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరమాత్మాహ మచ్యుతః ।
బోధరూప మహాలింగః అఖండ స్సంగవర్జితః ॥ ౨౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం విషయాకార వర్జితః ।
అఖండ పరిపూర్ణోఽహం సర్వసంగ వివర్జితః ॥ ౨౫ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నిర లః స్ఫటికాకృతిః ।
ఆధార స్సర్వభూతానాం అగుణో గుణవానివ ॥ ౨౬ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కర్తృత్వాది విహీనవాన్ ।
నిష్క్రియో నిరహంకారః సాక్షిమాత్ర ప్రకాశవాన్ ॥ ౨౭ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరమాత్మాహమచ్యుతః ।
నిర్గుణోనిశ్చలోఽరూపః అచలస్సంగవర్జితః ॥ ౨౮ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం జరామరణ వర్జితః ।
అఖండ పరిపూర్ణోఽహం అనంత పరమాత్మకః॥ ౨౯ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం అఖండ స్సంగవర్జితః।
నిర స్త విషయాసంగః పరిపూర్ణ ఇవాంబరమ్॥ ౩౦॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సచ్చిదానంద లక్షణః।
ప్రజ్ఞాన ఘనరూపోఽహం ప్రత్యగాత్మా స్స్వయం ప్రభః॥ ౩౧॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నిరవద్యోనిరాకృతిః।
నిత్యానందః పరంజ్యోతి రద్వితీయో హ్యఖండితః॥ ౩౨॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం చిద్ఘనానంద లక్షణః।
సర్వాధిష్ఠానరూపోఽహం ఆకాశమివసంస్థితః॥ ౩౩॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం తేజోరూపశ్చిదంబరః।
సంవిన్మాత్ర స్సదాపూర్ణో విశుద్ధాత్మా నిరామయః॥ ౩౪॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం ద్రష్టృ దృశ్య వివర్జితః।
సంవిన్మాత్రస్వరూపోఽహం సచ్చిదానందలక్షణః॥ ౩౫॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వదృశ్య వివర్జితః।
నిర స్తవిషయాకార స్సచ్చిదానంద లక్షణః॥ ౩౬॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కర్తృభోక్తృత్వ వర్జితః।
నిష్క్రియోనిరహంకార స్తచ్ఛివం శాంతమవ్యయం॥ ౩౭॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహ మచలోఽహంసనాతనః।
ఏకరూపః ప్రశాంతాత్మా నిర్మలఃస్ఫటికో యథా॥ ౩౮॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం, సర్వ దృశ్యవివర్జితః।
చిన్మాత్రమద్వయంశాంత మేకంబ్రహ్మాస్మినేతరత్॥ ౩౯॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వోపాధి వివర్జితః ।
అద్వి య మనాద్యంత మక్షరం శాంతమేవచ ॥ ౪౦ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహ మసంగోఽసంగఏవచ ।
అకర్తాహ మభోక్తాహంకేవలోహంసదాశివః ॥ ౪౧ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం పరాత్మాపరమేవచ ।
చిద్రూపస్ఫూర్యలక్షిత స్సమస్తాభాసభాసనః ॥ ౪౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం శుద్ధబోధాత్మకశ్శివః ।
అద్వి యం స్వయంజ్యోతిః పరమాత్మాహ మచ్యుతః ॥ ౪౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహ మసంగ వ్యవహారవాన్ ।
కర్తృత్వాది వినిర్ముక్తో మేఘాకాశ మివస్థితః ॥ ౪౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం లోహితః స్ఫటికోయథా ।
అంతఃకరణధర్మేణ ప్రారబ్ధేన సమన్వితః ॥ ౪౫ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం మయివిశ్వంనవిద్యతే ।
జపాకుసుమసాన్నిధ్యా రక్తత్వంస్ఫటికే యథా ॥ ౪౬ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నిర్వికల్పోనిరంజనః ।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽసి నిర్మలః ॥ ౪౭ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నిస్సంగో నిర్మలోఽచలః ।
నిత్యశుద్ధ విముక్తైక మఖండానంద మద్వయః ॥ ౪౮ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం స్వశరీరం వివర్జితః ।
శరీరంచ జగత్సర్వం సర్వంబ్రహ్మణి కల్పితమ్ ॥ ౪౯ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సచ్చిదానంద లక్షణః ।
దీర్ఘస్వప్నమిదం విశ్వం విశ్వం బ్రహ్మణి కల్పితమ్ ॥ ౩౦ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కేవలోఽద్వయఏవచ ।
గ్రహీతుర్గ్రహదోషేణ నానాత్వం నచవస్తునః ॥ ౩౧ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వం బ్రహ్మైవకేవలమ్ ।
వ్యోమ్నీవ నగరం సర్వం విశ్వం బ్రహ్మణికల్పితమ్ ॥ ౩౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నామరూప వివర్జితః ।
స్వప్రకాశః పరంజ్యోతిః సర్వదా దహరే స్థితః ॥ ౩౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం శరీరత్రయవర్జితః ।
పరిపూర్ణశ్శివశ్శాన్తః సర్వదాదహరేస్థితః ॥ ౩౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం మమాహంభావవర్జితః ।
అవ్యయః పరిపూర్ణోఽహం సర్వదాదహరేస్థితః ॥ ౩౫ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సూర్యచన్ద్రాదివర్జితః ।
జ్యోతిషామపి యజ్జ్యోతిః సర్వదాదహరేస్థితః ॥ ౩౬ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం మాయావిద్యావివర్జితః ।
సాక్షీచేతా నిర్గుణశ్చ సర్వదాదహరేస్థితః ॥ ౩౭ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం నిత్యస్సర్వగతశ్శివః ।
సర్వాధిష్ఠాన రూపోఽహం సర్వదాదహరేస్థితః ॥ ౩౮ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సచ్చిదానన్ద లక్షణః ।
అఖండ జ్యోతిరేవాఽహం సర్వదాదహరేస్థితః ॥ ౩౯ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కూటస్థః ప్రత్యగేవచ ।
సర్వసాక్షీ పరంబ్రహ్మ సర్వదాదహరేస్థితః ॥ ౬౦ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం సర్వజీవగుహాశయః ।
నిర్వికారో నిరాకార స్సర్వదా దహరేస్థితః ॥ ౬౧ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం సర్వదృశ్యవివర్జితః ।
ప్రజ్ఞానఘనరూపోహం సర్వదాదహరేస్థితః ॥ ౬౨ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహం కర్తృభోక్తృత్వ వర్జితః ।
నిరస్త విషయాకారః సర్వదా దహరేస్థితః ॥ ౬౩ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోఽహ మఖండానంద అద్వయః ।
అంబరేణ సమఃపూర్ణ స్సర్వదా దహరేస్థితః ॥ ౬౪ ॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం యోవేదశ్రుతిచోదితః ।
గుహా హి తత్వబోధేన సర్వకామ ఫలాప్తిమాన్ ॥ ౬౫ ॥

శ్లో॥ చిదాకాశమిదంస్తోత్రం మోహ నామసుధీకృతమ్ ।
యః పఠేత్ సతతంభక్త్యాసను ముక్తిమాన్ భవేత్ ॥ ౬౬ ॥

# చిదాకాశానుసంధాన, స్తోత్ర వివరణము

ఈ విషయమును గురించి కొందరకు, ప్రసిద్ధపూర్వాచార్య రచితములైన అనేక స్తోత్రము లుండగ దీని యావశ్యకత ఏమని తోచవచ్చును: ఇది సత్యము, సర్వులకును అవియే ఆధారము. అయిననూ అట్టివి యన్ని యూ

ప్రౌఢార్థముగ అతిగంభీరముకై యున్నందున, కేవల అనుసంధాన సౌలభ్యమును, సులభమార్గముననుసరించి శ్రుత్యనుసారముగ ఇది తెలుపబడినదే కాని అన్యముగాదని గ్రహించవలెను. విద్వాంసులు దీని అభ్యాస లాభమును కరతలామలకముగ నొందగలరను ఆశయముతో సిద్ధాన్తానుసంధానములు హృద్గోచరమగునటుల స్తోత్రరూపమున విశదీకరించినాడను.

బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు, సర్వదా తన సత్య స్వరూపము- దేశ, కాల, వస్త్వబాధితమై, స్వశరీర సర్వోపాధి వినిర్ముక్తమైన, సజాతీయ, విజాతీయ, స్వగత భేద రహిత, నిత్య, నిరతిశయ, స్వప్రకాశ, అసఙ్గ, అఖండ, పరిపూర్ణ చైతన్య పదార్థమనిన్నీ యిదియే తన దహరాకాశమందుండు చిదాకాశ స్వరూపము, పరమాత్మ యనియు, ఇదియే సర్వాధిష్ఠానమై సర్వప్రాణుల యందు ప్రకాశించు పరిపూర్ణ చైతన్య మనియు, ఇదియే పరమాత్మ, సర్వాత్మ యనియు, ఇదియే తానని యు, తన సత్య స్వరూపమునకు మించిన ఇతర పదార్థమేమియు లేదనియూ, గ్రహించి స్వశరీర సర్వ దృశ్యము తన సత్య స్వరూపమందే మాయా కల్పితమై, రజ్జువయందు సర్పభ్రాంతిలాగున కలుగుచున్నదే కాని పరమార్థ వాస్తవము కాదను నిశ్చయముతో నిర్గుణ బ్రహ్మానుసంధానమును చేయుచుండుట యావశ్యకము. ఇదియే తన తరణోపాయమునకు సాక్షాన్మార్గము, ముక్తి సాధనము, అనుసంధానములలో పరమోత్కృష్టమైనది, యని గ్రహించవలెను.

ఇట్టి నిర్గుణ బ్రహ్మానుసంధానాభ్యాసకుడైన ముముక్షువు సర్వదా. శరీరత్రయ వివర్జితమై, జగదుత్పత్తిస్థితిలయములకు అభిన్ననిమిత్తోపాదాన కారణమై, స్వప్రకాశమైన. సర్వాధిష్ఠాన అఖండ పరిపూర్ణ చైతన్యమే తన వాస్తవ స్వరూపమని తన హృత్పుండరీకమందు చిదాకాశ భావన చేయుచుండవలయును. ఈ పరమాత్మ, అద్వితీయ, అఖండ పరిపూర్ణుడైననూ, ప్రతియొక్కరునకునూ, ఆయన వారి, వారి, హృదయమునందే గోచరించునని శ్రుతిమాత తెలుపుచున్నందున ఆత్మానుసంధానాదుల నట్లే చేయుట

శ్రేష్ఠము, అవశ కము. మన యనుభవమును బట్టి చూచినను లోక వ్యవహారమునందు, సర్వదృశ్యమునకున్నూ, యొక్కడై యున్న సూర్యుడు ప్రతి వారికిన్నీ వారు, వారు, యున్న ప్రదేశములందు ప్రాతఃకాలమున తూర్పు దిశయందే ఉదయించి పరిమిత బింబాకారముగ నేత్రదోషములేని వారందరి చేతను యెట్లు చూడబడుచూ సర్వదృశ్యమునకున్నూ సూర్యడొక్కడేయని అందరిచేతను యెట్లు తెలుసుకొనబడుచున్నాడో అట్లే ఈ పరిపూర్ణ, అద్వియ, అఖండ, పరమాత గూడ జ్ఞానదోషము, అనగా అజ్ఞానము లేనివారికి వారివారి హృదయ పుండరీకమందు చిదాకాశ స్వరూపుడుగ గోచరించుచూ తెలిసికొన సాధ్యమగునని శాస్త్రము తెలుపుచున్నది. అనగా పరమాత అచట సాక్షాత్కరించునని గాని, పొందబడుననిగాని, గ్రహించవలయును. చిదాకాశమనగా ఆకాశమువంటి జ్ఞానస్వరూపుడు. ఆకాశ శబ్దము ఇచట సాదృశ మునకే సికొనబడినది. కేవల ఆకాశము జడము, ఈ ఆకాశము వంటి, యనుటలోనే ఆకాశము బ్రహ్మ గాదను విషయము స్పష్టమగుచున్నది. అయినను అయనను తెలిసికొనుటకు వ్యవహారమందు ఈ మ హా కా శ మే బ్రహ్మ లక్షణములకు సన్నిహిత భూతము. దీని- శ్రుతి "ఆకాశ శరీరంబ్రహ్మ" అని బ్రహ్మను ఆకాశమువంటి శరీరము గలవాడని ఆకాశము యొక్క, నిర్మలత్వ, అసఙ్గత్వ, పరిపూర్ణత్వ వ్యాపకత్వాది ల క్ష ణ ము ల ను తీసికొని అట్టి శరీరముగలవాడని ఉపలక్షణముగా తెలుపుచున్నది. ఇచట శరీర మను శబ్దముచే యుపాధిగా తెలియబడుచున్నది. ఉపాధియైన శరీరము ఎప్పుడునూ ఉపస్థితమైన శ రియగుటకు వీలులేదు. ఈ శ ర శబ్దముచేతనే బ్రహ్మ మహాకాశ న్నుడనిన్నీ, అయిననూ ఆకాశమువంటి వాడని శ్రుతి తెలుపుచున్నది. శ్రీ శంకరభగవత్పాదులు గూడ బ్రహ్మానుసంధానమును తెలుపుటకు "దృశిస్వరూపం గగనోపమం పరం" అనిన్నీ, ఇంకనూ:—

శ్లో॥ ఆత్మన్యే వాఖిలం దృశ్యం ప్రవిలాప ధియా సుధీః ।
భావయేదేకమాత్మా నం, నిర లాకాశవత్సదా ॥

అనగా నిద్రయందువలె ఈ దృశ్యమునంతయును బుద్ధిచేత ఆత యందు లయింపజేసి సర్వదా నిర లమైన ఆకాశమువలెనే ఆత ను, తననుగా అను సంధింపవలయునని తెలుపుచున్నారు. కావున ముముక్షుజిజ్ఞాసువు చిదాకాశ స్వరూపుడైన బ్రహ్మ ను తన దహరాకాశమందే సచ్చిదానంద లక్షణములతో తెలుసుకొని పొందవలసియున్నది. దీనినిగురించి సూత్ర భాష్యమునందు శంకరులు సిద్ధాంతపరచియున్నారు,

ముముక్షువైన నిర్గుణబ్రహ్మాభ్యాసకుడు ప్రారబ్ధానుసారమున తన శరీరోపాధులతో నెట్టివ్యవహారము లాచరించుచున్ననూ, అట్టి వానితో తన కెట్టివా స్తవసంబంధములేదనిన్నీ, తన శరీరోపాధులు తనకు కేవల వ్యవహా రానుభవమునకు కల్పితమైన సాధనములే కాని పరమార్థవా స్తవములుకావని నిశ్చయముగా గ్రహించి తన సత్యస్వరూపమును హృత్పుండరీకమందు సర్వదా చిదాకాశరూపమున అనుసంధాన ధ్యానాదులను యాచరించుచుండుట యావశ కము.

ఈ చిదాకాశ స్తోత్రానుసంధాన సౌలభ్య విశేషమేమనిన చిదాకాశ మన్ననూ, బ్రహ్మ యన్ననూ యొక్కటియే యని లోగడనే తెలిపియుంటిమి. కాని చంద్రుడన్ననూ, శీతాంశుడన్ననూ అర్థమొక్కటియేయైననూ శీతాంశు శబ్దమువల్ల చంద్ర లక్షణములైన శైత్య, ఆహ్లాద లక్షణములెట్లు సామాన్య ముగ స్ఫురించునో అట్లే ఈ చిదాకాశ శబ్దముచే బ్రహ్మ కుపలక్షణమైన ఆకాశశబ్దమువల్ల నిర లాకాశ లక్షణములు తన యందు స్ఫురించుటకు సౌలభ ముగనుండునుగాన సల్లక్షణములన్నియూ చేర్చి చిదాకాశాను సంధాన స్తుతి రచించినాడను. ఈచిదాకాశస్వరూపమైన బ్రహ్మా నుసంధానమును హృత్పుండరీకమందే అనుసంధానాదులను చేయుచుండవలయును. ఇట్టి చిదాకాశస్వరూపుడైన బ్రహ్మా నుసంధాన సౌలభ్యముకొరకు ఈ స్తోత్రమును రచించుటలో దహరోపాసనానిరూఢి కొరకే స్తోత్రాంతమందున పన్నెండు శ్లోకములును, వివరింపబడినవి.

వుని దహరాకాశాత్మ కుద్దైన, ఈచిదాకాశోపాసననుగురించి :—

శ్రు॥ "అణోరణీయాన మహతో మహీయానాత్మాగుహాయాంనిహితోఽస్యజన్తోః। తమక్రతుంపశ్యతి వీతశోకోధాతుః ప్రసాదాన్మహిమానమీశం"

అనగా అణువు కంటె అతిసూక్ష్మమైనవాడునూ, గొప్పదైన ఆకాశముకంటె మిక్కిలి గొప్పవాడునూ అగు పరమాత్మ ఈ దేవ మనుష్యాది ప్రాణుల యొక్క హృదయపుండరీకమందుండు, బుద్ధిగుహ యందు విద్యచేత, అనగా జ్ఞానముచే లభించును. పరమేశ్వరుని యొక్క అనుగ్రహము వలన సంకల్ప రహితుడును, మిక్కిలి గొప్పవాడునగు ఆ పరమాత్మను సాక్షాత్కారము చేసుకొనువాడు, జనన జరామరణాది వివర్జితుడగుచున్నాడు అనిన్నీ :—

శ్రు॥ "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ । యోవేదనిహితంగుహాయాం పరమే వ్యోమన్ । సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ॥"

అనగా సత్యం, జ్ఞానం, అనన్తం అని చెప్పబడు బ్రహ్మను, ఎవడు తనబుద్ధి గుహయందు గల దహరాకాశాత్మను తెలుసుకొనునో అట్టివాడు సకల మనోరథములను, బ్రహ్మాత్మ స్వరూపముతో ననుభవించుచుండునినిన్నీ :—

శ్రు॥ "సయఏషోఽన్తర్హృదయ ఆకాశః । తస్మిన్నయం పురుషోమనోమయః । అమృతోహిరణ్మయః"॥

అనగా, ఆయన (ఆపరమాత్మ) సర్వప్రాణుల హృదయాకాశమందు మనోరూపుడై తేజోరూపుడుగా ప్రకాశించుచుండును. ఈయనయే అమృతుడు. అని పై శ్రుతివచనములన్నియు పరమాత్మ వారివారి హృదయాకాశమందు సాక్షాత్కారమగునని తెలుపుచున్నవి. అభ్యాసకులకిచట యొకచిన్న హెచ్చరిక చేయవలసియున్నది. అదియేమన, ఈ బ్రహ్మ ధ్యానానుసంధానాదుల గురించి ఎన్ని విధముల వ్రాసి తెలిపిననూ, అభ్యాసకుడు తాననుసంధానముచేయు

స్వస్వరూప, సాక్షాత్కారమును తన ప్రారబ్ధక్షయమగువరకు : చిరకాలము శ్రద్ధోత్సాహములతో చేయు నిరంతరాభ్యాసము వలనగాని, పొందజాలడు. ఇది వునకు అనాదిగా కలుగుచున్న జన్మ పరంపర సంసార ఆత్యంతిక దుఃఖరాహిత ప్రక్రియ గనుకనూ తనకు నిత్య, నిరతిశయ, సుఖస్వరూపము నిచ్చు పరమ లాభము గనుకనూ, దీని ఫలమునొందుటకు మాసములు, సంవత్సరములు, జన్మలు అని లెక్క చూచుకొనదగినదిగాదు. అనేక జన్మలలో బహు కాలాభ్యాస సాధ్యము. అయిననూ శాస్త్ర ప్రమాణమును బట్టి వుని, నిత్య నిరతిశయ, సుఖస్వరూపము నొందుటకు సాక్షాత్సాధనమిది యొక్కటియే, అన్యములు పరంపరా సాధనములు. కావున ముముక్షువు ఇట్టి అభ్యాసమును ఆమరణాంతము ప్రీతి నిశ్చయములతో చేయుచుండవలయునుగాని ఫల సిద్ధినిగోరి సంతానము కొరకు అశ్వత్థప్రదక్షిణములను చేసిన యువ న్యాయమునగాని, మరియు నీ క్రిందిలోకోక్తి ననుసరించిగాని, నిరుత్సాహము చెంద గూడదు.

లోకములో నొక బ్రహ్మచారి వేదాధ్యయనము చేయుటకొరకు గురు గృహమునకు జనియుండగా, పరమమూఢుడైన నాతనితండ్రి వేదములు నాలుగని చెప్పబడియుండగా మా వాడు పోయి అయిదురోజులైనది ఇంకనూ రాలేదేయని తలచి మిక్కిలి పరితపింప నారంభించెనని, నొక కథ వలన తెలియుచున్నది. కావున ఇట్లు తలచు అభ్యాసకుడు మూఢుడేయగునని ఎరుగ వలయును. అనేక జన్మల అభ్యాసమువలనగాని యోగము అనగా బ్రహ్మ సాక్షాత్కారము కలుగదను నిశ్చయముతో ముముక్షువు చిరకాలాభ్యాసము ప్రీతితో. చేయుచుండవలయును. విద్యలలో నింతకు మించిన విద్యలేదు. గాన నిది జన్మలతో లెక్కచూచుకొనవలసిన విద్య. దీనినే శ్రీకృష్ణభగవానులు:- "అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతిపరాంగతిం" అనిగీతలలో తెలుపుచున్నారు.

# తత్త్వజ్ఞాన పరీక్ష

జ్ఞానాభ్యాసకునకు తన అభ్యాసలాభ మెంత కలుగుచున్నదియూ కూడ తెలిసికొనుట యావశ్యకము. లాభమును గ్రహించలేని యెడల నిరుత్సాహము కలుగును. ఇచట జ్ఞాన మనగా ప్రకరణమును బట్టి బ్రహ్మజ్ఞానమే గాని మరియొకటి కాజాలదు. ఈ జ్ఞాన స్వరూపము అద్వితీయముగాన పరీక్షింప బడుటకు వీలులేదు. కాని జ్ఞానలాభమును స్వానుభవము వల్ల గ్రహించ సాధ్యము. ఈ జ్ఞానము వునకు ప్రాప్త ప్రాప ముగాని వేరుగ సంపాదించ వలసినది గాదు. కాని స్వానుభవము వల్లనే పొంచవలసి యున్నది. ఇట్లు పొందుట ఎట్లని ముముక్షువు ఆలోచించ వలసి యున్నది. జ్ఞానము, అనునది తెలివియే గాని తెలిసికొన బడునదిగాదు. అయిననూ ముముక్షువునకు తన ప్రారబ్ధమును బట్టి దేహధారణ మున్నంత కాలము వ్యవహార దశయే, కావున ఈ స్థితిని బట్టి తెలిసికొను జ్ఞానము గూడ సద్వితీయమే యగును గాని అద్వియముకాదు. కావున యిట్టిది గౌణజ్ఞాన మనియే చెప్పవలయును. అయిననూ వ్ర ముముక్షువు ఇట్టి జ్ఞానమును స్వాతా న్నముగ గ్రహించవలసి యున్నది, గనుక దీనినే సత్యజ్ఞానమని గూడ జెప్పవచ్చును. కాని ప్రారబ్ధమును బట్టి శ రోపాధికుడై యుండుటచేతనూ యీ జ్ఞానము ప్రారబ్ధ నిరోధకమై యుండుటచేతనూ, స్వప్రయత్నాభ్యాసాదులచేత గాని జ్ఞానము భాసించదు. వ్ర ముముక్షువైన వాడు ఇట్లు ప్రయత్నపూర్వకముగా తనకు కలుగుచున్న జ్ఞానము, శాస్త్రీయముగ నున్నదా లేదాయని తెలిసికొనుట యావశ్యకము ఈ జ్ఞానము స్వానుభవైక వేద్యముగాని పరప్రత్యక్షముగాదు, గాన తన జ్ఞానమును ముముక్షువు తన ప్రయత్నముచేతనే స్వానుభవము వలన తెలిసికొనవలయును గాని వేరు విధములేదు. కావున వ ముముక్షువైన వాడు, తన అభ్యాస పాటవముచే, కాలక్రమమున తన ప్రారబ్ధ కర ఫలానుభవములు ఎట్టివి యైననూ. వికారరహితుడై బాగుగ ణించిన స క్తతా మానములతో నిర్లిప్తతగా తన సుఖదుఃఖముల నెప్పుడు పొందగలుగుచుండునో, తన మనస్సంతో

భము తగ్గి శాంతచిత్తుడై తన చిత్త ప్రసాదము స్వస్వరూపానుసంధాన మందు ఎప్పుడు నిరంతరము కలుగు చుండునో, ఎప్పుడు శ్రుతియుక్త్యను భవ జ్ఞానముచే దృశ్య నానాత్వమును అఖండముగ గ్రహింపగలుగు చుండునో, ఎప్పుడు యీ సర్వదృశ్యమునకూ అధిష్ఠానము తన పరమార్థ స్వరూపమేనని నిశ్చయము నొందగలుగునో. ఎప్పుడు ఈ అభ్యాసకుడు శాస్త్రానుభవ జ్ఞాన బలముచే తన జాగ్రదనుభవములను గూడ తన స్వప్నాను భవముల వంటివేగాని, వేరుకాదను నిశ్చయము నొందునో ఎప్పుడు తన ప్రారబ్ధానుసార వ్యవహారానుభవములను జ్ఞానపూర్వకముగ, క్షీణించిన సుఖ దుఃఖములతో భోగమునొందగల్గుచుండునో, తనకు ఎప్పుడు రాగద్వేషాదుల క్షీణత స్పష్టముగ కలుగుచుండునో, తన ప్రారబ్ధము ననుభవించు చున్ననూ ఎప్పుడు సదా తనకు జగని ధ్యాత్వనిరూఢి స్ఫురించుచుండునో, ఎప్పుడు తన అనుభవములయందు జ్ఞానపూర్వకమైన తృప్తి సంతోషములు కలుగుచుండునో, ఎప్పుడు స్వమరణమును వుత్సవతులముగ గ్రహించుచూ తన మరణ తి నెంతమాత్రము నొందడో, అప్పుడు తన సత్యజ్ఞానాభ్యాసాదులు ఫలించు చున్నవని గ్రహించవచ్చును. అప్పుడు యిట్టి స్థితియే తన సత్య స్వరూప ధానాద్యభ్యాసములకు సహకరించి ముక్తిద్వారము నిచ్చునని తెలిసికొని ముముక్షువు తన జ్ఞానాభ్యాసమును వుత్సాహముతో చేయగలుగుచుండును.

ఏ జీవియైననూ మరణభయము నొందనివాడు వుండడు, కాని వ ముముక్షువైన జ్ఞానాభ్యాసకుడు అట్టి మరణమును, తనకు సర్వమంగళ కరముగా తలచుచుండును, ఏలనన ఈ ముముక్షువు తన ప్రారబ్ధానుభవక్షయము చేత తన స్థూల శరీరమును, తన జ్ఞానబలముచేత అంతఃకరణోపాధినీ, వాస్తవముగ తాను కానను నిశ్చయముతో, తన వాస్తవ స్వరూపమైన సత జ్ఞానానంత లక్షణములను బాగుగ గుర్తించినవాడు గనుక తన యీ శరీర పత నానంతరము తాను అఖండ స్వరూపమును పొందగల నను నిశ్చయముతో నుండి దేహపతనము నొందును. ఇట్టి అఖండ స్వరూప ప్రాప్తియే తన

అష్టము గావున మరణమునుంచి భయము నొందడు. ప్రారబ్ధక్షయమే ముముక్షువునకు కర్తవ్యాశయమై, తన స్వస్వరూప ప్రాప్తినే యిచ్ఛయించును గాన అట్టి మహనీయునకు దేహపతనము మరణమై మృతు భయమును కలిగింపజాలదు, అట్టి మహనీయులు ఈ జనాంతమందే అమృత సిద్ధినొంద వచ్చును. లేనిచో తత్సాధనానుకూల జన లనొంది అమృతత్త్వసిద్ధిని పొందుదురు — ఇది శాస్త్రప్రమాణము కావున ఎవరలకు తన స్వస్వరూప జ్ఞానముచే సుఖ దుఃఖానుభవములు, ఆభాసమాత్రముగ నుండునో, యెవరికి, స్వస్వరూప జ్ఞాన బలముచే వారి మరణ తి యుండదో అట్టివారు తమ జ్ఞానాభ్యాస లాభము కలుగు చున్నట్లు నిశ్చయముగ గ్రహించ వచ్చును.

# శ్రీ బ్రహ్మ విద్యాభ్యాస సారము

ఇచట విద్యయనగా విద్యాసాధనమనియే గ్రహించవలెను. బ్రహ విద్యయనగా - వుడు తన పరమార్థ స్వరూపమును గురుశాస్త్ర బోధవలన బాగుగ గుర్తించి అట్టి నిత్య అద్వితీయ అఖండ పరమాత స్వరూపము నేనేను, అని తన మననాద్యభా సములను ఫలపర్యంత మాచరించి ఆత్మ సాక్షాత్కారము నొందుట. శాస్త్రము "బ్రహ సత్యంజగన్మిథ్య" అనియు, "ఏకమేవాద్వి యం బ్రహ," "నేహనానాస్తికించన" అనియు తెలుపుచున్నది. ఈవచనార్థములు రెండునూ మానవ దృశ్యానుభవమునకు ప్రత్యక్ష విరుద్ధములుగా నగపడు చున్నవి. ఇట్లుండగా ఇంకనూ "తత్త్వమసి" "అహంబ్రహాసి" అను మహావాక్యబోధ "ఆ బ్రహ వు నీవే" లేక "ఆ బహ నేనే" అని త్వం, అహం — ప్రత్యయముల రెంటిచేతను స్పష్టము చేయుచున్నది. ఇంకనూ "బ్రహ విద్బ్రహ్మైవభవతి" "బ్రహ విదాప్నోతిపరం" అని బ్రహ ను తెలిసి

కొనినవాడు బ్రహ్మ మేయగు ననియూ, బ్రహ్మ ను తెలిసికొనినవాడు పరమో త్కృష్ట స్థానము నొందుననియూ, అనగా ముక్తి నొందును అని యీ వచన ములు మనకు తెలుపుచున్నవి. దీని నంతయూ బట్టి చూడ మనకు ముక్తి-బ్రహ్మ జ్ఞానము వలననే గాని, వేరువిధముగ గలుగదని శ్రుతిమాత స్పష్టము చేయుచున్నది. నూరు తల్లుల సమానమగు శ్రుతివాక్య మెన్నటికినీ అసత్య మగుటకు గాని, వ్యర్థమగుటకుగాని వీలులేదు. కావున వివేకులు యీ వాక్య ముల ప్రామాణ్యమును గ్రహించి వాటి యథార్థ జ్ఞానానుభవములను సంపా దింపవలసియున్నది. ఇట్టి ప్రయత్నాభ్యాసములలో నున్నవాడే జ్ఞానాభ్యాస కుడు. జిజ్ఞాసువులకు ఇట్టి జ్ఞాన వివేచన. మననాద్యభ్యాసముల బోధయే యీ గ్రంథ ముఖ్యోద్దేశ్యము గాన యింతవరకును శ్రుతిస్మృతులననుసరించి వివిధ నిరూపణలు వ్రాయబడినవి.

ఈ విద్యాసాధన సారమేమనిన – బ్రహ్మ జ్ఞానాభ్యాసి తన ఆత్మ సాక్షాత్కార ఫలమునకు గాను నిరంతరము స్వశరీర సర్వదృశ్య మిథ్యాత్వ మును శ్రుతి యుక్తి అనుభవములతో నెల్లప్పుడునూ మననము చేయుచుండు టయే. ఏలనన యిట్టి వివేచన మననాదుల వలనగాని, స్వశరీర సర్వదృశ్యము సత్యమైన దానివలె కనబడుచూ వ్యవహారానుభవముల నిచ్చుచున్ననూ, ఇది యంతయూ పరమార్థ సత్యముకాదు; అనిత్యము – కావున దుఃఖపర్యవసాన మైనది మాత్రమే కాని తనకు నిత్యసుఖమును యీ స్వశరీర ప్రాపంచిక సంబంధ పదార్థము లెవ్వియునూ వాస్తవముగా నివ్వజాలవను ఒక్క నిశ్చయ సంస్కార మేర్పడదు, ఇందువలన యీ అభ్యాసకునకు దృశ్యసంబంధ సక్తతా మానములు క్షీణించుచుండును. ఈ జగన్మిథ్యాత్వజ్ఞాన దార్ఢ్యము లోగడ యీ గ్రంథమందు చేసిన నిరూపణ లన్నియూ బాగుగా గ్రహించి శాస్త్రీయ ముగ దీర్ఘకాల మాచరించిన నిత్యానిత్య వివేకమననాదుల వల్లగాని సాధ్యము కాదు. ఎంత బుద్ధిమంతునికైననూ తన అనాది అవిద్యాదోషము వలన యొక సారి గ్రహించిననూ, అనుకున్ననూ అట్టి జగన్మిథ్యాత్వ జ్ఞానము నిలబడి

తనకు ఫలకారి కాజాలదు. ఇట్లు యీ అభ్యాసకునకు కలుగు స్వశరీర, జగద సత్యత్వ నిశ్చయమే తన వాస్తవ స్వరూప జ్ఞానలాభమునకు సహకరించు చుండును.

ఈ స్వశరీర జగత్తంతయూ, అనగా — అహ, మిదములు రెండునూ అధిష్ఠానమైన అఖండ బ్రహ్మమునందే అధ్యస్తమై యున్నవి కావున, దృశ్యము అధ్యస్తము అనగా — కల్పితము గనుక ప్రథమమున కల్పితమైన సర్వదృశ్యమునూ జ్ఞానపూర్వకముగ నిషేధించిన యెడల వాస్తవమున మిగులునది, అధిష్ఠాన స్వరూపమైన పరమార్థ సత పదార్థ మొక్కటియేగాని, తదితర మేమియునూ యుండదు. సత్వము గూడ దృశ్యాన్తఃపాతియే గనుక తనను విడచి మిగులు పరిచ్ఛిన్న పదార్థమేమియు నుండదు. అట్లు నిర్విశేషముగ శేషించు నిత అఖండ బ్రహ్మ పదార్థమునే "తత్త్వమసి" అను మహావాక్యము "ఆ బ్రహ్మ నువ్వే అయియున్నావు" అని స్పష్టముగ వబ్రహ్మైక్య బోధను చేయుచున్నది. ఇట్టి వబ్రహ్మైక్యజ్ఞానము భాగత్యాగ లక్షణవల్ల కలుగు గ్రహణము చేతగాని సిద్ధించదు. ఏలనన-మనకు స్ఫురించుచున్న యీ అహ—మిదములగు స్వశరీర, దృశ మంతయూ చిత్, జడముల మిశ్రితమై యున్నది. కావున యీ స్వశరీర సర్వదృశ్యమునుంచి జడాంశమైన అధ్యస్తమును జ్ఞానపూర్వకముగ సివేసిన యెడల రెండింటియందున నిర్విశేషముగ మిగులునట్టి అద్వితీయ అఖండ చిద్రూప పరమాత స్వరూపమే తానగును.

కాని యిట్టి తన సత స్వరూప గ్రహణానుభవములు కలుగుటకు దీర్ఘకాలము అనగా — బ్రహ్మ సాక్షాత్కార పర్యంతము ముముక్షువు నిరంతరాభ్యాసము చేయుచుండవలయును. దీనికిగాను ముముక్షువు యింతవరకు మనము చేసిన వివేచన నిరూపణల వల్లనూ, నిరూపించిన శ్రుతిస్మృతి ప్రమాణముల వల్లనూ, అనుసంధాన వాక్యముల వల్లనూ, గుర్వీశ్వరానుగ్రహములతోడనూ, నేను అనునది యెవరు ? ఈ స్వశరీర సర్వదృశ్యము లెట్టివి ? అనగా — వీటి

యందు పరమార్థ సత్యత్వమున్నదా ? యివినాకు నిత్యములా ? లేక — అనిత్యము లగుచున్నవా : నా అనుభవము లెట్లున్నవి ? ఈ శరీరాది దృశ్యమును విచారించిన అన్నియునూ దుఃఖపర్యవసానములే యగుచున్నవిగదా ! నిత్య నిరతిశయ సుఖమెట్టిది ? పరమాత్మ యెట్టివాడు ? ఎచటనున్నాడు ? ఆయన యెవరు ? మహావాక్యము — నేనున్నూ ఆపరమాత్మ యూ నొక్కటియేనని బోధించుచున్నది. నా స్వరూపమెట్లున్న, నేనున్నూ ఆపరమాత్మ యూ నొక్కటి యగుదుము : ఇదియెట్లు సంభవము ? అను విషయములను సంశయ విపర్య రహితముగ నిశ్చయించి తెలిసికొని తన అభ్యాసాదులను చేయుచుండ వలయును,

ఈ అభ్యాస మెట్లుండవలెననిన — తన నిత్య—అసంగ—స్వప్రకాశ— అఖండ — పరిపూర్ణత్వ అనుసంధానాదుల, నిరంతరాచరణ బలముగా తత్స్వరూపమును, వృత్తిచే ఫలపర్యంతము గ్రహించుచుండవలయును. వేరుదారి లేదు — ఇట్టి అభ్యాసాదులే ముముక్షువును కాలక్రమమున ఆత్మసాక్షాత్కారము నొందింపజేయును. బ్రహ్మజ్ఞానాభ్యాసి తనకు శ్రవణానంతరము జ్ఞాన పూర్వక మనన నిదిధ్యాసనానుసంధానాద్యభ్యాసములే, ఆత్మసాక్షాత్కార ప్రాప్తికి సాక్షాత్సాధన సారభూతములని గ్రహించవలయును.

ముముక్షువు ప్రయత్నముచే తన పరమార్థ వాస్తవ స్వరూపము పరమాత్మ అఖండజ్యోతి స్వరూపమని గ్రహించవలెను గావున పరమాత్మ స్వరూపమైన పరంజ్యోతి 'అహం' నేనే అను వేదాన్త సిద్ధాంత సారమును శిష్యుడు సులభముగా తెలిసికొనుటకుగాను శ్రీ శంకరభగవత్పాదులు గురుశిష్య ప్రశ్నోత్తర రూపముగా ఒక శ్లోకమును బోధించి యున్నారు. అది యేదియనిన.

శ్లో॥ "కింజ్యోతిస్తవభాను మానహని మే రాత్రౌప్రదీపాదికమ్'
స్యాదేవంరవిదీపదర్శన విధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే,

చక్షుస్తస్య నిమీలనాదిసమయే కిం ధీర్ధియోదర్శనే,
కిం తత్రాహమతో భవాన్పరమకంజ్యోతి స్తదసి ప్రభో"

అని ! నీకు ప్రకాశమిచ్చు జ్యోతిస్సు యేది? పగలు సూర్యుడు. రాత్రియందు దీపాదులను, సూర్యచంద్రులను చూచుటకు నీకు ప్రకాశ మేది తెలుపుము. నేత్రములు, నేత్రములు మూసిన కాలమున నీకు జ్యోతిస్సు యేది ? నాబుద్ధియే, నీబుద్ధిని చూచుటలో జ్యోతిస్సు యేది? "అహం". నేనే, కావున దీని కన్నింటికిని పరమజ్యోతిస్స్వరూపుడు నీవేకదా ? స్వామీ నిజము. "అహం" నేనే పరమజ్యోతిస్స్వరూపుడనై యున్నాను అని శిష్యుడు, సులభముగా సిద్ధాంత సారమును గ్రహించెను. యీ అఖండ "అహం" జ్యోతియే పరమార్థజ్ఞానము. ఇది అద్వితీయము, అఖండము, స్వప్రకాశము, అవికారి, అసంగము, అవినాశియై సర్వజీవుల హృదయమందునను పరమ జ్యోతిస్సుగా విలసిల్లు ప్రత్యగాత్మగా తెలుసుకొనబడు పరమాత్మ యీయనయె.

బాగుగా విచారించిన యీ ప్రపంచ మంతయు జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయముగా భాసించుచున్నది గాని తదితరము ఏమియులేదు, ఇందు జ్ఞానము ఒక్కటియే పరమార్థ సత్యము, ఇదియే అఖండ పరిపూర్ణ చైతన్యమై సర్వాధిష్ఠానముగా అద్వితీయమై యున్నది. యీ అద్వితీయజ్ఞాన పదార్థమునందే రజ్జువుయందుభాసించు సర్పభ్రాంతిలాగున అనాదిమాయా ప్రభావముచే జ్ఞాతృ, జ్ఞేయములు రెండునూ అధ్యస్తములై "అహం" "ఇదం" అహంఇదములుగా భాసించుచున్నవి గాని వాస్తవములుగావు ఇవి వల అవిద్యాకల్పితములై జీవునికి సంసారదుఃఖమును కలిగించుచున్నవి. కాని పరమార్థ సత్యము అఖండ పరిపూర్ణ జ్ఞాన మొక్కటియే. ఇదియే సర్వదృశ్యాధిష్ఠానము, సత్యము, నిత్యము, నిరతిశయము, అద్వితీయము, అఖండము, సర్వభూతములును మాయా కల్పితములు, అవాస్తవములు, పరమార్థముగా లేనివేయగును. పరమార్థమున వాస్తవముగా నున్నది జీవుని సత్యస్వరూప మొక్కటియే. ఇదియే 'అహం' అను ప్రతీతికి వాస్తవికార్థము, పరమాత్మ

స్వరూపము. దీనిని బోధించుటకే పరిపూర్ణ జ్ఞాన స్వరూపుడైన భగవంతుడు గీతలలో

శ్లో॥ మయాతత మిదంసర్వం జగదవ్యక్త మూర్తినా।
మత్స్థానిసర్వభూతాని నచాహం తేష్వవస్థితః॥

అనగా యీ జగత్తు అంతయు వ్యక్తముగాని నాస్వరూపముతో పరిపూర్ణమై యున్నది, సర్వభూతములు నాయందున్నవి. (అనగా కల్పితముగా నున్నవి.) కాని జ్ఞాన స్వరూపుడనై పరమాత్ముడనైన నేను ఆ భూతములయందు లేను. అనగా వాటికిన్నీ నాకును వాస్తవ సంబంధము లేదు అని తెలుపుచున్నాడు. అనగా అధ్యస్తమైన యీ సర్వదృశ్యము సత్యాధిష్ఠానమై పరమాత్ముడైన నాయందే కలుగుచున్నది గాని పరమాత్ముడనైన నేను యీ కల్పిత దృశ్యమందుండుటకు వీలులేదు. ఎట్లన వ్యవహార సత్యమైన రజ్జువుయందు సర్ప భ్రాంతి కలుగును గాని భ్రాంతియుతమైన సర్పమందు రజ్జువు వుండుట అనునది అసంభవము గదా? ఎల్లప్పుడును అధిష్ఠానము సత్యము. అధ్యస్తము కల్పితముగా నుండును. యీ విషయమునే, భగవంతుడు పై వాక్యముచే బోధించుచున్నాడని ముముక్షువు గ్రహించవలెను. కావున ముఖ్యముగా జ్ఞానాభ్యాసకుడు తన పరమార్థ స్వరూపమై పరమ జ్యోతియగు అఖండ జ్ఞానమే సర్వ వులయందునను ప్రకాశించుచూ సర్వదృశ్యాధిష్ఠానముగా నున్నదని తెలిసికొని తన సర్వాత్మ భావనను చేయుచుండవలయును. ఇట్టి సర్వాత్మ భావన తనకు సర్వోపప్లవ కరమైన స్వశరీర సర్వోపాధులను వృత్తి జ్ఞానపూర్వకముగా త్యజించిన గాని కలుగదు. ఇట్లు స్వశరీర దృశ్య త్యాగ మనునది తన పరమజ్యోతి స్వరూపమైన అఖండ జ్ఞానాను సంధానాభ్యాసాదుల వలనగాని సాధ్యముకాదు. యీ అభ్యాసాదుల వలన కాలక్రమమున తన అఖండ పరిపూర్ణ జ్ఞానము గోచరించు చుండును. ఇట్టి సర్వోపాధి వినిర్ముక్త పరిపూర్ణ చైతన్యాధిష్ఠానగ్రహణమునే "సర్వోపప్లవ రహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి." అను వాక్యము వాస్తవ బ్రహ్మానుసంధా

నమును బోధించుచున్నది. వున ట్టి అనుసంధాన ఫలమే కాల క్రమమున అఖండ స్వరూప సిద్ధినిచ్చి మోక్షప్రాప్తి నొందజేయును.

కావున జ్ఞానాభ్యాసకుడు తన అభ్యాసకాలమందు యీ ద్రష్ట్ర దృశ రూపములుగా నున్న జ్ఞాతృజ్ఞేయములను జ్ఞాన పూర్వకముగా త్యజించి వృత్తి నఖండాకారము గావించి ధ్యానాదుల సచ్చిదానంద లక్షణములతో నభ సించు నెడల అపుడు గోచరించునదియే, తన అఖండ, అద్వితీయ, పరిపూర్ణ జ్ఞానస్వరూపమని తెలిసికొనవలయును. ఇదియే తన పరమార్థ స్వరూపమని ముముక్షువు గ్రహించి అఖండాత్మానుసంధానము నభ్యసించుచుండ వలయును. ఇదియే పరంజ్యోతి, పరమాత్మ, వునియొక్క నిత్యనిరతిశయ మైన అఖండ సుఖస్వరూపమని గ్రహించి అనుసంధానాదుల నాచరించుచుండ వలయును,

ముముక్షువునకు సిద్ధాంత పరమసారాంశ మేమనిన యీ తన పరి చ్ఛిన్న స్థూలదేహము, సూక్ష్మ శరీరాదులు తాను కానని గురుశాస్త్రబోధ వలన బాగుగ తెలిసికొని తన పరమార్థ సత్యస్వరూపమైన అఖండాత్మానుసంధాన మును నిరంతరము స్వానుభవ సాక్షాత్కార పర్యంతము, ఇపుడు తాను ప్రారబ్ధ బద్ధుడై సుఖదుఃఖాది యెట్టి భోగానుభవములను, చేయుచున్నను ఇవియన్నియు అనిత్యములు, తాత్కాలికములు మాత్రమే నను నిశ్చయముతోడ తన పర మార్థ అఖండ పరిపూర్ణ జ్ఞాన స్వరూపమును విడువక విసుగు చెందక తప్పక ఫలము కలుగునను ప్రీతినిశ్చయములతో స్వస్వరూపానుసంధానాదుల గావించుటయే తన పరమ కర్తవ్యమని మనననిదిధ్యసనాదులను యాచరించు చుండవలయును.

బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు ముఖ్యముగా గ్రహించ వలసిన సిద్ధాంత సారాంశ మేమనగా, తాను ఇపుడు ప్రారబ్ధకర్మ ఫలబద్ధుడై యెట్టి సుఖభోగా నుభవములను పొందుచున్నను ఇవి యన్నియు తనకు పరమార్థ వాస్తవమున

సంబంధించినవి కావను దృఢనిశ్చయమును సంపాదించ వలయును, ఇప్పుడు తనకు కలుగుచున్న సమస్త సుఖదుఃఖానుభవములు తన అజ్ఞానకాలకృత ప్రారబ్ధ కర్మఫల భోగానుభవములకు గాను కల్పితమైన తనయుపాధి ధర్మము లైనను ప్రారబ్ధ బలముచే ప్రస్తుత దేహతాదాత్మ్యాధ్యాస తనకు నివర్తించనందు వలన తాను యీ దేహో (శరీరో)పాధి ధర్మముల సుఖ దుఃఖముల నొందుచున్నాననియు గాని వాస్తవమున వీనితో తనకెట్టి నిత్య సంబంధము లేదను నిశ్చయము నొందవలయును. ఐనను దేహము యున్నంత కాలము దేహధర్మములు జ్ఞానినైనను విడువవు. యీ శరీర ధారణ ప్రారబ్ధాధీనము. కావున జ్ఞానాభ్యాసకుడు తనకు పరమాభీష్టమైన ఆత్మసాక్షాత్కారము నొందుటకు తన ప్రారబ్ధక్షయమును చేయుట యావశ్యకము గాన అట్టి ప్రారబ్ధమును యథాప్రాప్తముగా సక్తతాభిమాన రహితముగా అనగా సక్తతా మానములను క్షీణింప చేసిన వాడై ఇప్పుడనుభవించు చున్నాననే శాస్త్రీయ జ్ఞానాభ్యాసాదుల బలముచే నిశ్చయము నొంది తనలో తాను ఆ అనుభవములను నిర్లిప్తతతో ననుభవించు చుండవలయును. జ్ఞానాభ్యాసకుడు ఇట్లు తన అనుభవములను క్షీణ సక్తతా మానములు గలవిగా చేయుచూ, గురుశాస్త్రబోధ, మననాదుల వలన తన పరమార్థ స్వరూపమును ప్రీతినిశ్చయములతో. నిట్లు తెలుసుకొనవలయును — నేను, వాస్తవమున యీ దేహశరీరాదులు కాను. నాకు తాత్కాలికములైన యీ సంసార సుఖదుఃఖానుభవములకు ఇవి యన్నియు కల్పితములు - యీ "అహం" "ఇదం"లును, వాటివలన నాకు కలుగుచున్న "మమేదం" అను సదంతయు భ్రాంతి మాత్రము, నాకు స్వశరీరదృశ్యమంతయు కల్పనారూపమున వ్యవహార మాత్రమై తాత్కాలికమై దీర్ఘ స్వప్నములాగున పర్యవసానమున అనిత్యమగుచున్నది. శాస్త్రము నాస్వరూపము కేవల సుఖము నిత్యమని తెలుపుచున్నది. కావున నేను స్వశరీర సర్వదృశ్యమునందు నను నేదియును యగుటకును వీలులేదు — శ్రుతిబోధ ననుసరించి నాస్వరూపము పరిచ్ఛిన్నమై యుండుటకు వీలులేదు. "అహం" నేను అద్వి

# శ్రీ బ్రహ్మ విద్యాభ్యాస సారము

య, అఖండ, పరిపూర్ణ చైతన్య స్వరూపుడను, స్వశరీర సర్వదృశ్యము, నా పరమార్థ వాస్తవ స్వరూపమైన అఖండ పరిపూర్ణ చైతన్యమునందే, రజ్జు సర్పభ్రాంతి లాగున వివర్తముగా భాసించుచున్నది. కావున యీ స్వశరీర సర్వదృశ్యమునకున్ను, సత్యాధిష్ఠాన స్వరూపము "అహం" నేనేఐ యున్నాను. కాని తదితర మేమియును లేదు-ఇందుచే నా పరమార్థ వాస్తవ స్వరూపము, స్వశరీర సర్వదృశ్యాధిష్ఠాన, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత, స్వప్రకాశ, జగదుత్పత్తి, స్థితి, లయ, ములకు వివర్త, అభిన్ననిమిత్తో పాదాన కారణమగు, నిత్య నిర్వికార, నిరతిశయానంద, పరిపూర్ణాఖండ చైతన్య స్వరూపమనియు. నిరవయవుడు గనుక తానునిష్క్రియుడనియు, నిష్క్రియుడు గనుక తనకు కర్తృత్వాదులు వాస్తవములు కావనియు తెలిసికొని తన స్వరూపమును అఖండాకార వృత్తితో చిదాకాశముగా నభ్యసించు చుండ వలయును.

యీ బ్రహ్మ విద్యాభ్యాసకుడు మరియొక ముఖ్యాంశమును గమనించ వలసియున్నది. అదియేదియనిన తనమనస్సును యెన్ని ఉపాయములచేనైనను స్వాధీనము చేసుకొనుట. యీ మనస్సనునది జీవునకు సూక్ష్మ కరణము గాని, తన వాస్తవ స్వరూపముగాదు ఐనను ఇది మానవునకు తాను వాస్తవ మైనదాని వలె గోచరించుచూ పూర్వసంస్కార వాసనా బలముచే దాని ఇష్టము వచ్చినట్లు జీవుని పనిచేయుంచును గాని, వివేకినిగూడ తనయిష్టము వచ్చినటుల యీ మనస్సు పనిచేయనివ్వక దాని వాసనా మార్గముల లోనికీడ్చుకొని పోవుచుండును. యీమనస్సు అతి బలీయమైన అశ్వము వంటిది, దీనిని స్వాధీనము చేసి కొనిన యెడల యెంతదుర్ఘట కార్యమునైనను సాధించుటకు సమర్థతనిచ్చును. కాని దీనిని స్వాధీన పరచుకొనుట యనునది యొక్క జ్ఞానాభ్యాసకునకు గాని తదితరులకు సులభ సాధ్యముకాదు. జ్ఞానాభ్యాసకుడున్ను తన గుర్వీశ్వరాను గ్రహములచేతను, శ్రవణమన నాదులచేతను, యీ మనస్సుయొక్క స్వరూప స్వభావములను బాగుగాగుర్తించి ఇది తనకు

ఉపకరణ కోటిలోనిది గాని తానుకానిదియు, ఐనను తన పరమ తరణోపాయ మునకు నిదియే ముఖ సాధనమని గ్రహించి దీనిని, తన స్వాధీనములో యుంచుకొనువాడు. కావున దీనిని తనశరీర జగన్మిథ్యాత్వజ్ఞాన నిరూఢి ని, పరమార్థస్యస్వరూప గ్రహణాభ్యాసములకు సదాఉపయోగించుచుండవలయును. ఇట్లుచేయు అభ్యాసకునకు యీ మనస్సు యొక్కటియే కాల క్రమమున తన పరమ ప్రయోజనమగు ఆత్మ సాక్షాత్కారము నొనగూర్చును. దీనినే శ్రీ త్యాగరాజస్వామి" మనసుస్వాధీనమైన ఆఘనునికి, మణిమంత్రతంత్రము లేలా" యనుకీర్తనచే తెలుపుచున్నారు. మనస్సును స్వాధీనములోనుంచు కొనగలిగిన మహనీయునకు సర్వము స్వాధీనములోనుండును. సాధించలేని కార ముండదు. కావున జ్ఞానాభ్యాసకుడు సర్వదా తనమనస్సును తన లక్ష్యమైన స్వస్వరూపానుసంధాన, అఖండా కారవృత్తినుంచి, చలించకుండు నట్లు మాటిమాటికి నభ్యసించుచుండవలయును— యిట్టి అభ్యాసము, ముము క్షువు, తన ప్రారబ్ధానుసారమున నెట్టిభోగానుభవములుచేయుచున్నను, తన నిత్యానిత్య వివేకబలముచే యీస్వశరీర స్వదృశ్యము కల్పితమాత్రమనిన్నీ తనకు నిత్యముకాదనిన్నీ దృఢజ్ఞానముతోనుండి స్వస్వరూపాను సంధానాదుల చేయుచుండినయెడల నిది సులభసాధ్యమై తనస్వరూప సుఖమునిచ్చు చుండును.

ఇదియే కాల క్రమమున ప్రారబ్ధముక్షయించగనే ముక్తినొందించును, ఇదియే బ్రహ్మ జ్ఞానాభ్యాసకుడు తనకు రాజమార్గము, రాజ విద్యయని నిశ్చయముగా గ్రహించవలయును. జ్ఞానాభ్యాసకుడు సర్వదా నిర లచిత్తుడై తన ప్రారబ్ధాను సరణమున, నెట్టిసుఖదుఃఖాది భోగముల ననుభవించుచున్నను అట్టివి యన్నియు తనకు వాస్తవములు కావనుదృఢజ్ఞాన విశ్వాసములతో కించిదను భవములను నొందుచూ, వస్తుశక్తి సుఖము గాంచుచుండును.

# ఉపసంహారము

ఈ గ్రంథబోధ పర్యవసాన మేమనిన వివేకియై, మానవ జన నొందిన ప్రతివాడును అట్టి జన ను వృథాగావించక దానిని, గుర్వీశ్వరాను గ్రహ శాస్త్రబోధ వలన, వుడు తన పరమార్థ సిద్ధికి సాధనముగ నుపయో గించుకొనుచు తన నిత్య నిరతిశయ సుఖస్వరూప లాభమును పొందుటయే— దీనినే మోక్షమని శాస్త్రము తెలుపుచున్నది. ఇట్లుగాక మానవ వితమందు మోక్షపురుషార్థమును వదలి, కేవల యితర పురుషార్థములనే ఆశ్రయించు మానవుడు మహానష్టము నొందునని శాస్త్రము తెలుపుచున్నది. దీనినే శ్రుతి:—

"ఇహచేదవేదీ దథసత్యమస్తి నచేదిహావేదీన హ వినష్టిః। భూతేషు భూతేషు విచిత్యధీరాః ప్రేత్యాసా ల్లోకాదమృతాభవంతి"

అనగా మానవజన ముండగనే తత్త్వజ్ఞానమును సంపాదింపవలయును. లేనిచో యీ యుత్కృష్టమైన మానవ జన్మ నిరర్థకమై, జీవుడు అంతులేని ఉచ్చ, నీచ, జన ల, పరంపరతో సంసార మహాదుఃఖమును పొందుచుండును. కనుకనే ధీరుడైన ముముక్షువు, చేతనాచేతన సమస్త దృశ మున కధిష్ఠానమై యున్న, తన అఖండాధిష్ఠాన స్వరూపమును బాగుగ గ్రహించి దానినే తన పరమార్థవాస్తవ స్వరూపమని తెలిసికొని యీ శరీరమును త్యజించి అమృతత్త్వమును పొందును; అని యీ శ్రుతి తాత్పర ము స్పష్టముగ తెలియుచున్నది. మానవజన కు దీనిని సాధించుటయే పరమావధి. కాన వివేకియైన వుడు యిప్పుడు తనకు కలిగిన యీ మానవజన ను వృథా చేసికొనుట యవివేకము. ఏలనన పురుషార్థములు నాలుగైననూ అందు" మోక్ష ఏవ పరమ పురుషార్థః" యని శాస్త్రము బోధించుచున్నది. వుడు తన పరమ తరణోపాయము గాంచి ముక్తి నొందుటకు, యీ యొక్క మానవజన్మము వలననే సాధ్యముగాని అన్యజన ముల వలన సాధ్యము కాదు. వున అనాదిసంసారజన్మపరంపరలో మానవజన్మయనునది వచ్చుట కడుదుర్లభము, అనేక కోటి జన ల పుణ్యవిశేషము. ఇట్టి పుణ్యవిశేషఫల లాభము వలనగాని, వునకు మానవజన్మ సంభవము కాదు. వుడు తాను

పరమాత్మయేనని, తాను మరచిన తన సత్యస్వరూపమును తెలిసికొని యను భవమునొందుటకు యీ మానవజన్మ సాధనమగునట్లు యితరజన్మలు కాజాలవు. కావున వివేకియైన జీవుడు తనకు పునరావృత్తిరహితమై, నిత్యనిరతిశయమైన తన వాస్తవ స్వరూపమును తెలిసికొని స్వానుభవమునొందుట యనునది, మానవజన్మ మీదనే ఆధారపడియున్నది. అట్టిది పురుష ప్రయత్నసాధ్యమే కాని తదితరముకాదు. ఈ జన్మ పరంపరకు కారణము జీవుడు తన అనాదిఅవిద్యా కామ కర్మ ల యందు, ప్రారబ్ధకర్మఫలభోగముల ననుభవించుటకొరకు అయియున్నది. వుడు యిట్టి తన కర్మఫలానుభవమును పొందుటకే వివిధ ఉచ్ఛ నీచోపాధులను జన్మపరంపరగ గ్రహించుచుండును. ఇట్టి జన్మ పరంపరలో అనేక కోటిజన్మల సుకృత ఫలము వలనగాని జీవునికి మానవశరీరము ల౦చదని శ్రీ శంకరభగవత్పాదులు :—

"జన్తూనాం నరజన్మ దుర్లభం" అను శ్లోకమువలన సకలస్థావర జంగమ రూపభూతములలో మనుష్యజన్మ దుర్లభమను, మొదలగు వచనములతో ఈ మానవ శరీరప్రాప్తినే కడు దుర్లభమైన దానినిగా చెప్పియున్నారు. జీవుని జన్మ పరంపరలో యిట్టి దుర్లభమైన అవకాశము కలిగినప్పుడు దానిని వృధాచేసికొనక ఈ శరీరమును తన మోక్షప్రాప్తి సాధనముగా గ్రహించి జీవుడు పరమపురుషార్థము నొందవలయును గాని వేరుమార్గము లేదు. మానవునకు, తాను లక్ష్యముంచిన విషయమును బాణముచే కొట్టుటకు విల్లు ఎట్లు సాధనమగు చున్నదో అట్లే జీవునికి తన మోక్ష స్వరూప ప్రాప్తికి యీ మానవదేహము సాధనమగుచున్నది. కనుకనే "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" "వన్భద్రాణిపశ్యతి" అను మొదలుగాగల వచనములు యీ విషయమునే సూచించుచున్నవి—

మానవునకు ప్రయోజనములు రెండు విధములు. అవియేవియనిన సామాన్య ప్రయోజనములనిన్నీ, పరమప్రయోజనమనిన్నీ గలవు. సామాన్యప్రయోజనము

లనగా వ్యవహారానుభవ ప్రయోజనములు, పరమ ప్రయోజనమనగా వుడు తన సత్యస్వరూపమైన మోక్షము నొందుట. ఈ రెండు ప్రయోజనములకును గూడ స్వశరీర రక్షణ మావశ్యకము. శరీరము లేనిది ఏ పురుషార్థమును మానవుడు సంపాదింప జాలడు. అట్టి సంపాదనకు యీ శరీరోపాధియే సాధనము. అయినను వ్యవహారానుభవములకు వునికి విశేష ప్రయత్నమావశ్యకము లేదు. ఏలనన తనుకోరుకున్నను లేకపోయినను తన ప్రారబ్ధకర ఫలానుభవములు వ్యవహారమునందు అప్రయత్నముగ తన ప్రారబ్ధ కర ఫలముల ననుసరించి జరుగుచుండును. కాని మానవుడు అట్టి వ్యవహారానుభవములకు నిమిత్త మాత్రుడు. నిమిత్తము లేనిదే వ్యవహారమనునది జరుగుటకు వీలులేదు. ఇట్టి వ్యవహారానుభవములు మానవుని యొక్క నిమిత్తమాత్ర సామాన్య ప్రయత్నముతో జరుగుచుండును, ఇవియే వ్యవహార ప్రయోజనములు. ఇవియన్నియు తాత్కాలిక ప్రయోజనములై తాత్కాలిక సుఖదుఃఖ ఫలముల నిచ్చుచుండును గాని, జీవునికి తన నిత్యనిరతిశయమైన శాశ్వత సుఖము నివ్వ జాలవు. కావుననే యివి ప్రయోజనములు మాత్రమే యగుచున్నవి.

ఇంక పరమప్రయోజన మనునది వుడైన మానవుడు తన నిత నిరతిశయ శాశ్వతసుఖమును పొందుట. ఇది తన శాస్త్రీయ విశేషప్రయత్నముచే గాని కలుగదు. ఇట్టి విశేషశాస్త్రీయ ప్రయత్నమునే వునికి శాస్త్రము బోధించుచున్నది. ఇదియే అద్వైత శాస్త్రమనియూ, బ్రహ్మ విద్యయనియూ గూడ చెప్పబడుచున్నది. వునికి పరమప్రయోజనమైన మోక్షలాభ సంపాదనమే మన గ్రంథ ముఖ్యతాత్పర్యమని యింతవరకును నిరూపించియుంటిమి. అందు బ్రహ్మ విద్యానుసన్ధాన మనునది సాక్షాన్మోక్షమార్గము గనుక నది శ్రుతియుక్త్యనుభవపూర్వకముగ వివిధోపాయములచే తెలుపబడెను, కాని యింతనిరూపించిననూ విషయమంతయును "జగన్మిథ్య బ్రహ్మ సత్యం" అను నొక్క విషయమునే నిర్ణయించి తెలుపుచున్నది. ఇది తెలియుట మానవునికి కష్టసాధ్యమయిననూ పరమ శ్రేయోదాయకము, నిర్విశేషము, పరమ సుఖమైనది గాన "పథ్యం శతవిధం కృత్వా" అను న్యాయమును బట్టి బహువిధ

ముల బోధ యావశ్యకమై వివిధ రూపముల అద్వైతశాస్త్రసిద్ధాంతములు శృత్యుక్త్యనుభవములతో విమర్శించి తెలుపబడెను — కావున జిజ్ఞాసువులు సావధాన స్వస్థ చిత్తులై దీని పఠన గ్రహణములను బాగుగ చేసి తల్లాభము నొందుదురు గాక -

ఈ గ్రంథనామమును బట్టియే, ముముక్షువైన జిజ్ఞాసువు బ్రహ్మ స్వరూపము, తానేయని తిరిగి తిరిగి పలుమారు లనుకొనుట, యని అర్థము. ఇట్లనుకొనుటకు సద్వస్తుస్వరూపము బాగుగ తెలిసినగదా—దానిని అనుకొనుటకు సంభవము. కాని ఈ బ్రహ్మ స్వరూపము అఖండమై అద్వి యమైనది. కనుక బోధ సౌలభ మునకు గాను వ్యవహారములోని ఉదాహరణములనే కొని, దర్పణమునందు ప్రతిఫలించు పదార్థముల లాగున సుబోధకముగ నుండుటకు గాను యిందు వివిధోపాయ, ప్రకార నిరూపణలతో ఆత్మానాత్మ విచారమును, బ్రహ్మ స్వరూప లక్షణములును, ఆత్మా నుసంధాన ప్రక్రియలును తెలుపబడినవి. ఎట్లన లోకమునందు సముద్ర జలమంతయు విభాగ రహితమై యున్ననూ. వ్యవహార ప్రయోజనముకు గాను — విభాగంబులుగా పరిగణించి వివిధ నామంబులిడి వ్యవహరించుచున్నట్లు — ఈ బ్రహ్మ వస్తువు అఖండ అద్వి య మైనను వదశ; భ్రాంతియుతము, కల్పితము, వ్యావహారికమైనదియే గాన అట్టి వ్యవహారదశ ననుసరించి ముముక్షువు తరణోపాయమునకు గాను యుదాహరణలను కొని, గ్రహించి, బ్రహ్మ యందు కల్పితములను అనగా ఈ అధ్యస్త సర్వదృశ్యమునూ త్యజించి కేవల తత్పదార్థ స్వానుభవమును పొందవలయును.

కాని యిట్లు చేయుటకు ముముక్షువు గూడ, తన అనాది, అజ్ఞానము వల్ల దృశ్యమందు, సత్యత్వబుద్ధితో ఆశాకల్పితుడై సంసార బంధము నొందుచుండును — వునకు యీ స్వశరీర సర్వదృశ్యమందు కలుగు ఆశ మహాబ యమైనది — ఈ ఆశయే వుని లోకమునందు బంధించుచున్నది-దీనినే "ఆశయా బధ్యతే లోకః" యని పెద్దల వచనము తెలుపు

చున్నది. కావున సర్వప్రయత్నములతోడను యీ ఆశ అనుజాడ మును, నిర్మూలించుట ముముక్షువున కావశ్యకము. దీనికి, యుపాయము అధ్యాత శాస్త్రజ్ఞానమేనని:—

శ్లో॥ అధ్యాత శాస్త్రమంత్రేణ। తృష్ణావిషవిషూచికా ।
క్షీయతే భావితేనాంతః శరదామిహికా యథా ॥

అంతఃకరణమునందు విచారణ చేయబడిన అధ్యాత శాస్త్రమను, మంత్రముచేత నాశయను విషూచికా జాడ్యము, శరత్కాలముచే మంచు నశింపజేయబడు నట్లు నశింపజేయబడునని వసిష్ఠ వచనము తెలుపుచున్నది — కావున ముము క్షువునకు అధ్యాత శాస్త్రమను మంత్రజపము అనగా, మననానుసంధానములు అత్యావశ్యకము —

ఈ బ్రహ్మ విద్యయనునది యెంతవ్రాసి యెన్నివిధముల నిరూపించి నను ఇది వుని తత్త్వశోధన, అనుభవవేద్యమును నై యున్నందున యీ గ్రంథవిషయములు కావ్యనాటక ప్రబంధ గ్రంథముల లాగున సులభముగా గోచరించునవికావు. ఏలయన ఈ విషయములన్నియు 'నేను' అను తన వాస్తవ స్వరూపమును తెలిసికొని స్వానుభవమును సంపాదించుటకు నిరూ పింపబడినవి. ఇట్టి 'నేను'అను తన వాస్తవ స్వరూపము సర్వాంతరమై సర్వ వ్యాప్తమై యున్నది. దీనిని పొందుటకు శాస్త్రీయ ప్రయత్న మపేక్షితము. ఇట్టి ప్రయత్నములలో చిత్తశుద్ధి బ్రహ్మవిద్యాగ్రహణమునకు ప్రధానమైన పూర్వాంగమై యున్నది. ఇది మనకు కలదా, లేదా, ఎంతవరకు కలదు ? అని గ్రహించుటకు వారివారి స్వానుభవమే ముఖ్య ప్రమాణమై యున్నది. కనుక ఎవరికివారు వారివారి చిత్తప్రసన్నతను పరిశీలించి దీనియావశ్యకతను గ్రహించి ప్రయత్నమును చేయవలయును. ఇట్టి చిత్తశుద్ధి ప్రయత్నములలో ఉత్కృష్టమైన వివిధోపాసనలు భాష్యాది గ్రంథములయందు తెలుపబడి యున్నవి. అట్టివి వారివారి గ్రహణ సామర్థ్యాధికారములనుబట్టి గురుముఖతః తెలిసికొని అనుష్ఠించి తల్లాభమును పొందవచ్చును.

కాని, అట్టి యనుష్ఠానములు సామాన్యులకు సులభసాధ్యములుగావు— కాన ఇట్టి పరమ శ్రేయోదాయకమైన చిత్తశుద్ధిని కారుణ్యముతో మనలకు ప్రసాదింప దలచి మనపూర్వులైన త్రికాలజ్ఞుల కృతముగా శాస్త్రము సంధ్యా వందనాది నిత్యానుష్ఠానములను విధించుచున్నది. అందు నిత్యముఖ్యవిధి యైన సంధ్యావందనాచరణమునందు సర్వశక్తి స్వరూపిణియైన గాయత్రి మంత్రజపానుష్ఠానమును ప్రసాదించినది. "గాయన్తం త్రాయతే ఇతి గాయత్రి" "నగాయత్ర్యాః పరోమన్త్రః" అనగా — ఈ మూర్తి జపించు వానిని రక్షించునది గాన, యీ గాయత్రి మన్త్రము సర్వోత్కృష్టమైనదని పై వచనములు తెలుపుచున్నవి, ఇంకను ఈ మూర్తి సర్వదేవతాస్వరూపిణి యనియు, "పరబ్రహ్మ స్వరూపిణీ గాయత్రీ" యనియు తెలుపబడుచున్నది. ఇందువలననే ఉపనయన సంస్కారమందు వటువుకు ఉపదేశముచేయబడు యీ గాయత్రీ మంత్రోపదేశమే, బ్రహ్మోపదేశమని గూడ చెప్పబడు చున్నది. ఈ మూర్తి సర్వశక్తి స్థానీయము. ఎవరికైనను ఏపనిని సాధించ వలయునన్నను శక్తిలేనిది సాధ్యముకాదను విషయ మెల్లరకును విశదమే గాన నట్టి శక్తిసంపాదనకు సర్వశక్తిస్వరూపిణియైన యీ గాయత్రి జపధ్యానాదులు సర్వులకున్ను, అందును ముఖ్యముగ మోక్షార్థికి పరమావశ్యకమైయున్నది, కాన ముఖ్యముగ ఈ బ్రహ్మ విద్యా గ్రహణ సాధనమైన చిత్త శుద్ధిని కోరువారికి "జ్ఞాత్వాకర్మాణికుర్వీత" అను వచనమునుబట్టి స్వరూప, ఫల, జ్ఞానపూర్వకముగ నీగాయత్రి మంత్రానుష్ఠానాదుల నాచరించుట మిక్కిలి శ్రేయోదాయకము — ఆవశ్యకము.

వారివారి స్థితిసామర్థ్యములకు తగిన యమనియమాదులతో గూడ శక్తిలోపము జేయక ఆర్తులై యిట్టి జపానుష్ఠానాదులను చేసి చిత్తశుద్ధిని సంపాదించుకొన్నవారికిన్నీ పురాకృత పుణ్యముచే అంతఃకరణ శుద్ధి కలిగిన వారికిన్నీ యీ గ్రంథబోధ సుఖదాయకమై అమృత సాధనమగును.

ఇట్లు చిత్తశుద్ధిని సంపాదించి శ్రవణమననాదులచే గలిగిన తన సత స్వరూప జ్ఞానమును బాగుగా అనుసంధాన వివేచన ప్రకరణమందు తెల్పిన

విధమున సద్వస్తువునందు వృత్తి వ్యాప్తితో ప్రీతి నిశ్చయములను సంపాదించు కొని ఫలావగతిపర్యంతము సతతాను సంధానమునువిసుగుచెందక ఫల ప్రాప్తికి ఉత్సాహముతో నాచరించుచుండవలయును.

ఇట్టి సతతానుసంధానా వశ్యకతను (శ్రీ) కృష్ణభగవానులు గీతలలో నిట్లు తెలుపుచున్నారు

శ్లో॥ అన్తకాలేచ మామేవస రన్ ముక్త్వాకశేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

ప్రాణోత్క్రమణకాలమందు నన్నేస రించుచు శరీరమును పరిత్యజించిన వాడు నాస్వరూపమును పొందుననుటకు సంశయములేదు. ఇంతియే గాదు;

శ్లో॥ యం యం వాపిస రన్ భావం త్యజత్యన్తే కశేబరమ్।
తంతమే వైతికౌన్తేయ సదాతద్భావ భావితః॥

అంత కాలమందేయేవస్తువును స రించుచు ప్రాణి తనశరీరమును వదలి పెట్టునో ఎల్లప్పుడు పూర్వము దానినే భావించినవాడై తరువాతకూడ ఆవస్తు స్వరూపమునే పొందును,

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ।
మయ్యర్పిత మనోబుద్ధి రామేవైష్య స సంశయమ్॥

అందుచేత సర్వకాలములయందు నన్ను స రించుచు యుద్ధాదులను చేయుము. అట్లు చేయగా నాయందేమనస్సును బుద్ధిని ఉంచిన వాడవై నన్నేపొంద గలవనుటలో సందేహము లేదు.

శ్లో॥ అభ్యాసయోగ యుక్తేన చేతసానాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతిపార్థానుచిన్తయన్ ॥

పునఃపునః అనుసంధానమనే యోగముతో గూడిన ఏకాగ్రతగల మనస్సుచే పరమ పురుషుని చింతించుచు అతనినే పొందును. ఇట్లు తెలుపుచు అట్టి పరమాత యైన తన స్వరూపమును ఎట్లు గ్రహించవలసినదిన్నీ యీ క్రింది శ్లోకములు తెలుపుచున్నవి—

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణంగుణ భోక్తృచ ॥

అనగా ఈ పరమాత స్వరూపము స్వతః ఏయిన్ద్రియమును లేనిదయు సర్వేంద్రియముల కాయావస్తుగ్రహణము నిచ్చునదై, అసంగమై, సర్వాధిష్ఠానమై, గుణరహితమయ్యు గుణముల ననుభవించునదై యున్నది.

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితమ్ ।
భూతభర్తృచతద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥

అది సమస్త భూతములయందును విభక్తముగాకనే విభక్తమైనట్లుండునది. సమస్త భూతముల సృష్టిస్థితి లయములను చేయునది.

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృదిసర్వస ధిష్ఠితమ్ ॥

అజ్ఞాన బంధరహితమై, సమస్త జ్యోతిస్సులను మించిన జ్యో రూపమై జ్ఞానరూపమయ్యు జ్ఞేయరూపమయ్యు, జ్ఞానముచే పొందదగినదయు సర్వప్రాణుల హృదయముల యందు స్థిరముగా నున్నది. ఆ పరమాత స్వరూపమును యిట్లు తెలిసికొనినవారు అమృతులగుదురని గూడ —

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృత మశ్నుతే ।
అనాది మత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥

అనగా దేనిని తెలిసికొనవలయునో, నిని తెలిసికొనుటచే అమృతత్వము సిద్ధించునో అట్టి బ్రహ్మ అనాదియై 'నేనే' ఉత్కృష్టావధియై, సత్ అనిగాని, అసత్ అనిగాని వ్యవహరింపబడుట లేదు అని తెలుపుచున్నారు.

ఈ పై శ్లోకములు స్పష్టముగా భగవంతునిచే చెప్పబడినవి. ఇట్టి పరమాత స్వరూపము సర్వవ్యాపకమని నిరూపించుటకు గాను విష్ణుభక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు "ఉపాసకానాం సిద్ధ్యర్థం బ్రహ్మణోరూప కల్పనా" అను వచన సార్థక్యము ననుసరించి – హరివాస్తవ స్వరూపమును గురించి తన తండ్రితో "ఇందుగల డందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన నందందే గలడు దానవాగ్రణి వింటే" అని చెప్పి ప్రత్యక్షనిదర్శనము నిచ్చియున్నాడు. గాన దీనిని బట్టి గ్రహించవలసిన దేమనగా పరమాత సర్వవ్యాపకుడై యున్ననూ, ఆయనను వెదకి తెలుసుకున్న వారికే తెలియబడును గాని యందరకునూ ఆ పరమాత తానుగనే వృక్షకుడ్యాదుల లాగున అసంస్కృత మనస్సునకు గోచరించడు. అందుకు గాను జిజ్ఞాసువునకు ఈ సతతానుసంధానావశ్యకత విధిగా నుండవలెను. దానికి గాను అంతఃకరణ పారిశుధ్యము – అనగా మనస్సును సంస్కరించుకుని యాపరమాత ను వెదకి ఆయనను నేనే అని తెలుసుకుని అనుభవము సంపాదించవలసి యున్నది. గాన తన సత్యస్వరూపము నెల్లపుడును ప్రీతి నిశ్చయములతో చింతించుచుండవలయును. మనము యెల్లప్పుడు పరమప్రీతితో దేనిని తలంచుచుందుమో సాధారణముగ మరణకాలమందు అట్టి భావనయే కలుగుచుండునుగాని యన్యము కాదు. ఇట్లు కలుగుటకున్నూ యిట్టి నిత్యనిరతిశయ సుఖప్రాప్తికిన్నీ సతతము బ్రహ్మానుసంధాన మావశ్యకము. ఇట్టి యభ్యాసమును చేయునపుడు ముముక్షువు యిచట నొక విషయమును జాగరూకతతో తెలిసికొనవలయును. కొంత కాలమునకు ఈ బ్రహ్మ విద్యానుసంధాన సతతాభ్యాసదార్ఢ్యపరిపాకము వల్ల నిదిధ్యసన, సమాధిస్థితులు గోచరించును. అట్టితరి యీ సమాధ్యభ్యాసస్థితి సుషుప్తికి సన్నిహితముగా నుండును. ఈ నిద్రాసమాధుల యనుభవములు సన్నిహితముగా నుండినను

వీటి స్వరూప స్వభావములు మిక్కిలి విలక్షణములుగా నుండును. ఎట్లనగా :— నిద్ర — తమోగుణ ప్రధానమై నిరాలంబన వృత్తి ప్రత్యయ స్వరూపముతో నుండును. ఫలము మాంద్యము — అజ్ఞానము. సమాధి యన్ననో, సత్త్వ ప్రధాన వృత్తియై సత్య స్వస్వరూపాలంబనతో నుండును. ఫలము స్వస్వరూప సుఖము, జ్ఞానము. ఇట్టి విలక్షణ ఫలభేదములను బట్టి అభ్యాసకుడు జాగరూకతతో తన అభ్యాసస్థితి యెట్టిదిగా నున్నదని సూక్ష్మబుద్ధితో గ్రహించి అభ్యాసమును చేయుచుండవలయును. మన యనుభవమును బట్టి అధిక ప్రీతి దేని యందుంచుదుమో అదియే సర్వదా యెన్నిపనులు చేయుచున్నను అప్రయత్నముగ జ్ఞప్తికి వచ్చుచు కనబడుచునే యుండును. ఇది అందరి యనుభవములో నున్నదే. ఇట్లు కలుగుటకు అధిక ప్రీతియే కారణము. ఈ ప్రీతిని గురించి ప్రహ్లాదుడు భగవంతుని యిట్లు కోరియున్నాడు.

శ్లో॥ యాప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ ।
త్వామనుస రతస్సామే హృదయానా పసర్పతు ॥

అనగా పామరులకు విషయములందు ఎట్టి ప్రీతి యున్నదో, అట్టి ప్రీతిని భగవంతుడవైన నీయందు నాకు సర్వదా ఉండునట్లు చేయుము. ఇట్టి ప్రీతి కలిగిన వస్తుసిద్ధి తానుగానే కలుగును. ఇట్టి అధికప్రీతిని మన వాస్తవ స్వస్వరూపానుసంధానమందు కలుగజేసుకొనిన తత్స్వరూపమే జ్ఞప్తికి వచ్చుచుండును. ఈ విధముగ ప్రీతి పూర్వకముగా సతతాభ్యాసము చేయుటవల్ల సర్వ సిద్ధులు కలుగునని,

శ్లో॥ అభ్యాసాత్సర్వ సిద్ధిస్స్యాదితి వేదానుశాసనమ్ ।
తసాత్త్వం, సర్వముత్సృజ్య కుర్వభ్యాసేస్థిరం మనః ॥

అను, వసిష్ఠభగవానుని వచనము తెలుపుచున్నది. ఇట్టి బ్రహ్మజ్ఞానాభ్యాసము వల్లనే ముముక్షువు సర్వసిద్ధులను పొందనగును. గాన జిజ్ఞాసువు యిట్టి అభ్యాస లాభమును గ్రహించి "నవైరాగ్యాత్పరో బంధుః నసంసారాత్పరోరిపుః"

అను న్యాయము ననుసరించి సంసారాసక్తతను క్షీణింపజేయుచు సర్వదా యేపనిచేయుచున్ననూ తన సత్యస్వరూప జ్ఞానాభిలాషియై తన కారములను ప్రారబ్ధానుగతమున సాక్షీ భావముతో ననువర్తించుచు బ్రహ్మజ్ఞానాభ్యాసాదులను సల్పుచుండవలెను. తన సత్యస్వరూపానుసంధాన– సమాధ్యభ్యాస కాలములో వ్యవహారచింతలను నిరోధించుచూ అనగా రానీయక "దద్యా న్నావసరకించి త్కామాదీనాం మనాగపి" "ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా" అను వచనానుసారము కాలము గడపు మహనీయులకు దేహయాత్రానుకూల వ్యవహారము తప్ప కావలసినదేమి యుండును. ఇదిన్ని ప్రారబ్ధకరానుసారము తానుగనే నడుచుచుండును.

ఇట్లు సతతాభ్యాసాదులవల్ల ఆ పరమాత్మను తెలిసికొన్నవాడే మృత్యుయుక్తమగు సంసారమునుండి విడువబడును. ఇట్టి మోక్షప్రాప్తికి బ్రహ్మవిజ్ఞానము తప్ప నితరసాధనము లేదని" తమేవ విదిత్వాఽతి మృతు మేతి, నాన్యః పన్థా విద్యతేఽ యనాయ॥ అని శ్రుతి తెలుపుచున్నది. ఇచట తెలిసికొనుట యనగా' ఆ బ్రహ్మ నేను' అను దృఢమైన స్వానుభవము (బ్రహ్మజ్ఞానము) కలుగుటే. ఇచట ముముక్షువునకొక చిన్న హెచ్చరిక చేయవలసి యున్నది. అది యేదియనిన విద్యారణ్య వచనమిట్లు తెలుపుచున్నది–

శ్లో॥ పరోక్షజ్ఞాన మశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరత్।
అవిచారోఽ పరోక్షస జ్ఞానస్య ప్రతిబంధకః॥

అనగా అవిశ్వాసము పరోక్షజ్ఞానమును కలుగనియ్యదు. అవిచారము అపరోక్షజ్ఞానమును కలుగనియ్యక చెరచును. మరియును;—

శ్లో॥ విచార్యా ప్యాపరోక్ష్యేణ బ్రహ్మాత్మానం నవేత్తిచేత్।
ఆపరోక్ష్యావసానత్వా ద్భూయోభూయో విచారయేత్

ఒకమారు విచారించినయెడల బ్రహ్మసాక్షాత్కారము కలుగనిచో విసువు చెందక సాక్షాత్కారము కలుగువరకు పలుమారులు విచారము చేయవలయు ననియూ యింకనూ :—

శ్లో॥ విచారయన్నామరణం నైవాత్మానం లభేతచేత్।
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయేసతి॥

యావజ్జీవము విచారించినను బ్రహ్మసాక్షాత్కారము కలుగదేని, నిరాశ జెందకూడదు. ప్రారబ్ధ ప్రతిబంధము తొలగగనే జన్మాంతరమునందు బ్రహ్మసాక్షాత్కారము శాస్త్రప్రామాణ్యముచేత తప్పక కలుగునని పంచదశి కారుల వాక్యములు విశదీకరించుచున్నవి. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసకుడు యెప్పుడునూ, యెట్టిపరిస్థితులయందునూ నిరుత్సాహము చెందక తనయిష్టసిద్ధియైన మోక్షప్రాప్తికి గాను, ప్రీతి నిశ్చయములతో సతతానుసంధానాభ్యాసాదులను, ఫలావగతి పర్యంతము చేయుచుండుట కర్తవ్యమును, తనకు పరమపుప్రాప్తి దాయకమును అగునని గ్రహించవలయును.

ఇట్టి స్వానుభవము కలుగుటయనగా బ్రహ్మాత్మాకార అఖండాద్వైత జ్ఞానముచే స్వస్వరూప పరిపూర్ణత్వమును పొందుట. ఇట్లగుట, ప్రజ్ఞా సాధ్యముగాని ప్రజ్ఞను సంపాదించనియెడల యిట్లగుటకు సాధ్యముకాదు. దీనినే బ్రహ్మవిద్యయైన భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానులు" ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" ప్రజ్ఞగల వానివలె భాషించుచున్నావని పరమ పురుషుడును, సవ్యసాచియునైన అర్జునునంతటివానిని అనిరి. అనగా యింతటివాడైన అర్జునుడు కూడ ప్రజ్ఞాలోపయుక్తుడని తెలియుచున్నది. అనిన ఈప్రజ్ఞ అంతసులభసాధ్యము కాదని గ్రహించవలయును. ప్రకృష్టా+జ్ఞా= ప్రజ్ఞా అనగా జ్ఞానం. జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానమే గాని తదితరముకాదు. ఈసర్వోత్కృష్టమైన తెలివియే జ్ఞాన మనబడుచున్నది. ఇట్టి బ్రహ్మజ్ఞానమును, తన సతతాభ్యాసము, ప్రజ్ఞాపాటవముల, చేతనే పొందనగును. కాన జిజ్ఞాసువగువాడు యిట్టి జ్ఞానమును ప్రజ్ఞా మాంద్యమును తొలగించుకుని ప్రజ్ఞ చేతనే పొందనగును కాని అన్యము వల్లకాదని:—

శ్లో॥ సీమానం సర్వదుఃఖానా మాపదాం కోశముత్తమం।
జంసంసార వృక్షాణాం ప్రజ్ఞామాంద్యం వినాశయేత్॥

శ్లో॥ సుందర్యానిజయా బుధా ప్రజ్ఞయైవ వయస్యయా।
పదమాసాద్యతే రామ ననామ క్రియయాఽన్యయా॥

శ్లో॥ యఏవ యత్నః క్రియతే బాహ్యార్థోపార్జనేజనైః।
స ఏవయత్నః కర్తవ్యః పూర్వం ప్రజ్ఞా వివృద్ధయే॥

శ్లో॥ చింతామణిరియం ప్రజ్ఞాహృత్కోశస్థా వివేకినః।
ఫలం కల్పలతే వైషా చింతితం సంప్రయచ్ఛతి॥

అనగా సర్వదుఃఖములకు కారణమై సంసారవృక్షమునకు జమైన ప్రజ్ఞా మాంద్యమును తొలగించుకొని అతిసుందరమైనటు వంటిన్నీ తనకు సహాయకమైనది న్నీ అగు ప్రజ్ఞచేతనే ఉత్తమ స్థానము ల ంచునుగాని అన్య క్రియలచేత పొందబడదు. బాహ్యమైన వ్యవహార విషయములను పొందుటకు యెట్టి ప్రయత్నమవసరమో అట్టి ప్రయత్నమునే ప్రజ్ఞకొరకు చేయవలయును. వివేకులహృదయ కోశమందున్నటు వంటి ప్రజ్ఞ చింతామణి వంటిది. కల్పలతవలె కోరినఫలము నిచ్చును అని వసిష్ఠభగవానులు శ్రీరామచంద్రమూర్తికి ఉపదేశించియున్నారు.

గాన యింతవరకు మనముచేసిన నిరూపణలను విచారిత సిద్ధాంతములను బట్టి అనుసంధాన శబ్దార్థములను బాగుగ మనోగోచరము గావించుకొనుచూ యిట్టి అభ్యాసమును సదా చేయుచుండవలయును. ఎందుకనిన అభ్యాసము చేతనే సర్వసిద్ధులను పొందసగునని" అభ్యాసాత్సర్వసిద్ధిః స్యాదితివేదానుశాసనం" అని వచనము తెలుపుచున్నది. గాన ముముక్షువునకు అభ్యాసమనగా తన సత్యస్వరూపానుసంధానమేగదా. దీనికి గాను తనవాస్తవ స్వరూపమైన కేవల ప్రత్యగాత స్వరూపమునే తానుగ తెలుసుకుని యిట్టి స్వరూపమునే "అహంసర్వమిదం విశ్వంపరమాతా హ మచ్యుతః" అని గ్రహించి తన సత స్వరూపము కేవల ప్రత్యగాత యే కాని వేరుగాదని నిశ్చయమును పొంది తన సత్యస్వరూపమును:—అహంనేను కేవల చిత్సరూపుడను, సత జ్ఞానానంత స్వరూడను. నాస్వరూపము దేశకాల వస్త్వపరిచ్ఛిన్న—దృశ్యరహిత — సర్వాధిష్ఠాన— స్వప్రకాశ—భేదరహిత— పరిపూర్ణ శుద్ధచైతన ము. అనగా నేను సర్వదా మహాకాశమువలె సర్వవ్యాపకుడనై, నిస్తరంగ మహాసముద్రమువలె శాంత, గం రములతో స్ఫటిక సంవిత్ మహాశిలలాగున జ్ఞానరూపుడనై, అచలుడనై నిర లముగా ప్రకాశించుచుండు పరిపూర్ణుడను.-వికారరహితుడను. నేను కర్తృత్వాదులతో పరిచ్ఛిన్నమైన దృశ్యము గాక, నేను కర్తృత్వాది రహిత,

దృశ్యరహిత, అపరిచ్ఛిన్న, సర్వాధిష్ఠాన, పరిపూర్ణ చైతన్య అఖండ స్వరూపుడనని సర్వదా తనవాస్తవ స్వరూపమును మరువక, దేహేంద్రియాది అంతఃకరణ ధర్మములతో తాదాత్మ్యమునొందక అవియన్నియు తన కరణములు మాత్రముగాని తాను గానని గ్రహించి నిరభిమానా సక్తతలతో ప్రారబ్ధానుసార దేహయాత్రను గావించుచు ఫలావగతి పర్యంతము ప్రీతి నిశ్చయములతో స్వస్వరూపానుసంధానము నొనర్చుచుండవలయును. ఇదియే బ్రహ్మ విద్యానుసంధానసార సంగ్రహము గాన జిజ్ఞాసువునకు అభ్యాస దార్ఢ్యతకు గాను" ఆవృత్తి రసకృ దుపదేశాత్" అను వచనము ననుసరించిన్నీ "పథ్యం శతవిధం కృత్వా" అను న్యాయము ననుసరించిన్నీ యిచట సూచింపబడినదని పాఠకులు దీనిని గ్రహింతురు గాక. కాని యిట్టిజ్ఞానము దీనియందు ప్రీతి నిశ్చయములు అనేక జన్మములయొక్క సుకృతము వల్లగాని కలుగవని "బహూనాం జన నామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" అని భగవద్వచనము తెలుపుచున్నది. ఇంకను" మహాపాపవతాంనౄణాం జ్ఞాన యజ్ఞో న రోచతే॥ అని వచనము తెలుపుచున్నది. గనుక వారివారికి తగిన యమనియమాదులతో సత్కర్మాను ష్ఠానాదుల నాచరించుచు సాధుసంగమ సచ్ఛాస్త్రములతోను గురుదేవతానుగ్రహములతోను చిత్తశుద్ధిని సంపాదించి అద్వైత సిద్ధాంతమందు ప్రీతినిశ్చయములను కలిగించుకొని, ప్రజ్ఞను సంపాదించి సర్వదా. తన స్వస్వరూపమైన పరబ్రహ్మస్వరూపమును అనుసంధానాదులను చేయుచుండు మహనీయులకు—

శ్లో॥ యావద్విజ్ఞాన సామీప్యం తావత్ శ్రైష్ఠ్యం వివర్ధతే ।
బ్రహ్మ జ్ఞానాయతే సాక్షీ నిర్గుణోపాసనం శనైః ॥

అనగా అద్వైయత్వానుభవము ఎంతదృఢమగునో అంత శ్రేష్ఠత్వము సిద్ధించును. ఇట్టి బ్రహ్మ జ్ఞానమునకు కాలక్రమముగ చేయబడు నిర్గుణోపాసనమే నిదర్శనము.

శ్లో॥ అనుభూతే రభావేఽపి బ్రహ్మాత్మత్వేన చిన్త్యతామ్।
అప్యసత్ప్రాప్యతేధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మకింపునః ॥

అనగా తనకు నేనే బ్రహ్మ అను అనుభవము లేకపోయినను ఆ బ్రహ్మ యే నేనని అనుసంధానమును చేయవలెను. అనుసంధానము వలన లేనివస్తువే సిద్ధించు చుండగా నిత్యప్రాప్తమైన బ్రహ్మ సిద్ధించుటలో ఏమి సంశయమున్నది.

శ్లో॥ అనాత్మ బుద్ధి శైథిల్యం ఫలం ధ్యానాద్దినేదినే।
పశ్యన్నపి న చేద్ధ్యాయే త్కోఽపరోఽస్మాత్పశుర్వద॥

అనగా ధ్యానముచే రోజు రోజుకు అనాత్మలైన శరీరాదుల యందుండు ఆత్మబుద్ధి యొక్క శైథిల్యమును చూచుచు ధ్యానమును చేయమని మనుష్యునికంటే అధికమూర్ఖుడెవడుండ గలడు! అని పంచదశి వచనములు ధ్యానాదులే సాధనములని తెలుపుచూ సతతాభ్యాసముచే ప్రతిబంధనివృత్తి కాగా ఫలించునని బోధించుచున్నవి. ఇట్టి జ్ఞానము అనేక జన్మములలో చేసిన సాధనములవల్లనే కలుగునని "అనేక జన్మ సంసిద్ధః" ఇత్యాది గీతావచనములు తెలుపుచున్నవి. దీనినే కాలపరిపాకమువల్ల పొందబడునవి—

శ్లో॥ కాలేన పరిపచ్యన్తే కృషిగర్భాదయో యథా।
తద్వదాత్మావబోధోఽపి శనైః కాలేన పచ్యతే॥

అనగా కృషి గర్భాదులు కాలము వచ్చినప్పుడే ఫలించునట్లు ఆత్మ జ్ఞానము గూడ కాలపరిపాకముచే మెల్ల మెల్లగా సిద్ధించును, అని ఇత్యాదివచనములు బోధించుచున్నవి.

శ్లో॥ భావితం తీవ్రవేగేన యద్వస్తు స్వాత్మ నిశ్చయాత్।
పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమర కీటవత్॥

అనగా పురుషుడు ప్రవేగముతో ఏ వస్తువును ధ్యానించునో, కీటకము భ్రమరమును ధ్యానించుచు తద్భావమును పొందునట్లు ఆధ్యేయవస్తుపరమాత్మ భావమునే పొందగలడు. అను ఈ వచనముగూడ తద్భావాపత్తికి సాధనమని తెలుపుచున్నది. "తస్మాత్ జ్ఞానావగతిపర్యన్తం సతతం యదనుచిన్త్యతే భ్రమర కీటన్యాయేన తదేవ భవతి"

కశ్చిత్సుకృతవాన్ జ్ఞానేన ఏతత్ సాక్షాదపరోక్షం బ్రహ్మ అవగత్య బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "అభయం ప్రతిష్ఠాం విన్దతే" అత్ర బ్రహ్మ సమశ్నుతే" "యత్ర నాన్యత్పశ్యతి—నాన్యచ్ఛృణోతి—నాన్యద్విజానాతి—సభూమా—యో వై భూమా తత్సుఖం" "స ఆత్మా తత్త్వమసి" "అహం బ్రహ్మాఽస్మి" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" నైవ ముక్తిః—మోక్షః—తతః "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కంపశ్యేత్తత్కేన కంజిఘ్రేత్తత్కేన కంవిజానీయాత్" "ఏకత్వమనుపశ్యతి"

శ్లో॥ నబంధోఽస్తి నమోక్షోఽస్తి బ్రహ్మైవాస్తి నిరామయమ్।
నైక్యమస్తి న చ ద్విత్వం సంవిత్సారం విజృంభతే॥

ఈ గ్రంథము యొక్క పరమప్రయోజన తాత్పర్యము, ముముక్షువునకు వ బ్రహ్మైక్యాను సంధాన అఖండబోధయే. గనుక నదులన్నియు తుదకు పారావారమునందే కలియుచున్నట్లు, నా అనుసంధాన వాక్యములు, వివేచనా నిరూపణలు, అన్నియును అఖండ పరమాత్మ జ్ఞానమునందే, అనగా వ బ్రహ్మైక్య బోధయందే పర్యవసానము నొందును గాని, అన్యధాగా నుండవు. కాన జిజ్ఞాసువులిట్టి ఏకతత్త్వ షునాభా సనిరూపణ-అనుసంధానాదులయందు విసువుజెందక దీనిని శ్రద్ధోత్సాహములతోపఠించి, సారాంశములను మాత్రము గ్రహించి, బాగుగ నభ్యసించి బ్రహ్మ విద్యా సామ్రాజ్యప్రాప్తిని పొందుదురు గాక యని య లషించుచున్నాడ,

శ్లో॥ తత్త్వ శాస్త్రమిదం పుణ్యం ఆత్మ జ్ఞాన సుసాధనమ్।
మోహాన్నామ సుధీప్రోక్తం మహాభయ నివారణమ్॥

శ్లో॥ ఇదం యశస్యమాయుష్యం మోక్షప్రాప్తి సుసాధనమ్।
యే పఠన్తి సదా భక్త్యా తత్పదం యాన్తి తే పరమ్॥

మోక్షప్రాప్తికి సుసాధనంబైన ఈ శ్రీబ్రహ్మ విద్యానుసంధానమను గ్రంథంబును సదా ఎవరు భక్తితోడ పఠించుచు, సత్యస్వరూపానుసంధానాదుల నాచరించుచుందురో, వారు కీర్తిమంతులు,ఆయుష్మంతులగుచు పరమోత్కృష్టమైన ఆ బ్రహ్మ పదంబును పొందుదురు.

ఇతి శ్రీగురు విశ్వరానుగ్రహప్రసాదేన
ము ము క్షు
శ్రీ కౌతా వంశోద్భవ మోహనరామశాస్త్రిణా
వి ర చి త ం
బ్రహ్మవిద్యాను సన్ధాన దర్పణం
స మా ప్త మ్
ఓం తత్సత్.

# తత్త్వమంజరి

మానవుని మోక్షస్వరూపమగు నట్టి, నిత్య నిరతిశయ సుఖప్రాప్తి కొరకు "బ్రహ్మవిదాప్నోతి పరం" తెలుపుచున్నది. అనగా బ్రహ్మను తెలిసి కొనిన విద్వాంసుడు సర్వోత్కృష్ట పదమగు నిత్య నిరతిశయ సుఖస్వరూపము నొందునని అర్థము. ఇట్లు తెలుపుచు "నాన్యపంథా విద్యతేయనాయ" వేరు దారి లేదు అని గూడా చెప్పి "జీవోబ్రహ్మైవనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరు కాదు అని స్పష్టము చేయుచున్నది.

కాని యీ బ్రహ్మ; ఆత్మ పదార్థము చూడబడునది గాని తెలిసికొన బడునదిగాని కాదు. ఏలనన శ్రుతి "విజ్ఞాతార మరేకేనీవిజానీయాత్" అనగా తానే జ్ఞానస్వరూపుడై యున్నప్పుడు, తనను తానెట్లు చూడగలడు—ఎల్లప్పుడునూ చూడబడు వస్తువు తానుగాదు—కావున ఇది ఎట్లని మానవునకు బోధించునట్టి స్వానుభవ రూపమే తత్త్వజ్ఞానము.

తత్త్వజ్ఞానమనగా—జీవుడు తన పరమార్థస్వరూపమును వాస్తవముగ గ్రహించి స్వానుభవము నొందుట. ఇదియే మానవునకు పరమపురుషార్థము; మోక్షప్రాప్తి. ఈ పురుషార్థము మానవునకు ఒక్క తత్త్వజ్ఞానము అనగా-బ్రహ్మజ్ఞానము వల్లగాని కలుగదు. జీవునకు మానవజన్మ కలిగినప్పుడే ఆత్మజ్ఞానమును సంపాదింపవలయునని—

"నచేదిహావేదీ న్మహతీ వినష్టిః"

ఈ జన్మ యందే సదాత్మ జ్ఞానమును సంపాదింపక యుండు మానవునకు ఘోరమగు నష్టము సంభవించునని శ్రుతిమాత తెలుపుచున్నది. కావున ఈ

జన మునందే సదాత్మజ్ఞానమును సంపాదించుట యావశ్యకమని శాస్త్రము తెలుపుచున్నది. కాని—ఆత్మ, ప్రయత్నముచే గాని లభ్యము కాదని—

"నాఽయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయా నబహునాశ్రుతేన।
యమేవైషవృణుతేనలభ్య స్తస్యైషఆత్మావివృణుతే తనూంస్వామ్"

ఈ యాత్మ వేదాధ్యయనము, బుద్ధిచాతుర్యము, వేదార్థ శ్రవణము అనుమొదలగువానిచే తెలియబడదు. కాని—ఏ సాధకుడు ప్రయత్నము చేయుచున్నాడో వానికి ఈ యాత్మ తనకు తానే ప్రకటితమగును. అనగా—ఎరుంగబడును. ఇట్టి శ్రద్ధగల సాధకునకు ఆయాత్మ స్వయముగనే స్వస్వరూపమును బ్రకటించును. (ఇదియే గుర్వీశ్వరానుగ్రహ ప్రసాదమని సాధకుడు ఎరుంగ వలయును.)

ఈ సాధన ప్రయత్న నిరూపణములను గురించి గ్రంథములో విపులముగ బహువిధముల తెలుపబడెను. ఐనను ముముక్షువులగు జిజ్ఞాసువులకు ఈ పరమోత్కృష్ట విద్యాలాభము నుద్దేశించి నా చిరకాల సతత ప్రయత్న సాధనా భ్యాసానుభవమును నిచట సంగ్రహించుచున్నాడను.

శ్రుతి పరమతాత్పర్యము, - వబ్రహ్మైక్య బోధయే. వునకిట్టి అద్వితీయ అఖండజ్ఞానము మహావాక్యమువలననే కలుగవలయును. కాని యీ జ్ఞాన మాత్ర స్వరూపుడగు ప్రత్యగాత్మ, ప్రమాణములు అనగా—ఇంద్రియములచే జూచి తెలిసికొనబడెడువాడుకాడు. ఏలనన-ఆయన స్వయం ప్రకాశ మానుడై గడపయందున్న దీపము లోపలను బయటను ప్రకాశించునట్లు అంతర బాహ్యేంద్రియాది విషయములను ప్రకాశింప జేయుచుండును. ఈ ప్రకాశమునకు ఆయన కర్త కాడు. ఆయన స్వరూప ప్రకాశము చేతనే సర్వము ప్రకాశింప జేయబడుచున్నదని—

"తస భాసా సర్వమిదం విభాతి"

అని శ్రుతి తెలుపుచున్నది. వునకిట్టి పరమాత్మైక్యమును "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహా వాక్యములు బోధించుచున్నవి.

ప్రజ్ఞాన ఘనుడు ఎట్టివాడనగా-

"అపూర్వమనపర మనన్తర మబాహ్యం ప్రజ్ఞాన ఘన ఏవ"

ఈ ప్రజ్ఞాన ఘనుడు కారణము కార్యము లేనివాడును, అనగా-సర్వత్ర నిండియుండు నిత్యపరిపూర్ణ జ్ఞానస్వరూపుడు అని శ్రుతి తెలుపుచున్నది. నిత పరిపూర్ణజ్ఞాన స్వరూపుడే తానని ఆత్మాన్న అఖండాకారముగ "అహం బ్రహ్మాస్మి" అని ముముక్షువులను సంధానము చేయుచుండవలయును.

ఇట్టి అభ్యాసకునకు సాక్షాత్సాధనక్రమమునుగూడ శ్రుతియే-

"ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష ముచ్యతే" అని తెలుపుచున్నది.

కాని- శ్రుతియే-

"పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూ స్తస్మా త్పరాఙ్ పశ్యతి నాన్తరాత న్" అని తెలుపుచున్నది. ఇంద్రియములు బాహ్యవిషయముల జ్ఞానమునే కలుగ జేయునుగాని, ఆత జ్ఞానమును సాక్షాత్తుగా నివ్వజాలవు. కావున బాహ్యప్రత క్షమును బాధించినయడల ఆత జ్ఞానమునకు సాధనములు కాగలవు. తత్త్వ మస్యాది మహావాక్యము దీనినే బోధించుచున్నది. ప్రత్యగాత యందు దుఃఖత్వాది సంసారమును బోధించుచు, "అహం దుఃఖీ" త్యాది ప్రత్యక్ష ప్రమాణమునకు విరుద్ధముగా, అద్విత్వయ కూటస్థ పరమానంద చైతన్య జ్ఞానమును పుట్టించుచున్నది.

అందుచే విద్వాంసులైనవారు ప్రత్యక్షమైన "అహం దుఃఖీ" త్యాది ప్రమాణములను గౌణమనియు, కూటస్థాత —నిర్వికారుడు, అసంగుడు గనుక

ఈ జ్ఞానము అముఖ్యమనియు తెలుపుదురు. ఏలనన-దుః ఖాదులు ముఖ్యముగా అంతః కరణ ధర్మములై యున్నను, గౌణవృత్తిచే ఆత్మధర్మములుగ వ్యవహరింపబడుచున్నవి. ఆత్మ స్వరూపమును బోధించుటకు 'త్వం-అహం' (నీవు-నేను) అను పదములు తప్ప, వేరు పదములు లేవు. ఈ రెండును వాచార్థముతో అంతః కరణమునకు సంబంధించినవియగుచు, లక్షణావృత్తిచే ప్రత్యగాత్మను బోధించును. ఈ ఒక్క 'అహం' వృత్తిచేతనే ప్రత్యగాత్మ లక్షింపబడుచున్నదిగాని, వేరు దారిలేదు. ప్రత్యగాత్మ ప్రత్యక్షముగ తెలియబడు వస్తువు కాదు. "గంగాయాం ఘోషః" అనునప్పుడు ప్రవాహ వాచకమైన గంగా శబ్దము తీర వాచకము కాకపోయినను లక్షణావృత్తిచే తీరమును బోధించుచున్నదిగదా! అట్లే "తత్త్వమసి" వాక్యము, "అహం బ్రహ్మాస్మి" అనువాక్యము, అంతఃకరణాద్యవచ్ఛిన్న చైతన్య వాచకమగుచు, అఖండైక రస స్వప్రకాశపరమాత్మ బోధను కలుగజేయును. ఇందుకు సందియములేదు.

కాని-ఇచట నొక శంక కలుగవచ్చును. ఏదియనిన-నివర్తింప జేయబడవలసినట్టి అంతః కరణ ధర్మమైన అజ్ఞానమునకును, ప్రవర్తింప జేయునట్టి జ్ఞానమునకును ఒక్క ఆత్మయే ఆశ్రయమై యున్నందున ఆత్మకు సవికారత్వము సంభవించునుగదా యనునది. ఈ శంకకు అవకాశములేదు. ఏలనన-వివర్తకారణ వాదసిద్ధాన్తమందు ఎచటనూ వాస్తవికమైన సద్వితీయత్వము సంభవింపదు. ఎల్లప్పుడునూ సత్యమగు అధిష్ఠానమును, కల్పితమగు అధ్యస్తమును పరమార్థవాస్తవమున ఒక్కటిగనే యుండును. ఇదిగాక, ఆకసము-అమూర్తము, రూపహీనమనునది జ్ఞానము. ఆకసము-నీలముగనున్నది, బోర్లించినట్లు అర్ధగోళాకారముగనున్నది యనునది అజ్ఞానము. ఇది సర్వానుభవము. ఈ జ్ఞానాజ్ఞానములు రెండును ఒక్కవస్తువునందే యున్నను అట్టి ఆకసమునకు ఎట్టి వికారమును కలిగింపకయే వాస్తవజ్ఞానము అజ్ఞానమును నివర్తింప జేయుచున్నది. అనగా-ఆకాశము వాస్తవమున రూపహీనమను జ్ఞానమే, ఆకసమునందెట్టిమార్పును కలిగించకయే, ఆకసమునీలము-అర్ధగోళాకారము-అనుజ్ఞానమును నివర్తింపజేయుచున్నది. కాని ఆకాశ

యథార్థ జ్ఞానము లేనివారికందరికిని ఆకాశ నీలత్వాదులు వాస్తవముగనున్నట్లే కనబడుచుండునుగదా ! ఇటులనే ఆత దుః త్వాది సంసారము కలవాడను నది అజ్ఞానము. ఆత అసంగ నిత్య నిర్వికార అఖండ చిన్మాత్రస్వరూపుడను నది జ్ఞానము. ఈ రెండును ఆత నే ఆశ్రయించియున్నను, ఆ యాత యందెట్టి వికారములను సంపాదించ నేరవు. అనగా-ఆత కు కలుగజేయలేవు. కావున జ్ఞానము-అజ్ఞానమును నివర్తింపజేయును. అప్పుడు నిత్య నిర్వికార అఖండ జ్ఞానము నిర్విశేషముగ శేషించును. ఇదియే మోక్షము.

ముముక్షువునకు అన్వయవ్యతిరేకవిచారసహిత మహావాక శ్రవణము వల్లన అవిద్యా నివృత్తి కలుగును. ప్రత్యగాత అవిద్యా నిద్రచే నాక్రమింప బడి, గాఢసుషుప్తి గల వానివలె స్వస్వరూపజ్ఞానము మరచిన వాడై యున్నట్లు లోకానుభవమును బట్టి తెలియుచున్నది. కావున తత్త్వ మస్యాది మహా వాక్యబోధ-అంతఃకరణ దేహేంద్రియాది తాదాత మును, అభావరూపత్వ మును రెంటిని నిరసించుచు, అవిదా నిద్రను నిరాకరించి, అద్వి య అఖండ స్వస్వరూప జ్ఞానమును కలుగ యును. ఇది నిత్యము. నికాల మెప్పుడును లేదు. దీనినే-

"నహిద్రష్టుః దృష్టే ర్విపరిలోపో విద తే"

సాక్షియొక్క స్వరూప భూతమైన జ్ఞానమునకు లోపములేదు, అని శ్రుతితెలుపుచున్నది. వునకిట్టి తన నిత అఖండ పరిపూర్ణ సత్య స్వరూప మును-తనమెడలోని మరచిన హారమునువలె-జ్ఞప్తికి తెచ్చుకొనుటయే కర్త వ్యము. జ్ఞప్తికివచ్చిన వెంటనే తానే పరిపూర్ణ స్వరూపుడగును. ఈ అర్థ మునే "బహ వి ద్బహై వభవతి" అను శ్రుతి తెలుపుచున్నది.

సదాత తత్త్వజ్ఞానము కలవానికి శ్రుతి-

"తస్యతావదేవచిరం, యావన్నవిమోక్ష్యే, అథసంపత్స్యే"

## బ్రహ్మ విద్యానుసన్ధాన దర్పణం

మోక్షప్రాప్తికి ప్రారబ్ధాంతమువరకే విలంబముగాని, తదుపరి ఆలస్య ముండదని తెలుపుచున్నది. సదాత యనగా-స్వాత్మ న్న అద్వి య అఖం డాత్మ కాని, స్వ నా త్మ జ్ఞానముకాదు. న్నాత్మ జ్ఞానము స్వస్వరూపానుభవ బోధనివ్వ జాలదని ముముక్షువులు గ్రహించవలయును.

జిజ్ఞాసువు బాగుగ గ్రహించ వలసిన రహస్యమొకటి కలదు. ఏదియ నిన-సర్వకాలములయందును తనకు 'అహం' నేను అనికలుగు ప్ర తికి తన పరమార్థ వాస్తవ స్వరూపము నిత్య నిరతిశయ అఖండ పరిపూర్ణ జ్ఞానానంద స్వరూపమే ననియు, కాని తాను యిప్పుడు తన అజ్ఞాన కృతప్రారబ్ధ ఫలముచే యీ ఉపాధిబద్ధుడనై యున్నాననియు, తన యుపాధి తనప్రారబ్ధ క్షయము వరకే యుండుననియు, ప్రారబ్ధాంతమందు తాను తనపరిపూర్ణ బ్రహ్మానంద స్వరూపము నొందగలనని యు నిశ్చయముతోనుండి తనవ్యవహార పారమార్థిక కర లను నిర్లిప్తతతో నాచరించుచుండవలయును. కాని-ఎట్టి పరిస్థితుల యం దైనను తాను-'నేను' అనుకొను చున్నట్టి యీ'అహం'ప్ర ·తి, తనశ ·రాదులని మాత్రము స్వప్నములో గూడ తలచగూడదు. సర్వకర లను శాస్త్ర చోదిత ముగ నిర్వర్తించుచు, అవియన్నియు తన ఉపాధి ధర ములను నిశ్చయముతో నుండవలయును. స్వశ ·ర సర్వ దృశ్యోపాధులన్నియూ తన ప్రారబ్ధఫల భోగమునకుగాను కల్పితములైనవేగాని, తనకింద నిత్య సత ·మగు పదార్థ మేదియు లేదను నిశ్చయముతోడ సర్వదా తన సర్వాధిష్ఠాన అఖండాకార మగు నిర లాకాశమువంటి తనపరిపూర్ణ జ్ఞానస్వరూపమును అనుసంధించు చుండ వలయును. ఇట్టి వృత్తితోడనే తన సర్వకర లను నిర్వర్తించవచ్చును. ఇదియే బ్రహ్మ సిద్ధికి సాధనము.

ముముక్షువునకు తనపరమార్థ స్వరూపమగు బ్రహ్మ ను తెలిసికొనుటకు గాను ఎచటికి పో నవసరములేదు. ఏలనన—తన పరమార్థవాస్తవ స్వరూ పము, స్వశ ·ర సర్వాధిష్ఠానమగు పరమాత్మ యే. కాని-·వ అనాది అవిద్యా కల్పితమై దీనియందే "అహం" "ఇదం"అను రెండుప్ర తులును, స్వాప్నికుని

యందు స్వప్న దృశ్య మధ్యస్తమగుచున్న విధముగ నున్నవిగాని, వాస్త వముగలేవు. కావున సర్వము తనయందే అవాస్తవముగ నున్నదనియు తాను వాస్తవమున పరమాత్మ స్వరూపుడేనని గ్రహించవలయును.

శ్రుతి, "వోబ్రహ్మై వనాపరః" జీవుడు బ్రహ్మకంటె వేరుకాదు. అని స్పష్టముచేయుచు, ఈ విషయమునే సదృష్టాన్తముగ విపులముగ బోధించుటకుగాను, ఎల్లప్పుడును ఒక్కటియగు పరమాత్మయే సంసారోపాధియను వృక్షముపైన వాస్తవముగ బింబరూపముననను, భ్రాంతితోడ ప్రతిబింబరూపమగు వునిగను, అనగా పరమాత్మ - వాత రూపముల అజ్ఞానకాలమందు భాసించుచున్నట్లనుభవము నిచ్చుచుండును. వుడు భ్రాంతుడై సంసార సుఖదుఃఖానుభవముల నొందుచున్నను, పరమాత్మ సాక్షిరూపమున నిత్య నిరతిశయ సుఖ స్వరూపముతో భాసించుచుండుననియు, ఆలంకారికముగ రెండు పక్షులును ఒక్కచెట్టుమీద యున్నట్లు శ్రుతి తెలుపుచున్నది. ఎప్పుడు ఈ జీవాత్మ యను పక్షి, తన సుఖదుఃఖానుభవములతో విసకట జెంది, వైరాగ్యముకలదై, పైనున్న వాస్తవ స్వరూపమగు పరమాత్మ పక్షిని చూచునో, అప్పుడీ వుడు తాను భ్రాంతుడే గనుక, తన భ్రాంతిజ్ఞానము నశించి తాను వాస్తవమున ఆ నిత్య నిరతిశయ సుఖమగు పరమాత్మ స్వరూపుడను నేనే గాని, వేరుగాదని గ్రహించును. కనుక భ్రాంతిచే సద్వి యముగ ప్ర తు డగు వుడు, తాను అద్వి య బ్రహ్మ స్వరూపుడగును. ఈ తాత్పర్యార్థమునే క్రింది శ్రుతివచనములు ఆలంకారికముగ జీవునకు బోధించుచున్నవి-

"ద్వాసుపర్ణా సయుజాసఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యోఽ చాక తి"

"సమానేవృక్షే పురుషోనిమగ్నోఽ నీశయా శోచతి ముహ్యమానః।
జుష్టం యదాపశ్యత్యన మీశమస్య మహిమాన మితి వీతశోకః"

వునకు యీ బ్రహ్మ యే స్వశరీర సర్వాధిష్ఠానము. ఈ బ్రహ్మస్వరూప మెట్టిదియనిన, ఇది-స్వశ ర సర్వోపాధివినిరుక్త, సజా యవిజా యస్వగత

భేదరహిత, సర్వాధిష్ఠాన, స్వ ప్రకాశ, నిత్య, నిరతిశయ, అసంగ, జగదుత్పత్తి స్థితి లయ వివర్త అ న్ననిమిత్తోపాదాన కారణ, అఖండపరిపూర్ణానంద చైతన్య స్వరూపము. ఇదియే తానను నిశ్చయమునొంది తన వెలుపల, లోపల, క్రింద, పైన సర్వపరిపూర్ణమైనట్టి వల చైతన్య స్వరూపమంతయు తన పరమార్థ స్వరూపమేనని గ్రహించవలయును. కావున తానులేని దేశకాల వస్తువులుగాని, అవస్థలుగాని, క, తాను నిత పరిపూర్ణుడై యున్నాడు. కావుననే-

"అందుగల నిందులేనని సందేహమువలదు, నేను సర్వో పగతిన్,
ఎందెందు వెదకిజూచిన నందందేగలను నాదు మోహము వీడన్"

అని తన వత్వ పరిచ్ఛిన్న భ్రాంతి తొలగగనే తాను పరిపూర్ణుడగునని ముముక్షువు గ్రహించవలయును.

ఈ సిద్ధాంత సారాంశమునే "సదేవసౌమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వియం" సర్వం ఖల్విదం బ్రహ్మ "నేహనానాస్తికించన" "మాయామాత్ర మిదంద్వైతం అద్వైతం పరమార్థతః"అను మొదలుగాగల శ్రుతివచనములు ఘోషించుచున్నవి. దానినెట్లు అభ్యాసకుడు గ్రహించి అనుసంధించవలయునో, అట్టి తత్త్వసారమును ఈక్రింది శ్లోకములు సంగ్రహముగ నిరూపించుచున్నవి:

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం పరమాత్మా ఽహమచ్యుతః।
అహం కారా ధా యాసా కల్ప్యతే నతు వాస్తవీ॥

శ్లో॥ అహం మమేతి సర్వంహి కల్పితం చిత్తవిభ్రమాత్।
అఖండ పరిపూర్ణోఽహం నామరూప వివర్జితః॥

శ్లో॥ సంసారో మనసా పుంసః కల్పితోఽస్తి, నవస్తుతః।
మనశూనే సుషుప్త్యాదౌ సంసారో నైవ దృశ్యతే॥

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం విశ్వంబ్రహ్మణి కల్పితమ్।
నామరూప మిదం సర్వం రజ్జు సర్ప ఇవోదితమ్॥

శ్లో॥ యత్ర యత్ర మనఃస్ఫూర్తి స్తత్ర తత్ర జగత్త్రియమ్।
యత్ర యత్ర మనోనాస్తి తత్ర తత్ర నకించన॥

శ్లో॥ మమపుత్రా మమధనం అయంసోఽహ మిదం మమ।
ఇ య మిం దజాలేన వాసనై వాధివల్గతే॥

శ్లో॥ నిస్సంగ వ్యవహారిత్వా ద్భవభావన వర్జనాత్।
శరీరనాశదర్శిత్వా ద్వాసనా నప్రవర్తతే॥

శ్లో॥ దీర్ఘస్వప్న మిదం విశ్వం విశ్వంబ్రహ ణి కల్పితమ్।
దీర్ఘ సంసారరోగస్య విచారోహి మహౌషధమ్॥

శ్లో॥ ఆత జ్ఞానం వినా సాధో! అహం మమ మతి స్తవ।
అహం కర్తా అహం భోక్తా ఇతి భ్రాన్తి ర్నినశ్యతి॥

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే సచ్చిదానంద లక్షణే।
అహంకర్తా అహం భోక్తా ఇతిభ్రాన్తి ర్వినశ్యతి॥

శ్లో॥ వివిక్తదేశే ఆ నో వీతరాగో జితేంద్రియః।
భావయేదేకమాతా నం తమనంత మనన్యధీః॥

శ్లో॥ నాఽహంజ్ఞేయ మితిధ్యాయం స్థిష్ఠత్వ మచలస్సదా।
అనన్తాకాశ సంకాశహృదయో హృదయేశ్వరే॥

శ్లో॥ ఆ యే పర యేవా సర్వస్మిన్నేవ సర్వదా।
నష్టే చోపచి కార్యే సుఖదుఃఖే గృహాణమా॥

శ్లో॥ ఆత న్యే వా లంద్‌దృశ్యం ప్రవిలాప్య యా సుధీః।
భావయేదేకమాత్మానం నిర లాకాశవత్సదా॥

శ్లో॥ చిన్మా త మమలం శాంతం సర్వతేజోఽవభాసకమ్।
భావయేదేక మాతా నం నిర లాకాశవత్సదా॥

## బ్రహ్మ విద్యానుసన్ధాన దర్పణం

శ్లో॥ అఖండ సంవిదాకారం పరిపూర్ణ సుఖాత్మకమ్।
భావయే దేకమాత్మానం నిర్మలాకాశ వత్సదా॥

శ్లో ॥ సర్వమేవ చిదాకాశం బ్రహ్మేతి ఘననిశ్చయే।
స్థితిం యాతే, శమంయాతి వో నిస్స్నేహ దీపవత్॥

శ్లో॥ ఆత్మా తు సతతంప్రాప్తోఽప్యప్రాప్తవద విద్యయా।
తన్నాశే ప్రాప్త వద్భాతి స్వకంఠాభరణం యథా॥

శ్లో॥ నాఽహందుః నమేదేహః బంధఃకః స్యాత నిస్థితః।
ఇతిభావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే॥

శ్లో॥ అఖండ పరిపూర్ణోఽహం జ్ఞానమాత్ర స్వరూపతః।
చిదాకాశ స్వరూపోఽహం నిర్మలాకాశ వత్సదా॥

శ్లో॥ అఖండ పరిపూర్ణోఽహం జ్ఞానమాత్ర స్వరూపతః।
అకృత్రిమ మనాద్యన్తం నిరవద్యో నిరాశ్రయః॥

శ్లో॥ అఖండ పరిపూర్ణోఽహం సర్వతేజోఽవభాసకః।
నిత్య స్సర్వగతఃస్థాణు రచలోఽహం సనాతనః॥

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోహం జ్ఞాతృజ్ఞేయ వివర్జితః।
అఖండ పరిపూర్ణోహం సర్వదాదహాఠేస్థితః॥

శ్లో॥ సర్వసాక్షీ ప్రత్యగాత్మా పరమాత్మా పరంజ్యోతిః।
అఖండ సంవిదాకారం సర్వదాదీహాఠేస్థితః॥

శ్లో॥ అఖండ పరిపూర్ణోఽహం నిర్మలాకాశ వత్సదా।
సీమాన్తం సర్వదుఃఖానాం చిదాకాశ ముపాస్మహే॥

శ్లో॥ చినాత్రమమలం శాన్తం పరిపూర్ణ మివాం బరమ్।
అఖండ సంవిదాకారం చిదాకాశ ముపాస్మహే॥

శ్లో॥ చిదేవ పంచభూతాని చిదేవ భువనత్రయమ్।
చిదేహాహం చిదేవత్వం చిద్భిన్నం నహికించన॥

శ్లో॥ తత్త్వసారమిదం పుణ్యం మోహఘ్నాం నామ సూక్తికృతమ్।
యేపఠన్తి సదాభక్త్యా తత్సుఖం ప్రాప్నువన్తితే॥

ఇహ జ్ఞా భ్యాసకులకు యీ పై ప్రతియొక్క శ్లోకమును రసభావ గర్భితమై అనుసంధానాదులకు అత్యంతోపయోగకరములై యుండును. కావున ముముక్షువులకు యీపై శ్రుతివచన వాక్య, శ్లోక తాత్పర్యార్థము లను సక్రమమున, సశాస్త్రీయముగ గ్రహించి అనుసంధానాదుల, నాచరించు చుండుట తత్త్వ, జ్ఞానమునకు సాక్షాత్సాధనము. ఇట్టి జిజ్ఞాసువులకు కాలక్రమ మున వారి, వారి, అభ్యాసపాటవమును బట్టి. జీవునకు పరమోత్కృష్ట లాభ మగు ఆత్మలాభము తప్పక కలుగు ననుటకు సందియము లేదు. ప్రారబ్ధాంత మందు, నిశ్చయముగ తన, నిత్య నిరతిశయ సుఖప్రాప్తి కలుగును- జీవున కిదియే మోక్షము, ముక్తి.

---

# తప్పు ఒప్పుల పట్టిక

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | స్థావరా న్తన్య | స్థావరా న్తస్య |
| 4 | 20 | ష్ఠాశయ | ` శయ |
| 15 | 15 | శృత్యు | శ్రుత్యు |
| 16 | 14 | వస్తుయం | వస్తువునందు |
| ,, | 18 | నీ | నిష్ఠ |
| ,, | 27 | (బాంతి | (భాంతి |
| 17 | 6 | యముల | ముల |
| 23 | 3 | తిన్న | తినన్న |
| 27 | 3 | నిర్చ | నిశ్చ |
| 29 | 24 | పతిఫల | ప్రతిఫలన |
| ,, | 25 | యాన్వని | యానని |
| 40 | 8 | బ్రహ్మాసి | బ్రహ్మా |
| 68 | 27 | భాంత్యనుభముగాని | భాంత్యనుభవముగాని |
| 69 | 2 | విజూ | వినా త్ర |
| 78 | 15 | తర్వరి | తర్పహిః |
| 80 | 26 | దృ నితో | దృష్టితో |
| 83 | 22 | ఛేధ | ఛేద |
| 99 | 8 | యాఒజోర్కర | యాఒజ్కుర |
| 99 | 13 | భవ న్త న్త | భవ న్త న్త |
| 102 | 17 | దష్టదృ | ద్రష్టరిదృ |
| 106 | 2 | తయా | తతయా |
| 116 | 23 | యోక్ష | మోక్ష |
| 117 | 19 | శ్లాఘింప బడినవియో | శ్లాఘింపబడినదియో |
| 127 | 7 | (Antosuggetion | (Autosuggestion) |
| 131 | 9 | హాండము (Microcosm) | హాండము (Macrocosm) |
| 132 | 12 | జవ | జీవ |
| 134 | 18 | పదార్థముచే | పదార్థములే |

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 136 | 25 | జవ | వ |
| 138 | 23 | మై తియేతి | మైత్రీమేతి |
| 143 | 3 | బింబరర్మ | బింబధర |
| 146 | 21 | తను పతి. జీ | త, పతిజీ |
| 148 | 21 | స్వఆతా | క ఆతా |
| 150 | 8 | సాతు | సాత్యు |
| 151 | 26 | అభాళములుగా | ఆభాసములుగా |
| 153 | 9 | శంపత్స్వ్య | సంపత్స్య |
| 154 | 19 | దృశ | దృశ్య |
| 156 | 19 | ఉండును | ఉండదు |
| 157 | 17 | జ్ఞామేన | జ్ఞానమే |
| 165 | 17 | తాదాత్వ్యత | తాదాత్మ్యత |
| 171 | 6 | చతుష్ట సంపత్తి యుక్తమున | చతుష్టయ సంపత్తి యుక్తముగ |
| 183 | 15 | బుందుచున్నారు. | పొందుచున్నాడు. |
| 193 | 12 | భార్యా | భార్యా |
| 198 | 19 | త్వప్తి | తృప్తి |
| 206 | 4 | ఇభ | ఉభ |
| 207 | 23 | బ్రహానుభవము | బహ్మానుభవము |
| 209 | 5 | ప్రత్వతః | ప్రదత్వతః |
| 221 | 19 | కల్నించు | కల్పించు |
| 225 | 5 | దశ్య | దృశ్య |
| 236 | 21 | తెసుకొనిన | తెలుసుకొనిన |
| 241 | 6 | ఉన్మిష | ఉనే ష |
| 243 | 25 | లెవ | వలె |
| 248 | 4 | వాలసు | వారసు |
| 249 | 3 | గానితను | గానియున్నచో తను |
| 251 | 26 | తాదాప్యతా | తాదాత్మ్యము |
| 252 | 7 | జారునియందు | జారిణియైన |
| 257 | 2 | నస్యాత్ | నశ్యేత్ |
| ,, | 6 | తాదాప్యము | తాదాత్మ్యము |
| 259 | 16 | త్వాద్యాభిమాన | త్వాధ్యభిమాన |
| 263 | 14 | జగదృశ్యా | జగద్దృశ్యా |

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 264 | 21 | శ క్తి | శు క్తి |
| 271 | 7 | స్సర్వ | త్సర్వ |
| 273 | 4 | త్రైశ్వష్ఠ్యత | శ్రేష్టత |
| 277 | 13 | తాదాప్యా | తాదాత్మ్య |
| ,, | 20 | క్రింధి | ౦ది |
| 280 | 6 | కరము | కరణము |
| ,, | 24 | హేత్ | హ్యేత |
| 287 | 3 | టచేతనే | టయే |
| ,, | 13 | చానఘు | చానఘు |
| 291 | 14 | షుథమ్ | షథమ్ |
| ,, | 21 | బ్రహ్మైవ్య | బ్రహ్మైక్య |
| 295 | 6 | ఫనావగతి | ఫలావగతి |
| 297 | 25 | దా. ప | పదార్థ |
| 303 | 12 | భో క్తృత్వాది | భో క్తృత్వాది |
| 306 | 4 | సత్పదార్థయొ | సత్పదార్థమొ |
| 313 | 11 | నెం మాత్రము | నెంతమా తము |
| 316 | 23 | మప | మమ |
| 320 | 19 | నాంత | జ్ఞానానంత |
| 321 | 21 | చిక్త్థానాశములు | అపక్షయ నాశమును |
| 330 | 12 | గు ర్తిచు | గు ర్తించు |
| 334 | 12 | దృశ్యపరశ్వర | దృశ్యము |
| 339 | 12 | మత్స్వాన్ని......స్వవస్థితిః | మత్స్థాన్ని......ష్వవస్థితః |
| ,, | 13 | మత్స్వాని | మత్స్థాని |
| 342 | 15 | భ్యత......ష్వవ | భ్యంత...,...ష్వధ |
| 345 | 10 | తోదాత్మ్యే | తాదాత్మ్యే |
| ,, | 16 | యంద ర్మ | యాందర్మ్య |
| 357 | 15 | మనస్సహజ | మనస్సహజ |
| 358 | 25 | పూర్ణక్యే | పూర్ణస్యే |
| 365 | 24 | వోభూతం | వోమ్యూతం |
| 366 | 6 | యయేష...,...మాయ | యయేష ....మాయా |
| 367 | 7 | అనుదనూ | అయినసూ |
| ,, | 19 | యతస్నే | తస్నే |

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 369 | 24 | నిష్ట | నిష్ఠ |
| 370 | 4 | ధ్యాభాస | ధ్యాస |
| 384 | 9 | ణ వచ | ణ్యమనివచ |
| 392 | 10 | కుభవములనూ | నుభవములునూ |
| 411 | 19 | నిర్వకార | నిర్వికార |
| 325 | 20 | నన్న | నున్న |
| 426 | 24 | తూష్ణీభా | తూష్ణీంభా |
| 431 | 3 | స్త్రరహ్మ......సి న్నయం | స్త్రర్హ్మ......సి న్నయం పురుషో |
| .. | 4 | అంగుష్ట | అంగుష్ఠ |
| 448 | 28 | కింకంష్యతి | కింకరిష్యతి |
| 457 | 15 | క్కనొటయై | నొక్కటయై |
| 470 | 21 | ర్దెసించి | ర్ధేశించి |
| 531 | 12 | ధరే | దర్శే |
| 545 | 16 | వ్యాచుడై | వాచ్యుడై |
| 605 | 24 | అవుడు | అపుడు |
| 608 | 5 | స్యస్వ | సత్యస్వ |
| 622 | 20 | త్రైష్ట్యం | త్రైష్ఠ్యం |